| | | | రు. | అ. |
|---|---|---|---|---|
| | | | ప్రతి 1-కి రు. | అ. |
| చరకసంహిత, సూత్రస్థానము | I | ... | [illegible] | 0 |
| ,, శారీర,ఇంద్రియ,నిదాన,విమానస్థానములు | II | ... | 5 | 0 |
| ,, చికిత్సాస్థానము | III | ... | 8 | 0 |
| ,, సిద్ధి-కల్పస్థానములు | IV | ... | 3 | 8 |
| నాడీజ్ఞానము, సాంధ్ర తాత్పర్యము | | ... | 0 | 4 |
| బసవరాజీయము, ఆంధ్ర తాత్పర్యసహితము, క్రొత్తకూర్పు | | | (అచ్చు) | |
| భేషజకల్పము, సాంధ్ర తాత్పర్యము | | ... | 0 | 8 |
| రసప్రదీపిక, ఆంధ్ర తాత్పర్యము | | ... | 0 | 12 |
| రాజమార్తాండము ,, | | ... | 0 | 10 |
| విషవైద్యచింతామణి, ఆంధ్ర తాత్పర్యము | | ... | 3 | 0 |
| వృక్షాయుర్వేదము ,, | | ... | 0 | 6 |
| వైద్యశతశ్లోకి ,, | | ... | 0 | 6 |
| శార్ఙ్గధరకృతత్రిశతి | | ... | 0 | 8 |
| లోలంబరాజీయము, సాంధ్ర తాత్పర్యము | | ... | 0 | 12 |
| శార్ఙ్గధరసంహిత, క్రొత్తకూర్పు ,, | | ... | 5 | 0 |
| [illegible]ద్రసనిఘంటువు, అభిధానరత్నమాల | | ... | 0 | 12 |
| సహదేవపశువైద్యశాస్త్రము, సాంధ్ర తాత్పర్యము | | ... | 0 | 6 |
| సర్వౌషధిగుణకల్పము ,, | | ... | 2 | 8 |
| సూతికాచికిత్స, డాక్టరు వరదప్పనాయుడుగారిది | | ... | [illegible] | 4 |
| జీవధనరక్షణి, పశువైద్యశాస్త్రము | | ... | 1 | 4 |
| మాధవనిదానము, ఆంధ్రవ్యాఖ్యానము | | ... | 4 | 8 |
| సుశ్రుతశారీరము | | ... | 2 | 8 |
| ఘృతతరంగము | | ... | 1 | 4 |
| హోమియోపతి గృహవైద్యం | | ... | 1 | 0 |
| వస్తుగుణమహోదధి, తెనుగువచనము | | ... | 6 | 0 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.

శ్రీ ర స్తు.

శ్రీ మద్రామాయణాంతర్గత

# అరణ్య కాండము

ఆంధ్ర తాత్పర్యసహితము.



చెన్న పురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1924

## అరణ్యకాణ్డ ఫలశ్రుతి రారభ్యతే

### ఉమాసంహితాయాం ఉమాం ప్రతి శివోక్తిః.

యో విరాధవధం నిత్యం శృణోతి శ్రావయేత వా,
తస్య సర్వాణి పాపాని లయం యాన్తి న సంశయః.
శరభంగాశ్రమగతిం రాఘవస్య మహాత్మనః,
శృణ్వ న్త్రిదశలోకం వై ప్రాప్నోత్యేవ న సంశయః.
అప్యహం జీవితం జహ్యాం త్వాం వా సీతే సలక్ష్మణామ్,
ఇత్యాదిశ్రవణా న్మర్త్యో రామా త్కాంక్షిత మాప్నుయాత్.
శ్రుత్వా శ్రీరామవిజయం పాపబంధా ద్విముచ్యతే,
భరత స్యార్యపుత్రస్య తత్ర త్యనవమాత్మకమ్.
భక్త్యా శ్రుత్వా చ గాయత్ర్యాః పరాంసిద్ధి మవాప్నుయాత్
సీతాపహార మారభ్య లంకాయాం స్థాపనావధి.
శ్రవణా చ్ఛాస్త్రవిహితం జ్యేష్ఠా దేవీ విముంచతి,
సీతా న్వేషణ మాకర్ణ్య నైవ లక్ష్మీ ర్వియుజ్యతే.
జటాయో స్సంస్కృతిం శ్రుత్వా నర స్స్వర్గ మవాప్నుయాత్
కబంధమోక్షణం శ్రుత్వా స్వర్లోకం యాతి మానవః.
శబర్యా స్స్వర్గతిం శ్రుత్వా సాధ్వీనాం లోకగో భవేత్
గచ్ఛ శీఘ్ర మితో రామే త్యత్ర త్యం దశమాత్మకమ్.
నిశమ్య దేవ్యా మనుజ స్సార్వలోక మవాప్నుయాత్
అరణ్యకాణ్డ మాహాత్మ్యం యే శృణ్వన్తి మహీతలే.
రాఘవస్య ప్రసాదేన విష్ణులోకం వ్రజంతి తే,

ఆరణ్యకాండపారాయణాదిసమయే శ్రీరామధ్యానక్రమః.

జటిలం చీరవసనం దణ్డకారణ్యవాసినమ్,
మునివేషధరం ధ్యాయే దారణ్యే కాణ్డ ఉత్తమే.

---

శ్రీః

## స్మార్తాదీనాం సర్వేషాం శ్రీరామాయణపారాయణాదౌ కర్తవ్యపూజావిధానమ్.

---

ఆచమ్య, ప్రాణానాయమ్య, మమోపాత్త....శుభే శోభనే ముహూర్తే అస్యాం శుభతిథౌ శ్రీసీతాలక్ష్మణభరతశత్రుఘ్నహనుమత్సమేత శ్రీరామచంద్రదేవతా ప్రీత్యర్థం యావచ్ఛక్తిధ్యానావాహనాదిషోడశోపచారపూజాం కరిష్యే. ఆదౌ నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం గణాధిపతిపూజాం కరిష్యే. తదంగత్వేన కలశపూజాం కరిష్యే. కలశపూజాం గణపతిపూజాం చ కృత్వా, వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామంటపే మధ్యేపుష్పక మాసనే మణిమయే వీరాసనే సుస్థితమ్, అగ్రే వాచయతి ప్రభంజనసుతే తత్త్వం మునిభ్యః పరం. వ్యాఖ్యాంతం భరతాదిభిః పరివృతం రామం భజే శ్యామలమ్. తత శ్రీమతోక్త శోపరి శ్రీరామధ్యానావాహనాది నైవేద్యాంతపూజావిధేయా. శ్రీరామచంద్ర దేవతాభ్యాం నమః. ధ్యానావాహనాదిషోడశోపచారపూజాం చ కృత్వా,

---

### శ్రీమద్రామాయణపారాయణారంభక్రమః.

సద్గురుసకాశా ల్లబ్ధోపదేశో వక్ష్యమాణరీత్యా శ్రీరామాయణపారాయణం కుర్యాత్ - దేశకాలౌ సంకీర్త్య:—

అస్య శ్రీరామాయణమహామంత్రస్య వాల్మీకి ర్భగవాన్ ఋషిః - అనుష్టుప్ఛందః - శ్రీసీతాలక్ష్మణభరతశత్రుఘ్నహనుమత్సమేతశ్రీరామచంద్రో దేవతా - రాం బీజం - శ్రీం శక్తిః-మం కీలకం - మమ శ్రీసీతాలక్ష్మణభరతశత్రుఘ్నహనుమత్సమేతశ్రీరామచంద్రప్రసాదసిద్ధ్యర్థే పారాయణజపే విని

న్యాసః-రాం అంగుష్ఠాభ్యాన్నమః - రీం తర్జనీభ్యాం స్వాహా-రూం మధ్యమాభ్యాం వషట్-రైం అనామికాభ్యాం హుం-రౌం కనిష్ఠికాభ్యాం వౌషట్-రః కరతలకరపృష్ఠాభ్యాం ఫట్-రాం హృదయాయ నమః-రీం శిరసే స్వాహా - రూం శిఖాయై వషట్-రైం కవచాయ హుం-రౌం నేత్రత్రయాయ వౌషట్-రః అస్త్రాయ ఫట్. లోకత్రయేణ దిగ్బంధః. ధ్యానం.—

కాలాంభోధరకాంతికాంత మనిశం వీరాసనాధ్యాసినం
ముద్రాం జ్ఞానమయీం దధాన మపరం హస్తాంబుజం జానుని,
సీతాంపార్శ్వగతాం సరోరుహకరాం విద్యున్నిభాం రాఘవం,
పశ్యంతం ముకుటాంగదాదివివిధాకల్పోజ్జ్వలాంగం భజే.

---

## అథ మానసికపూజా.

లం పృథివ్యాత్మనే శ్రీరామచంద్రపరబ్రహ్మణే గంధం సమర్పయామి-హం ఆకాశాత్మనే శ్రీరామచంద్ర పరబ్రహ్మణే పుష్పం సమర్పయామి - యం వాయ్వాత్మనే శ్రీరామచంద్ర పరబ్రహ్మణే ధూపమాఘ్రాపయామి - రం అగ్న్యాత్మనే శ్రీ రామచంద్రపరబ్రహ్మణే దీపం దర్శయామి-వం అమృతాత్మనే శ్రీరామచంద్రపరబ్రహ్మణే అమృతోపహారం సమర్పయామి సం సర్వాత్మనే శ్రీరామచంద్రపరబ్రహ్మణే సర్వోపచారపూజా స్సమర్పయామి - ఇతి మానసికపూజా.

మూలమంత్రః.—ధర్మాత్మా సత్యసంధశ్చ రామో దాశరథి ర్యది, పౌరుషేచాప్రతిద్వంద్వ శ్శరైనం జహి రావణిమ్.

ఇతి యథాశక్తి జపిత్వా శ్రీరామాయణపారాయణం కుర్యాత్. అనంతరం పునః ధ్యానం మానసికపూజాం హృదయాదిన్యాసం చ కుర్యాత్ - లోకత్రయేణ దిగ్విమోకః.

గుహ్యాతిగుహ్యగోప్తా త్వం గృహాణాస్మత్కృతం జపం,
సిద్ధిర్భవతు మే దేవ! త్వత్ప్రసాదాద్రఘూద్వహ!.

---

## శ్రీవైష్ణవానాం

శ్రీమద్రామాయణపఠనోపక్రమానుసంధేయక్రమః.

ప్రథమతః 'శ్రీశైలేశే'త్యాదిస్వస్వసంప్రదాయనిర్వాహకాచార్యానుసంధానం, తతః 'లక్ష్మీనాథే' త్యారభ్య 'ప్రణతోఽస్మినిత్య' మిత్యంతం, అనంతరం శ్రీశైలపూర్ణవిషయం, 'పితామహ'స్యేతి శ్లోకమారభ్య శ్రీభాష్యకారప్రభృతిస్వాచార్యపర్యంతవిషయాః స్వసాంప్రదాయికశ్లోకా అనుసంధేయాః. యద్వా శ్రీధరాదిస్వాచార్యపర్యంతాః ప్రతివ్యక్తిశ్లోకా అనుసంధేయాః. తతః—

కూజంతం రామ రామేతి మధురం మధురాక్షరమ్,
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్.
వాల్మీకేర్మునిసింహస్య కవితావనచారిణః,
శృణ్వన్ రామకథానాదం కో న యాతి పరాం గతిమ్.
యః పిబన్ సతతం రామచరితామృతసాగరమ్,
అతృప్తస్తం మునిం వందే ప్రాచేతసమకల్మషమ్.
గోష్పదీకృతవారాశిం మశకీకృతరాక్షసమ్,
రామాయణమహామాలారత్నం వందేఽనిలాత్మజమ్.
అంజనానందనం వీరం జానకీశోకనాశనమ్,
కపీశమక్షహంతారం వందే లంకాభయంకరమ్.
మనోజవం మారుతతుల్యవేగం జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్, వాతాత్మజం వానరయూథముఖ్యం శ్రీరామదూతం శిరసా నమామి.

ఉల్లంఘ్యసింధోః సలిలం సలీలం యశ్శోకవహ్నిం జనకాత్మజాయాః, ఆదాయ తేనైవ దదాహ లంకాం నమామి తం ప్రాంజలి రాంజనేయమ్.

ఆంజనేయ మతిపాటలాననం కాంచనాద్రికమనీయవిగ్రహమ్, పారిజాతతరుమూలవాసినం భావయామి పవమాననందనమ్.
యత్రయత్ర రఘునాథకీర్తనం తత్రతత్ర కృతమస్తకాంజలిమ్, బాష్పవారిపరిపూర్ణలోచనం మారుతిం నమత రాక్షసాంతకమ్.
వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే,
వేదః ప్రాచేతసాదాసీ త్సాక్షా ద్రామాయణాత్మనా.
తదుపగతసమాససంధియోగం సమమధురోపనతార్థవాక్యబద్ధమ్, రఘువరచరితం మునిప్రణీతం దశశిరసశ్చ వధం నిశామయధ్వమ్. శ్రీరాఘవం దశరథాత్మజ మప్రమేయం సీతాపతిం రఘుకులాన్వయరత్నదీపమ్, ఆజానుబాహు మరవిందదళాయతాక్షం రామం నిశాచరవినాశకరం నమామి.
వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామంటపే
మధ్యేపుష్పక మాసనే మణిమయే వీరాసనే సుస్థితమ్,
అగ్రే వాచయతి ప్రభంజనసుతే తత్త్వం మునిభ్యః పరమ్
వ్యాఖ్యాంతం భరతాదిభిః పరివృతం రామం భజే శ్యామలమ్.
తతో యథాశక్తి శ్రీకోశోపరి భగవదారాధనం కర్తవ్యమ్.

---

## పారాయణసమాపనక్రమః.

ఏవ మేత త్పురావృత్త మాఖ్యానం భద్ర మస్తు వః,
ప్రవ్యాహరత విస్రబ్ధం బలం విష్ణోః ప్రవర్ధతామ్.
లాభ స్తేషాం జయ స్తేషాం కుత స్తేషాం పరాభవః,
యేషా మిందీవరశ్యామో హృదయే సుప్రతిష్ఠితః

కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్యశాలినీ,
దేశోఽయం క్షోభరహితో బ్రాహ్మణా స్సంతు నిర్భయాః.
కావేరీ వర్ధతాం కాలే కాలే వర్షతు వాసవః,
శ్రీరంగనాథో జయతు శ్రీరంగశ్రీశ్చ వర్ధతామ్.
స్వస్తిప్రజాభ్యః పరిపాలయంతాంన్యాయ్యేనమార్గేణమహీంమహీశాః, గో బ్రాహ్మణేభ్య శ్శుభ మస్తు నిత్యం లోకా స్సమస్తా స్సుఖినో భవంతు.
మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాబ్ధయే,
చక్రవర్తితనూజాయ సార్వభౌమాయ మంగళమ్.
వేదవేదాంతవేద్యాయ మేఘశ్యామలమూర్తయే,
పుంసాం మోహనరూపాయ పుణ్యశ్లోకాయ మంగళమ్.
విశ్వామిత్రాంతరంగాయ మిథిలానగరీపతేః,
భాగ్యానాం పరిపాకాయ భవ్యరూపాయ మంగళమ్.
పితృభక్తాయ సతతం భ్రాతృభి స్సహ సీతయా,
నందితాఖిలలోకాయ రామభద్రాయ మంగళమ్.
త్యక్తసాకేతవాసాయ చిత్రకూటవిహారిణే,
సేవ్యాయ సర్వయమినాం ధీరోదారాయ మంగళమ్.
సౌమిత్రిణా చ జానక్యా చాపబాణాసిధారిణే,
సంసేవ్యాయ సదా భక్త్యా స్వామినే మమ మంగళమ్.
దండకారణ్యవాసాయ ఖండితామరశత్రవే,
గృధ్రరాజాయ భక్తాయ ముక్తిదా యాస్తు మంగళమ్.
సాదరం శబరీదత్తఫలమూలాభిలాషిణే,
సౌలభ్యపరిపూర్ణాయ సత్త్వోద్రిక్తాయ మంగళమ్.
హనుమత్సమవేతాయ హరీశాభీష్టదాయినే,
వాలిప్రమథనా యాస్తు మహాధీరాయ మంగళమ్.

శ్రీమతే రఘువీరాయ సేతూల్లంఘితసింధవే,
జితరాక్షసరాజాయ రణధీరాయ మంగళమ్.
ఆసాద్య నగరీం దివ్యా మభిషిక్తాయ సీతయా,
రాజాధిరాజరాజాయ రామభద్రాయ మంగళమ్.
మంగళాశాసనపరై ర్మదాచార్యపురోగమైః,
సర్వైశ్చ పూర్వై రాచార్యై స్సత్కృతా యాస్తు మంగళమ్.
తతః పితామహ స్యే త్యారభ్య స్వాచార్యాంతా శ్లోకా అను
సంధేయాః.

---

శ్రీస్మార్తపద్ధ్యాదీనాం శ్రీమద్రామాయణ
పఠనోపక్రమానుసంధేయక్రమః.

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్,
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే.
వాగీశాద్యా స్సుమనస స్సర్వార్థానా ముపక్రమే,
యం నత్వా కృతకృత్యా స్స్యు స్తం నమామి గజాననమ్.
తతః శ్రీమచ్ఛంకరాచార్యాదిగురుపరంపరాఽనుసంధేయా.
దోర్భిర్యుక్తాచతుర్భిస్స్ఫటికమణిమయీ మక్షమాలాందధానా
హస్తే నైకేన పద్మం సిత మపి చ శుకం పుస్తకం చాపరేణ,
భాసాకుందేందుశంఖస్ఫటికమణినిభా భాసమానాఽసమానా
సా మే వాగ్దేవ తేయం నివసతు వదనే సర్వదా సుప్రసన్నా.
కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్,
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్.
వాల్మీకే ర్మునిసింహస్య కవితావనచారిణః,
శృణ్వన్ రామకథానాదం కో నయాతి పరాం గతిమ్.
యః పిబన్ సతతం రామచరితామృతసాగరమ్,

అతృప్త స్తం మునిం వందే ప్రాచేతస మకల్మషమ్.
గోష్పదీకృతవారాశిం మశకీకృతరాక్షసమ్,
రామాయణమహామాలారత్నం వందేఽనిలాత్మజమ్.
అంజనానందనం వీరం జానకీశోకనాశనమ్,
కపీశ మక్షహంతారం వందే లంకాభయంకరమ్.
ఉల్లంఘ్య సింధో స్సలిలం సలీలం యః శ్శోకవహ్నిం జనకాత్మ జాయాః, ఆదాయ తేనైవ దదాహ లంకాం నమామి తం ప్రాంజలి రాంజనేయమ్.
ఆంజనేయ మతిపాటలాననం కాంచనాద్రికమనీయవిగ్రహమ్,
పారిజాతతరుమూలవాసినం భావయామి పవమాననందనమ్.
యత్రయత్ర రఘునాథకీర్తనం తత్రతత్ర కృతమ స్తకాంజలిమ్,
బాష్పవారిపరిపూర్ణలోచనం మారుతింనమత రాక్షసాంతకమ్.
మనోజవం మారుతతుల్యవేగం జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్, వాతాత్మజం వానరయూథముఖ్యం శ్రీరామదూతం శిరసా నమామి.
యః కర్ణాంజలిసంపుటై రహరహ స్సమ్య క్పిబ త్యాదరా
ద్వాల్మీకే ర్వదనారవిందగళితం రామాయణాఖ్యం మధు,
జన్మవ్యాధిజరావిపత్తిమరణై రత్య న్తసోపద్రవమ్
సంసారం స విహాయ గచ్ఛతి పుమా న్విష్ణోః పదం శాశ్వతమ్.
తదుపగతసమాససంధియోగం సమమధురోపనతార్థవాక్యబద్ధమ్, రఘువరచరితం మునిప్రణీతం దశశిరసశ్చ వధం నిశామయధ్వమ్.
వాల్మీకిగిరిసంభూతా రామసాగరగామినీ,
పునాతి భువనం పుణ్యా రామాయణమహానదీ.
శ్లోకసారసమాకీర్ణం సర్గకల్లోలసంకులమ్,

కాండగ్రాహమహామీనం వందే రామాయణార్ణవమ్,
వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే,
వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షా ద్రామాయణాత్మనా.
వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామంటపే
మధ్యేపుష్పక మాసనే మణిమయే వీరాసనే సుస్థితమ్,
అగ్రే వాచయతిప్రభంజనసుతే తత్త్వం మునిభ్యః పరమ్
వ్యాఖ్యాంతం భరతాదిభిః పరివృతం రామంభజే శ్యామలమ్.
వామే భూమిసుతా పురశ్చ హనుమా న్పశ్చా త్సుమిత్రాసుత
శ్శత్రుఘ్నో భరతశ్చ పార్శ్వదళయో ర్వాయ్వాదికోణేషు చ,
సుగ్రీవశ్చ విభీషణశ్చ యువరాట్ తారాసుతో జాంబవా
న్మధ్యే నీలసరోజకోమలరుచిం రామం భజే శ్యామలమ్.
నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ దేవ్యై చ తస్యై జనకా
త్మజాయై, నమోఽస్తు రుద్రేంద్రయమానిలేభ్యో నమోఽస్తు
చంద్రార్కమరుద్గణేభ్యః.
తతః శ్రీకోశోపరి శ్రీరామావాహనాదినైవేద్యాంతపూజా
విధేయా. పారాయణావసానే చ పునఃపూజా కర్తవ్యా.

---

పారాయణసమాపనసమయానుసంధేయక్రమః.

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం న్యాయ్యేన మార్గేణ
మహీం మహీశాః, గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం లోకా
స్సమస్తా స్సుఖినో భవంతు.
కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్యశాలినీ,
దేశోఽయం క్షోభరహితో బ్రాహ్మణా స్సంతు నిర్భయాః.
అపుత్త్రాః పుత్త్రిణ స్సంతు పుత్త్రిణ స్సంతు పౌత్త్రిణః,
అధనా స్సధనా స్సంతు జీవంతు శరదాం శతమ్.

చరితం రఘునాథస్య శతకోటిప్రవిస్తరమ్,
ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్.
శృణ్వ న్రామాయణం భక్త్యా యః పాదం పద మేవ వా,
స యాతి బ్రహ్మణ స్థానం బ్రహ్మణా పూజ్యతే సదా.
రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే,
రఘునాథాయ నాథాయ సీతాయాఃపతయే నమః.
య న్మంగళం సహస్రాక్షే సర్వదేవనమస్కృతే,
వృత్రనాశే సమభవ త్త త్తే భవతు మంగళమ్.
య న్మంగళం సుపర్ణస్య వినతాఽకల్పయ త్పురా,
అమృతం ప్రార్థయానస్య త త్తే భవతు మంగళమ్.
మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాత్మనే,
చక్రవర్తితనూజాయ సార్వభౌమాయ మంగళమ్.
అమృతోత్పాదనే దైత్యాన్ ఘ్నతో వజ్రధరస్య యత్
అదితి ర్మంగళం ప్రాదా త్త త్తే భవతు మంగళమ్.
త్రీ న్విక్రమాన్ ప్రక్రమతో విష్ణో రమితతేజసః,
య దాసీ న్మంగళం రామ! త త్తే భవతు మంగళమ్.
ఋతవ స్సాగరా ద్వీపా వేదా లోకా దిశ శ్చ తే,
మంగళాని మహాబాహో! దిశంతు తవ సర్వదా.

కాయేన వాచా మనసేంద్రియై ర్వా బుద్ధ్యాఽఽత్మనా వా ప్రకృతే స్స్వభావాత్, కరోమి యద్య త్సకలం పరస్మై నారాయణాయేతి సమర్పయామి

# శ్రీగాయత్రీరామాయణమ్.

---

తపస్స్వాధ్యాయనిరతం తపస్వీ వాగ్విదాం వరమ్,
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్మునిపుంగవమ్. ౧
స హత్వా రాక్షసాన్ సర్వాన్ యజ్ఞఘ్నాన్ రఘునందనః,
ఋషిభిః పూజిత స్సమ్య గ్యథేంద్రో విజయీ పురా. ౨
విశ్వామిత్ర స్స ధర్మాత్మా శ్రుత్వా జనకభాషితమ్,
వత్స రామ ధనుః పశ్య ఇతి రాఘవ మబ్రవీత్. ౩
తుష్టావాస్య తదా వంశం ప్రవిశ్య స విశాంపతేః,
శయనీయం నరేంద్రస్య తదాసాద్య వ్యతిష్ఠత. ౪
వనవాసం హి సంఖ్యాయ వాసాం స్యాభరణాని చ,
భర్తార మనుగచ్ఛంత్యై సీతాయై శ్వశురో దదౌ. ౫
రాజా సత్యం చ ధర్మం చ రాజా కులవతాం కులమ్,
రాజా మాతా పితా చైవ రాజా హితకరో నృణామ్. ౬
నిరీక్ష్య స ముహూర్తం తు దదర్శ భరతో గురుమ్,
ఉటజే రామ మాసీనం జటావల్కలధారిణమ్. ౭
యది బుద్ధిః కృతా ద్రష్టు మగస్త్యం తం మహామునిమ్,
అద్యైవ గమనే బుద్ధిం రోచయస్వ మహాయశాః. ౮
భరత స్యార్యపుత్రస్య శ్వశ్రూణాం మమ చ ప్రభో,
మృగరూప మిదం వ్యక్తం విస్మయం జనయిష్యతి. ౯
గచ్ఛ శీఘ్ర మితో రామ సుగ్రీవం తం మహాబలమ్,
వయస్యం తం కురు క్షిప్ర మితో గత్వాఽద్య రాఘవ. ౧౦
దేశకాలా ప్రతీక్షస్వ క్షమమాణః ప్రియాప్రియే,
సుఖదుఃఖసహః కాలే సుగ్రీవవశగో భవ. ౧౧

సంద్యాస్తేతు తపస్సిద్ధా స్తపసా వీతకల్మషాః,
ప్రష్టవ్యా శ్చాపి సీతాయాః ప్రవృత్తిం వినయాన్వితైః. ౧౨

స నిర్జిత్య పురీం శ్రేష్ఠాం లంకాం తాం కామరూపిణీమ్,
విక్రమేణ మహాతేజా హనుమాన్ మారుతాత్మజః. ౧౩

ధన్యా దేవా స్సగంధర్వా స్సిద్ధా శ్చ పరమర్షయః,
మమ పశ్యంతి యే నాథం రామం రాజీవలోచనమ్. ౧౪

మంగళాభిముఖీ తస్య సా తదాసీ న్మహాకపేః,
ఉపతస్థే విశాలాక్షీ ప్రయతా హవ్యవాహనమ్. ౧౫

హితం మహార్థం మృదుపూర్వసంహితం వ్యతీతకాలాయతి
సంప్రతిక్షమమ్, నిశమ్య తద్వాక్య ముపస్థితజ్వరః ప్రసంగవా
నుత్తర మేత దబ్రవీత్. ౧౬

ధర్మాత్మా రక్షసాం శ్రేష్ఠ స్సంప్రాప్తోఽయం విభీషణః,
లంకైశ్వర్యం ధ్రువం శ్రీమా నయం ప్రాప్నో త్యకంటకమ్.
యో వజ్రపాతాశనిసన్నిపాతా న్న చుక్షుభే నాపి చచాల రా
జా, స రామబాణాభిహతో భృశార్త శ్చచాల చాపం చ
ముమోచ వీరః. ౧౭

యస్య విక్రమ మాసాద్య రాక్షసా నిధనం గతాః,
తం మన్యే రాఘవం వీరం నారాయణ మనామయమ్. ౧౯

న తే దదృశిరే రామం దహంత మరివాహినీమ్,
మోహితాః పరమాస్త్రేణ గాంధర్వేణ మహాత్మనా. ౨౦

ప్రణమ్య దేవతాభ్యశ్చ బ్రాహ్మణేభ్యశ్చ మైథిలీ,
బద్ధాంజలిపుటా చేద మువా చాగ్నిసమీపతః. ౨౧

చలనా త్పర్వతేంద్రస్య గణా దేవాశ్చ కంపితాః,
చచాల పార్వతీ చాపి తదాశ్లిష్టా మహేశ్వరమ్. ౨౨

దారాః పుత్త్రాః పురం రాష్ట్రం భోగాచ్ఛాదనభాజనమ్,
సర్వమే వావిభక్తం నో భవిష్యతి హరీశ్వర. ౨౩
యామేవ రాత్రిం శత్రుఘ్నః పర్ణశాలాం సమావిశత్,
తామేవ రాత్రిం సీతాఽపి ప్రసూతా దారకద్వయమ్. ౨౪
ఇదం రామాయణం కృత్స్నం గాయత్రీబీజసంయుతమ్,
త్రిసంధ్యం యః పఠే న్నిత్యం సర్వపాపైః ప్రముచ్యతే. ౨౫

గాయత్రీరామాయణం సంపూర్ణమ్.

---

## దేవతాప్రార్థనా.

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్,
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే.
రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే,
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః.

---

## వాల్మీకిప్రార్థనా.

కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్,
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలం.
వాల్మీకే ర్మునిసింహస్య కవితావనచారిణః,
శృణ్వ న్రామకథానాదం కో న యాతి పరాం గతిమ్.

---

## ఆంజనేయప్రార్థనా.

అంజనానందనం వీరం జానకీశోకనాశనమ్,
కపీశ మక్షహంతారం వందే లంకాభయంకరం.

గోష్పదీకృతవారాశిం మశకీకృతరాక్షసం,
రామాయణమహామాలారత్నం వందేఽనిలాత్మజమ్.
మనోజవం మారుతతుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠం,
వాతాత్మజం వానరయూథముఖ్యం
శ్రీరామదూతం శిరసా నమామి.

## శ్రీరామాయణప్రశంసా.

శ్రీమద్బ్రహ్మ తదేవ బీజ మమలం యస్యాఙ్కుర శ్చిన్మయః,
కాణ్డై స్సప్తభి రన్వితోఽతివితతో ఋష్యాలవాలోదితః,
పత్రై స్తత్త్వసహస్రకై స్సువిలసచ్ఛాఖాశతైః పఞ్చభి
శ్చాత్మప్రాప్తిఫలప్రదో విజయతే రామాయణ స్స్వ స్తరుః.
యః కర్ణాంజలిసంపుటై రహరహ స్సమ్య క్పిబ త్యాదరా
ద్వాల్మీకే ర్వదనారవిందగళితం రామాయణాఖ్యం మధు,
జన్మవ్యాధిజరావిపత్తిమరణై రత్యన్తసోపద్రవం
సంసారం స విహాయ గచ్ఛతి పుమా న్విష్ణోః పదం శాశ్వతమ్.
వాల్మీకిగిరిసంభూతా రామాంభోనిధిసంగతా,
శ్రీమద్రామాయణీగంగా పునాతు భువనత్రయం.

శ్రీః.

# శ్రీమద్రామాయణే - అరణ్యకాణ్డే

## ప్రథమస్సర్గః.

ప్రవిశ్యతు మహారణ్యం దణ్డకారణ్య మాత్మవాన్,
దదర్శ రామో దుర్ధర్ష స్తాపసాశ్రమమణ్డలమ్. ౧

కుశచీరపరిక్షిప్తం బ్రాహ్మ్యా లక్ష్మ్యా సమావృతమ్,
యథా ప్రదీప్తం దుర్దర్శం గగనే సూర్యమణ్డలమ్. ౨

శరణ్యం సర్వభూతానాం సుసమ్మృష్టాజిరం తథా,
మృగై ర్బహుభి రాకీర్ణం పక్షిసఙ్ఘై స్సమాకులమ్. ౩

పూజితం చ ప్రనృత్తం చ నిత్య మప్సరసాం గణైః,
విశాలై రగ్నిశరణై స్స్రుగ్భాణ్డై రజినైః కుశైః. ౪

సమిద్భి స్తోయకలశైః ఫలమూలై శ్చ శోభితమ్,
ఆరణ్యై శ్చ మహావృక్షైః పుణ్యై స్స్వాదుఫలై ర్వృతమ్. ౫

బలిహోమార్చితం పుణ్యం బ్రహ్మఘోషనినాదితమ్,
పుష్పై ర్వన్యైః పరిక్షిప్తం పద్మిన్యా చ సపద్మయా. ౬

శ్రీరస్తు.

# అరణ్యకాండ తాత్పర్యము.

---

## ఒకటవ సర్గము.

మహాధైర్యశాలియు ధర్మిష్ఠుండు నగు రాముఁడు భయంకరాకారంబయిన దండకారణ్యంబుఁ బ్రవేశించి యచ్చటనుండు ఋష్యాశ్రమంబులం జూచెను. ౧

హోమాద్యర్థమయి తీసికొనివచ్చిన దర్భలచేతను దడిపి యారవేయఁబడిన వల్కలంబులచేతను ఒప్పుచున్నదియుఁ దపోబలజన్యంబగు బ్రహ్మవర్చస్సుచే జ్వలించుచున్నదియు నాకాశంబున దుర్దర్శంబై వెలుఁగు మధ్యాహ్నసూర్యమండలముంబోలెఁ జూపట్టుచున్నదియు నగు నాశ్రమసమూహమును రాముఁడు చూచెను. ౨

సమస్తప్రాణులకును వాసయోగ్యంబును జక్కఁగా నలుకఁబడిన భూములుగలదియుఁ బెక్కుమృగంబులతోను మధురస్వరంబులగు పక్షులతోనుం గూడినదియు నగు నాశ్రమసమూహమును రాముఁడు చూచెను. ౩

ఎల్లప్పుడును భక్త్యతిశయంబున నర్తనంబుసేయుచున్న యచ్చరలచేఁ బూజింపఁబడుచున్న యాశ్రమసమూహముం జూచెను.

విశాలంబులగు నగ్నిహోత్రగృహంబులచేతను యాగపాత్రలచేతను కృష్ణాజినములచేతను దర్భలచేతను సమిత్తులచేతను జలకలశంబులచేతను ఫలమూలంబులచేతను ఒప్పుచున్న ఋష్యాశ్రమములను రాముఁడు చూచెను. ౪

మంచిఫలంబులుగలవియుఁ బవిత్రంబులు నగు గొప్పయడవివృక్షంబులతోఁగూడిన యాశ్రమసమూహమును రాముఁడు చూచెను. ౫

భూతబల్యాదిబలులతోను వైశ్వదేవాదిహోమములతోనుఁ గూడినదియుఁ బుణ్యంబును వేదపారాయణధ్వనితోఁ గూడినదియు దేవతార్చనకును

ఫలమూలాశనై ర్దాన్తై శ్చీరకృష్ణాజినామ్బరైః,
సూర్యవైశ్వానరాభైశ్చ పురాణై ర్మునిభి ర్వృతమ్. ౭

పుణ్యైశ్చ నియతాహారై శ్శోభితం పరమర్షిభిః,

తద్బ్రహ్మభవనప్రఖ్యం బ్రహ్మఘోషనినాదితమ్. ౮
బ్రహ్మవిద్భి ర్మహాభాగై ర్బ్రాహ్మణై రుపశోభితమ్,
స దృష్ట్వా రాఘవ శ్శ్రీమాం స్తాపసాశ్రమమణ్డలమ్. ౯
అభ్యగచ్ఛ న్మహాతేజా విజ్యం కృత్వా మహ ద్ధనుః,
దివ్యజ్ఞానోపపన్నా స్తే రామం దృష్ట్వా మహర్షయః. ౧౦
అభ్యగచ్ఛం స్తథా ప్రీతా వైదేహీం చ యశస్వినీమ్,

తే తం సోమ మివోద్యన్తం దృష్ట్వా వై ధర్మచారిణః. ౧౧
లక్ష్మణం చైవ దృష్ట్వా తు వైదేహీం చ యశస్వినీమ్,
మఙ్గళాని ప్రయుఞ్జానాః ప్రత్యగృహ్ణ న్దృఢవ్రతాః. ౧౨
రూపసంహననం లక్ష్మీం సౌకుమార్యం సువేషతామ్,
దదృశు ర్విస్మితాకారా రామస్య వనవాసినః. ౧౩
వైదేహీం లక్ష్మణం రామం నేత్రై రనిమిషై రివ,
ఆశ్చర్యభూతా న్దదృశు స్సర్వే తే వనచారిణః. ౧౪
అత్రైనం హి మహాభాగా స్సర్వభూతహితే రతమ్,
అతిథిం పర్ణశాలాయాం రాఘవం సంన్యవేశయన్. ౧౫

మంబులతో నొప్పుచున్నదియుఁ గమలశోభితంబగు కమలాకరముతోఁ గూడినదియు నగు ఋష్యాశ్రమసమూహమును రాముఁడు చూచెను. ౬

ఫలమూలంబు లాహారంబుగాఁ గొనువారలును జితేంద్రియులును వల్కలంబులను గృష్ణాజినంబులను ధరించియుండువారలును సూర్యునకు సరి వచ్చువారలును అగ్నిహోత్రసమానులు నగు వృద్ధమునులతోఁ గూడిన ఋష్యాశ్రమసమూహమును రాముఁడు చూచెను. ౭

పరిశుద్ధులును జితాహారులు నగు మున్ను చెప్పఁబడిన మునులకును బూజనీయులయిన మహర్షులతోనుం గూడిన యాశ్రమసమూహమును రాముఁడు చూచెను. ౮

మహాతేజుఁడును శ్రీమంతుఁడు నగు రాముఁడు బ్రహ్మలోకంబు నంటినదియు వేదఘోషంబుచే నలంకరింపఁబడినదియు బ్రహ్మవేత్తలగు నుత్తమ బ్రాహ్మణులతో నొప్పుచున్నదియు నగు నయ్యాశ్రమమండలంబుఁ జూచి ధనుస్సు విజ్యంబు గావించి యయ్యాశ్రమంబులకుం బోయెను. ౯

దివ్యజ్ఞానసహితు లగుటం జేసి రాముఁడు నారాయణావతారరూపుఁ డగుటయు సీతాలక్ష్మణులమాహాత్మ్యంబు నెఱింగినవారలగు నమ్మహర్షులం సీతారామలక్ష్మణులం జూచి పరమసంతోషంబున నెదుర్కొనిరి. ౮-౧౦

ధార్మికులును దృఢవ్రతులు నగు నమ్మహర్షులు ఉదయించుచంద్రుం బోలె నున్న రాముని సీతాలక్ష్మణులనుం జూచి వారలకునుం గశాశీర్వాదంబులం గావించుచుఁ బ్రతిగ్రహించిరి. ౧౨

వనవాసులు రామునిరూపంబును శరీరంబును లక్ష్మిని సౌకుమార్యంబును సౌందర్యంబునుం జూచి యాశ్చర్యంబు నొందిరి. ౧౩

వనవాసు లందఱు సీతాదేవిని రామలక్ష్మణులను ఱెప్పపాటు విడిచి పరమాశ్చర్యంబునం జూచిరి. ౧౪

అయ్యాశ్రమమండలంబున మహాభాగులగు మునులు సమస్తప్రాణిహితాసక్తుఁడగు రాముం డతిథిగా వచ్చుటకు సంతసించి యాయనను బర్ణశాలకుఁ దీసికొనిపోయిరి. ౧౫

తతో రామస్య సత్కృత్య విధినా పావకోపమాః,
ఆజహ్రు స్తే మహాభాగా స్సలిలం ధర్మచారిణః. ౧౬
పుష్పం మూలం ఫలం వన్య మాశ్రమం చ మహాత్మనః,
నివేదయిత్వా ధర్మజ్ఞా స్తతః ప్రాఞ్జలయోఽబ్రువన్. ౧౭

ధర్మపాలో జన స్యాస్య శరణ్య స్త్వం మహాయశః!,
పూజనీయ శ్చ మాన్య శ్చ రాజా దణ్డధరో గురుః. ౧౮

ఇన్ద్రస్యేవ చతుర్భాగః ప్రజా రక్షతి రాఘవ!,
రాజా తస్మా ద్వరా న్భోగా న్భుఙ్క్తే లోకనమస్కృతః. ౧౯

తే వయం భవతా రక్ష్యా భవద్విషయవాసినః,
నగరస్థో వనస్థో వా త్వం నో రాజా జనేశ్వరః. ౨౦
న్యస్తదణ్డా వయం రాజ! న్జితక్రోధా జితేన్ద్రియాః,
రక్షితవ్యా స్త్వయా శశ్వ ద్గర్భభూతా స్తపోధనాః. ౨౧

ఏవ ముక్త్వా ఫలై ర్మూలైః పుష్పై ర్వన్యై శ్చ రాఘవమ్,
అన్యై శ్చ వివిధాహారై స్సలక్ష్మణ మపూజయన్. ౨౨

తథాఽన్యే తాపసా స్సిద్ధా రామం వైశ్వానరోపమాః,
న్యాయవృత్తా యథాన్యాయం తర్పయామాసు రీశ్వరమ్ ౨౩
ఇతి శ్రీమదరణ్యకాణ్డే ప్రథమ స్సర్గః ౧.

అంత నగ్నిహోత్రతుల్యులును మహాభాగులును బరమధార్మికులు నగు సమ్మునులు రామునకు స్వాగతంబుఁ జెప్పి పూజార్థమయి జలంబుఁ దెచ్చిరి.

దివ్యజ్ఞానోపపన్నులగు నా ఋషులు మహాత్ముఁడగు రామునకు వనంబునందుఁ గలిగిన పుష్పంబులను ఫలమూలంబులను నివేదించి తమయాశ్రమంబును ఆయనకు నొప్పగించి రాముని నారాయణావతారునిగ నెఱింగినవార లగుటచే భక్తిపూర్వకంబుగా నితరరాజులకన్న నధికుండును భగవంతుఁడు నను భావనచేఁ జేమోడ్పు గీలించి యిట్లని విన్నవించిరి. ౧౭

మహాయశుఁడవగు రాముఁడా! నీవు ధర్మమును బాలించువాఁడ వగుటచే మాకందఱకును శరణ్యుఁడవు; పూజింపను గౌరవింపను దగినవాఁడవు ఏలయన రాజు దుష్టుల శిక్షించుఁగావున తండ్రియంటివాఁడు. ౧౮

రాముఁడా! రాజు దేవేంద్రుని నాల్గవభాగంబునను నితరదిక్పాలకుల యంశంబులను నిర్మింపఁబడినవాఁడై ప్రజలను రక్షించును కావున నతనికి సమస్తభోగంబుల ననుభవించుట యుక్తముగా నున్నది. ౧౯

మేమందఱము నీ దేశంబున నుండువారము కావున నీవె మాకు రక్షకుఁడవు పట్టణంబుననున్నను వనంబున నున్నను నీవె మాకు రాజవు. ౨౦

రాజవగు రాముఁడా! మేము ఎవ్వరంగాని యపకారము గావించినను వారిని శిక్షించుటను విడిచి, కోపంబుఁ బరిత్యజించి జితేంద్రియులమయి తపంబు గావించుచుండువారలము; భిక్షువంటివారము; కావున నీవు మమ్ము ఎప్పుడును దప్పక రక్షింపుచుండవలెను. అని యమ్మునులు రామునితోఁ జెప్పికొనిరి ౨౧

అమ్మహర్షులు ఈ ప్రకారంబున బ్రార్థించి నానావిధంబులగు పుష్పములచేతను ఫలమూలంబులచేతను నుతించుచు వనంబునం గలుగు నానావిధంబులయిన యితరాహారములచేతను రామలక్ష్మణులం బూజించిరి. ౨౨

అగ్నిహోత్రసమానులును శాస్త్రోక్తాచారసంపన్నులును దపస్సిద్ధులు నగు నితరమహర్షులును యథాన్యాయంబుగ రాముం బూజించిరి ౨౩

ఇది యొకటవసర్గము.

## ద్వితీయ స్సర్గః.

కృతాతిథ్యోఽథ రామ స్తు సూర్య స్యోదయనం ప్రతి,
ఆమన్త్ర్య స మునీం త్సర్వా న్వన మే వాన్వగాహత. ౧
నానామృగగణాకీర్ణం శార్దూలవృకసేవితమ్,
ధ్వ స్తవృక్షలతాగుల్మం దదర్శ సలిలాశయమ్. ౨
నిష్కూజనానాశకుని ఝిల్లికాగణనాదితమ్,
లక్ష్మణానుగతో రామో వనమధ్యం దదర్శ హ. ౩

సీతయా సహ కాకుత్స్థ స్తస్మి న్ఘోరమృగాయుతే,
దదర్శ గిరిశృఙ్గాభం పురుషాదం మహాస్వనమ్. ౪
గమ్భీరాక్షం మహావక్త్రం వికటం విషమోదరమ్,
బీభత్సం విషమం దీర్ఘం వికృతం ఘోరదర్శనమ్. ౫
వసానం చర్మ వైయాఘ్రం వసార్ద్రం రుధిరోక్షితమ్,
త్రాసనం సర్వభూతానాం వ్యాదితాస్య మి వాన్తకమ్. ౬
త్రీం త్సింహాం శ్చతురో వ్యాఘ్రా న్ద్వౌ వృకౌ పృషతా న్దశ,
సవిషాణం వసాదిగ్ధం గజస్య చ శిరో మహత్. ౭
అవసజ్యాఽయసే శూలే వినద న్తం మహాస్వనమ్,
స రామం లక్ష్మణం చైవ సీతాం దృష్ట్వా చ మైథిలీమ్. ౮
అభ్యధావత సంక్రుద్ధః ప్రజాః కాల ఇ వాన్తకః,
స కృత్వా భైరవం నాదం చాలయ న్నివ మేదినీమ్. ౯
అఙ్కే నాదాయ వైదేహీ మపక్రమ్య తతోఽబ్రవీత్,
యువాం జటాచీరధరౌ సభార్యౌ క్షీణజీవితౌ. ౧౦
ప్రవిష్టౌ దణ్డకారణ్యం శరచాపాసిధారిణౌ,

## రెండవసర్గము.

అంతట నట్లు రాముఁడు వారలవలన నాతిథ్యంబువడసి సూర్యోదయంబున మునులనందఱ వీడ్కొని యరణ్యంబునకుఁ బోయెను. ౧

రాముఁడు లక్ష్మణసహితుఁడై నానామృగంబులతోఁ గూడినదియుఁ బెద్దపులులు మున్నగుక్రూరజంతువులు గలదియు నలఁగినవృక్షంబులును లతలును గుల్మములును గలదియుఁ జూడ నసహ్యంబులయిన కొలంకులతోఁ గూడినదియు భయంబుంజేసి ధ్వనింపక నిశ్చలంబులయియుండు నానావిధపక్షులు గలదియు అధికసూర్యతాపంబు లగుటవలన నిర్భయంబుగ ధ్వనించుచున్న యీలపురుగులతో నొప్పుచున్నదియు నగు నరణ్యమధ్యంబుం జూచెను. ౨-౩

రాముఁడు సీతాలక్ష్మణులతోఁ గూడఁబోవుచుఁ బర్వతశిఖరాకారుండును మహానాదుండును గంభీరనయనుండును పెద్దనోరుగలవాఁడును మహాకాయుఁడును వికృతోదరుండును జూచువారలకు రోఁతగలిగించువాఁడును విషమదేహుండును, దీర్ఘగాత్రుండును, వికృతుండును, భయంకరాకారుండును, రక్తమాంసంబుల నార్ద్రంబయిన వ్యాఘ్రచర్మంబు ధరించియున్నవాఁడును, సమస్తభూతభయంకరుండును, నోరు దెఱచుకొనియున్న యమునింబగిదిఁ జూపట్టుచున్నవాఁడును, మూఁడుసింహంబులను నాలుగుపెద్దపులులను రెండుతోఁడేళ్లను బదిజింకలను వసాదిగ్ధంబగు గొప్పయేనుంగుతలయొక్కటియును ఆయసశూలంబునం గ్రుచ్చిపట్టుకొని భయంకరంబుగా నఱచుచున్నవాఁడునగు నొక్కరాక్షసునిం జూచెను. ౪-౮

ఆరాక్షసుఁడు సీతారామలక్ష్మణులం జూచి క్రుద్ధుఁడై సంహారకాలంబున యముండు ప్రజలపైకి వచ్చునట్లు వారలపైకి వచ్చెను.

ఆరాక్షసుఁడు భూమి యంతయుఁ గదలునట్లు భయంకరనాదంబుఁ గావించి సీతనెత్తి చంకలో నుంచుకొని యావలికిం బోయి రామలక్ష్మణులం జూచి యిట్లని చెప్పెను. ౯

మీరలు జటాచీరంబులు ధరించి భార్యాసహితులరయి ధనుర్బాణంబులను ఖడ్గంబును ధరించి యీదండకారణ్యంబునకు వచ్చినారు కావున మీయాయువు దీఱిన ట్లున్నది.

కథం తాపసయో ర్వాం చ వాసః ప్రమదయా సహ. ౧౧
అధర్మచారిణౌ పాపౌ కౌ యువాం మునిదూషకౌ,

అహం వన మిదం దుర్గం విరాధో నామ రాక్షసః. ౧౨
చరామి సాయుధో నిత్య మృషిమాంసాని భక్షయన్,
ఇయం నారీ వరారోహా మమ భార్యా భవిష్యతి. ౧౩
యువయోః పాపయో శ్చాహం పాస్యామి రుధిరం మృధే,

త స్యైవం బ్రువతో దుష్టం విరాధస్య దురాత్మనః. ౧౪
శ్రుత్వా సగర్వితం వాక్యం సమ్భ్రాన్తా జనకాత్మజా,
సీతా ప్రావేప తోద్వేగా త్ప్రవాతే కదళీ యథా. ౧౫
తాం దృష్ట్వా రాఘవ స్సీతాం విరాధాఙ్కగతాం శుభామ్,
అబ్రవీ ల్లక్ష్మణం వాక్యం ముఖేన పరిశుష్యతా ౧౬
పశ్య సౌమ్య! నరేన్ద్రస్య జనకస్యాత్మసమ్భవామ్,
మమ భార్యాం శుభాచారాం విరాధాఙ్కే ప్రవేశితామ్ ౧౭
అత్యన్తసుఖసంవృద్ధాం రాజపుత్రీం యశస్వినీమ్,

య దభిప్రేత మస్మాసు ప్రియం వరవృతం చ యత్. ౧౮
కైకేయ్యాస్తు సుసంపన్నం క్షిప్ర మద్యైవ లక్ష్మణ!,

యా న తుష్యతి రాజ్యేన పుత్రార్థే దీర్ఘదర్శినీ. ౧౯
యయాఽహం సర్వభూతానాం హితః ప్రస్థాపితో వనమ్,
అ ద్యేదానీం సకామా సా యా మాతా మమ మధ్యమా ౨౦

మీరలు ఋషులుగదా! స్త్రీతో నెట్లున్నారు? ౧౧.

ఇట్లు మునివేషంబు వేసికొని మరల మునిజనవిరుద్ధంబుగా ధనుర్బాణాద్యాయుధంబులు ధరించి యధర్మం బాచరించుచున్న మీర లెవ్వరు? ౧౨

విరాధుండను పేరుగల రాక్షసుండ నగు నేను ఋషిమాంసంబులం దినుటకై యాయుధంబు ధరించి యెల్లప్పుడు నీవనంబునం దిరుగుచుందును.

సుందరములయినపిఱుందులుగల యీవనితయు నాకుభార్య గాఁగలదు. యుద్ధంబునఁ బాపిష్ఠులరగు మీర క్తంబు దనివిదీరం ద్రావెదను. అని విరాధుండు రామలక్ష్మణులతోఁ జెప్పెను. ౧౪

అతిదుష్టంబుగాఁ బలికెడురాక్షసుండగు విరాధుని గర్వంపుమాటలను విని జనకమహారాజు కూఁతురయిన సీతాదేవి త్రొట్రుపాటు నొంది మిక్కిలియు భయముపడి పెనుగాలిచే నరఁటిచెట్టువలెఁ జలించెను. ౧౫

రాముఁడు విరాధుని చంకం జిక్కియున్న సీతాదేవిం జూచి పరమదుఃఖంబున నో రెండ లక్ష్మణుం జూచి యీమాటం జెప్పెను. ౧౬

సౌమ్యుఁడవగు లక్ష్మణుఁడా! జనకమహారాజుకూఁతురును మంచియాచారంబుగలదియు మిక్కిలి సుఖంబునం బెరిఁగినదియు రాజకొమార్తెయుఁ బతివ్రతయును నధికకీర్తిని సహించినదియునగు నాభార్య సీత విరాధునిచంకం జిక్కియున్నది. చూడుము. ౧౭

లక్ష్మణుఁడా! మనవిషయమయి కైకేయి యేమి యభిప్రాయపడినదో ఏయిష్టమును బొందుటకై సరవ్యాజంబున నడిగెనో అదియంతయు నిప్పుడే శీఘ్రమున సిద్ధించినది. ౧౮

ఏబిడ "భరతునకు రాజ్యంబు నిచ్చుటమాత్రమే చాలదు రాముఁడు సర్వలోకప్రియుండు గావున నతఁ డుండునేని జనులందఱు నతనికే యనుకూలురగుదురు" అని దూరదృష్టితో నాలోచించి భరతునకు రాజ్యంబువచ్చినంతం దృప్తిఁ జెందక "రాముఁ డడవికిఁ బోయినచో సీతయు నతనివెంబడించును. సీత సౌందర్యవతి గావున రాక్షసులు లాబిడ నపహరింతురు. అంత సీతయం దతిమోహానురాగంబులుగల రాముఁడు తోడనే ప్రాణంబులు విడుచును.

పరస్పర్శా త్తు వై దేహ్యా న దుఃఖతర మస్తి మే,
పితు ర్వినాశా న్సౌమిత్రే! స్వరాజ్యహరణా త్తథా. ౨౧

ఇతి బ్రువతి కాకుత్స్థే బాష్పశోకపరిప్లుతే,
అబ్రవీ ల్లక్ష్మణః క్రుద్ధో రుద్ధో నాగ ఇవ శ్వసన్. ౨౨

అనాథ ఇవ భూతానాం నాథ స్త్వం వాసవోపమః,
మయా ప్రేష్యేణ కాకుత్స్థ! కిమర్థం పరితప్యసే. ౨౩

శరేణ నిహత స్యాద్య మయా క్రుద్ధేన రక్షసః,
విరాధస్య గతాసో ర్హి మహీ పాస్యతి శోణితమ్. ౨౪
రాజ్యకామే మమ క్రోధో భరతే యో బభూవ హ,
తం విరాధే ప్రమోక్ష్యామి వజ్రీ వజ్ర మి వాచలే. ౨౫

మమ భుజబలవేగవేగితః
పతతు శరోఽస్య మహా న్మహోరసి,
వ్యపనయతు తనో శ్చ జీవితం
పతతు తత స్స మహీం విఘూర్ణితః. ౨౬

ఇతి శ్రీమదరణ్యకాణ్డే ద్వితీయ స్సర్గః. ౨.

తృతీయ స్సర్గః

ఇత్యుక్త్వా లక్ష్మణ శ్శ్రీమా న్రాక్షసం ప్రహస న్నివ,

లోక విరక్తుఁడై మఱల నయోధ్యకు రానొల్లకుండును" అని చక్కఁగా నాలోచించి సమస్తభూతహితుఁడనగు నన్ను నడవికిఁ బంపెనో, అట్టి నామధ్యమాంబయగు కైకేయికోర్కి యీదినంబున నీక్షణమునందు ఫలించినది.

లక్ష్మణుఁడా! నాదు సీతను బరపురుషుఁడు స్పృశించుటవలనం గలుగు నంతదుఃఖము పితృమరణంబునం గాని రాజ్యంబు పోవుటచేఁ గాని గలుగలేదు. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౨౧

ఇట్లు రాముఁడు పరమదుఃఖంబునం గన్నీళ్లు విడుచుచుఁ జెప్ప లక్ష్మణుఁడు రామశోకంబుఁ జూచి పరమక్రుద్ధుఁడై మంత్రవేగబద్ధంబగు సర్పంబుపగిది వేఁడినిట్టూర్పులు పుచ్చుచు నిట్లని చెప్పెను. ౨౨

రాముఁడా! నీవు సమస్తలోకంబులకును బ్రభుండవయి దేవేంద్రునకు సరివచ్చువాఁడవయి ప్రేష్యుఁడ నగు నేను సన్నిధానంబున నుండఁగా నిట్ల నాథుపగిదిఁ బరితపించెదవేలొ? ౨౩

ఇప్పుడు క్రుద్ధుఁడనగు నేను బాణంబున నీవిరాధునిం జంపి యితని రక్తమును భూమి త్రావునట్లు గావించెదను. ౨౪

రాజ్యంబుఁ గోరిన భరతునిపై నాకుఁ గలిగిన కోపమునంతయుఁ దేవేంద్రుఁడు పర్వతముపై వజ్రాయుధమును బ్రయోగించునట్లు విరాధునిపై విడిచెదను. ౨౫

నేను నాభుజబలంబుకొలఁది నాకర్ణాంతముగఁ బూరించి విడిచిన మహాబాణము ఈవిరాధుని విశాలవక్షస్స్థలంబుఁ జొచ్చి ప్రాణంబుల దేహమునుండి పాఱుందోల నీవిరాధుఁడు గిఱ్ఱగిఱ్ఱం దిరిగి నేలం బడుఁగాక. అని లక్ష్మణుఁడు రామునకుం జెప్పెను. ౨౬

ఇది రెండవసర్గము.

---

## మూఁడవసర్గము.

శ్రీమంతుఁడగు లక్ష్మణుఁడు ఇట్లు రామునకుం జెప్పి విరాధుం జూచి నవ్వుచు నిట్లని చెప్పెను.

కో భవా న్వన మభ్యేత్య చరిష్యతి యథాసుఖమ్. ౧
అథోవాచ పున ర్వాక్యం విరాధః పూరయ న్వనమ్,

ఆత్మానం పృచ్ఛతే బ్రూహి కౌ యువాం క్వ గమిష్యథః. ౨

త ముువాచ తతో రామో రాక్షసం జ్వలితాననమ్,
పృచ్ఛ న్తం సుమహాతేజా ఇక్ష్వాకుకుల మాత్మనః. ౩
క్షత్రియౌ వృత్తసమ్పన్నౌ విద్ధి నౌ వనగోచరౌ,
త్వాం తు వేదితు మిచ్ఛావః క స్త్వం చరసి దణ్డకాన్. ౪

త మువాచ విరాధ స్తు రామం సత్యపరాక్రమమ్,

హ న్త వక్ష్యామి తే రాజ న్నిబోధ మమ రాఘవ. ౫
పుత్త్రః కిల జయ స్యాహం మమ మాతా శతహ్రదా,
విరాధ ఇతి మా మాహుః పృథివ్యాం సర్వరాక్షసాః. ౬
తపసా చాపి మే ప్రాప్తా బ్రహ్మణో హి ప్రసాదజా,
శస్త్రేణావధ్యతా లోకే ఽచ్ఛేద్యాభేద్యత్వ మేవ చ. ౭

ఉత్సృజ్య ప్రమదా మేనా మనపేక్షౌ యథాగతమ్,
త్వరమాణౌ పలాయేథాం న వాం జీవిత మాదదే. ౮

తం రామః ప్రత్యువాచేదం కోపసంరక్తలోచనః,
రాక్షసం వికృతాకారం విరాధం పాపచేతసమ్. ౯
క్షుద్ర! ధి క్త్వాం తు హీనార్థం మృత్యు మన్వేషసే ధ్రువమ్,
రణే సంప్రాప్స్యసే తిష్ఠ న మే జీవ న్గమిష్యసి. ౧౦

ఈవనంబున సుఖంబుగాఁ దిరుగుచున్నావేఁ; నీ వెవ్వఁడవు? ౧

అంత విరాధుఁడు వనంబునం దంతటను బ్రతిధ్వని గలుగ నుఱుల నిట్లని చెప్పెను.

మీసంగతి నే నడుగుచున్నానే చెప్పుఁడు; మీర లెవ్వరు? ఎచ్చటికిఁ బోఁబోవుచున్నారు? అని విరాధుఁడు చెప్పెను. ౨

అంత మహాతేజుఁడగురాముఁడు తన్నడుగుచున్న జ్వలితముఖుండగు విరాధుం జూచి తనయిక్ష్వాకువంశము మొదలగుసంగతిఁ జెప్పెను. ౩

నేము క్షత్రియకులము సదాచారసంపన్నులము అడవినుండువారలము. ఇంక నీసంగతి దెలియఁగోరెదము నీ వెవ్వఁడవు? దండకారణ్యంబునం దిరుగుచున్నావు. అని రాముఁడు విరాధునితోఁ జెప్పెను. ౪

అంత విరాధుఁడు సత్యపరాక్రముఁడగు రాముం జూచి యిట్లని చెప్పెను.

రాముఁడా! అఁ చెప్పెదను. నాసమాచారమును వినుము. ౫

నేను జయునికొడుకును. నాతల్లిపేరు శతహ్రద. నన్ను భూమియందు రాక్షసు లందఱు విరాధుఁడని పిలుతురు. ౬

మఱియును నేను మహాతపంబు గావించి బ్రహ్మదేవు ననుగ్రహంబున నాయుధంబులఁ జంపఁ దలవి గాకుండుటయు ఛేదింప నలవి గాకుండుటయు నచ్ఛేద్యతయుఁ బొందినాను. ౭

మీరలు ఈస్త్రీని విడిచి దీనియపేక్షను వదలుకొని వచ్చినదారింబట్టి శీఘ్రంబుగఁ బరుగెత్తిపొండు. మీప్రాణంబులతో నాకుఁ బనిలేదు. అని విరాధుఁడు రామలక్ష్మణులతోఁ జెప్పెను. ౮

రాముఁడు కోపంబునొంది కన్నుల నెఱ్ఱఁదనంబు గదుర వికృతాకారుండును పాపబుద్ధియును నగు విరాధుం జూచి యీమాటం జెప్పెను. ౯

అల్పుఁడా! అతినీచమయిన పరస్త్రీహరణముఁ దలపెట్టినావు. నీవు మరణముఁ గోరివచ్చినట్లున్నది. యుద్ధంబున నే నట్లె గావించెదను. నిలువు. నాముందటఁ బ్రాణంబులతోఁ బోఁజాలవు. అని రాముఁడు చెప్పెను. ౧౦

తత స్సజ్యం ధనుః కృత్వా రామ స్సునిశితా ఞ్ఛరాన్,
సుశీఘ్ర మభిసంధాయ రాక్షసం నిజఘాన హ. ౧౧
ధనుషా జ్యాగుణవతా సప్త బాణా న్ముమోచ హ,
రుక్మపుంఖా న్మహావేగా న్సుపర్ణానిలతుల్యగాన్. ౧౨
తే శరీరం విరాధస్య భిత్త్వా బర్హిణవాససః,
నిపేతు శ్శోణితా దిగ్ధా ధరణ్యాం పావకోపమాః. ౧౩
స విద్ధో న్యస్య వైదేహీం శూల ముద్యమ్య రాక్షసః,
అభ్యద్రవ త్సుసంక్రుద్ధ స్తదా రామం సలక్ష్మణమ్. ౧౪
స వినద్య మహానాదం శూలం శక్రధ్వజోపమమ్,
ప్రగృహ్యాశోభత తదా వ్యాత్తానన ఇవా న్తకః. ౧౫

అథ తౌ భ్రాతరౌ దీప్తం శరవర్షం వవర్షతుః,
విరాధే రాక్షసే తస్మి న్కాలా న్తకయమోపమే. ౧౬

స ప్రహస్య మహారౌద్రః స్థిత్వాఽజృమ్భత రాక్షసః,
జృమ్భమాణస్య తే బాణాః కాయా న్నిష్పేతు రాశుగాః. ౧౭

స్పర్శాత్తు వరదానేన ప్రాణాం త్సంరోధ్య రాక్షసః,
విరాధ శ్శూల ముద్యమ్య రాఘవా వభ్యధావత. ౧౮
త చ్ఛూలం వజ్రసఙ్కాశం గగనే జ్వలనోపమమ్,
ద్వాభ్యాం శరాభ్యాం చిచ్ఛేద రామ శ్శస్త్రభృతాం వరః.

త ద్రామవిశిఖచ్ఛిన్నం శూలం తస్య కరా ద్భువి,
పపా తాశనినా ఛిన్నం మేరో రివ శిలాతలమ్. ౨౦

అంత రాముఁడు ధనుస్సు సజ్యంబుగావించి కఱకుబాణంబుల సంధించి విరాధునిపైఁ బ్రయోగించెను. ౧౧

రాముఁడు అట్లు ధనువు సెక్కుపెట్టి బంగారు పింజలంగూఁ గలవియు గరుడానిలసమానవేగంబులు నగు సప్తబాణంబులం బ్రయోగించెను. ౧౨

నెమలిఱెక్కలు గట్టిన నిప్పువంటియా బాణంబులు విరాధుని దేహంబు భేదించి నెత్తుటితోఁ గూడ నేలం బడినవి. ౧౩

అవ్విరాధుఁడు ఆయేడుబాణంబులచేతను నొచ్చి పరమకుపితుఁడై సీతాదేవిని నేలనుంచి శూలంబుచేఁ బూని రామలక్ష్మణులపైకిఁ బరుగెత్తెను.

అప్పు డావిరాధుఁడు మహాధ్వనిగలుగునట్లు సింహనాదంబుగావించి ఇంద్రధ్వజంబువలె నత్యున్నతంబయినశూలంబు చేఁబూని నోరుదెఱచుకొని యుండు యముండువలెఁ జూపరులకు భయంబు గలిగించుచుండెను. ౧౫

అంత నారామలక్ష్మణు లిద్దరును విరాధుఁడు సీతను విడిచివచ్చుటచే నిర్భయంబుగాఁ బ్రళయకాలంబున సమస్తభూతసంహారంబు గావించు యమునింబోలియున్న యవ్విరాధునిపై బాణవర్షంబు గురిపించిరి. ౧౬

మహాభయంకరుఁడగు నావిరాధుఁడు వీరలెంతమాత్రమని నవ్వి నిలుచుండి దేహమునంతయు విఱుచుకొనెను. అప్పుడు మహావేగంబులగు నాబాణంబులన్నియు నతనిదేహంబుననుండి వెలువడి నేలం బడినవి. ౧౭

అంత నవ్విరాధుఁడు వరమహిమవలన మహాబలంబు వహించి శూలంబు చేఁబూని రామలక్ష్మణులపైకిఁ బరుగెత్తెను. ౧౮

ఆయుధధారులలో నుత్తముఁడగు రాముఁడు ఆకాశంబున నగ్నిహోత్రంబుపగిది వెలుంగుచున్నదియు వజ్రసమానంబునగు నాశూలంబును రెండు బాణంబుల ఖండించెను. ౧౯

రాముని బాణంబులచేత ఖండింపఁబడిన యాశూలము వజ్రాయుధముచే నఱకఁబడిన మేరుశిలాతలంబువలె విరాధునిహస్తమునుండి నేలం బడెను. ౨౦

తౌ ఖడ్గౌ క్షిప్ర ముద్యమ్య కృష్ణసర్పోపమౌ శుభౌ,
తూర్ణ మాపతత స్తస్య తదా ప్రహరతాం బలాత్. ౨౧

స వధ్యమాన స్సుభృశం బాహుభ్యాం పరిరభ్య తౌ,
అప్రకమ్ప్యౌ నరవ్యాఘ్రౌ రౌద్రః ప్రస్థాతు మైచ్ఛత. ౨౨

తస్యాభిప్రాయ మాజ్ఞాయ రామో లక్ష్మణ మబ్రవీత్,

వహ త్వయ మలం తావ త్పథాఽనేన తు రాక్షసః. ౨౩
యథా చేచ్ఛతి సౌమిత్రే! తథా వహతు రాక్షసః,
అయమేవ హి నః పన్థా యేన యాతి నిశాచరః. ౨౪

స తు స్వబలవీర్యేణ సముత్క్షిప్య నిశాచరః,
బాలా వివ స్కన్ధగతౌ చకా రాతిబలో తతః. ౨౫
తా వారోప్య తత స్కన్ధం రాఘవౌ రజనీచరః,
విరాధో నినద న్ఘోరం జగా మాభిముఖో వనమ్. ౨౬
వనం మహామేఘనిభం ప్రవిష్టో
ద్రుమై ర్మహద్భి ర్వివిధై రుపేతమ్,
నానావిధైః పక్షికులై ర్విచిత్రం
శివాయుతం వ్యాళమృగై ర్వికీర్ణమ్. ౨౭

ఇతి శ్రీమదరణ్యకాణ్డే తృతీయ స్సర్గః. 3.

---

## చతుర్థ స్సర్గః.

హ్రియమాణౌ తు తౌ దృష్ట్వా వైదేహీ రామలక్ష్మణౌ,
ఉచ్చై స్స్వరేణ చుక్రోశ ప్రగృహ్య సుభుజా భుజౌ. ౧

విరాధుఁడు శీఘ్రంబునఁ బైకివచ్చుటం జూచి యారామలక్ష్మణులు కృష్ణసర్పములవంటివియును జయావహములు నగు ఖడ్గంబులం బూని మిక్కిలియుం బ్రహరించిరి. ౨౧

భయంకరుండగు విరాధుఁడు అట్లింతకొట్టినను వదలక పురుషశ్రేష్ఠులను గదలింప నవి గానివారలును నగు నారామలక్ష్మణులపైఁబడి వారలం జేతులఁ గవుఁగిలించుకొని యెత్తుకొని పోఁగోరను. ౨౨

రాముఁ డతని యభిప్రాయంబు నెఱింగి లక్ష్మణుం జూచి యిట్లని చెప్పెను.

ఇతఁడు ఈదారినే మనలం దీసికొని పోవుఁగాక. ౨౩

లక్ష్మణుఁడా! ఇతని కెట్లు కోర్కెయున్నదో అట్లే తీసికొనిపోవుఁ గాక. ఈరాక్షసుఁడు పోవునదే మనము పోవలసినదారిగా నున్నది. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౨౪

అంత నవ్విరాధుఁడు తనభుజబలంబున మహాబలశాలురగు నారామలక్ష్మణులను బిడ్డంబోలె నెత్తి తనభుజంబులపై నుంచుకొనెను. ౨౫

అట్లు విరాధుఁడు రామలక్ష్మణుల నిద్దఱను భుజముపై నెక్కించుకొని భయంకరంబుగా నఱచుచు నరణ్యాభిముఖుఁడై పోయెను. ౨౬

అంత నవ్విరాధుఁడు మహామేఘంబువలె దట్టముగా నుండునదియు నానావిధంబులగు గొప్పవృక్షములతో నిండినదియు నానావిధంబులగు పక్షులతో నొప్పుచున్నదియు నక్కలును బెద్దపులులు మున్నగు క్రూరమృగంబులును మెండుగాఁ గలదియు నగు మహావనముం బ్రవేశించెను. ౨౭

ఇది మూఁడవసర్గము.

---

## నాలవసర్గము.

సుందరములగు భుజంబులుగల సీతాదేవి అట్లు రాక్షసుఁడు రామలక్ష్మణులం గొనిపోవుటం జూచి సంతోషరహితదుఃఖితయయి చేతులం బట్టుకొని పేరెలుంగున నిట్లని విలపించెను. ౧

ఏవ దాశరథీ రామ స్సత్యవాన్ శీలవాన్ శుచిః,
రక్షసా రౌద్రరూపేణ హ్రియతే సహలక్ష్మణః. ౨

మాం వృకా భక్షయిష్యన్తి శార్దూలా ద్వీపిన స్తథా,
మాం హరోత్సృజ్య కాకుత్స్థౌ నమ స్తే రాక్షసోత్తమ! ౩

తస్యా స్తద్వచనం శ్రుత్వా వైదేహ్యా రామలక్ష్మణౌ,
వేగం ప్రచక్రతు ర్వీరౌ వధే తస్య దురాత్మనః. ౪
తస్య రౌద్రస్య సౌమిత్రి స్సవ్యం బాహుం బభఞ్జ హ,
రామ స్తు దక్షిణం బాహుం తరసా తస్య రక్షసః. ౫
స భగ్నబాహు స్సంవిగ్నో నిపపాతాఽఽశు రాక్షసః,
ధరణ్యాం మేఘసఙ్కాశో వజ్రభిన్న ఇవాచలః. ౬
ముష్టిభి ర్జానుభిః పద్భి స్సూదయన్తౌ తు రాక్షసమ్,
ఉద్యమ్యోద్యమ్య చాప్యేనం స్థణ్డిలే నిష్పిపేషతుః. ౭

స విద్ధో బహుభి ర్బాణైః ఖడ్గాభ్యాం చ పరిక్షతః,
నిష్పిష్టో బహుధా భూమౌ న మమార స రాక్షసః. ౮

తం ప్రేక్ష్య రామ స్సుభృశ మవధ్య మచలోపమమ్,
భయే ష్వభయద శ్శ్రీమా నిదం వచన మబ్రవీత్. ౯

తపసా పురుషవ్యాఘ్ర! రాక్షసోఽయం న శక్యతే,
శస్త్రేణ యుధి నిర్జేతుం రాక్షసం నిఖనావహే. ౧౦

దశరథమహారాజకుమారుఁడును సత్యవాదియు సదాచారసంపన్నుఁడును బరిశుద్ధుఁడు నగు రాముని అతినితమ్ముని లక్ష్మణుని భయంకరాకారుఁ డగురాక్షసుఁడు కొనిపోవుచున్నాఁడు! ౨

నన్ను తోడేళ్లును బెద్దపులులును చిఱుతపులులును భక్షించును.

రాక్షసోత్తముఁడా! నీకు నమస్కారముచేసెదను. రామలక్ష్మణులను విడిచి నన్నుఁ దీసికొనిపొమ్ము. అని సీతాదేవి విలపించెను. 3

పరాక్రమవంతులగు నారామలక్ష్మణులు సీతాదేవి రోదనంబు విని దురాత్ముఁడగు నవ్విరాధుని శీఘ్రంబుగా వధింపఁ దలంచుకొనిరి. ౪

భయంకరాకారుఁడగు నావిరాధుని యెడమచేతిని లక్ష్మణుఁడు ఖండించెను. రాముఁడు దక్షిణబాహువును ఖండించెను. ౫

మేఘసమానుఁడగు నావిరాధుఁడు చేతులు విఱిగి భయపడి శీఘ్రంబున వజ్రాయుధముచేత ఖండితంబగు పర్వతముంబోలె నేలం బడెను. ౬

అంత రామలక్ష్మణులు విరాధుని నేలంబడవైచి పిడికిళ్లను మోఁకాళ్లను గాళ్లను నానావిధంబులఁ గ్రుమ్ముచు నెముకలన్నియు విఱిచి ముద్దగాఁ గావించిరి. ౭

ఆవిరాధుఁడు పెక్కుబాణంబుల బాధింపఁబడియు ఖడ్గంబుల నఱుకంబడియు నేలపైఁ బెక్కువిధంబులఁ ద్రొక్కఁబడియు మృతిపొందఁడయ్యె. ౮

ఎట్టిభయంబులం బచ్చినను నభయం బొసంగునట్టి మహాపురుషుఁడు శ్రీమంతుఁడు నగు రాముఁడు పర్వతాకారుఁడగు నవ్విరాధుఁడు ఆయుధంబున నవధ్యుండగుటఁ జక్కఁగా నెఱింగి లక్ష్మణుం జూచి యిట్లనిచెప్పెను.

పురుషశ్రేష్ఠుఁడవగు లక్ష్మణుఁడా! ఈరాక్షసుఁడు తపసుగావించి వరంబు వడసియున్నాఁడు కావున నితని నాయుధంబునం జంప నలవిగాకున్నది. అందువలన నితని నేలం బాఁతిపెట్టుదము. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౧౦

తచ్ఛ్రుత్వా రాఘవేణోక్తం రాక్షసః ప్రశ్రితం వచః,
ఇదం ప్రోవాచ కాకుత్స్థం విరాధః పురుషర్షభమ్. ౧౧
హతోఽస్మి పురుషవ్యాఘ్ర! శక్రతుల్యబలేన వై,
మయా తు పూర్వం త్వం మోహా న్న జ్ఞాతః పురుషర్షభః. ౧౨

కౌసల్యా సుప్రజా రామ! తాత! త్వం విదితో మయా,
వైదేహీ చ మహాభాగా లక్ష్మణశ్చ మహాయశాః. ౧౩

అభిశాపా దహం ఘోరాం ప్రవిష్టో రాక్షసీం తనుమ్,
తుమ్బురు ర్నామ గన్ధర్వ శ్శప్తో వైశ్రవణేన హ. ౧౪
ప్రసాద్యమానశ్చ మయా సోఽబ్రవీ న్మాం మహాయశాః,

యదా దాశరథీ రామ స్త్వాం వధిష్యతి సంయుగే. ౧౫
తదా ప్రకృతి మాపన్నో భవాం స్స్వర్గం గమిష్యతి,

ఇతి వైశ్రవణో రాజా రమ్భాసక్తం పురాఽనఘ!. ౧౬
అనుపస్థీయమానో మాం సంక్రుద్ధో వ్యాజహార హ,

తవ ప్రసాదా న్ముక్తోఽహ మభిశాపా త్సుదారుణాత్. ౧౭
భువనం స్వం గమిష్యామి స్వస్తి వోఽస్తు పరన్తప!,

ఇతో వసతి ధర్మాత్మా శరభఙ్గః ప్రతాపవాన్. ౧౮
అధ్యర్ధయోజనే తాత! మహర్షి స్సూర్యసన్నిభః,

తం క్షిప్ర మభిగచ్ఛ త్వం స తే శ్రేయో విధాస్యతి. ౧౯

విరాధుఁడు రాముఁడు చెప్పినమాటనువిని పురుషోత్తముఁడగు రాముం జూచి వినయంబున నీమాటం జెప్పెను. ౧౧

పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! దేవేంద్రతుల్యపరాక్రముఁడవగు నీవు నన్ను వధించితివి. నేను అజ్ఞానంబునంజేసి నీవు సాక్షాత్పురుషోత్తముఁడవని యెఱుంగనైతి. ౧౨

నాయనా! నీవు సాక్షాన్నారాయణుఁడవు కౌసల్యాగర్భంబున జన్మించితివని నాకిప్పుడు తెలిసినది. మహాభాగయగు సీతాదేవిస్వరూపంబును మహాకీర్తిశాలియగు లక్ష్మణుని స్వరూపంబును దెలియవచ్చినది. ౧౩

నేను తుంబురువను గంధర్వుఁడను. కుబేరునిశాపంబున నిట్లు భయంకరంబగు రాక్షసదేహంబు నొందితిని. ౧౪

అంత మహాయశుఁడగు నాకుబేరుఁడు నేను వేఁడుకొనం గరుణించి యిట్లని చెప్పెను.

దశరథపుత్రుఁడగు రాముఁడు నిన్ను యుద్ధంబున వధింపఁగలఁడు. అప్పుడు నీవు శాపవిముక్తుఁడవయి స్వర్గంబునొందఁగలవు. అని కుబేరుఁడు చెప్పెను. ౧౫

పాపరహితుఁడవగు రాముఁడా! నేను మున్ను రంభాసక్తుఁడనై కొలువునకుఁ బోమింజేసి కుబేరుఁడు మిక్కిలియుఁ గోపించి నాకీప్రకారమున శాపంబు నొసంగెను. ౧౬

శత్రువులఁ దపింపఁజేయునట్టి రాముఁడా! నీయనుగ్రహంబునంజేసి నన్నీభయంకరశాపంబువదలినది. ఇంక నాస్థానంబునకుం బోయెదను. మీకు మంగళంబు గలుగుఁగాక. ౧౭

నాయనా! ఇచ్చటికొకటియునరామడదూరంబున ధర్మాత్ముఁడును మహాతపశ్శాలియు సూర్యసమానతేజుఁడు నగు శరభంగుఁడనుమహాముని నివసించుచున్నాఁడు. ౧౮

నీవు శీఘ్రంబున నాశరభంగునొద్దకుఁ బొమ్ము. ఆయన నీకు మేలు గావించును. ౧౯

అవటే చాపి మాం రామ! ప్రక్షిప్య కుశలీ వ్రజ,
రక్షసాం గతసత్త్వానా మేష ధర్మ స్సనాతనః. ౨౦
అవటే యే నిధీయన్తే తేషాం లోకా స్సనాతనాః,

ఏవ ముక్త్వా తు కాకుత్స్థం విరాధ శ్శరపీడితః. ౨౧
బభూవ స్వర్గసమ్ప్రాప్తో న్యస్తదేహో మహాబలః,
త చ్ఛ్రుత్వా రాఘవో వాక్యం లక్ష్మణం వ్యాదిదేశ హ. ౨౨
కుఞ్జర స్యేవ రౌద్రస్య రాక్షస స్యాస్య లక్ష్మణ!,
వనేఽస్మిం స్సుమహా చ్ఛ్వభ్రం ఖన్యతాం రౌద్రకర్మణః. ౨౩

ఇ త్యుక్త్వా లక్ష్మణం రామః ప్రదరః ఖన్యతా మితి,
తస్థౌ విరాధ మాక్రమ్య కణ్ఠే పాదేన వీర్యవాన్. ౨౪

తతః ఖనిత్ర మాదాయ లక్ష్మణ శ్శ్వభ్ర ముత్తమమ్,
అఖన త్పార్శ్వత స్తస్య విరాధస్య మహాత్మనః. ౨౫
తం ముక్తకణ్ఠం నిష్పిష్య శఙ్కుకర్ణం మహాస్వనమ్,
విరాధం ప్రాక్షిప చ్ఛ్వభ్రే నదన్తం భైరవస్వనమ్. ౨౬
త మాహవే నిర్జిత మాశు విక్రమౌ
స్థిరా వుభౌ సంయతి రామలక్ష్మణౌ,
ముదాన్వితౌ చిక్షిపతు ర్భయావహం
నదన్త ముత్క్షిప్య బిలే తు రాక్షసమ్ ౨౭
అవధ్యతాం ప్రేక్ష్య మహాసురస్య తౌ
శితేన శస్త్రేణ తదా నరర్షభౌ,
సమర్థ్య చాత్యర్థవిశారదా వుభౌ
బిలే విరాధస్య వధం ప్రచక్రతుః. ౨౮

రాముఁడా! నన్నుఁ బల్లముద్రవ్వి పూడ్చి యటుపిమ్మట సుఖంబునం బొమ్ము. భూమిం బూడ్చుట మృతులగు రాక్షసులకు ముఖ్యధర్మము.

రాక్షసులకళేబరములను భూమిం బూడ్చిపెట్టినచో వారలకుఁ బుణ్యలోకంబులు గలుగును. అని విరాధుఁడు రామునితోఁ జెప్పెను.

మహాబలుఁడగు విరాధుఁడు బాణపీడితుఁడై రామునింజూచి యీప్రకారముసం జెప్పి యంత దేహంబు విడిచి స్వర్గంబు నొందెను. ౨౧

రాముఁడు విరాధునిమాటను విని లక్ష్మణుం జూచి యిట్లని చెప్పెను.

లక్ష్మణుఁడా! పెద్దయేనుఁగునకుంబోలె భయంకరకర్ముఁడగు నీరాక్షసునకుఁ బెద్దపల్లమొకటి యీవనమునం ద్రవ్వుము. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౨౩

మహాపరాక్రమశాలియగు రాముఁడు ఇట్లు పల్లంబు ద్రవ్వుమని లక్ష్మణునకుం జెప్పి విరాధునిఁ గదలనీయక కంఠంబునం గాలిచే నదిమిపెట్టి నిలుచుండి యుండెను. ౨౪

అంత లక్ష్మణుండు పాఱచిప్పఁ దీసికొని మహాకాయుఁడగు విరాధుని పార్శ్వభాగంబునం బెద్దబిలంబు ద్రవ్వెను. ౨౫

అంత రాముఁడు కాలం ద్రొక్కి విడిచిన కంఠముగలవాఁడును మేకులవంటి చెవులుగలవాఁడు నగు నావిరాధుని బిలంబునం బడవైచిరి. ౨౬

శీఘ్రపరాక్రములును యుద్ధంబున వెనుదీయనివారలునగు రామలక్ష్మణులు సంతోషంబున భయంకరుఁడగు విరాధుని యుద్ధంబున జయించి యతని బిలంబునం బడవైచిరి ౨౭

కార్యంబులందు మిక్కిలియుఁ బండితులును బురుషశ్రేష్ఠులునగు నారామలక్ష్మణులు విరాధుఁడు ఆయుధంబున వధ్యుఁ డగుటను జూచి యతనిపూడ్చివేయుటయే యుక్తంబని యాలోచించి యట్లు బిలంబు ద్రవ్వి యతనిం బూడ్చిపెట్టిరి. ౨౮

స్వయం విరాధేన హి మృత్యు రాత్మనః
ప్రసహ్య రామేణ వధార్థ మీప్సితః,
నివేదితః కాననచారిణా స్వయం
న మే వధ శ్శస్త్రకృతో భవే దితి. ౨౯
తదేవ రామేణ నిశమ్య భాషితం
కృతా మతి స్తస్య బిలప్రవేశనే,
బిలం చ రామేణ బలేన రక్షసా
ప్రవేశ్యమానేన వనం వినాదితమ్. ౩౦
ప్రహృష్టరూపా విన రామలక్ష్మణౌ
విరాధ ముర్వ్యాః ప్రదరే నిహత్య తౌ,
ననన్దతు ర్వీతభయా మహావనే
శిలాభి రన్తర్దధతు శ్చ రాక్షసమ్. ౩౧
తత స్తు తౌ కాఞ్చనచిత్రకార్ముకౌ
నిహత్య రక్షః పరిగృహ్య మైథిలీమ్,
విజహ్రతు స్తౌ ముదితౌ మహావనే
దివి స్థితౌ చన్ద్రదివాకరా విప. ౩౨

ఇతి శ్రీమదరణ్యకాణ్డే చతుర్థ స్సర్గః. ౪.

---

## పఞ్చమ స్సర్గః.

హత్వా తు తం భీమబలం విరాధం రాక్షసం వనే,
తత స్సీతాం పరిష్వజ్య సమాశ్వాస్య చ వీర్యవాన్ ౧
అబ్రవీ ల్లక్ష్మణం రామో భ్రాతరం దీప్తతేజసమ్,
కష్టం వన మిదం దుర్గం నచ స్మ వనగోచరాః, ౨
అభిగచ్ఛామహే శీఘ్రం శరభఙ్గం తపోధనమ్,

వనవాసియగు రాముఁడు బలాత్కారమునం దన్నుఁ జంపఁ దలంపు గొని నానావిధంబుల నతనిం బ్రహరింపుచుండుటనుజూచి యావిరాధుఁడు తానే తనకు ఆయుధంబునం జావుగలుగదనియు రాముతోం జెప్పెను. ౨౯

రాముఁడు ఆవిరాధునిమాటను వినియే యతని బిలంబునం బూడ్వఁ దలంచెను. రాముఁడు బలాత్కారంబున నవ్విరాధుని బిలంబునం బూడ్చు నప్పుడు ఆరాక్షసుఁ డడవియంతయు మహాధ్వని గలుగునట్లు అఱచెను. ౩౦

రామలక్ష్మణులు అట్లు విరాధుని భూమిబిలంబున వైచి పులకితగాత్రులయి యమ్మహావనంబున నెంతమాత్రమును భయంబులేక యవ్విరాధుని కళేబరమును ఱాళ్లచేఁ గప్పిరి. ౩౧

అంత దివ్యధనుర్ధరులగు నారామలక్ష్మణులు విరాధుం జంపి సీతాదేవిం జేకొని పరమసంతుష్టులయి యమ్మహావనంబున నాకాశంబునం జంద్రసూర్యులపగిది విహరించుచుండిరి. ౩౨

ఇది నాలవసర్గము.

---

## ఐదవసర్గము.

మహాపరాక్రమశాలియగు రాముఁడు అరణ్యంబున భయంకరపరాక్రముఁడగు విరాధుంజంపి యంత సీతం గవుఁగిలించి మంచిమాటలం దేర్చి మహాతేజుఁడగు తమ్ముని లక్ష్మణునిం జూచి యిట్లని చెప్పెను. ౧

ఈయడవి మిక్కిలియు నిషాయకరము గానున్నది మనము ను అడవిలో నుండి మెదిగినవారలము కాము. కావున నిం నుండఁదగదు. శీఘ్రంబున శరభంగమహామునియొద్దకుఁ బోవుదము. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను

ఆశ్రమం శరభఙ్గస్య రాఘవోఽభిజగామ హ. ౩
తస్య దేవప్రభావస్య తపసా భావితాత్మనః,
సమీపే శరభఙ్గస్య దదర్శ మహదద్భుతమ్. ౪
విభ్రాజమానం వపుషా సూర్యవైశ్వానరోపమమ్,
అవరుహ్య రథోత్సఙ్గా దాకాశే విబుధానుగమ్. ౫
అసంస్పృశన్తం వసుధాం దదర్శ విబుధేశ్వరమ్,
సుప్రభాభరణం దేవం విరజోఽమ్బరధారిణమ్. ౬
తద్విధై రేవ బహుభిః పూజ్యమానం మహాత్మభిః,
హరిభి ర్వాజిభి ర్యుక్త మన్తరిక్షగతం రథమ్. ౭
దదర్శాదూరత స్తస్య తరుణాదిత్యసన్నిభమ్,
పాణ్డురాభ్రఘనప్రఖ్యం చన్ద్రమణ్డలసన్నిభమ్. ౮
అపశ్య ద్విమలం ఛత్రం చిత్రమాల్యోపశోభితమ్,
చామరవ్యజనే చాగ్ర్యే రుక్మదణ్డే మహాధనే. ౯
గృహీతే వరనారీభ్యాం ధూయమానే చ మూర్ధని,
గన్ధర్వాసురసిద్ధాశ్చ బహవః పరమర్షయః, ౧౦
అన్తరిక్షగతం దేవం వాగ్భి రగ్ర్యాభి రీడిరే,
సహ సమ్భాషమాణే తు శరభఙ్గేణ వాసవే. ౧౧
దృష్ట్వా శతక్రతుం తత్ర రామో లక్ష్మణ మబ్రవీత్,
రామోఽథ రథ ముద్దిశ్య లక్ష్మణాయ ప్రదర్శయన్. ౧౨
అర్చిష్మన్తం శ్రియా జుష్ట మద్భుతం పశ్య లక్ష్మణ!,
ప్రతపన్త మివాఽదిత్య మన్తరిక్షగతం రథమ్. ౧౩

అంత రాముఁడు దేవప్రభావుండును దపంబునఁ బరమాత్మను ధ్యానించువాఁడును నగు శరభంగమహాముని యాశ్రమంబునకుం బోయెను. 3

రాముఁడు శరభంగునిసమీపంబున సూర్యాగ్నిసదృశంబును మహాతేజంబు నగు నాశ్చర్యావహమయిన యొకగొప్పవస్తువుం జూచెను. ౪

అంత సమీపంబునకు వచ్చుటంజేసి రథంబుడిగ్గి భూమిని స్పృశింపక దేవతాపరివృతుఁడై యాకాశంబున శరభంగునొద్దకుఁ బోవుచున్న దేవేంద్రుని రాముఁడు చూచెను. ౫

కాంతిమంతంబులగు నాభరణంబులు ధరించియున్నవాఁడును స్వచ్ఛములయిన వస్త్రంబులం గట్టుకొనియున్నవాఁడును తనయట్టివారలగు పెక్కండ్రు మహాత్ములచేఁ బూజింపఁబడుచున్నవాఁడు నగు దేవేంద్రుని రాముఁడు దూరంబుననుండి చూచెను. ౬

రాముఁడు ఆయాశ్రమంబునకు సమీపంబున నాకాశంబునఁ బచ్చని గుఱ్ఱంబులతోఁ గూడినదియు మధ్యాహ్నసూర్యుఁడుంబోలె వెలుంగుచున్నదియు నగు నాయింద్రునియరదంబుఁ గనెను. ౭

రాముఁడు తెల్లనిమేఘంబువలె నుండునదియుఁ జంద్రమండలసమానంబును బుష్పమాలికాలంకృతంబు నగు దేవేంద్రుని శ్వేతచ్ఛత్త్రంబునుం జూచెను.

ఉత్తమంబులును గాంచనదండములును గొప్పవెలగలవియు నుత్తమస్త్రీలచే గ్రహించి వీవంబడుచున్నవియు నగు వింజామరలం జూచెను. ౯

గంధర్వులును సిద్ధులును దేవతలును బరమర్షులును ఆకాశంబుననున్న దేవేంద్రుని వేదవాక్యంబులం బ్రస్తుతించిరి. ౧౦

అంత దేవేంద్రుఁడు శరభంగమహామునితో మాటలాడుచుండఁగా రాముఁడు దేవేంద్రుంజూచి లక్ష్మణునకు దేవేంద్రునిరథంబుఁ జూపుచు నిట్లని చెప్పెను. ౧౧-౧౨

లక్ష్మణుఁడా! ఆకాశంబున శ్రీమంతంబును గాంతిమంతంబును మధ్యాహ్నసూర్యసమానంబును ఆశ్చర్యకరంబు నగు రథంబును జూడుము.

యే హయాః పురుహూతస్య పురా శక్రస్య న శ్శ్రుతాః,
అన్తరిక్షగతా దివ్యా స్త ఇమే హరయో ధ్రువమ్. ౧౪

ఇమే చ పురుషవ్యాఘ్రా యే తిష్ఠన్త్యభితో రథమ్,
శతం శతం కుణ్డలినో యువానః ఖడ్గపాణయః. ౧౫
విస్తీర్ణవిపులోరస్కాః పరిఘాయతబాహవః,
శోణాంశువసనా స్సర్వే వ్యాఘ్రా ఇవ దురాసదాః ౧౬

ఉరోదేశేషు సర్వేషాం హారా జ్వలనసన్నిభాః,

రూపం బిభ్రతి సౌమిత్రే! పఞ్చవింశతివార్షికమ్. ౧౭

ఏతద్ధి కిల దేవానాం వయో భవతి నిత్యదా,
యథేమే పురుషవ్యాఘ్రా! దృశ్యన్తే ప్రియదర్శనాః. ౧౮
ఇహైవ సహ వైదేహ్యా ముహూర్తం తిష్ఠ లక్ష్మణ!,
యావ జ్జానా మ్యహం వ్యక్తం క ఏష ద్యుతిమా న్రథే ౧౯

త మేవ ముక్త్వా సౌమిత్రి మిహైవ స్థీయతా మితి,
అభిచక్రామ కాకుత్స్థ శ్శరభఙ్గాశ్రమం ప్రతి. ౨౦
తత స్సమభిగచ్ఛన్తం ప్రేక్ష్య రామం శచీపతిః,
శరభఙ్గ మనుప్రాప్య వివిక్త ఇద మబ్రవీత్. ౨౧
ఇహోపయా త్యసౌ రామో యావ న్మాం నాభిభాషతే,
నిష్ఠాం నయతు తావ త్తు తతో మాం ద్రష్టు మర్హతి. ౨౨

జితవన్తం కృతార్థం చ ద్రష్టాఽహ మచిరా దిమమ్,

మున్ను మనము యాగము చేయువాండ్రచే సభక్తికంబుగాఁ బిలువంబడునట్టి దేవేంద్రునిగుఱ్ఱములను వినియున్నామే: ఆపచ్చనిగుఱ్ఱములు ఇవిగో యాకాశంబున వచ్చియున్నవి: చూడుము. ౧౪

కుండలాలంకృతులును యౌవనవంతులును ఖడ్గపాణులును అత్యంతవిశాలవక్షులును, ఇనుపగుదియలవంటి బాహువులుగలవారలును, ఎఱ్ఱనివస్త్రములం ధరించినవారలును, బెబ్బులులుంబోలె దురాసదులునగునీపురుషశ్రేష్ఠులు రథంబుచుట్టును ఒక్కొకదిక్కున నూర్గురు నూర్గురుగా నిలుచున్నారే: వీరలందఱు దేవతలు. ౧౫-౧౬

వీరల కంఠములను ఱొమ్ములపై దివ్యతేజంబులగు హారంబులు గలవు. చూడుము.

లక్ష్మణుఁడా! వీర లందఱు ఇరువదియయిదుసంవత్సరముల వయసును మించకున్నారు. ౧౭

దేవతలకు ఎప్పటికిని ఈయిరువదియైదుసంవత్సరములవయస్సు మించదు. వీర లెంత సుందరాకారులో! చూడుము. ౧౮

లక్ష్మణుఁడా! నీ విచ్చటనె సీతతోఁగూడ కొంచెముసేపు ఉండుము. నేనుబోయి కాంతిమంతుండగు నీతఁ డెవ్వఁడో స్పష్టముగాఁ దెలిసికొనివచ్చెదను. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౧౯

రాముఁడు ఇట్లు లక్ష్మణున కిచ్చటనె యుండుమనిచెప్పి తాను శరభంగమహాముని యాశ్రమముతట్టు పోయెను. ౨౦

అంత దేవేంద్రుఁడు రాముఁడు వచ్చుటను జూచి శరభంగమహాముని సమీపంబునకుం బోయి యేకాంతంబున నాయనతో నిట్లని చెప్పెను. ౨౧

ఇదిగో రాముఁడు వచ్చుచున్నాఁడు. ఇతఁడు నాతో మాటలాడుటకు మున్నె కార్యంబు సాధింపవలయును. కార్యసాధనం బయినపిమ్మట నన్నుఁ జూడవచ్చును. ౨౨

ఈతఁడు రావణునివధించి దేవతాకార్యంబు సాధించినపిమ్మట శీఘ్రంబునసె నీతనిం జూచెదన

కర్మ హ్యనేన కర్తవ్యం మహ దన్యై స్సుదుష్కరమ్. ౧౩
నిష్పాదయిత్వా తత్కర్మ తతో మాం ద్రష్టు మర్హతి,

ఇతి వజ్రీ త మామన్త్ర్య మానయిత్వా చ తాపసమ్. ౧౪
రథేన హరియుక్తేన యయౌ దివ మరిన్దమః,

ప్రయాతే తు సహస్రాక్షే రాఘవ స్సపరిచ్ఛదమ్. ౧౫
అగ్నిహోత్ర ముపాసీనం శరభఙ్గ ముపాగమత్,

తస్య పాదౌ చ సఙ్గృహ్య రామ స్సీతా చ లక్ష్మణః. ౧౬
నిషేదు స్సమనుజ్ఞాతా లబ్ధవాసా నిమన్త్రితాః,

తత శ్శక్రోపయానం తు పర్యపృచ్ఛత్స రాఘవః. ౧౭

శరభంగ శ్చ తత్సర్వం రాఘవాయ న్యవేదయత్,
మా మేష వరదో రామ! బ్రహ్మాలోకం నినీషతి. ౧౮
జిత ముగ్రేణ తపసా దుష్ప్రాప మకృతాత్మభిః,

అహం జ్ఞాత్వా నరవ్యాఘ్ర! వర్తమాన మదూరతః. ౧౯
బ్రహ్మాలోకం న గచ్ఛామి త్వా మదృష్ట్వా ప్రియాతిథిమ్,

త్వయాఽహం పురుషవ్యాఘ్ర! ధార్మికేణ మహాత్మనా. ౨౦
సమాగమ్య గమిష్యామి త్రిదివం దేవసేవితమ్,

ఇతఁడు మఱియెవ్వరికిని అసాధ్యమగు గొప్పకార్యము నొకటిఁ జేయవలసియున్నదిగదా! దానిఁ గావించినపిమ్మట నన్నుఁ జూచుట మంచిది. అని యింద్రుఁడు శరభంగునితోఁ జెప్పెను. ౨౩

ఇట్లు శత్రువుల నణఁగఁద్రొక్కునట్టిదేవేంద్రుఁడు ఆశరభంగమహామునికిం జెప్పి యాయనం బూజించి వీడ్కొని రథం బారోహించి స్వర్గంబునకుఁ బోయెను. ౨౪

అంత దేవేంద్రుఁడు పోయినంతనే రాముఁడు సీతాలక్ష్మణులతోఁ గూడ నగ్నిప్రవేశార్థమయి యగ్నిహోత్రము నుపాసించుచున్న శరభంగమహాముని యొద్దకుఁ బోయెను. ౨౫

రాముఁడును సీతాలక్ష్మణులును ఆశరభంగమహామునిపాదంబులకు నమస్కరించి యాయన యాసనం బొసంగి యాతిథ్యంబు గ్రహింపుఁడని నుడువం గూర్చుండిరి. ౨౬

అంత రాముఁడు శరభంగమహామునిని దేవేంద్రుఁడు వచ్చినసంగతిం గుఱించి యడిగెను. ౨౭

శరభంగుండాసంగతియంతయు రామునకుం జెప్పెను.

రాముఁడా! వరంబులొసంగునట్టి యీదేవేంద్రుఁడు నేఁగావించిన యుగ్రతపస్సుచే బ్రాప్తమయినదియు నాత్మవేత్తలుగానివారలకుఁ బొందనలవిగానిదియు నగు బ్రహ్మలోకంబునకు నన్నుఁ దీసికొనిపోఁ దలంచి యున్నాఁడు. ౨౮

పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! నీ విచ్చట దగ్గఱనే యున్నావని యెఱింగి ప్రియాతిథివగు నిన్నుఁ జూడక పోఁగూడదని బ్రహ్మలోకంబునకుం బోకున్నాను. ౨౯

పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! ధార్మికుఁడవు మహాత్ముఁడవునగు నిన్నుఁ జూచి యటుపిమ్మట దేవసేవితంబగు బ్రహ్మలోకంబునకుఁ బోయెదనని యుంటిని. ౩౦

అక్షయా నరశార్దూల! మయా లోకా జితా శ్శుభాః. ౩౧
బ్రాహ్మ్యా శ్చ నాకపృష్ఠ్యా శ్చ ప్రతిగృహ్ణీష్వ మామకాన్,

ఏవ ముక్తో నరవ్యాఘ్ర స్సర్వశాస్త్రవిశారదః.
ఋషిణా శరభఙ్గేన రాఘవో వాక్య మబ్రవీత్, ౩౨
అహమే వాహరిష్యామి సర్వలోకా న్మహామునే!,
ఆవాసం త్వహ మిచ్ఛామి ప్రదిష్ట మిహ కాననే, ౩౩

రాఘవే ణైవ ముక్తస్తు శక్రతుల్యబలేన వై.
శరభఙ్గో మహాప్రాజ్ఞః పున రే వాబ్రవీ ద్వచః, ౩౪
ఇహ రామ! మహాతేజా స్సుతీక్ష్ణో నామ ధార్మికః.
వస త్యరణ్యే ధర్మాత్మా స తే శ్రేయో విధాస్యతి, ౩౫

సుతీక్ష్ణ మభిగచ్ఛ త్వం శుచౌ దేశే తపస్వినమ్.
రమణీయే వనోద్దేశే స తే వాసం విధాస్యతి, ౩౬
ఇమాం మన్దాకినీం రామ! ప్రతిస్రోతా మనువ్రజ.
నదీం పుష్పోడుపవహాం తత్ర తత్ర గమిష్యసి, ౩౭

ఏష పన్థా నరవ్యాఘ్ర ముహూర్తం పశ్య తాత మామ్.
యావ జ్జహామి గాత్రాణి జీర్ణాం త్వచ మి వోరగః, ౩౮

తతో ఽగ్నిం సుసమాధాయ హుత్వా చాజ్యేన మన్త్రవిత్,
శరభఙ్గో మహాతేజాః ప్రవివేశ హుతాశనమ్,

పురుషశ్రేష్ఠుఁడవగు రామా! నేను అక్షయంబులగు బ్రహ్మలోక స్వర్గలోకంబులను సాధించియున్నాను; వానినన్నింటిని నీకు సమర్పించెదను: ప్రతిగ్రహింపుము. అని శరభంగమహాముని చెప్పి తాను గావించిన సమస్త కర్మంబులను రఘువీరునకు సమర్పించెను. ౩౧

పురుషశ్రేష్ఠుఁడును సమస్తశాస్త్రంబులు దెలిసినవాఁడునగు రాముఁడు శరభంగమహాముని చెప్పినమాటను విని యాయనతో నిట్లని చెప్పెను. ౩౨

శరభంగమహామునీ! సమస్తలోకంబులను నేనే సాధించుకొనఁ గోరి యున్నాను. నా కీయడవియందు వాసంబుసేయుటకుఁ దగినస్థలంబును మాత్రము జూపుము. అని రాముఁడు శరభంగమహామునితోఁ జెప్పెను ౩౩

మహాపండితుఁడగు శరభంగమహాముని రామునిమాటను విని మఱల రామునిం జూచి యిట్లని పలికెను. ౩౪

రామా! ఈయడవియం దిచ్చటికి సమీపంబుననే మహాప్రభావుఁడును ధార్మికుఁడును ధర్మాత్ముఁడునగు సుతీక్ష్ణుండను మహర్షి యున్నాఁడు. ఆయన నీకు మేలుగావించును. ౩౫

నీవు సుతీక్ష్ణమహర్షి యొద్దకుఁ బొమ్ము; ఆయన నీకు రమణీయంబును బరిశుద్ధంబునగు ప్రదేశంబున వాసస్థానం జేర్పఱచును. ౩౬

రామా! ఈయేటిగట్టుననే పశ్చిమాభిముఖంబుగా మార్గ మొకటి యున్నది. అది కొంతదూరము ఏటికిదూరంబుగను ఉండును. ఏటిలోఁబుష్పాకారంబులగు తెప్ప లగపడుచుండును; నీ వాదారింబట్టి పొమ్ము. ౩౭

పురుషశ్రేష్ఠుఁడవగు రామా! నీవు కొంచెమునే యిచ్చట నన్నుఁ జూచుచుండుము; సర్పము కుబుసమును విడుచునట్లు నే జీర్ణదేహమును విడిచెదను. ౩౮

అంత మహాతేజుండును సమస్తమంత్రజ్ఞుండునగు శరభంగమహాముని యగ్నిం బ్రజ్వలింపఁజేసి యాజ్యంబు వ్రేల్చి యయ్యగ్నిహోత్రముం బ్రవేశించెను. ౩౯

తస్య రోమాణి కేశాం శ్చ తదా పావకి ర్మహాత్మనః. ౪౦
జీర్ణాం త్వచం తథా ఽస్థీని యచ్చ మాంసం సశోణితమ్,
రామ స్తు విస్మితో భ్రాత్రా భార్యయా చ సహాత్మవాన్. ౪౧

స చ పావకసఙ్కాశః కుమార స్సమపద్యత,
ఉత్థా యాగ్నిచయా త్తస్మా చ్ఛరభఙ్గో వ్యరోచత. ౪౨

స లోకా నాహితాగ్నీనా మృషీణాం చ మహాత్మనామ్,
దేవానాం చ వ్యతిక్రమ్య బ్రహ్మలోకం వ్యరోహత. ౪౩
స పుణ్యకర్మా భవనే ద్విజర్షభః
పితామహం సానుచరం దదర్శ హ,
పితామహ శ్చాపి సమీక్ష్య తం ద్విజం
ననన్ద సుస్వాగత మిత్యువాచ హ. ౪౪

ఇతి శ్రీమదరణ్యకాణ్డే పఞ్చమ స్సర్గః. ౫.

---

## షష్ఠ స్సర్గః.

శరభఙ్గే దివం యాతే మునిసఙ్ఘా స్సమాగతాః,
అభ్యగచ్ఛన్త కాకుత్స్థం రామం జ్వలితతేజసమ్. ౧
వైఖానసా వాలఖిల్యా స్సమ్ప్రక్షాళా మరీచిపాః,
అశ్మకుట్టా శ్చ బహవః పత్రాహారా శ్చ ధార్మికాః. ౨
దన్తోలూఖలిన శ్చైవ తథై వోన్మజ్జకాః పరే,
గాత్రశయ్యా అశయ్యా శ్చ తథై వాభ్రావకాశకాః. ౩
మునయ స్సలిలాహారా వాయుభక్షా స్తథా పరే,
ఆకాశనిలయా శ్చైవ తథా స్థణ్డిలశాయినః. ౪
వ్రతోపవాసినో దాన్తా స్తథా ఽఽర్ద్రపటవాససః,

ఆంత నయ్యగ్నిహోత్రంబున మహాత్ముఁడగు శారభంగుని వెండ్రుకలును శిథిలంబగు చర్మంబును అస్థులును మాంసంబును దగ్ధమయ్యెను. ౪౦

అట్లు శరభంగునిశరీరం బగ్నిహోత్రంబున దగ్ధంబగుటను జూచి మహాత్ముఁడగు రాముఁడును సీతయు లక్ష్మణుఁడును బరమాశ్చర్యంబు నొందిరి. ౪౧

అంత శారభంగుఁడు అగ్నిహోత్రుఁడుంబోలె వెలుంగునట్టి ముప్పదియేండ్లకు లోనయిన వయస్సుతోఁగూడిన రూపముగలవాఁడయి మహాతేజంబున వెలుంగుచు నయ్యగ్నిహోత్రంబునుండి వెలువడెను. ౪౨

ఆశరభంగమహర్షి ఆహితాగ్నిలోకంబులను మహాత్ములగుఋషులుచేరు లోకంబులను దేవలోకంబులను అతిక్రమించి బ్రహ్మలోకంబుఁ జేరెను. ౪౩

పుణ్యకర్ముఁడును బ్రాహ్మణోత్తముఁడు నగు శారభంగమహాముని యాబ్రహ్మలోకంబున సపరివారుఁడగు బ్రహ్మదేవుం జూచెను; బ్రహ్మదేవుఁడును శరభంగునిం జూచి సంతోషించి స్వాగతంబుఁ జెప్పెను. ౪౪

ఇది ఐదవసర్గము.

---

## ఆఱవసర్గము.

శరభంగుఁడు ముక్తిఁబొందినవెనుక మునులందఱు నొక్కటియయి తేజంబున వెలుంగుచుండు రామునొద్దకు వచ్చిరి. ౧

బ్రహ్మనఖంబులవలనం బుట్టినవైఖానసులను మునులును బ్రహ్మరోమంబుల జన్మించినట్టి వాలఖిల్యులను మునులును దేహంబు లోపలిభాగమునం తయు నీటిచేఁ గడుగుకొనునట్టి ఋషులును చంద్రసూర్యులకిరణంబులం ద్రాగియుండువారలును దేహమంతయు ఱాళ్లచేఁ గొట్టుకొనువారలును బత్రాహారులును వడ్లు మొదలగుధాన్యంబుల దంచుటకు బదులుగా దంతములచేతనే నమిలి పొట్టునువిడిచి గింజలనుమాత్రము దినువారలును కంఠము లోఁతు నీళ్లలో నుండి తపముసేయువారలును దేహమునందే ఱొమ్ముమీఁదం

సజపా శ్చ తపోనిత్యా స్తథా పఞ్చతపోఽన్వితాః. ౫
సర్వే బ్రాహ్మ్యా శ్రియా జుష్టా దృఢయోగా స్సమాహితాః,
శరభఙ్గాశ్రమే రామ మభిజగ్ము శ్చ తాపసాః. ౬

అభిగమ్య చ ధర్మజ్ఞా రామం ధర్మభృతాం వరమ్,
ఊచుః పరమధర్మజ్ఞ మృషిసఙ్ఘా స్సమాహితాః. ౭
త్వ మిక్ష్వాకుకులస్యాస్య పృథివ్యా శ్చ మహారథ,
ప్రధాన శ్చాసి నాథశ్చ దేవానాం మఘవా నివ. ౮

విశ్రుత స్త్రిషు లోకేషు యశసా విక్రమేణ చ,
పితృభక్తి శ్చ సత్యం చ త్వయి ధర్మ శ్చ పుష్కలః. ౯

త్వా మాసాద్య మహాత్మానం ధర్మజ్ఞం ధర్మవత్సలమ్,
అర్థిత్వా న్నాథ వక్ష్యామ స్తచ్చ నః క్షన్తు మర్హసి. ౧౦
అధర్మ స్తు మహాం స్తాత! భవే త్తస్య మహీపతేః,
యో హరే ద్బలిషడ్భాగం న చ రక్షతి పుత్రవత్. ౧౧
యుఞ్జాన స్స్వా నివ ప్రాణా న్ప్రాణై రిష్టాం స్సుతా నివ,
నిత్యయుక్త స్సదా రక్షం స్సర్వా న్విషయవాసినః. ౧౨
ప్రాప్నోతి శాశ్వతీం రామ! కీర్తిం స బహువార్షికీమ్,

గాని భుజముమీఁదఁగాని తలయుంచుకొని నిద్రించువారలును నిద్రింపక యె
యుండువారలును శీతకాలంబున బయలనుండి తపముసల్పువారలును, జలమా
త్రాహారులును వాయుమాత్రాహారులును అనాధారంబుగ నాకాశంబున నుం
డువారలును నేలం బరుండువారలును వ్రతార్థమయి నిత్యోపవాసములుండు
వారలును జితేంద్రియులును ఎల్లప్పుడును దడిబట్టలం గట్టుకొనియుండువా
రలును వివిధమంత్రజపంబులు సేయువారలును స్వాధ్యాయపరాయణులును
గ్రీష్మకాలంబునఁ బంచాగ్నిమధ్యంబుననుండి తపంబు గావించువారలును
ఇట్లు అందఱును బ్రహ్మతేజస్సంపన్నులును దృఢయోగాభ్యాసశీలురును
సమాధినిష్ఠులునగు నానావిధానుష్ఠానసంపన్నులయిన మునులందఱు శరభంగుని
యాశ్రమంబునకు వచ్చి రాముని సందర్శించిరి. ౬

ధర్మజ్ఞులగు నామహర్షులు పరమధర్మవేత్తయు ధనుర్ధరవరుండునగు
రామునిం జూచి యిట్లని చెప్పిరి. ౭

మహారథుఁడవగు రాముఁడా! దేవేంద్రుఁడు స్వర్గంబునకును దేవతల
కును బ్రభుండును ముఖ్యుండునై యుండునట్లు నీవు భూమండలంబునకును
ఇక్ష్వాకుకులంబునకును నాథుండవు. ౮

నీవును బరోపకారకీర్తిచేతను బలపరాక్రమంబునను ముల్లోకంబుల
యందును బ్రసిద్ధుండవు. మఱియు నీవు పితృభక్తియు సత్యంబును గలవాఁ
డవు. పరమధార్మికుండవు. ౯

నాథుఁడా! మహాత్ముఁడవు ధర్మజ్ఞుఁడవు ధర్మవత్సలుండవు నగు నీయొ
ద్దకు వచ్చి యాచనబుద్ధిచే నొకటిఁ జెప్పెదము; క్షమించవలయును. ౧౦

నాయనా! ఎవ్వఁడు ఆఱవభాగము పన్నుదీసికొని ప్రజలఁ గొడు
కులంబోలె రక్షింపకుండునో ఆరాజునకు మితిలేని యధర్మము గలుగును. ౧౧

రాముఁడా! ఎవ్వఁడు నానావిధయత్నంబు సేయుచు నెల్లప్పుడును
నవహితుఁడై స్వదేశవాసుల నందఱను దనప్రాణంబులంబోలెఁ బ్రాణంబుల
కన్ననధికులగు కొడుకులంబోలెఁ బరిపాలింపుచుండునో ఆరాజు శాశ్వతంబగు

బ్రహ్మణః స్థాన మాసాద్య తత్ర చాపి మహీయతే. ౧౩

య త్కరోతి పరం ధర్మం ముని ర్మూలఫలాశనః,
తత్ర రాజ్ఞ శ్చతుర్భాగః ప్రజా ధర్మేణ రక్షతః. ౧౪

సోఽయం బ్రాహ్మణభూయిష్ఠో వానప్రస్థగణో మహాన్,
త్వం న్నాథోఽనాథవ ద్రామ రాక్షసై ర్వధ్యతే భృశమ్. ౧౫

ఏహి పశ్య శరీరాణి మునీనాం భావితాత్మనామ్,
హతానాం రాక్షసై ర్ఘోరై ర్బహూనాం బహుధా వనే ౧౬
పమ్పానదీనివాసానా మనుమన్దాకినీ మపి,
చిత్రకూటాలయానాం చ క్రియతే కదనం మహత్ ౧౭
ఏవం వయం న మృష్యామో విప్రకారం తపస్వినామ్,
క్రియమాణం వనే ఘోరం రక్షోభి ర్భీమకర్మభిః. ౧౮
తత స్త్వాం శరణార్థం చ శరణ్యం సముపస్థితాః,
పరిపాలయ నో రామ! వధ్యమానా న్నిశాచరైః. ౧౯
పరా త్వత్తో గతి ర్వీర! పృథివ్యాం నోపపద్యతే,
పరిపాలయ న స్సర్వా న్రాక్షసేభ్యో నృపాఽత్మజ. ౨౦

ఏత చ్ఛ్రుత్వా తు కాకుత్స్థ స్తాపసానాం తపస్వినామ్,
ఇదం ప్రోవాచ ధర్మాత్మా సర్వానేవ తపస్వినః ౨౧
నైవ మర్హథ మాం వక్తు మాజ్ఞాప్యోఽహం తపస్వినామ్,
కేవలేనాత్మకార్యేణ ప్రవేష్టవ్యం మయా వనమ్. ౨౨

కీర్తిం బొందును; అంతంబున బ్రహ్మలోకంబు నొంది యచ్చటను బూజితుండై వెలుంగును. ౧౩

ప్రజలందఱు నా ఆఱవభాగము నొసంగుటం జేసి వారల రక్షింపవలెను; ఋషులేమియు నిచ్చువారలు కారే వారి నేల రక్షింపవలయు ననవలదు; ఋషులు ఫలమూలంబుల నాహారంబుగాం గొనుచుం గావించుమహాధర్మంబులోం గూడ ధర్మంబునం బ్రజల రక్షించుచుండు రాజునకు నాలవభాగంబు గలదు. ౧౪

రాముండా! తఱచుగా నందఱు బ్రాహ్మణులె యయిన యీ వానప్రస్థులందఱు నీవు నాథుండ వుండియు ఆనాథులుంబోలె రాక్షసులచే వధింపంబడుచున్నారు. ౧౫

ఇదిగో చూడుము; వనంబున నానావిధంబుల భయంకరులగు రాక్షసులచేం జంపంబడిన పరమాత్మవేత్తలగు మునుల దేహంబులు పడియున్నవి; చూడుము.

మందాకినీనదీతీరంబునందేమి పంపానదీతీరంబునందేమి చిత్రకూటపర్వతంబునందేమి వాసము సేయు ఋషుల నందఱను వధించుచున్నారు. ౧౬

ఇట్లు వనియందు భయంకరముగా ఋషులను వధించుటను మేము సహింపంజాలము. ౧౭

రాముండా! అందువలన మేము రక్షణార్థులమయి శరణ్యుండగు నిన్ను శరణుపొందినాము; రాక్షసులచే వధింపంబడుచున్న మమ్ము రక్షింపుము. ౧౮

పరాక్రమశాలివి రాచకొమరుండ వగురాముండా! నీకన్న మాకు వేఱుగతి భూమండలంబున నెచ్చటను లేదు. మమ్ము ఈరాక్షసబాధం దొలంగించి రక్షింపుము. అని ఋషులు రామునితోం జెప్పుకొనిరి. ౨౦

ధర్మాత్ముండగు రాముండు మహాతపస్సంపన్నులగు నాఋషులు చెప్పిన మాటను విని యాఋషుల నందఱం జూచి యీమాటం జెప్పెను. ౨౧

మీరలు నావిషయమున యిట్లు చెప్పవలదు; నన్ను మీర లాజ్ఞాపింపవలయునుగాని పరిపాలింపుమని చెప్పరాదు. నాకార్యముచేత నే నీయడవికి రావలసియుండినది; ఇప్పుడు తపస్విజనరక్షణము రెండవఫల మగుచున్నది

విప్రకార మపాక్రష్టుం రాక్షసై ర్భవతా మిమమ్,
పితు స్తు నిర్దేశకరః ప్రవిష్టో౽హ మిదం వనమ్. ౧౩

భవతా మర్థసిద్ధ్యర్థ మాగతో౽హం యదృచ్ఛయా,
తస్య మే౽యం వనే వాసో భవిష్యతి మహాఫలః. ౧౪
తపస్వినాం రణే శత్రూ న్హన్తు మిచ్ఛామి రాక్షసాన్,
పశ్యన్తు వీర్య మృషయ స్సభ్రాతు ర్మే తపోధనాః. ౧౫

దత్త్వా౽భయం చాపి తపోధనానాం
ధర్మే ధృతాత్మా సహ లక్ష్మణేన,
తపోధనై శ్చాపి సభాజ్యవృత్త
స్సుతీక్ష్ణ మే వాభిజగామ వీరః. ౧౬
ఇతి శ్రీమదరణ్యకాణ్డే షష్ఠ స్సర్గః. ౬.

---

## సప్తమ స్సర్గః

రామ స్తు సహితో భ్రాత్రా సీతయా చ పరన్తపః,
సుతీక్ష్ణ స్యాశ్రమపదం జగామ సహ తై ర్ద్విజైః. ౧

స గత్వా దూర మధ్వానం నదీ స్తీర్త్వా బహూదకాః,
దదర్శ విపులం శైలం మహామేఘ మి వోన్నతమ్. ౨
తత స్త దిక్ష్వాకువరౌ సన్తతం వివిధై ర్ద్రుమైః,
కాననం తౌ వివిశతు స్సీతయా సహ రాఘవౌ. ౩

ప్రవిష్ట స్తు వనం ఘోరం బహుపుష్పఫలద్రుమమ్,

ఇప్పుడు నేను తండ్రియాజ్ఞను నెఱవేర్చుటకును మీ కిప్పుడు రాక్షసులచేఁ గలిగినకష్టమును నివారించుటకైయును ఈయడవికి వచ్చినవాఁడ నైతిని. ౨౩

నేను యాదృచ్ఛికంబుగా మీకార్యసిద్ధియగుటకై నే నిచ్చటికివచ్చినాను; కావున నా కీవనంబున నుండుటవలన మహాఫలంబుగలుగును. ౨౪

నేను ఋషులకు శత్రువులుగానుండు రాక్షసుల నందఱను యుద్ధంబున వధింపఁగోరియున్నాను; తపోధనులగు ఋషులందఱు యుద్ధంబున నాపరాక్రమంబును నాతమ్మునిపరాక్రమంబునుం జూడఁగలరు. అని రాముఁడు ఋషులకుఁ జెప్పెను. ౨౫

వీరుఁడును ధర్మంబునందుఁ జలనములేనివాఁడును ఋషులకుఁగూడఁ బూజనీయంబగు నాచారంబుగలవాఁడు నగు రాముఁడు ఋషులకు అభయం బొసంగి లక్ష్మణుంగూడి సుతీక్ష్ణమహామునియొద్దకుఁ బోయెను. ౨౫

ఇది యాఱవసర్గము.

## ఏడవసర్గము.

శత్రువులఁ దపింపఁజేయునట్టి రాముఁడు సీతాలక్ష్మణసహితుఁడై యా వైఖానసాదిబ్రాహ్మణులు వెంబడింప సుతీక్ష్ణమహాముని యాశ్రమంబునకుఁ బోయెను. ౧

రాముఁడట్లు దూరముగాఁబోయి అధికజలముగల నదులను దాఁటి మహామేఘము వలెనున్న యత్యున్నతంబగు నొక్కపర్వతముం గనెను. ౨

అంత నిక్ష్వాకువంశమునం బుట్టినవారలలో నుత్తములగు రామలక్ష్మణులు సీతాసంయుతులయి నానావృక్షసమూహసంకులంబగు నాపర్వతసమీపమందలి యరణ్యంబుఁ బ్రవేశించిరి. ౩

అట్లురాముఁడు భయంకరంబును బుష్పపూర్ణంబులును ఫలవంతంబులు

దదర్శాఽఽశ్రమ మేకాన్తే చీరమాలాపరిష్కృతమ్. ౪

తత్ర తాపస మాసీనం మలపఙ్కజటాధరమ్,
రామ స్సుతీక్ష్ణం విధివ త్తపోవృద్ధ మభాషత. ౫
రామోఽహ మస్మి భగవ! న్భవన్తం ద్రష్టు మాగతః,
త్వం మాభివద ధర్మజ్ఞ మహర్షే సత్యవిక్రమ. ౬

స నిరీక్ష్య తతో వీరం రామం ధర్మభృతాం వరమ్,
సమాశ్లిష్య చ బాహుభ్యా మిదం వచన మబ్రవీత్. ౭

స్వాగతం ఖలు తే వీర! రామ! ధర్మభృతాం వర,
ఆశ్రమోఽయం త్వయాఽఽక్రాన్త స్సనాథ ఇవ సామ్ప్రతమ్.
ప్రతీక్షమాణ స్త్వా మేవ నారోహేఽహం మహాయశః,
దేవలోక మితో వీర! దేహం త్యక్త్వా మహీతలే. ౮

చిత్రకూట ముపాదాయ రాజ్యభ్రష్టోఽసి మే శ్రుతః,

ఇహోపయాతః కాకుత్స్థ! దేవరాజ శ్శతక్రతుః. ౧౦
ఉపాగమ్య చ మాం దేవో మహాదేవ స్సురేశ్వరః,
సర్వాన్లోకా ఞ్జితా నాహ మమ పుణ్యేన కర్మణా. ౧౧
తేషు దేవర్షిజుష్టేషు జితేషు తపసా మయా,
మత్ప్రసాదా త్సభార్య స్త్వం విహరస్వ సలక్ష్మణః. ౧౨

త ముగ్రతపసా యుక్తం మహర్షిం సత్యవాదినమ్,
ప్రత్యువా చాత్మవా న్రామో బ్రహ్మాణ మివ కాశ్యపః. ౧౩

నగు వృక్షములతోఁ గూడినదియు నగు నాయడవిం జొచ్చి యచ్చట నొక విచిత్రభాగంబున నారచీరలసమూహాతోఁగూడినయాశ్రమముఁ జూచెను. ౫

ఆయాశ్రమమందు సుఖాసీనుండును ముటికితోఁగూడిన జటలుగల వాఁడును మహాతపశ్శాలియు నగు సుతీక్ష్ణమహాముని౦ జూచి యిట్లనిచెప్పెను.

భగవంతుఁడవు ధర్మవేత్తవు నమోఘతపఃప్రభావుఁడవు నగు సుతీక్ష్ణ మహామునీ! నేను రాముఁడనువాఁడ: నిన్నుఁ జూడవచ్చినాను: నీకు నమస్కరించెదను: ఆశీర్వదింపుము. అని రాముఁడు సుతీక్ష్ణునితోఁ జెప్పెను. ౬

అంత నాసుతీక్ష్ణమహాముని మహాపరాక్రమశాలియుఁ బరమధార్మికుం డునగు నారాముం జూచి దృఢంబుగాఁ జేతులఁ గవుఁగిలించుకొని యీ మాటం జెప్పెను. ౭

వీరుఁడవుఁ బరమధార్మికుఁడవునగు రాముఁడా! నీకు స్వాగతంబగుఁ గాక: నీవు వచ్చుటంజేసి యీయాశ్రమంబు సనాథం బయినది. ౮

మహాయశుండవు వీరుఁడవు నగు రాముఁడా! నీవు వత్తువు నీదర్శనము సేయవలెనని యెదురుచూచుచు నే యింకను ఈదేహమును విడిచి స్వర్గమునకుఁ బోవకయున్నాను. ౯

నీవు రాజ్యభ్రష్టుఁడవై వనంబునకు వచ్చినావని నేను చిత్రకూటంబుననుండి వినుచున్నాను.

రాముఁడా! దేవరాజుఁడగు నింద్రుండిచ్చటికివచ్చిపోయినాఁడు.

దేవదేవుఁడగు నాదేవేంద్రుఁడు నాయొద్దకువచ్చి నాతపస్సుచేత సమస్తలోకంబులును జయింపఁబడినట్లు చెప్పినాఁడు. ౧౧

నీవు నాప్రసాదంబున తపస్సుచే నే నార్జించినదేవర్షి సేవితంబులగు నాదివ్యలోకంబులయందు సీతను లక్ష్మణునింగూడి సుఖంబున విహరింపుచుండుము. అని సుతీక్ష్ణుఁడు రామునితోఁ జెప్పెను. ౧౨

మహాత్ముఁడగురాముఁడు కాశ్యపుఁడు బ్రహ్మదేవునితోఁ జెప్పినట్లు మహాతపశ్శాలియు సత్యవాదియు నగునాసుతీక్ష్ణమహామునిం జూచి యిట్లని చెప్పెను. ౧౩

అహ మే వాహరిష్యామి స్స్వయం లోకా న్మహామునే!,
ఆవాసం త్వహ మిచ్ఛామి ప్రదిష్ట మిహ కాననే. ౧౪
భవాం త్సర్వత్ర కుశల స్సర్వభూతహితే రతః,
ఆఖ్యాత శ్శరభఙ్గేణ గౌతమేన మహాత్మనా. ౧౫

ఏవ ముక్త స్తు రామేణ మహర్షి ర్లోకవిశ్రుతః,
అబ్రవీ న్మధురం వాక్యం హర్షేణ మహతాఽఽప్లుతః. ౧౬
అయ మే వాశ్రమో రామ! గుణవా న్రమ్యతా మిహ,
ఋషిసంఘానుచరిత స్సదా మూలఫలాన్వితః. ౧౭

ఇమ మాశ్రమ మాగమ్య మృగసంఘా మహాయశః!,
అటిత్వా ప్రతిగచ్ఛన్తి లోభయిత్వాఽకుతోభయాః. ౧౮
నాన్యో దోషం భవే దత్ర మృగేభ్యోఽన్యత్ర విద్ధి వై,

తచ్ఛ్రుత్వా వచనం తస్య మహర్షే ర్లక్ష్మణాగ్రజః. ౧౯
ఉవాచ వచనం ధీరో వికృష్య సశరం ధనుః,
తా నహం సుమహాభాగ! మృగసఙ్ఘాం త్సమాగతాన్. ౨౦
హన్యాం నిశితధారేణ శరే ణాశనివర్చసా,
భవాం స్తత్రాభిషజ్యేత కిం స్యా త్కృచ్ఛ్రతరం తతః. ౨౧

ఏతస్మి న్నాశ్రమే వాసం చిరం తు న సమర్థయే,

త మేవ ముక్త్వా వరదం రామ స్సన్ధ్యా ముపాగమత్. ౨౨

అన్వాస్య పశ్చిమాం సన్ధ్యాం తత్ర వాస మకల్పయత్,
సుతీక్ష్ణస్యాఽశ్రమే రమ్యే సీతయా లక్ష్మణేన చ. ౨౩

సుతీక్ష్ణమహామునీ! నేనే నాను లోకంబుల సంపాదించుకొనెదను: ఈ యడవియందు మాకుఁదగిన నివాసస్థానమునుమాత్రము చెప్పఁగోరినాను ౧౪

నీవు మహాత్ముఁడ వనియు సర్వభూతహితకరుఁడవనియు మహాత్ముఁడును గౌతమవంశ్యుఁడునగు శరభంగమహాముని చెప్పినాఁడు. అని రాముఁడు సుతీక్ష్ణునితోఁ జెప్పెను. ౧౫

లోకప్రసిద్ధుఁడగు నాసుతీక్ష్ణమహాముని రాముఁడు చెప్పినమాటనువిని పరమానందము నొంది మధురవచనంబున నిట్లని చెప్పెను. ౧౬

రాముఁడా! ఋషిసేవితంబును ఎల్లప్పుడును ఫలమూలసమృద్ధంబై యుండు నదియు నగు నీయాశ్రమమే మంచిది. ఇచ్చటనే విహరింపుచుండుము. ౧౭

మహాయశుఁడవగు రాముఁడా! మృగంబులు నిర్భయముగా నీయాశ్రమమునకు వచ్చి సంచరించి ఋషులను బాధపెట్టి పోవుచున్నవి. ౧౮

ఈయాశ్రమమునందు ఈమృగబాధయొకటె. మఱి వేఱొకదోషమేదియు లేదని తెలియుంగుము. అని సుతీక్ష్ణుఁడు రామునితోఁ జెప్పెను.

ధీరుఁడగు నారాముఁడు ఆసుతీక్ష్ణమహామునిమాటను విని ధనువు నెక్కుపెట్టి యాకర్షించుచు నిట్లని చెప్పెను. ౧౯

మహాభాగుఁడవగు సుతీక్ష్ణుఁడా! నేను ఇచ్చట నున్నయెడ నామృగంబులు వచ్చినప్పుడు వానినన్నింటిని కఱకుబాణంబులం జంపుదును. ౨౦

అట్లు నీయాశ్రమంబున నుండి మృగంబులఁ జంపుటచే నీకుఁ గోపము వచ్చును. అంతకన్న నాకుఁ గష్టమేమియున్నది? ౨౧

అట్లు కావున నీయాశ్రమంబున బహుకాల ముండుటకు నా కిష్టము లేదు. అని రాముఁడు సుతీక్ష్ణమహామునితోఁ జెప్పెను.

రాముఁడు వరప్రదుఁడగు నాసుతీక్ష్ణమహామునితో నీప్రకారమునం జెప్పి సంధ్య నుపాసించుటకై పరస్తీరంబునకుం బోయెను. ౨౨

రాముఁడు సాయంసంధ్య నుపాసించి రమణీయంబగు నాసుతీక్ష్ణమహామునియాశ్రంబున సీతాలక్ష్మణులతో నారాత్రివాసంబు గావించెను. ౨౩

తత శ్శుభం తాపసభోజ్య మన్నం
స్వయం సుతీక్ష్ణః పురుషర్షభాభ్యామ్,
తాభ్యాం సుసత్కృత్య దదౌ మహాత్మా
సన్ధ్యానివృత్తౌ రజనీ మవేక్ష్య. ౨౪

ఇతి శ్రీమదరణ్యకాణ్డే సప్తమ స్సర్గః.

---

## అష్టమ స్సర్గః.

రామస్తు సహసౌమిత్రి స్సుతీక్ష్ణే నాభిపూజితః,
పరిణామ్య నిశాం తత్ర ప్రభాతే ప్రత్యబుధ్యత. ౧

ఉత్థాయ తు యథాకాలం రాఘవ స్సహ సీతయా,
ఉపాస్పృశ త్సుశీతేన జలే నోత్పలగన్ధినా. ౨

అథ తేఽగ్నిం సురాం శ్చైవ వైదేహీ రామలక్ష్మణౌ,
కాల్యం విధివ దభ్యర్చ్య తపస్విశరణే వనే. ౩

ఉదయన్తం దినకరం దృష్ట్వా విగతకల్మషాః,
సుతీక్ష్ణ మభిగ మ్యేదం శ్లక్ష్ణం వచన మబ్రువన్. ౪

సుఖోషితా స్స్మ భగవం! స్త్వయా పూజ్యేన పూజితాః,
ఆపృచ్ఛామః ప్రయాస్యామో మునయ స్త్వరయన్తి నః. ౫

త్వరామహే వయం ద్రష్టుం కృత్స్న మాశ్రమమణ్డలమ్,
ఋషీణాం పుణ్యశీలానాం దణ్డకారణ్యవాసినామ్. ౬

అభ్యనుజ్ఞాతు మిచ్ఛామ స్సహైభి ర్మునిపుఙ్గవైః,
ధర్మనిత్యై స్తపోదాన్తై ర్విశిఖై రివ పావకైః. ౭

అవిషహ్యాతపో యావ త్సూర్యో నాతివిరాజతే,

అంత మహాత్ముఁడగు సుతీక్ష్ణమహాముని సంధ్యాకాలంబు గడచి రాత్రి యగుటంజూచి పురుషశ్రేష్ఠులగు రామలక్ష్మణులం బూజించి తాపసులు దినున ట్టియన్నంబును వారల కొసంగెను.

ఇది ఏడవసర్గము.

---

## ఎనిమిదవసర్గము.

రాముఁడును లక్ష్మణుఁడును సుతీక్ష్ణమహామునిచేఁ బూజింపఁబడినవార లయి యయ్యాశ్రమంబున నారాత్రి యంతయు నుండి యుషఃకాలంబునఁ మేలుకొనిరి.

రాముఁడు యుక్తకాలంబుననే మేలుకొని సీతతోఁగూడ గలువలసం బంధంబున సుగంధియయియుండు చల్లనినీట స్నానంబు గావించెను. ౨

అంత ఋషినిలయంబగు వసంబున పాపరహితులగు సీతాదేవియు రామలక్ష్మణులును ప్రాతఃకాలంబున యథావిధిగ నగ్నిహోత్రకార్యంబులుగా వించి దేవతలం బూజించి సూర్యుఁడుదితుఁ డగుటనుజూచి సుతీక్ష్ణమహాము నియొద్దకుఁ బోయి మధురవచనంబున నిట్లని చెప్పిరి. ౩-౪

భగవంతుఁడ వగు సుతీక్ష్ణుఁడా! పూజ్యుఁడవగు నీచే నానావిధపూజలం బొంది మేము రాత్రియంతయు సుఖంబుగ నుంటిమి. చెప్పిపోవుటకు వచ్చినాము. మావెంబడివచ్చిన మునులు మమ్ముఁ దొందరచేయుచున్నారు. ౫

ఈదండకారణ్యంబున నుండునట్టిపుణ్యవంతులగు ఋషుల యాశ్రమముల సన్నియుఁ జూడవలెనని మా కిచ్చగాఁ ద్వరగలిగియున్నది. ౬

మేమును బరమధార్మికులును మహాతపస్కులురును జితేంద్రియులును జ్వాలలులేని యగ్నిహోత్రములవంటివారలు నగు ఈమునివరులును నీయనుమతిం గోరియున్నాము. ౭

నీచకులంబునం బుట్టినవాఁడు తప్పుమార్గంబున రాజ్యలక్ష్మిని సంపా-

అమార్గేణాఽగతాం లక్ష్మీం ప్రాప్యే వాన్వయవర్జితః. ౮
తావ దిచ్ఛామహే గన్తు

మిత్యుక్త్వా చరణౌ మునేః,
వవన్దే సహ సౌమిత్రి స్సీతయా సహ రాఘవః. ౯
తౌ సంస్పృశన్తౌ చరణా వుత్థాప్య మునిపుఙ్గవః,
గాఢ మాలిఙ్గ్య సస్నేహ మిదం వచన మబ్రవీత్. ౧౦

అరిష్టం గచ్ఛ పన్థానం రామ! సౌమిత్రిణా సహ,
సీతయా చానయా సార్థం ఛాయ యే వానువృత్తయా. ౧౧

పశ్యాఽఽశ్రమపదం రమ్యం దణ్డకారణ్యవాసినామ్,
ఏషాం తపస్వినాం వీర! తపసా భావితాత్మనామ్. ౧౨

సప్రాజ్యఫలమూలాని పుష్పితాని వనాని చ,
ప్రశస్తమృగయూథాని శాన్తపక్షిగణాని చ. ౧౩
ఫుల్లపఙ్కజషణ్డాని ప్రసన్నసలిలాని చ,
కారణ్డవవికీర్ణాని తటాకాని సరాంసి చ. ౧౪
ద్రక్ష్యసే దృష్టిరమ్యాణి గిరిప్రస్రవణాని చ,
రమణీయా న్యరణ్యాని మయూరాభిరుతాని చ. ౧౫.
గమ్యతాం వత్స! సౌమిత్రే! భవా నపి చ గచ్ఛతు,
ఆగన్తవ్యం త్వయా తాత! పునరే వాశ్రమం మమ. ౧౬

ఏవ ముక్త స్తథే త్యుక్త్వా కాకుత్స్థ స్సహలక్ష్మణః,
ప్రదక్షిణం మునిం కృత్వా ప్రస్థాతు ముపచక్రమే. ౧౭

దించి విఱ్ఱవీఁగునట్లు సూర్యుఁడు మఱియు నెండగాయ నారంభించుటకు మున్నె పోవలయునని యున్నాము. అని సీతారామలక్ష్మణులు సుతీక్ష్ణమహామునితోఁ జెప్పిరి. ౮

ఆసీతారామలక్ష్మణులు ఈప్రకారమునం జెప్పి యాసుతీక్ష్ణమహాముని చరణంబులకు నమస్కరించిరి. ౯

మునిశ్రేష్ఠుఁడగు నాసుతీక్ష్ణమహాముని తనపాదంబులకు నమస్కరింపుచున్న యారామలక్ష్మణులను లేవనెత్తి స్నేహాతిశయంబొప్ప దృఢముగఁ గవుఁగిలించుకొని యిట్లని చెప్పెను. ౧౦

రాముఁడా! ఛాయయుంబోలె ననువర్తించియుండునట్టి యీసీతను లక్ష్మణునింగూడి నీవు పోవుచుండునప్పుడు నీమార్గము ఉపద్రవరహిత మయియుండుఁగాక. ౧౧

పరాక్రమశాలివగు రాముఁడా! తపస్సుచేఁ బరమాత్మను ధ్యానింపుచుండునట్టి యీదండకారణ్యమున నుండుమహర్షుల యాశ్రమములం జూడుము. ౧౨

ఫలమూలసమృద్ధంబులును మంచిమృగంబులు గలవియుఁ బరస్పరవైరంబు విడిచి శాంతంబులయియుండు పక్షులతోఁ గూడినవియు నగు పుష్పితవనంబులను వికసితంబులగు కమలంబులును నీరుకోడులునుగలిగి నిర్మలంబగు జలముతోఁ గూడిన తటాకంబులను సరస్సులను నేత్రానందకరంబులగు నెలయేఱులను మధురంబుగాఁ గూయుచుండుమయూరంబులతోఁ గూడిన మనోహరంబులగు నడవులను నీవు చూడఁగలవు. ౧౩-౧౫

లక్ష్మణుఁడా! నీవును బొమ్ము. రాముఁడా! నీవును బొమ్ము. అయితే మీరు మఱల నాయాశ్రమంబున కొకమాఱు రావలయును. అని సుతీక్ష్ణమహాముని రామాదులకుఁ జెప్పెను. ౧౬

అట్లు రాముఁడు సుతీక్ష్ణునిమాటలువిని అట్లె యనిచెప్పి లక్ష్మణసహితుఁడై యమ్మునివరునకుఁ బ్రదక్షిణము గావించి పయనంబయ్యెను. ౧౭

తత శ్శుభతరే తూణీ ధనుషీ చాయతేక్షణా,
దదౌ సీతా తయో ర్భ్రాత్రోః ఖడ్గౌ చ విమలౌ తతః. ౧౮

ఆబధ్య చ శుభే తూణీ చాపౌ చాదాయ సుస్వనౌ,
నిష్క్రాన్తా వాశ్రమా ద్గన్తు ముభౌ తౌ రామలక్ష్మణౌ. ౧౯
శ్రీమన్తౌ రూపసమ్పన్నౌ దీప్యమానౌ స్వతేజసా,
ప్రస్థితౌ ధృతచాపౌ తౌ సీతయా సహ రాఘవౌ. ౨౦
ఇతి శ్రీమదరణ్యకాణ్డేఽష్టమ స్సర్గః. ౮.

---

నవమ స్సర్గః.

సుతీక్ష్ణే నాభ్యనుజ్ఞాతం ప్రస్థితం రఘునన్దనమ్,
హృద్యయా స్నిగ్ధయా వాచా భర్తార మిద మబ్రవీత్ ౧.

అయం ధర్మ స్సుసూక్ష్మేణ విధినా ప్రాప్యతే మహాన్,
నివృత్తేన తు శక్యోఽయం వ్యసనా త్కామజా దిహ. ౨

త్రీ ణ్యేవ వ్యసనా న్యత్ర కామజాని భవ న్త్యుత,
మిథ్యావాక్యం పరమకం తస్మా ద్గురుతరా వుభౌ. ౩
పరదారాభిగమనం వినా వైరం చ రౌద్రతా,
మిథ్యావాక్యం న తే భూతం న భవిష్యతి రాఘవ!. ౪

కుతోఽభిలాషణం స్త్రీణాం పరేషాం ధర్మనాశనమ్,
తవ నాస్తి మనుష్యేన్ద్ర! న చాభూ త్తే కదాచన. ౫
మన స్యపితథా రామ! న చైత ద్విద్యతే క్వచిత్,

అంత విశాలములగు కండ్లుగల సీతాదేవి యారామలక్ష్మణుల కిరువురకును మంచియమ్ములపొదులను ధనుస్సులను నిర్మలంబగు పిడిగలకత్తులను ఇచ్చెను. ౧౮

అంత నారామలక్ష్మణులు తూణీరంబుల బంధించుకొని ధనుస్సులను గ్రహించి యాశ్రమంబుననుండి బయలువెడలిరి. ౧౯

శ్రీమంతులును మహాసౌందర్యశాలురునగు నారామలక్ష్మణులు నిజదేహకాంతిచే వెలుంగుచు ధనుర్ధరులయి సీతతోఁగూడఁ బోయిరి. ౨౦

ఇది యెనిమిదవసర్గము.

## తొమ్మిదవసర్గము.

సీతాదేవి సుతీక్ష్ణమహాముని యనుమతింబొంది బయలువెడలినపెనిమిటిని రాముం జూచి మధురంబును స్నేహయుక్తంబునగు వచనంబున నిట్లని చెప్పెను. ౧

గ. మునిధర్మము మిక్కిలియు గొప్పది; అతిసూక్ష్మమార్గంబున సంపాదింపఁదగినది. కామజవ్యసనములను విడిచినవానికే దీని సంపాదింప శక్యమగును గాని యితరుని కలవిగాదు. ౨

కామజవ్యసనములు మూఁడుగలవు.

అబద్ధము చెప్పుట గొప్పది; పరస్త్రీగమనమును వైరకారణములేకయె కోపం బవలంబించుటయు నీరెండును దానికన్నను గొప్పవి. 3

రాముఁడా! నీ విదివఱ కెన్నఁడును అబద్ధముఁ జెప్పినవాఁడవుకావు. ఇంకనుఁ జెప్పఁబోవునదియులేదు. ౪

అధర్మకారణంబగు పరస్త్రీలయందలి యభిలాష నీ కెక్కడిది?

మనుష్యశ్రేష్ఠుఁడవగు రాముఁడా! పరస్త్రీవాంఛమాత్రము నీకు లేదు; ఇదివఱ కెప్పుడును లేదు. మనస్సునందుఁగూడ నీ కట్టిసంకల్ప మెప్పుడును గలుగదు.

స్వదారనిరత స్త్వం చ నిత్య మేవ నృపాత్మజ!. ౬
ధర్మిష్ఠ స్సత్యసన్ధశ్చ పితు ర్నిర్దేశకారకః,

సత్యసన్ధ! మహాభాగ! శ్రీమ! ల్లక్ష్మణపూర్వజ!. ౭
త్వయి సత్యం చ ధర్మ శ్చ త్వయి సర్వం ప్రతిష్ఠితమ్,

తచ్చ సర్వం మహాబాహో! శక్యం ధర్తుం జితేన్ద్రియైః. ౮
తవ వశ్యేన్ద్రియత్వం చ జానామి శుభదర్శన!.

తృతీయం య దిదం రౌద్రం పరప్రాణాభిహింసనమ్. ౯
నిర్వైరం క్రియతే మోహా త్తచ్చ తే సముపస్థితమ్,
ప్రతిజ్ఞాత స్త్వయా వీర! దణ్డకారణ్యవాసినామ్. ౧౦
ఋషీణాం రక్షణార్థాయ వధ స్సంయతి రక్షసామ్,

ఏతన్నిమిత్తం చ వనం దణ్డకా ఇతి విశ్రుతమ్ ౧౧
ప్రస్థిత స్త్వం సహ భ్రాత్రా ధృతబాణశరాసనః,
తత స్త్వాం ప్రస్థితం దృష్ట్వా మమ చిన్తాకులం మనః. ౧౨
త్వద్వృత్తం చిన్తయన్త్యా వై భవే న్నిశ్శ్రేయసం హి తత్,

నహి మే రోచతే వీర! గమనం దణ్డకా న్ప్రతి. ౧౩
కారణం తత్ర వక్ష్యామి వదన్త్యాః శ్రూయతాం మమ,
త్వం హి బాణధనుష్పాణిః భ్రాత్రా సహ వనం గతః. ౧౪
దృష్ట్వా వనచరాం త్సర్వా న్కచ్చి త్కుర్యాః శ్శరవ్యయమ్,
క్షత్రియాణా మపి ధను ర్హుతాశ స్యేన్ధనాని చ. ౧౫
సమీపతః స్థితం తేజో బల ముచ్ఛ్రియతే భృశమ్,

రాచకొమరుఁడవగు రాముఁడా! నీవు ఎల్లప్పుడును స్వభార్యయందే యాసక్తుఁడవు. పరమధార్మికుఁడవు; సత్యసంధుఁడవు; తండ్రియాజ్ఞను జవదాఁటవు. ౬

సత్యసంధుఁడవు మహాభాగుఁడవు శ్రీమంతుఁడవు లక్ష్మణుని యన్నవు నగు రాముఁడా! నీయందు ధర్మంబును సత్యంబును అన్నిసద్గుణంబులును ప్రతిష్ఠితము లయి యున్నవి. ౭

మహాబాహుఁడవగు రాముఁడా! అట్టి పరమధార్మికత మొదలగు గుణంబులు జితేంద్రియులయందుండును గాని మఱియొకరియందును ఉండవు నీవు జితేంద్రియుండవని నాకుఁ జక్కఁగాఁ దెలియును. ౮

వైరము లేకయే ప్రాణిహింససేయుట యనురౌద్రవ్యసనము అజ్ఞానంబునఁ బామరులచేఁ జేయఁబడును. అది నీ కిప్పుడు తటస్థించియున్నది. ౯

పరాక్రమశాలివగు రాముఁడా! నీవు దండకారణ్యంబున నుండు ఋషుల రక్షించుటకై రాక్షసుల నందఱ యుద్ధంబున వధించెద నని ప్రతిజ్ఞ గావించినావు. ౧౦

నీవు ఇందుకొఱకే తమ్మునితోఁగూడ ధనుర్బాణంబులు ధరించి యీదండకారణ్యంబునకు వచ్చినావు. ౧౧

అంత నీ విట్లు బయలువెడలుటం జూచి నీసత్యప్రతిజ్ఞతయు నీ క్షేమంబునుం గుఱించి యాలోచింప నామనస్సునకు మిక్కిలియుఁ జింతయగుచున్నది. ౧౨

పరాక్రమశాలివగు రాముఁడా! దండకారణ్యమునకుఁ బోవుటయందు నాకిష్టములేదు అందుకుఁగారణంబుఁ జెప్పెదను నామాటను వినుము. ౧౩

ధనుర్బాణంబులు దాల్చి తమ్మునితోఁగూడ వనంబునకు వచ్చిన నీవు వనంబుననుండు రాక్షసులంజూచినప్పుడు బాణంబులు విడుతువుగదా? ౧౪

అగ్నిహోత్రునకు సమీపంబునఁ గట్టెలున్నయెడ తేజస్సువృద్ధిఁబొందునట్లు క్షత్రియులకు సమీపంబున ధనుస్సున్నయెడఁ దేజస్సు వృద్ధిఁ బొందును ౧౫

పురా కిల మహాబాహో! తపస్వీ సత్యవా క్ఛుచిః, ౧౬
కస్మిం శ్చి దభవ త్పుణ్యే వనే రతమృగద్విజే.

త స్యైవ తపసో విఘ్నం కర్తు మిన్ద్ర శ్శచీపతి. ౧౭
ఖడ్గపాణి రథాగచ్ఛ దాశ్రమం భటరూపధృక్,
తస్మిం స్తదాశ్రమపదే నిశితః ఖడ్గ ఉత్తమః. ౧౮
స న్యాసవిధినా దత్తః పుణ్యే తపసి తిష్ఠతః,

స తచ్ఛస్త్ర మనుప్రాప్య న్యాసరక్షణతత్పరః ౧౯
వనే తం విచర త్యేవ రక్షన్ ప్రత్యయ మాత్మనః,

యత్ర గచ్ఛ త్యుపాదాతుం మూలాని చ ఫలాని చ. ౨౦
న వినా యాతి తం ఖడ్గం న్యాసరక్షణతత్పరః,

నిత్యం శస్త్రం పరివహ న్క్రమేణ స తపోధనః. ౨౧
చకార రౌద్రీం స్వాం బుద్ధిం త్యక్త్వా తపసి నిశ్చయమ్,
తత స్స రౌద్రేఽభిరతః ప్రమత్తో ధర్మకర్శితః. ౨౨
తస్య శస్త్రస్య సంవాసా జ్జగామ నరకం మునిః,
ఏవ మేత త్పురావృత్తం శస్త్రసంయోగకారణమ్. ౨౩

అగ్నిసంయోగవ ద్ధేతు శ్శస్త్రసంయోగ ఉచ్యతే,
స్నేహా చ్చ బహుమానా చ్చ స్మారయే త్వాం న శిక్షయే.

న కథంచన సా కార్యా గృహీతధనుషా త్వయా,
బుద్ధి ర్వైరం వినా హన్తుం రాక్షసా న్దణ్డకాశ్రితాన్. ౨౪

మహాబాహుండవగు రాముండా! మున్ను పుణ్యంబును, ఎల్లప్పుడు సంతుష్టంబులయియుండు మృగపక్షులతోఁ గూడినదియునగు నొకవనంబున సత్యవాదియుఁ బరిశుద్ధుఁడు నగు నొకమునివరుఁ డుండెను. ౧౬

అంత దేవేంద్రుఁడు ఆమునికి తపోవిఘ్నంబు సేయుటకై భటరూపంబుఁ దాల్చి కత్తి చేతంబూని యమ్ముని యాశ్రమమునకు వచ్చెను. ౧౭

అట్లు భటవేషధారియగు నింద్రుఁడు అయ్యాశ్రమంబున మహాతపస్సు గావించుచున్న యామహర్షికి దీని దాఁచియుంచి నే నడిగినప్పు డిమ్మని తీక్ష్ణంబగు నాఖడ్గంబు నొసంగెను. ౧౮

ఆమునివరుఁడు తనయొద్ద దాఁచనుంచినదాని రక్షించుటయం దాసక్తుఁడై తననమ్మకమును గాపాడుకొనుటకై యాఖడ్గము నేమఱక రక్షించుచు నే యడవిం దిరుగుచుండెను. ౧౯

అమ్మునివరుండు తనయొద్ద దాఁచనుంచినదాని రక్షించుటకై ఫలమూలంబులను సంగ్రహించుటకై యెచ్చటికిఁబోయినను ఆఖడ్గమును విడిచి పోఁడు. ౨౦

ఆఋషి యిట్లు ఎల్లప్పుడును ఆయుధమును ధరించుటచేతఁ దనతపస్సును వదలి హింసారూపమయిన రౌద్రబుద్ధిం బొందెను. ౨౧

అంత నమ్మహర్షి ఆయాయుధసంసర్గమువలనఁ బ్రాణిహింసారతుఁడై యొడలు తెలియక యధర్మం బాచరించుచుండి తుదకు నరకంబు నొందెను. ౨౨

ఇట్లు మున్ను ఆయుధసంపర్కంబున నమ్మునివరునకు అధర్మబుద్ధి గలిగి నాశము గలిగినది. ౨౩

ఆయుధసంసర్గము అగ్నిసంపర్కమువంటిదని పెద్దలు చెప్పెదరు.

నేను నీయందలిస్నేహంబునను నీవు నాయందుంచియుండు గౌరవంబునను నీకుఁ దెలిసినధర్మము నే జ్ఞాపకపఱచుచున్నానుగాని శిక్షించుటకుఁ జెప్పలేదు. ౨౪

నీవు ధనుర్ధరుఁడవయి నిరపరాధులగు దండకారణ్యమునందుండు రాక్షసుల నెట్లయినను వధింపవలదు. ౨౫

అపరాధం వినా హన్తుం లోకా న్వీర! న కామయే,

క్షత్త్రియాణాం తు వీరాణాం వనేషు నిరతాత్మనామ్. ౨౬
ధనుషా కార్య మేతావ దార్తానా మభిరక్షణమ్,

క్వచ శస్త్రం క్వచ వనం క్వచ క్షాత్త్రం తపః క్వచ. ౨౭
వ్యావిద్ధ మిద మస్మాభి ర్దేశధర్మ స్తు పూజ్యతామ్,

త దార్య కలుషా బుద్ధి ర్జాయతే శస్త్రసేవనాత్. ౨౮
పున ర్గత్వా త్వయోధ్యాయాం క్షత్త్రధర్మం చరిష్యసి,

అక్షయా తు భవే త్ప్రీతి శ్శ్వశ్రూశ్వశురయో ర్మమ. ౨౯
యది రాజ్యం పరిత్యజ్య భవే స్త్వం నిరతో మునిః,
ధర్మా దర్థః ప్రభవతి ధర్మా త్ప్రభవతే సుఖమ్. ౩౦
ధర్మేణ లభతే సర్వం ధర్మసార మిదం జగత్,
ఆత్మానం నియమై స్తైస్తైః కర్శయిత్వా ప్రయత్నతః. ౩౧
ప్రాప్యతే నిపుణై ర్ధర్మో న సుఖా ల్లభ్యతే సుఖమ్,

నిత్యం శుచిమతి స్సౌమ్య! చర ధర్మం తపోవనే. ౩౨
సర్వం హి విదితం తుభ్యం త్రైలోక్య మపి తత్త్వతః.
స్త్రీచాపలా దేత దుదాహృతం మే
ధర్మం చ వక్తుం తవ క స్సమర్థః,
విచార్య బుద్ధ్యా తు స హానుజేన
య ద్రోచతే త త్కురు మా చిరేణ. ౩౩

ఇతి శ్రీమదరణ్యకాణ్డే నవమ స్సర్గః.

---

పరాక్రమశాలివగు రాముఁడా! అపరాధములేక వ్యర్థముగాఁ బ్రాణులఁ జంప నా కిష్టములేదు.

వీరులగు క్షత్రియులకు తమయెదుట రాక్షసునిచేఁ బీడింపఁబడుచున్న ఋషులను రక్షించుటయే ధనుస్సుతోఁ జేయవలసినపని; రాక్షసుల నందఱను హింసించుటగాదు. ౨౬

ఆయుధ మెచ్చట? ఆరణ్యవాస మెచ్చట? క్షత్రియధర్మ మెచ్చట? తపం బెచ్చట? ఇవన్నియుఁ బరస్పరవిరుద్ధములు కాఁబట్టి మనము ఈయరణ్యప్రదేశమునందుఁ జేయఁదగిన తపస్సనెడు ధర్మమునే చేయుదము. ౨౭

పూజ్యుఁడవగు రాముఁడా! అట్లగుటవలన శస్త్రధారణముచేఁ బాపబుద్ధి గలుగునుగాన దానివదలి తపంబు గావింతము; మఱల నయోధ్యకుఁ బోయి యచ్చట క్షత్రియధర్మంబు నాచరింపవచ్చును. ౨౮

నీ వింక నెప్పటికిని రాజ్యమే యక్కఱలేదని మునివైయున్నచో నాకైకేయీదశరథుల కక్షయంబగు సంతోషంబునుం గలుగును ౨౯

ధర్మమువలన ధనము గలుగును; ధర్మమువలన సుఖంబునుం గలుగును; అట్లుధర్మంబువలననే సర్వంబునుంగలుగును; కావునఁ బ్రపంచమునకంతయు ధర్మమె ముఖ్యము. 30

సమర్థులగువారలు నానావిధప్రయత్నములచేఁ జాంద్రాయణాదివ్రతంబుల దేహంబుఁ గృశింపఁ జేసి ధర్మమును బొందెదరు. ఎన్నటికిని సుఖంబున సుఖంబు దొరకొనదు. 3౧

శాంతుఁడవగు రాముఁడా! అట్లు కావునఁ దపోవనంబుననుండి ధర్మంబు నాచరింపుము; ముల్లోకంబులయందును నీకుఁ దెలియని దేదియులేదు. 3౨

నేను స్త్రీచాపల్యంబున నీమాటం జెప్పితిని: నీకుఁగూడ ధర్మంబుపదేశింప నెవ్వఁడు సమర్థుఁడు? నీవు లక్ష్మణునితోఁగూడఁ జక్కఁగా నాలోచించి నీ కేదియిష్టమో దాని శీఘ్రముగాఁ గావింపుము. అని సీతాదేవి రామునకుం జెప్పెను. 33

ఇది తొమ్మిదవసర్గము.

## ద శ మ స్స ర్గః.

వాక్య మేత త్తు వై దేహ్యా వ్యాహృతం భ ర్తృభ క్తయా,
శ్రుత్వా ధర్మే స్థితో రామః ప్రత్యువా చాథ మైథిలీమ్. ౧
హిత ము క్తం త్వయా దేవి! స్నిగ్ధయా సదృశం వచః,
కులం వ్యపదిశన్త్యా చ ధర్మజ్ఞే! జన కాత్మజే!. ౨
కిం తు వక్ష్యా మ్యహం దేవి! త్వయై వో క్త మిదం వచః,
క్షత్రియై ర్ధార్యతే చాపో నా ర్తశబ్దో భ వేదితి. 3
తే చార్తా దణ్డకారణ్యే మునయ స్సంశితవ్రతాః,
మాం సీతే! స్వయ మాగమ్య శరణ్యా శ్శరణం గతాః. ౪
వసన్తో ధర్మనిరతా వనే మూలఫలాశనాః,
న లభ న్తే సుఖం భీతా రాక్షసైః క్రూరకర్మభిః. ౫

కాలేకాలే చ నిరతా నియమై ర్వివిధై ర్వనే,
భక్ష్య న్తే రాక్షసై ర్భీమై ర్నరమాంసోపజీవిభిః. ౬

తే భక్ష్యమాణా మునయో దణ్డకారణ్యవాసినః,
అస్మా నభ్యవప ద్యేతి మా మూచు ర్ద్విజస త్తమాః. ౭

మయా తు వచనం శ్రుత్వా తేషా మేవం ముఖా చ్చ్యుతమ్,
కృత్వా చరణశుశ్రూషాం వాక్య మేత దుదాహృతమ్. ౮
ప్రసీదన్తు భవన్తో మే హ్రీ రేషా హి మ మాతులా,
య దీదృశై రహం విప్రై రుపస్థేయై రుపస్థితః. ౯

కింకరో మీతి చ మయా వ్యాహృతం ద్విజసన్నిధౌ,

## పదియవసర్గము.

ధార్మికుఁడగు రాముఁడు పెనిమిటియం దధికభక్తిగల సీతాదేవి చెప్పి నమాటను విని యామెయిడం జూచి యిట్లని చెప్పెను. ౧

ధర్మజ్ఞురాల[illegible] జనకమహారాజుకొమార్తెవు నగుసీతా! నీకు నాయందుం గలస్నేహమునకును నీకులంబునకును దగునట్లు హితంబగు మాటం జెప్పితివి.

సీతాదేవీ! నే నేమి చెప్పవలయును? ఎవ్వరును ఆర్తులు కాఁగూడదని క్షత్రియులు ధనుస్సు ధరింతు రని నీవె చెప్పితివిగదా!. ౩

సీతా! తీక్ష్ణములగు వ్రతములు సేయువారలును శరణ్యులు నగు నాదండకారణ్యమునందలి మునులు వారలై యే నాయొద్దకువచ్చి శరణుచొచ్చినారు.

ధర్మపరాయణులై వనంబునఫలమూలంబుల నాహారంబుగాఁ గొనుచు నివాసము సేయుచుండు నామునులు క్రూరకర్ములగు రాక్షసులకు భయపడి సుఖంబు నొందఁజాల కున్నారు. ౫

మాంసాహారులగు భయంకరాకారు లయిన రాక్షసులు అడవియందు నానావిధవ్రతములు గావించుకొనుచుఁ దపస్సుచేయుచుండుమునులను బట్టి భక్షించుచున్నారు. ౬

దండకారణ్యమున నుండు బ్రాహ్మణోత్తములయిన యామునులు అట్లు రాక్షసులచే భక్షింపఁబడుచు బాధపడఁజాలక నాయొద్దకు వచ్చి "మమ్మను గ్రహింపుము" అని చెప్పిరి. ౭

నేను వారలుచెప్పిన మాటనువిని వారలపాదంబులకు వందనంబుగావించి యీమాటం జెప్పినాను. ౮

మీరలు నాయపచారమును క్షమింపుఁడు. నేను మీయొద్దకువచ్చి సేవ సేయవలసియుండఁగా నట్టిమహనీయులరగు మీరలు నాయొద్దకువచ్చి ప్రార్థించుచున్నా రనునది నాకు మిక్కిలియు సిగ్గుగా నున్నది. ౯

నే నేమిసేయవలయును? చెప్పుఁడు, అని యామునులయెదుట నేను జెప్పినాను.

సర్వై ర్వేతై స్సమాగమ్య వా గియం సముదాహృతా. ౧౦
రాక్షసై ర్దణ్డకారణ్యే బహుభిః కామరూపిభిః,
అర్దితా స్స్మ దృఢం రామ! భవా న్న స్తత్ర రక్షతు. ౧౧
హోమకాలేషు సమ్ప్రాప్తాః పర్వకాలేషు చానఘ!,
ధర్షయన్తి సుదుర్ధర్షా రాక్షసాః పిశితాశనాః. ౧౨

రాక్షసై ర్ధర్షితానాం చ తాపసానాం తపస్వినామ్,
గతిం మృగయమాణానాం భవా న్నః పరమా గతిః. ౧౩
కామం తపఃప్రభావేన శక్తా హన్తుం నిశాచరాన్,
చిరార్జితం తు నేచ్ఛామ స్తపః ఖణ్డయితుం వయమ్. ౧౪

బహువిఘ్నం తపో నిత్యం దుశ్చరం చైవ రాఘవ!,
తేన శాపం న ముఞ్చామో భక్ష్యమాణా శ్చ రాక్షసైః. ౧౫

త దర్ద్యమానా న్రక్షోభి ర్దణ్డకారణ్యవాసిభిః,
రక్ష న స్త్వం సహ భ్రాత్రా త్వన్నాథా హి వయం వనే. ౧౬

మయా చైత ద్వచ శ్శ్రుత్వా కార్త్స్న్యేన పరిపాలనమ్,
ఋషీణాం దణ్డకారణ్యే సంశ్రుతం జనకాత్మజే!. ౧౭

సంశ్రుత్య చ న శక్ష్యామి జీవమానః ప్రతిశ్రవమ్,
మునీనా మన్యథా కర్తుం సత్య మిష్టం హి మే సదా. ౧౮

అ ప్యహం జీవితం జహ్యాం త్వాం వా సీతే! సలక్ష్మణామ్,

అంత నామును లందఱును జేరి యీమాటం జెప్పిరి. ౧౦

రాముఁడా! దండకారణ్యంబునఁ గామరూపులగు రాక్షసులు పెక్కండ్రువచ్చి మమ్ముఁ జాల బాధించుచున్నారు; నీవు మమ్ము రక్షింపుము. ౧౧

పాపరహితుఁడవగు రాముఁడా! గృధ్రులును మాంసాశనులునగునారాక్షసులు హోమసమయంబులయందును దర్శపౌర్ణమాస్యాదియాగసమయముల యందును వచ్చి యాగంబులం జెఱచి మమ్ము బెదరించెదరు. ౧౨

రాక్షసులచే నానావిధములుగ బాధింపఁబడుచున్నవారలము శోచనీయులము దిక్కులేనివారలము నగు మాకు నీవె పరమగతివి. ౧౩

మేము తపోమహిమచే రాక్షసులఁజంపఁగలము. వాస్తవము. అయితే బహుకాలముగాఁ గష్టపడి సంపాదించినతపస్సు నశించునే యని యూరకున్నాము. ౧౪

రాముఁడా! తపస్సుచేయుట మిక్కిలియుఁ గష్టము; దానికి వేయివిఘ్నములు; అందువలన నింతకష్టపడి చేసినతపస్సును ధారపోయంజాలక రాక్షసులు భక్షించినను వారల శపింపకున్నాము. ౧౫

అందువలన నీవు లక్ష్మణుఁడును అట్లు దండకారణ్యవాసులచేఁ బీడింపఁబడుచున్న మమ్ము రక్షింపుఁడు. ఈయడవియందు మాకు మీరేకదా నాథులరు. మీరుదక్క మఱియెవ్వరున్నారు? అని ఋషులందఱు నాతోఁ జెప్పినారు. ౧౬

జనకమహారాజుకొమార్తెవగు సీతాదేవీ! నేను ఆఋషులమాటను విని దండకారణ్యంబునందలి ఋషులను అన్నివిధంబులను రక్షించెదనని ప్రతిజ్ఞ గావించినాను. ౧౭

నేను ప్రతిజ్ఞచేసినవెనుక బ్రతికియుండువఱకును మునులకుఁగాఁ జేసిన యీప్రతిజ్ఞఁ దప్పఁజాలను; నాకు సత్యము సర్వకాలావస్థలయందును బ్రియమని నీకుఁ దెలియునుగదా? ౧౮

సీతాదేవీ! నేను నాప్రాణముఁగాని నిన్నుఁగానిలక్ష్మణునిగానివిడుతును.

న తు ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః. ౧౯

త దవశ్యం మయా కార్య మృషీణాం పరిపాలనమ్,
అను క్తే నాపి వై దేహి! ప్రతిజ్ఞాయ తు కిం పునః. ౨౦

మమ స్నేహా చ్చ సౌహార్దా దిద ము క్తం త్వయాఽనఘే!,
పరితుష్టోఽస్మ్యహం సీతే! న హ్యనిష్టోఽనుశిష్యతే. ౨౧

సదృశం చానురూపం చ కులస్య తవ చాత్మనః,
సధర్మచారిణీ మే త్వం ప్రాణేభ్యోఽపి గరీయసీ. ౨౨
ఇ త్యేవ ముక్త్వా వచనం మహాత్మా
సీతాం ప్రియాం మైథిలరాజపుత్రీమ్,
రామో ధనుష్మాం సహ లక్ష్మణేన
జగామ రమ్యాణి తపోవనాని. ౨౩
ఇతి శ్రీమదరణ్యకాణ్డే దశమ స్సర్గః. ౧౦.

---

## ఏకాదశ స్సర్గః.

అగ్రతః ప్రయయౌ రామ స్సీతా మధ్యే సుమధ్యమా,
పృష్ఠత స్తు ధనుష్పాణి ర్లక్ష్మణోఽనుజగామ హ. ౧
తౌ పశ్యమానౌ వివిధా శ్శైలప్రస్థా న్వనాని చ,
నదీ శ్చ వివిధా రమ్యా జగ్మతు స్సీతయా సహ. ౨
సారసాం శ్చక్రవాకాం శ్చ నదీపులినచారిణః,
సరాంసి చ సపద్మాని యుక్తాని జలజైః ఖగైః. ౩

ఎవ్వనికేని ప్రతిజ్ఞచేసి యాప్రతిజ్ఞను మాత్రము విడువను అందును విశేషించి బ్రాహ్మణులకుఁ గావించినప్రతిజ్ఞను ఎంతమాత్రము విడువను. ౧౯

సీతాదేవీ! అందువలన ఋషులు నన్నడుగకపోయినను నే నవశ్యము వారలఁ బరిపాలింపవలసినది. అట్లుండఁగా వారలు నన్నుఁ బ్రార్థించి నేను ను రక్షించెద నని ప్రతిజ్ఞచేసియు నుండఁగాఁ జెప్పవలసిన దేమియున్నది?. పాపరహితవగు సీతాదేవీ! నీవు నాయందలి స్నేహంబువలనను సౌహార్దంబువలనను ఈమాటం జెప్పినావు; నాకు మిక్కిలియు సంతోషంబు గలిగినది; అందఱుఁ బ్రియుఁడైనవాని కుపదేశింతురుగాని యప్రియున కుపదేశింపరుగదా!. ౨౧

నీమాట నీకులంబునకును నీమనంబునకును అనురూపముగానున్నది; నీవు నాకుప్రాణంబులకన్న నధికురాలవు. అని రాముఁడు సీతతోఁ జెప్పెను. మహాత్ముండగు రాముఁడు జనకమహారాజుకొమార్తెయును బ్రియురాలును నగు సీతాదేవి కీప్రకారమునం జెప్పి ధనుర్ధరుఁడై లక్ష్మణునితోఁగూడ రమణీయంబులగు తపోవనంబులకుఁ బోయెను. ౨౩

ఇది పదియవసర్గము.

---

## పదునొకండవసర్గము.

రాముఁడు ముందటంబోయెను; సీతాదేవి నడుమనడచెను. అటువెనుక లక్ష్మణుఁడు ధనుర్ధరుఁడై వెంబడించెను. ౧

ఆరామలక్ష్మణులు నానావిధపర్వతసానువులను వనంబులను నానావిధంబులును రమణీయంబులు నగు నదుల యిసుకదిబ్బలపైఁ దిరుగునట్టిహంసపక్షులను జక్రవాకంబులను నానావిధజలపక్షులతోఁగూడినతామరకొలంకులనుగుంపులుగుంపులుగాఁగట్టియుండుజింకలను నుత్తమంబులగు నెనుపోతులను

యూథబద్ధాంశ్చ పృషతాన్మదోన్మత్తాన్విషాణినః,
మహిషాంశ్చ వరాహాంశ్చ నాగాంశ్చ ద్రుమవైరిణః.
తే గత్వా దూరమధ్వానం లమ్బమానే దివాకరే,
దదృశుస్సహితా రమ్యం తటాకం యోజనాయతమ్.
పద్మపుష్కరసమ్బాధం గజయూథైరలఙ్కృతమ్,
సారసైర్హంసకాదమ్బైస్సఙ్కులం జలచారిభిః.

ప్రసన్నసలిలే రమ్యే తస్మింస్సరసి శుశ్రువే,
గీతవాదిత్రనిర్ఘోషో న తు కశ్చన దృశ్యతే. ౭
తతః కౌతూహలాద్రామో లక్ష్మణశ్చ మహాబలః,
మునిం ధర్మభృతం నామ ప్రష్టుం సముపచక్రమే. ౮
ఇదమత్యద్భుతం శ్రుత్వా సర్వేషాం నో మహామునే!,
కౌతూహలం మహజ్జాతం కిమిదం సాధు కథ్యతామ్. ౯

వక్తవ్యం యది చేద్విప్ర! నాతిగుహ్యమపి ప్రభో!,

తేనైవముక్తో ధర్మాత్మా రాఘవేణ మునిస్తదా. ౧౦
ప్రభవం సరసః కృత్స్నమాఖ్యాతుముపచక్రమే,
ఇదం పఞ్చాప్సరో నామ తటాకం సార్వకాలికమ్. ౧౧
నిర్మితం తపసా రామ! మునినా మాణ్డకర్ణినా,

స హి తేపే తపస్తీవ్రం మాణ్డకర్ణిర్మహామునిః. ౧౨
దశవర్షసహస్రాణి వాయుభక్షో జలాశ్రయః,
తతః ప్రవ్యథితాస్సర్వే దేవాస్సాగ్నిపురోగమాః. ౧౩

వరాహంబులను వ్యాఘ్రంబులన్నియుం విలుచునట్టి యేనుంగులనుఁ జూచుచు సీతతోఁగూడఁ బోయిరి. ४

ఆసీతారామలక్ష్మణులు అట్లు బహుదూరముపోయి సూర్యుఁడస్తమింపఁబోవుసమయంబున రమణీయంబును నాలుగుప్రక్కలను యోజనప్రమాణవైశాల్యముగలదియుం నెత్తమ్మిదామరలచేతను దెల్లదామరలచేతను నిండియుండునదియుం తీరప్రదేశంబుల గజయూథంబులతోఁ గూడినదియుం మధురంబుగాఁ గూయుచుసారసపక్షులతోను రాజహంసలతోను గలహంసలతోను ఒప్పుచున్నదియు నగు నొకతటాకముం జూచిరి. ౫

నిర్మలజలముగల రమణీయమయిన యాకొలంకునుండి గీతవాద్యధ్వని వినఁబడుచుండినది. అందొకఁడును గానంబడఁడయ్యెను ౬

అంత రాముఁడును మహాబలుఁడగు లక్ష్మణుఁడును కౌతుకంబునంజేసి యాతటాకంబునుగుఱించి ధర్మభృత్తనుముని నడిగిరి. ౭

ధర్మభృత్తా! ఆశ్చర్యకరంబగు నీగీతవాద్యధ్వనిని విని మాకందఱకును దీనిసంగతిని విన వేడుకగలిగియున్నది. ఇదియేమి దీనిసంగతిం జక్కఁగాఁ జెప్పుము. ౮

ప్రభుఁడవగు ధర్మభృత్తా! ఇది చెప్పఁగూడనంత యతిరహస్యము గాకుండునేని చెప్పుము. అని రామలక్ష్మణులు ధర్మభృత్తు నడిగిరి.

ధర్మాత్ముఁడగు ధర్మభృత్తు రాముఁడు చెప్పినమాటను విని ఆసరస్సు పుట్టినవిధమంతయుఁ జెప్ప నారంభించెను. ౧౦

రాముఁడా! ఈతటాకము పంచాప్సరస్సని పేరుగలది. ఇది యెల్లప్పుడును ఇట్లు గీతవాద్యధ్వనితో నొప్పుచుండును. ఇది మాండకర్ణియను మహామునిచేఁ దపోబలంబున నిర్మితంబయ్యె. ౧౧

ఆమాండకర్ణిమహాముని పదివేలసంవత్సరములు వాయువే యాహారంబుగా జలంబుననుండి తీవ్రంబగు తపంబు గావించెను.

అంత నగ్నిహోత్రుఁడు మున్నుగా సమస్తదేవతలును బరమదుఃఖి

అబ్రువ న్వచనం సర్వే పరస్పరసమాగతాః,
అస్మాకం కస్యచిత్ స్థాన మేష ప్రార్థయతే మునిః. ౧౪

ఇతి సంవిగ్నమనస స్సర్వే తే త్రిదివౌకసః,

తత్ర కర్తుం తపోవిఘ్నం దేవై స్సర్వై ర్నియోజితాః. ౧౫
ప్రధానాప్సరసః పఞ్చ విద్యుచ్చలితవర్చసః,

అప్సరోభి స్తత స్తాభి ర్ముని ర్దృష్టపరావరః. ౧౬
నీతో మదనవశ్యత్వం సురాణాం కార్యసిద్ధయే,
తా శ్చైవాప్సరసః పఞ్చ మునేః పత్నీత్వ మాగతాః. ౧౭
తటాకే నిర్మితం తాసా మస్మి న్నన్తర్హితం గృహమ్,

తత్రై వాప్సరసః పఞ్చ నివసన్త్యో యథాసుఖమ్. ౧౮
రమయన్తి తపోయోగా న్మునిం యౌవన మాస్థితమ్,

తాసాం సంక్రీడమానానా మేష వాదిత్రనిస్వనః. ౧౯
శ్రూయతే భూషణోన్మిశ్రో గీతశబ్దో మనోహరః,

ఆశ్చర్య మితి తస్యైత ద్వచనం భావితాత్మనః. ౨౦
రాఘవః ప్రతిజగ్రాహ సహ భ్రాత్రా మహాయశాః,
ఏవం కథయమానస్య దదర్శాఽఽశ్రమమణ్డలమ్. ౨౧
కుశచీరపరిక్షిప్తం బ్రాహ్మ్యా లక్ష్మ్యా సమావృతమ్,
ప్రవిశ్య సహ వైదేహ్యా లక్ష్మణేన చ రాఘవః. ౨౨
ఉవాస మునిభి స్సర్వైః పూజ్యమానో మహాయశాః,

తులయి యొండొరులంగూడి యిట్లని చెప్పుకొనిరి. ౧౩

ఈమాండకర్ణి మహాముని మనలో నొకని స్థానమును బొందఁగోరుచు న్నాఁడు. అని దేవతలు పరస్పరము చెప్పుకొనిరి. ౧౪

ఆదేవత లందఱు ఇట్లు ఒండొరులతోఁ జెప్పుకొని మిక్కిలియు భయముఁ జెందిరి.

అప్పుడు దేవత లందఱును మెఱుపులంబోలెఁ దళుకుతళుక్కుమను దేహకాంతిగల యుత్తమలయిన యయిదుగురప్సరస్త్రీల నమ్మాండకర్ణికిం దపోవిఘ్నంబు సేయ నియోగించిరి. ౧౫

అంత నాయప్సరసలు దేవకార్యసిద్ధ్యర్థము యమ్మాండకర్ణిని మన్మథాధీనుం గావించిరి. ౧౬

ఆయప్సరస లయిదుగురును ఆమ్మాండకర్ణి మహామునికి భార్యలయిరి. ఈతటాకములోన ఆయప్సరసలకు గృహంబు అంతర్హితంబుగా నిర్మింపఁబడినది.

అట్లు ఆయయిదుగురు దప్సరసలకును ఈతటాకాంతర్గృహంబుల సుఖంబుగా నివసించుచుఁ దపోబలంబున యౌవనరూపంబు దాల్చియున్న యమ్మాండకర్ణికి సంతోషంబు సేయుచున్నారు. ౧౭

అప్సరస్త్రీలు క్రీడింపుచుండుటవలన మనోహరంబును భూషణధ్వని మిశ్రంబునగు సంగీతవాద్యధ్వని వినఁబడుచున్నది. అని ధర్మభృత్తు రామలక్ష్మణులకుఁ జెప్పెను. ౧౮

మహాయశుఁడగు రాముఁడును లక్ష్మణుఁడును బరమాత్మవేత్తయగు నాధర్మభృత్తు చెప్పినమాటనువిని మిక్కిలియు నాశ్చర్యపడిరి. ౨౦

ఇట్లాధర్మభృత్తు చెప్పుచుండఁగానే రాముఁడు దర్భలతోను నారచీరలతోను ఒప్పుచున్నదియు బ్రాహ్మణసమృద్ధంబునగు నాశ్రమసమూహముం జూచెను. ౨౧

మహాయశుఁడగు రాముఁడు సీతాలక్ష్మణసహితుఁడై యయ్యాశ్రమంబులం బ్రవేశించి సమస్తమునులచేతనుం బూజితుఁడై సుఖంబుననుండెను.

తథా తస్మింత్స కాకుత్స్థ శ్శ్రీమ త్యాశ్రమమణ్డలే. ౨౩
ఉషిత్వా తు సుఖం తత్ర పూజ్యమానో మహర్షిభిః,
జగామ చాశ్రమాం స్తేషాం పర్యాయేణ తపస్వినామ్. ౨౪
యేషా ముషితవా న్పూర్వం సకాశే స మహాస్త్రవిత్,
క్వచి త్పరిదశా న్మాసా నేకం సంవత్సరం క్వచిత్. ౨౫
క్వచి చ్చ చతురో మాసా న్పఞ్చ షట్చాపరా న్క్వచిత్,
అపర త్రాధికం మాసా దప్యర్ధ మధికం క్వచిత్. ౨౬
త్రీ న్మాసా నష్ట మాసాం శ్చ రాఘవో న్యవస త్సుఖమ్,

తథా సంవసత స్తస్య మునీనా మాశ్రమేషు వై. ౨౭
రమత శ్చానుకూల్యేన యయు స్సంవత్సరా దశ,

పరివృత్య చ ధర్మజ్ఞో రాఘవ స్సహ సీతయా. ౨౮
సుతీక్ష్ణ స్యాశ్రమం శ్రీమా న్పున రేవాజగామ హ,
స త మాశ్రమ మాసాద్య మునిభిః ప్రతిపూజితః. ౨౯
తత్రాపి న్యవస ద్రామః కంచి త్కాల మరిన్దమః,

తదాఽఽశ్రమస్థో వినయా త్కదాచి త్తం మహామునిమ్. ౩౦
ఉపాసీన స్స కాకుత్స్థ స్సుతీక్ష్ణ మిద మబ్రవీత్,
అస్మి న్నరణ్యే భగవా నగస్త్యో మునిస త్తమః. ౩౧
వస తీతి మయా నిత్యం కథాః కథయతాం శ్రుతమ్,
న తు జానామి తం దేశం వనస్యాస్య మహ త్తయా. ౩౨

మహాస్త్రవేత్తయగు రాముఁడు శ్రీమంతంబగు నయ్యాశ్రమమండలంబున మహర్షులచేఁ బూజింపఁబడుచు సుఖంబుననుండి రాక్షసబాధఁ బోఁగొట్టుటకై యొక్కొకమహర్షియాశ్రమమునకు రెండేసిమాఱులుపోయి వాసంబు గావించెను. ౨౩,౨౪

రాముఁ డొకయాశ్రమంబునఁ బదుమూఁడుమాసంబులును ఒకయాశ్రమంబున నొకసంవత్సరంబును ఒకచోట నాలుగుమాసంబులును ఒకచోట నైదుమాసంబులును నొకయాశ్రమంబుల నాఱుమాసంబులును ఒకయాశ్రమంబున నేడుమాసంబులును ఒకచోట నొకటియుఁ బాతికమాసంబును మఱియొకచోట ముప్పాతికమాసంబును నొకచోట మూఁడుమాసంబులును మఱియొకయాశ్రమంబున నెనిమిదిమాసంబులును సుఖంబుగా నివసింపుచుండెను. ౨౫,౨౬

అట్లు ఆరాముఁడు ఆమునుల ప్రతియాశ్రమమునందును రెండేసిమార్లు వాసముసేయుచు సంతోషంబునం గ్రీడింపుచుండఁగాఁ బదిసంవత్సరము లయినవి. ౨౭

ధర్మవేత్తయు శ్రీమంతుఁడునగు రాముఁడు సీతతోఁగూడి నయ్యాశ్రమంబులన్నియుఁ దిరిగి మఱల సుతీక్ష్ణమహామునియాశ్రమంబునకువచ్చెను.

శత్రువుల నడంగఁ ద్రొక్కఁజాలినట్టి యారాముఁడు ఆసుతీక్ష్ణమహామునియాశ్రమంబునకువచ్చి మునులచేఁ బూజితుఁడై యచ్చటను గొంతకాలము నివసించెను. ౨౯

అంత రాముఁడు అయ్యాశ్రమంబుననుండి యొకానొకప్పుడు వినయంబున నాసుతీక్ష్ణమహామునిం జూచి యిట్లని చెప్పెను. ౩౦

ఈయరణ్యమునందే భగవంతుఁడగు నగస్త్యుఁడున్నాఁడని వారువారు చెప్పుకొనుటవలన విన్నాను. ౩౧

ఈవనంబు మిక్కిలియు గొప్పదిగావున నాప్రదేశ మేదో నాకుఁ దెలియదు. ౩౨

కుత్రాఽఽశ్రమపదం పుణ్యం మహర్షే స్తస్య ధీమతః,
ప్రసాదా త్తత్ర భవత స్సానుజ స్సహ సీతయా. 33
అగస్త్య మభిగచ్ఛేయ మభివాదయితుం మునిమ్,

మనోరథో మహా నేష హృది మే పరివర్తతే. 34
య ద్యహం తం మునివరం శుశ్రూషేయ మపి స్వయమ్,
ఇతి రామస్య స ముని శ్శ్రుత్వా ధర్మాత్మనో వచః. 35
సుతీక్ష్ణః ప్రత్యువా చేదం ప్రీతో దశరథాత్మజమ్,
అహ మ ప్యేత దేవ త్వాం వక్తుకామ స్సలక్ష్మణమ్. 36
అగస్త్య మభిగ చ్ఛేతి సీతయా సహ రాఘవ!,
దిష్ట్యా త్విదానీ మర్థేఽస్మిం స్త్వయ మేవ బ్రవీషి మామ్. 37
అహ మాఖ్యామి తే వత్స! య త్రాగస్త్యో మహామునిః,
యోజనా న్యాశ్రమా దస్మా త్తథా చత్వారి వై తతః. 38
దక్షిణేన మహాన్ శ్రీమా నగస్త్యభ్రాతు రాశ్రమః,

స్థలప్రాయే వనోద్దేశే పిప్పలీవనశోభితే. 39
బహుపుష్పఫలే రమ్యే నానాశకునినాదితే,

పద్మిన్యో వివిధా స్తత్ర ప్రసన్నసలిలా శ్శివాః. 40
హంసకారణ్డవాకీర్ణా శ్చక్రవాకోపశోభితాః,

త త్రైకాం రజనీం వ్యుష్య ప్రభాతే రామ! గమ్యతామ్. 41

దక్షిణాం దిశ మాస్థాయ వనషణ్డస్య పార్శ్వతః,
త త్రాగస్త్యాశ్రమపదం గత్వా యోజన మంతరా. 42

బుద్ధిమంతుఁడగు నాయగస్త్యమహర్షి యాశ్రమ మెచ్చటనున్నది?. నీ వనుగ్రహించి యాయగస్త్యాశ్రమంబుండు ప్రదేశముం జెప్పితివేని నేను సీతాలక్ష్మణులతోఁగూడ నాయగస్త్యమహామునికి వందనంబు గావించుటకై యచ్చటికిఁ బోయెదను. ౩౩

ఆయగస్త్యమహామునికి శుశ్రూష చేయవలయునని నామనంబున పెద్దకోరిక యున్నది. అని రాముఁడు సుతీక్ష్ణమహామునితోఁ జెప్పెను. ౩౪

సుతీక్ష్ణమహాముని ధర్మాత్ముఁడగు రాముఁడు చెప్పినమాటనువిని సంతుష్టుఁడై రాముం జూచి యిట్లని చెప్పెను. ౩౫

రాముఁడా నేనును సీతతోఁగూడ నగస్త్యమహామునియొద్దకుఁ బొండనియే నీకును లక్ష్మణునకును జెప్పవలెనని తలంచి యుంటిని. ౩౬

భాగ్యవశంబున నీవె యిప్పుడు నన్నడిగితివి; కాఁబట్టి అగస్త్యమహామునియుండు ప్రదేశమును నీకుం జెప్పెదను వినుము. ౩౭

. ఇచ్చటనుండి దక్షిణపుదిక్కువైపున నాలుగామడలదూరము పోయినవెనుక నచ్చట అగస్త్యునితమ్ముండగు సుదర్శనమహాముని యాశ్రమంబున్నది. ౩౮

ఆయాశ్రమము పెక్కుపుష్పములును ఫలములును గలదియు రమణీయంబును మధురంబుగాఁ గూయుచుండునానావిధపక్షులుగలదియుఁ బిప్పలీవనశోభితంబునగు స్థలప్రాయవనప్రదేశంబున నున్నది. ౩౯

అచ్చట నిర్మలంబులగు జలంబులుగలవియు హంసలు నీరుకోళ్లు చక్రవాకంబులు మొదలగుపక్షులచే నొప్పుచున్నవియునగు నానావిధంబులయిన తామరకొలంకులు గలవు. ౪౦

రాముఁడా! ఆసుదర్శనాశ్రమమునందు ఒకరాత్రి యుండి ప్రాతఃకాలంబునఁ బొమ్ము. ౪౧

అచ్చటనుండి దక్షిణదిక్కుఁబట్టి వనసమూహమునకుఁ బ్రక్క నొకామడదూరము పోయిన నచ్చట నగస్త్యాశ్రమ మున్నది. ౪౨

రమణీయే వనోద్దేశే బహుపాదపసంవృతే,
రంస్యతే తత్ర వైదేహీ లక్ష్మణశ్చ సహ త్వయా. ౪౩

స హి రమ్యో వనోద్దేశో బహుపాదపసఙ్కులః,

యది బుద్ధిః కృతా ద్రష్టు మగస్త్యం తం మహామునిమ్. ౪౪
అద్యైవ గమనే బుద్ధిం రోచయస్వ మహాయశః!,

ఇతి రామో మునే శ్శ్రుత్వా సహ భ్రాత్రాఽభివాద్య చ. ౪౫
ప్రతస్థేఽగస్త్య ముద్దిశ్య సానుజ స్సహ సీతయా,

పశ్య న్వనాని రమ్యాణి పర్వతాం శ్చాభ్రసన్నిభాన్. ౪౬
సరాంసి సరిత శ్చైవ పథి మార్గవశానుగాః,
సుతీక్ష్ణే నోపదిష్టేన గత్వా తేన పథా సుఖమ్. ౪౭
ఇదం పరమసంహృష్టో వాక్యం లక్ష్మణ మబ్రవీత్,
ఏత దేవాశ్రమపదం నూనం తస్య మహాత్మనః. ౪౮
అగస్త్యస్య మునే ర్భ్రాతు ర్దృశ్యతే పుణ్యకర్మణః,
యథాహి మే వన స్యాస్య జ్ఞాతాః పథి సహస్రశః. ౪౯
సన్నతాః ఫలభారేణ పుష్పభారేణ చ ద్రుమాః,
పిప్పలీనాం చ పక్వానాం వనా దస్మా దుపాగతః. ౫౦
గన్ధోఽయం పవనోత్క్షిప్త స్సహసా కటుకోదయః,
తత్ర తత్ర చ దృశ్యన్తే సంక్షిప్తాః కాష్ఠసంచయాః. ౫౧
లూనా శ్చ పథి దృశ్యన్తే దర్భా వైడూర్యవర్చసః,
ఏతచ్చ వనమధ్యస్థం కృష్ణాభ్రశిఖరోపమమ్. ౫౨
పావక స్యాశ్రమస్థస్య ధూమాగ్రం సంప్రదృశ్యతే,

ఆయగస్త్యాశ్రమంబున రమణీయంబును బెక్కువృక్షములతోఁగూడి నదియు నగువనంబునందు నీవును సీతయును లక్ష్మణుఁడును క్రీడింపుచుండఁగలరు. ౪౩

ఆవనప్రదేశము పెక్కువృక్షములతోఁ గూడి రమణీయములయి యుండును.

మహాయశుఁడవగు రాముఁడా! ఆయగస్త్యమహామునిం జూడఁ గోర్కెయుండు నేని యిప్పుడే యచ్చటికి బయలుదేఱిపొమ్ము. అని సుతీక్ష్ణమహాముని రామునితోఁ జెప్పెను. ౪౪

రాముఁడు సుతీక్ష్ణమహాముని చెప్పినమాటను విని లక్ష్మణునితోఁగూడ నాయనకు నమస్కరించి యంత సీతాలక్ష్మణులంగూడి యగస్త్యాశ్రమంబును గూర్చిపోయెను. ౪౫

రాముఁడు మార్గంబున నుండినట్టి రమణీయంబులగు వనంబులను మేఘంబులవంటిపర్వతంబులను కొలంకులను నదులనుఁ జూచుచు సుతీక్ష్ణమహాముని చెప్పినమార్గంబుననే సుఖంబుగాఁ బోయి పరమసంతుష్టుఁడై లక్ష్మణుం జూచి యీమాటం జెప్పెను. ౪౬,౪౭

మహాత్ముఁడును బుణ్యకర్ముఁడును అగస్త్యమహామునితమ్ముండు నగు నాసుదర్శనమహామునియాశ్రమం బిదే; ఇందుకు సందేహము లేదు. ౪౮

సుతీక్ష్ణమహాముని నాకు గుఱుతుచెప్పినట్లు మార్గంబున ఫలపుష్పభారంబున నమ్రంబులయిన పిప్పలీవృక్షంబులు కనుపట్టుచున్నవి. ౪౯

మఱియు నీవనంబుననుండి చక్కఁగాబండియుండు పిప్పలీఫలంబుల వగరు వాసనయు గాలికిఁ గొట్టుచున్నది. ౫౦

అచ్చటచ్చట ఋషులచేసంగ్రహింపఁబడిన కట్టెలు రాసులుగఁ బడియున్నవి; మార్గంబున ఋషులచేఁ గోయఁబడిన వైడూర్యమణులకాంతి వంటికాంతిగల దర్భమొక్కలు గనఁబడుచున్నవి. ౫౧

నల్లనిమేఘంబువంటిదగు నాశ్రమాగ్నిహోత్రధూమంబును ఈవనమధ్యంబుననుండి యగపడుచున్నది. ౫౨

వివిధేషు చ తీర్థేషు కృతస్నానా ద్విజాతయః. ౪౩
పుష్పోపహారం కుర్వన్తి కుసుమై స్స్వయ మార్జితైః,
తత్సుతీక్ష్ణస్య వచనం యథా సౌమ్య! మయా శ్రుతమ్. ౪౪
అగస్త్యస్యాశ్రమో భ్రాతు ర్నూన మేవ భవిష్యతి,

నిగృహ్య తపసా మృత్యుం లోకానాం హితకామ్యయా. ౪౫
యస్య భ్రాత్రా కృతేయం దిక్ఛరణ్యా పుణ్యకర్మణా,

ఇహైకదా కిల క్రూరో వాతాపి రపి చేల్వలః. ౪౬
భ్రాతరౌ సహితా వాస్తాం బ్రాహ్మణఘ్నౌ మహాసురౌ,
ధారయ న్బ్రాహ్మణం రూప మిల్వల స్సంస్కృతం వదన్. ౪౭
ఆమన్త్రయతి విప్రాన్ స్మ శ్రాద్ధ ముద్దిశ్య నిర్ఘృణః,
భ్రాతరం సంస్కృతం కృత్వా తత స్తం మేషరూపిణమ్ ౪౮
తాన్ ద్విజా న్భోజయామాస శ్రాద్ధదృష్టేన కర్మణా,

తతో భుక్తవతాం తేషాం విప్రాణా మిల్వలోఽబ్రవీత్. ౪౯
వాతాపే! నిష్క్రమస్వేతి స్వరేణ మహతా వదన్,
తతో భ్రాతు ర్వచ శ్శ్రుత్వా వాతాపి ర్మేషవ న్నదన్. ౫౦
భిత్త్వాభిత్త్వా శరీరాణి బ్రాహ్మణానాం వినిష్పతత్,
బ్రాహ్మణానాం సహస్రాణి తై రేవం కామరూపిభిః. ౫౧
వినాశితాని సంహత్య నిత్యశః పిశితాశనైః,
అగస్త్యేన తదా దేవైః ప్రార్థితేన మహర్షిణా. ౫౨
అనుభూయ కిల శ్రాద్ధే భక్షిత స్స మహాసురః,
తత స్సమ్పన్న మిత్యుక్త్వా దత్త్వా హస్తోదకం తతః. ౫౩

బ్రాహ్మణులు అర్ఘ్యపుణ్యతీర్థములందు స్నానముగావించి తమచేతులారఁ గోసికొన్న పూలచేఁ బుష్పబలిం గావింపుచున్నారు. ౫౩

శాంతుఁడవగు లక్ష్మణుఁడా! సుతీక్ష్ణమహామునిచెప్పిన మాటలప్రకారము ఇదియె యగస్త్యమహాముని తమ్ముఁడగు సుదర్శనమహాముని యాశ్రమము. నిశ్చయము. ౫౪

ఈసుదర్శనునియన్న పుణ్యాత్ముఁడగు నగస్త్యమహాముని లోకహితంబుపొంటె తపోబలంబున మరణంబును గూడ నిగ్రహించి యిల్వలవాతాపులను రాక్షసుల వధించి యీదక్షిణదిక్కును ఋషులకు వాసయోగ్యము గావించెను. ౫౫

ఇచ్చట మున్ను ఇల్వలవాతాపులను నన్నదమ్ము లిద్దఱు రాక్షసులు బ్రాహ్మణులం జంపుచుండిరి. ౫౬

నిర్దయుఁడగు నిల్వలుండను బ్రాహ్మణరూపము ధరించి సంస్కృతభాష మాటలాడుచు బ్రాహ్మణులం బిలుచును. ౫౭

అంత నాయిల్వలుండు మేఁకరూపమునొందిన తనతమ్ముని వాతాపిని వండి శ్రాద్ధముసేయువిధంబుననే యాబ్రాహ్మణులకుఁ జక్కఁగాఁ దినిపించును. ౫౮

అంత నాబ్రాహ్మణు లందఱు భుజించినపిమ్మట నిల్వలుఁడు "వాతాపీ! నీ వింక రమ్ము" అని పేరెలుంగునం జెప్పెను. ౫౯

అంత వాతాపి యిల్వలుని మాటను విన్నంతనే మేఁకయుంబోలె నఱచుచు బ్రాహ్మణశరీరంబులఁ జీల్చుకొని వెడలివచ్చును. ౬౦

కామరూపులును మాంసాశనులు నగు నాయిల్వలవాతాపులు ఇట్లు పట్టుకుఁ బెక్కువేలబ్రాహ్మణులం జంపియున్నారు. ౬౧

అంత నగస్త్యమహాముని దేవతాప్రార్థితుండై యిల్వలుని యామంత్రణంబున కియ్యకొని క్రమప్రకారంబున వాతాపిని భక్షించెను. ౬౨

అంత శ్రాద్ధాంతంబున నాయిల్వలుఁడును తృప్తియయినదా! యని

భ్రాతరం నిష్క్రమస్వేతి చేల్వల స్సోఽభ్యభాషత,

స తం తథా భాషమాణం భ్రాతరం విప్రఘాతినమ్. ౬౪
అబ్రవీ త్ప్రహస న్ధీమా నగస్త్యో మునిస త్తమః,
కుతో నిష్క్రమితుం శక్తి ర్మయా జీర్ణస్య రక్షసః. ౬౫
భ్రాతు స్తే మేషరూపస్య గతస్య యమసాదనమ్,

అథ తస్య వచ శ్శ్రుత్వా భ్రాతు ర్నిధనసంశ్రయమ్. ౬౬
ప్రధర్షయితు మారేభే మునిం క్రోధా న్నిశాచరః,
సోఽభిద్రవ న్మునిశ్రేష్ఠం మునినా దీప్తతేజసా. ౬౭
చక్షుషాఽనలకల్పేన నిర్దగ్ధో నిధనం గతః,
తస్యాయ మాశ్రమో భ్రాతు స్తటాకవనశోభితః. ౬౮
విప్రానుకమ్పయా యేన కర్మేదం దుష్కరం కృతమ్,

ఏవం కథయమానస్య తస్య సౌమిత్రిణా సహ. ౬౯
రామ స్యాస్తం గత స్సూర్య స్సన్ధ్యాకాలోఽభ్యవర్తత,
ఉపాస్య పశ్చిమాం సన్ధ్యాం సహ భ్రాత్రా యథావిధి. ౭౦
ప్రవివే శాఽశ్రమపదం త మృషిం సోఽభ్యవాదయత్,

సమ్య క్ప్రతిగృహీత శ్చ మునినా తేన రాఘవః. ౭౧
న్యవస త్తాం నిశా మేకాంప్రాశ్య మూలఫలాని చ,

తస్యాం రాత్ర్యాం వ్యతీతాయాం విమలే సూర్యమణ్డలే. ౭౨
భ్రాతరం త మగస్త్యస్య హ్యామన్త్రయత రాఘవః,

యగస్త్యు నడిగి యయినదని యమ్మహర్షి వచింపుడు నాయన కుత్తరాపోశ
నం బొసంగి తమ్ముఁడగు వాతాపిని నీ వింక రమ్మని యథాక్రమముగాఁ
బిలిచెను. ౭౩

బుద్ధిమంతుఁ డగు నాయగస్త్యమహాముని యిట్లు తమ్మునిఁ జీరుచు
న్న బ్రాహ్మణఘాతియగు నాయిల్వలుం జూచి నవ్వుచు నిట్లని చెప్పెను. ౭౪
మేఁకరూపముధరించిన నీతమ్ముఁడు వాతాపినాయుదరంబున జీర్ణించి
యమునిగృహంబుఁ జేరియున్నాఁడే ఇంక నతం డెట్లు వెడలివచ్చును ? అని
యగస్త్యమహాముని యిల్వలునితోఁ జెప్పెను. ౭౫

అంత నాయిల్వలుండు ఆయగస్త్యుఁడు తమ్మునిచావుఁ జెప్పుటనువిని
పరమకుపితుఁడై యగస్త్యునిపై కుఱికెను. ౭౬

ఆయిల్వలుఁడు మునివరుఁడగు నయ్యగస్త్యునిపైకిఁ బోయి మహా
తేజుఁడగు నమ్మునిచే నేత్రానలంబున దగ్ధుఁడై మృతిఁ బొందెను. ౭౭

తటాకవనసంపన్నంబగు నీయాశ్రమ ఏమహాత్ముఁడు బ్రాహ్మణులయం
దు దయచే నిట్టి దుష్కరకార్యంబు గావించెనో అట్టి యగస్త్యమహాముని
తమ్ముఁడు సుదర్శనమునియాశ్రమము అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను.

అట్లు రాముఁడు లక్ష్మణునితో మాటలాడుచుండఁగానే సూర్యుఁడస్త
మించెను. సంధ్యాసమయంబును వచ్చినది. ౭౯

రాముఁడు లక్ష్మణునితోఁగూడ సాయంసంధ్యావందనము యథావిధి
గఁ గావించి యయ్యాశ్రంబుఁ బ్రవేశించి యాసుదర్శనమహర్షికి నమస్క
రించెను. ౮౦

రాముఁడు సుదర్శనమహామునిచేఁ జక్కఁగాఁ బూజింపఁబడినవాఁ
డై యాయన యొసంగిన ఫలమూలంబుల భుజించి యారాత్రియంతయు
నచ్చట నుండెను. ౮౧

అంతఁ దెల్లవాఱినవెనుక సూర్యుఁడు స్వచ్ఛముగాఁ బ్రకాశింప రా
ముఁడు అగస్త్యమహామునితమ్ముఁడగు సుదర్శనమహామునితోఁ బోయివచ్చెద
నని చెప్పెను. ౮౨

అభివాదయే త్వాం భగవన్! సుఖ మధ్యుషితో నిశామ్.
ఆమన్త్రయే త్వాం గచ్ఛామి గురుం తే ద్రష్టు మగ్రజమ్,

గమ్యతా మితి తే నోక్తో జగామ రఘునన్దనః. ౭౪
యథోద్దిష్టేన మార్గేణ వనం త చ్చావలోకయన్,
నీవారా న్పనసాం స్తాలాం స్తినిశా న్వఞ్జులా న్ధవాన్. ౭౫
చిరిబిల్వా న్మధూకాం శ్చ బిల్వా నపిచ తిన్దుకాన్,
పుష్పితా న్పుష్పితాగ్రాభి ర్లతాభి రనువేష్టితాన్. ౭౬
దదర్శ రామ శ్శతశ స్తత్ర కాన్తారపాదపాన్,
హ స్తిహస్తై ర్విమృదితా న్వానరై రుపశోభితాన్. ౭౭
మత్తై శ్శకునిసంఘై శ్చ శతశ శ్చ ప్రణాదితాన్,
తతో௨బ్రవీ త్సమీపస్థం రామో రాజీవలోచనః. ౭౮
పృష్ఠతో௨నుగతం వీరం లక్ష్మణం లక్ష్మివర్ధనమ్,

స్నిగ్ధపత్రా యథా వృక్షా యథా క్షాన్తా మృగద్విజాః. ౭౯
ఆశ్రమో నాతిదూరస్థో మహర్షే ర్భావితా௨త్మనః,

అగస్త్య ఇతి విఖ్యాతో లోకే స్వే నైవ కర్మణా. ౮౦
ఆశ్రమోదృశ్యతే తస్య పరిశ్రాన్తశ్రమాపహః,
ప్రాజ్యధూమాకులవన శ్చీరమాలాపరిష్కృతః. ౮౧
ప్రశాన్తమృగయూథ శ్చ నానాశకునినాదితః,
తస్యేద మాశ్రమపదం ప్రభావా ద్యస్య రాక్షసైః. ౮౨
దిగియం దక్షిణా త్రాసా ద్దృశ్యతే నోపభుజ్యతే,

భగవంతుఁడవగు సుదర్శనమహామునీ! నీకు నమస్కారంబు గావించె
దను; రాత్రి యంతయు నిచ్చట సుఖంబుగ నుంటిని; నీయాచార్యుఁడును
అన్నయు నగు నగస్త్యమహామునిం జూడఁగోరెదను, పోయివచ్చెదను సెల
వొసంగుము అని రాముఁ డగస్త్యునితమ్మునితోఁ జెప్పెను. ౭౩

ఆసుదర్శనమహాముని పొమ్మని యనుజ్ఞయొసంగ నారాముఁడు ఆయ
డవింజూచుచు సుతీక్ష్ణమహాముని చెప్పినమార్గంబునం బోయెను. ౭౪

రాముఁడడవియందు ఏనుఁగుతొండంబుల విఱువఁబడినవియు, గోఁతు
లతో నొప్పుచున్నవియు, మదించి మధురంబుగాఁ గూయుచుండు పక్షుల
తోఁ గూడినవియుఁ, బుష్పితంబులును బుష్పితాగ్రంబులగులతలచే వేష్టితం
బులునగు నడవివృక్షంబులను మఱియు నీవారంబులను బనసవృక్షంబులను
దాటిచెట్లను దిసాసపుఁజెట్లను బొగడచెట్లను జంద్రవృక్షంబులను గానుగ
చెట్లను ఇప్పచెట్లను బిల్వవృక్షంబులను దుమ్మికిచెట్లనుం జూచెను. ౭౫-౭౭

అంతఁ దామరపూలవంటి నేత్రంబులుగలరాముఁడు తనసమీపంబున
నున్నవాఁడును దనవెంబడి వచ్చినవాఁడును బరాక్రమవంతుఁడును సంపద్వ
ర్ధనుఁడు నగు లక్ష్మణుం జూచి యిట్లని చెప్పెను. ౭౮

వృక్షంబు లన్నియు స్నిగ్ధంబులయిన యాకులుగలిగియుండుటయు
మృగపక్షులు శాంతంబులయి యుండుటయుం జూడఁగా భావితాత్ముఁడగు
నయ్యగస్త్యమహాముని యాశ్రమంబు సమీపించినదని తోఁచుచున్నది.

ఎవ్వఁడు వింధ్యపర్వతమును స్తంభించుటంజేసి యగస్త్యుఁడని లోకం
బులం బ్రసిద్ధుఁడయ్యె నట్టి మహామునిదైన పరిశ్రాంతులశ్రమమును బోఁగొ
ట్టునదియు నధికమయిన పొగచే వ్యాప్తమగు వనముగలదియు నారచీరలచే
నొప్పుచున్నదియు ప్రశాంతములగు మృగములుగలదియు నానావిధపక్షి
నాదితంబు నగు నాశ్రమంబు చూపట్టుచున్నది. ౮౦,౮౧

ఏమహాముని ప్రభావమువలన రాక్షసులు ఈదక్షిణపుదిక్కును భయం
బునం జూతురుగాని యుపభోగింపరో అట్టియగస్త్యమహాముని యాశ్ర
మం బిది. ౮౨

యదాప్రభృతి చాక్రాన్తా దిగియం పుణ్యకర్మణా. ౭౩
తదాప్రభృతి నిర్వైరాః ప్రశాన్తా రజనీచరాః,
నామ్నా చేయం భగవతో దక్షిణా దిక్ప్రదక్షిణా. ౭౪
ప్రథితా త్రిషు లోకేషు దుర్ధర్షా క్రూరకర్మభిః,
మార్గం నిరోద్ధుం నిరతో భాస్కర స్యాచలోత్తమః. ౭౫
నిదేశం పాలయ న్యస్య విన్ధ్యశ్శైలో న వర్ధతే,
అయం దీర్ఘాయుష స్తస్య లోకే విశ్రుతకర్మణః. ౭౬
అగస్త్య స్యాఽఽశ్రమ శ్శ్రీమా న్వినీతజనసేవితః,
ఏష లోకార్చిత స్సాధు ర్హితే నిత్యరత స్సతామ్. ౭౭
అస్మా నభిగతా నేష శ్రేయసా యోజయిష్యతి,

ఆరాధయిష్యా మ్యత్రాహ మగస్త్యం తం మహామునిమ్. ౭౮
శేషం చ వనవాసస్య సౌమ్య! వత్స్యా మ్యహం ప్రభో!,
అత్ర దేవా స్సగన్ధర్వా స్సిద్ధాశ్చ పరమర్షయః. ౭౯
అగస్త్యం నియతాహారం సతతం పర్యుపాసతే,

నాత్ర జీవే న్మృషావాదీ క్రూరో వా యది వా శఠః. ౮౦
నృశంసః కామవృత్తో వా ముని రేష తథావిధః,

అత్ర దేవా శ్చ యక్షా శ్చ నాగా శ్చ పతగై స్సహ. ౮౧
వసన్తి నియతాహారా ధర్మ మారాధయిష్ణవః,
అత్ర సిద్ధా మహాత్మానో విమానై స్సూర్యసన్నిభైః. ౮౨
త్యక్తదేహా నవై ర్దేహైః స్వర్యాతాః పరమర్షయః,

యక్షత్వ మమరత్వం చ రాజ్యాని వివిధాని చ. ౮౩

పుణ్యకర్ముండగు నగస్త్యమహర్షి యీదక్షిణదిక్కున నివసింప నారం
భించినది మొదలు రాక్షసులు ఋషులపై వైరంబు విడిచి శాంతులయిరి ౮౩

ఈదక్షిణదిక్కు భగవంతుఁడగు నగస్త్యనామంబున నగస్త్యదిక్కని
పేరుఁబొంది రాక్షసులకు దుర్ధర్షమయి ముల్లోకంబులను బ్రసిద్ధిఁబొందినది.

శ్రీమంతంబును వినీతజనసేవితంబు నగు నీయాశ్రమము సూర్యమా
ర్గంబు నిరోధింప నుద్యుక్తమయిన పర్వతశ్రేష్ఠమగు వింధ్యపర్వతము ఎవ్వని
యాజ్ఞచే వృద్ధిఁబొందక నిలిచెనో అట్టి సుప్రసిద్ధకర్ముఁడును చిరంజీవియు నగు
నగస్త్యమహాముని యాశ్రమము. ౮౪,౮౫

అగస్త్యుఁడు సమస్తలోకపూజితుఁడు సత్పురుషుఁడు ఎల్లప్పు
డును సత్పురుషులకు హితంబు గావించువాఁడు. మన మతని బొందినచో
మనకు శ్రేయస్సు గావించును. ౮౬

శాంతుఁడనగు లక్ష్మణుఁడా! కావున నీయాశ్రమంబుననే యియ్య
గస్త్యమహాముని నారాధింపుచు నిచ్చటనే వనవాసశేషకాలం బుండెదను.

ఈయాశ్రమంబున దేవతలును గంధర్వులును సిద్ధులును మహర్షులును
ఆహారంబు నిగ్రహించి తపస్సు గావించుచున్నయగస్త్యమహాముని నెల్ల
ప్పుడు నుపాసించుచున్నారు. ౮౭

అసత్యముఁ జెప్పువాఁడు గాని క్రూరుఁడు గాని వంచకుఁడు గాని
ఘాతుకుఁడు గాని శాస్త్రనియమంబు విడిచి యథేచ్ఛముగా నాచరించువాఁడు
గాని యీయాశ్రమంబున జీవింపఁడు. ఈయగస్త్యునిమహిమ యట్టిది ౯౦

దేవతలును యక్షులును నాగములును పక్షులును యాహారము వర్జించి
ధర్మము నారాధింపుచు నీయాశ్రమంబున వాసము సేయుచున్నారు. ౯౧

మహాత్ములగు మహర్షులు పెక్కండ్రు ఈయాశ్రమంబునఁ దపస్సు గా
వించి సిద్ధులయి మానుషదేహంబు విడిచి నూతనమయిన దేవతాదేహంబు దాల్చి
సూర్యసమానంబులగు విమానంబుల నారోహించి స్వర్గంబు నొందిరి. ౯౨

ఈయాశ్రమమున నారాధించువారలకు దేవతలు యక్షత్వమును దేవ

అత్ర దేవాః ప్రముచ్ఛన్తి భూతాని గాంధితా శ్శుభైః,
ఆగతాః స్మాఽశ్రమపదం సౌమిత్రే! ప్రవిశాగ్రతః. ౯౪
నివేద యేహ మాం ప్రాప్త మృషయే సీతయా సహ.

ఇతి శ్రీమదరణ్యకాణ్డే ఏకాదశ స్సర్గః. ౧౧.

## ద్వాదశ స్సర్గః.

స ప్రవిశ్యాఽశ్రమపదం లక్ష్మణో రాఘవానుజః,
అగస్త్యశిష్య మాసాద్య వాక్య మేత దువాచ హ. ౧
రాజా దశరథో నామ జ్యేష్ఠ స్తస్య సుతో బలీ,
రామః ప్రాప్తో మునిం ద్రష్టుం భార్యయా సహ సీతయా. ౨

లక్ష్మణో నామ త స్యాహం భ్రాతా త్వవరజో హితః,
అనుకూల శ్చ భక్త శ్చ యది తే శ్రోత్ర మాగతః. ౩
తే వయం వన మత్యుగ్రం ప్రవిష్టాః పితృశాసనాత్,
ద్రష్టుమిచ్ఛామహే సర్వే భగవన్తం నివేద్యతామ్. ౪

తస్య తద్వచనం శ్రుత్వా లక్ష్మణస్య తపోధనః,
తథే త్యుక్త్వాఽగ్నిశరణం ప్రవివేశ నివేదితుమ్. ౫
స ప్రవిశ్య మునిశ్రేష్ఠం తపసా దుష్ప్రధర్షణమ్,
కృతాఞ్జలి రువా చేదం రామాగమనమఞ్జసా. ౬
యథోక్తం లక్ష్మణే నైవ శిష్యోఽగస్త్యస్య సమ్మతః,

పుత్త్రౌ దశరథ స్యేమౌ రామో లక్ష్మణ ఏవచ. ౭
ప్రవిష్టా వాఽశ్రమపదం సీతయా సహ భార్యయా,

త్వమును నానావిధరాజ్యాధిపత్యములను ఇచ్చెదరు. ౯౩

లక్ష్మణుఁడా! అగస్త్యాశ్రమమునకు వచ్చినాము. నీవు ముందుపోయి ఇచ్చటికి సీతతోఁగూడ నేను వచ్చియుండుటను అమ్మహర్షికిం దెలుపుము. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౯౪

ఇది పదునొకండవసర్గము.

---

## పండ్రెండవసర్గము.

రామునితమ్ముఁడగు లక్ష్మణుఁడు అగస్త్యాశ్రమంబుఁ బ్రవేశించి యగస్త్యునిశిష్యునియొద్దకుఁ బోయి యిట్లని చెప్పెను. ౧

దశరథుఁడను రాజొకఁడుగలఁడు; అతనిజ్యేష్ఠకుమారుఁడు బలవంతుఁడును నగురాముఁడు అగస్త్యమహామునిం జూచుటకై భార్యయగు సీతతోఁగూడ వచ్చినాఁడు. ౨

నేను లక్ష్మణుఁడనుపేరుగలవాఁడను. ఆరామునికిఁ దమ్ముఁడను ఇష్టుఁడను అనుకూలుఁడను భక్తుఁడను. నీవును వినియుందువు. ౩

మేము మున్వ్రతమును మాతండ్రియాజ్ఞవలన భయంకరంబగు నరణ్యమునకు వచ్చినాము; మేమందఱమును భగవంతుఁడగు నగస్త్యుఁ జూడఁగోరియున్నాము. ఆ మునకుఁ దెల్పుము. అని లక్ష్మణుఁడగస్త్యశిష్యునకుఁ జెప్పెను.

అగస్త్యశిష్యుఁడా లక్ష్మణునిమాటను విని అట్లె యనిచెప్పి అగస్త్యునకు విన్నవించుటకై యగ్నిహోత్రగృహములోనికిఁ బోయెను. ౪

ఆయగస్త్యప్రియశిష్యుఁడు అట్లు అగ్నిహోత్రగృహంబుఁజొచ్చి శీఘ్రంబున మహామునింజూచి లక్ష్మణుఁడు చెప్పినపద్ధతిని రామాగమనంబును గుఱించి యిట్లని చెప్పెను. ౫

దశరథమహారాజకుమారులగు రామలక్ష్మణు లిద్దఱు రామభార్యయగు సీతతోడంగూడి మనయాశ్రమంబునకు వచ్చియున్నారు. ౬

శత్రువుల నణఁగఁద్రొక్కఁజాలిన యారామలక్ష్మణులు నిన్నుఁజూచి

ద్రష్టుం భవన్త మాయాతౌ శుశ్రూషార్థ మరిన్దమౌ. ౮
య దత్రానన్తరం తత్త్వ మాజ్ఞాపయితు మర్హసి,
తత శ్శిష్యా దుపశ్రుత్య ప్రాప్తం రామం సలక్ష్మణమ్. ౯
వైదేహీం చ మహాభాగా మిదం వచన మబ్రవీత్,
దిష్ట్యా రామ శ్చిర స్యాద్య ద్రష్టుం మాం సముపాగతః. ౧౦
మనసా కాఙ్క్షితం హ్యస్య మయా ప్యాగమనం ప్రతి,

గమ్యతాం సత్కృతో రామ స్సభార్య స్సహలక్ష్మణః. ౧౧
ప్రవేశ్యతాం సమీపం మే కిం చాసౌ న ప్రవేశితః,

ఏవ ముక్తస్తు మునినా ధర్మజ్ఞేన మహాత్మనా. ౧౨
అభివాద్యాబ్రవీ చ్ఛిష్య స్తథేతి నియతాఞ్జలిః,
తతో నిష్క్రమ్య సమ్భ్రాన్త శ్శిష్యో లక్ష్మణ మబ్రవీత్. ౧౩
క్వాసౌ రామో మునిం ద్రష్టు మేతు ప్రవిశతు స్వయమ్,

తతో గత్వాఽఽశ్రమద్వారం శిష్యేణ సహలక్ష్మణః. ౧౪
దర్శయామాస కాకుత్స్థం సీతాం చ జనకాత్మజామ్,
తం శిష్యః ప్రశ్రితో వాక్య మగస్త్యవచనం బ్రువన్. ౧౫
ప్రావేశయ ద్యథాన్యాయ్యం సత్కారార్హం సుసత్కృతమ్,
ప్రవివేశ తతో రామ స్సీతయా సహలక్ష్మణః. ౧౬
ప్రశాన్తహరిణాకీర్ణ మాశ్రమం హ్యవలోకయన్,
స తత్ర బ్రహ్మణః స్థాన మగ్నేః స్థానం తథైవ చ. ౧౭
విష్ణోః స్థానం మహేన్ద్రస్య స్థానం చైవ వివస్వతః,
సోమస్థానం భగస్థానం స్థానం కౌబేర మేవ చ. ౧౮
ధాతు ర్విధాతుః స్థానే చ వాయోః స్థానం తథైవ చ,

సేవింపవలెనని వచ్చినారు; ఇంక నీవిషయమునందుఁ జేయవలసినదాని నాన
తిమ్ము అని శిష్యుఁడగస్త్యునితోఁ జెప్పెను. ౮

అంత నయ్యగస్త్యమహర్షి రామలక్ష్మణులును మహాభాగయగు సీతాదే
వియు వచ్చుటను శిష్యునివలన విని శిష్యుం జూచి యిట్లని చెప్పెను. ౯

నాభాగ్యవశంబున బహుకాలంబునకు రాముఁడు నన్నుఁజూడ
నిచ్చటికి వచ్చెను; రాముఁడు వచ్చునని బహుకాలముగా మనంబున నెదురు
చూచుచుంటిని. ౧౦

నీవు పొమ్ము. సీతయు లక్ష్మణుఁడును రాముఁడును వీరలు పూజార్హులు
వారల రానిమ్ము. ఇంతకుమును పే యేల నీవు రానీయక జాగు చేసినావు? అని
యగస్త్యుఁడు శిష్యునితోఁ జెప్పెను. ౧౧

మహాత్ముఁడును ధర్మజ్ఞుఁడునగు నయ్యగస్త్యమహాముని చెప్పినమాటను
విని శిష్యుఁడు నమస్కరించి చేతులు మొగుడ్చుకొని ఆజ్ఞ యని చెప్పెను.

అంతశిష్యుఁడు వేగంబునంబోయి లక్ష్మణుం జూచి యిట్లని చెప్పెను.

రాముఁడెచ్చట నున్నాఁడు? అగస్త్యమహామునింజూచుటకు ఆయన
వచ్చుఁగాక; శీఘ్రముగా రానిమ్ము అని శిష్యుఁడు లక్ష్మణునితోఁ జెప్పెను.

అంత లక్ష్మణుఁడు శిష్యునితోఁగూడ నాశ్రమద్వారంబు నొద్దకుఁ
బోయి సీతారాముల సతినికిఁ జూపెను. ౧౪

శిష్యుఁడు వినయంబునఁ బూజార్హుఁడగు రాముని యథాన్యాయం
బుగా గౌరవం బేర్పడ నాశ్రమంబులోనికిం దీసికొనిపోయెను. ౧౫

అంత రాముఁడు సీతాలక్ష్మణసహితుండై శాంతంబులగు జింకలతోఁ
గూడిన యయ్యాశ్రమంబుఁ జూచుచుఁ బ్రవేశించెను. ౧౬

ఆయగస్త్యాశ్రమమునందు బ్రహ్మదేవునిస్థానంబును, అగ్నిస్థానంబును,
విష్ణుస్థానంబును, దేవేంద్రస్థానంబును, సూర్యస్థానంబును, చంద్రస్థానంబును,
భగస్థానంబును, కుబేరస్థానంబును, ధాతృస్థానంబును, విధాతృస్థానంబును,
వాయుస్థానంబును, శేషస్థానంబును, మహాత్ముఁడగు ననంతునిస్థానంబును,

నాగరాజస్య చ స్థాన మన న్తస్య మహాత్మనః. ౧౯
స్థానం త థైవ గాయత్ర్యా వసూనాం స్థాన మేవచ,
స్థానం చ పాశహ స్తస్య వరుణస్య మహాత్మనః. ౨౦
కా ర్తికేయస్య చ స్థానం ధర్మస్థానం చ పశ్యతి,
స తు శ్శిష్యైః పరివృతో ముని ర ప్యభినిష్పతత్. ౨౧
తం దద ర్శాగ్రతో రామో మునీనాం దీ ప్తతేజసామ్,

అబ్రవీ ద్వచనం వీరో లక్ష్మణం లక్ష్మివర్ధనమ్. ౨౨

ఏష లక్ష్మణ! నిష్క్రామ త్యగస్త్యో భగవా నృషిః,
ఔదార్యే ణావగచ్ఛామి నిధానం తపసా మిమమ్. ౨౩

ఏవ ముక్త్వా మహాబాహు రగ స్త్యం సూర్యవర్చసమ్,
జగ్రాహ పరమప్రీత స్తస్య పాదౌ పర న్తపః. ౨౪

అభివాద్య తు ధర్మాత్మా తస్థౌ రామః కృతాఞ్జలిః,
సీతయా సహ వైదేహ్యా తదా రామ స్సలక్ష్మణః. ౨౫
ప్రతిజగ్రాహ కాకుత్స్థ మర్చయిత్వాఽఽసనోదకైః,
కుశలప్రశ్న ముక్త్వా చ ఆస్యతా మితి చాబ్రవీత్. ౨౬
అగ్నిం హుత్వా ప్రదా యార్ఘ్య మతిథీ న్ప్రతిపూజ్య చ,
వానప్రస్థేన ధర్మేణ స తేషాం భోజనం దదౌ. ౨౭

ప్రథమం చోపవి శ్యాథ ధర్మజ్ఞో మునిపుఙ్గవః,
ఉవాచ రామ మాసీనం ప్రాఞ్జలిం ధర్మకోవిదమ్. ౨౮

గాయత్రీస్థానంబును, వసుస్థానంబును, మహాత్ముఁడును బాశహస్తుఁడునగు వరుణునిస్థానంబును, గుమారస్వామిస్థానంబును ధర్మస్థానంబును జూచుచుఁ బోయెను. ౨౦

అంత నగస్త్యమహామునియు శిష్యులతోఁగూడ రాము నెదుర్కొని వచ్చెను. రాముఁడు మహాతేజస్సంపన్నులగు మునుల యగ్రభాగంబున వచ్చుచున్న యగస్త్యమహామునిం జూచెను. ౨౧

పరాక్రమవంతుఁడగు రాముఁడు సంపద్వర్ధనుఁడయిన లక్ష్మణుంజూచి యిట్లని చెప్పెను. ౨౨

లక్ష్మణుఁడా! ఇదిగో భగవంతుఁడగు నగస్త్యుఁడు వచ్చుచున్నాఁడు. ఈతని తేజోవిశేషముచేత నితఁడు తపోనిధియగు నగస్త్యుఁడని గనుగొంటిని అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౨౩

ఇట్లు శత్రువులఁ దపింపఁజేయునట్టి మహాబాహుఁడగు రాముఁడు సూర్యునకుంబోలె దేజస్సుగల యగస్త్యుం గురించి నుడువుచు బరమసంతుష్టుఁడై యమ్మహామునిం బొంది యాయనపాదంబుల కభివందనంబు గావించెను. ౨౪

అప్పుడును ధర్మాత్ముఁడగు రాముఁడు సీతాలక్ష్మణులతోఁగూడ నయ్యగస్త్యమహామునికి నమస్కరించి చేతులు మొగిడ్చుకొని నిలుచుండెను. ౨౫

అయ్యగస్త్యుఁడు రాము నతిథిగాఁ బ్రతిగ్రహించి ఆసనంబొసంగి యర్ఘ్యపాద్యంబులఁ బూజించి కుశలం బడిగి కూర్చుండుమని చెప్పెను.

ఆయగస్త్యుఁడు వైశ్వదేవము గావించి యాయతిథుల నర్ఘ్యాదులఁ బూజించి వారలకు వానప్రస్థధర్మంబున ఫలమూలాద్యాహారముల నొసంగెను ౨౬

అంత ధర్మజ్ఞుఁడగు నగస్త్యమహర్షి యందఱును గూర్చుండినపిమ్మట చేతులు మొగిడ్చుకొని కూర్చుండియున్న ధర్మకోవిదుఁడగు రాముం జూచి యిట్లని చెప్పెను. ౨౭

అగ్నిం హుత్వా ప్రదాయార్ఘ్య మతిథిం ప్రతిపూజయేత్,
అన్యథా ఖలు కాకుత్స్థ! తపస్వీ సముదాచరన్.
దుస్సాక్షీవ పరే లోకే స్వాని మాంసాని భక్షయేత్,

రాజా సర్వస్య లోకస్య ధర్మచారీ మహారథః.
పూజనీయ శ్చ మాన్య శ్చ భవా న్ప్రాప్తః ప్రియాతిథిః

ఏవ ముక్త్వా ఫలై ర్మూలైః పుష్పై రన్యై శ్చ రాఘవమ్
పూజయిత్వా యథాకామం పున రేవ తతోఽబ్రవీత్,

ఇదం దివ్యం మహ చ్చాపం హేమరత్నవిభూషితమ్.
వైష్ణవం పురుషవ్యాఘ్ర! నిర్మితం విశ్వకర్మణా,
అమోఘ స్సూర్యసఙ్కాశో బ్రహ్మదత్త శ్శరోత్తమః.

దత్తౌ మమ మహేన్ద్రేణ తూణీ చాక్షయసాయకౌ,
సంపూర్ణౌ నిశితై ర్బాణై ర్జ్వలద్భి రివ పావకైః.
మహారజతకోశోఽయ మసి ర్హేమవిభూషితః,

అనేన ధనుషా రామ! హత్వా సంఖ్యే మహాసురాన్.
ఆజహార శ్రియం దీప్తాం పురా విష్ణు ర్దివౌకసామ్,
త ద్ధను స్తౌ చ తూణీరౌ శరం ఖడ్గం చ మానద!.
జయాయ ప్రతిగృహ్ణీష్వ వజ్రం వజ్రధరో యథా,

వైశ్వదేవముచేసి యర్ఘ్యమునొసంగి యతిథిని బూజింపవలయును.

రాముఁడా! ఋషియగువాఁడు అట్లు అతిథిపూజగావింపఁడేని తప్పు. సాక్ష్యము చెప్పినవాఁడువలెఁ బరలోకంబునఁ దనమాంసంబు దానే భక్షించును. ౨౯

సమస్తలోకంబులకును బ్రభుఁడవును ధార్మికుఁడవును మహారథుఁడవును బూజనీయుఁడవును మాన్యుఁడవు నగు. ప్రియాతిథివైన నీవు వచ్చిన ప్పుడు విశేషించి పూజింపవలయునని చెప్పనేల? అని యగస్త్యుఁడు రామునితోఁ జెప్పెను. ౩౦

ఆయగస్త్యుఁడు ఈప్రకారమునం జెప్పి ఫలమూలంబులను బుష్పంబులను ఇతరంబులగు వన్యద్రవ్యంబులను యథావిధిగ రామం బూజించి మరల నిట్లని చెప్పెను. ౩౧

పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! రత్నకాంచనాలంకృతంబును దివ్యంబును బూజ్యంబునగు నీధనుస్సు విష్ణుదేవునిది. విశ్వకర్మచే నిర్మింపఁబడినది.

సూర్యసమానంబగు నీబాణోత్తమము అమోఘమయినది బ్రహ్మదేవునిచే నీయఁబడినది. ౩౩

మండుచున్న యగ్నిహోత్రమువంటి బాణంబులనిండిన యీయక్షయబాణతూణీరంబులు రెండును నాకు దేవేంద్రుఁడొసంగినవి. ౩౪

బంగారుతోఁజేయఁబడిన యొరగలదియు బంగారముతో నలంకరింపఁబడినదియు నగు నీఖడ్గమును నాకు దేవేంద్రుఁడొసంగెను.

రాముఁడా! మున్ను విష్ణుదేవుఁడు ఈధనుస్సునసే యుద్ధంబున నసురుల వధించి దేవతలకు రాజ్యలక్ష్మిని గలుగఁజేసెను. ౩౫

ఆశ్రితమానమును గాపాడునట్టి రాముఁడా! ఆధనుస్సును ఆయమ్ముల పొదులను ఆదేఖడ్గమును బాణంబును దేవేంద్రుఁడు వజ్రాయుధంబుంబోలె శత్రువిజయార్థమయి ప్రతిగ్రహింపుము. అని యగస్త్యుఁడు రామునితోఁ జెప్పెను. ౩౬

ఏవ ముక్త్వా మహాతేజా స్సమ స్తం తద్వరాయుధమ్.
దత్త్వా రామాయ భగవా నగ స్త్య స్పున రబ్రవీత్.

ఇతి శ్రీమదరణ్యకాణ్డే ద్వాదశ స్సర్గః.

---

## త్రయోదశ స్సర్గః

రామ! ప్రీతోఽస్మి భద్రం తే పరితుష్టోఽస్మి లక్ష్మణ!,
అభివాదయితుం యన్మాం ప్రాప్తౌ స్థ స్సహ సీతయా.

అధ్వశ్రమేణ వాం ఖేదో బాధతే ప్రచురశ్రమః,
వ్యక్త ముత్కణ్ఠతే చాపి మైథిలీ జనకాఽత్మజా.

ఏషా హి సుకుమారీ చ దుఃఖై శ్చ న విమానితా,
ప్రాజ్యదోషం వనం ప్రాప్తా భర్తృస్నేహప్రచోదితా.

యథైషా రమతే రామ! ఇహ సీతా తథా కురు,
దుష్కరం కృతవ త్యేషా వనే త్వా మనుగచ్ఛతీ.

ఏషా హి ప్రకృతిః స్త్రీణా మాసృష్టే రఘునన్దన!,
సమస్థ మనురజ్య న్తి విషమస్థం త్యజ న్తి చ.

శతహ్రదానాం లోలత్వం శస్త్రాణాం తీక్ష్ణతాం తథా,
గరుడానిలయో శ్శైఘ్ర్య మనుగచ్ఛ న్తి యోషితః.

ఇయం తు భవతో భార్యా దోషై రేతై ర్వివర్జితా,

మహాతేజుఁడును భగవంతుఁడునగు నగస్త్యమహాముని యిట్లుచెప్పి రామున కాయుత్తమాయుధంబుల నొసంగి మఱల నిట్లని పలికెను.

ఇది పండ్రెండవసర్గము.

---

## పదుమూఁడవసర్గము.

రాముఁడా! లక్ష్మణుఁడా! మీరలు సీతతోఁగూడ నన్ను నమస్కరించుటకై యిచ్చటికి వచ్చినారలు కావున నేను మిక్కిలియు సంతోషించితిని. మీకు మంగళ మగుఁగాక. ౧

మీకు మార్గాయాసంబున మిక్కిలియుఁ జెమటపోసి యెచ్చుగా నలసటగలిగియున్నది. జనకపుత్త్రియగు సీతాదేవి మఱియు నలసి విశ్రాంతి నపేక్షించు చున్నది. ౨

సుకుమారమయిన దేహముగలదియు నెప్పుడును దుఃఖము నెఱుంగనిదియునగు నీసీత పెనిమిటివగు నీయందలి స్నేహంబున నానావిధదుఃఖాకరంబగు నడవికి వచ్చినది. ౩

రాముఁడా! అట్టి యీసీతాదేవియీయాశ్రమంబున నెట్లుసంతోషంబు నొందునో అట్లు గావింపుము. ఈబిడ నీతో నడవికివచ్చుటచే దుష్కరంబగు కార్యంబు గావించినది. ౪

రాముఁడా! స్త్రీలు పెనిమిటి చక్కఁగా నుండునప్పుడు అతనిపై ననురక్తులయి యుందురు, దుర్దశం బొందునేని యతనిఁ బరిత్యజింతురు; ఇది సృష్టియయినది మొదలు స్త్రీలస్వభావముగా నున్నది. ౫

స్త్రీలు మెఱుపులవంబోలెఁ జాంచల్యంబుఁ గలిగియుందురు; ఖడ్గాద్యాయుధంబులతైక్ష్ణ్యముంబోని క్రౌర్యంబున బహుకాలముగాఁ గల్గియుండు స్నేహబంధముం దెంచుకొందురు; గరుడానిలవేగమువంటి వేగంబున విచారింపక సాహసించి కార్యంబులు సేయుదురు. ౬

నీభార్యయగు నీసీతాదేవి మాత్రము అట్టిదోషంబు లేవియు లేనిదై

శ్లాఘ్యా చ వ్యపదేశ్యా చ యథా దేవీ హ్యరున్ధతీ. ౭

అలఙ్కృతో౽యం దేశశ్చ యత్ర సౌమిత్రిణా సహ,
వైదేహ్యా చానయా రామ! వత్స్యసి త్వ మరిన్దమ!. ౮

ఏవ ముక్త స్తు మునినా రాఘవ స్సంయతాఞ్జలిః,
ఉవాచ ప్రశ్రితం వాక్య మృషిం దీప్త మివానలమ్. ౯
ధన్యో౽స్మ్యనుగృహీతో౽స్మి యస్య మే మునిపుఙ్గవః,
గుణై స్సభ్రాతృభార్యస్య వరదః పరితుష్యతి. ౧౦

కింతు వ్యాదిశ మే దేశం సోదకం బహుకాననమ్,
యత్రా౽౽శ్రమపదం కృత్వా వసేయం నిరత స్సుఖమ్. ౧౧

తతో౽బ్రవీ న్మునిశ్రేష్ఠ శ్శ్రుత్వా రామస్య తద్వచః,
ధ్యాత్వా ముహూర్తం ధర్మాత్మా ధీరో ధీరతరం వచః. ౧౨

ఇతో ద్వియోజనే తాత! బహుమూలఫలోదకః,
దేశో బహుమృగ శ్శ్రీమా న్పఞ్చవ ట్యభివిశ్రుతః. ౧౩

తత్ర గత్వా౽౽శ్రమపదం కృత్వా సౌమిత్రిణా సహ,
రంస్యసే త్వం పితు ర్వాక్యం యథోక్త మనుపాలయన్. ౧౪
కాలో౽యం గతభూయిష్ఠో యః కాల స్తవ రాఘవ!,
సమయో యో నరేన్ద్రేణ కృతో దశరథేన తే. ౧౫

యరుంధతీదేవియుంబోలె శ్లాఘనీయురాలుఁ బతివ్రతాగ్రగణ్యయు నై యున్నది. ౭

శత్రువుల నడఁగఁద్రొక్కఁజాలిన రాముఁడా! నీవు లక్ష్మణునితోను ఇట్టి పతివ్రతాశిరోమణియగు సీతాదేవితోనుంగూడ నివాసముగావించుటం జేసి యీ దేశము అలంకృత మగుచున్నది. అని యగస్త్యుఁడు రామునితోఁ జెప్పెను. ౮

రాముఁడు అగస్త్యమహామునిమాటనువిని చేమోడ్పుగీలించి దీప్తాగ్ని హోత్రుండువలెనున్న యమ్మహర్షిం జూచి వినయంబున నిట్లని చెప్పెను. ౯

నాతమ్మునిగుణంబులను నాభార్యగుణంబులను నాగుణంబులనుఁజూచి వరదుఁడవు మునిశ్రేష్ఠుఁడవు నగు నీవు మెచ్చుకొంటివి కావున నేను ధన్యుఁడను ఈశ్వరానుగ్రహంబు గలవాఁడ నైతిని. ౧౦

ఇఁక నేమన్నను ఎచ్చట నాశ్రమంబుకావించుకొని యేకాగ్రంబుగ సుఖంబున నుండఁగలనో అట్టి జలసమృద్ధంబును బహువనసమేతంబునగు ప్రదేశమును నాకుఁ జెప్పుము. అని రాముఁడు అగస్త్యునితోఁ జెప్పెను. ౧౧

అంత ధర్మాత్ముఁడును బుద్ధిమంతుఁడును మునిశ్రేష్ఠుఁడునగు నగస్త్యమహాముని రామునిమాటను వినిజరగవలసినవిశేషంబులను గుఱించి కొంచెము సేపు ధ్యానించి నిశ్చయించి యీమాటం జెప్పెను. ౧౨

నాయనా! ఇచ్చటికి రెండుయోజనంబులదూరంబున నెచ్చోగా మూల ఫలోదకంబులు కలదియు నధికంబుగా మృగంబులు గలదియు శ్రీమంతంబునగు పంచవటియనుప్రదేశ మొకటి గలదు. ౧౩

నీవు సీతాలక్ష్మణులంగూడి యచ్చటికిఁబోయి యాశ్రమంబు గావించుకొని తండ్రియాజ్ఞను బాలింపుచుఁ గ్రీడింపుచుండఁగలవు. ౧౪

రాముఁడా! నీకు దశరథమహారాజు గావించిన యాజ్ఞపద్ధతిని నీవు వనవాసము చేయవలసిన పదునాలుగుసంవత్సరములలోఁ జాలమట్టుకుఁ గడచినది. ౧౫

తీర్ణప్రతిజ్ఞః కాకుత్స్థ! సుఖం రాజ్యే నివత్స్యసి,

ధన్య స్తే జనకో రామ! స రాజా రఘునన్దన!. ౧౬
య స్త్వయా జ్యేష్ఠపుత్త్రేణ యయాతి రివ తారితః,
విదితో హ్యేవ వృత్తాన్తో మమ సర్వ స్త వానఘ!. ౧౭
తపస శ్చ ప్రభావేన స్నేహా ద్దశరథస్య చ,

హృదయస్థ శ్చ తే ఛన్దో విజ్ఞాత స్తపసా మయా. ౧౮
ఇహ వాసం ప్రతిజ్ఞాయ మయా సహ తపోవనే,

అత శ్చ త్వాం మహం బ్రూమి గచ్ఛ పఞ్చవటీ మితి. ౧౯
స హి రమ్యో వనోద్దేశో మైథిలీ తత్ర రంస్యతే,
స దేశ శ్శ్లాఘనీయ శ్చ నాతిదూరే చ రాఘవ!. ౨౦

గోదావర్యా స్సమీపే చ మైథిలీ తత్ర రంస్యతే,

ప్రాజ్యమూలఫలై శ్చైవ నానాద్విజగణాయుతః. ౨౧
వివిక్త శ్చ మహాబాహో! పుణ్యో రమ్య స్తథైవ చ,

భవా నపి సదార శ్చ శక్త శ్చ పరిరక్షణే. ౨౨
అపి చాత్ర వస న్రామ! తాపసా న్పాలయిష్యసి,

ఏత దాలక్ష్యతే వీర! మధూకానాం మహ ద్వనమ్. ౨౩
ఉత్తరే ణాస్య గన్తవ్యం న్యగ్రోధ మభిగచ్ఛతా,

రాముఁడా! నీవు ప్రతిజ్ఞం దీర్చుకొని రాజ్యంబునకుఁబోయి సుఖముగా నుండఁగలవు.

నీతండ్రి దశరథమహారాజు జ్యేష్ఠపుత్త్రుఁడవగు నీచేత యయాతియుంబోలె సత్యప్రతిజ్ఞుఁడుగాఁ జేయఁబడియె. గావునఁ బుణ్యవంతుఁ డయ్యె. ౧౫

పాపరహితుఁడవగు రాముఁడా! నాకు దశరథునిపైనుండు స్నేహంబు సంజేసి తపోమహిమవలన నీవృత్తాంతము నంతయుఁ దెలిసికొనియేయున్నాను. ౧౬

నేను నిన్ను నాతోఁగూడ నీయాశ్రమంబుననె యుండవలయునని చెప్పినానుగదా? అయినను దపఃప్రభావంబున నీవు వేఱె యెచ్చటనేని రమ్యప్రదేశంబున నివసింపఁ గోరియున్నావని నీమనస్సునందలి యభిప్రాయంబుఁ దెలిసికొంటిని. ౧౮

ఇందువలననె నేను 'పంచవటికిఁ బొమ్మని' నీకుఁ జెప్పినాను. ౧౯

రాముఁడా! ఆవనప్రదేశము మిక్కిలియు రమణీయమయినది; సీతయచ్చట సంతోషంబున నుండఁగలదు; ఆప్రదేశము శ్లాఘనీయమెగాక యిచ్చటికి సమీపంబుననె యున్నది. ౨౦

మఱియు నాప్రదేశము గోదావరీనదిసమీపంబున నున్నది కావున సీతాదేవి యచ్చట మిక్కిలియు సంతోషంబు గలుగుచుండును.

మహాబాహుఁడవగు రాముఁడా! ఆప్రదేశము ఎచ్చుగా ఫలమూలంబులుగలది. నానావిధమధురపక్షులతోఁగూడినది; జనసంఘములేనిది; పవిత్రము; సుందర మయినది. ౨౧

ఈపంచవటి మిక్కిలియు రమణీయప్రదేశము కావున భార్యాసహితుఁడవగు నీకుఁ దగియుండును. మఱియు నాపన్నులరక్షించుటయందు సమర్థుఁడవు కావున నిచ్చట నుండువేని తాపసుల రక్షింపవచ్చును. ౨౨

పరాక్రమవంతుఁడవగు రాముఁడా! ఇదిగో ఇప్పచెట్లగుంపగడుచున్నది; ఆమధుకవనంబున కుత్తరపుదిక్కునఁబోయిన నొక్కమఱ్ఱిచెట్టునొద్దకుఁ బోవుచున్నది. ౨౩

తతః స్థల ముపారుహ్య పర్వత స్యావిదూరతః ౨౪
ఖ్యాతః పఞ్చవటీ త్యేవ నిత్యపుష్పితకాననః,

అగస్త్యే నైవ ముక్తస్తు రామ స్సౌమిత్రిణా సహ. ౨౫
సత్కృత్యామన్త్రయామాస త మృషిం సత్యవాదినమ్,
తౌ తు తే నాభ్యనుజ్ఞాతౌ కృతపాదాభివన్దనౌ. ౨౬
తదాశ్రమా త్పఞ్చవటీం జగ్మతు స్సహ సీతయా,

గృహీతచాపౌ తు నరాధిపాత్మజౌ
విషక్తతూణౌ సమరే ష్వకాతరౌ,
యథోపదిష్టేన పథా మహర్షిణా
ప్రజగ్మతుః పఞ్చవటీం సమాహితౌ. ౨౭

ఇతి శ్రీమదరణ్యకాణ్డే త్రయోదశ స్సర్గః. ౧౩.

---

## చతుర్దశ స్సర్గః.

అథ పఞ్చవటీం గచ్ఛ న్నన్తరా రఘునన్దనః,
ఆససాద మహాకాయం గృధ్రం భీమపరాక్రమమ్. ౧
తం దృష్ట్వా తౌ మహాభాగౌ వటస్థం రామలక్ష్మణౌ,
మేనాతే రాక్షసం పక్షిం బ్రువాణౌ కో భవా నితి. ౨
స తౌ మధురయా వాచా సౌమ్యయా ప్రీణయ న్నివ,
ఉవాచ వత్స! మాం విద్ధి వయస్యం పితు రాత్మనః. ౩

స తం పితృసఖం బుద్ధ్వా పూజయామాస రాఘవః,

అంత నాదారిలోనే పోయిన నొకమిట్ట ప్రదేశము కనుపట్టును. దాని నారోహింపఁగా నగపడునట్టి పర్వతముసమీపంబునఁ బంచవటియున్నది. అది యెల్లప్పుడును బుష్పితములయిన వనంబులతో నొప్పుచుండును. అని యగస్త్యుఁడు రామునితోఁ జెప్పెను. ౨౮

రాముఁడగస్త్యునిమాటను విని లక్ష్మణునితోఁగూడ సత్యవాదియగు సప్తమహర్షిం బూజించి పోయివచ్చెద మని చెప్పెను. ౨౯

ఆరామలక్ష్మణులు అగస్త్యుని పాదంబులకు నమస్కరించి యాయన యనుమతింబొంది సీతాసమేతులయి యగస్త్యాశ్రమంబునుండి పంచవటికిం బోయిరి. ౩౦

యుద్ధములందు భయములేనట్టి యారామలక్ష్మణులు ధనుస్తూణతూణీరంబులు దాల్చి సమాహితమనస్కులయి యగస్త్యమహామునిచెప్పినమార్గంబునఁ బంచవటికిం బోయిరి. ౩౧

ఇది పదమూఁడవసర్గము.

---

## పదునాలవసర్గము.

అంత నట్లు రాముఁడు పంచవటికిం బోవుచు దారినడుమ భయంకరపరాక్రమంబును మహాకాయంబు నగు నొకగృధ్రముం జూచెను. ౧

మహాభాగులగు నారామలక్ష్మణులు అగృధ్రముం జూచి యతనిరాక్షసునిగాఁ దలఁచి "నీ వెవ్వఁడవు?" అని యడిగిరి. ౨

అగృధ్రము మధురంబును సౌమ్యంబునగు వాక్యంబున నారామలక్ష్మణులకు సంతోషంబు గలిగించుచు "రాముఁడా! నేను నీతండ్రిదశరథమహారాజునకు స్నేహితుఁడను." అని చెప్పెను. 3

రాముఁడు అగృధ్రమును దనతండ్రిస్నేహితుఁగా నెఱింగి పూజించెను.

స తస్య కుల మవ్యగ్ర మథ పప్రచ్ఛ నామ చ. ౪
రామస్య వచనం శ్రుత్వా సర్వభూతసముద్భవమ్,
ఆచచక్షే ద్విజ స్తస్మై కుల మాత్మాన మేవ చ. ౫
పూర్వకాలే మహాబాహో! యే ప్రజాపతయోఽభవన్,
తా న్మే నిగదత స్సర్వా నాదిత శ్శృణు రాఘవ!. ౬
కర్దమః ప్రథమ స్తేషాం వికృత స్తదనన్తరః,
శేష శ్చ సంశ్రయ శ్చైవ బహుపుత్ర శ్చ వీర్యవాన్. ౭
స్థాణు ర్మరీచి రత్రి శ్చ క్రతు శ్చైవ మహాబలః,
పుల స్త్య శ్చాఙ్గిరా శ్చైవ ప్రచేతాః పులహ స్తథా. ౮
దక్షో వివస్వా నపరోఽరిష్టనేమి శ్చ రాఘవ!,
కాశ్యప శ్చ మహాతేజా స్తేషా మాసీ చ్చ పశ్చిమః. ౯
ప్రజాపతే స్తు దక్షస్య బభూవు రితి విశ్రుతమ్,
షష్టి ర్దుహితరో రామ! యశస్విన్యో మహాయశః!. ౧౦
కాశ్యపః ప్రతిజగ్రాహ తాసా మష్టౌ సుమధ్యమాః,
అదితిం చ దితిం చైవ దను మప్యథ కాళికామ్. ౧౧
తామ్రాం క్రోధవశాం చైవ మనుం చా ప్యనలా మపి,
తాస్తు కన్యా స్తతః ప్రీతః కాశ్యపః పున రబ్రవీత్. ౧౨
పుత్రాం స్త్రైలోక్యభ ర్తౄ న్వై జనయిష్యథ మత్సమాన్,
అదితి స్తన్మనా రామ! దితి శ్చ మనుజర్షభ!. ౧౩
కాళికా చ మహాబాహో! శేషా స్త్వమనసోఽభవన్,
అదిత్యాం జజ్ఞిరే దేవా స్త్రయస్త్రింశ దరిన్దమ!. ౧౪
ఆదిత్యా వసవో రుద్రా హ్యశ్వినౌ చ పరన్తప!,

అంత రాముఁడు ఆగృధ్రముయొక్క కులంబును పేరును అడిగెను. ౪

ఆగృధ్రము రాముని మాటను విని ఆరామునికి జగత్సృష్టివిధానంబుఁ జెప్పుచు దనకులంబును పేరునుం జెప్పెను. ౫

మహాబాహుఁడవగు రాముఁడా! మున్నెవ్వరెవ్వరు ప్రజాపతులుగా నుండిరో వారల నందఱ మొదటనుండి చెప్పెదను. ౬

రాముఁడా! ఆప్రజాపతులలో మొదటివాఁడు కర్దముఁడు: అంత విక్రీతుఁడును, శేషుఁడును, పెక్కుకొడుకులుగలవాఁడును మహావీర్యశాలియు నగు సంశ్రయుండును: స్థాణుఁడును, మారీచియు, నత్రియు, మహాబలుఁడగు క్రతువును, పులస్త్యుఁడును, నంగిరసుఁడును, బ్రచేతసుఁడును, పులహుఁడును దక్షుఁడును, వివస్వంతుఁడును, క్రమంబునఁ బ్రజాపతులైరి. అంత నరిష్టనేమి యనునామాంతరముగల మహాతేజుఁడగు కాశ్యపుఁడు ప్రజాపతియయ్యె. ౭-౯

మహాయశుఁడవగు రాముఁడా! దక్షప్రజాపతికిఁ గీర్తిమంతులగు నఱువదిమంది కూఁతులు గల్గిరని యందఱకును దెలిసినదే కదా!. ౧౦

కాశ్యపుఁడు వారలలో సుందరాంగులగు నదితిని దితిని దనువును గాళికను దామ్రను గ్రోధవశను మనువును అనలను ఈయెనిమిదిమందిని వివాహంబయ్యెను. ౧౧

అంతఁ గాశ్యపుఁడు సంతోషంబున నాకన్యకలం జూచి యిట్లని చెప్పెను. ౧౨

ముల్లోకంబులం బాలింపఁ గలిగినవారలును నాకుసమానులునగు కొడుకులంగనుండు. అని కశ్యపుఁడు ఆకన్యలకుం జెప్పెను.

పురుషశ్రేష్ఠుఁడవు మహాబాహుఁడవు నగురాముఁడా! అందుకు నదితియు దితియుఁ గాళికయు సమ్మతించిరి. మిగిలినవారలు మాత్రము సమ్మతింపరైరి.

శత్రుసంహారకారకుఁడవగు రాముఁడా! అదితియందుఁ బన్నిద్దఱాదిత్యులును ఎనమండ్రువసువులును బదునొక్కరురుద్రులును ఇద్దఱశ్వినీదేవతలును ఇట్లు ముప్పదిమువ్వురు దేవతలు జన్మించిరి. ౧౪

దితి స్త్వజనయ త్పుత్రా న్దైత్యాం స్తాత! యశస్వినః. ౧౫
తేషా మియం వసుమతీ పురాఽఽసీ త్సవనార్ణవా,

దను స్త్వజనయ త్పుత్ర మశ్వగ్రీవ మరిన్దమ!. ౧౬

నరకం కాలకం చైవ కాలికాపి వ్యజాయత,
క్రౌఞ్చీం భాసీం తథా శ్యేనీం ధృతరాష్ట్రీం తథా శుకీమ్. ౧౭
తామ్రాపి సుషువే కన్యాః పఞ్చైతా లోకవిశ్రుతాః,
ఉలూకా ఞ్జనయ త్క్రౌఞ్చీ భాసీ భాసా న్వ్యజాయత. ౧౮
శ్యేనీ శ్యేనాం శ్చ గృధ్రాం శ్చ వ్యజాయత సుతేజసః,
ధృతరాష్ట్రీ తు హంసాం శ్చ కలహంసాం శ్చ సర్వశః. ౧౯
చక్రవాకాం శ్చ భద్రం తే విజజ్ఞే సాపి భామినీ,
శుకీ నతాం విజజ్ఞే తు నతాయా వినతా సుతా. ౨౦
దశ క్రోధవశా రామ! విజజ్ఞే హ్యాత్మసమ్భవాః,
మృగీం చ మృగమన్దాం చ హరీం భద్రమదా మపి. ౨౧
మాతఙ్గీ మపి శార్దూలీం శ్వేతాం చ సురభిం తథా,
సర్వలక్షణసమ్పన్నాం సురసాం కద్రుకా మపి. ౨౨
అపత్యం తు మృగా స్సర్వే మృగ్యా నరవరోత్తమ!,

ఋక్షా శ్చ మృగమన్దాయా స్సృమరా శ్చమరా స్తథా. ౨౩

హర్యా శ్చ హరయోఽపత్యం వానరా శ్చ తరస్వినః,
తత స్త్విరావతీం నామ జజ్ఞే భద్రమదా సుతామ్, ౨౪
తస్యా స్త్వైరావతః పుత్రో లోకనాథో మహాగజః,

నాయనా! దితి కీర్తిమంతులగు దైత్యులం గనెను; మున్ను సమస్తారణ్యంబులతోను సముద్రంబులతోనుం గూడిన యీభూమియంతయు నాదైత్యులదిగా నుండెను. ౧౫

శత్రువుల నడంగఁ ద్రొక్కం జాలినరాముఁడా! దనువు హయగ్రీవుఁ డను కొడుకుం గనెను. ౧౬

కాళికను నరకుండును గాలకుండును బుట్టిరి.

తామ్రయుఁ గ్రౌంచిని భాసిని శ్యేనిని ధృతరాష్ట్రిని శుకిని లోకప్రసిద్ధలగు నీయైదుగురం గన్యలం గనెను. ౧౭

క్రౌంచి యులూకంబులం గనెను. భాసిభాసపక్షులం బుట్టించెను. ౧౮

శ్యేనికి మహావీర్యంబులగు డేగలును గృధ్రంబులును బుట్టినవి ధృతరాష్ట్రికి హంసలును గలహంసములును బుట్టినవి. ౧౯

ఆధృతరాష్ట్రికి చక్రవాకపక్షులుగూడ జన్మించినవి.

శుకికి నతి జన్మించెను. నతకు వినత పుట్టెను. ౨౦

రామునఁడా! క్రోధవశ మృగిని మృగమందను హరిని భద్రమదను మాతంగని శార్దూలిని శ్వేతను సురభిని సమస్తలక్షణసంపన్నయగు సురసను గద్రువను ఇట్లు పదుగురఁ గొమార్తెలఁ గనెను. ౨౧,౨౨

పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! మృగికి సమస్తములయిన జింకలు జనించినవి.

మృగమందకు నెలుగుఁబంటులును సృమరమృగములును జమరమృగంబులును జన్మించినవి. ౨౩

హరికి సింహంబులును వేగవంతులగు వానరులునుం గలిగిరి.

అంతను భద్రమదకు ఇరావతియను కూఁతురు పుట్టెను. ౨౪

అయిరావతికి దేవేంద్రునివాహనంబగుటచే లోకనాథంబగు నైరావతంబను మహాగజంబు గలిగెను.

మాతఙ్గ్యా స్త్వథ మాతఙ్గా అపత్యం మనుజర్షభ!. ౨౫
గోలాఙ్గూలాం శ్చ శార్దూలీ వ్యాఘ్రాం శ్చాజనయ త్సుతాన్,
దిశాగజాం శ్చ కాకుత్స్థ! శ్వేతా వ్యజనయ త్సుతాన్. ౨౬
తతో దుహితరౌ రామ! సురభి ర్దేవ్య జాయత,
రోహిణీం నామ భద్రం తే గన్ధర్వీం చ యశస్వినీమ్. ౨౭
రోహి ణ్యజనయ ద్గా వై గన్ధర్వీ వాజిన స్సుతాన్,
సురసా జనయ న్నాగా న్రామ! కద్రూ స్తు పన్నగాన్. ౨౮

మను ర్మనుష్యా ఞ్జనయ ద్రామ! పుత్త్రా న్యశస్వినః,
బ్రాహ్మణా న్క్షత్త్రియా న్వైశ్యా ఞ్ఛూద్రాం శ్చ మనుజర్షభ!.
సర్వా న్పుణ్యఫలా న్వృక్షా ననలాఽపి వ్యజాయత,

వినతా చ శుకీ పౌత్త్రీ కద్రూ శ్చ సురసా స్వసా. ౩౦

కద్రూ ర్నాగం సహస్రాస్యం విజజ్ఞే ధరణీధరమ్,

ద్వౌ పుత్త్రౌ వినతాయా స్తు గరుడోఽరుణ ఏవ చ. ౩౧
తస్మా జ్జాతోఽహ మరుణా త్సమ్పాతి స్తు మమాగ్రజః,
జటాయురితి మాం విద్ధి శ్యేనీపుత్త్ర మరిన్దమ!. ౩౨

సోఽహం వాససహాయ స్తే భవిష్యామి యదీచ్ఛసి,

ఇదం హి దుర్గం కాన్తారం మృగరాక్షససేవితమ్. ౩౩

సీతాం చ తాత! రక్షిష్యే త్వయి యాతే సలక్ష్మణే.

పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! మాతంగికి ఏనుఁగులు గలిగినవి.

శార్దూలికి గోలాంగూలంబులును వ్యాఘ్రింబులును గలిగినవి.

రాముఁడా! శ్వేతకు దిగ్గజంబులు జన్మించినవి. ౨౬

రాముఁడా! అంత సురభి రోహిణియను గంధర్వియను నను పేళ్లుగల యిద్దఱఁ గూఁతులం గనెను. నీకు మంగళమగుఁ గాక. ౨౭

రోహిణికి గోవులు పుట్టినవి గంధర్వికి గుఱ్ఱములు జన్మించినవి.

రాముఁడా! సురసకుఁ బెక్కుతలలుగల దివ్యసర్పంబులు జన్మించినవి.

కద్రువునకు సాధారణసర్పంబులు గలిగినవి. ౨౮

పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! మనువు బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రాదులను నాలుగువర్ణములుగల మనుష్యులం గనెను. ౨౯

అనలయును పవిత్రములగు ఫలములుగల వృక్షంబులం గనెను.

అందు శుకిమనుమరాలగు వినత సురసచెల్లెలగు కద్రువ వీరలవంశముం జెప్పెదను. 30

అందుఁ గద్రువ వేయితలలుగలవాఁడును భూమిని మోయుచున్నవాఁడునగు నాదిశేషునిం గనెను.

వినతకు గరుడుం డనియు నరుణుఁడనియు నిద్దఱుకొడుకులు గలిగిరి.

శత్రువుల నడంగఁ ద్రొక్కునట్టి రాముఁడా! నే నా యరుణునకు శ్యేనియందుఁ బుట్టినవాఁడను; సంపాతియనువాఁడు నా యగ్రజుఁడు. నా పేరు జటాయువని యెఱుంగుము. 31

నీకిష్టమం డునేని నేను నీకు వనవాసంబున సహాయుఁడనై యుండెదను.

ఈయడవి మిక్కిలియు భయంకరమును క్రూరమృగంబులుగలదియు రాక్షససేవితంబును గావున నా సాహాయ్యంబున నీకుఁ బ్రయోజనముగలదు.

నాయనా! నీవును లక్ష్మణుఁడును ఎచ్చటికేని పోయినప్పుడు నేను

జటాయుషం తం ప్రతిపూజ్య రాఘవో
ముదా పరిష్వజ్య చ సన్నతో౽భవత్,
పితు ర్హి శుశ్రావ సఖిత్వ మాత్మవా
జ్జటాయుషా సంకథితం పునఃపునః. 3౪
స తత్ర సీతాం పరిధాయ మైథిలీం
సహైవ తే నాతిబలేన పక్షిణా,
జగామ తాం పఞ్చవటీం సలక్ష్మణో
రిపూ న్దిధక్షు శ్శలభా ని వానలః. 3౫
ఇతి శ్రీమదరణ్యకాణ్డే చతుర్దశ స్సర్గః. ౧౪.

---

పఞ్చదశ స్సర్గః.

తతః పఞ్చవటీం గత్వా నానావ్యాళమృగాయుతామ్,
ఉవాచ భ్రాతరంరామ సౌమిత్రిం దీప్తతేజసమ్. ౧

ఆగతాః స్మ యథోద్దిష్ట మముం దేశం మహర్షిణా,
అయం పఞ్చవటీదేశ స్సౌమ్య! పుష్పితపాదపః. ౨

సర్వత శ్చార్యతాందృష్టిః కాననే నిపుణో హ్యసి,
ఆశ్రమః కతరస్మి న్నో దేశే భవతి సమ్మతః. 3

రమతే యత్ర వైదేహీ త్వ మహం చైవ లక్ష్మణ!,
తాదృశో దృశ్యతాం దేశ స్సన్నికృష్టజలాశయః. ౪
వనరామణ్యకం యత్ర స్థలరామణ్యకం తథా,

సీతాదేవిని రక్షింపుచుండెదను. అని జటాయువు రామునితోఁ జెప్పెను.

మహాత్ముఁడగు రాముఁడు జటాయువుం బూజించి సంతోషంబునం గవుఁగిలించుకొని యతఁడు పలుమాఱు తనకును దశరథునకునుం గల్గిన సఖ్యంబుఁ జెప్పినవన్నియెల్ల నత్యాదరంబున వినుచు నమస్కరింపుచుండెను.

అంత రాముఁడు మహాబలుం డగు జటాయువుతోఁగూడ సీతాలక్ష్మణ సమేతుఁడై శలభంబుల నగ్నిహోత్రుఁడువలె శత్రువుల దహింపఁగోరుచుఁ బంచవటిం బొందెను. ౩౫

ఇది పదునాలవసర్గము.

## పదునైదవసర్గము.

అంత రాముఁడు నానావిధములయిన దుష్టసర్పములతోను మృగములతోనుంగూడిన పంచవటింజేరి మహాతేజుఁడగు తమ్ముని లక్ష్మణుంజూచి యిట్లని చెప్పెను. ౧

శాంతుఁడవగు లక్ష్మణుఁడా! అగస్త్యమహాముని చెప్పినపద్ధతిని మన మీప్రదేశముం జేరినాము. ఇదిగో చక్కఁగాఁ బూచిన యడవులుకల ఈ ప్రదేశమే పంచవటి. ౨

ఈయడవినంతం జూడుము. అడవియం దాశ్రమయోగ్యస్థలంబు గనుంగొనుటయందు నీవు మిక్కిలియు సమర్థుఁడవుగదా! ఏప్రదేశంబున మన కందఱకును సమ్మతంబగునట్లు ఆశ్రమంబు గుదురును? ౩

లక్ష్మణుఁడా! ఎచ్చట సీతయును నీకును నాకును సంతోషంబుగనుండునో ఎచ్చట సుందరవనంబులును మంచియిసుకతోఁగూడిన స్థలంబు నుండునో ఎచ్చట సమిధలును బూలును దర్భలును సమీపంబున సమృద్ధంబుగా

సన్నికృష్టం చ యత్ర స్యా త్సమిత్పుష్పకుశోదకమ్. ౫

ఏవ ముక్త స్తు రామేణ లక్ష్మణ స్సంయతాఞ్జలిః,
సీతాసమక్షం కాకుత్స్థ మిదం వచన మబ్రవీత్.
పరవా నస్మి కాకుత్స్థ! త్వయి వర్షశతం స్థితే,
స్వయం తు రుచిరే దేశే క్రియతా మితి మాంవద. ౭

సుప్రీత స్తేన వాక్యేన లక్ష్మణస్య మహాత్మనః,
విమృశ న్రోచయామాస దేశం సర్వగుణాన్వితమ్. ౮
స తం రుచిర మాక్రమ్య దేశ మాశ్రమకర్మణి,
హస్తే గృహీత్వా హస్తేన రామ స్సౌమిత్రి మబ్రవీత్. ౯

అయం దేశ స్సమ శ్శ్రీమా న్పుష్పితై స్తరుభి ర్వృతః,
ఇహాఽఽశ్రమపదం సౌమ్య! యథావ త్కర్తు మర్హసి. ౧౦

ఇయ మాదిత్యసఙ్కాశైః పద్మై స్సురభిగన్ధిభిః,
అదూరే దృశ్యతే రమ్యా పద్మినీ పద్మశోభితా. ౧౧

యథాఽఽఖ్యాత మగస్త్యేన మునినా భావితాత్మనా,
ఇయం గోదావరీ రమ్యా పుష్పితై స్తరుభి ర్వృతా. ౧౨
హంసకారణ్డవాకీర్ణా చక్రవాకోపశోభితా,
నాతిదూరే నచాసన్నే మృగయూథనిపీడితా. ౧౩
మయూరనాదితా రమ్యాః ప్రాంశవో బహుకన్దరాః,

నుండునో అట్టి సమీపంబునం గొలనుగల ప్రదేశముం జూడుము అని రాముండు లక్ష్మణునితోఁ జెప్పెను. ౪,౫

లక్ష్మణుఁడు రామునిమాటను విని చేతులు మొగిడ్చుకొని సీతాదేవి సమక్షంబున రాముంజూచి యిట్లని చెప్పెను. ౬

రాముఁడా! నీ విద్యానంబున నూఱుసంవత్సరంబులున్నను నేను నీవు చెప్పినపనిఁ జేయుచుండువాఁడనేగాని స్వతంత్రుండఁ గాను. కావున నీవె చూచి మనోహరంబగు ప్రదేశంబున నాశ్రమంబురచియింపుమని యానతిమ్ము. అని లక్ష్మణుఁడు రామునితోఁ జెప్పెను. ౭

రాముఁడు మహాత్ముఁడగు లక్ష్మణునిమాటకు సంతసించి చక్కఁగా విమర్శించి సమస్తగుణసమన్వితంబగు ప్రదేశము నొకటి చూచెను. ౮

ఆరాముఁడు ఆశ్రమంబునిమిత్తమయి, యమ్మనోహరప్రదేశము నాక్రమింపఁదలఁచి తనహస్తంబున లక్ష్మణునిహస్తంబులుపట్టుకొని యిట్లనిచెప్పెను.

శాంతుఁడవగు లక్ష్మణుఁడా! ఈప్రదేశము మిట్టపల్లములులేనిదిగాను శ్రీమంతంబుగాను బుష్పితంబులగు వృక్షములుగలదిగాను నున్నది. ఇచ్చట యథాశాస్త్రముగా నాశ్రమంబు నిర్మింపుము. ౧౦

సూర్యసమానంబులును మంచిగంధముగలవియునగు కమలంబులతో నొప్పుచున్నదియు రమణీయంబునగు తామరకొలను ఇదిగో సమీపంబుననున్నది. ౧౧

భావితాత్ముఁడగు నగస్త్యమహాముని చెప్పినట్లె రమణీయంబును పుష్పితవృక్షములతోఁ గూడినదియు హంసకారండవ చక్రవాకంబులతోఁ గూడినదియు నగు నీగోదావరి యొంతయు సమీపంబున నున్నది. ౧౨

శాంతుఁడవగు లక్ష్మణుఁడా! మృగసమూహంబుల నిండినవియు మధురంబుగాఁ గూయుచుండు నెమిళ్లతోఁగూడినవియు రమణీయంబులును నత్యున్నతంబులును బెక్కుగుహలు గలదియుఁ జక్కఁగా వికసించిపుష్పములు

దృశ్యన్తే గిరయస్సౌమ్య! ఫుల్లై స్తరుభి రావృతాః. ౧౪

సౌవర్ణై రాజతై స్తామ్రై ర్దేశేదేశే చ ధాతుభిః,
గవాక్షితా ఇవాఽభాన్తి గజాః పరమభక్తిభిః. ౧౫

సాలై స్తాలై స్తమాలై శ్చ ఖర్జూరైః పనసామ్రకైః,
నీవారై స్తినిశై శ్చైవ పున్నాగై శ్చోపశోభితాః. ౧౬
చూతై రశోకై స్తిలకై శ్చమ్పకైః కేతకై రపి,
పుష్పగుల్మలతోపేతై స్తై స్తై స్తరుభి రావృతాః. ౧౭
చన్దనైః స్యన్దనై ర్నీపైః పర్ణాసై ర్లికుచై రపి,
ధవాశ్వకర్ణఖదిరై శ్శమీకింశుకపాటలైః. ౧౮

ఇదం పుణ్య మిదం మేధ్య మిదం బహుమృగద్విజమ్,
ఇహ వత్స్యామ సౌమిత్రే! సార్ధ మేతేన పక్షిణా. ౧౯

ఏవ ముక్తస్తు రామేణ లక్ష్మణః పరవీరహా,
అచిరేణాఽఽశ్రమం భ్రాతు శ్చకార సుమహాబలః. ౨౦
పర్ణశాలాం సువిపులాం తత్ర సంఘాతమృత్తికామ్,
సుస్తమ్భాం మస్కరై ర్దీర్ఘైః కృతవంశాం సుశోభనామ్. ౨౧
శమీశాఖాభి రాస్తీర్య దృఢపాశావపాశితామ్,
కుశకాశశరైః పర్ణై స్సుపరిచ్ఛాదితాం తథా. ౨౨

గల వృక్షములతోఁ గూడినవియు నగుపర్వతంబులు ఈపంచవటికి సమీపంబునను దూరంబునను గాక వెలంగుచున్నవి, చూడుము. ౧౪

ఇచ్చట నగ్యుప్రదేశంబులనుండు సువర్ణవర్ణంబులును రజతవర్ణంబులును దామ్రవర్ణంబులు నగు గైరికధాతువులకాంతులు మేనఁ బ్రసరించుటం జేసి యేనుఁగులు గవాక్షాకారములగు చిత్రరచనలు వ్రాయఁబడినవివలెఁ బ్రకాశించుచున్నవి. ౧౫

మద్దిచెట్లును దాటిచెట్లును తమాలవృక్షంబులును ఖర్జూరవృక్షములును పనసచెట్లును నానావిధములగు మామిడిచెట్లును జలకదంబవృక్షములును నేమివృక్షములును పున్నాగవృక్షములును అశోకవృక్షములును బొట్టుగుచెట్లును సంపెఁగచెట్లును మొగిలిపొదలును పుల్లజాజి మున్నగుపుష్పలతలతోఁగూడిన నానావిధవృక్షంబులును చందనవృక్షంబులును స్పందనవృక్షంబులును గదంబవృక్షంబులును బర్ణాసవృక్షంబులును నిమ్మచెట్లును ఉమ్మెత్తచెట్లును ఇనుమద్దిచెట్లును జండ్రచెట్లును జమ్మిచెట్లును మోదుగుచెట్లును గరిగొట్టుచెట్లునుం గలిగి యీపర్వతంబు లెంతయు నొప్పుచున్నవి. ౧౬-౧౮

లక్ష్మణుఁడా! ఈప్రదేశము పుణ్యమును పావనమును గానున్నది ఇచ్చట నానావిధములగు మనోహరములయిన మృగంబులును పక్షులునుం గలవు. ఇచ్చట ఈజటాయువుతోఁగూడ నివసించియుందము. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౧౯

శత్రువీరులవధించువాఁడును మహాబలుండునగు లక్ష్మణుఁడు రాముని మాటను విని శీఘ్రముగ రామునకు నాశ్రమంబు నిర్మించెను. ౨౦

శీఘ్రముగాఁ గార్యముఁజేయు స్వభావముగల లక్ష్మణుఁడు ఆయాశ్రమంబున మట్టిద్రవ్వి గోడలుపెట్టి దీర్ఘంబులును దృఢములునగు వెదుళ్లను స్తంభంబులుగాఁబూన్చి వానిపై జమ్మికొమ్మల నడ్డముగా నుంచి దృఢములగు త్రాళ్లఁబంధించి పైని దర్భలెల్లు మొదలగు పత్రములచేఁ జక్కఁగాఁ గప్పివేసి నేలను చదరముగాఁజేసి సకలలక్షణయుక్తంబుగా రామునకు సుందరంబును రమణీయంబునగు పర్ణశాలను నిర్మించెను. ౨౧-౨౩

సమీకృతతలాం రమ్యాం చకార లఘువిక్రమః,
నివాసం రాఘవ స్యార్థే ప్రేక్షణీయ మను త్తమమ్. ౨౩
స గత్వా లక్ష్మణ శ్శ్రీమా న్నదీం గోదావరీం తదా,
స్నాత్వా పద్మాని చాదాయ సఫలః పున రాగతః. ౨౪
తతః పుష్పబలిం కృత్వా శాన్తిం చ స యథావిధి,
దర్శయామాస రామాయ తదాశ్రమపదం కృతమ్. ౨౫
స తం దృష్ట్వా కృతం సౌమ్య మాశ్రమం సీతయా సహ,
రాఘవః పర్ణశాలాయాం హర్ష మాహారయ త్పరమ్. ౨౬
సుసంహృష్టః పరిష్వజ్య బాహుభ్యాం లక్ష్మణం తదా,
అతిస్నిగ్ధం చ గాఢం చ వచనం చేద మబ్రవీత్. ౨౭
ప్రీతోఽస్మి తే మహ త్కర్మ త్వయా కృత మిదం ప్రభో!,
ప్రదేయో యన్నిమిత్తం తే పరిష్వఙ్గో మయా కృతః. ౨౮

భావజ్ఞేన కృతజ్ఞేన ధర్మజ్ఞేన చ లక్ష్మణ!,
త్వయా పుత్రేణ ధర్మాత్మా న సంవృత్తః పితా మమ. ౨౯

ఏవం లక్ష్మణ ముక్త్వా తు రాఘవో లక్ష్మివర్ధనః,
తస్మి న్దేశే బహుఫలే న్యవస త్సుసుఖం వశీ. ౩౦

కంచి త్కాలం స ధర్మాత్మా సీతయా లక్ష్మణేన చ,
అన్వాస్యమానో న్యవస త్స్వర్గలోకే యథాఽమరః. ౩౧

ఇతి శ్రీదరణ్యకాణ్డే పఞ్చదశ స్సర్గః. ౧౫.

---

అప్పుడు శ్రీమంతుఁడగు లక్ష్మణుఁడు శీఘ్రంబున గోదావరీనదికిం బోయి స్నానంబు గావించి కమలంబులను ఫలంబులనుం దీసికొని మఱలవచ్చెను.

అంత నాలక్ష్మణుఁడు వాస్తుపూజను శాంతినిం గావించి తాను నిర్మించిన యాశ్రమంబును శ్రీరామునకుఁ జూపెను. ౨౫

అంత రాముఁడు సీతతోఁగూడ నయ్యాశ్రమంబుఁ జూచి పర్ణశాలం బ్రవేశించి పరమసంతోషంబు నొందెను. ౨౬

రాముఁడట్లు పరమసంతుష్టుఁడై యతిస్నేహంబున బాహువుల నాలక్ష్మణుని గాఢంబుగాఁ గవుఁగిలించుకొని యీమాటం జెప్పెను. ౨౭

సమర్థుఁడవగు లక్ష్మణుఁడా! నీవు మిక్కిలియు గొప్పకార్యము గావించినావు; కావున నీపై నాకుఁ జాలసంతోషము గలిగినది. అందుకు నీకీయవలసిన పారితోషికమునకుఁగా నిన్నుఁ గవుఁగిలించుకొంటిని. ౨౮

లక్ష్మణుఁడా! నీవిట్లు నాహృదయంబుఁ దెలిసి నాకుఁ బ్రియంబులగు వానినెల్ల నేను జెప్పకుండినను నేర్పుతోఁ జేయుచు ధర్మముఁ దప్పక నాకు శుశ్రూష సేయుచుఁ దండ్రికి మాఱుగా, నన్ను నానావిధంబులం బాలించుచు నుండుటచేత ధర్మాత్ముఁడగు నాతండ్రి నాకు జీవించియున్నట్లేయున్నాఁడని. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౨౯

జితేంద్రియుఁడును సంపద్వర్ధనుఁడు నగు రాముఁడు అట్లు లక్ష్మణునకుఁ జెప్పి నానావిధబహుఫలసమన్వితంబగు నప్పంచవటియందు సుఖంబుగా నివసించెను. ౩౦

ధర్మాత్ముఁడగు నారాముఁడు సీతాలక్ష్మణులు సేవింప నయ్యాశ్రమంబున దేవలోకంబున దేవేంద్రుండుంబోలె సుఖంబున నుండెను. ౩౧

ఇది పదునైదవసర్గము.

---

## షోడశ స్సర్గః.

వసత స్తస్య తు సుఖం రాఘవస్య మహాత్మనః,
శరద్వ్యపాయే హేమ న్తఋతు రిష్టః ప్రవర్తతే. ౧

స కదాచి త్ప్రభాతాయాం శర్వర్యాం రఘునన్దనః,
ప్రయయా వభిషేకార్థం రమ్యాం గోదావరీం నదీమ్. ౨
ప్రహ్వః కలశహ స్త స్తం సీతయా సహ వీర్యవాన్,
పృష్ఠతోఽనువ్రజ న్భ్రాతా సౌమిత్రి రిద మబ్రవీత్. ౩
అయం స కాల స్సమ్ప్రాప్తః ప్రియో య స్తే ప్రియంవద!,
అలఙ్కృతఇవాఽభాతి యేన సంవత్సర శ్శుభః. ౪

నీహారపరుషో లోకః పృథివీ సస్యశాలినీ,
జలా న్యనుపభోగ్యాని సుభగో హవ్యవాహనః. ౫

నవాగ్రయణపూజాభి రభ్యర్చ్య పితృదేవతాః,
కృతాగ్రయణకాః కాలే సన్తో విగతకల్మషాః. ౬

ప్రాజ్యకామా జనపదా స్సమ్పన్నతరగోరసాః,
విచర న్తి మహీపాలా యాత్రాస్థా విజిగీషవః. ౭

సేవమానే దృఢం సూర్యే దిశ మ న్తకసేవితామ్,
విహీనతిలకేవ స్త్రీ నోత్తరా దిక్ప్రకాశతే. ౮
ప్రకృత్యా హిమకోశాఽఢ్యో దూరసూర్యశ్చ సామ్ప్రతమ్,
యథార్థనామా సువ్యక్తం హిమవా న్హిమవా న్గిరిః. ౯

## పదునాఱవసర్గము.

మహాత్ముఁడగు నారాముఁడట్టు లయ్యాశ్రమంబున సుఖంబుగా వాసము చేయుచుండఁగానే శరదృతువు కడచి కామినీకాములకుఁ బ్రియంబగు హేమంతర్తువు వచ్చినది. ౧

ఒకనాఁడు తూర్పు తెల్లవాఱుసప్పుడు రాముఁడు స్నానార్థమయి రమణీయంబగు గోదావరీనదికిం బోయెను. ౨

మహాపరాక్రమశాలియగు తమ్ముఁడు లక్ష్మణుఁడు నమ్రుఁడై కలశంబు దీసికొని సీతతోఁగూడ రాముని వెంబడింబోవుచు నాయనతో నిట్లని చెప్పెను.

ప్రియంవదుఁడగు రాముఁడా! ఏది నీకు మిక్కిలియుఁ బ్రియమో దేనిచే సంవత్సరమున కంతయు నలంకారము గలుగునో అట్టి హేమంతఋతువు వచ్చినది. ౪

ఇప్పుడు జనుల దేహము మంచుచే బిఱుసుఁగా నున్నది. భూమియంతయు సస్యములతో నొప్పుచున్నది జలంబులు డాఁక నలవిగాకున్నవి. నిప్పు మిక్కిలియు మనోహర మగుచున్నది. ౫

సత్పురుషులు నవధాన్యములు భుజించుటకు మున్ను చేయవలసిన యాగ్రయణయజ్ఞములచేఁ బితృదేవతలం బూజించి యట్లు యుక్తకాలంబున నాగ్రయణయజ్ఞంబు నిర్వర్తించి విగతకల్మషులై యొప్పెదరు. ౬

ఇప్పుడు గ్రామములందు సమస్తపదార్థంబులును సమృద్ధంబులై యావుపాలెచ్చుగానుండును. శత్రువుల జయింపఁగోరు రాజులు యుద్ధములం దిరుగుదురు. ౭

సూర్యుఁడు దక్షిణపుదిక్కున నుండుటవలన నుత్తరపుదిక్కు ముఖంబునఁ దిలకంబులేని స్త్రీవలె నెంతమాత్రము ప్రకాశింపకున్నది. ౮

స్వభావంబుననే ఘనీభూతమగు మంచుచే నిండియుండునదియగు హిమవత్పర్వతము ఇప్పుడు దక్షిణాయనమునందు సూర్యుఁడు దూరగతుఁడగుటచే మఱియు మంచు హెచ్చగుటం జేసి "హిమవంతము" (అధికముగా మంచుగలది) అను యథార్థంబగు పేరుతోఁ గూడినదయ్యె. ౯

అత్యన్తసుఖసంచారా మధ్యాహ్నే స్పర్శత స్సుఖాః,
దివసా స్సుభగాదిత్యా శ్ఛాయాసలిలదుర్భగాః. ౧౦

మృదుసూర్యా స్సనీహారాః పటుశీతా స్సమారుతాః,
శూన్యారణ్యా హిమధ్వస్తా దివసా భాన్తి సామ్ప్రతమ్. ౧౧

నివృత్తాకాశశయనాః పుష్యనీతా హిమారుణాః,
శీతా వృద్ధతరాయామా స్త్రియామా యాన్తి సామ్ప్రతమ్.

రవిసఙ్క్రాన్తసౌభాగ్య స్తుషారారుణమణ్డలః,
నిశ్వాసాన్ధ ఇవాదర్శ శ్చన్ద్రమా న ప్రకాశతే. ౧౩

జ్యోత్స్నా తుషారమలినా పౌర్ణమాస్యాం న రాజతే,
సీతేవ చాతపశ్యామా లక్ష్యతే న తు శోభతే. ౧౪

ప్రకృత్యా శీతలస్పర్శో హిమవిద్ధ శ్చ సామ్ప్రతమ్.
ప్రవాతి పశ్చిమో వాయుః కాలే ద్విగుణశీతలః. ౧౫

బాష్పచ్ఛన్నా న్యరణ్యాని యవగోధూమవన్తి చ,
శోభన్తేఽభ్యుదితే సూర్యే నదద్భిః క్రౌఞ్చసారసైః. ౧౬

ఖర్జూరపుష్పాకృతిభిశ్శిరోభిః పూర్ణతణ్డులైః,
శోభన్తే కించి దానమ్రా శ్శాలయః కనకప్రభాః. ౧౭

ఇప్పుడు మధ్యాహ్నమునందు ఎండలోఁ దిరుగుట మిక్కిలియు సుఖకరముగానున్నది. సూర్యుఁడు వేఁడిమి గలిగించుటంజేసి మనోహరుఁడై యున్నాఁడు. నీడయు జలమును ఎంతమాత్ర మక్కఱకు రాకున్నవి. ౧౦

ఇప్పుడు సూర్యుఁడు ఎచ్చువేఁడిలేక మెత్తఁగా నున్నాఁడు. మంచధికముగాఁ గురియుచున్నది. చలి ప్రబలముగా నున్నది. గాలి యెచ్చుగా నున్నది; అడవులయందుండువార లడవుల విడిచియున్నారు; మంచుచే నేదియుఁ జూడ నలవిగాకున్నది. ౧౧

ఇప్పుడు రాత్రులందు బయలఁ బరుండరు; పుష్యమాసము వచ్చినది. మంచుచే రాత్రికాలంబున ధూసరవర్ణముగానున్నది. చలియగుచున్నది. రాత్రులు అతిదీర్ఘంబులుగా నున్నవి. ౧౨

చంద్రునియందలి మనోహరతయు దర్శనీయతయు నిప్పుడు సూర్యునకుఁ గలిగియున్నది. మఱియుఁ జంద్రుఁడు మంచుచే నెఱ్ఱనిమండలముగలవాఁడగుటచే నిట్టూర్పులవలనఁ బ్రకాశము విడినయద్దమువలెఁ బ్రకాశింపకున్నాఁడు. ౧౩

పున్నమనాఁడుగూడ వెన్నెల తుషారమలిన మగుటంజేసి కాంతితగ్గి యెండతాఁకుడునకు నల్లనయిన దేహముగల సీతాదేవియుంబోలెనున్నది. ఎంతమాత్రము ప్రకాశింపదు. ౧౪

స్వభావంబుననే చల్లనిదియు నిప్పుడు హేమంతఋతువునందు మంచుదగులుటచేతఁ బ్రాతఃకాలంబున ద్విగుణశీతలంబు నగుపడమటివాయువు వీచుచున్నది. ౧౫

సూర్యుఁడుదయించునప్పుడు అడవులు ఆవిరితోఁగూడినవై యవగోధుమసంయుతంబులయి మధురంబుగాఁగూయు క్రౌంచసారసపక్షులతో నెంతయు నొప్పుచున్నది. ౧౬

చక్కఁగాఁ బండియుండుటచే బంగారువన్నెగల వరిపైరులు ఖర్జూరపుష్పములువలె నుండుతండులపూర్ణంబులగు వెన్నులభారంబునకుఁ గొంచెము వంగినవై యెంతయు నొప్పుచున్నవి. ౧౭

మయూఖై రుపసర్పద్భి ర్హిమనీహారసంవృతైః,
దూర మభ్యుదిత స్సూర్య శ్శశాఙ్క ఇవ లక్ష్యతే. ౧౮
అగ్రాహ్యవీర్యః పూర్వాహ్ణే మధ్యాహ్నే స్పర్శత స్సుఖః,
సంరక్తః కించి దాపాణ్డు రాతప శ్శోభతే క్షితౌ. ౧౯

అవశ్యాయనిపాతేన కించిత్ప్రక్లిన్నశాద్వలా,
వనానాం శోభతే భూమి ర్నివిష్టతరుణాతపా, ౨౦
స్పృశం స్తు విమలం శీత ముదకం ద్విరద స్సుఖమ్,
అత్యన్తతృషితో వన్యః ప్రతిసంహరతే కరమ్. ౨౧

ఏతే హి సముపాసీనా విహగా జలచారిణః,
నావగాహన్తి సలిల మప్రగల్భా ఇ వాహవమ్. ౨౨

అవశ్యాయతమోనద్ధా నీహారతమసావృతాః,
ప్రసుప్తా ఇవ లక్ష్యన్తే విపుష్పా వనరాజయః. ౨౩

బాష్పసంఛన్నసలిలా రుతవిజ్ఞేయసారసాః,
హిమార్ద్రవాలుకై స్తీరై స్సరితో భాన్తి సామ్ప్రతమ్. ౨౪

తుషారపతనా చ్చైవ మృదుత్వా ద్భాస్కరస్య చ,
శైత్యా దగాగ్రస్థమపి ప్రాయేణ రసవ జ్జలమ్. ౨౫

జరాజర్ఝరితైః పత్రై శ్శీర్ణకేసరకర్ణికైః,
నాళశేషా హిమధ్వస్తా న్న భాన్తి కమలాకరాః. ౨౬

అస్మిం స్తు పురుషవ్యాఘ్ర కాలే దుఃఖసమన్వితః,
తప శ్చరతి ధర్మాత్మా త్వద్భక్త్యా భరతః పురే. ౨౭

త్యక్త్వా రాజ్యంచ మానంచ భోగాం శ్చ వివిధా న్బహూన్,
తపస్వీ నియతాహార శ్శేతే శీతే మహీతలే. ౨౮

సోఽపి వేలా మిమాం నూన మభిషేకార్థ ముద్యతః,
వృతః ప్రకృతిభి ర్నిత్యం ప్రయాతి సరయూం నదీమ్. ౨౯
అత్యన్తసుఖసంవృద్ధ స్సుకుమారో హిమార్దితః,
కథం త్వపరరాత్రేషు సరయూ మవగాహతే. 30

పద్మపత్రేక్షణో వీరః శ్యామో నిరుదరో మహాన్,
ధర్మజ్ఞ స్సత్యవాదీ చ హ్రీనిషేధో జితేన్ద్రియః. 3౧
ప్రియాభిభాషీ మధురో దీర్ఘబాహు రరిన్దమః,
సంత్యజ్య వివిధా న్సౌఖ్యా నార్యం సర్వాత్మనా శ్రితః 3౨

జిత స్స్వర్గ స్తవ భ్రాత్రా భరతేన మహాత్మనా,
వనస్థ మపి తాపస్యే య స్త్వా మనువిధీయతే. 33

న పిత్ర్య మనువర్తన్తే మాతృకం ద్విపదా ఇతి,
ఖ్యాతో లోకప్రవాదోఽయం భరతే నాన్యథా కృతః. 3౪

భర్తా దశరథో యస్యా స్సాధు శ్చ భరత స్సుతః,

ఈకాలమునందును ధర్మాత్ముండును బురుషశ్రేష్ఠుండును నగుభరతుండు దుఃఖితుండై నీయందలి భక్తిచేత నయోధ్యాపురంబునఁ దపస్సు గావించుచున్నాఁడు. ౨౭

ఆభరతుఁడు రాజ్యంబును మానంబును నానావిధానేకభోగంబులను విడిచి మునివేషంబు ధరియించి ఫలమూలంబుల నాహారంబుగాఁ గొనుచుఁ జల్లని నేలపైఁ బరుండుచున్నాఁడు. ౨౮

ఆభరతుఁడును ఈసమయంబున స్నానము సేయుటకొఱకు లేచి ప్రకృతులచే సేవింపఁబడుచు సరయూనదికిం బోవును. ౨౯

మిక్కిలియు సుఖముగాఁ బెరిఁగినవాఁడును సుకుమారశరీరుండును సుఖోచితుండు నగు భరతుఁడు ఎట్లు అపరరాత్రుల లేచి సరయూనదియందు మునుంగును. ౩౦

తామరపూరేఁకులుం బోలె విశాలసుందరంబు లగుకన్నులు గలవాఁడును వీరుండును శ్యామలవర్ణుండును సన్నని నడుము గలవాఁడును బూజ్యుఁడును ధర్మవేత్తయు సత్యవాదియు లజ్జచేతనె యకృత్యంబుఁ జేయకుండువాఁడును జితేంద్రియుండును బ్రియంవదుండును మనోహరవిగ్రహుఁడును ఆజానుబాహుఁడును శత్రువుల నణఁగఁ ద్రొక్కఁ జాలినవాఁడును ఇట్లు సమస్తసుఖభోగార్హుఁ డగుభరతుఁడు సమస్త భోగంబులను విడిచి యన్నివిధంబుల నిన్నే పొందియున్నాఁడు. ౩౧,౩౨

మహాత్ముఁడగు నీతమ్ముఁడు భరతుఁడు నీ వడవిలో మునివేషంబు ధరించియున్నను దానును నీయట్లు మునివేషము ధరించి నిన్ననుసరించుచుండుటం జేసి స్వర్గమును జయించినవాఁ డయ్యె. ౩౩

భరతుఁడు తల్లిస్వభావము ననుసరింపక తండ్రిస్వభావంబునే యనుసరించుటంజేసి "మనుష్యులు తల్లిస్వభావము ననుసరింతురుగాని తండ్రిస్వభావంబు ననుసరింపరు" అను నీలోకోక్తి భరతుని విషయమై యబద్ధమయ్యె. ౩౪

ఎవ్వతెభర్త సత్పురుషాగ్రగణ్యుఁ డగుదశరథుఁడో ఎవ్వతెకొడుకు

కథం ను సాఽమ్బా కైకేయీ తాదృశీ క్రూరశీలినీ. ౩౫

ఇత్యేవం లక్ష్మణే వాక్యం స్నేహాద్బ్రువతి ధార్మికే,
పరివాదం జనన్యా స్తమసహ న్రాఘవోఽబ్రవీత్. ౩౬

న తేఽమ్బా మధ్యమా తాత! గర్హితవ్యా కథంచన,
తామే వేక్ష్వాకునాథస్య భరతస్య కథాం కురు. ౩౭

నిశ్చితాఽపి హి మే బుద్ధి ర్వనవాసే దృఢవ్రతా,
భరతస్నేహసంతప్తా బాలిశీక్రియతే పునః. ౩౮

సంస్మరా మ్యస్య వాక్యాని ప్రియాణి మధురాణి చ,
హృద్యా న్యమృతకల్పాని మనఃప్రహ్లాదనాని చ. ౩౯

కదా న్వహం సమేష్యామి భరతేన మహాత్మనా,
శత్రుఘ్నేన చ వీరేణ త్వయా చ రఘునన్దన!. ౪౦

ఇత్యేవం విలపం స్తత్ర ప్రాప్య గోదావరీం నదీమ్,
చక్రేఽభిషేకం కాకుత్స్థ స్సానుజ స్సహ సీతయా. ౪౧
తర్పయిత్వాఽథ సలిలై స్తే పితౄ న్దైవతాని చ,
స్తువన్తి స్మోదితం సూర్యం దేవతా శ్చ సమాహితాః. ౪౨
కృతాభిషేక స్స రరాజ రామ
స్సీతాద్వితీయ స్సహ లక్ష్మణేన,
కృతాభిషేకో గిరిరాజపుత్ర్యా
రుద్ర స్సనన్దీ భగవా నివేశః. ౪౩

ఇతి శ్రీమదరణ్యకాణ్డే షోడశ స్సర్గః. ౧౬.

సత్పురుషవీర్యుం డగుభరతుఁడో; అట్టి కైకేయికి ఇట్టి క్రూరస్వభావం బెట్లు గలిగెను? అని లక్ష్మణుఁడు రామునితోఁ జెప్పెను. ౩౫

అని యిట్లు ధార్మికుఁడగు లక్ష్మణుఁడుస్నేహంబునం జెప్పుచుండఁగా రాముఁడు అట్లు తల్లియగు కైకేయిని నిందించుటను సహింపఁజాలక యిట్లని చెప్పెను. ౩౬

నాయనా! నీ వెంతమాత్రము తల్లియగు కైకేయిని నిందింపరాదు; ఇదివఱకు నీవు చెప్పుచుంటివే ఆయిక్ష్వాకునాథుఁడగు భరతునిసమాచారము నే చెప్పుము. ౩౭

దృఢవ్రతుఁడనగు నేను వనవాసంబు సేయవలెనని నిశ్చయించినవాఁ డనైనను భరతునియందలి స్నేహంబున నతనిందలఁచుకొనునప్పుడెల్ల నాబుద్ధి మిక్కిలియుఁ జంచల మగుచున్నది. ౩౮

ప్రియంబులును మధురంబులును అమృతంబువంటివియునగు భరతుని మాటలను ఇప్పుడును నప్పుడప్పుడు తలఁచుకొనుచున్నాను; అవి తలఁచుకొన్నను మనంబునకు సంతోషకరంబులు గానున్నది. ౩౯

లక్ష్మణుఁడా! నేను మహాత్ముఁడగు భరతునితోఁ బరాక్రమవంతుఁ డగుశత్రుఘ్నుని నిన్నును మిమ్ముందఱనుంగూడి యెప్పుడు సుఖంబు ననుభవింపఁగలను. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౪౦

రాముఁడట్లు విలపించుచు గోదావరీనదిం జేరి సీతాలక్ష్మణులతోఁగూడ నచ్చట స్నానము గావించెను. ౪౧

అంత నాసీతారామలక్ష్మణులు పితృదేవతలకును దేవతలకును జలతర్పణంబు గావించి యుదితుఁడగుసూర్యుని దేవతలనుఁ బ్రస్తుతించిరి. ౪౨

రాముఁడు కృతస్నానుఁడై సీతాలక్ష్మణసహితుఁడై స్నానముచేసిన వాఁడును నందికేశసహితుఁడును భగవంతుఁడును జగన్నాథుఁడునగు శివుఁడుంబోలెఁ బ్రకాశించెను. ౪౩

ఇది పదునాఱవసర్గము.

---

## సప్తదశస్సర్గః.

కృతాభిషేకో రామస్తు సీతా సౌమిత్రి రేవచ,
తస్మా ద్గోదావరీతీరా త్తతో జగ్ము స్స్వమాశ్రమమ్. ౧
ఆశ్రమం త ముపాగమ్య రాఘవ స్సహలక్ష్మణః,
కృత్వా పౌర్వాహ్ణికం కర్మ పర్ణశాలా ముపాగమత్. ౨
ఉవాస సుఖిత స్తత్ర పూజ్యమానో మహర్షిభిః,
లక్ష్మణేన సహ భ్రాత్రా చకార వివిధాః కథాః. ౩
స రామః పర్ణశాలాయా మాసీన స్సహ సీతయా,
విరరాజ మహాబాహు శ్చిత్రయా చన్ద్రమా ఇవ. ౪

తథాఽఽసీనస్య రామస్య కథాసంసక్తచేతసః,
తం దేశం రాక్షసీ కాచి దాజగామ యదృచ్ఛయా. ౫

సా తు శూర్పణఖా నామ దశగ్రీవస్య రక్షసః,
భగినీ రామ మాసాద్య దదర్శ త్రిదశోపమమ్. ౬
సింహోరస్కం మహాబాహుం పద్మపత్రనిభేక్షణమ్,
ఆజానుబాహుం దీప్తాస్య మతీవ ప్రియదర్శనమ్. ౭
గజవిక్రాన్తగమనం జటామణ్డలధారిణమ్,
సుకుమారం మహాసత్త్వం పార్థివవ్యఞ్జనాన్వితమ్. ౮
రామ మిన్దీవరశ్యామం కన్దర్పసదృశప్రభమ్,
బభూ వేన్ద్రోపమం దృష్ట్వా రాక్షసీ కామమోహితా. ౯

సుముఖం దుర్ముఖీ రామం వృత్తమధ్యం మహోదరీ,

## పదునేడవసర్గము.

అట్లు స్నానంబు గావించిన పిమ్మట రాముఁడును సీతాలక్ష్మణులును గోదావరీతీరంబుననుండి తమయాశ్రమంబునకుఁ బోయిరి. ౧

రాముఁడు లక్ష్మణునితోఁ గూడ బ్రహ్మయజ్ఞము మొదలగు పూర్వాహ్ణమునందుఁ జేయవలసినకర్మముల నిర్వర్తించి పర్ణశాలం బ్రవేశించెను. ౨

అచ్చట రాముఁడు మహర్షులచేఁ బూజింపఁబడుచు లక్ష్మణునితో నానావిధంబులగు సారపుమాటలం జెప్పుచు సుఖంబున నుండెను. ౩

సీతాసమేతుఁడై యప్పర్ణశాలయందుఁ గూర్చుండియున్న మహాబాహుఁడగు నారాముఁడు చిత్రానక్షత్రయుక్తుఁడగు చంద్రుఁడుంబోలెఁ దేజరిల్లుచుండెను. ౪

అట్లు రాముఁడు మనస్సున కింపుగా మాటలు చెప్పుకొనుచుఁ బర్ణశాలయందుఁ గూర్చుండియుండఁగా నొకానొకరాక్షసస్త్రీ యాదృచ్ఛికముగా నాప్రదేశంబునకు వచ్చినది. ౫

రావణునిచెల్లెలును శూర్పణఖ యనుపేరుగలదియు నగు నారాక్షసి యచ్చటికి వచ్చి దేవసమానుఁడగు రాముం జూచెను. ౬

సింహంబునకుంబోలె విశాలంబగువక్షస్స్థలముగలవాఁడును మహాబాహుఁడును దామరసపత్రంబులుంబోలె విశాలసుందరంబులగు కన్నులుగలవాఁడును నాజానుబాహుఁడును దివ్యతేజంబున వెలుంగుచుండు ముఖంబుగలవాఁడును జూపరులకు మిక్కిలియు సంతోషంబు గలిగించువాఁడును మత్తగజంబునకుంబోలె గంభీరగమనంబుగలవాఁడును జటామండలంబుతో నొప్పువాఁడును సుకుమారశరీరుఁడును మహాబలుఁడును రాజచిహ్నయుక్తుఁడును నల్లకలువలుంబోలె శ్యామలవర్ణుఁడును నూతనమన్మథునిమాడ్కి సుందరాకారుఁడై తేజరిల్లుచున్నవాఁడును దేవేంద్రసమానుఁడు నగు రాముంజూచి యాశూర్పణఖ మోహించినది. ౭-౯

దుర్ముఖియు మహోదరియు వికటనేత్రయు నెఱ్ఱనివెండ్రుకలు గల

విశాలాక్షం విరూపాక్షీ సుకేశం తామ్రమూర్ధజా. ౧౦
ప్రీతిరూపం విరూపా సా సుస్వరం భైరవస్వనా,
తరుణం దారుణా వృద్ధా దక్షిణం వామభాషిణీ. ౧౧
న్యాయవృత్తం సుదుర్వృత్తా ప్రియ మప్రియదర్శనా,
శరీరజసమావిష్టా రాక్షసీ వాక్య మబ్రవీత్. ౧౨

జటీ తాపసరూపేణ సభార్య శ్శరచాపధృత్,
ఆగత స్త్వ మిమం దేశం కథం రాక్షససేవితమ్. ౧౩
కి మాగమనకృత్యం తే త త్త్వ మాఖ్యాతు మర్హసి,
ఏవ ముక్త స్తురాక్షస్యా శూర్పణఖ్యా పరన్తపః. ౧౪
ఋజుబుద్ధితయా సర్వ మాఖ్యాతు ముపచక్రమే,

అనృతం న హి రామస్య కదాచి దపి సమ్మతమ్. ౧౫
విశేషేణాఽఽశ్రమస్థస్య సమీపే స్త్రీజనస్య చ,

ఆసీ ద్దశరథో నామ రాజా త్రిదశవిక్రమః. ౧౬
తస్యాహ మగ్రజః పుత్త్రో రామో నామ జనై శ్శ్రుతః,

భ్రాతాఽయం లక్ష్మణో నామ యవీయా న్మా మనువ్రతః.౧౭

ఇయం భార్యా చ వైదేహీ మమ సీతేతి విశ్రుతా,
నియోగా త్తు నరేన్ద్రస్య పితు ర్మాతు శ్చ యన్త్రితః. ౧౮
ధర్మార్థం ధర్మకాఙ్క్షీ చ వనం వస్తు మిహాఽఽగతః,

దియు విరూపయు భయంకరమయిన కంఠధ్వనిగలదియు భయంకరాకారయు వృద్ధయు గ్రామ్యోక్తులాడునదియునగు నాశూర్పణఖ సుందరముఖుఁడును సన్ననడుముగలవాఁడును వెడల్పుకన్నులుగలవాఁడును నల్లనిసుందరములయిన వెండ్రుకలుగలవాఁడును జూపరులకుఁ బ్రియంబగురూపముగలవాఁడును శ్రావ్యమయిన కంఠధ్వనిగలవాఁడునుయౌవనవంతుఁడుఁనుజతురంబుగా మాటలాడువాఁడును శాస్త్రసమ్మతముగా నాచరించువాఁడునుజూపరులకుఁబ్రియుఁడును నగు రామునిం జూచి మన్మథపరవశయయి యిట్లని చెప్పెను.౧౦-౧౨

నీవు తాపసరూపంబు జటలు ధరించి ధనుర్బాణంబులుదాల్చి భార్యతోఁగూడ రాక్షససేవితంబగు నీప్రదేశంబున కెట్లు వచ్చినావు? ౧౩

నీ విచ్చటి కేలవచ్చితివి? ఇదంతయునాకు యథార్థముగాఁ జెప్పుము.

శత్రువుల దపింపఁ జేయునట్టిరాముఁడు శూర్పణఖ చెప్పినమాటలన్నియు విని కపటములేనివాఁడగుటచేఁ దనవృత్తాంతమునంతయు యథార్థముగాఁ జెప్ప నారంభించెను. ౧౪

రామున కసత్యము ఎప్పటికి నిష్టముగాదు; అందు విశేషించి తాపసధర్మం బవలంబించి యాశ్రమంబున నుండునప్పుడును స్త్రీల సమక్షమునందును ఎంతమాత్ర మసత్యమాడఁడు. ౧౫

దేవతలకుంబోలె బరాక్రమంబుగల దశరథుఁడను నొకరాజుండెను.

నే నాదశరథమహారాజు పెద్దకుమారుఁడను. నన్ను రాముఁడని జనులు పిలుతురు.

ఇతఁడు నాతమ్ముఁడు. ఇతనిపేరు లక్ష్మణుఁడండ్రు. ఎప్పటికి నన్ననుసరించి యుండును. ౧౬

ఈబిడ జనకమహారాజు కొమార్తె. నాభార్య. సీత యని యీబిడపేరు.

నేను నాతండ్రి దశరథమహారాజును నాతల్లి కైకేయియు నాజ్ఞాపించుటంజేసి పితృాజ్ఞాపరిపాలనరూపధర్మంబు నాచరించుటకై యీవనంబునకు వచ్చినాను. ౧౭

త్వాం తు వేదితు మిచ్ఛామి కథ్యతాం కాసి కస్య వా. ౧౯

న హి తావ న్మనోజ్ఞాఙ్గీ రాక్షసీ ప్రతిభాసి మే,
ఇహ వా కిన్నిమి త్తం త్వ మాగతా బ్రూహి తత్త్వతః. ౨౦

సాఽబ్రవీ ద్వచనం శ్రుత్వా రాక్షసీ మదనార్దితా,
శ్రూయతాం రామ! వక్ష్యామి తత్త్వార్థం వచనం మమ. ౨౧

అహం శూర్పణఖా నామ రాక్షసీ కామరూపిణీ,
అరణ్యం విచరా మీద మేకా సర్వభయఙ్కరా. ౨౨
రావణో నామ మే భ్రాతా బలీయా న్రాక్షసేశ్వరః,
వీరో విశ్రవసః పుత్త్రో యది తే శ్రోత్ర మాగతః. ౨౩

ప్రవృద్ధనిద్ర శ్చ సదా కుమ్భకర్ణో మహాబలః,

విభీషణ స్తు ధర్మాత్మా నతు రాక్షసచేష్టితః. ౨౪

ప్రఖ్యాతవీర్యౌ చ రణే భ్రాతరౌ ఖరదూషణౌ,

తా నహం సమతిక్రాన్తా రామ! త్వా పూర్వదర్శనాత్. ౨౫
సముపేతాఽస్మి భావేన భర్తారం పురుషోత్తమమ్,
అహం ప్రభావసమ్పన్నా స్వచ్ఛన్దబలగామినీ. ౨౬.
చిరాయ భవ మే భర్తా సీతయా కిం కరిష్యసి,
వికృతా చ విరూపా చ న సేయం సదృశీ తవ. ౨౭

నిన్నుఁ దెలియఁగోరియున్నాను; నీవెవ్వతెవు? ఎవ్వరికొమార్తెవు?
చెప్పుము. ౧౯

ఇంత సుందరమయిన రూపముగల నీవు రాక్షసి యని నాకుఁదోఁచలేదు.

నీ విచ్చటికేల వచ్చినావు? ఈసంగతియంతయు నాకు యథార్థము
గాఁ జెప్పుము, అని రాముండు శూర్పణఖతోఁ జెప్పెను. ౨౦

ఆశూర్పణఖ రాముని మాటను విని మన్మథపరవశయయి యిట్లని చెప్పెను.

రాముఁడా! యథార్థముగా నాసంగతి నంతయు జెప్పెదను; నామా
టను వినుము. ౨౧

నేను శూర్పణఖ యనురాక్షసిని కామరూపిణిని సమస్తప్రాణులును నా
పేరన్న భయపడుదురు ఒక్కతెనె యీ యడవియందుఁ దిరుగుచుందును.

బలవంతుండును బరాక్రమవంతుండును విశ్రవసుని కుమారుండును
రాక్షసేశ్వరుండు నగురావణుండు నాకు సహోదరుఁడు అతని నీవును విని
యుందువు. ౨౩

మహాబలశాలియు నెల్లప్పుడును మిక్కిలియు నిద్రపోవుచుండువాఁడు
నగుకుంభకర్ణుండును నా సహోదరుఁడు.

ధర్మాత్ముండగు విభీషణుండును నా సహోదరుఁడు అయితే అతండు
రాక్షసచేష్టలు గలవాఁడు గాఁడు. ౨౪

యుద్ధంబున వినుతికెక్కిన మహాపరాక్రమశాలు లగుఖరదూషణులును
నాసహోదరులు.

రాముఁడా! నేను నిన్నుఁ జూచినంతనె వారల నందఱం బరిత్యజించి
పురుషోత్తముండవగు నిన్ను భర్తగాఁ బొందవలెనని యున్నాను. ౨౫

నేను మహాప్రభావంబు గలదానను నాయిచ్చకొలఁది బలంబు నొందఁ
గలదానను. నాకు బహుకాలము భర్తవుగా నుండుము; ఈసీతతో నీకేమి
కార్యము. ౨౬

ఈసీత వికృతగాను కురూపిగాను నున్నది; ఈబిడ నీకుఁ దగినదికాదు.

అహ మే వానురూపా తే భార్యా రూపేణ పశ్య మామ్,
ఇమాం విరూపా మసతీం కరాళాం నిర్ణతోదరీమ్ ౨౮
అనేన తే సహ భ్రాత్రా భక్షయిష్యామి మానుషీమ్,
తతః పర్వతశృఙ్గాణి వనాని వివిధాని చ. ౨౯
పశ్యం త్సహ మయా కాన్త! దణ్డకా న్విచరిష్యసి,

ఇత్యేవ ముక్తః కాకుత్స్థః ప్రహస్య మదిరేక్షణామ్. ౩౦
ఇదం వచన మారేభే వక్తుం వాక్యవిశారదః.

ఇతి శ్రీమదరణ్యకాణ్డే సప్తదశ స్సర్గః. ౧౭.

---

## అష్టాదశ స్సర్గః.

తత శ్శూర్పణఖాం రామః కామపాశావపాశితామ్,
స్వచ్ఛయా శ్లక్ష్ణయా వాచా స్మితపూర్వ మథాబ్రవీత్. ౧

కృతదారోఽస్మి భవతి! భార్యేయం దయితా మమ,
త్వద్విధానాం తు నారీణాం సుదుఃఖా ససపత్నతా. ౨

అనుజ స్త్వేష మే భ్రాతా శీలవా న్ప్రియదర్శనః,
శ్రీమా నకృతదార శ్చ లక్ష్మణో నామవీర్యవాన్. ౩

అపూర్వీ భార్యయా చార్థీ తరుణః ప్రియదర్శనః,
అనురూప శ్చ తే భర్తా రూప స్యాస్య భవిష్యతి. ౪

ఏనం భజ విశాలాక్షి! భర్తారం భ్రాతరం మమ,
అసపత్నా వరారోహే! మేరు మర్కప్రభా యథా. ౫

నేనే నీకుఁ దగినదానను నన్ను భార్యగాఁ జూడుము.

వికృతరూపయును దుష్టాచారయును భయంకరాకారయును వ్రేలుకా ఘు కడుపుగలదియు నగునీమనుష్యస్త్రీని నీతమ్మునితోఁగూడ భక్షించెదను ౨౮

మనోహరుఁడా! అంత నీవు నన్నుఁగూడి పర్వతశిఖరంబులను నానావిధములగు వనంబులనుం జూచుచు దండకారణ్యంబున విహరింపఁగలవు. అని శూర్పణఖ రామునితోఁ జెప్పెను. ౨౯

మాటలుచెప్పుటయందు నేర్పరి యగురాముండు శూర్పణఖ చెప్పిన మాటను విని యాబిడం జూచి యిట్లని చెప్పెను. ౩౦

ఇది పదునేడవసర్గము.

## పదునెనిమిదవసర్గము.

అంత రాముండు కామపాశసంగత యగుశూర్పణఖం జూచి స్పష్టార్థమును మధురము నగువాక్యంబునఁ జిఱునగవు మొగంబునందోఁప నిట్లని చెప్పెను. ౧

అమ్మా నేను వివాహము చేసికొనియున్నాను; ఈబిడ నాభార్య ఈబిడయందు నాకుమిక్కిలి మక్కువయుఁ గలిగియుండును. మఱియు నీయట్టియుత్తమస్త్రీలకు సవతితో నుండుట కష్టము. ౨

ఇతఁడు నాతమ్ముఁడు; ఇతనిపేరు లక్ష్మణుఁడందురు సదాచారవంతుఁడు. మంచిరూపరి శ్రీమంతుఁడు. ఇతఁడు భార్యను వెంటదీసికొని రాలేదు మఱియు నితఁడు మిక్కిలియుఁ బరాక్రమశాలి. 3

ఇతఁడు ఇదివఱకు భార్యాసుఖం బెఱుంగనివాఁడు. కాఁబట్టి యితనికి భార్య కావలసియున్నది మఱియు నితండు యౌవనవంతుఁడును సుందరాకారుఁడునుగాన నీరూపంబున కనురూపంబుగా భర్తకాఁగలఁడు. ౪

సుందరములయిన పిఱుఁదులు గలదానవు వెడల్పులయిన కన్నులు గలదానవు నగుశూర్పణఖా! మేరుపర్వతమును సూర్యకాంతిపొందునట్లు నీవు

నాతమ్మునిఁ బెనిమిటిగాఁ బొందుము నీకుఁ జవతులులేక సుఖంబుగా నుండగలవు. అని రాముఁడు శూర్పణఖతోఁ జెప్పెను. ౫

కామమోహితయగు నాశూర్పణఖ రాముఁడు చెప్పినది విని యంతశీఘ్రంబున రామునివిడిచి లక్ష్మణునింజూచి యిట్లని పలికెను. ౬

ఉష్ణకాలమున సుఖశీతలమును శీతకాలమున సుఖోష్ణమునగు సంగము గలిగి భర్తయందనురాగముగల యుత్తమవనిత నగు నేను నీసౌందర్యమునకుఁ దగినభార్యను నీవు నన్నుంగూడి సౌఖ్యంబున నీదండకారణ్యమున నంతటను విహరింపుచుండుము. అని శూర్పణఖ లక్ష్మణునితోఁ జెప్పెను. ౭

మాటలుచెప్పుటయందుఁ బండితుఁడగు లక్ష్మణుఁడు శూర్పణఖ చెప్పినమాటనువిని చేటలవంటిగోళ్లతో నున్నయారాక్షసిం జూచి చిఱునగవు మొగంబునం దోఁప నిట్లని యుక్తంబుగాఁ బలికెను. ౮

తామరపువ్వువంటి రంగుగలదానవగు శూర్పణఖా! నీవు దాసుఁడనగు నాకు భార్యవై దాసివగుట కేలగోరెదవు? నాకు జ్యేష్ఠభ్రాతయగు నీరాముఁడు నాథుఁడు నే నతనికి దాసుఁడను. ౯

వెడల్పులయిన కన్నులుగల శూర్పణఖా! సిద్ధార్థురాలవును సుందరాంగివగు నీవు సంతోషంబున సర్వార్థసిద్ధిగల రామునకు రెండవభార్య వగుము.

ఈరాముఁడు వికృతరూపముగలదియు దుర్గుణురాలును భయంకరాకారయును వ్రేలుకాడుచుండు కడుపుగలదియు ముసలిదియునగు నీభార్యనువిడిచి నిన్నే భార్యగాఁ బొందును. ౧౧

ఉష్ణకాలమున సుఖశీతలమును శీతకాలమున సుఖోష్ణమునగుసంగము గలిగిభర్తయందనురాగముగల యుత్తమవనితవు సుందరములయిన పిఱుఁదులుగలదానవు నగుశూర్పణఖా! పండితుఁడగు వాఁ డెవ్వండు ఇట్టి సుందరాకారంబువిడిచి మనుష్యస్త్రీలయందు మనసునుంచును? అని లక్ష్మణుఁడు శూర్పణఖతోఁ జెప్పెను. ౧౨

భయంకరాకారయు వ్రేలుకాడుచుండు కడుపుగలదియునగు నాశూ

మన్యతే తద్వచ స్తథ్యం పరిహాసావిచక్షణా. ౧౩

సా రామం పర్ణశాలాయా ముపవిష్టం పరన్తపమ్,
సీతయా సహ దుర్ధర్ష మబ్రవీ త్కామమోహితా. ౧౪

ఏనాం విరూపా మసతీం కరాళాం నిర్ణతోదరీమ్,
వృద్ధాం భార్యామవష్టభ్య మాం న త్వం బహు మన్యసే. ౧౫
అద్యేమాం భక్షయిష్యామి పశ్యత స్తవ మానుషీమ్,
త్వయా సహ చరిష్యామి నిస్సపత్నా యథాసుఖమ్. ౧౬

ఇత్యుక్త్వా మృగశావాక్షీ మలాతసదృశేక్షణా,
అభ్యధావ త్సుసంక్రుద్ధా మహోల్కా రోహిణీ మివ. ౧౭

తాం మృత్యుపాశప్రతిమా మాపత న్తీం మహాబలః,
నిగృహ్య రామః కుపిత స్తతో లక్ష్మణ మబ్రవీత్. ౧౮

క్రూరై రనార్యై స్సౌమిత్రే! పరిహాసః కథంచన,
నకార్యః పశ్య వైదేహీం కథంచి త్సౌమ్య జీవతీమ్. ౧౯

ఇమాం విరూపా మసతీ మతిమత్తాం మహోదరీమ్,
రాక్షసీం పురుష వ్యాఘ్ర! విరూపయితు మర్హసి. ౨౦

ఇత్యుక్తో లక్ష్మణ స్తస్యాః క్రుద్ధో రామస్య పశ్యతః,
ఉద్ధృత్య ఖడ్గం చిచ్ఛేద కర్ణనాసం మహాబలః. ౨౧
నికృత్త కర్ణనాసా తు విస్వరం సా వినద్య చ,

ర్పణఖ లక్ష్మణునిమాటనువిని పరిహాసం బెట్టిదో యెఱుంగనిది కావున నామాటనంతయు యథార్థముగాఁ దలంచినది. ౧౩

మన్మథపరవశయగు నా శూర్పణఖ పర్ణశాలయందు సీతతోఁగూడ దుర్ధర్షుఁడై కూర్చుండియున్న శత్రుమర్దనుఁడగు రాముంజూచి యిట్లని పలికెను. ౧౪

నీవు వికృతరూపముగలిగి భయంకరాకారయయి వ్రేలుకాడుకడుపు గూడిన యీముసలిభార్యను దగ్గఱఁబెట్టుకొని నన్ను లక్ష్యము సేయకున్నావు. ఇప్పుడు నీవు చూచుచుండఁగానే యీమనుష్యస్త్రీని భక్షించెదను. అంతఁజరతిఱంపులేక నీతోఁగూడ సుఖంబుగ విహరించెదను అని శూర్పణఖ రామునితోఁ జెప్పెను. ౧౫

ఆశూర్పణఖ యిట్లుచెప్పి కన్నులుకొఱవులంబోలెభయంకరంబులయి గ్రాలఁ బఱమకుపితయయి క్రూరగ్రహములు రోహిణిం దఱుమునట్లు సీతాదేవిం దఱిమెను. ౧౬

మహాబలశాలియగు రాముఁడు మృత్యుపాశంబువలె నతిభయంకరయయి వచ్చుచున్న యాశూర్పణఖంజూచి కుపితుండై యదల్చి లక్ష్మణుం జూచి యిట్లని చెప్పెను. ౧౭

సౌమ్యుఁడవగు లక్ష్మణుఁడా! దుష్టులును క్రూరులు నగువారలతో నెంతమాత్రము పరిహాసమాడరాదు. ఇప్పుడు సీత బ్రతికియుండునట్లు చూడు కొనుము. ౧౮

పురుషశ్రేష్ఠుఁడవగు లక్ష్మణుఁడా! వికృతాకారయును దుష్టురాలును మిక్కిలియు మదించియున్నదియు మహోదరియునగు నీశూర్పణఖను అంగవిహీనఁగాఁజేయుము. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౨౦

మహాబలుఁ డగు లక్ష్మణుఁడు రామునిమాటనువిని క్రుద్ధుఁడై రాముని పార్శ్వంబున నున్న ఖడ్గంబుదీసి యాశూర్పణఖ ముక్కుంజెవులను ఛేదించెను.

భయంకరయాకారయగు శూర్పణఖ తనముక్కుఁజెవులను ఛేదించి నం

యథాగతం ప్రదుద్రావ ఘోరా శూర్పణఖా వనమ్ ౨౨

సా విరూపా మహాఘోరా రాక్షసీ శోణితోక్షితా,
ననాద వివిధా న్నాదా న్యథా ప్రావృషి తోయదః. ౨౩

సా విక్షరన్తీ రుధిరం బహుధా ఘోరదర్శనా,
ప్రగృహ్య బాహూ గర్జన్తీ ప్రవివేశ మహావనమ్. ౨౪

తతస్తు సా రాక్షససంఘసంవృతం
ఖరం జనస్థానగతం విరూపితా,
ఉపేత్య తం భ్రాతర ముగ్రదర్శనం
పపాత భూమౌ గగనా ద్యథాऽశనిః. ౨౫
తత స్సభార్యం భయమోహమూర్ఛితా
సలక్ష్మణం రాఘవ మాగతం వనమ్,
విరూపణం చాత్మని శోణితోక్షితా
శశంస సర్వం భగినీ ఖరస్య సా. ౨౬

ఇతి శ్రీమదరణ్యకాణ్డే - అష్టాదశ స్సర్గః. ౧౮.

## ఏకోనవింశ స్సర్గః

తాం తథా పతితాం దృష్ట్వా విరూపాం శోణితోక్షితామ్,
భగినీం క్రోధసన్తప్తః ఖరః పప్రచ్ఛ రాక్షసః. ౧

ఉత్తిష్ఠ తావ దాఖ్యాహి ప్రమోహం జహి సంభ్రమమ్,
వ్యక్త మాఖ్యాహి కేన త్వ మేవంరూపా విరూపితా. ౨
కః కృష్ణసర్ప మాసీన మాశీవిష మనాగసమ్,
తుద త్యభిసమాపన్న మఙ్గుళ్యగ్రేణ లీలయా. ౩

తట వికృతస్వరముగా నఱచి వచ్చినదారిఁబట్టి యడవికిఁ బరుగెత్తిపోయెను. ౨౨

అతిభయంకరాకారయగు నాశూర్పణఖ అట్లు విరూపగాఁ జేయఁబడి నెత్తురు వెల్లువలుగాఁగాఱ వర్షాకాలంబున మేఘముంబోలె నానావిధంబుగా నఱచెను. ౨౩

చూపరులకు భయంబుగలిగించునట్టి యాశూర్పణఖ నెత్తురుగాఱఁ జేతులంబట్టుకొని నానావిధంబుల రోదనంబుసేయుచు మహారణ్యంబుఁ జొచ్చెను. ౨౪

అంత నట్లు విరూపితయయిన శూర్పణఖ జనస్థానంబున బెక్కురాక్షసులంగూడియున్న భయంకరాకారుఁడగు తనసోదరుంజేరి దుఃఖావేశంబున నాకాశంబునుండి పిడుగుపడునట్లు నేలంబడెను. ౨౫

అంత నాశూర్పణఖ భయమోహంబులు పెనంగొన నెత్తురు వెల్లువలుగాఁగాఱ రాముఁడు సీతాలక్ష్మణులతోఁ గూడవనంబునకు వచ్చుటయుఁ దన్ను విరూపం జేయుటయు మొదలుగా సమాచారమంతయు ఖరునకుఁ జెప్పెను.

ఇది పదునెనిమిదవసర్గము.

---

## పందొమ్మిదవసర్గము.

అంత ఖరుఁడు అట్లు విరూపితయయి నెత్తురుచేఁదడుపఁడినదై నేలంబడియున్న తనతోఁబుట్టు శూర్పణఖంజూచి పరమకుపితుఁడై యిట్లని యడిగెను. ౧

లెమ్ము: సంగతినంతయుఁ జెప్పుము. మోహసంభ్రమంబుల విడువుము. ఎవ్వఁడు నిన్నిట్లు విరూపగాఁజేసెను? స్పష్టముగాఁ జెప్పుము. ౨

ఎవ్వఁడు తనజోలికిరాక తనంతటనూరకకూర్చుండియున్న కష్టసర్పమును విలాసార్థము వ్రేలిచేఁ గొట్టుచున్నాఁడు? ౩

కః కాలపాశ మాసజ్య కణ్ఠే మోహా న్న బుధ్యతే,
యస్త్వా మద్య సమాసాద్య పీతవా న్విష ముత్తమమ్. ౪

బలవిక్రమసంపన్నా కామగా కామరూపిణీ,
ఇమా మవస్థాం నీతా త్వం కేనా న్తకసమా గతా. ౫

దేవగన్ధర్వభూతానా మృషీణాం చ మహాత్మనామ్,
కోఽయ మేవం విరూపాం త్వాం మహావీర్య శ్చకార హ. ౬

న హి పశ్యా మ్యహం లోకే యః కుర్యా న్మమ విప్రియమ్,
అమరేషు సహస్రాక్షం మహేన్ద్రం పాకశాసనమ్. ౭
అద్యాహం మార్గణైః ప్రాణా నాదాస్యే జీవితాన్తకైః,
సలిలే క్షీర మాసక్తం నిష్పిబ న్నివ సారసః. ౮
నిహతస్య మయా సంఖ్యే శరసంకృత్తమర్మణః,
సఫేనం రుధిరం రక్తం మేదినీ కస్య పాస్యతి. ౯
కస్య పత్రరథాః కాయా న్మాంస ముత్కృత్య సంగతాః,
ప్రహృష్టా భక్షయిష్యన్తి నిహతస్య మయా రణే. ౧౦
తం న దేవా న గన్ధర్వా న పిశాచా న రాక్షసాః,
మయాఽపకృష్టం కృపణం శక్తా స్త్రాతు మిహాఽఽహవే. ౧౧
ఉపలభ్య శనై స్సంజ్ఞాం తం మే శంసితు మర్హసి,
యేన త్వం దుర్వినీతేన వనే విక్రమ్య నిర్జితా. ౧౨

ఇతి భ్రాతు ర్వచ శ్శ్రుత్వా క్రుద్ధస్య చ విశేషతః,
తత శ్శూర్పణఖా వాక్యం సబాష్ప మిద మబ్రవీత్. ౧౩
తరుణౌ రూపసంపన్నౌ సుకుమారౌ మహాబలౌ,

ఎవ్వఁడు మోహంబునఁ గంఠమునందు మృత్యుపాశంబుఁ దగిలించుకొని తెలిసికొనకున్నాఁడు? ఎవ్వఁడు నిన్నుఁ దాఁకి మహావేగంబగు విషంబు ద్రావినాఁడు? ౪

బలపరాక్రమంబులతోఁ గూడినదానవును గామగమనముగలదానవును గామరూపిణివి మృత్యుసమానవునగు నీకు నెవ్వఁడిట్టి దురవస్థ గావించినాఁడు. ౫

దేవతలలోఁగాని గంధర్వులలోఁగాని భూతంబులలోఁగాని మహాత్ములగు ఋషులలోఁగాని యెవ్వఁడు మహాపరాక్రమశాలి నిన్నిట్లు విరూప గావించెను? ౬

లోకంబున సహస్రాక్షుఁడును పాకాసురుంజంపినవాఁడునగు దేవేంద్రుఁడునుంగూడ నాకపకారంబు సేయజాలఁడు. ౭

హంసపక్షి నీటంగలసినపాలను ద్రావునట్లు నేనిప్పుడు ప్రాణాంతకరంబులగు బాణంబుల నెవ్వని ప్రాణంబులం గొనవలయు? ౮

ఎవ్వఁడు యుద్ధంబున నాచేత నిహతుఁడగుడు పక్షులు సంతోషంబున గుంపులుగూడి యతనిదేహంబుననుండి మాంసమును భక్షింపఁగలవు? ౯

ఎవ్వఁడు యుద్ధంబున నాబాణంబుల ఛిన్నమస్తుండై హతుండగుడు నురుఁగుతోఁగూడి యుష్ణమైయుండు నతనిరక్తంబును భూమి ద్రావఁగలదు?

నే నిప్పు డతని యుద్ధంబున కీడ్వఁగా దేవతలుగాని పిశాచములుగాని రాక్షసులుగాని యతని రక్షింపఁజాలరు. ౧౧

ఏదుష్టుఁడు పరాక్రమగర్వంబున నిన్నిట్లుగావించినవాఁడో నీవు తిన్నఁగా దెలివిఁదెచ్చుకొని యతని పేరుం జెప్పుము అని ఖరుఁడు శూర్పణఖతోఁ జెప్పెను. ౧౨

శూర్పణఖ పరమకుపితుఁడగు ఖరుఁడు చెప్పినమాటనువిని యంతఁ గన్నులం గన్నీళ్లుగాఱ నిట్లని చెప్పెను. ౧౩

యౌవనసంపన్నులును సౌందర్యవంతులును సుకుమారశరీరులును మహా

పుణ్డరీకవిశాలాక్షౌ చీరకృష్ణాజినామ్బరౌ. ౧౪
ఫలమూలాశనౌ దాన్తౌ తాపసౌ ధర్మచారిణౌ,
పుత్రౌ దశరథ స్యాస్తాం భ్రాతరౌ రామలక్ష్మణౌ. ౧౫

గన్ధర్వరాజ ప్రతిమౌ పార్థివవ్యఞ్జనాన్వితౌ,
దేవౌ వా మానుషౌ వా తౌ న తర్కయితు ముత్సహే. ౧౬

తరుణీ రూపసంపన్నా సర్వాభరణభూషితా,
దృష్టా తత్ర మయా నారీ తయో ర్మధ్యే సుమధ్యమా ౧౭

తాభ్యా ముభాభ్యాం సంభూయ ప్రమదా మధికృత్య తామ్,
ఇమా మవస్థాం నీతాఽహం యథాఽనాథాఽసతీ తథా. ౧౮
తస్యా శ్చానృజువృత్తాయా స్తయో శ్చ హతయో రహమ్,
సఫేనం పాతు మిచ్ఛామి రుధిరం రణమూర్ధని. ౧౯
ఏష మే ప్రథమః కామః కృతస్తాత! త్వయా భవేత్,
తస్యా స్తయో శ్చ రుధిరం పిబేయ మహ మాహవే. ౨౦

ఇతి తస్యాం బ్రువాణాయాం చతుర్దశ మహాబలాన్,
వ్యాదిదేశ ఖరః క్రుద్ధో రాక్షసా నన్తకోపమాన్.
మానుషౌ శస్త్రసంపన్నౌ చీరకృష్ణాజినామ్బరౌ,
ప్రవిష్టౌ దణ్డకారణ్యం ఘోరం ప్రమదయా సహ. ౨౧

తౌ హత్వా తాం చ దుర్వృత్తా ముపావర్తితు మర్హథ,
ఇయం చ రుధిరం తేషాం భగినీ మమ పాస్యతి. ౨౩
మనోరథోఽయ మిష్టోఽస్యా భగిన్యా మమ రాక్షసాః,

బలశాలులును బుండరీకంబుల వంటి వెడఁదకన్నులుగలవారలును నారచీరలును గృష్ణాజినంబును గట్టుకొన్నవారలును ఫలమూలంబుల నాహారంబుగాఁ గొనువారలును జితేంద్రియులును దాపసులును ధార్మికులునగు దశరథమహారాజకుమారులు రామలక్ష్మణు లనువార లన్నదమ్ము లిద్దఱు వనంబుననుండిరి.

ఆరామలక్ష్మణులు గంధర్వరాజసమానులుగాను రాజచిహ్నంబులతోఁ గూడినవారలుగాను నున్నారు: వారలు దేవతలో మనుష్యులో నాకుఁ దెలియకున్నది. ౧౬

యౌవనవంతురాలును సుందరాంగియు సమస్తభూషణంబులను దాల్చియున్నదియు సుందరమయిన నడుముగలదియునగు నొక్కవనిత వారియిద్దఱి నడుము నుండఁగంటిని. ౧౭

ఆస్త్రీనిమిత్తముగా వార లిద్దఱునుజేరి నన్ను అనాథనుంబోలె నిట్టియవస్థను బొందించినారు. ౧౮

యుద్ధాగ్రంబున హతులయిన యారామలక్ష్మణులయొక్కయు నావనితయొక్కయు నెత్తురును నురుఁగుతోఁగూడఁ ద్రావంగోరెదను. ౧౯

నాయనా! నేను యుద్ధంబున నామువ్వురి నెత్తురుఁ ద్రావవలయును; ఇది నామొదటికోర్కె; దీనిని నీవు గావింపవలయును. అని శూర్పణఖ ఖరునితోఁ జెప్పెను. ౨౦

ఇట్లుశూర్పణఖ చెప్పుచుండఁగా ఖరుఁడు కోపించి మహాబలశాలుల నంతకతుల్యులఁ బదునల్వురరాక్షసులం జూచి యిట్లని యాజ్ఞాపించెను. ౨౧

ఇద్దఱుమనుష్యులు నారచీరలను గృష్ణాజినంబునుగట్టుకొని యాయుధధారులయి ఒకస్త్రీని వెంటఁదీసికొని భయంకరమగు దండకారణ్యంబునకు వచ్చిరి. ౨౨

వారల నిద్దఱను దురాచారయగు నావనితను వధించిరండు; నాభగినియగునీశూర్పణఖ వారల నెత్తురుం ద్రావును. ౨౩

రాక్షసులారా! మీరలు మీపరాక్రమంబున నాసీతారామలక్ష్మణులం

శీఘ్రం సంపాద్యతాం తౌ చ ప్రమథ్య స్వేన తేజసా. ౧౪

ఇతి ప్రతి సమాదిష్టా రాక్షసా స్తే చతుర్దశ,
తత్ర జగ్ము స్తయా సార్ధం ఘనా వాతేరితా యథా. ౧౫

తత స్తు తే తం సముదగ్రతేజసం
తథాఽపి తీక్ష్ణప్రదరా నిశాచరాః,
న శేకు రేనం సహసా ప్రమర్దితుం
వనే ద్విపా దీప్త మివాగ్ని ముత్థితమ్. ౧౬

ఇతి శ్రీమదరణ్యకాణ్డే ఏకోనవింశ స్సర్గః. ౧౯.

---

## వింశ స్సర్గః.

తత శ్శూర్పణఖా ఘోరా రాఘవాశ్రమ మాగతా,
రక్షసా మాచచక్షే తౌ భ్రాతరౌ సహ సీతయా. ౧
తే రామం పర్ణశాలాయా ముపవిష్టం మహాబలమ్,
దదృశు స్సీతయా సార్ధం వైదేహ్యా లక్ష్మణేన చ. ౨
తా న్దృష్ట్వా రాఘవ శ్శ్రీమా నాగతాం స్తాం చ రాక్షసీమ్,
అబ్రవీ ద్భ్రాతరం రామో లక్ష్మణం దీప్తతేజసమ్. 3
ముహూర్తం భవ సౌమిత్రే! సీతాయాః ప్రత్యనన్తరః,
ఇమా నస్యా వధిష్యామి పదవీ మాగతా నిహ. ౪

వాక్య మేత త్తత శ్శ్రుత్వా రామస్య విదితాత్మనః,
తథేతి లక్ష్మణో వాక్యం రామస్య ప్రత్యపూజయత్. ౫
రాఘవోఽపి మహ చ్చాపం చామీకరవిభూషితమ్,
చకార సజ్యం ధర్మాత్మా తాని రక్షాంసి చాబ్రవీత్. ౬

జంపి నాతోఁడఁబుట్టినదాని కోరికను సిద్ధించునట్లు గావింపుఁడు. అనిఖరుఁ డాపదునలువురి రాక్షసుల కాజ్ఞాపించెను. ౨౪

అంత నాపదునలువురురాక్షసులు ఖరునియాజ్ఞను శిరసావహించి వాయువేగచోదితంబులగు మేఘంబులకైవడి నతివేగంబున నాశూర్పణఖతోఁ గూడ రాముని యాశ్రమంబునకుఁ బోయిరి. ౨౫

అంత నారాక్షసులు కఱకుబాణంబులుచేతం గలవారలయ్యు మహాతేజుఁడును దమ్ముఁజూచి యెదుర్కొన్నవాఁడు నగు రాముంజూచి నడవియేనుఁగులు మండుచున్నకార్చిచ్చుంజూచి భయపడునట్లు వెఱఁగంది ప్రహరింపఁజాలక యూరకుండిరి. ౨౬

ఇది పందొమ్మిదవసర్గము.

---

## ఇరువదియవసర్గము.

అంత భయంకరాకారయగు శూర్పణఖ రాముని యాశ్రమంబునకు వచ్చి సీతారామలక్ష్మణులను ఆరాక్షసులకుం జూపెను. ౧

ఆరాక్షసులు పర్ణశాలయందు జనకమహారాజపుత్రియగు సీతతోను లక్ష్మణునితోనుంగూడఁ గూర్చుండియున్న మహాబలుఁడగురాముఁ జూచిరి ౨

శ్రీమంతుఁడగురాముఁడు ఆపదునలువురురాక్షసులును శూర్పణఖయు వచ్చుటంజూచి మహాతేజుఁడగు తమ్ముఁడు లక్ష్మణునితో నిట్లని చెప్పెను. ౩

లక్ష్మణుఁడా! నీవు కొంచెముసేపు సీతయొద్దనుండుము; నే నిప్పుడు ఈశూర్పణఖకుఁ గావచ్చిన రాక్షసుల వధించివచ్చెదను. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౪

అంత లక్ష్మణుఁడు పరమాత్మవేత్తయగు రాముని మాటను విని అట్లే యని రాముని యాజ్ఞచొప్పునం బ్రవర్తించెను. ౫

ధర్మాత్ముఁడగు రాముఁడును గాంచనభూషితంబగు మహాధనువు నెక్కువెట్టి యారాక్షసులఁజూచి యిట్లని చెప్పెను. ౬

పుత్త్రౌ దశరథ స్యావాం భ్రాతరౌ రామలక్ష్మణౌ,
ప్రవిష్టౌ సీతయా సార్ధం దుశ్చరం దణ్డకావనమ్. ౭

ఫలమూలాశనౌ దాన్తౌ తాపసౌ ధర్మచారిణౌ,
వసన్తౌ దణ్డకారణ్యే కిమర్థ ముపహింసథ. ౮

యుష్మా న్పాపాత్మకా న్హన్తుం విప్రకారా న్మహాహవే,
ఋషీణాం తు నియోగేన ప్రాప్తోఽహం సశరాయుధః. ౯

తిష్ఠ తై వాత్ర సంతుష్టా నోపావర్తితు మర్హథ,
యది ప్రాణై రిహార్థో వా నివర్తధ్వం నిశాచరాః!.

తస్య తద్వచనం శ్రుత్వా రాక్షసా స్తే చతుర్దశ,
ఊచు ర్వాచం సుసంక్రుద్ధా బ్రహ్మఘ్నా శ్శూలపాణయః. ౧౧
క్రోధ ముత్పాద్య నో భర్తుః ఖరస్య సుమహాత్మనః,
త్వ మేవ హాస్యసే ప్రాణా న ద్యాస్మాభి ర్హతో యుధి. ౧౨

కా హి తే శక్తి రేకస్య బహూనాం రణమూర్ధని,
అస్మాక మగ్రతః స్థాతుం కిం పున ర్యోద్ధుమాహవే. ౧౩
ఏహి బాహుప్రయుక్తై ర్నః పరిఘై శ్శూలపట్టిసైః,
ప్రాణాం స్త్యక్ష్యసి వీర్యం చ ధను శ్చ కరపీడితమ్. ౧౪

ఇ త్యేవ ముక్త్వా సంక్రుద్ధా రాక్షసా స్తే చతుర్దశ,
చిక్షిపు స్తాని శూలాని రాఘవం ప్రతి దుర్జయమ్, ౧౫
తాని శూలాని కాకుత్స్థ స్సమస్తాని చతుర్దశ
తావద్భి రేవ చిచ్ఛేద శరైః కాఞ్చనభూషణైః. ౧౬

మేము దశరథమహారాజు కొడుకులము. అన్నదమ్ములము; మా పేరు రామలక్ష్మణులు; ఈబిడ పేరు సీత; ఈబిడతోఁగూడ దుర్గమంబగు నీదండకారణ్యంబునకు వచ్చినాము. ౭

మేము ఫలమూలంబులం దినుచు జితేంద్రియులమయి తపం బాచరించుచు ధర్మాచరణంబు గావించుచు దండకారణ్యంబున నున్నాము; మమ్మేల హింసించెదరు? ౮

నేను ఋషినియోగంబున సాధుహింసకులరును బాపాత్ములరునగు మిమ్ము యుద్ధంబున వధించుటకై యే ధనుర్బాణంబులు ధరించి యిచ్చటికి వచ్చినాను. ౯

దుష్టాత్ములరగు రాక్షసులారా! ఇచ్చటనే నిలువుఁడు; మిమ్ము వధించెదను. పైకి రావలదు. మీకుఁ బ్రాణాపేక్షకలదేని పాఱిపొండు. అని రాముఁడా రాక్షసులతోఁ జెప్పెను. ౧౦

బ్రాహ్మణఘాతకులగు నాపదునలువురు రాక్షసులు రాముని మాటను విని చేతుల శూలంబులు గ్రాలఁ బరమకుపితులయి యిట్లని పలికిరి. ౧౧

మహాపరాక్రమశాలియగు మాదొర ఖరునికిఁ గోపముగలుగునట్లు గావించినావు కావున నీవె యిప్పుడు యుద్ధంబున మాచే వధింపఁబడినవాఁడవై ప్రాణంబులు విడువంగలవు. ౧౨

నీవొక్కఁడవు యుద్ధంబునఁ బెక్కండ్రమగు మాయెదుట నిలుచుటకేని సమర్థుఁడవు కావు. ఇంకఁ బోరంజాల వని చెప్పనేల? ౧౩

యుద్ధంబునకు రమ్ము. మేము ప్రయోగించు పరిఘశూలపట్టసంబుల హీనపరాక్రముఁడవై ధనుస్సు జాఱవిడిచి ప్రాణంబులు విడువంగలవు. అని యారాక్షసులు రామునితోఁ జెప్పిరి. ౧౪

ఆపదునలువురు రాక్షసులు ఇట్లు చెప్పి కోపం బినుమడింప దుర్జయుఁడగు రాముని మీఁదికిఁ దమచేతిశూలంబుల వేసిరి. ౧౫

రాముఁడు ఆపదునాలుగుశూలంబులను గాంచనాలంకృతంబులగు పదునాలుగు బాణంబులచేత నడుమనే ఖండించెను. ౧౬

తతః పశ్చా న్మహాతేజా నారాచా న్సూర్యసన్నిభా న్,
జగ్రాహ పరమక్రుద్ధ శ్చతుర్దశ శిలాశితా న్. ౧౭

గృహీత్వా ధను రాయమ్య లక్ష్యా నుద్దిశ్య రాక్షసా న్,
ముమోచ రాఘవో బాణా న్వజ్రా నివ శతక్రతుః. ౧౮

రుక్మపుఙ్ఖాశ్చ విశిఖా దీప్తా హేమవిభూషితాః,
తే భిత్త్వా రక్షసాం వేగా ద్వక్షాంసి రుధిరాప్లుతాః. ౧౯
వినిష్పేతు స్తదా భూమౌ న్యమజ్జ న్తాశనిస్వనాః,

తే భిన్నహృదయా భూమౌ ఛిన్నమూలా ఇవ ద్రుమాః. ౨౦
నిపేతు శ్శోణితార్ద్రాఙ్గా వికృతా విగతాసవః,

తా న్దృష్ట్వా పతితా న్భూమౌ రాక్షసీ క్రోధమూర్ఛితా. ౨౧
పరిత్రస్తా పున స్తత్ర వ్యసృజ ద్భైరవస్వనా న్,
సా నద న్తీ మహానాదం జవాచ్ఛూర్పణఖా పునః. ౨౨
ఉపగమ్య ఖరం సా తు కించి త్సంశుష్కశోణితా,
పపాత పున రేవార్తా సనిర్యా సేవ సల్లకీ ౨౩
భ్రాతు స్సమీపే శోకార్తా ససర్జ నినదం మహుః,
సస్వరం ముముచే బాష్పం విషణ్ణవదనా తదా. ౨౪
నిపాతితా న్దృశ్య రణే తు రాక్షసా
న్ప్రధావితా శూర్పణఖా పున స్తతః,
వధం చ తేషాం నిఖిలేన రక్షసాం
శశంస సర్వం భగినీ ఖరస్య సా. ౨౫
ఇతి శ్రీమదరణ్యకాణ్డే వింశ స్సర్గః. ౨౦.

అంత మహాతేజుఁడగు రాముఁడు పరమకుపితుఁడై సూర్యసమానంబులును జక్కఁగా సానఁబెట్టఁబడి తీక్ష్ణములయి యున్నవియు నగు పదునాలుగుబాణంబులను గ్రహించెను. ౧౭

రాముఁడు అట్లు బాణంబులు గ్రహించి విల్లు వంచి రాక్షసుల నుద్దేశించి దేవేంద్రుఁడు వజ్రంబులం బ్రయోగించునట్లు ఆబాణంబులను వారలపైఁ బ్రయోగించెను. ౧౮

బంగారముతోఁ బూయఁబడిన పింజలుగలవియుఁ గాంతిమంతంబులును గాంచనాలంకృతంబులు నగు నాబాణంబులు వేగంబున నారాక్షసుల వక్షంబులభేదించి నెత్తురుతోఁ గూడ నావలికివెడలి పిడుగులుంబోలె భూమిని భేదించుకొని పోయినవి. ౧౯

ఆరాక్షసులు బాణంబులచే ఱొమ్ములు పగుల నెత్తుటం దోఁగుచు వికృతాకారు లయి ప్రాణంబులు విడిచి ఛిన్నమూలంబు లగు వృక్షంబులుంబోలె నేలం బడిరి. ౨౦

పరమకుపితయగు నాశూర్పణఖ యట్లు మృతులై నేలం బడిన రాక్షసులంజూచి భయమునొంది మఱల నచ్చట భయంకరంబుగా నఱచెను. ౨౧

ఆశూర్పణఖ అట్లు మాటిమాటికి భయంకరంబుగా నఱచుచు వేగంబున ఖరునియొద్దకుఁ బోయి మఱలఁ బరమదుఃఖిత యయి నెత్తురు గొంచె మెండియుండుటంజేసి నిర్యాసనహితంబగు నందుగుచెట్టుకైవడి నేలం బడెను.

అట్లు శూర్పణఖ ఖరునిసమీపంబుఁజేరి పలుమాఱు నానావిధంబుల నఱచి దుఃఖితయయి రోదనంబు సేయుచుఁ గన్నీళ్లు విడిచెను. ౨౪

ఖరుని తోఁడఁబుట్టినదగు శూర్పణఖ యాపదునలుగురు రాక్షసులు యుద్ధంబున హతులగుటం జూచినంతనే యచ్చో నిలువక పరుగెత్తి ఖరుని యొద్దకుఁబోయి యారాక్షసులందఱు హతులగుటమొదలుగా సమాచారమంతయు నతనితోఁ జెప్పెను. ౨౫

ఇది యిరువదియవసర్గము.

---

## ఏ క విం శ స్స ర్గః.

స పునః పతితాం దృష్ట్వా క్రోధా చ్ఛూర్పణఖాం ఖరః,
ఉవాచ వ్యక్తయా వాచా తా మనర్థార్థ మాగతామ్. ౧
మయా త్విదానీం శూరా స్తే రాక్షసా రుధిరాశనాః,
త్వత్ప్రియార్థం వినిర్దిష్టాః కిమర్థం రుద్యతే పునః. ౨
భక్తా శ్చైవానురక్తా శ్చ హితా శ్చ మమ నిత్యశః,
ఘ్నన్తోఽపి న నిహన్తవ్యా న నకుర్యు ర్వచో మమ. ౩

కి మేత చ్ఛ్రోతు మిచ్ఛామి కారణం యత్కృతే పునః,
హా నాథేతి వినర్దన్తీ సర్పవ ల్లుఠసి క్షితౌ. ౪

అనాథవ ద్విలపసి నాథేతు మయి సంస్థితే,
ఉత్తి ష్ఠోత్తిష్ఠ మాభైషీ ర్వైక్లబ్యం త్యజ్యతా మిహ. ౫

ఇత్యేవ ముక్తా దుర్ధర్షా ఖరేణ పరిసాన్త్వితా,
విమృజ్య నయనే సాస్రే ఖరం భ్రాతర మబ్రవీత్. ౬

అ స్మీదానీ మహం ప్రాప్తా హృతశ్రవణనాసికా,
శోణితౌఘపరిక్లిన్నా త్వయా చ పరిసాన్త్వితా. ౭
ప్రేషితా శ్చ త్వయా వీర! రాక్షసా స్తే చతుర్దశ,
నిహన్తుం రాఘవం క్రోధా న్మత్ప్రియార్థం సలక్ష్మణమ్. ౮
తే తు రామేణ సామర్షా శ్శూలపట్టసపాణయః,
సమరే నిహతా స్సర్వే సాయకై ర్మర్మభేదిభిః. ౯

## ఇరువదియొకటవసర్గము.

ఆఖరుఁడు అట్లు నేలం బడిన శూర్పణఖం జూచి కుపితుఁడై రాక్షస వినాశార్థమువచ్చిన యాశూర్పణఖతో స్పష్టవాక్యంబున నిట్లనిచెప్పెను. ౧

నేను ఇప్పుడే నీకొఱకు శూరులును రుధిరాహారులు నగు నారాక్షసులం బంపినానే మఱల నేల రోదనము చేసెదవు? ౨

ఆరాక్షసులు ఎల్లప్పుడును నాకు భక్తులయి నాయం దనురాగము గలిగి నాకు మేలుసేయుచుండువారలు. ఎట్టివారికైన శత్రువుల వధింపఁజాలినవారు. ఎవరికి జయింప నలవిగానివారలు, వారలు నాయాజ్ఞ మీఱరు. ౩

అట్లుండఁగా మఱల నిప్పుడువచ్చి "అయ్యో నాథుఁడా!" యని రోదసంబుసేయుచు సర్పముంబోలె నేలం బొరలుచున్నావే. ఇందుకుఁ గారణమేమి? చెప్పుము, వినఁగోరెదను. ౪

నేను నాథుఁడ నుండఁగానే నీ వనాథవలె రోదనము సేయుచున్నావేల? లెమ్ములెమ్ము. భయపడవలదు. దుఃఖము విడువుము. అని ఖరుఁడు శూర్పణఖతోఁ జెప్పెను. ౫

అట్లు ఖరుఁడు నానావిధవచనంబుల ననూనయింప దుర్ధర్షయగు నాశూర్పణఖ కన్నీళ్లం దుడుచుకొని యన్నయగు ఖరుం జూచి యిట్లని చెప్పెను. ౬

ఇప్పుడు నేను ముక్కుసెవులం బోఁగొట్టుకొని నెత్తుటఁదోఁగుచు నిచ్చటికి రాఁగానే నీవు నన్నూఱడించితివి. ౭

పరాక్రమవంతుఁడవగు ఖరుఁడా! నీవు నాకొఱకుఁ గోపించి రామలక్ష్మణుల వధించుటకు నాపదునలుగుర రాక్షసులను బంపినావు. ౮

ఆరాక్షసులందఱు శూలంబులఁ బట్టసంబులంగొని కోపంబున రామునిపై కడఁక యుద్ధంబున నారాముఁడు మర్మభేదకములగు బాణముల వారల నందఱ వధించెను. ౯

తా న్దృష్ట్వా పతితా న్భూమౌ క్షణే నైవ మహాబలాన్,
రామస్య చ మహ త్కర్మ మహాం స్త్రాసోఽభవ న్మమ. ౧౦

అహ మస్మి సముద్విగ్నా విషణ్ణా చ నిశాచర!,
శరణం త్వాం పునః ప్రాప్తా సర్వతో భయదర్శినీ. ౧౧

విషాదనక్రాధ్యుషితే పరిత్రాసోర్మిమాలిని,
కిం మాం న త్రాయసే మగ్నాం విపులే శోకసాగరే. ౧౨

ఏతే చ నిహతా భూమౌ రామేణ నిశితై శ్శరైః,
యేఽపి మే పదవీం ప్రాప్తా రాక్షసాః పిశితాశనాః. ౧౩
మయి తే యద్యనుక్రోశో యది రక్షస్సు తేషు చ,
రామేణ యది శక్తి స్తేజో వాఽస్తి నిశాచర!. ౧౪
దణ్డకారణ్యనిలయం జహి రాక్షసకణ్టకమ్,
యది రామం మమామిత్రం న త్వ మద్య వధిష్యసి. ౧౫
త వైవ చాగ్రతః ప్రాణాం స్త్యక్ష్యామి నిరపత్రపా,
బుద్ధ్యాఽహ మనుపశ్యామి న త్వం రామస్య సంయుగే. ౧౬
స్థాతుం ప్రతిముఖే శక్త స్సబల శ్చ మహాత్మనః,

శూరమానీ న శూర స్త్వం మిథ్యారోపితవిక్రమః. ౧౭
మానుషౌ యౌ న శక్నోషి హన్తుం తౌ రామలక్ష్మణౌ,

రామేణ యది తే శక్తి స్తేజో వాఽస్తి నిశాచర!. ౧౮

క్షణమాత్రముననే యట్టి మహాబలశాలులగు రాక్షసులు నేలం గూలుటయు రాముని యమేయపరాక్రమంబునుం జూడ నాకు మిక్కిలియుఁ భయంబు గలిగినది. ౧౦

ఖరుఁడా! నేను భయంబు నొంది దుఃఖార్తనై యున్నాను. ఎందుఁ జూచినను నాకు భయ మగుచున్నది. కావున మఱల నిన్నే శరణుపొందినాను. ౧౧

దిగులను మొసలితోఁ గూడినదియు భయమను తరంగసమూహముతోఁ గూడినదియు నగు విశాలంబగు దుఃఖసముద్రంబున మునింగి పరితపించుచున్న నన్ను రక్షింపవా యేమి? ౧౨

నావెంబడివచ్చిన మాంసాహారులగు నారాక్షసులనుంగూడ రాముఁడు తీక్ష్ణబాణంబుల వధించి పుచ్చెను. ౧౩

ఖరుఁడా! నీకు నాయందును ఆరాక్షసులయందును బ్రీతిగలిగియుండు నేని నీవు రామునకు సమానముగా బలపరాక్రమంబులుగలవాఁడవేని దండకారణ్యంబున రాక్షసకంటకుఁడగు నారాముని వధింపుము ౧౪

నీ విప్పుడు నాశత్రుఘ్నను రాముని వధింపవేని నే నిట్లు ముక్కుంజెవులుపోఁగొట్టుకొని సిగ్గులేనిదాననై నీయెదుటనే ప్రాణంబులు విడిచెదను.

నీవు సైన్యంబులతోఁ గూడినవాఁడవయ్యు యుద్ధంబున నపరిమేయపరాక్రమశాలియగు రామునియెదుట నిలువం జాలవని నాబుద్ధికిఁ దోఁచుచున్నది. ౧౫

మనుష్యులగు నారామలక్ష్మణుల వధింపఁజాలకున్నావు కావున నీ వెంతమాత్రము శూరుఁడవు కావు. అయినను బొంకులమాటలచే నేను శూరుఁడనని చెప్పుకొని మహాపరాక్రమశాలియగు శూరుఁడువలె నభినయించుచున్నావు. ౧౬

వంశమును జెఱుపఁబుట్టినట్టి ఖరుఁడా! నీవు రామునంతటి బలపరా

దణ్డకారణ్యనిలయం జహి తం కులపాంసన!,
నిస్సత్త్వ స్యాల్పవీర్యస్య వాస స్తే కీదృశ స్త్విహ. ౧౯
అపయాహి జనస్థానా త్త్వరిత స్సహబాన్ధవః,
రామతేజోఽభిభూతో హి త్వం క్షిప్రం వినశిష్యసి. ౨౦

స హి తేజస్సమాయుక్తో రామో దశరథాత్మజః,
భ్రాతా చాస్య మహావీర్యో యేన చాస్మి విరూపితా. ౨౧

ఏవం విలప్య బహుశో రాక్షసీ వితతోదరీ,
కరాభ్యా ముదరం హత్వా రురోద భృశదుఃఖితా. ౨౨

ఇతి శ్రీమదరణ్యకాణ్డే ఏకవింశ స్సర్గః.

---

## ద్వావింశ స్సర్గః.

ఏవ మాధర్షిత శ్శూర శ్శూర్పణఖ్యా ఖర స్తదా,
ఉవాచ రక్షసాం మధ్యే ఖరః ఖరతరం వచః. ౧
తవావమానప్రభవః క్రోధోఽయ మతులో మమ,
న శక్యతే ధారయితుం లవణామ్భ ఇవోత్థితమ్. ౨

న రామం గణయే వీర్యా న్మానుషం క్షీణజీవితమ్,
ఆత్మదుశ్చరితైః ప్రాణా న్హతో యోఽద్య విమోక్ష్యతి. ౩

బాష్పః సంహ్రియతా మేష సంభ్రమశ్చ విముచ్యతామ్,
అహం రామం సహ భ్రాత్రా నయామి యమసాదనమ్. ౪

క్రమంబులు గలవాఁడవేని దండకారణ్యంబున నివసింపుచున్న రామునివధింపుము. ౧౮

దుర్బలుఁడవు స్వల్పపరాక్రముఁడవు నగు నీవు భయంకరంబగు నీజనస్థానంబున నుండఁదగవు; కాఁబట్టి బంధుసహితంబుగా వేగంబున నిచ్చోటనుండి పొమ్ము. ౧౯

లేనియెడ నీవు రామునితేజంబునఁ బరాజితుఁడవై నాశంబు నొందుదువు. ౨౦

దశరథమహారాజకుమారుఁడగు నారాముఁడు మహాతేజుఁడు. నన్ను విరూపముగాఁ జేసినయతనితమ్ముఁడు లక్ష్మణుఁడును మహాపరాక్రమశాలి అని శూర్పణఖ ఖరునితోఁ జెప్పెను. ౨౧

పెద్దకడుపుగల యాశూర్పణఖ యిట్లు నానావిధంబుల విలపించి యంతదుఃఖంబు మఱియు వృద్ధినొందఁ జేతులతో నుదరంబు మోఁదికొనుచు రోదనంబు గావించెను. ౨౨

ఇది ఇరువదియొకటవసర్గము.

---

## ఇరువదిరెండవసర్గము.

శూరుఁడగుఖరుఁడు ఇట్లు శూర్పణఖ రాక్షసులనడుమఁ దన్నవమానింప దారుణాకారుఁడై భయంకరంబగువాక్యంబున నిట్లని పలికెను. ౧

నీకుఁ గలిగినయవమానముచే నాకిప్పుడు మితిలేనికోపము గలిగినది; ప్రళయకాలమునందుఁ బొంగినసముద్రజలమువలె దాని నిప్పుడు నిలుపనలవిగాదు. ౨

మనుష్యుఁడును నష్టాయువునగు రామునిపరాక్రమంబు నేనెంతమాత్రము సరకుసేయను. అతఁడు తాను గావించినదుష్టకార్యంబులకు ఫలముగా నిప్పుడు ప్రాణంబు విడువఁబోవుచున్నాఁడు. 3

కన్నీరు తుడుచుకొనుము. భయంబు విడువుము. నేను రామునిసతోని తమ్ముని లక్ష్మణుని యమపురికిం బంపెదను. ౪

పరశ్వధహత స్యాస్య మన్దప్రాణస్య సంయుగే,
రామస్య రుధిరం రక్త ముష్ణం పాస్యసి రాక్షసి!. ౫

సా ప్రహృష్టా వచ శ్శ్రుత్వా ఖరస్య వదనా చ్చ్యుతమ్,
ప్రశశంస పున ర్మౌర్ఖ్యా ద్భ్రాతరం రక్షసాం వరమ్. ౬
తయా పరుషితః పూర్వం పున రేవ ప్రశంసితః,
అబ్రవీ ద్దూషణం నామ ఖర స్సేనాపతిం తదా. ౭
చతుర్దశ సహస్రాణి మమ చిత్తానువర్తినామ్,
రక్షసాం భీమవేగానాం సమరే ష్వనివర్తినామ్. ౮
నీలజీమూతవర్ణానాం ఘోరాణాం క్రూరకర్మణామ్,
లోకహింసావిహారాణాం బలినా ముగ్రతేజసామ్. ౯
తేషాం శార్దూలదర్పాణాం మహాస్యానాం మహౌజసామ్,
సర్వోద్యోగ ముదీర్ణానాం రక్షసాం సౌమ్య! కారయ. ౧౦

ఉపస్థాపయ మే క్షిప్రం రథం సౌమ్య! ధనూంషి చ,
శరాం శ్చిత్రాం శ్చ ఖడ్గాం శ్చ శక్తీ శ్చ వివిధా శ్శితాః. ౧౧
అగ్రే నిర్యాతు మిచ్ఛామి పౌలస్త్యానాం మహాత్మనామ్,
వధార్థం దుర్వినీతస్య రామస్య రణకోవిదః. ౧౨

ఇతి తస్య బ్రువాణస్య సూర్యవర్ణం మహారథమ్,
సదశ్వై శ్శబలై ర్యుక్త మాచచక్షేఽథ దూషణః. ౧౩

తం మేరుశిఖరాకారం తప్తకాఞ్చనభూషణమ్,
హేమచక్ర మసంబాధం వైడూర్యమయకూబరమ్. ౧౪
మత్స్యైః పుష్పై ర్ద్రుమై శ్శైలై శ్చన్ద్రసూర్యై శ్చ కాఞ్చనైః,

శూర్పణఖా! నేను యుద్ధంబున నల్పాయువగు రామునిఁ గుఠారంబున వధించెను. అంత నీవు రాముని వేఁడినెత్తురుం ద్రావఁగలవు. అని ఖరుఁడు శూర్పణఖతోఁ జెప్పెను. ౫

ఆశూర్పణఖ ఖరుఁడు చెప్పినమాటనువినిసంతోషించి అవ్యవస్థితచిత్తయగుటవలన రాక్షసశ్రేష్ఠుఁడగు ఖరుని మఱలఁ బ్రశంసించెను. ౬

అట్లు శూర్పణఖ మొదట దూషించి వెనుక మఱలఁ బొగడినపిమ్మట ఖరుఁడు సేనానాయకుఁడగు దూషణుం జూచి యిట్లని చెప్పెను. ౭

నామనసు ప్రకారము నడచువారలును భయంకరవేగులును యుద్ధంబుల వెనుదీయనివారలును మేఘవర్ణులును భయంకరాకారులును క్రూరకర్ములును లోకహింసకులును బలవంతులును మహాతేజులు నగు రాక్షసులు పదునాలుగు వేలమంది యున్నారు. ౮, ౯

సౌమ్యుఁడవగు దూషణుఁడా! పెద్దపులులంబోలె దర్పముగలవారలును వికృతముఖులును మహాబలశాలురును గర్వితులునగు నా రాక్షసులకు యుద్ధమునకుఁ గావలసిన ప్రయత్నములన్నియుఁ గావింపుము. ౧౦

సౌమ్యుఁడవగు దూషణుఁడా! మఱియు నారథంబును ధనుస్సులను నానావిధంబులగు బాణంబులను ఖడ్గంబులను శక్తులను శీఘ్రంబునం దెమ్ము.

యుద్ధంబునం బండితుఁడ నగు నేను దుష్టుఁడగు రాముని వధించుటకు మహాత్ములగు పౌలస్త్యులలో నందఱికన్న ముందుపోవవలయు ననియున్నాను. అని ఖరుఁడు దూషణునితోఁ జెప్పెను. ౧౨

అట్లు ఖరుఁడు చెప్పుచుండఁగానే దూషణుఁడు సూర్యవర్ణంబును నానావర్ణంబు లగు నుత్తమాశ్వంబుగలదియు నగు మహారథం బాయత్తంబు బఱచెనని చెప్పెను. ౧౩

అంత ఖరుఁడు కోపంబున మేరుశిఖరాకారంబును గాంచనాలంకృతంబును బంగారుచక్రంబులుగలదియు విశాలంబును వైడూర్యమణితోఁ జేయఁబడిన నొగ గలదియు బంగారముతోఁ జేయఁబడినవియు మంగళకరం-

మఙ్గళ్యైః పక్షిసంఘైశ్చ తారాభి రభిసంవృతమ్. ౧౫
ధ్వజనిస్త్రింశసంపన్నం కిఙ్కిణీకవిరాజితమ్,
సదశ్వయుక్తం సోఽమర్షా దారురోహ ఖరో రథమ్. ౧౬

నిశామ్య తు రథస్థం తం రాక్షసా భీమవిక్రమాః,
తస్థు స్సంపరివా ర్యైనం దూషణం చ మహాబలమ్. ౧౭
ఖర స్తు తా న్మహేష్వాసా న్ఘోరవర్మాయుధధ్వజాన్,
నిర్యా తేత్యబ్రవీ ద్దృష్ట్వా రథస్థ స్సర్వ రాక్షసాన్. ౧౮

తత స్తద్రాక్షసం సైన్యం ఘోరవర్మాయుధధ్వజమ్,
నిర్జగామ జనస్థానా న్మహానాదం మహాజవమ్. ౧౯

ముద్గరైః పట్టిశై శ్శూలై స్సుతీక్ష్ణైశ్చ పరశ్వధైః,
ఖడ్గై శ్చక్రైశ్చ హస్తస్థై ర్భ్రాజమానైశ్చ తోమరైః. ౨౦
శక్తిభిః పరిఘై ర్ఘోరై రతిమాత్రైశ్చ కార్ముకైః,
గదాసిముసలై ర్వజ్రై ర్గృహీతై ర్భీమదర్శనైః. ౨౧
రాక్షసానాం సుఘోరాణాం సహస్రాణి చతుర్దశ,
నిర్యాతాని జనస్థానా త్ఖరచిత్తానువర్తినామ్. ౨౨
తాం స్త్వభిద్రవతో దృష్ట్వా రాక్షసా న్భీమవిక్రమాన్,
ఖర స్యాపి రథః కించి జ్జగామ తదనన్తరమ్. ౨౩
తత స్తా ఞ్ఛబలా నశ్వాం స్తప్తకాఞ్చనభూషితాన్,
ఖరస్య మత మాజ్ఞాయ సారథి స్సమచోదయత్. ౨౪
స చోదితో రథ శ్శీఘ్రం ఖరస్య రిపుఘాతినః,
శబ్దే నాపూరయామాస దిశ శ్చ ప్రదిశ స్తదా. ౨౫

బులునగు మత్స్యంబులతోను పుష్పంబులతోను వృక్షంబులతోను బర్వతంబులతోను జంద్రసూర్యబింబములతోను బక్షులతోను నక్షత్రంబులతోనుఁ గూడినదియు ధ్వజఖడ్గసంయుతంబును జిఱుగంటలతోఁ నొప్పుచున్నదియు నుత్తమాశ్వసమేతంబు నగు మహారథంబు నారోహించెను. ౧౪-౧౫

భయంకరమగు పరాక్రమముగలరాక్షసులు ఖరుఁడు రథంబు నారోహించినంతనే యతనిని మహాబలుఁడగు దూషణునిఁ బరివేష్టించి నిలిచిరి ౧౬

ఖరుఁడును రథంబుననుండి మహాధనుర్ధరులును భయంకరకవచాయుధధారులును ధ్వజంబులు పట్టుకొనియున్నవారలు నగు నారాక్షసుల నందఱం జూచి బయలుదేఱుఁడని యాజ్ఞాపించెను. ౧౭

అంత గొప్పగొప్పకవచంబులను ఆయుధంబులను ధరించియున్నరాక్షసులతోఁ గూడినదియుఁ బతాకాసమన్వితంబునగు నారాక్షససైన్యము మహాధ్వని గదుర మహావేగంబున జనస్థానంబుననుండి వెడలినది. ౧౮

భయంకరాకారంబులగు ముద్గరంబులు పట్టసంబులు శూలంబులు గొడ్డళ్లు ఖడ్గంబులు చక్రంబులు తోమరంబులు శక్తులు పరిఘంబులు ధనువులు గదలు ముసలంబులు వజ్రంబులు మొదలగు నాయుధంబుల ధరించినవారలును పరమభయంకరాకారులును ఖరునాజ్ఞ చొప్పున నడచువారలునగు రాక్షసులు పదునాలుగువేలమంది జనస్థానంబుననుండి రామునిపైకి యుద్ధంబుసేయఁ బోయిరి. ౨౦-౨౨

భయంకరపరాక్రములగు నారాక్షసులు బయలుదేఱిపోవుటంజూచి, దాని గొంచెమువెనుక ఖరునిరథంబువెడలినది. ౨౩

అంత సారథి ఖరునియభిప్రాయం బెఱింగి కాంచనాలంకృతంబులును చిత్రవర్ణంబులు నగు నశ్వంబుల శీఘ్రంబుగాఁ దోలెను. ౨౪

అప్పుడు సారథి శత్రువుల వధించునట్టి ఖరునిరథంబును వేగంబునం దోలఁగానే యారథధ్వనిచే దిక్కులును విదిక్కులును నిండినవి. ౨౫

ప్రవృద్ధమన్యు స్తు ఖరః ఖరస్వనో
రిపో ర్వధార్థం త్వరితో యథాఽన్తకః,
అచూచుద త్సారథి మున్నద న్ఘనం
మహాబలో మేఘ ఇ వాశ్మవర్షవాన్. ౨౬

ఇతి శ్రీమదరణ్యకాణ్డే ద్వావింశ స్సర్గః ౨౨.

---

## త్రయోవింశ స్సర్గః.

తస్మిన్ యాతేబలే ఘోర మశివం శోణితోదకమ్,
అభ్యవర్ష న్మహామేఘ స్తుములో గర్దభారుణః. ౧

నిపేతు స్తురగా స్తస్య రథయుక్తా మహాజవాః,
సమే పుష్పచితే దేశే రాజమార్గే యదృచ్ఛయా. ౨

శ్యామం రుధిరపర్యన్తం బభూవ పరివేషణమ్,
అలాతచక్రప్రతిమం పరిగృహ్య దివాకరమ్. 3
తతో ధ్వజ ముపాగమ్య హేమదణ్డం సముచ్ఛ్రితమ్,
సమాక్రమ్య మహాకాయ స్తస్థౌ గృధ్ర స్సుదారుణః. ౪
జనస్థానసమీపే తు సమాగమ్య ఖరస్వనాః,
విస్వరా న్వివిధాం శ్చక్రు ర్మాంసాదా మృగపక్షిణః. ౫
వ్యాజహ్రుశ్చ ప్రదీప్తాయాం దిశి వై భైరవస్వనమ్,
అశివం యాతుధానానాం శివా ఘోరా మహాస్వనాః. ౬
ప్రభిన్నగిరిసంకాశా స్తోయశోణితధారిణః,
ఆకాశం త దనాకాశం చక్రు ర్భీమా వలాహకాః. ౭

మహాబలుఁడగు ఖరుఁడు అంతకంతకుఁ గోపం బగ్గలంబుగా శత్రువధార్థమయి యముండుఁబోలెఁ జూపట్టుచు అొల్లవానగురియు మహామేఘంబుకరణి భయంకరనాదంబున గర్జించుచు సారథినిరథంబును వేగమునం దోలనాజ్ఞాపించెను. ౨౭

ఇది యిరువదిరెండవసర్గము.

---

## ఇరువదిమూఁడవసర్గము

రాక్షససేన జనస్థానంబుననుండి వెడలఁగానే గర్దభంబువలె ధూసరవర్ణంబగు మహామేఘము ఆసైన్యముపై నమంగళకరంబగు రక్తజలంబుఁ గురిసెను. ౧

అతని రథంబునకుఁ బూన్చియున్న మహావేగంబులగు గుఱ్ఱంబులు సమభూమియుఁ బూలం చల్లియున్నదియునగు రాజమార్గంబున దైవగతిచేఁ బడినవి. ౨

సూర్యునిచుట్టును నల్లనిదియు నంచునందుమాత్రము రక్తవర్ణంబును జక్రాకారంబగు కొఱవివలె నున్నదియు నగు పరివేషంబు కలిగినది. ౩

అంత మహాకాయంబును భయంకరంబు నగు నొకగద్ద బంగారుదండంబు గలదియు నత్యున్నతంబు నగు ధ్వజంబు నాక్రమించి నిలిచెను. ౪

మాంసభక్షకంబులగు మృగపక్షులు జనస్థానసమీపంబునంజేరి నానావిధంబులుగ వికృతంబుగా నఱచినవి. ౫

నక్కలు సూర్యుఁడు వెలుంగుదిక్కునంజేరి భయంకరంబులయి పేరెలుంగున రాక్షసుల కమంగళసూచకం బగునట్లు అఱచినవి. ౬

పగిలినపర్వతంబులతో సమానములును భయంకరములునగు మేఘములు నెత్తురువంటిజలమును వర్షించుచు నాకాశమంతయు నిరవకాశముగావించినవి. ౭

బభూవ తిమిరం ఘోర ముద్ధతం రోమహర్షణమ్,
దిశో వా విదిశో వాపి నచ వ్యక్తం చకాశిరే. ౮
క్షతజార్ద్రసవర్ణాభా సన్ధ్యా కాలం వినా బభౌ,

ఖర స్యాభిముఖా నేదు స్తదా ఘోరమృగాః ఖగాః. ౯
కఙ్కగోమాయుగృధ్రాశ్చ చుక్రుశు ర్భయశంసినః,

నిత్యాశుభకరా యుద్ధే శివా ఘోరనిదర్శనాః. ౧౦
నేదు ర్బల స్యాభిముఖం జ్వాలోద్గారిభి రాననైః,

కబన్ధః పరిఘాభాసో దృశ్యతే భాస్కరాన్తికే. ౧౧

జగ్రాహ సూర్యం స్వర్భాను రపర్వణి మహాగ్రహః,

ప్రవాతి మారుత శ్శీఘ్రం నిష్ప్రభోఽభూ ద్దివాకరః. ౧౨

ఉత్పేతుశ్చ వినా రాత్రిం తారాః ఖద్యోతసప్రభాః,

సంలీనమీనవిహగా నళిన్య శ్శుష్కపఙ్కజాః. ౧౩
తస్మి న్క్షణే బభూవు శ్చ వినా పుష్పఫలై ర్ద్రుమాః,

ఉద్ధూత శ్చ వినా వాతం రేణు ర్జలధరారుణః. ౧౪
వీచీకూ చీతివాశ్యన్త్యో బభూవు స్తత్ర శారికాః,
ఉల్కా శ్చాపి సనిర్ఘాతా నిపేతు ర్ఘోరదర్శనాః. ౧౫
ప్రచచాల మహీ సర్వా సశైలవనకాననా,

భయంకరంబును అధికంబును రోమహర్షణంబునగు చీఁకటి క్రమ్మినది. దిక్కులుగాని విదిక్కులుగాని యొంతమాత్రము ప్రకాశింపకుండినవి. ౮

సంధ్యాకాలము రాకమున్నే నెత్తురువంటి వర్ణముగల సంధ్య యడరినది.

అప్పుడు భయంకరములగు క్రూరమృగంబులును బక్షులును రాపులుఁగులును నక్కలును గద్దలును ఖరుని కెదురుమొగమయి భయంబు గలుగుట సూచింపుచు నఱచినవి. ౯

యుద్ధంబునఁ దప్పక యమంగళంబు గలిగించునట్టి సాన్నిధ్యంబుగల వియు భయంకరమయిన యాపదను గలిగించునవియునగు నక్కలు సైన్యమున కభిముఖముగా వక్త్రంబుల నగ్నిజ్వాలలు గదుర నఱచినవి. ౧౦

సూర్యుని సమీపంబున నినుపగుదియవంటి నల్లనిమనిషి మొండెము ఒకటి చూపట్టినది. ౧౧

రాహువు పూర్ణిమగాని యమావాస్యగాని కానికాలమునందు సూర్యుని గ్రసించెను.

వాయువు మహావేగంబునఁ బ్రతికూలంబుగా వీచెను. సూర్యుఁడు కాంతివిహీనుఁ డయ్యెను. ౧౨

పట్టపగటనే నక్షత్రంబులు మిడుఁగుఱుఁ బురువులుఁబోలె నుదయించినవి.

ఆసమయమునందుఁ దామరకొలంకులు మత్స్యములును జలపక్షులును జలంబుల నడంగి యుండినకమలంబులతోఁ గాంతిహీనంబు లయియుండినవి; వృక్షంబులఁ బుష్పఫలంబులు లేకుండినవి. ౧౩

ఆరాక్షససేనయందు గాలిలేకయే మేఘంబువలె ధూసరవర్ణముగు దుమ్ము లేఁగినది. గోరువంకలు పీచి కూచియని పరుషంబుగాఁ గూయుచుండినవి. ౧౪

చూపరులకు భయంకరంబుగా మహాకాంతితోఁ బిడుగులుపడినవి. పర్వతంబులతోను వనంబులతోనుంగూడ భూమియంతయుఁ జలనంబు నొందినది. ౧౫

ఖరస్య చ రథస్థస్య నర్దమానస్య ధీమతః. ౧౭
ప్రాకమ్పత భుజ స్సవ్య స్స్వర శ్చా స్యావసజ్జత,
సాస్రా సంపద్యతే దృష్టిః పశ్యమానస్య సర్వతః. ౧౮
లలాటే చ రుజా జాతా నచ మోహా న్న్యవర్తత,

తాం త్సమీక్ష్య మహోత్పాతా నుత్థితా న్రోమహర్షణాన్.
అబ్రవీ ద్రాక్షసాం త్సర్వా న్ప్రహసం త్స ఖర స్తదా,
మహోత్పాతా నిమాం త్సర్వా నుత్థితా న్ఘోరదర్శనాన్. ౧౯
న చిన్తయా మ్యహం వీర్యా ద్బలవా న్దుర్బలా నివ,

తారా అపి శరై స్తీక్ష్ణైః పాతయామి నభస్స్థలాత్. ౨౦
మృత్యుం మరణధర్మేణ సంక్రుద్ధో యోజయా మ్యహమ్,
రాఘవం తం బలోత్సిక్తం భ్రాతరం చాస్య లక్ష్మణమ్. ౨౧
అహత్వా సాయకై స్తీక్ష్ణై ర్నోపావర్తితు ముత్సహే,
సకామా భగినీ మేఽస్తు పీత్వా తు రుధిరం తయోః. ౨౨
యన్నిమిత్త స్తు రామస్య లక్ష్మణస్య విపర్యయః,

న క్వచి త్ప్రాప్తపూర్వో మే సంయుగేషు పరాజయః. ౨౩
యుష్మాక మేత త్ప్రత్యక్షం నానృతం కథయా మ్యహమ్,
దేవరాజ మపి క్రుద్ధో మత్తైరావతయాయినమ్. ౨౪
వజ్రహస్తం రణే హన్యాం కిం పున స్తౌ కుమానుషౌ,

సా తస్య గర్జితం శ్రుత్వా రాక్షసస్య మహాచమూః. ౨౫
ప్రహర్ష మతులం లేభే మృత్యుపాశావపాశితా,

రథంబుపైఁ గూర్చుండి గర్జించుచున్న బుద్ధిమంతుఁడగు ఖరుని యెడమభుజం బదరినది. అతనికంఠధ్వనియు డగ్గుత్తికతోఁ దడఁబడసాగినది.

ఖరుఁడును నాలుగుప్రక్కలఁ జూచినప్పుడు నిర్నిమిత్తముగా కన్నులలో నీళ్లుగాఱినవి. అతనికి నెత్తియం దొకవిధమయిన వికారముగలిగినది. అట్లయినను అతఁడు యుద్ధంబుసేయవలెనను తనయజ్ఞానమునువదలఁడయ్యె.

అప్పుడు ఖరుఁడు భయంకరములగు నాయుత్పాతంబు లుదయించుటం గని పకపకనవ్వుచు రాక్షసుల నందఱం జూచి యిట్లని చెప్పెను ౧౮

ఇప్పు డుదయించునట్టి భయంకరంబులగు నీమహోత్పాతంబులను నేను బరాక్రమబలంబున బలవంతుఁడు బలహీనులంబోలె నెంతమాత్రము సరకు సేయను. ౧౯

నేను గోపించినయెడఁ దీక్ష్ణబాణంబులనుంగూడ నాకాశంబుననుండి పడఁద్రోయుదును. మృత్యువునకుం గూడ మరణంబు గలిగింతును. ౨౦

నేను గఱకుబాణంబుల బలగర్వితుఁడగు రాముని అతనితమ్ముని లక్ష్మణుని వధింపక మఱలివచ్చుటలేదు. ౨౧

నాచెల్లెలు శూర్పణఖయు నారామలక్ష్మణుల రుధిరంబు ద్రావి తనకోరికి నీడేర్చుకొనుఁగాక. ఆబిడకొఱకే గదా యిప్పు డారామలక్ష్మణులకు నాశంబు వాటిల్లునది. ౨౨

ఇదివఱకు నాకెప్పుడును ఎందును యుద్ధంబునఁ బరాజయంబు గలిగినదిలేదు. ఇది మీకును జక్కఁగాఁ దెలిసినదేగదా! నేనబద్ధముఁ జెప్పలేదు. నేను గోపింతునేని యుద్ధంబున మదించిన యైరావతముపైఁ గూర్చుండిన వజ్రహస్తుఁడగు దేవేంద్రు నేని వధించిపుత్తును. ఇంక నా కుత్సితంపుమనుష్యులగు రామలక్ష్మణుల విషయమయి చెప్పనేల? అని ఖరుఁడు రాక్షసులతోఁ జెప్పెను. ౨౪

ఆసేనలోని రాక్షసులందఱు ఖరునిమాటను విని మృత్యుపాశవశంగతులు కావునఁ బరమసంతోషంబు నొందిరి. ౨౫

సమీయుశ్చ మహాత్మానో యుద్ధదర్శనకాఙ్క్షిణః. ౨౬
ఋషయో దేవగన్ధర్వాః సిద్ధా శ్చ సహ చారణైః,
సమేత్య చోచు స్సహితా స్తేఽన్యోన్యం పుణ్యకర్మణః. ౨౭
స్వస్తి గోబ్రాహ్మణేభ్యోఽస్తు లోకానాం యేఽభిసఙ్గతాః,
జయతాం రాఘవ స్సంఖ్యే పౌలస్త్యా న్రజనీచరాన్. ౨౮
చక్రహస్తో యథా యుద్ధే సర్వా నసురపుఙ్గవాన్,
ఏత చ్చాన్య చ్చ బహుశో బ్రువాణాః పరమర్షయః. ౨౯
జాతకౌతూహలా స్తత్ర విమానస్థా శ్చ దేవతాః,
దదృశు ర్వాహినీం తేషాం రాక్షసానాం గతాయుషామ్. 3౦
రథేన తు ఖరో వేగా దుగ్ర స్సైన్యో వినిస్సృతః,
తం దృష్ట్వా రాక్షసం భూయో రాక్షసా శ్చ వినిస్సృతాః. 3౧
శ్యేనగామీ పృథుగ్రీవో యజ్ఞశత్రు ర్విహఙ్గమః,
దుర్జయః కరవీరాక్షః పరుషః కాలకార్ముకః. 3౨
మేఘమాలీ మహామాలీ సర్పాస్యో రుధిరాశనః,
ద్వాదశైతే మహావీర్యాః ప్రతస్థు రభితః ఖరమ్. 33
మహాకపాలః స్థూలాక్షః ప్రమాథీ త్రిశిరా స్తథా,
చత్వార ఏతే సేనాన్యో దూషణం పృష్ఠతో యయుః. 3౪.
సా భీమవేగా సమరాభికామా
మహాబలా రాక్షసవీరసేనా,
తౌ రాజపుత్రౌ సహసా భ్యుపేతా
మాలా గ్రహాణా మివ చన్ద్రసూర్యౌ. 3౫

ఇతి శ్రీమదరణ్యకాణ్డే త్రయోవింశ స్సర్గః. ౨3.

మహాత్ములగు ఋషులును దేవతలును గంధర్వులును సిద్ధులును చారణు లును యుద్ధంబుఁ జూడఁగోరి యచ్చటికి వచ్చిరి. ౨౭

పుణ్యకర్ములగు నాదేవర్షి గంధర్వచారణులు అచ్చటికి వచ్చి యొక్క-టిగాఁ జేరి యొండొరులతో నిట్లని చెప్పుకొనిరి.

గోబ్రాహ్మణులకును ఎవ్వరు లోకహితంబుఁ గోరువారలో అట్టిమహా త్ములకును మంగళంబు గలుగుఁగాక. ౨౮

చక్రపాణియగు విష్ణుఁడు యుద్ధంబున నసురులనందఱను జయించి నట్లు రాముఁడు యుద్ధంబునఁ బులస్త్యవంశంబునం బుట్టినరాక్షసుల నంద ఱను జయించుఁగాక. అని దేవర్షి గంధర్వులు చెప్పుకొనిరి. ౨౯

యుద్ధంబుఁ జూచువేడుకతోఁగూడిన యమ్మహర్షులును దేవతలును విమానారూఢులయి గోబ్రాహ్మణులకు మంగళంబు గలుగుఁగాక యని పెంద లగుమాటలఁ జెప్పుకొనుచు గతాయుష్కులగు నారాక్షసుల సేనంజూచిరి.

భయంకరంబగు సైన్యముగల ఖరుఁడు రథము నెక్కి వేగంబున వెడ లెను. అతఁడు వెడలుటం జూచి రాక్షసు లందఱు వెడలిరి. 3౧

శ్యేనగామియుఁ బృథుగ్రీవుఁడును యజ్ఞశత్రుఁడును విహంగముఁడును దుర్జయుఁడును గరవీరాక్షుఁడును బరుషుఁడును గాలకార్ముకుఁడును మేఘ మాలియు మహామాలియు సర్పముఖుఁడును రుధిరాశనుండు నను మహాపరా క్రములగు నీపండ్రెండుగురురాక్షసులు ఖరునింబరివేష్టించి వెడలిరి. 3౨, 33

మహాకపాలియు స్థూలాక్షుఁడును బ్రమాథియుఁ ద్రిశిరుండునను నీన లుపురు సేనానాయకులు దూషణునిం బరివేష్టించి తరలిరి. 3౪

భయంకరవేగులును మహాబలశాలులునగు నారాక్షసవీరులందఱు యు ద్ధోత్సాహముప్పు నంగారకాదిగ్రహములు చంద్రసూర్యులం బొందునట్లు శ్రీరామలక్ష్మణులయొద్దకుఁ బోయిరి. 3౫

ఇది ఇరువదిమూఁడవ సర్గము.

## చతుర్వింశ స్సర్గః.

ఆశ్రమం ప్రతి యాతే తు ఖరే ఖరపరాక్రమే,
తానే వౌత్పాతికా న్రామ స్సహ భ్రాత్రా దదర్శ హ. ౧

తా నుత్పాతా న్మహాఘోరా నుత్థితా న్రోమహర్షణాన్,
ప్రజానా మహితాన్దృష్ట్వా వాక్యం లక్ష్మణ మబ్రవీత్. ౨

ఇమా న్పశ్య మహాబాహో! సర్వభూతాపహారిణః,
సముత్థితా న్మహోత్పాతాన్ సంహర్తుం సర్వరాక్షసాన్. ౩

అమీ రుధిరధారా స్తు విసృజన్తః ఖరస్వనాః,
వ్యోమ్ని మేఘా వివర్తన్తే పరుషా గర్దభారుణాః. ౪
సధూమా శ్చ శరా స్సర్వే మమ యుద్ధాభినన్దినః,
రుక్మపృష్ఠాని చాపాని వివేష్టన్తే చ లక్ష్మణ!. ౫

యాదృశా ఇహ కూజన్తి పక్షిణో వనచారిణః,
అగ్రతో నో భయం ప్రాప్తం సంశయో జీవితస్య చ. ౬
సంప్రహార స్తు సుమహా న్భవిష్యతి న సంశయః,
అయ మాఖ్యాతి మే బాహు స్స్ఫురమాణో ముహుర్ముహుః. ౭
సన్నికర్షే తు న శ్శూర! జయం శత్రోః పరాజయమ్,

సప్రభం చ ప్రసన్నం చ తవ వక్త్రం హి లక్ష్యతే. ౮
ఉద్యతానాం హి యుద్ధార్థం యేషాం భవతి లక్ష్మణ!,
నిష్ప్రభం వదనం తేషాం భవత్యాయుఃపరిక్షయః. ౯

## ఇరువదినాలవసర్గము.

భయంకరంబగు పరాక్రమంబుగల ఖరుఁడు రామునియాక్రమంబునకుఁ బయనం బగుచుండ రాముఁడు లక్ష్మణునితోఁ గూడ మున్ను దాహరింపఁబడిన యుత్పాతంబులనే గాంచెను. ౧

రాముఁడు మహాభయంకరంబులును రోమహర్షణంబులును జనులకుఁ గీడుగావించునవియు నగునట్టి యుత్పాతంబులు పొడసూపుటం గని లక్ష్మణుం జూచి యిట్లని చెప్పెను. ౨

మహాబాహుఁడ వగు లక్ష్మణుఁడా! సమస్తరాక్షసులను సంహరించుటకై సర్వభూతభయంకరంబులగు నీమహోత్పాతంబులు పొడసూపినవి. చూడుము. ౩

పరుషములు గార్దభవర్ణములు నగునీమేఘంబులు రక్తధారలు వర్షింపుచు మహాధ్వనిగలుగునట్లు గర్జించుచు నాకాశంబునఁ దిరుగుచున్నవి. ౪

లక్ష్మణుఁడా! నాబాణము లన్నియు పొగరాజుచు యుద్ధంబుఁ గోరుచున్నవి. కాంచనాలంకృతంబులగు నాధనుస్సులు యుద్ధోత్సాహంబున నాతురంబు లయి పొరలుచున్నవి. ౫

ఇప్పుడు కూయుచుండునట్టి వనచరపక్షులం జూడఁగా ముందు మనకు భయంబును బ్రాణసంశయంబును గలుగునని తోఁచుచున్నది. ౬

మహాయుద్ధంబు మాత్రము జరుగును. ఇందుకు సందేహములేదు. నా దక్షిణభుజము మాటికి మాటికి స్ఫురించుచుండుటవలనఁ దెలియవచ్చినది. ౭

శూరుఁడవగు లక్ష్మణుఁడా! ఇఁక శీఘ్రంబుననె మనకు జయంబును గలుగును.

నీముఖంబును గాంతిమంతంబును బ్రసన్నంబును గాఁజూపట్టుచున్నది.

లక్ష్మణుఁడా! యుద్ధము వచ్చినప్పుడు ఎవ్వరిముఖము కాంతిహీనముగునో వారలకుం బ్రాణహాని కలుగును. ౯

రక్షసాం నర్దతాం ఘోర శ్శ్రూయతే చ మహాధ్వనిః,
ఆహతానాం చ భేరీణాం రాక్షసైః క్రూరకర్మభిః. ౧౦
అనాగతవిధానం తు కర్తవ్యం శుభ మిచ్ఛతా,
ఆపదం శఙ్కమానేన పురుషేణ విపశ్చితా. ౧౧

తస్మాద్గృహీత్వా వైదేహీం శరపాణి ర్ధనుర్ధరః,
గుహా మాశ్రయ శైలస్య దుర్గాం పాదపసంకులామ్. ౧౨
ప్రతికూలితు మిచ్ఛామి న హి వాక్య మిదం త్వయా,
శాపితో మమ పాదాభ్యాం గమ్యతాం వత్స! మా చిరమ్. ౧౩
త్వం హి శూర శ్చ బలవా న్హన్యా హ్యేతా న్న సంశయః,
స్వయం తు హన్తు మిచ్ఛామి సర్వా నేవ నిశాచరాన్.

ఏవ ముక్త స్తు రామేణ లక్ష్మణ స్సహ సీతయా,
శరా నాదాయ చాపం చ గుహాం దుర్గాం సమాశ్రయత్. ౧౪
తస్మి న్ప్రవిష్టే తు గుహాం లక్ష్మణే సహ సీతయా,
హా! నిర్యుక్త మిత్యుక్త్వా రామః కవచ మావిశత్. ౧౫

స తే నాగ్నినికాశేన కవచేన విభూషితః,
బభూవ రామ స్తిమిరే విధూమోఽగ్ని రివోత్థితః. ౧౬

స చాప ముద్యమ్య మహ చ్ఛరా నాదాయ వీర్యవాన్,
బభూ వావస్థిత స్తత్ర జ్యాస్వనైః పూరయ న్దిశః. ౧౭
తతో దేవా స్సగన్ధర్వాః సిద్ధా శ్చ సహ చారణైః,
సమేయు శ్చ మహాత్మానో యుద్ధదర్శనకాఙ్క్షిణః. ౧౮
ఋషయ శ్చ మహాత్మానో లోకే బ్రహ్మర్షిసత్తమాః,

ఇదిగో రాక్షసులసింహనాదంబులును భేరీధ్వనులును మహాభయంకరముగా మనవీనులకు వినవచ్చుచున్నవి. ౧౦

ఆపదవచ్చునేమో యని భయపడువాఁడును మంగళంబు గోరువాఁడును బండితుఁడునగు పురుషుఁడు ఆపదవచ్చుటకు మున్నె దానికిఁ బ్రతీకారంబు సేయవలసినది. ౧౧

అందువలన నీవు ధనుర్బాణంబులుధరించి సీతందీసికొని దుర్గమంబును వృక్షములచే నాచ్ఛాదితంబునగు గుహం బ్రవేశించి కాచియుండుము. ౧౨

లక్ష్మణుఁడా! నీ వీమాట కడ్డముచెప్పవలదు; జాగుసేయవలదు. శీఘ్రముగాఁ బొమ్ము. ౧౩

నీవును శూరుఁడవు బలవంతుఁడవు. ఈరాక్షసుల నందఱను వధింపఁ జాలుదువు ఇందుకు సందియములేదు. అయితే నేనే యీరాక్షసుల నందఱ వధింపఁ దలఁచి యున్నాను. ౧౪

లక్ష్మణుఁడు రామునిమాటను విని ధనుర్బాణంబులను దాల్చి సీతాదేవిం దీసికొని దుష్ప్రవేశంబగు గుహ నాశ్రయించెను. ౧౫

లక్ష్మణుఁడు సీతాదేవిం దీసికొని గుహం బ్రవేశించినపిదప రాముఁడు "ఆ! మంచియుపాయంబు దోఁచినది." అనిచెప్పి మేనం గవచంబు ధరించెను. ౧౬

అగ్నిహోత్రమువలె వెలుంగుచున్నట్టి యాకవచము దొడుగుకొన్న పిదప రాముఁడు చీఁకటియందుఁ బొగలేక మండుచున్న యగ్నిపగిది వెలుఁగుచుండెను. ౧౭

మహాపరాక్రమశాలియగు నారాముఁడు అట్లు మహాధనుస్సును బాణంబులను దీసికొని జ్యాఘోషంబుల దిక్కులు పిక్కటిల్లఁ జేయుచునుండెను.

అంత మహాత్ములగు దేవతలును గంధర్వులును సిద్ధులును జారణులును యుద్ధంబుఁ జూచుటకై వచ్చిరి. ౧౮

పుణ్యకర్ములును మహాత్ములును బ్రహ్మర్షిప్రవరులును వసుబుధులును

సమేత్య చోచు స్సహితా అన్యోన్యం పుణ్యకర్మణః. ౧౦
స్వస్తి గోబ్రాహ్మణేభ్యోఽస్తు లోకానాం యేఽభిసంగతాః,

జయతాం రాఘవో యుద్ధే పౌలస్త్యా న్రజనీచరాన్. ౧౧
చక్రహస్తో యథా యుద్ధే సర్వా నసురపుఙ్గవాన్,

ఏవ ముక్త్వా పునః ప్రోచు రాలోక్య చ పరస్పరమ్. ౧౨

చతుర్దశ సహస్రాణి రక్షసాం భీమకర్మణామ్,
ఏకశ్చ రామో ధర్మాత్మా కథం యుద్ధం భవిష్యతి. ౧౩

ఇతి రాజర్షయ స్సిద్ధా స్సగణా శ్చ ద్విజర్షభాః,
జాతకౌతూహలా స్తస్థు ర్విమానస్థా శ్చ దేవతాః. ౧౪
ఆవిష్టం తేజసా రామం సంగ్రామశిరసి స్థితమ్,
దృష్ట్వా సర్వాణి భూతాని భయా ద్వివ్యథిరే తదా. ౧౫
రూప మప్రతిమం తస్య రామ స్యాక్లిష్టకర్మణః,
బభూవ రూపం క్రుద్ధస్య రుద్ర స్యేవ పినాకినః. ౧౬
ఇతి సంభాష్యమాణే తు దేవగంధర్వచారణైః,
తతో గమ్భీరనిర్హ్రాదం ఘోరవర్మాయుధధ్వజమ్. ౧౭
అనీకం యాతుధానానాం సమన్తా త్ప్రత్యదృశ్యత,
సింహనాదం విసృజతా మన్యోన్య మభిగర్జతామ్. ౧౮
చాపాని విస్ఫారయతాం జృమ్భతాం చాప్యభీక్ష్ణశః,
విప్రఘుష్టస్వనానాం చ దున్దుభీం శ్చాపి నిఘ్నతామ్. ౧౯
తేషాం సుతుముల శ్శబ్దః పూరయామాస తద్వనమ్,

అచ్చోటికి విచ్చేసి యందఱుంజేరి యొండొరులతో నిట్లని చెప్పుకొనిరి. ౨౦

గోబ్రాహ్మణులకును లోకహితార్థులగువారలకును మంగళంబు గలుగుఁగాక.

చక్రపాణియగు విష్ణుదేవుఁడు సమస్తాసురులను జయించినట్లు రాముఁడు పౌలస్త్యులగు రాక్షసుల నందఱను యుద్ధంబున జయించుఁగాక. అని యాదేవాదులు పరస్పరము చెప్పుకొనిరి. ౨౧

ఈప్రకారమునం జెప్పి యాదేవతలు మున్నగువారలు మఱల నొండొరులం జూచి యిట్లని చెప్పుకొనిరి. ౨౨

భయంకరకర్ములగు రాక్షసులు పదునాలుగువే లున్నవారు; ధర్మాత్ముఁడగు రాముఁడొక్కఁడే. యుద్ధంబెట్లు జరగును? అని దేవతలు మున్నగువారలు చెప్పుకొనిరి. ౨౩

ఇట్లు రాజర్షులును సిద్ధులును బ్రహ్మర్షులును దేవతలును యుద్ధంబుఁ జూచువేడుకతో విమానారూఢులయి యాకాశంబున నుండిరి. ౨౪

అప్పుడు అద్భుతంబగు తేజస్సుతోఁగూడి యుద్ధాగ్రంబుననున్న రాముంజూచి సమస్తభూతంబులును భయమోహితంబులయినవి. ౨౫

అప్పుడు క్రుద్ధుఁడయిన యక్లిష్టకర్ముఁడగు నారాముని యాకారంబు క్రుద్ధుఁడగురుద్రుని యాకారంబుపగిది నెంతయు భయంకరంబై యొప్పినది.

ఇట్లు దేవగంధర్వచారణులు చెప్పుకొనుచుండఁగానే అంత గంభీరధ్వనియు భయంకరంబులగు కవచంబులు నాయుధంబులును ధ్వజంబులును గలదియు నగు నారాక్షససైన్యము ఎల్లెడలం జూపట్టినది ౨౬

సింహనాదంబులు సేయువారలును ఒండొరులం జూచి నేను జయించెద నేను జయించెదనని యుచ్చైర్నాదంబున నుద్ఘోషించువారలును జ్యానాదంబులు గావించువారలును మదంబున నావలింతలు విడుచువారలును మహాధ్వనులు గలుగున ట్లఱచువారలును భేరులు వాయించువారలు నగు నారాక్షసుల తుములధ్వని యావనంబంతయు నిండి చెలంగినది. ౨౭, ౨౮

తేన శబ్దేన విత్రస్తా శ్శ్వాపదా వనచారిణః. ౩౦
దుద్రువు ర్యత్ర నిశ్శబ్దం పృష్ఠతో న వ్యలోకయన్.
తత్త్వనీకం మహాఘోరం రామం సముపసర్పత. ౩౧
ధృతనానాప్రహరణం గమ్భీరం సాగరోపమమ్,

రామోఽపి చారయన్ చక్షు స్సర్వతో రణపణ్డితః. ౩౨
దదర్శ ఖరసైన్యం త ద్యుద్ధాభిముఖ ముత్థితమ్,
వితత్య చ ధను ర్భీమం తూణ్యా శ్చోద్ధృత్య సాయకాన్. ౩౩
క్రోధ మాహారయ త్తీవ్రం వధార్థం సర్వరక్షసామ్,

దుష్ప్రేక్ష్య స్సోఽభవ త్క్రుద్ధో యుగాన్తాగ్ని రివ జ్వలన్. ౩౪
తం దృష్ట్వా తేజసావిష్టం ప్రాద్రవ న్వనదేవతాః,

తస్య క్రుద్ధస్య రూపం తు రామస్య దదృశే తదా. ౩౫
దక్ష స్యేవ క్రతుం హన్తు ముద్యతస్య పినాకినః,

ఆవిష్టం తేజసా రామం సంగ్రామశిరసి స్థితమ్ ౩౬
దృష్ట్వా సర్వాణి భూతాని భయార్తాని ప్రదుద్రువుః
తత్కార్ముకై రాభరణై ర్ధ్వజై శ్చ
తై ర్వర్మభి శ్చాగ్నిసమానవర్ణైః,
బభూవ సైన్యం పిశితాశనానాం
సూర్యోదయే నీల మి వాభ్రబృన్దమ్. ౩౭

ఇతి శ్రీమదరణ్యకాణ్డే చతుర్వింశ స్సర్గః. ౨౪.

---

అడవియందుండునట్టి క్రూరజంతువులు ఆధ్వనికి భయమునొంది తిరిగి చూడక నిశ్శబ్దముగా నున్నస్థలమునకుఁ బాఱిపోయినవి. ౩౦

నానావిధాయుధంబులతోఁ గూడినదియు నితరులకు దుష్ప్రవేశంబును సముద్రతుల్యంబును మహాభయంకరంబు నగు నారాక్షససేన రాముని చెంతకుఁ బోయినది. ౩౧

యుద్ధమునందుఁ బండితుఁడగు రాముఁడును నలుప్రక్కలం జూచి యుద్ధంబునకు సన్నద్ధంబు గావచ్చిన ఖరసైన్యముం గనెను. ౩౨

రాముఁడు భయంకరాకారంబగు ధనుస్సును గొంచెమువంచి యమ్ముల పొదినుండి బాణంబులు దీసి సమస్తరాక్షసులను వధించుటకై తీవ్రంబగు కోపం బవలంబించెను. ౩౩

అట్లు రాముఁడు క్రుద్ధుఁడై ప్రళయకాలానలంబుపగిదిఁ దేఱిచూడ నలవిగాక తేజరిల్లుచుండెను. అట్లు తేజంబున దుర్నిరీక్ష్యుండై వెలుంగుచున్న రాముం జూచి వనదేవతలు భయంబునం బాఱిపోయిరి. ౩౪

అప్పుడు రాక్షసవధార్థమయి క్రుద్ధుఁడగు రామునియాకారంబు దక్ష ప్రజాపతియజ్ఞంబుహరింప నుద్యుక్తుఁడై యతిక్రుద్ధుఁడైన రుద్రునియాకారంబుకైవడి యతిభయంకరంబయి చూపట్టినది. ౩౫

అట్లు యుద్ధాగ్రంబుననిలుచుండి దుర్నిరీక్ష్యతేజుఁడైయున్న రాముం జూచి సమస్తభూతంబులును భయపీడితంబులయి పరుగెత్తినవి. ౩౬

అట్లు కాంచనాలంకృతంబులగు ధనుస్సులను భూషణంబులను ధ్వజంబులను అగ్నిసమానవర్ణంబులగు కవచంబులను ధరించియుండుటంజేసి నీలవర్ణులగు నారాక్షసులసైన్యము సూర్యోదయంబున సూర్యకిరణంబులతోఁ గలసిన నీలమేఘసమూహంబుకరణిఁ బ్రకాశించినది. ౩౭

ఇది యిరువదినాలవసర్గము.

## పఞ్చవింశస్సర్గః.

అవష్టబ్ధధనుం రామం క్రుద్ధం చ రిపుఘాతినమ్,
దదర్శాఽఽశ్రమ మాగమ్య ఖర స్సహ పురస్సరైః. ౧
తం దృష్ట్వా సశరం చాప ముద్యమ్య ఖరనిస్స్వనమ్,
రామ స్యాభిముఖం సూతం చోద్యతా మి త్యచోదయత్. ౨
స ఖర స్యాజ్ఞయా సూత స్తురఙ్గాం త్సమచోదయత్,
యత్ర రామో మహాబాహు రేకో ధూన్వన్ స్థితో ధనుః. ౩
తం తు నిష్పతితం దృష్ట్వా సర్వే తే రజనీచరాః,
నర్దమానా మహానాదం సచివాః పర్యవారయన్. ౪

స తేషాం యాతుధానానాం మధ్యే రథగతః ఖరః,
బభూవ మధ్యే తారాణాం లోహితాఙ్గ ఇవోదితః. ౫
తత శ్శరసహస్రేణ రామ మప్రతిమౌజసమ్,
అర్దయిత్వా మహానాదం ననాద సమరే ఖరః. ౬
తత స్తం భీమధన్వానం క్రుద్ధా స్సర్వే నిశాచరాః,
రామం నానావిధై శ్శస్త్రై రభ్యవర్షన్త దుర్జయమ్. ౭

ముద్గరైః పట్టసైః శూలైః ప్రాసైః ఖడ్గైః పరశ్వథైః,
రాక్షసా స్సమరే రామం నిజఘ్నూ రోషతత్పరాః. ౮

తే వలాహకసంకాశా మహానాదా మహౌజసః,
అభ్యధావన్త కాకుత్స్థం రథై ర్వాజిభి రేవచ. ౯
గజైః పర్వతకూటాభై రామం యుద్ధేజిఘాంసవః,

తే రామే శరవర్షాణి వ్యసృజ న్రక్షసాంగణాః. ౧౦

## ఇరువదియైదవసర్గము.

ఖరుఁడు సైనికులతోఁగూడ రామాశ్రమంబునకు వచ్చి ధనుర్ధరుఁడై క్రుద్ధుఁడైయున్న శత్రుఘాతకుఁడగు రాముం జూచెను. ౧

ఆఖరుఁడు రాముం జూచి మహాధ్వనియగు ధనుస్సును బాణంబును బట్టుకొని రామున కభిముఖంబుగాఁ దోలుము అని సారథి నాజ్ఞాపించెను.

ఆసారథి ఖరు నానతిచొప్పున మహాబాహుఁడగు రాముఁ డొకఁడే ధనుర్ధరుఁడైయుండు స్థలంబునకుఁ గుఱ్ఱంబులం దోలెను. ౩

అట్లు ఖరుఁడు రామునిపైకిఁ బోవుటం జూచినంతనే శ్యేనగామి మున్నగు నతనిమంత్రులందఱు మహాధ్వనిగదుర సింహనాదంబులు సేయుచు నతనిం బరివేష్టించి పోయిరి. ౪

నక్షత్రంబులనడుమ నుదితుఁడగు నంగారకుఁడు ప్రకాశించునట్లు ఆరాక్షసులనడుమ రథగతుఁడగు ఖరుఁడు తేజరిల్లెను. ౫

అంత యుద్ధంబున ఖరుఁడు అసమానపరాక్రమశాలియగు రాముని వేయిబాణంబుల నొప్పించి మహాధ్వని గదుర సింహనాదంబు గావించెను. ౬

అంత నారాక్షసులందఱుఁ గుపితులయి భయంకరధనుర్ధరుఁడును జయింప నలవిగానివాఁడు నగు రామునిపై నానావిధాయుధంబులం గురిపించిరి. ౭

రాక్షసులు కుపితులయి యుద్ధంబున ముద్గరంబులుఁ బట్టసంబులు శూలంబులుఁ బ్రాసంబులు ఖడ్గంబులు గొడ్డళ్లు మున్నగు నాయుధంబులచేత రాముం బ్రహరించిరి. ౮

మేఘాకారులును మహానాదులునుమహాపరాక్రమశాలులునగు నారాక్షసులు యుద్ధంబున రాముని వధింపఁగోరి కొందఱు రథంబులచేతను గొందఱు గుఱ్ఱంబులచేతను గొందఱు పర్వతశిఖరాకారంబులగు నేనుఁగులచేతను రాముని దఱిమిరి. ౯

ఆరాక్షసులు మేఘంబులు పర్వతంబుపై వర్షించునట్లు రామునిపైఁ బడి

శైలేన్ద్ర మివ ధారాభి ర్వర్షమాణా బలాహకాః,
స తైః పరివృతో ఘోరై రాఘవో రక్షసాం గణైః. ౧౧

తాని ముక్తాని శస్త్రాణి యాతుధానై స్స రాఘవః,
ప్రతిజగ్రాహ విశిఖై ర్నద్యోఘా నివ సాగరః. ౧౨

స తైః ప్రహరణై ర్ఘోరై ర్భిన్నగాత్రో న వివ్యథే,
రామః ప్రదీప్తై ర్బహుభి ర్వజ్రై రివ మహాచలః. ౧౩

స విద్ధః క్షతజాదిగ్ధ స్సర్వగాత్రేషు రాఘవః,
బభూవ రామ స్సన్ధ్యాభ్రై ర్దివాకర ఇ వావృతః.

విషేదు ర్దేవగన్ధర్వా స్సిద్ధా శ్చ పరమర్షయః,
ఏకం సహస్రై ర్బహుభి స్తదా దృష్ట్వా సమావృతమ్. ౧౪

తతో రామ స్సుసంక్రుద్ధో మణ్డలీకృతకార్ముకః,
ససర్జ విశిఖా న్బాణా ఞ్ఛతశోఽథ సహస్రశః. ౧౫
దురావారా న్దుర్విషహా న్కాలదణ్డోపమా న్రణే,
ముమోచ లీలయా రామః కఙ్కపత్రా నజిహ్మగాన్. ౧౬

తే శరా శ్శత్రుసైన్యేషు ముక్తా రామేణ లీలయా,
ఆదదూ రక్షసాం ప్రాణా న్పాశాః కాలకృతా ఇవ. ౧౭

భిత్త్వా రాక్షసదేహాం స్తాం స్తే శరా రుధిరాప్లుతాః,
అన్తరిక్షగతా రేజు ర్దీప్తాగ్నిసమతేజసః. ౧౮

మూర్ఖ బాణవర్షంబులు గురిపించిరి. ౧౦

రాముఁడు అప్పుడు యుద్ధంబున నారాక్షసగణంబులచేఁ బరివేష్టితుఁడయి యుండెను. ౧౧

సముద్రంబునందు నదీప్రవాహములు లయమునొందునట్లు ఆరాక్షసులచేఁ బ్రయోగింపఁబడిన యాయాయుధంబులన్నియు రామబాణప్రహతంబులయి లయము నొందినవి. ౧౨

ఆరాముఁడు భయంకరంబులగునారాక్షసుల యాయుధంబులచే భిన్నగాత్రుఁడయ్యు నెన్నిపిడుగులు పడినను మహాపర్వతంబు చలనంబు నొందనట్లు ఎంతమాత్రము జలనంబు నొందఁడయ్యె. ౧౩

ఆరాముఁడు అట్లు సమస్తావయవములందును బాధింపఁబడి నెత్తుటం దడుపఁబడినవాఁడై సాయంకాలమునందలి మేఘంబులచే నావృతుం డగు సూర్యునిపగిదిం బ్రకాశించుచుండెను. ౧౪

అప్పుడు దేవతలును గంధర్వులును సిద్ధులును బరమర్షులును రాముండొక్కఁడు పెక్కువేలరాక్షసులచేఁ జిక్కియుండుటనుజూచి మిక్కిలియు దుఃఖంబునొందిరి. ౧౫

అంత రాముఁడు పరమకుపితుఁడై మండలీకృతకోదండుఁడై నూఱులు నూఱులుగాను వేనవేలుగాను అర్ధచంద్రాకారబాణంబులం బ్రయోగించెను.

అప్పుడు యుద్ధంబున రాముఁడునివారింపఁగూడనివియు దుస్సహంబులును యమదండములవంటివియు లక్ష్యంబు దప్పనివియునగు పెక్కుబాణంబులను అనాయాసంబుగాఁ బ్రయోగించెను. ౧౭

రాముఁడు రాక్షససైన్యంబులపై విలాసంబునం బ్రయోగించినబాణంబులు కాలపాశంబులుంబోలె యుద్ధంబున రాక్షసులప్రాణంబులను గ్రహించినవి. ౧౮

ఆబాణంబులు రాక్షసదేహంబులను భేదించి నెత్తురుతో నాకాశంబునొంది మండుచున్నయగ్నులకైవడిం బ్రకాశించినవి. ౧౯

అసంఖ్యేయా స్తు రామస్య సాయకా శ్చాపమణ్డలాత్,
వినిష్పేతు రతీవోగ్రా రక్షఃప్రాణాపహారిణః. ౨౦

తై రథాంశ్చ ధ్వజాగ్రాణి వర్మాణి చ శిరాంసి చ
బాహూం స్సహస్తాభరణా నూరూ న్కరికరోపమాన్. ౨౧
చిచ్ఛేద రామ స్సమరే శతశోఽథ సహస్రశః,
హయా న్కాఞ్చనసన్నాహా న్రథయుక్తాం స్ససారథీన్. ౨౨
గజాంశ్చ సగజారోహాం స్సహయాం త్సాదిన స్తథా,
పదాతీం స్సమరే హత్వా హ్యనయ ద్యమసాదనమ్. ౨౩

తతో నాళీకనారాచై స్తీక్ష్ణాగ్రై శ్చ వికర్ణిభిః,
భీమ మార్తస్వరం చక్రు ర్భిద్యమానా నిశాచరాః. ౨౪
తత్సైన్యం నిశితై ర్బాణై రర్దితం మర్మభేదిభిః,
రామేణ న సుఖం లేభే శుష్కం వన మి వాగ్నినా. ౨౫

కేచి ద్భీమబలా శ్శూరా శ్శూలా న్ఖడ్గా న్పరశ్వధాన్,
రామ స్యాభిముఖం గత్వా చిక్షిపుః పరమాయుధాన్. ౨౬

తాని బాణై ర్మహాబాహు శ్శస్త్రా ణ్యావార్య రాఘవః,
జహార సమరే ప్రాణాం శ్చిచ్ఛేద చ శిరోధరాన్. ౨౭
తే ఛిన్నశిరసః పేతు శ్ఛిన్నవర్మశరాసనాః,
సువర్ణవాతవిక్షిప్తా జగత్యాం పాదపా యథా. ౨౮

అవశిష్టా శ్చ యే తత్ర విషణ్ణా శ్చ నిశాచరాః,
ఖర మే వాభ్యధావన్త శరణార్థం శరార్దితాః. ౨౯

అప్పుడు మండలాకారమునొందిన రామునిధనుస్సునుండి మహాభయంకరంబులగు లెక్కలేని బాణంబులువెడలి రాక్షసుల ప్రాణంబుల నపహరించినవి. ౨౦

రాముఁడు యుద్ధంబున రాక్షసులధనుస్సులను ధ్వజంబులను గవచంబులను శిరస్సులను గడియంబులతోఁగూడిన బాహువులను ఏనుఁగుతొండంబుల వంటితొడలను వేనవేలుగాఁ దీక్ష్ణబాణంబుల ఛేదించెను. ౨౧

అప్పుడు యుద్ధంబున రాముఁడు కాంచనాలంకృతంబులును సారథిసహితంబులు నగు రథంబులనుఁ గట్టినగుఱ్ఱంబులను మావటీలతోడఁగూడ నేనుఁగులను సాదులతోఁగూడ గుఱ్ఱంబులను గాలిబంటులను వధించి యమపురికిం బంపెను. ౨౩

అంత రాక్షసు లట్లు తీక్ష్ణములగు నానావిధబాణములచే భేదింపఁబడుచు నోర్వఁజాలక దుఃఖంబున భయంకరంబుగా నఱచిరి. ౨౪

అట్లు రామునిచే మర్మభేదకంబులగు బాణంబుల నొప్పింపఁబడిన యారాక్షససేన కార్చిచ్చుచే దహింపఁబడు నరణ్యముంబోలె మిక్కిలియు వ్యథనొందినది. ౨౫

భయంకరబలశాలులును శూరులునగు కొందఱు రాక్షసులు రామున కభిముఖంబుగాఁ బోయి యుత్తమంబులగు శూలంబులు ఖడ్గంబులుఁ బరశ్వథంబులు మున్నగు నాయుధంబులను రామునిపై వేసిరి. ౨౬

మహాబాహుఁడగురాముఁడు బాణంబులచే నారాక్షసులు ప్రయోగించిన యాయుధంబుల నివారించి వారలకంఠములను ఛేదించెను. ౨౭

ఆరాక్షసులు తలలు ఛేదింపఁబడి కవచంబులును ధనుస్సును ఖండితంబులుగాఁగా గరుత్మంతునిపక్షవాయువుచే వృక్షంబులు భూమింబడునట్లు నేలం గూలిరి. ౨౮

ఆరాక్షసులలోఁ జంపఁబడఁగా మిగిలిన రాక్షసులును రామబాణవిద్ధులయి భయంపడి కావుకావుమని ఖరుని శరణు చొచ్చిరి. ౨౯

తాం త్సర్వా స్స్వన మాదాయ సమాశ్వాస్య చ దూషణః,
అభ్యధావత కాకుత్స్థం క్రుద్ధో రుద్ర మి వాన్తగః. ౩౦
నివృత్తా స్తు పున స్సర్వే దూషణాఽశ్రయనిర్భయాః,
రామ మే వాభ్యధావన్త సాలతాలశిలాయుధాః. ౩౧

శూలముద్గరహస్తా శ్చ చాపహస్తా మహాబలాః,
సృజన్త శ్శరవర్షాణి శస్త్రవర్షాణి సంయుగే. ౩౨
ద్రుమవర్షాణి ముఞ్చన్త శ్శిలావర్షాణి రాక్షసాః,
తద్బభూ వాద్భుతం యుద్ధం తుములం రోమహర్షణమ్. ౩౩
రామస్య చ మహాఘోరం పున స్తేషాం చ రక్షసామ్,
తే సమన్తా దతిక్రుద్ధా రాఘవం పున రభ్యయుః. ౩౪
తై శ్చ సర్వా దిశో దృష్ట్వా ప్రదిశ శ్చ సమావృతాః,
రాక్షసై రుద్యతప్రాసై శ్శరవర్షాభివర్షిభిః. ౩౫
స కృత్వా భైరవం నాద మస్త్రం పరమభాస్వరమ్,
సంయోజయత గాన్ధర్వం రాక్షసేషు మహాబలః. ౩౬
తత శ్శరసహస్రాణి నిర్యయు శ్చాపమణ్డలాత్,
సర్వా దశ దిశో బాణై రావార్యన్త సమాగతైః. ౩౭
నాదదానం శరాన్ ఘోరా న్న ముఞ్చన్తం శిలీముఖాన్,
వికర్షమాణం పశ్యన్తి రాక్షసా స్తే శరార్దితాః. ౩౮

శరాన్ధకార మాకాశ మావృణో త్స దివాకరమ్,
బభూ వావస్థితో రామః ప్రవమ న్నివ తా న్ఛరాన్. ౩౯

యుగపత్పతమానై శ్చ యుగప చ్చ హతై ర్భృశమ్,
యుగపత్పతితై శ్చైవ వికీర్ణా వసుధాఽభవత్. ౪౦

దూషణుఁడు ఆరాక్షసుల నందఱిం బిలిచి యాహ్వానించి క్రుద్ధుఁడై రుద్రునిపైకి మృత్యువు పోవునట్లు రామునిపై కడరెను. ౩౦

ఆరాక్షసు లందఱును మఱలివచ్చి దూషణుని మున్నిడికొని సాలవృక్షంబులను దాలవృక్షంబులను శిలలను నాయుధంబులుగాఁ గొని రామునిపై కడరిరి. ౩౧

శూలముద్గరంబులును ధనుస్సులును దాల్చియున్న వారలును మహాబలశాలులునగు నారాక్షసులు యుద్ధంబున రామునిపై బాణంబులను నానావిధాయుధంబులను వృక్షంబులను ఱాళ్లను గురిపించుచుఁ బోరుచుండిరి. ౩౨

అప్పుడు మఱల రామునకు ఆరాక్షసులకును రోమహర్షణంబును ఆశ్చర్యకరంబును మహాభయంకరంబునగు తుములయుద్ధము జరిగినది. ౩౩

ఆరాక్షసులు మఱలఁ బరమకుపితులయి రామునిపై కడరిరి. ౩౪

మహాబలుఁడగు రాముఁడురాక్షసుల ప్రాసంబులుధరించి బాణవర్షంబులు గురియుచు సమస్తదిక్కుల నావరించి యుండుటంజూచి భయంకరంబుగా సింహనాదంబు నేయుచుఁ బరమభాస్వరంబగు గాంధర్వాస్త్రంబును రాక్షసులపైఁ బ్రయోగించెను. ౩౫, ౩౬

అంత రాముని ధనుస్సుననుండి వేనవేలుగ బాణంబులు వెడలినవి. రామప్రయుక్తంబులగు బాణంబులు దశదిశలును నిండి చెలంగినవి. ౩౭

బాణపీడితులగు నారాక్షసులు రాముఁడు బాణంబులు దీయుటను గాని బాణంబులు విడుచుటనుగాని ధనుస్సు నాకర్షించుటనుగాని గానంజాలరైరి. బాణంబులచేఁ బీడితులు మాత్ర మగుచుండిరి. ౩౮

ఆకాశంబంతయు సూర్యునితోఁగూడ బాణమయంబగు నంధకారంబుచే నావృతమయినది. రాముఁడు ఆబాణంబులను నోటివెంబడిఁ గ్రక్కునట్లు మాపట్టుచుండెను. ౩౯

గుంపులుగుంపులుగాఁ బడుచున్న వారలునుగుంపులుగుంపులుగా పతింపఁబడి నేలఁ గూలువారలును గుంపుగుంపుగా వివశులయి నేలంబడియున్న వా

నిహతాః పతితాః క్షీణా శ్ఛిన్నా భిన్నా విదారితాః,
తత్ర తత్ర స్మ దృశ్యన్తే రాక్షసా స్తే సహస్రశః. ౪౧

సోష్ణీషై రుత్తమాఙ్గైశ్చ సాఙ్గదై ర్బాహుభి స్తథా,
ఊరుభి ర్జానుభి శ్ఛిన్నై ర్నానారూపై ర్విభూషణైః. ౪౨
హయైశ్చ ద్విపముఖ్యైశ్చ రథై ర్భిన్నై రనేకశః,
చామరై ర్వ్యజనై శ్ఛత్రై ర్ధ్వజై ర్నానావిధై రపి. ౪౩
రామస్య బాణాభిహతై ర్విచిత్రై శ్శూలపట్టిసైః,
ఖడ్గైః ఖణ్డీకృతైః ప్రాసై ర్వికీర్ణైశ్చ పరశ్వధైః. ౪౪
చూర్ణితాభి శ్శిలాభిశ్చ శరై శ్చిత్రై రనేకశః,
విచ్ఛిన్నై స్సమరే భూమి ర్వికీర్ణాఽభూ ద్భయఙ్కరా. ౪౫

ఇతి శ్రీమదరణ్యకాణ్డే పఞ్చవింశ స్సర్గః. ౨౫.

---

## షడ్వింశ స్సర్గః.

దూషణ స్తు స్వకం సైన్యం హన్యమానం నిరీక్ష్య సః,
సన్దిదేశ మహాబాహు ర్భీమవేగా న్దురాసదాన్. ౧
రాక్షసా న్పఞ్చసాహస్రాన్ సమరే ష్వనివర్తినః,
తే శూలైః పట్టిసైః ఖడ్గై శ్శిలావర్షై ర్ద్రుమైరపి. ౨
శరవర్షై రవిచ్ఛిన్నం వవృషు స్తం సమన్తతః,
స ద్రుమాణాం శిలానాం చ వర్షం ప్రాణహరం మహత్. ౩
ప్రతిజగ్రాహ ధర్మాత్మా రాఘవ స్తీక్ష్ణసాయకైః,

కలునగు నారాక్షసులచే నయ్యుద్ధభూమియంతయు వ్యాపింపఁబడియుం డినది. ౪౦

ఆయుద్ధభూమియందు రాక్షసులు కొందఱు నిహతులును గొందఱు పతితులును గొందఱు రూపనాశంబు నొందినవారలును గొందఱుభిన్నులును గొందఱు విదారితులునునై వేనవేలుగాఁ బడియుండిరి. ౪౧

రామబాణంబులచే నఱుకఁబడిన తలగుడ్డలతోఁగూడిన శిరస్సులచేతను బాహుపురులచే నలంకృతంబులగు బాహువులచేతను నానావిధాలంకారసహితములగు తొడలచేతను మ్రొఁకాళ్లచేతను గుఱ్ఱములచేతను ఏనుఁగులచేతను రథములచేతను నానావిధములగుచామరములచేతను విసనకఱ్ఱలచేతను ఛత్రంబులచేతను ధ్వజంబులచేతను నానావిధంబులగు శూలంబులచేతను అడ్డకత్తులచేతను గస్కులుగాఁజేయఁబడిన ఖడ్గంబులచేతను ప్రాసంబులచేతను గొడ్డళ్లచేతను జూర్ణితంబులగు శిలలచేతను ఛిన్నంబులగుబాణంబులచేతను ఆయుద్ధభూమియంతయు వ్యాపింపఁబడిభయంకరంబై యుండినది. ౪౨-౪౫

ఇది యిరువదియైదవసర్గము.

---

## ఇరువదియాఱవసర్గము.

మహాబాహుఁడగు దూషణుఁడు తనసైన్యమంతయు నిట్లు రామునిచే హతంబగుటం జూచి భయంకరవేగులును ఎట్టియుద్ధంబునకేనియు వెనుదీయని వారలునగు నైదువేలరాక్షసుల రామునిపైకిఁ బోవ నాజ్ఞాపించెను. ౧

ఆరాక్షసులు నేలుప్రక్కలనుండి శూలంబులనుబట్టసంబులను ఖడ్గంబులను ఱాళ్లను వృక్షంబులను బాణంబులను రామునిపై నవిచ్ఛిన్నంబుగాఁ గురిపించిరి. ౨

ధర్మాత్ముఁడగు రాముఁడు ప్రాణహారకంబును భయంకరంబునునగు నా శిలావృక్షములవర్షమును గణుపుబాణంబుల నివారించెను. 3

ప్రతిగృహ్య చ తద్వర్షం నిమీలిత ఇవర్షభః. ౪
రామః క్రోధం పరం భేజే వధార్థం సర్వరక్షసామ్,

తతః క్రోధసమావిష్టః ప్రదీప్త ఇవ తేజసా. ౫
శరై రవాకిర త్సైన్యం సర్వత స్సహదూషణమ్,
తత స్సేనాపతిః క్రుద్ధో దూషణ శ్శత్రుదూషణః. ౬
శరై రశనికల్పై స్తం రాఘవం సమవాకిరత్,
తతో రామ స్సుసంక్రుద్ధః క్షురేణాస్య మహ ద్ధనుః. ౭
చిచ్ఛేద సమరే వీర శ్చతుర్భి శ్చతురో హయాన్,

హత్వా చాశ్వాన్ శరై స్తీక్ష్ణై రర్ధచన్ద్రేణ సారథేః. ౮
శిరో జహార తద్రక్ష స్త్రిభి ర్వివ్యాధ వక్షసి,

స ఛిన్నధన్వా విరథో హతాశ్వో హతసారథిః. ౯
జగ్రాహ గిరిశృఙ్గాభం పరిఘం రోమహర్షణమ్,
వేష్టితం కాఞ్చనైః పట్టై ర్దేవసైన్యప్రమర్దనమ్. ౧౦
ఆయసై శ్శఙ్కుభి స్తీక్ష్ణైః కీర్ణం పరవసోక్షితమ్,
వజ్రాశనిసమస్పర్శం పరగోపురదారణమ్. ౧౧

తం మహోరగసంకాశం ప్రగృహ్య పరిఘం రణే,
దూషణోఽభ్యద్రవ ద్రామం క్రూరకర్మా నిశాచరః. ౧౨
త స్యాభిపతమానస్య దూషణస్య స రాఘవః,
ద్వాభ్యాం శరాభ్యాం చిచ్ఛేద సహస్తాభరణౌ భుజౌ. ౧౩

రాముఁడు ఆఁబోతుకన్నుమూసికొని యెంతవానయైనను సరకుసేయకుండునట్లు నానావిధాయుధవర్షమును సరకుసేయక తీసికొని ఆరాతులనందఱను వధించుటకై మహాకోపంబు నవలంబించెను. ౪

అంత రాముఁడు పరమక్రుద్ధుఁడై తేజంబున వెలుఁగుచు దూషణసహితంబుగా నారాక్షససేన నంతయు బాణంబులచే నిండునట్లు గావించెను. ౫

అంత శత్రుదూషణుఁడుకోపించి వజ్రంబులంబోని కఱకుబాణంబుల రాముని నొప్పించెను. ౬

అంత వీరుఁడగు రాముఁడును యుద్ధంబున నొక్కయర్ధచంద్రాకార బాణంబున నాదూషణుని ధనుస్సును నిండించి నాలుగుబాణంబులచే నతని గుఱ్ఱంబులం గూలనేసెను. ౭

ఆరాముఁడు అట్లు కఱకుబాణంబులచే గుఱ్ఱంబుల వధించి యొక యర్ధచంద్రాకారబాణంబున సారథిశిరంబు ద్రుంచి యంతంబోక యాదూషణుని ఱొమ్మున మూఁడమ్ముల నొప్పించెను. ౮

దూషణుఁడు అట్లు తనధనుస్సు ఖండింపఁబడుటయు గుఱ్ఱంబులును సారథియును వధింపఁబడుటయుం జూచి పర్వతశిఖరసమానంబును జూపరులకు భయంబుగలిగించునదియు బంగారుకట్టులతోఁ గూడినదియుఁ బలుమాఱు దేవసైన్యంబుల మర్దించినదియుఁ దీక్ష్ణంబులగు నినుపమేకులతోఁ గూడినదియు శత్రువులమేదస్సుచేఁ దడుపఁబడినదియు వజ్రములను రత్నంబులువలె నతికఠినంబును వజ్రాయుధంబుకైవడిఁ బ్రాణహరంబును శత్రువుల పురద్వారంబుల భేదించునదియునగు మహాపరిఘంబు గ్రహించెను. ౯-౧౧

క్రూరకర్ముఁడగు దూషణుఁడు మహోరగముంబోని యాపరిఘంబు చేకొని యుద్ధంబున రామునిపైకిఁ బోయెను. ౧౨

ఆరాముఁడు అట్లు దూషణుఁడు పరిఘంబుచే నిడికొని తనపైకి వచ్చుటంజూచి రెండుబాణంబులచేఁ గంకణాలంకృతంబులగు నతని బాహువులం ద్రుంచెను. ౧౩

భ్రష్ట స్తస్య మహాకాయః పపాత రణమూర్ధని,
పరిఘ శ్ఛిన్నహ స్తస్య శక్రధ్వజ ఇ వాగ్రతః. ౧౪

స కరాభ్యాం వికీర్ణాభ్యాం పపాత భువి దూషణః,
విషాణాభ్యాం విశీర్ణాభ్యాం మన స్వీవ మహాగజః. ౧౫
తం దృష్ట్వా పతితం భూమౌ దూషణం నిహతం రణే,
సాధు సాధ్వితి కాకుత్స్థం సర్వభూతా న్యపూజయన్. ౧౬
ఏతస్మి న్న న్తరే క్రుద్ధా స్త్రయ స్సేనాగ్రయాయినః,
సంహ త్యాభ్యద్రవ న్రామం మృత్యుపాశావపాశితాః. ౧౭
మహాకపాలః స్థూలాక్షః ప్రమాథీ చ మహాబలః,
మహాకపాలో విపులం శూల ముద్యమ్య రాక్షసః. ౧౮
స్థూలాక్షః పట్టసం గృహ్య ప్రమాథీచ పరశ్వధమ్,
దృష్ట్వైవాపతత స్తూర్ణం రాఘవ స్సాయకై శ్శితైః. ౧౯
తీక్ష్ణాగ్రైః ప్రతిజగ్రాహ సంప్రాప్తా నతిథీ నివ,

మహాకపాలస్య శిర శ్చిచ్ఛేద పరమేషుభిః. ౨౦
అసంఖ్యేయై స్తు బాణౌఘైః ప్రమమాథ ప్రమాథినమ్,
స పపాత హతో భూమౌ విట పీవ మహాద్రుమః. ౨౧
స్థూలాక్ష స్యాక్షిణీ తీక్ష్ణైః పూరయామాస సాయకైః,
దూషణ స్యానుగా న్పఞ్చ సాహస్రా న్కుపితః క్షణాత్. ౨౨
బాణౌఘైః పఞ్చసాహస్రై రనయ ద్యమసాదనమ్,
దూషణం నిహతం దృష్ట్వా తస్య చైవ పదానుగాన్. ౨౩
వ్యాదిదేశ ఖరః క్రుద్ధ స్సేనాధ్యక్షా న్మహాబలాన్,

అట్లు దూషణుని బాహువులు రెండును ఖండింపఁబడుటయు భయంకరాకారంబగు నతనిపరిఘంబు చేతనుండి జాతి యుత్సవాంతంబున నింద్రధ్వజంబు పడునట్లు నేలం బడెను. ౧౪

ఆదూషణుఁడట్లు చేతులుదెగి దంతంబులుదెగినమహాగజంబుపగిది నేలం గూలెను. ౧౫

అట్లు దూషణుఁడు యుద్ధంబున నిహతుఁడై నేలం బడుటనుజూచి సమస్తభూతంబులును రామునిసాధువాదంబులం బ్రశంసించినవి. ౧౬

ఇంతలో మహాకపాలుఁడును స్థూలాక్షుఁడును మహాబలుఁడగు ప్రమాథియుననను నీముగ్వురు రాక్షసులు మృత్యుపాశబద్ధులగుటంజేసి పరమకుపితులయి రామునిపై కడరిరి. ౧౭

విశాలంబగు శూలంబు ధరించి మహాకపాలుఁడును బట్టిసంబు దాల్చి స్థూలాక్షుఁడును బరశ్వధంబుఁ జేకొని ప్రమాథియు రామునిపై కడఁగిరి. ౧౮

రాముఁడు ఆరాక్షసులు ముగ్వురను వచ్చుటం జూచి యతిథులు వచ్చినచో వారల కర్ఘ్యాదు లొసఁగునట్లు శీఘ్రంబున నారాక్షసులకుఁ దీక్ష్ణంబులగు బాణంబులం బ్రయోగించెను ౧౯

ఆరాముఁడు కఱకుబాణంబులచే మహాకపాలునిశిరంబు ఖండించెను.

ఆరాముఁడు లెక్కలేనిబాణంబులచేఁ బ్రమాథిని వధించె నంత నతఁడు పెక్కుకొమ్మలతోఁగూడిన మహావృక్షంబుపగిది నేలం గూలెను. ౨౧

ఆరాముఁడు స్థూలాక్షుని కన్నులునిండఁ గఱకుబాణంబుల నేసెను.

ఆరాముఁడు కుపితుఁడై దూషణుని వెంబడించివచ్చిన యయిదువేలమందిరాక్షసులను అయిదువేలబాణములచే క్షణంబున యమపురికిం బంపెను.

ఖరుఁడుఁ దూషణుఁడును అతనివెంబడిఁబోయిన నయిదువేలమంది రాక్షసులును నిహతు లగుటం జూచి కుపితుఁడై మహాబలశాలులగు సేనాధ్యక్షుల కాజ్ఞాపించెను. ౨౩

అయం వినిహత స్సంఖ్యే దూషణ స్సపదానుగః. ౨౪

మహత్యా సేనయా సార్ధం యుద్ధ్వా రామం కుమానుషమ్,
శస్త్రై ర్నానావిధాకారై ర్హనధ్వం సర్వరాక్షసాః. ౨౫

ఏవ ముక్త్వా ఖరః క్రుద్ధో రామ మే వాభిదుద్రువే,
శ్యేనగామీ పృథుగ్రీవో యజ్ఞశత్రు ర్విహఙ్గమః. ౨౬
దుర్జయః కరవీరాక్షః పరుషః కాలకార్ముకః,
మేఘమాలీ మహామాలీ సర్పాస్యో రుధిరాశనః. ౨౭
ద్వాదశైతే మహావీర్యా బలాధ్యక్షా స్ససైనికాః,
రామ మే వాభ్యవర్తన్త విసృజన్త శ్శరోత్తమాన్. ౨౮
తతః పావకసంకాశై ర్హేమవజ్రవిభూషితైః,
జఘాన శేషం తేజస్వీ తస్య సైన్యస్య సాయకైః. ౨౯

తే రుక్మపుఙ్ఖా విశిఖా స్సధూమా ఇవ పావకాః,
నిజఘ్ను స్తాని రక్షాంసి వజ్రా ఇవ మహాద్రుమాన్. ౩౦

రక్షసాం తు శతం రామ శ్శతే నైకేన కర్ణినా,
సహస్రం చ సహస్రేణ జఘాన రణమూర్ధని. ౩౧
తై ర్భిన్నవర్మాభరణా శ్ఛిన్నభిన్నశరాసనాః,
నిపేతు శ్శోణితాదిగ్ధా ధరణ్యాం రజనీచరాః. ౩౨
తై ర్ముక్తకేశై స్సమరే పతితై శ్శోణితోక్షితైః,
ఆస్తీర్ణా వసుధా కృత్స్నా మహావేదిః కుశై రివ. ౩౩

క్షణేన తు మహాఘోరం వనం నిహతరాక్షసమ్,

ఈదూషణుఁడును అతనివెంబడిఁబోయిన యయిదువేలరాక్షసులును రామునిచే హతులయిరి. ౨౪

సమస్తరాక్షసులారా! మీరలు ఇమ్మహాసేనం గూడి నానావిధాయుధంబుల యుద్ధముగావించి కుత్సితమనుష్యుఁడగు రాముని వధింపుఁడు. అని ఖరుఁడు సేనాధ్యక్షుల కాజ్ఞాపించెను. ౨౫

ఖరుఁ డీప్రకారమునం జెప్పి కుపితుఁడై రామునిమీఁదికిఁ బోయెను.

శ్యేనగామియుఁ బృథుగ్రీవుఁడును యజ్ఞశత్రుఁడును విహంగముఁడును దుర్జయుఁడును కరవీరాక్షుఁడును బరుషుఁడును గాలకార్ముకుఁడును మేఘమాలియు మహామాలియు సర్పాస్యుఁడును రుధిరాశనుఁడును మహావీర్యులగు నీసేనాధ్యక్షులు పండ్రెండుగురును సేనాసహితులయి నానావిధోత్తమబాణంబులం బ్రయోగించుచు రామునిమీఁది కడరిరి. ౨౬-౨౮

అంతఁ మహాపరాక్రమశాలియగు రాముఁడు బంగారముచేతను వజ్రములచేతను అలంకృతంబులయి యగ్నిహోత్రములవలెఁ దేజరిల్లుచున్న బాణంబులచే నామిగిలినసైన్యమునుగూడ వధించెను. ౨౯

పొగరాజుచున్న యగ్నిహోత్రములవలె నున్న కాంచనపుంఖములగు నాబాణంబులు వజ్రాయుధంబులు మహావృక్షంబుల నఱకునట్లు ఆరాక్షసుల నందఱ ఖండించినవి. ౩౦

రాముఁడు యుద్ధాగ్రంబున నూఱురాక్షసుల నూఱుబాణంబులచేతను వేయిమందిరాక్షసుల వేయిబాణంబులను వధించెను. ౩౧

రాక్షసులు ఆబాణంబులచే భిన్నకవచులయి నఱుకఁబడిన ధనుస్సులుగలవారలయి నెత్తుటం దోఁగుచు భూమిం బడిరి. ౩౨

అట్లు విరిసినతలవెండ్రుకలతో నెత్తుటం దోఁగుచుఁ బడియున్నరాక్షసులచేఁ గప్పఁబడిన యాయుద్ధభూమి దర్భలచేఁ గప్పఁబడిన యాగవేదిక వలె నొప్పుచుండినది. ౩౩

క్షణమాత్రంబున మహాభయంకరంబగు నవ్వనంబు రాక్షసులందఱు

బభూవ నిచయప్రఖ్యం మాంసశోణితకర్దమమ్. ౩౪
చతుర్దశ సహస్రాణి రక్షసాం భీమకర్మణామ్,
హతా న్యేకేన రామేణ మానుషేణ పదాతినా. ౩౫
తస్య సైన్యస్య సర్వస్య ఖర శ్శేషో మహారథః,
రాక్షస స్త్రిశిరా శ్చైవ రామ శ్చ రిపుసూదనః. ౩౬

శేషా హతా మహాసత్త్వా రాక్షసా రణమూర్ధని,
ఘోరా దుర్విషహా స్సర్వే లక్ష్మణ స్యాగ్రజేన తే. ౩౭
తత స్తు తద్భీమబలం మహాహవే
సమీక్ష్య రామేణ హతం బలీయసా,
రథేన రామం మహతా ఖర స్తదా
సమాససా దేన్ద్ర ఇవోద్యతాశనిః. ౩౮

ఇతి శ్రీమదరణ్యకాణ్డే షడ్వింశ స్సర్గః. ౨౬.

---

## సప్తవింశ స్సర్గః.

ఖరం తు రామాభిముఖం ప్రయాన్తం వాహినీపతిః,
రాక్షస స్త్రిశిరా నామ సన్నిప త్యేద మబ్రవీత్. ౧
మాం నియోజయ విక్రాన్త! సన్నివర్తస్వ సాహసాత్,
పశ్య రామం మహాబాహుం సంయుగే వినిపాతితమ్. ౨

ప్రతిజానామి తే సత్య మాయుధం చాహ మాలభే,
యథా రామం వధిష్యామి వధార్హం సర్వరక్షసామ్. ౩
అహం వాస్య రణే మృత్యు రేష వా సమరే మమ,
వినివృత్య రణోత్సాహా న్ముహూర్తం ప్రాశ్నికో భవ. ౪

నిహతులగుటచే మాంసరక్తంబుల యడుసుతోఁగూడి నరకంబువలె నుండినది.

మనుష్యుఁడును బదాతియునగు రాముఁ డొకఁడు భయంకరపరాక్రములగు పదునాలుగువేలరాక్షసులను వధించెను. ౩౫

ఆసైన్యమున కంతయుఁ దన్నును సారథిని గుఱ్ఱంబులను గాపాడుకొనుచుఁ బదునొకండువేలమంది విలుకాండ్రతోఁ బోరఁజాలినఖరుఁడును త్రిశిరుఁడును శత్రువధంబు సేయునట్టిరాముఁడును వీరుముగ్గురు మిగిలిరి.

మహాబలశాలులును భయంకరాకారులును దుర్జయులునగు తక్కినరాక్షసుల నందఱను లక్ష్మణాగ్రజుఁడగు రాముఁడు యుద్ధంబున వధించివుచ్చెను.

అంత నప్పుడు బలవంతుఁడగు రాముఁడు యుద్ధంబున భయంకరంబగు నాసైన్యమునంతయు వధించుటం జూచి ఖరుఁడు కోపంబున మహారథారూఢుఁడై వజ్రాయుధంబు ధరించిన యింద్రునిపగిది భయంకరాకారుఁడై రామునిపైకిఁ గవిసెను. ౩౮

ఇది యిరువదియాఱవసర్గము.

---

## ఇరువదియేడవసర్గము.

సేనానాయకుఁడగు త్రిశిరుఁడు రామున కభిముఖంబుగా నడచిన ఖరుంజూచి యతనికడ్డముగాఁబోయి యీమాటం జెప్పెను. ౧

పరాక్రమశాలివగు ఖరుఁడా! నన్నాజ్ఞాపింపుము. ఈసాహసంబు వదలుము. ఇదిగో మహాబాహుఁడగు రాముని యుద్ధంబున వధించెదను. జూడుము. ౨

నేను సమస్తరాక్షసులకును వధ్యుండగు రాముని వధించెదను. అట్లు ఆయుధంబు దాఁకి సత్యముగాఁ బ్రతినగావించెదను. ౩

నేనైనను ఈరాముని యుద్ధంబున వధించెదను. లేక రాముఁడేని నన్ను యుద్ధంబున వధించుఁ గాక. నీ విప్పుడు యుద్ధోత్సాహంబువదలి కొంచెము సేపు సాక్షివిగా నుండుము. ౪

ప్రహృష్టో వా హతే రామే జనస్థానం ప్రయాస్యసి,
మయి వా నిహతే రామం సంయుగాయోపయాస్యసి. ౫

ఖర స్త్రిశిరసా తేన మృత్యులోభా త్ప్రసాదితః,
గచ్ఛ యుధ్యే త్యనుజ్ఞాతో రాఘవాభిముఖో యయౌ. ౬

త్రిశిరాశ్చ రథే నైవ వాజియుక్తేన భాస్వతా,
అభ్యద్రవ ద్రణే రామం త్రిశృఙ్గ ఇవ పర్వతః. ౭

శరధారాసమూహాం స్స మహామేఘ ఇవోత్సృజన్,
వ్యసృజ త్సదృశం నాదం జలార్ద్రస్య తు దున్దుభేః. ౮

ఆగచ్ఛన్తం త్రిశిరసం రాక్షసం ప్రేక్ష్య రాఘవః,
ధనుషా ప్రతిజగ్రాహ విధున్వ న్సాయకా ఞ్శితాన్. ౯
స సంప్రహారస్తుములో రామత్రిశిరసో ర్మహాన్,
బభూవాతీవ బలినో స్సింహకుఞ్జరయోరివ. ౧౦
తత స్త్రిశిరసా బాణై ర్లలాటే తాడిత స్త్రిభిః,
అమర్షీ కుపితో రామస్సంరబ్ధ మిద మబ్రవీత్. ౧౧
అహో విక్రమశూరస్య రాక్షస స్యేదృశం బలమ్,
పుష్పై రివ శరై ర్యస్య లలాటేఽస్మి న్పరిక్షతః. ౧౨

మమాపి ప్రతిగృహ్ణీష్వ శరాంశ్చాపగుణా చ్చ్యుతాన్,

ఏవ ముక్త్వా తు సంరబ్ధ శ్శరా నాశీవిషోపమాన్. ౧౩
త్రిశిరో వక్షసి క్రుద్ధో నిజఘాన చతుర్దశ,

రాముఁడు హతుఁడగునేని నీవు సంతుష్టుఁడవై జనస్థానంబునకైనను బోఁగలవు. లేక నేను హతుఁడ నగుదునేని రామునితోనేని యుద్ధంబుగావింపుము. అని త్రిశిరుఁడు ఖరునితోఁ జెప్పెను. ౫

ఆత్రిశిరుఁ డీప్రకారంబున ఖరుని వేఁడుకొనియెను.

అంత ఖరుఁడు "పోయి యుద్ధంబుగావింపుము" అని యనుమతింప నాత్రిశిరుఁడు రామున కభిముఖంబుగాఁ బోయెను. ౬

త్రిశిరుఁడు మంచిగుఱ్ఱంబులుగట్టినదియు దేదీప్యమానంబునగు రథంబు నారోహించి మూఁడుతలలుగలవాఁడు కావున మూఁడుశిఖరములతోఁ గూడిన పర్వతంబుకరణి యుద్ధంబున రామునిపై కడరెను. ౭

ఆత్రిశిరుఁడు మహామేఘము జలధారలను విడుచునట్లు బాణంబులు గురిపించుచు నీటం దడిసిన భేరినాదంబునకుఁ దుల్యంబుగా సింహనాదంబు గావించెను. ౮

రాముఁడు త్రిశిరుఁడు వచ్చుటం జూచి తీక్ష్ణంబులగు బాణంబులను వింటం గూర్చి ప్రయోగించుచు నాతనిం బ్రతిగ్రహించెను. ౯

అంత మహాబలశాలులగు నారామత్రిశిరులకు సింహంబునకు మదపుటేనుఁగునకుం బోలె గొప్ప తుములయుద్ధంబు గలిగెను. ౧౦

అంతఁ గ్రుద్ధుఁడైన రాముఁడు త్రిశిరునిచే నొసట మూఁడుబాణంబులం దాడితుఁడై మఱియుఁ గోపము నొంది యిట్లని చెప్పెను. ౧౧

ఆశ్చర్యము! మహాపరాక్రమశాలియు శూరుఁడునగు రాక్షసునిబలము చాల గొప్పదిగా నున్నది!. ఈబాణంబులు నానొసటందగిలి పుష్పంబులవలె నున్నవి!. ౧౨

ఇంక నాధనుస్సునుండి వెడలెడుబాణంబులనుం బ్రతిగ్రహించి చూడుము. అని రాముఁడు త్రిశిరునితోఁ జెప్పెను.

ఆరాముఁడు ఈప్రకారంబునం జెప్పికుపితుండై వేగంబునఁ గ్రూరసర్పసమానంబులగు పదునాలుగుబాణంబులఁ ద్రిశిరునిఱొమ్ముపై గాఁడ నేసెను.

చతుర్భి స్తురగా నస్య శరై స్సన్నతపర్వభిః ౧౪
న్యపాతయత తేజస్వీ చతుర స్తస్య వాజినః,
అష్టభి స్సాయకై స్సూతం రథోపస్థే న్యపాతయత్. ౧౫
రామ శ్చిచ్ఛేద బాణేన ధ్వజం చాస్య సముచ్ఛ్రితమ్,
తతో హతరథా త్తస్మా దుత్పత న్తం నిశాచరమ్. ౧౬
బిభేద రామ స్తం బాణై ర్హృదయే సోఽభవ జ్జడః,

సాయకై శ్చాప్రమేయాత్మా సామర్ష స్తస్య రక్షసః. ౧౭
శిరాం స్యపాతయ ద్రామో వేగవద్భి స్త్రిభి శ్శితైః,
స భూమౌ రుధిరోద్గారీ రామబాణాభిపీడితః. ౧౮
న్యపత త్పతితైః పూర్వం స్వశిరోభి ర్నిశాచరః,
హతశేషా స్తతో భగ్నా రాక్షసాః ఖరసంశ్రయాః. ౧౯
ద్రవన్తి స్మ న తిష్ఠన్తి వ్యాఘ్రత్రస్తా మృగా ఇవ,
తా న్ఖరో ద్రవతో దృష్ట్వా నివ ర్త్య రుషిత స్స్వయమ్. ౨౦
రామ మే వాభిదుద్రావ రాహు శ్చన్ద్రమసం యథా,

ఇతి శ్రీమదరణ్యకాణ్డే స ప్తవింశ స్సర్గః. ౨౭.

---

## అష్టావింశస్సర్గః.

నిహతం దూషణం దృష్ట్వా రణే త్రిశిరసా సహ,
ఖర స్యాప్యభవ త్త్రాసో దృష్ట్వా రామస్య విక్రమమ్. ౧
స దృష్ట్వా రాక్షసం సైన్య మవిషహ్యం మహాబలః,
హత మేకేన రామేణ త్రిశిరోదూషణా వపి. ౨
తద్బలం హతభూయిష్ఠం విమనాః ప్రేక్ష్య రాక్షసః,
ఆససాద ఖరో రామం నముచి ర్వాసవం యథా. ౩

అంత మహాపరాక్రమశాలియగు రాముఁడు నాలుగుబాణంబులచేత నాత్రిశిరునిగుఱ్ఱంబుల నాలుగింటినిం గూలనేసెను. ౧౪

రాముఁడెనిమిదిబాణంబుల సారథిం గూలనేసెను. ఒక్కబాణంబున రథంబుపైనుండు ధ్వజంబును దెగవ్రేసెను. ౧౫

అంత రాముఁడు ఆత్రిశిరుఁడు హతాశ్వంబగు నారథంబుననుండి యుద్ధమించుటం జూచి యాతనివక్షస్థ్సలంబునఁ బెక్కుబాణంబుల గాడ నేయ నారాక్షసుఁడు మూర్ఛిల్లెను. ౧౬

అప్రమేయబలుఁడగు రాముఁడు కోపము నొంది వేగవంతంబులగు మూఁడుకఱకుబాణంబుల నాత్రిశిరుని మూఁడుతలలను ఖండించెను. ౧౭

ఆత్రిశిరుఁడు అట్లు రామబాణంబులచే ఖండితశిరస్కుఁడై నెత్తురు గ్రక్కుచుఁ దలలతోఁగూడ నేలంగూలెను. ౧౮

అంత ఖరసైనికులలో హతశేషులగు రాక్షసులు భీతులయి పెద్దపులికి భయపడిన జింకలపగిది నిలువక పరుగెత్తిరి. ౧౯

ఖరుఁడు అట్లు పరుగెత్తుచున్న రాక్షసులఁజూచి కుపితుఁడై వారల మఱలించి రాహువు చంద్రునిపైకిఁ బోవునట్లు రామునిపైకిఁ బోయెను. ౨౦

ఇది యిరువదియేడవసర్గము.

---

## ఇరువదియెనిమిదవసర్గము.

అట్లు రాముఁడు యుద్ధంబున దూషణునిఁద్రిశిరునింగూడ వధించి నది చూచి ఖరుఁడును రామునిపరాక్రమంబునకు భయమునొందెను. ౧

మహాబలశాలియగు ఖరుఁడు ఒక్కరామునిచే దుర్జయంబగు రాక్షససైన్యంబంతయుఁ ద్రిశిరుఁడును దూషణుఁడును వధింపఁబడుటను జూచి సైన్యమంతయు నశించుటం గని దుఃఖితుఁడై నముచి యింద్రునిపైకిఁ బోయినట్లు రామునిమీఁది కడరెను. ౩

వికృష్య బలవ చ్చాపం నారాచా న్రక్తభోజనాన్,
ఖర శ్చిక్షేప రామాయ క్రుద్ధా నాశీవిషా నివ. ౪

జ్యాం విధూన్వం స్సుబహుశ శ్శిక్షయాస్త్రాణి దర్శయన్,
చచార సమరే మార్గా ఞ్ఛరై రథగతః ఖరః. ౫

స సర్వా శ్చ దిశో బాణైః ప్రదిశ శ్చ మహారథః,
పూరయామాస తం దృష్ట్వా రామోఽపి సుమహ ద్ధనుః. ౬

స సాయకై ర్దుర్విషహై స్సస్ఫులిఙ్గై రివాగ్నిభిః,
నభ శ్చకారావివరం పర్జన్య ఇవ వృష్టిభిః. ౭

త ద్బభూవ శితై ర్బాణైః ఖరరామవిసర్జితైః,
పర్యాకాశ మనాకాశం సర్వత శ్శరసంకులమ్. ౮

శరజాలావృత స్సూర్యో న తదా స్మ ప్రకాశతే,
అన్యోన్యవధసంరమ్భా దుభయో స్సంప్రయుధ్యతోః. ౯

తతో నాళీకనారాచై స్తీక్ష్ణాగ్రైశ్చ వికర్ణిభిః,
ఆజఘాన ఖరో రామం తోత్త్రై రివ మహాద్విపమ్. ౧౦
తం రథస్థం ధనుష్పాణిం రాక్షసం పర్యవస్థితమ్,
దదృశు స్సర్వభూతాని పాశహస్త మివాన్తకమ్. ౧౧

హన్తారం సర్వసైన్యస్య పౌరుషే పర్యవస్థితమ్,
పరిశ్రాన్తం మహాసత్త్వం మేనే రామం ఖర స్తదా. ౧౨

ఖరుఁడు తనబలంబుకొలంది ధనుస్సు నాకర్షించి క్రుద్ధంబులగు కృష్ణ సర్పంబులవంటి రక్తభోజనంబులగు బాణంబుల రామునిపైఁ బ్రయోగించెను. ౪

రథగతుఁడగు ఖరుఁడు యుద్ధంబున ధనుర్విద్యాపాండిత్యం బేర్పడ నానావిధంబుల బాణంబులు నారిం గూర్చుచు నస్త్రప్రయోగసామర్థ్యంబు దేటపడ నానామార్గంబుల బాణంబులు ప్రయోగించెను. ౫

మహారథుఁడగు రాముఁడును ఖరుఁడు తనమీఁదికి వచ్చుటం జూచి మహాధనుస్సున బాణంబులుగూర్చి సమస్తములయిన దిక్కులను విదిక్కులను నిండునట్లు బాణంబులు ప్రయోగించెను. ౬

ఆరాముఁడు దుస్సహంబులును స్ఫులింగసహితంబులగు నగ్నులం బోలె నున్నవియు నగు బాణంబులను మేఘంబు వర్షంబు గురియునట్లు గురిపించి యాకాశంబునంతయు సందులేనట్లు గావించెను. ౭

అట్లు ఖరుఁడును రాముఁడును ఒండొరులపైఁ బ్రయోగించుకొనిన బాణంబులచే నాచుట్టునున్న యాకాశంబంతయు బాణమయంబై నిరవకాశంబయినది. ౮

అప్పుడు ఒండొరుల వధింపు దలంపున నారాముఁడును ఖరుఁడును యుద్ధంబు సేయుచుండ సూర్యుఁడు వారలబాణంబుల నావృతుఁడై ప్రకాశింపకుండెను. ౯

అంత బరిగోలలచే మహాగజంబును బొడుచునట్లు ఖరుఁడు తీక్ష్ణంబులగు నానావిధబాణంబులచే రామునిం బ్రహరించెను. ౧౦

అట్లు రథగతుఁడును ధనుర్ధరుఁడును యుద్ధసన్నద్ధుఁడునై పాశహస్తుఁడగు యమునికైవడి భయంకరాకారుఁడైయున్న ఖరుం జూచి, సమస్త భూతంబులును భయము నొందినవి. ౧౧

ఖరుఁడు రాముఁడు మహాబలుఁడును మహాపౌరుషుఁడునైనను అంతటమహాసైన్యమును వధించి యున్నాఁడు కావున వలసటనొందియుండునని తలంచెదను. ౧౨

తం సింహ మివ విక్రాన్తం సింహవిక్రాన్తగామినమ్,
దృష్ట్వా నోద్విజతే రామ స్సింహః క్షుద్రమృగం యథా. ౧౩

తతస్సూర్యనికాశేన రథేన మహతా ఖరః,
ఆససాద రణే రామం పతఙ్గ ఇవ పావకమ్. ౧౪
తతో ఽస్య సశరం చాపం ముష్టిదేశే మహాత్మనః,
ఖర శ్చిచ్ఛేద రామస్య దర్శయ న్పాణిలాఘవమ్. ౧౫
స పున స్త్వపరాం స్సప్త శరా నాదాయ వర్మణి,
నిజఘాన ఖరః క్రుద్ధ శ్శక్రాశనిసమప్రభాన్. ౧౬
తత స్తత్ప్రహతం బాణైః ఖరముక్తై స్సుపర్వభిః,
పపాత కవచం భూమౌ రామ స్యాదిత్యవర్చసః. ౧౭

తత శ్శరసహస్రేణ రామ మప్రతిమౌజసమ్,
అర్దయిత్వా మహానాదం ననాద సమరే ఖరః. ౧౮
స శరై రర్పితః క్రుద్ధ స్సర్వగాత్రేషు రాఘవః,
రరాజ సమరే రామో విధూమో ఽగ్ని రివ జ్వలన్. ౧౯

తతో గమ్భీరనిర్హ్రాదం రామ శ్శత్రునిబర్హణః,
చకా రాన్తాయ స రిపో స్సజ్య మన్య న్మహ ద్ధనుః. ౨౦
సుమహ ద్వైష్ణవం య త్త దతిసృష్టం మహర్షిణా,
వరం తద్ధను రుద్యమ్య ఖరం సమభిధావత. ౨౧
తతః కనకపుఙ్ఖై స్తు శరై స్సన్నతపర్వభిః,
బిభేద రామ స్సంక్రుద్ధః ఖరస్య సమరే ధ్వజమ్. ౨౨
స దర్శనీయో బహుధా వికీర్ణః కాఞ్చనధ్వజః,
జగామ ధరణీం సూర్యో దేవతానా మి వాజ్ఞయా. ౨౩

రాముఁడు అట్లు సింహమువలె నతిపరాక్రమశాలియయి యతివేగంబున వచ్చుచున్న యాఖరుం జూచి సింహము క్షుద్రమృగంబులం జూచి భయపడనట్లు ఎంతమాత్రము చలింపఁడయ్యె. ౧౩

అంత మిడుత యగ్నిహోత్రముమీఁదికిఁ బోవునట్లుఖరుఁడు యుద్ధంబున సూర్యప్రభంబగు మహారథంబుతో రామునిమీఁది కడరెను. ౧౪

అంత ఖరుఁడు తనహస్తలాఘవంబేర్పడ నొక్కబాణమ్మున మహాత్ముఁడగు రామునిధనుస్సును ముష్టిప్రదేశంబున ఖండించెను. ౧౫

ఆఖరుఁడు క్రుద్ధుఁడై మఱల దేవేంద్రుని వజ్రాయుధముంబోని యేడు బాణంబులఁదీసి రాముని కవచంబుపయి నేసెను. ౧౬

అంత ఖరుఁడు విడిచిన యాసప్తబాణంబులచేఁ గొట్టఁబడి రాముని కవచంబు నేలంబడెను. అట్లు కప్పువిడుచుటచే రాముఁడు సూర్యునికైవడిఁ దేజరిల్లెను. ౧౭

అంత ఖరుఁడు యుద్ధంబున మహాపరాక్రమశాలియగు రాముని వేయి బాణంబులం బ్రహరించి మహాధ్వనిగలుగునట్లు సింహనాదంబు గావించెను.

ఆరాముఁడు యుద్ధంబున నట్లు దేహంబునం దంతటను బాణములచే బాధితుఁడై పరమకుపితుఁడై పొగలేక మండుచుండు నగ్నిహోత్రముకైవడిఁ బ్రకాశించెను. ౧౯

అంత శత్రువుల వధింపనట్టి రాముఁడు శత్రువధార్థమయి గంభీరమైన ధ్వనిగలదగు మఱియొకమహాధనుస్సును సజ్యంబు గావించెను. ౨౦

అగస్త్యమహామునిచే నియ్యఁబడినవైష్ణవంబగు నమ్మహాధనువు దీసికొని రాముఁడు యుద్ధంబున ఖరునిపై కడరెను. ౨౧

అంత రాముఁడు కుపితుఁడై బంగారుపింజలుగలవియు బుజుపర్వంబులవగు బాణంబులచే ఖరునిధ్వజంబును ఖండించెను. ౨౨

దేవతలయాజ్ఞచే సూర్యుఁడు భూమికివచ్చెనో యన సుందరంబగు నాకాంచనధ్వజంబు పెక్కువ్రయ్యలయి నేలంబడినది. ౨౩

తం చతుర్భిః ఖరః క్రుద్ధో రామం గాత్రేషు మార్గణైః,
వివ్యాధ యుధి మర్మజ్ఞో మాతఙ్గ మివ తోమరైః. ౨౪

స రామో బహుభి ర్బాణైః ఖరకార్ముకనిస్సృతైః,
విద్ధో రుధిరసిక్తాఙ్గో బభూవ రుషితో భృశమ్. ౨౫
స ధను ర్ధన్వినాం శ్రేష్ఠః ప్రగృహ్య పరమాహవే,
ముమోచ పరమేష్వాస ష్షట్ఛరా నభిలక్షితాన్. ౨౬

శిర స్యేకేన బాణేన ద్వాభ్యాం బాహ్వో రథార్పయత్,
త్రిభి శ్చన్ద్రార్ధవక్త్రై శ్చ వక్ష స్యభిజఘాన హ. ౨౭

తతః పశ్చా న్మహాతేజా నారాచా న్భాస్కరోపమాన్,
జిఘాంసూ రాక్షసం క్రుద్ధ స్త్రయోదశ సమాదదే. ౨౮
తతోఽస్య యుగ మేకేన చతుర్భి శ్చతురో హయాన్,
షష్ఠేన తు శిర స్సఙ్ఖ్యే ఖరస్య రథసారథేః. ౨౯
త్రిభి స్త్రివేణుం బలవా న్ద్వాభ్యా మక్షం మహాబలః,
ద్వాదశేన తు బాణేన ఖరస్య సశరం ధనుః. ౩౦
ఛిత్త్వా వజ్రనికాశేన రాఘవః ప్రహసన్నివ,
త్రయోదశే నేన్ద్రసమో బిభేద సమరే ఖరమ్. ౩౧

ప్రభగ్నధన్వా విరథో హతాశ్వో హతసారథిః,
గదాపాణి రవప్లుత్య తస్థౌ భూమౌ ఖర స్తదా. ౩౨

తత్కర్మ రామస్య మహారథస్య
సమేత్య దేవా శ్చ మహర్షయ శ్చ,

జీవస్థానంబులు చక్కఁగాఁ దెలిసినట్టిఖరుఁడు యుద్ధంబునఁ గుపితుఁడై చిల్లకోలల నేనుంగును బొడుచునట్లు రామునిజీవస్థానంబుల నాలుగు బాణంబులచే నొప్పించెను. ౨౪

ఆరాముఁడు అట్లు ఖరుఁడు ప్రయోగించిన పెక్కుబాణంబులచే విద్ధుఁడై నెత్తుటందోఁగుచు మిక్కిలియు రోషంబు నొందెను. ౨౫

ధనుర్ధరులలో నుత్తముఁడును మహాధనుర్ధరుఁడునగు నారాముఁడు అట్లు యుద్ధంబున మఱియొకవిల్లుఁ జేకొని యుత్తమబాణంబుల నాఱింటిని విడిచెను. ౨౬

అంత రాముఁడు శిరంబున నొకబాణముచేతను బాహులందు రెండమ్ములచేతను వక్షస్థ్సలంబున మూఁడర్ధచంద్రబాణంబులచేతను ఖరుని నొప్పించెను. ౨౭

అటుపిమ్మట మహాతేజుఁడగు రాముఁడు క్రుద్ధుఁడయి ఖరుని వధించుటకై సూర్యసమాన తేజంబులగు పదుమూఁడుబాణంబులఁ దీసెను. ౨౮

అంత దేవేంద్రసమానుఁడునుమహాబలపరాక్రమశాలియునగు రాముండు అనాయాసంబుగా నాపదుమూఁడుబాణంబులలో నొకబాణంబున రథముకాఁడిని ఖండించి నాలుగింటిచే గుఱ్ఱంబులం గూలనేసి యాఱవబాణంబున నతని సారథిశిరంబుఁ దెగవ్రేసి మూఁడింట యుగంధరము భేదించి రెంట నక్షంబు దునియనేసి యంత వజ్రాయుధముంబోని పండ్రెండవబాణంబున ఖరునిచేతనుండు బాణసహితంబగు ధనుస్సును ఖండించి పదుమూఁడవబాణంబున ఖరుని నొప్పించెను. ౩౧

అప్పుడు ఖరుఁడు అట్లు భగ్నశరాసనుఁడు విరథుఁడును హతాశ్వుఁడును హతసారథియు నై గద చేతంగొని రథంబుననుండి లంఘించి నేలపై నిలిచెను. ౩౨

అప్పు డచ్చటికివచ్చియాకాశంబునవిమానగతులయియుద్ధంబంతయుఁ జూచుచున్న దేవతలును మహర్షులును మహారథుఁడగు రాముఁడు ఖరుని విర

అపూజయ న్ప్రాఞ్జలయః ప్రహృష్టా
స్తదా విమానాగ్రగతా స్సమేతాః. 33

ఇతి శ్రీమదరణ్యకాణ్డేఽష్టావింశ స్సర్గః. ౨౮.

---

## ఏకోనత్రింశ స్సర్గః.

ఖరం తు విరథం రామో గదాపాణి మవస్థితమ్,
మృదుపూర్వం మహాతేజాః పరుషం వాక్య మబ్రవీత్. ౧

గజాశ్వరథసంబాధే బలే మహతి తిష్ఠతా,
కృతం సుదారుణం కర్మ సర్వలోకజుగుప్సితమ్. ౨

ఉద్వేజనీయో భూతానాం నృశంసః పాపకర్మకృత్,
త్రయాణా మపి లోకానా మీశ్వరోఽపి న తిష్ఠతి. ౩

కర్మ లోకవిరుద్ధం తు కుర్వాణం క్షణదాచర!,
తీక్ష్ణం సర్వజనో హన్తి సర్పం దుష్ట మి వాగతమ్. ౪

లోభా త్పాపాని కుర్వాణః కామా ద్వా యో న బుధ్యతే,
భ్రష్టః పశ్యతి త స్యాన్తం బ్రాహ్మణీ కరకా దివ. ౫

వసతో దణ్డకారణ్యే తాపసా న్ధర్మచారిణః,
కిన్ను హత్వా మహాభాగా న్ఫలం ప్రాప్స్యసి రాక్షస!. ౬
న చిరం పాపకర్మాణః క్రూరా లోకజుగుప్సితాః,
ఐశ్వర్యం ప్రాప్య తిష్ఠన్తి శీర్ణమూలా ఇవ ద్రుమాః. ౭

ధుం గావించుటనుజూచి పరమసంతుష్టులయి చేతులు మొగుడ్చుకొని యం దఱు నొక్కటిగాఁ జేరి రామునిఁ బూజించిరి. 33

ఇది యిరువదితొమ్మిదవసర్గము.

---

## ఇరువదితొమ్మిదవసర్గము.

మహాతేజుఁడగు రాముఁడు అట్లు విరథుఁడై గదాపాణియయి నిలిచి యున్న ఖరుం జూచి మెత్తనిమాటలచేఁ బరుషమయినయర్థము గలుగునట్లు ఈప్రకారంబునం జెప్పెను. ౧

నీవు ఏనుంగులచేతను గుఱ్ఱంబులచేతను రథములచేతను నిండిన మహా సైన్యముతోఁగూడి సమస్తలోకంబులకును బాధకరంబును మహాభయంకరం బు నగు కార్యంబుఁ గావించితివి. ౨

ప్రాణులకు దుఃఖంబుసేయుచు ఘాతుకుఁడై పాపంబులు సేయుచుం డునేని యతఁడు ముల్లోకంబులకును నాథుఁడైనను క్షేమంబు నొందఁ జాలఁడు. 3

ఖరుఁడా! దుష్టసర్పమువచ్చినయెడ నందఱును దాని వధించునట్లు లోకవిరుద్ధంబగుకర్మముసేయువాఁడును భయంకరుఁడు నగువాని సమస్తజను లును వధింపఁబూనుదురు. ౪

లోభంబునంగాని కామంబునంగాని యొడలు దెలియక పాపంబులు గావించునట్టివాఁడు భ్రష్టుఁడై వడిగల్లుతాయిడిన్న నలికండ్లపామువలె దాని ఫలమును శీఘ్రంబునం బొందును. (వడిగల్లుతాయి నలికండ్లపామునకు విష మనుట ప్రసిద్ధము.) ౫

ఖరుఁడా! ధర్మచారులును మహాభాగులు నగు దండకారణ్యంబున వసించుఋషులను వధించితివే. నీకు దానివలన నేమిఫలంబు గలిగినది? ౬

పాపకర్ములును గ్రూరులును లోకనిందితులు నగువారలు బహుకాల మైశ్వర్యంబు నొందియుండఁజాలరు. వేఱుదెగినవృక్షములువలె శీఘ్రముగ నాశంబు నొందుదురు. ౭

అవశ్యం లభతే జన్తుః ఫలం పాపస్య కర్మణః,
ఘోరం పర్యాగతే కాలే ద్రుమాః పుష్ప మి వార్తవమ్. ౮

నచిరా త్ప్రాప్యతే లోకే పాపానాం కర్మణాం ఫలమ్,
సవిషాణా మి వాన్నానాం భుక్తానాం క్షణదాచర!. ౯

పాప మాచరతాం ఘోరం లోక స్యాప్రియ మిచ్ఛతామ్,
అహ మాసాదితో రాజ్ఞా ప్రాణా న్హన్తుం నిశాచర!. ౧౦

అద్య హి త్వాం మయా ముక్తా శ్శరాః కాఞ్చనభూషణాః,
విదార్య నిపతిష్య న్తి వల్మీక మివ పన్నగాః. ౧౧

యే త్వయా దణ్డకారణ్యే భక్షితా ధర్మచారిణః,
తా నద్య నిహత స్సఙ్ఖ్యే ససైన్యోఽనుగమిష్యసి. ౧౨

అద్య త్వాం నిహతం బాణైః పశ్యన్తు పరమర్షయః,
నిరయస్థం విమానస్థా యే త్వయా హింసితాః పురా. ౧౩

ప్రహర త్వం యథాకామం కురు యత్నం కులాధమ!,
అద్య తే పాతయిష్యామి శిర స్తాలఫలం యథా. ౧౪

ఏవ ముక్త స్తు రామేణ క్రుద్ధ స్సంర క్తలోచనః,
ప్రత్యువాచ ఖరో రామం ప్రహస న్క్రోధమూర్ఛితః. ౧౫

ప్రాకృతా న్రాక్షసా న్హత్వా యుద్ధే దశరథాత్మజ!,

ఋతుకాలము వచ్చినప్పుడు వృక్షములు అయ్యైఋతువుల ననుసరించి పుష్పంబులం బొందునట్లు పురుషుండు అనుభవకాలము వచ్చినప్పుడు తాను గావించిన పాపకర్మముల ఫలము నవశ్యము ననుభవించును. ౮

ఖరుఁడా! విషమిశ్రితమయిన యన్నము భుజించినచో దానిఫలము శీఘ్రంబుననే యనుభవమునకు వచ్చునట్లు అత్యుత్కటంబులగు పాపంబులు గావించినవారలకు దానిఫలము అతిశీఘ్రంబుననే యనుభవమునకు వచ్చును.

రాక్షసుఁడా! భయంకరంబు లగుపాపములు గావించువారలును లోకమునకుఁ గీడు గావించువారలునగు దుష్టాత్ములను వధించుటకై రాజయిన దశరథునియాజ్ఞచే నేను వచ్చియున్నాను. ౧౦

సర్పములు వల్మీకమును జొచ్చి యావలికి వెడలునట్లు ఇప్పుడు నేను ప్రయోగించుకాంచనభూషణంబు లగు బాణంబులు నీశరీరమును భేదించి యావలికిఁ బోఁగలవు. ౧౧

నీ విదివఱకు దండకారణ్యంబున ధర్మచారులగు మునుల నెవ్వ రెవ్వరి భక్షించియున్నావో ఇప్పుడు నీవు యుద్ధంబున నాచే నిహతుఁడవై సైన్యసహితంబుగా వారలయొద్దకుఁ బోఁగలవు. ౧౨

మున్ను నీచే హింసితులగు మహర్షు లిప్పుడు విమానగతులయి యాకాశంబుననుండి నాబాణంబుల నిహతుఁడవై నేలంగూలి దుఃఖావస్థఁబొందియున్న నిన్నుఁ జూతురుగాక. ౧౩

కులాధముఁడవగు ఖరుఁడా! ఇప్పుడు నీవు యథేచ్ఛముగాఁ నన్నుఁ బ్రహరింపుము. నీచే నైనంతమట్టుకుఁ జూడుము. ఇప్పుడె తాటిపండును బోలె నీశిరస్సును నేలం బడవేసెదను. అని రాముఁడు ఖరునితోఁ జెప్పెను.

ఖరుఁడు రామునిమాటలను విని క్రుద్ధుఁడై కన్నుల నెఱ్ఱఁజేసికొని గడుఁ పకపకనవ్వుచుఁ గోపావేశంబున నొడలుదెలియక ఆరామునిం జూచి యిట్లని చెప్పెను. ౧౪

దశరథపుత్త్రుఁడవగు రాముఁడా! నీవు యుద్ధంబున నల్పులగు రాక్ష

ఆత్మనా కథ మాత్మాన మప్రశస్యం ప్రశంససి. ౧౬

విక్రాన్తా బలవన్తో వా యే భవన్తి నరర్షభాః,
కథయన్తి న తే కించి త్తేజసా స్వేన గర్వితాః. ౧౭

ప్రాకృతా స్త్వకృతాత్మానో లోకే క్షత్రియపాంసనాః,
నిరర్థకం వికత్థన్తే యథా రామ! వికత్థసే. ౧౮

కులం వ్యపదిశ న్వీర స్సమరే కోఽభిధాస్యతి,
మృత్యుకాలే హి సంప్రాప్తే స్వయ మప్రస్తవే స్తవమ్. ౧౯
సర్వథైవ లఘుత్వం తే కత్థనేన విదర్శితమ్,
సువర్ణప్రతిరూపేణ తప్తేనేవ కుశాగ్నినా. ౨౦

న తు మా మిహ తిష్ఠన్తం పశ్యసి త్వం గదాధరమ్,
ధరాధర మి వాకమ్ప్యం పర్వతం ధాతుభి శ్చితమ్. ౨౧
పర్యాప్తోఽహం గదాపాణి ర్హన్తుం ప్రాణా న్రణే తవ,
త్రయాణా మపి లోకానాం పాశహస్త ఇవా న్తకః. ౨౨
కామం బహ్వపి వక్తవ్యం త్వయి వక్ష్యామి న త్వహమ్,
అస్తంగచ్ఛే ద్ధి సవితా యుద్ధవిఘ్న స్తతో భవేత్. ౨౩

చతుర్దశ సహస్రాణి రాక్షసానాం హతాని తే,
త్వద్వినాశా త్కరో మ్యేషాం తేషా మశ్రుప్రమార్జనమ్. ౨౪

ఇత్యుక్త్వా పరమక్రుద్ధ స్తాం గదాం పరమాఙ్గదః,
ఖర శ్చిక్షేప రామాయ ప్రదీప్తా మశనిం యథా. ౨౫

కులంగొందఱఁ జంపి యింతలో మహాశూరుఁడవైనట్లు నిన్ను నీవే పొగడుకొనుచున్నావేమి? ౧౬

ఎవ్వరు పరాక్రమశాలులును బలవంతులు నైయుందురో అట్టిపురుషశ్రేష్ఠులు తమప్రతాపంబునకు గర్వించి తమ్ముఁ దామె యెంతమాత్రముఁ బొగడుకొనరు. ౧౭

రాముఁడా! ఇప్పుడు నీవు పొగడుకొనునట్లు అల్పులును బిఱికివాండ్రు నగు క్షత్రియాధములు నిష్ప్రయోజనముగాఁ దమ్ముఁ దామె పొగడుకొందురు. ౧౮

యుద్ధంబున మరణకాలంబు వచ్చియుండునప్పుడు ఆసమయమునందు వీరుఁ డెవ్వఁడు తనకులంబుఁ బొగడుకొని యాత్మస్తుతిఁ జేసికొనును? ౧౯

నీ వాత్మస్తుతిచేసికొనుటచేత నీయందలి యల్పత్వము స్పష్టముగాఁ దెలియవచ్చినది. మంచిబంగారురంగుతో మండుచుండు కుశాగ్ని యితరపదార్థముల దహింపఁజాలక యాఱిపోవునట్లు ఆత్మస్తుతిచేసికొని విఱ్ఱవీఁగువాఁడు ఇతరుల నెంతమాత్రము వధింపఁజాలక తానె వధింపఁబడును. ౨౦

ధాతువులతోఁగూడిన పర్వతంబుకరణి నిశ్చలుఁడనై గదాధరుఁడనై నీయెదుట నిలిచియున్న నన్నుం జూచుచున్నావుగదా! ౨౧

ముల్లోకంబులకును బాశహస్తుఁడగు నంతకుఁ డొక్కఁడు చాలినట్లు నీప్రాణంబుల యుద్ధంబున హరింప నే నొక్కఁడం జాలుదును. ౨౨

మఱియు ని ట్లాత్మస్తుతిచేసికొనునట్టి నీవిషయమయి యింకను జాలఁ జెప్పవలసియున్నది. అయినను నిప్పుడు చెప్పను, అట్లు చెప్పినచో నాలస్యమయి సూర్యుఁడ స్తమించి యుద్ధంబునకు విఘ్నంబు వచ్చును. ౨౩

నీవు పదునాలుగు వేలరాక్షసుల వధించినావు. నేను ఇప్పుడు నిన్ను వధించి వారలయందఱి కన్నీళ్లు తుడిచెదను. అని ఖరుఁడు రామునితోఁ జెప్పెను. ౨౪

మంచిబాహుపురులుగల ఖరుఁ డీప్రకారమునం జెప్పి పరమకుపితుఁడై వజ్రాయుధముంబోలెఁ బ్రకాశించుచున్నయాగదను రామునిపైవైచెను.

ఖరబాహుప్రముక్తా సా ప్రదీప్తా మహతీ గదా,
భస్మవృక్షాంశ్చ గుల్మాంశ్చ కృత్వాఽగ్రా త్తత్సమీపతః. ౨౬

తా మాపత న్తీం జ్వలితాం మృత్యుపాశోపమాం గదామ్,
అ న్తరిక్షగతాం రామ శ్చిచ్ఛేద బహుధా శరైః. ౨౭

సా విశీర్ణా శరై ర్భగ్నా పపాత ధరణీతలే,
గదా మన్త్రౌషధబలై ర్వ్యాళీవ వినిపాతితా. ౨౮

ఇతి శ్రీమదరణ్యకాణ్డే ఏకోనత్రింశ స్సర్గః. ౨౯

---

త్రింశ స్సర్గః.

భిత్త్వా తు తాం గదాం బాణై రాఘవో ధర్మవత్సలః,
స్మయమానః ఖరం వాక్యం సంరబ్ధ మిద మబ్రవీత్. ౧
ఏత త్తే బలసర్వస్వం దర్శితం రాక్షసాధమ!,
శక్తిహీనతరో మత్తో వృథా త్వ మవగర్జసి. ౨

ఏషా బాణవినిర్భిన్నా గదా భూమితలం గతా,
అభిధానప్రగల్భస్య తవ ప్రత్యయఘాతినీ. 3

యు త్త్వ యోక్తం వినష్టానా మహ మశ్రుప్రమార్జనమ్,
రాక్షసానాం కరో మీతి మిథ్యా తదపి తే వచః. ౪

నీచస్య క్షుద్రశీలస్య మిథ్యావృత్తస్య రక్షసః,
ప్రాణా నపహరిష్యామి గరుత్మా నమృతం యథా. ౫

అట్లు అమ్మహాగద ఖరునిచేఁ బ్రయోగింపఁబడినదై మహాతేజంబున వెలుఁగుచు మార్గంబుననున్న వృక్షగుల్మంబుల భస్మముగావింపుచు నారాముని సమీపంబునకుం బోయెను. ౨౭

రాముఁడు అట్లు మృత్యుపాశంబువలె నమ్మహాగద జ్వలించుచు వచ్చుటం జూచి దాని నాకాశంబుననే బాణంబులచేఁ బెక్కువ్రయ్యలుగా ఖండించెను. ౨౮

అట్లు ఆగద బాణములచే ఖండింపఁబడి తునకలు తునకలయి మంత్రౌషధంబులచే నిర్జితమయిన సర్పయుక్కై వడి నేలం బడెను. ౨౯

ఇది యిరువదితొమ్మిదవసర్గము.

---

## ముప్పదియవ సర్గము.

పరమధార్మికుఁడగు రాముఁడు బాణంబులచే నాగదను ఖండించి పరిహాసముగావింపుచు ఖరుం జూచి సంరంభంబున నిట్లని చెప్పెను. ౧

రాక్షసాధముఁడవగు ఖరుఁడా! నీబలమంతయుఁ జూపినావు. ఇంక నేమిసేయఁగలవు? నీవు బలంబున నాకన్నను హీనుఁడవయ్యు వ్యర్థముగాఁ బ్రేలెదవు. ౨

ఇంతదూరము ప్రేలితివే; నీవు మాటలు చెప్పుటయందుమాత్రము మహాసమర్థుఁడవు. ఇదిగో నీ వంతదూరము జయముగల్గించునని నమ్మియుండిన యీగద యిప్పుడు బాణంబులచే ఖండింపఁబడి నేలం బడినది. 3

"నేను నిన్నువధించి యిప్పుడు యుద్ధంబున నీచే హతులయిన రాక్షసులకన్నీళ్లు తుడిచెదను" అని యిప్పుడు చెప్పితివే; అమాట యబద్ధమయినది గదా!. ౪

గరుత్మంతుఁ డమృతమును హరించినట్లు నేను నీచుఁడవు దుష్టస్వభావుఁడవు ననాచారసంపన్నుఁడవు రాక్షసుఁడవునగు నీప్రాణంబులను హరించెదను. ౫

అద్య తే ఛిన్నకణ్ఠస్య ఫేనబుద్బుదభూషితమ్.
విదారితస్య మద్బాణై ర్మహీ పాస్యతి శోణితమ్. ౬
పాంసురూషితసర్వాఙ్గ స్స్రస్తన్యస్తభుజద్వయః,
స్వప్స్యసే గాం సమాలిఙ్గ్య దుర్లభాం ప్రమదా మివ. ౭

ప్రవృద్ధనిద్రే శయితే త్వయి రాక్షసపాంసనే,
భవిష్యన్త్యశరణ్యానాం శరణ్యా దణ్డకా ఇమే. ౮
జనస్థానే హతస్థానే తవ రాక్షస! మచ్ఛరైః,
నిర్భయా విచరిష్యన్తి సర్వతో మునయో వనే. ౯

అద్య విప్రసరిష్యన్తి రాక్షస్యో హతబాన్ధవాః,
బాష్పార్ద్రవదనా దీనా భయా దన్యభయావహాః. ౧౦

అద్య శోకరసజ్ఞా స్తా భవిష్యన్తి నిరర్థకాః,
అనురూపకులాః పత్న్యో యాసాం త్వం పతి రీదృశః. ౧౧
నృశంస! నీచ! క్షుద్రాత్మ! న్నిత్యం బ్రాహ్మణకణ్టక!,
యత్కృతే శఙ్కితై రగ్నౌ మునిభిః పాత్యతే హవిః. ౧౨

త మేవ మభిసంరబ్ధం బ్రువాణం రాఘవం రణే,
ఖరో నిర్భర్త్సయామాస రోషా త్ఖరతరస్వనః. ౧౩
దృఢం ఖ ల్వవలిప్తోఽసి భయే ష్వపి చ నిర్భయః,
వాచ్యావాచ్యం తతో హి త్వం మృత్యువశ్యో న బుధ్యసే.

ఇప్పుడు నాబాణంబుల విదారితుఁడవై కంఠము తెగిపడిన నీనురుఁగుబుగ్గలతోఁగూడిన క్రొత్తనెత్తురును భూమి త్రాగఁగలదు. ౬

నీవు దుమ్మునం బొరలుచుఁ జేతులఁ జాఁచి పరుండినవాఁడవై దుర్లభయగు వనితంబోలె భూమిని గాఢంబుగాఁ గవుఁగిలించుకొని దీర్ఘనిద్రం బొందఁగలవు. ౭

రాక్షసాధముఁడవగు నీవట్లు దీర్ఘనిద్రఁ బొంది శయనించిన పిమ్మట మహాతపశ్శాలులగు ఋషులు ఈదండకారణ్యంబున సుఖముగా నివసింతురు. ౮

ఖరుఁడా! నాబాణములచేత నీజనస్థానంబునందలి రాక్షసు లందఱు హతులయినపిదప మును లీవనంబునం దంతటను నిర్భయముగా విహరింపఁగలరు. ౯

ఇదివఱకు ఋషులకు భయంబు గలిగించుచుండిన రాక్షసస్త్రీలు ఇప్పుడు తమబంధువులందఱు హతు లగుటంజేసి కన్నీళ్లుగాఱఁ బరమదుఃఖితలయి భయంబునం బరుగెత్తఁగలరు. ౧౦

నీవు సరియయినకులంబునం బుట్టి యిట్టిదుర్మార్గుఁడవగు నిన్నుఁ బెండ్లాడిన రాక్షసవనితలు ఇప్పుడు దుఃఖరసంబెట్టిదో యెఱుంగఁగలరు ౧౧

ఘాతుకుఁడవు నీచుఁడవు దుర్మార్గుఁడవు నెల్లప్పుడు బ్రాహ్మణులకుఁ గీడు గావించుచుండువాఁడవు నగుఖరుఁడా! నీనిమిత్తమయి మునులు హవిస్సు నగ్నిహోత్రమును వ్రేల్చునపుడెల్ల భయంబు నొందుదురు, అట్టి పరమదుర్మార్గుఁడవగు నిన్నుఁ బెండ్లాడినస్త్రీలు ఇప్పుడు దుఃఖంబెట్టిదో తెలిసికొనఁగలరు. అని రాముఁడు ఖరునితోఁ జెప్పెను. ౧౨

అట్లు కుపితుఁడై చెప్పుచున్న రాముంజూచి ఖరుఁడు పరమక్రుద్ధుఁడై మహాధ్వని గదుర నారాముని నీప్రకారంబున బెదరించెను, ౧౩

నీవు మిక్కిలి గర్వితుఁడవు అందువలననే భయపడవలసిన కాలంబులందునుగూడ నిర్భయుఁడవై మృత్యువశ్యుఁడ వగుటంజేసి "ఇది చెప్పవచ్చు నిది చెప్పరాదు" అనిగూడఁ దెలియక నోటికివచ్చినట్లు ప్రేలుచున్నావు. ౧౪

కాలపాశపరిక్షిప్తా భవన్తి పురుషా హి యే,
కార్యాకార్యం న జానన్తి తే నిరస్తషడిన్ద్రియాః. ౧౫

ఏవముక్త్వా తతో రామం సంరుధ్య భ్రుకుటిం తతః,
స దదర్శ మహాసాలమవిదూరే నిశాచరః ౧౬
రణే ప్రహరణస్యార్థే సర్వతో హ్యవలోకయన్,
స తముత్పాటయామాస సందశ్య దశనచ్ఛదమ్. ౧౭

తం సముత్క్షిప్య బాహుభ్యాం వినద్య చ మహాబలః,
రామముద్దిశ్య చిక్షేప హతస్త్వమితి చాబ్రవీత్. ౧౮

తమాపతన్తం బాణౌఘైశ్ఛిత్త్వా రామః ప్రతాపవాన్,
రోషమాహారయత్తీవ్రం నిహన్తుం సమరే ఖరమ్. ౧౯.
జాతస్వేదస్తతో రామో రోషాద్రక్తాన్తలోచనః,
నిర్బిభేద సహస్రేణ బాణానాం సమరే ఖరమ్. ౨౦

తస్య బాణాన్తరాద్రక్తం బహు సుస్రావ ఫేనిలమ్,
గిరేః ప్రస్రవణస్యేవ తోయధారాపరిస్రవః. ౨౧

విహ్వలస్స కృతో బాణైః ఖరో రామేణ సంయుగే,
మత్తో రుధిరగన్ధేన తమేవాభ్యద్రవద్ద్రుతమ్. ౨౨

తమాపతన్తం సంరబ్ధం కృతాస్త్రో రుధిరాప్లుతమ్,
అపాసర్పత్ప్రతిపదం కించిత్త్వరితవిక్రమః. ౨౩

ఎవ్వరు మృత్యుపాశబద్ధు లగుదురో అట్టిపురుషులు ఇంద్రియాధీనతం దప్పి యుక్తాయుక్తంబు నెఱుంగఁజాలరు. అని ఖరుఁడు రామునితోఁ జెప్పెను. ౧౫

ఆఖరుఁడు రామునితో నీప్రకారంబునం జెప్పి యంత వేగంబున బొమముడిపాటు గదుర యుద్ధంబున నాయుధంబు నిమిత్తమయి నాలుగుప్రక్కలం జూచుచు సమీపంబున నొక్కమహావృక్షముం గనెను. ౧౬

ఆఖరుఁడు రోషంబునఁ బెదవిం గొఱుకుచు నామహావృక్షముం బెఱికెను. ౧౭

మహాబలశాలి యగుఖరుఁడు చేతులతో నావృక్షంబు నెత్తి సింహానాదంబు గావించి రామునిపై నేసి "దీనితో నీవు హతుఁడవైతివి" అని చెప్పెను. ౧౮

మహాపరాక్రమశాలి యగు రాముఁడు అట్లు తనపైకివచ్చుచున్న యమ్మహావృక్షమును బాణములచే దునియలుగా గావించి యుద్ధంబున ఖరుని వధింపుటకై తీవ్రంబగు కోపంబు వహించెను. ౧౯

అంత రాముఁడు కోపంబునంజేసి దేహమంతయుఁ జెమటగాఱఁ గనుంగొనల నెఱ్ఱఁదనంబు గదుర ఖరుని వేయిబాణంబుల నొప్పించెను. ౨౦

ఆఖరుని దేహంబున రాముని బాణంబులం జేయఁబడిన గాయములనుండి ప్రస్రవణపర్వతముననుండి జలధారాప్రవాహములు స్రవించునట్లు నురుఁగుతోఁగూడిన నెత్తురు రెచ్చు స్రవించినది. ౨౧

మత్తుఁడగు నాఖరుఁడు యుద్ధంబున రాముని బాణంబులచే నవయవంబుల స్వాధీనత దప్పునట్లు గావింపఁబడి నెత్తురువాసనతో నారామునిపై కడరెను. ౨౨

సమస్తాస్త్రవేత్తయు శీఘ్రవిక్రముఁడు నగు రాముఁడు అట్లు ఖరుఁడు మహావేగంబున నెత్తుటఁ దోఁగుచు వచ్చుటంజూచి బాణంబు విడువ నవకాశంబు గల్గుటకును ఖరుని మేని రుధిరదుర్గంధంబు సహింపఁజాలక పోవుటవలనను గొంచెము వెనుకకుఁ బోయెను. ౨౩

తతః పావకసంకాశం వధాయ సమరే శరమ్,
ఖరస్య రామో జగ్రాహ బ్రహ్మదణ్డ మి వాపరమ్. ౨౪

స తం దత్తం మఘవతా సురరాజేన ధీమతా,
సందధే చాపి ధర్మాత్మా ముమోచ చ ఖరం ప్రతి. ౨౫

స విముక్తో మహాబాణో నిర్ఘాతసమనిస్స్వనః,
రామేణ ధను రాయమ్య ఖర స్యోరసి చాపతత్. ౨౬
స పపాత ఖరో భూమౌ దహ్యమాన శ్శరాగ్నినా,
రుద్రేణేవ వినిర్దగ్ధ శ్శ్వేతారణ్యే యథాఽన్తకః. ౨౭
స వృత్ర ఇవ వజ్రేణ ఫేనేన నముచి ర్యథా,
బలో వేన్ద్రాశనిహతో నిపపాత హతః ఖరః. ౨౮

తతో రాజర్షయ స్సర్వే సఙ్గతాః పరమర్షయః,
సభాజ్య ముదితా రామ మిదం వచన మబ్రువన్. ౨౯
ఏతదర్థం మహాతేజా మహేన్ద్రః పాకశాసనః,
శరభఙ్గాశ్రమం పుణ్య మాజగామ పురన్దరః. ౩౦

ఆనీత స్త్వ మిమం దేశ ముపాయేన మహర్షిభిః,
ఏషాం వధార్థం క్రూరాణాం రక్షసాం పాపకర్మణామ్. ౩౧
తదిదం నః కృతం కార్యం త్వయా దశరథాత్మజ!,
సుఖం ధర్మం చరిష్యన్తి దణ్డకేషు మహర్షయః.

ఏతస్మి న్నన్తరే దేవా శ్చారణాః సహ సఙ్గతాః,

అంత రాముఁడు ఖరవధార్థమయి యగ్నిహోత్రంబు పగిది వెలుఁగుచున్నదియు రెండవబ్రహ్మదండం బనందగియున్నదియు నగుబాణంబు గ్రహించెను. ౨౪

ధర్మాత్ముఁడగు రాముఁడు. మున్ను బుద్ధిమంతుఁడగు దేవేంద్రుఁడు అగస్త్యమహర్షి ద్వారంబున నొసంగిన యమ్మహాశరంబును సంధించి ఖరునిపై విడిచెను. ౨౫

అట్లు అమ్మహాబాణము రామునిచే నాకర్ణాంతము ధనువు నాకర్షించి విడువఁబడి పిడుగుపడునట్లు మహాధ్వనిగదురఖరునివక్షస్థలంబుఁ జొచ్చెను.

అంత నాఖరుఁడు రామబాణాగ్నిచే నిర్దగ్ధుఁడై శ్వేతారణ్యక్షేత్రమునందు రుద్రనేత్రాగ్నిదగ్ధుఁడైన యంధకాసురునిపగిది నేలం గూలెను. ౨౭

వజ్రాయుధంబుచే నిహతుఁడైన వృత్రాసురుకైవడి నురుగుచే హతుఁడయిన నముచిభంగి, వజ్రాయుధహతుఁ డయిన బలాసురునిచాడ్పున నాఖరుఁడు రామబాణహతుఁడై నేలంగూలెను. ౨౮

అంత రాజర్షులును బ్రహ్మర్షులు వచ్చిపరమసంతోషంబునొంది రాముం బూజించి యిట్లని చెప్పిరి. ౨౯

మహాతేజుఁడును వృత్రానురపాకాసురుల వధించినవాఁడునగు దేవేంద్రుఁడు ఈ ఖరాదివధముకొఱకే పవిత్రంబగు శరభంగాశ్రమంబునకు వచ్చెను. ౩౦

ఘాతుకులును పాపాత్ములునగు నీ రాక్షసులవధార్థమై మహర్షులుపాయంబున ని న్నీస్థలంబుఁ జేరునట్లు గావించిరి. ౩౧

దశరథమహారాజపుత్రుఁడవగు రాముఁడా! నీవు మాకు మిక్కిలియు సుఖకరమగు నీకార్యంబు గావించినావు. ఇఁకమీఁద మహర్షులు దండకారణ్యంబున సుఖంబుగా ధర్మంబు నాచరింతురు. అని మహర్షులు రామునితోఁ జెప్పిరి. ౩౨

ఈమధ్యమున దేవతలును చారణులును బరమసంతుష్టులయి మిక్కి

దుద్రువు శ్చాభినిష్క్రాన్త స్స పుష్పవర్షం సమన్తతః. ౩౩
రామ స్యోపరి సంహృష్టా వవృషు ర్విస్మితా స్తదా,
అర్ధాధికముహూర్తేన రామేణ నిశితై శ్శరైః. ౩౪
చతుర్దశ సహస్రాణి రక్షసాం భీమకర్మణామ్,
ఖరదూషణముఖ్యానాం నిహతాని మహాహవే. ౩౫
అహో! బత! మహ త్కర్మ రామస్య విదితాత్మనః,
అహో! వీర్య మహో! దార్ఢ్యం విష్ణో రివ హి దృశ్యతే. ౩౬

ఇత్యేవ ముక్త్వా తే సర్వే యయు ర్దేవా యథాగతమ్,

తతస్మి న్నన్తరే వీరో లక్ష్మణ స్సహ సీతయా. ౩౭
గిరిదుర్గా ద్వినిష్క్రమ్య సంవివే శాశ్రమం సుఖీ,

తతో రామ స్తు విజయీ పూజ్యమానో మహర్షిభిః. ౩౮
ప్రవివే శాశ్రమం వీరో లక్ష్మణే నాభిపూజితః,

తం దృష్ట్వా శత్రుహన్తారం మహర్షీణాం సుఖావహమ్. ౩౯
బభూవ హృష్టా వైదేహీ భర్తారం పరిషస్వజే,

ముదా పరమయా యుక్తా దృష్ట్వా రక్షోగణా న్హతాన్. ౪౦
రామం చైవా వ్యథం దృష్ట్వా తుతోష జనకాత్మజా.

తత స్తు తం రాక్షససంఘమర్దనం
సభాజ్యమానం ముదితై ర్మహర్షిభిః,

లియు నాశ్చర్యంబునొంది భేరులు వాయింపుచు రామునిపైఁ బూలవాన గురి
పించిరి. ౩౩

రాముఁడు మహాయుద్ధంబునందు ఒకటియు నరముహూర్తంబులో
పల భయంకరపరాక్రములగు ఖరదూషణులు మొదలయిన పదునాలుగు
వేలరాక్షసుల వధించెను. ౩౪-౩౫

ఆత్మజ్ఞానముగల రాముఁడు ఎంతటి గొప్పకార్యము గావించినాఁడు!
ఆశ్చర్యము! ఈతని పరాక్రమము నీతని సామర్థ్యమును విష్ణుదేవునిపరాక్ర
మసామర్థ్యములుంబోలె నచింత్యంబు లయియున్నవి! ఆశ్చర్యము! అని
దేవాదులు చెప్పిరి. ౩౬

దేవతలు మున్నగునార లందఱు నీప్రకారమునం జెప్పి తమతమనెల
వులకుం బోయిరి.

ఇంతలో వీరుఁడగు లక్ష్మణుఁడు రాముఁడు జయించుటంజేసి పరమసం
తుష్టుండై సీతతోఁగూడఁ బర్వతగుహనుండి వెడలి యాశ్రమంబుఁ బ్రవేశిం
చెను. ౩౭

అంత జయమునొందినవాఁడును వీరుఁడునగు రాముఁడు మహర్షులచేఁ
బూజింపఁబడుచు లక్ష్మణునిచే నెదురొ్కని పూజింపఁబడినవాఁడై తన
యాశ్రమంబుఁ జొచ్చెను. ౩౮

సీతాదేవియట్లు సమస్తశత్రువుల వధించినవాఁడును మహర్షులకుసుఖం
బుగలిగించినవాఁడు నగు నారాముం జూచి సంతోషంబునొంది పెనిమిటిని
గాఢంబుగాఁ గవుఁగిలించుకొనెను. ౩౯

జనకమహారాజుకూఁతురైన సీతాదేవిఆరాక్షసులు హతులగుటకుఁ బర
మసంతోషంబునొంది రాముఁడును యుద్ధంబున నేమియు బాధనొందకుండు
టం జూచి మఱియు నానందించెను. ౪౦

అంత నప్పుడు చంద్రబింబముంబోలు ముఖంబుగల యాసీతాదేవి
యట్లు సమస్తరాక్షసుల సంహరించినవాని సంతుష్టులగుమహర్షులచేఁ బూజిం

పునః పరిష్వజ్య శశిప్రభాననా
బభూవ హృష్టా జనకాత్మజా తదా. ౪౧.

ఇతి శ్రీమదరణ్యకాణ్డే త్రింశ స్సర్గః. ౩౦.

---

## ఏకత్రింశ స్సర్గః.

త్వరమాణ స్తతో గత్వా జనస్థానా దకమ్పనః,
ప్రవిశ్య లఙ్కాం వేగేన రావణం వాక్య మబ్రవీత్. ౧
జనస్థానస్థితా రాజ! న్రాక్షసా బహవో హతాః,
ఖర శ్చ నిహత స్సఙ్ఖ్యే కథంచి దహ మాగతః. ౨

ఏవ ముక్తో దశగ్రీవః క్రుద్ధ స్సంరక్తలోచనః,
అకమ్పన మువా చేదం నిర్దహ న్నివ చక్షుషా. ౩

కేన రమ్యం జనస్థానం హతం మమ పరాసునా,
కో హి సర్వేషు లోకేషు గతిం చాధిగమిష్యతి. ౪
నహి మే విప్రియం కృత్వా శక్యం మఘవతా సుఖమ్,
ప్రాప్తుం వైశ్రవణే నాపి న యమేన న విష్ణునా. ౫
కాలస్య చా ప్యహం కాలో దహేయ మపి పావకమ్,
మృత్యుం మరణధర్మేణ సంయోజయితు ముత్సహే. ౬
దహేయ మపి సంక్రుద్ధ స్తేజసాఽఽదిత్యపావకౌ,
వాతస్య తరసా వేగం నిహన్తు మహ ముత్సహే. ౭

తథా క్రుద్ధం దశగ్రీవం కృతాఞ్జలి రకమ్పనః,
భయా త్సందిగ్ధయా వాచా రావణం యాచ తేఽభయమ్. ౮

పఁబడుచున్నవాని శ్రీరాముని మఱిమఱి గాఢంబుగాఁ గవుఁగిలించుకొని పరమసంతోషంబు నొందెను. ౪౧.

ఇది ముప్పదియవ సర్గము.

---

## ముప్పదియొకటవసర్గము.

అంత రావణునిచారుఁడగు నకంపనుఁడు జనస్థానంబుననుండి యతివేగంబున లంకకుం బోయి రావణుం జూచి యిట్లని చెప్పెను. ౧

రాక్షసరాజుఁడవగు రావణుఁడా! జనస్థానంబుననున్న రాక్షసు లందఱు యుద్ధంబున హతులయిరి. ఖరుఁడును వధింపఁబడియె. నేనుమాత్రము ప్రయాసంబునఁ దప్పించుకొనివచ్చినాను. అనియకంపనుఁడు రావణునితోఁ జెప్పెను. ౨

రావణుఁడు అకంపనుని మాటను విని కుపితుఁడై కన్నుల నెత్తుఁదనం బొప్ప దహించువాఁడువోలెఁ జూచుచుం జూచుచు నకంపనునితో నిట్లని చెప్పెను. ౩

మృత్యువశ్యుఁ డెవ్వఁడు జనస్థానంబునందలి రాక్షసుల వధించెను? ఇంక నతనికి సమస్తలోకంబులయందును గతి యెక్కడిది? ౪

దేవేంద్రుఁడుగాని కుబేరుఁడుగాని యముఁడుగాని విష్ణుఁడుగాని నాకప్రియంబు గావించిరేని యెంతమాత్రము సుఖంబు నొందఁజాలరు ౫

నేను యమునకును యముఁడను. అగ్నినింగూడ దహింతును. మృత్యువునకును గూడ మరణంబు గలిగింతును. ౬

నేను క్రుద్ధుఁడనగుదునేని సూర్యపావకుల నిద్దఱనుంగూడ దహింతును. వేగంబున వాయువేగంబును హరింతును. అని రావణుఁడు అకంపనునితోఁ జెప్పెను. ౭

అంత నకంపనుఁడు రావణుఁ డట్లు కుపితుఁడగుటను జూచి చేతులు మొగిడ్చి భయంబున మాటలుతొట్రుపడ నభయం బొసంగుమని రావణుని యాచించెను. ౮

దశగ్రీవోఽ భయం తస్మై ప్రదదౌ రక్షసాం వరః,
స విస్రబ్ధోఽబ్రవీ ద్వాక్య మసందిగ్ధ మకమ్పనః.
పుత్త్రో దశరథ స్యాస్తి సింహసంహననో యువా,
రామో నామ వృషస్కన్ధో వృత్తాయతమహాభుజః. ౧౦

వీరః పృథుయశాః శ్రీమా నతుల్యబలవిక్రమః,
హతం తేన జనస్థానం ఖర శ్చ సహదూషణః. ౧౧

అకమ్పనవచః శ్రుత్వా రావణో రాక్షసాధిపః,
నాగేన్ద్రఇవ నిశ్శ్వస్య వచనం చేద మబ్రవీత్. ౧౨
ససు రేన్ద్రేణ సంయుక్తో రామ స్సర్వామరైః సహ,
ఉపయాతో జనస్థానం బ్రూహి కచ్చి దకమ్పన!. ౧౩

రావణస్య పున ర్వాక్యం నిశమ్య త దకమ్పనః,
ఆచచక్షే బలం తస్య విక్రమం చ మహాత్మనః.
రామో నామ మహాతేజా శ్శ్రేష్ఠ స్సర్వధనుష్మతామ్,
దివ్యాస్త్రగుణసంపన్నః పురన్దరసమో యుధి. ౧౪
తస్యానురూపో బలవా న్రక్తాక్షో దున్దుభిస్వనః,
కనీయాన్ లక్ష్మణో నామ భ్రాతా శశినిభాననః. ౧౫

స తేన సహ సంయుక్తః పావకే నానిలో యథా,
శ్రీమా న్రాజవర స్తేన జనస్థానం నిపాతితమ్. ౧౬

రాక్షసశ్రేష్ఠుఁడగు రావణుఁ డాయకంపనున కభయం బొసంగెను.

ఆయకంపనుఁడు అంత భయంబువిడిచి ధైర్యంబుననిట్లని చెప్పెను.

లోకోత్తమమగు రూపముగలవాఁడును యౌవనవంతుఁడును ఆఁబోఁతుమూఁపువంటిమూఁపులుగలవాఁడును గుండ్రములయి నిడువులయి బలవంతంబులయిన భుజంబులుగలవాఁడును వీరుండును మహాయశుఁడును శ్రీమంతుఁడును సరిలేనిబలపరాక్రమంబులుగలవాఁడును దశరథమహారాజపుత్రుఁడునగు రాముఁడను నొక్క మహాపురుషుఁ డున్నాఁడు. ౧౦

అయ్యో! ఆరాముఁడే ఖరుఁడు దూషణుఁడు మొదలుగాఁగల జనస్థానంబునందలి రాక్షసుల నందఱను వధించెను. అని యకంపనుఁడు రావణునితోఁ జెప్పెను. ౧౧

రాక్షసేశ్వరుఁడగు రావణుఁడు అకంపనుఁడు చెప్పినమాటను విని సర్పరాజువలె వేఁడినిట్టూర్పులు పుచ్చుచు నిట్లనిచెప్పెను. ౧౨

అకంపనుఁడా! ఆరాముఁడు దేవతల యందఱితోనుంగూడి జనస్థానంబునకు వచ్చినాఁడా యేమి? నాకావివరంబుఁ జెప్పుము. అని అకంపనునితో రావణుఁడు చెప్పెను. ౧౩

అకంపనుఁడు మఱల రావణుఁడుచెప్పినమాటను విని మహాత్ముఁడగు నారామునిబలపరాక్రమంబులం జెప్ప నారంభించెను. ౧౪

రాముఁడు మహాతేజుఁడు సమస్తధనుర్ధరులలోను శ్రేష్ఠుఁడు దివ్యాస్త్రంబులు దెలిసినవాఁడు. యుద్ధంబున దేవేంద్రునకు సాటివచ్చును. ౧౫

ఆరామునకు బలవంతుఁడును ఎఱ్ఱనిరేఖలతో నొప్పుచున్న కన్నులుగలవాఁడును భేరీధ్వనివలె గంభీరంబగు కంఠధ్వనిగలవాఁడును చంద్రబింబమువంటి ముఖముగలవాఁడునగు లక్ష్మణుఁడను తమ్ముఁ డొక్కఁడు గలఁడు. ౧౬

శ్రీమంతుఁడును రాజశ్రేష్ఠుఁడునగు నారాముఁడు వాయువగ్నిహోత్రునితోఁ గూడునట్లు ఆలక్ష్మణునితోఁ గూడియున్నాఁడు. ఆరాముఁడే జనస్థానంబునందలి రాక్షసుల నందఱ వధించెను. ౧౭

నైవ దేవా మహాత్మానో నాత్ర కార్యా విచారణా,

శరా రామేణ తూత్సృష్టా రుక్మపుఙ్ఖాః పతత్రిణః. ౧౮
సర్పాః పఞ్చాననా భూత్వా భక్షయన్తి స్మ రాక్షసాన్,
యేన యేన చ గచ్ఛన్తి రాక్షసా భయకర్శితాః. ౧౯
తేన తేన స్మ పశ్యన్తి రామ మేవాగ్రతః స్థితమ్,

ఇత్థం వినాశితం తేన జనస్థానం తవానఘ!. ౨౦

అకమ్పనవచ శ్శ్రుత్వా రావణో వాక్య మబ్రవీత్,
జనస్థానం గమిష్యామి హన్తుం రామం సలక్ష్మణమ్. ౨౧

అథైవ ముక్తే వచనే ప్రోవాచేద మకమ్పనః,
శృణు రాజ! న్యథావృత్తం రామస్య బలపౌరుషమ్. ౨౨

అసాధ్యః కుపితో రామో విక్రమేణ మహాయశాః,
ఆపగాయా స్సుపూర్ణాయా వేగం పరిహరే చ్ఛరైః. ౨౩
సతారగ్రహనక్షత్రం నభ శ్చాప్యవసాదయేత్,

అసౌ రామ స్తు మజ్జన్తీం శ్రీమా నభ్యుద్ధరే న్మహీమ్. ౨౪

భిత్త్వా వేలాం సముద్రస్య లోకా నాప్లావయే ద్విభుః,
వేగం వాపి సముద్రస్య వాయుం వా విధమే చ్ఛరైః. ౨౫

సంహృత్య వా పున ర్లోకా న్విక్రమేణ మహాయశాః,
శక్త స్స పురుషవ్యాఘ్ర స్స్రష్టుం పునరపి ప్రజాః. ౨౬

మహాత్ములగు దేవతలెవ్వరును అచ్చటికివచ్చి రామునకు సాహాయ్యము సేయలేరు. ఈవిషయంబునందు సంశయింపవలసినది లేదు.

రామునిచేఁ బ్రయోగింపఁబడిన కాంచనపుంఖములగుబాణములుఅయి దుతంలలపాములయి రాక్షసులను భక్షించినవి. ౧౮

రాక్షసులు భయపీడితులయి యాత్మసంరక్షణార్థమయి యేయాయుధ ముంగొని యుద్ధంబుగావింపఁబూనుదురో రాముఁడును ఆయాయుధంబునే పట్టుకొని వారి కట్టెదుటఁ గాన్పించుచుండెను. ౧౯

పాపరహితుఁడవగు రావణుఁడా! రాముఁడీప్రకారంబుననీజనస్థానంబు నంతయు నాశంబు నొందించెను. అనియకంపనుఁడు రావణునితోఁ జెప్పెను.

రావణుఁడు అకంపనుఁడు చెప్పినమాటను విని యిట్లని చెప్పెను.

నేను జనస్థానంబునకుఁబోయి రాముని లక్ష్మణుని వధించివచ్చెదను. అని రావణుఁ డకంపనునితోఁ జెప్పెను. ౨౧

అట్లు రావణుఁడు చెప్పినదిచూచి యకంపనుఁ డిట్లని చెప్పెను.

రాక్షసరాజుఁడవగు రావణుఁడా! రామునిబలపరాక్రమంబుల యథార్థముగాఁ జెప్పెదను వినుము. ౨౨

మహాయశుఁడగు రాముని సాధింప నెరికి నలవిగాదు; అతఁడు కోపించునేని నిండినయేటిప్రవాహవేగమునుగూడ బాణంబులచే నిలుపును. ౨౩

ఆరాముఁడు నక్షత్రగ్రహంబులతోఁగూడ నాకాశంబు నంతయు నశింపఁజేయం జాలును.

శ్రీమంతుఁడగు నీరాముఁడు మునిఁగిపోవుచున్న భూమినింగూడ లేవనెత్తును. ౨౪

స్వతంత్రుఁడగు రాముఁడు సముద్రము చెలియలికట్టను భేదించి లోకముల నన్నిఁటి సముద్రజలంబుల ముంచును. బాణంబుల సముద్రవేగంబుఁగాని వాయువేగంబుఁగాని నిలుపును. ౨౫

మహాయశుఁడగురాముఁడు పరాక్రమంబున లోకంబుల నన్నింటిని సంహరించి మఱల మొదటనుండి ప్రజల సృజించుటకునుంగూడ సమర్థుఁడు.

న హి రామో దశగ్రీవ! శక్యో జేతుం త్వయా యుధి,
రక్షసాం వాపి లోకేన స్వర్గః పాపజనై రివ. ౨౭
న తం వధ్య మహం మన్యే సర్వై ర్దేవాసురై రపి,

అయం తస్య వధోపాయ స్తం మమైకమనా శ్శృణు. ౨౮

భార్యా తస్యోత్తమా లోకే సీతా నామ సుమధ్యమా,
శ్యామా సమవిభక్తాఙ్గీ స్త్రీరత్నం రత్నభూషితా. ౨౯

నైవ దేవీ న గన్ధర్వీ నాప్సరా నాపి దానవీ,
తుల్యా సీమన్తినీ తస్యా మానుషీషు కుతో భవేత్. 30
త స్యాపహర భార్యాం త్వం ప్రమథ్య తు మహావనే,

స తయా రహితః కామీ రామో హాస్యతి జీవితమ్. 3౧

అరోచయత తద్వాక్యం రావణో రాక్షసాధిపః,
చిన్తయిత్వా మహాబాహు రకమ్పన మువాచ హ. 3౨
బాఢం కాల్యం గమిష్యామి హ్యేక స్సారథినా సహ,
ఆనయిష్యామి వైదేహీ మిమాం హృష్టో మహాపురీమ్. 33
అథైవ ముక్త్వా ప్రయయౌ ఖరయుక్తేన రావణః,
రథే నాదిత్యవర్ణేన దిశ స్సర్వాః ప్రకాశయన్. 3౪

స రథో రాక్షసేన్ద్రస్య నక్షత్రపథగో మహాన్,
సంచార్యమాణ శ్శుశుభే జలదే చన్ద్రమా ఇవ. 3౫

రావణుఁడా! స్వర్గము పాపజనులకు సాధ్యముకానట్లు నీకుఁగాని మన రాక్షసులయందఱకుఁగాని యుద్ధంబున రాముని జయింప నలవిగాదు. ౨౬

దేవాసుర లందఱు నొక్కటియయినను రాముని వధింపఁజాలరని నేను దలంచెదను.

రాముని వధించునుపాయం బొకటియున్నది; దానిం జెప్పెదను వినుము. ౨౭

ఆరామునకు లోకంబున సమస్తస్త్రీలలో నుత్తమురాలును సుందరము యిన నడుముగలదియు యౌవనమధ్యస్థయును సమముగాఁగుదిరియుండు నవయవములుగలదియు రత్నాలంకారంబులతో నొప్పుచున్నదియు నగు సీత యనెడు భార్య గలదు. ౨౮

ఆసీతకు సరియయినవనిత దేవతలలోఁగాని యప్సరసలలోఁ గాని దానవులలోఁగాని లేదు. ఇంక మనుష్యులలో లేదని చెప్పనేల?. ౩౦

నీ వామహారణ్యంబునకుఁ బోయి బలాత్కారంబున నారామునిభార్యను దీసికొనిరమ్ము.

ఆరాముఁడు కాముకుఁడుగావున సీతను విడిచియుండఁజాలక ప్రాణంబులు విడుచును. అని అకంపనుఁడు రావణునితోఁ జెప్పెను. ౩౧

రాక్షసరాజుఁడగు రావణుఁడు అకంపనుఁడు చెప్పినమాట చక్కఁగానే యున్నదని తలఁచి యోచించి యకంపనునిం జూచి యిట్లని చెప్పెను.

మంచిది, నే నొక్కఁడనే సారథితోఁగూడఁ బ్రొద్దున లేచిపోయి సంతోషంబున సీత నిచ్చటికిఁ దీసికొని వచ్చెదను. ౩౩

రావణుఁ డీప్రకారంబునంజెప్పి యంతఁ బ్రాతఃకాలంబున గాడిదలు పూన్చినసూర్యప్రభంబగు రథంబు నారోహించి దిక్కులు వెలుఁగంజేయుచు వెడలెను. ౩౪

ఆకాశంబునందుఁబోవుచున్న యారాక్షసరాజుఁడగు రావణుని మహారథము మేఘమండలంబునఁ దిరుగు చంద్రునిభంగిఁ బ్రకాశింపుచుండెను. ౩౫

ఆరావణుండు మారీచాశ్రమంబుం జేరి యచ్చటం దేరుదిగ్గి తాటకాపుత్రుండగు మారీచునొద్దకుం బోయెను.

మారీచుండు మనుష్యదుర్లభంబులగు భక్ష్యభోజ్యంబులచే రాక్షసరాజుండగు రావణునిం బూజించెను. ౩౬

మారీచుండు ఆసనోదకంబుల నారావణునిం బూజించి మహార్థంబగు వచనంబున రావణుని జూచి యిట్లని చెప్పెను. ౩౭

రాక్షసరాజుండ వగు రావణుండా! రాక్షసులందఱు క్షేమమాయేమి? నీ వింతశీఘ్రముగా నచ్చుటవలన నాకు సంశయమగుచున్నది. అని మారీచుండు రావణునితోం జెప్పెను. ౩౮

మహాతేజుండును మాటలుచెప్పుటయందు బండితుండు నగు రావణుండు మారీచుండు చెప్పినమాటను విని యంతం దా నిట్లని చెప్పెను. ౩౯

మారీచుండా! నాతలారివాండైనఖరుని రాముండు వధించినాండు. మఱియు నెట్టివారికి వధింప నలవిగాని వారలగు జనస్థానమునందలి రాక్షసులందఱు యుద్ధంబున రామునిచే హతులయిరి. ౪౦

ఆరామునిభార్య నపహరించు విషయమునందు బంధువులం బోగొట్టుకొనియున్న నాకు నీవు సాహాయ్యంబు గావింపుము. అని రావణుండు మారీచునితోం జెప్పెను.

మారీచుండు రాక్షసరాజుండగు రావణుండు చెప్పినమాటను విని యిట్లని చెప్పెను. ౪౧

రాక్షసశ్రేష్ఠుడ వగు రావణుండా! స్నేహితుండువలె నటించుచు నీపై విరోధంబుగొని నిన్ను నాశంబు నొందింపం దలంచినవాం డెవ్వండు నీకు సీతపేరు చెప్పెను? ఎవ్వండు నీచే నైశ్వర్యమదంబునం దిరస్కృతుండై నీపై నసూయగొనియున్నాండు! ౪౨

సీత నిచ్చటికిం దెమ్మని యెవ్వండు నీకుం జెప్పెను? నా కతనిం జెప్పుము.

గత్వో లోకస్య సర్వస్య స శ్శృఙ్గాణి ఛేత్తు మిచ్ఛతి. ౪౩
ప్రోత్సాహయతి క శ్చి త్త్వాం సచ శత్రు రసంశయః,

ఆశీవిషముఖా ద్దంష్ట్రా ముద్ధర్తుం చేచ్ఛతి త్వయా. ౪౪

కర్మణా కేన కే నాసి కాపథం ప్రతిపాదితః,
సుఖసుప్తస్య తే రాజ! ప్రహృతం కేన మూర్ధని. ౪౫

విశుద్ధవంశాభిజనాగ్రహస్త
స్తేజోమద స్సంస్థితదోర్విషాణః,
ఉదీక్షితుం రావణ! నేహ యుక్త
స్స సంయుగే రాఘవగన్ధహస్తీ. ౪౬

అసౌ రణాన్తస్థితిసన్ధివాలో
విదగ్ధరత్నోమృగహా నృసింహః,
సుప్త స్త్వయా బోధయితుం న యుక్త
శ్శరాఙ్గపూర్ణో నిశితాసిదంష్ట్రః. ౪౭
చాపాపహారే భుజవేగపఙ్కే
శరోర్మిమాలే సుమహాహవౌఘే,
న రామపాతాళముఖేఽతిఘోరే
ప్రస్కన్దితుం రాక్షసరాజ! యుక్తమ్. ౪౮
ప్రసీద లఙ్కేశ్వర! రాక్షసేన్ద్ర!
లఙ్కాం ప్రసన్నో భవ సాధు గచ్ఛ,
త్వం స్వేషు దారేషు రమస్వ నిత్యం
రామ స్సభార్యో రమతాం వనేషు ౪౯

ఎవ్వఁడు రాక్షసలోకమున కంతయుఁ బ్రధానభూతుఁడవైన నిన్ను నాశంబు నొందింపఁ గోరినాఁడు? ఎవ్వఁడు నిన్ని విషయంబునఁ బ్రోత్సాహపఱచుచున్నాఁడో అతఁడు నీకు శత్రువు. సందేహములేదు. ౪౩

ఎవ్వఁడు నిన్నుఁ గ్రూరసర్పమునోటనుండి కోఱం బెఱుకు మనుచున్నాఁడు? ౪౪

ఎవ్వఁ డేయుపాయంబున నీకిట్టి దుర్బుద్ధిగలుగునట్లు గావించినాఁడు.

రాక్షసరాజుఁడవగు రావణుఁడా! నిష్కారణముగా నెవ్వఁడు నీకు మహానర్థము గలిగింపఁదలంచినాఁడు? ౪౫

రావణుఁడా! పరిశుద్ధమయిన వంశమునందుఁ బుట్టుటయే తొండముగాఁ గలదియుఁ బ్రతాపమే మదముగాఁ గలదియు బాహువులె కొమ్ములుగాఁ గలదియునగు దేని గంధము మూర్కొని యితరగజంబులు పరుగెత్తునో అట్టి రాముఁడను మదపుటేనుఁగును యుద్ధంబునఁ దేఱిచూడనైన నలవిగాదు. ౪౬

యుద్ధాగ్రంబున నుండుటయే కోపంబున నడుముదాఁకి యుండువాలంబుగాఁ గలదియు శూరులగు రాక్షసులను మృగంబులం జంపునదియు బాణంబులే నఖాద్యవయవములుగాఁ గలదియుఁ గఱకుఖడ్గంబులె కోఱలుగాఁ గలదియునగు నిదురించియున్న రాముఁ డనుసింహమును నీవు మేలుకొలుపఁదగదు.

రాక్షసరాజుఁడవగు రావణుఁడా! ధనుస్సను మొసలిగలదియు బాహువేగం బనునడుసుగలదియు బాణంబు లనుతరంగసమూహముగలదియు యుద్ధం బనుమహాజలప్రవాహముగలదియు మహాభయంకరంబు నగురాముఁడనుమహాబిలంబునోటం బడుట యెంతమాత్రము యుక్తముగాదు. ౪౭

లంకానాథుఁడవు రాక్షసరాజుఁడవునగు రావణుఁడా! అట్లు కావున నీవు కోపంబు విడువుము; ప్రసన్నుఁడవయి లంకకుఁ బొమ్ము; అచ్చట నీభార్యలం గూడి నానావిధభోగంబుల ననుభవింపుము; రాముఁడు తనభార్యం గూడి యడవులం గ్రీడింపుచుండుఁగాక అని మారీచుఁడు రావణునితోఁ జెప్పెను. ౪౮

ఏవ ముక్త్వా దశగ్రీవో మారీచేన స రావణః,
న్యవర్తత పురీం లఙ్కాం వివేశ చ గృహోత్తమమ్. ౫౦

ఇత్యార్షే శ్రీమద్రామాయణే అరణ్యకాణ్డే ఏకత్రింశ స్సర్గః. ౩౧.

## ద్వాత్రింశ స్సర్గః.

తత శ్శూర్పణఖా దృష్ట్వా సహస్రాణి చతుర్దశ,
హతా న్యేకేన రామేణ రక్షసాం భీమకర్మణామ్ ౧
దూషణం చ ఖరం చైవ హతం త్రిశిరసం రణే,
దృష్ట్వా పున ర్మహానాదం ననాద జలదో యథా. ౨
సా దృష్ట్వా కర్మ రామస్య కృత మన్యై స్సుదుష్కరమ్,
జగామ పరమోద్విగ్నా లఙ్కాం రావణపాలితామ్ ౩
సా దదర్శ విమానాగ్రే రావణం దీప్తతేజసమ్,
ఉపోపవిష్టం సచివై ర్మరుద్భి రివ వాసవమ్. ౪

ఆసీనం సూర్యసఙ్కాశే కాఞ్చనే పరమాసనే,
రుక్మవేదిగతం ప్రాజ్యం జ్వలన్త మివ పావకమ్. ౫

దేవగన్ధర్వభూతానా మృషీణాం చ మహాత్మనామ్,
అజేయం సమరే శూరం వ్యాత్తానన మివాన్తకమ్. ౬

దేవాసురవిమర్దేషు వజ్రాశనికృతవ్రణమ్,
ఐరావతవిషాణాగ్రై రుత్కృష్టకిణవక్షసమ్ ౭

ఆరావణుఁడు మారీచుఁడు చెప్పినమాటను విని మఱలి లంకకు బోయి సర్వోత్తమంబగు తనగృహముం బ్రవేశించెను. ౨౦

ఇదిముప్పదియొకటవసర్గము.

---

## ముప్పదిరెండవసర్గము.

అంత శూర్పణఖ రాముఁడొక్కఁడే భయంకరపరాక్రములగు పదునాలుగు వేలరాక్షసులను దూషణునిఖరుని త్రిశిరుని వధించుటఁ జూచి మఱల మహాధ్వనిగలుగునట్లు మేఘంబువలె గర్జించెను. ౧-౨

ఆశూర్పణఖ మఱియెవ్వరికిని జేయనలవిగానట్టి రామునికార్యమును జూచి మిక్కిలియుభయంబునొంది రావణపాలితంబగులంకకుఁబోయెను. 3

ఆశూర్పణఖ దేవతలతోఁగూడఁ గూర్చుండిన దేవేంద్రుఁడుంబోలెఁ బుష్పకవిమానాగ్రంబున మంత్రులతోఁగూడఁ గూర్చుండియున్నవాఁడును మహాతేజుఁడునగు రావణునిం జూచెను. ౪

సూర్యసమానతేజుఁడును గాంచనాసనంబునం గూర్చుండి బంగారువేదికయందు హెచ్చుగా నేయిప్రేల్చుటచే జ్వలించుచున్న యగ్నిహోత్రుఁడుంబోలెఁ దేజరిల్లుచున్నవాఁడు నగు రావణుని శూర్పణఖ చూచెను. ౫

దేవతలకుఁగాని గంధర్వులకుఁగాని భూతంబులకుఁగానిమహాత్ములగు ఋషులకుఁగానియుద్ధంబున జయింపనలవిగానివాఁడునుశూరుఁడును నోఱు దెఱచుకొనియుండు యముఁడువలె భయంకరాకారుఁడునగురావణుని శూర్పణఖ చూచెను. ౬

దేవాసురయుద్ధంబులందువజ్రాయుధప్రహారంబులచేఁ గలిగినగాయములతోఁగూడినవాఁడును ఐరావతము కొమ్ములతోఁ గీఱుటచేఁగలిగిన గాయలతో నొప్పువక్షస్థలంబుగలవాఁడునగు రావణుని శూర్పణఖ చూచెను. ౭

వింశద్భుజం దశగ్రీవం దర్శనీయపరిచ్ఛదమ్,
విశాలవక్షసం వీరం రాజలక్షణశోభితమ్. ౮

స్నిగ్ధవైడూర్యసఙ్కాశం తప్తకాఞ్చనకుణ్డలమ్,
సుభుజం శుక్లదశనం మహాస్యం పర్వతోపమమ్. ౯

విష్ణుచక్రనిపాతైశ్చ శతశో దేవసంయుగే,
అన్యైశ్శస్త్రప్రహారైశ్చ మహాయుద్ధేషు తాడితమ్. ౧౦

ఆహతాఙ్గం సమస్తైశ్చ దేవప్రహరణైస్తథా,
అక్షోభ్యాణాం సముద్రాణాం క్షోభణం క్షిప్రకారిణమ్. ౧౧

క్షేప్తారం పర్వతేన్ద్రాణాం సురాణాం చ ప్రమర్దనమ్,
ఉచ్ఛేత్తారం చ ధర్మాణాం పరదారాభిమర్శనమ్. ౧౨

సర్వదివ్యాస్త్రయోక్తారం యజ్ఞవిఘ్నకరం సదా,

పురీం భోగవతీం ప్రాప్య పరాజిత్య చ వాసుకిమ్. ౧౩
తక్షకస్య ప్రియాం భార్యాం పరాజిత్య జహార యః,

కైలాసపర్వతం గత్వా విజిత్య నరవాహనమ్. ౧౪

ఇరువదిచేతులును బదితలలును గలవాఁడును సుందరములయిన ఛత్ర చామరాదులతో నొప్పుచున్నవాఁడును విశాలంబగు ఱొమ్ముగలవాఁడును రాజచిహ్నశోభితుఁడునగు రావణుని శూర్పణఖ చూచెను. ౮

ఆభరణస్థగితంబులగు సుందరంబులయిన వైడూర్యమణులచేఁ బ్రకాశించుచున్నవాఁడును దప్తకాంచనమయంబులగు కుండలంబులు దాల్చినవాఁడును దీర్ఘముగాను బ్రమముగాను౧డు భుజములుకలవాఁడును దెల్లనిదంతములుగలవాఁడును బెద్దనోరువాఁడును బర్వతాకారుఁడునగు రావణుని శూర్పణఖ చూచెను. ౯

దేవతలతో యుద్ధంబు సేయునప్పుడు పెక్కుమాఱులు విష్ణుదేవుని చక్రముచేతను ఇతరములయిన మహాయుద్ధములందు నానావిధములయిన దివ్యాయుధములచేతను గొట్టఁబడియు వానినన్నిఁటిని సరకుసేయని మహాబలుఁడగురావణుని శూర్పణఖ చూచెను. ౧౦

అట్లు దేవతల సమస్తాయుధంబులచేతను బెక్కుమాఱులు ప్రహరింపఁబడిన దేహముగలవాఁడును అక్షోభ్యములగు సముద్రములకును క్షోభంబుగలిగించువాఁడును ఏకార్యమునేని యతివేగంబున౦ జేయువాఁడునగు రావణుని శూర్పణఖ చూచెను. ౧౧

మహాపర్వతంబుల నిగురవేయువాఁడును దేవతల మర్దించువాఁడును ధర్మముల నశింపఁజేయువాఁడును బరస్త్రీగామియు నగు రావణుని శూర్పణఖ చూచెను. ౧౨

సమస్తదివ్యాస్త్రంబులను బ్రయోగింపఁదెలిసినవాఁడును ఎల్లప్పుడును యాగంబులను విఘ్నంబుసేయువాఁడు నగురావణుని శూర్పణఖ చూచెను.

ఎవ్వఁడు భోగవతియను సర్పరాజనగరమునకుఁ బోయి వాసుకిని జయించి బలాత్కారంబునఁదక్షకుని ప్రియభార్యలనపహరించెనో అట్టిరావణుని శూర్పణఖ చూచెను. ౧౩

• ఎవ్వఁడు కైలాసపర్వతంబునకుఁ బోయి కుబేరుని జయించి కామ

విమానం పుష్పకం తస్య కామగం వై జహార యః,
వనం చైత్రరథం దివ్యం నళినీం నన్దనం వనమ్. ౧౫
విధ్వంసయతి యః క్రోధా ద్దేవోద్యానాని వీర్యవాన్,

చన్ద్రసూర్యౌ మహాభాగా వుత్తిష్ఠన్తౌ పరన్తపౌ. ౧౬
నివారయతి బాహుభ్యాం యః శైలశిఖరోపమః,

దశవర్షసహస్రాణి తప స్తప్త్వా మహావనే. ౧౭
పురా స్వయంభువే ధీర శ్శిరాం స్యుపజహార యః,

దేవ దానవ గన్ధర్వ పిశాచ పతగోరగైః. ౧౮
అభయం యస్య సంగ్రామే మృత్యుతో మానుషా దృతే,

మన్త్రై రభిష్టుతం పుణ్య మధ్వరేషు ద్విజాతిభిః. ౧౯
హవిర్ధానేషు య స్సోమ ముపహన్తి మహాబలః,

ఆప్తయజ్ఞహరం క్రూరం బ్రహ్మఘ్నం దుష్టచారిణమ్. ౨౦
కర్కశం నిరనుక్రోశం ప్రజానా మహితే రతమ్,

రావణం సర్వభూతానాం సర్వలోకభయావహమ్. ౨౧
రాక్షసీ భ్రాతరం క్రూరం సా దదర్శ మహాబలమ్,

తం దివ్యవస్త్రాభరణం దివ్యమాల్యోపశోభితమ్. ౨౨

గమనంబగు నతనిపుష్పకవిమానంబు నపహరించెనో అట్టి మహాబలు రావణుని శూర్పణఖ చూచెను. ౧౪

ఎవ్వఁడు కుబేరునిచైత్రరథవనంబును అతనిపుష్కరిణిని ఇంద్రునినందనవనంబును మఱియునితరదేవతల యుద్యానవనంబులను గోపంబున నాశంబు నొందించెనో అట్టిమహాపరాక్రమశాలినిరావణుని శూర్పణఖ చూచెను. ౧౫

పర్వతశిఖరాకారుఁడగు నెవ్వఁడుమహాభాగులును శత్రువులఁ దపింపఁ జేయువారలు నగుచంద్రసూర్యు లుదయించునప్పుడు వారలఁ జేతులచే నడ్డగించునో అట్టిరావణుని శూర్పణఖ చూచెను. ౧౬

ఏధైర్యశాలి మున్ను మహావనంబునఁ బదివేలయేండ్లత్యుగ్రంబుగాఁ దపంబు గావించి తనతలలను ఖండించి వానిచే బ్రహ్మదేవునిఁ బూజించెనో అట్టిరావణుని శూర్పణఖ చూచెను. ౧౭

ఎవ్వనికి మనుష్యుఁ డొక్కఁడు దక్క దక్కిన దేవదానవగంధర్వపిశాచపతగోరగాదులవలన యుద్ధంబున మరణభయములేదో ఆరావణునిశూర్పణఖ చూచెను. ౧౮

ఏమహాబలశాలి యాగములందు బ్రాహ్మణులచే మంత్రంబుల నభిషుతంబును బవిత్రంబునగు యాగశాలలయందలి సోమమును నశింపఁజేయునో ఆరావణుని శూర్పణఖ జూచెను. ౧౯

యాగములంతయు ముగిసి దక్షిణ నిచ్చుకాలంబున వానిం జెఱచువాఁడును క్రూరుఁడును బ్రహ్మహత్యలు గావించినవాఁడును దుర్మార్గుఁడును నిర్దాక్షిణ్యుఁడును దయలేనివాఁడును బ్రజలకుఁ గీడుసేయువాఁడునగు రావణుని శూర్పణఖ చూచెను. ౨౦

సమస్తభూతంబుల నేడ్పించువాఁడును సమస్తలోకంబులకును భయంబు గలిగించువాఁడును శూరుఁడును మహాబలశాలియునగు తనసోదరుఁడైన రావణుని శూర్పణఖ చూచెను. ౨౧

దివ్యవస్త్రాభరణంబులు దాల్చినవాఁడును దివ్యపుష్పమాలికలతో నొప్పు

ఆసనే సూపవిష్టం చ కాలకాల మివోద్యతమ్,
రాక్షసేన్ద్రం మహాభాగం పౌలస్త్యకులనన్దనమ్. 23
రావణం శత్రుహన్తారం మన్త్రిభిః పరివారితమ్,
అభిగమ్యాబ్రవీ ద్వాక్యం రాక్షసీ భయవిహ్వలా. 24

త మబ్రవీ ద్దీప్తవిశాలలోచనం
ప్రదర్శయిత్వా భయమోహమూర్ఛితా,
సుదారుణం వాక్య మభీతచారిణీ
మహాత్మనా శూర్పణఖా విరూపితా. 25

ఇతి శ్రీమదరణ్యకాణ్డే ద్వాత్రింశస్సర్గః. 32.

---

## త్రయస్త్రింశస్సర్గః.

తత శ్శూర్పణఖా దీనా రావణం లోకరావణమ్,
అమాత్యమధ్యే సంక్రుద్ధా పరుషం వాక్య మబ్రవీత్. 1

ప్రమత్తః కామభోగేషు స్వైరవృత్తో నిరఙ్కుశః,
సముత్పన్నం భయం ఘోరం బోద్ధవ్యం నావబుధ్యసే. 2

సక్తం గ్రామ్యేషు భోగేషు కామవృత్తం మహీపతిమ్,
లుబ్ధం న బహుమన్యన్తే శ్మశానాగ్ని మివ ప్రజాః.

స్వయం కార్యాణి యః కాలే నానుతిష్ఠతి పార్థివః,
స తు వై సహ రాజ్యేన తైశ్చ కార్యై ర్వినశ్యతి. 4

చున్నవాఁడును సింహాసనంబునం జక్కఁగాఁ గూర్చుండియున్నవాఁడును లోకసంహారోద్యుక్తుఁడగు మృత్యుమృత్యువుంబోలె భయంకరాకారుఁడై యున్నవాఁడును మహాభాగుఁడును పౌలస్త్యవంశమునకు సంతోషముగలిగించువాఁడును శత్రువుల వధించువాఁడును మంత్రులచేఁ బరివేష్టింపఁబడియున్నవాఁడు నగు రాక్షసరాజుఁడయిన రావణునియొద్దకుఁ బోయి శూర్పణఖ భయవిహ్వలయయి యిట్లని చెప్పెను. ౨౨-౨౩-౨౪

మహాత్ముఁడగు లక్ష్మణునిచే విరూపితయయిన నిర్భయముగా సర్వలోకములఁ దిరుగుచుండునట్టి శూర్పణఖ విశాలంబులయి వెలుఁగుచుండునట్టి కన్నులుగల యా రావణుం జూచి మహాభయంకరంబుగా నీమాటం జెప్పెను.

ఇది ముప్పదిరెండవసర్గము.

---

## ముప్పదిమూఁడవసర్గము.

అంత విరూపితయగుటం జేసి దుఃఖితయగు శూర్పణఖ మంత్రిమధ్యంబున లోకంబుల నేడ్పించునట్టి రావణుం జూచి పరమకుపితయయి పరుషవాక్యంబున నిట్లని చెప్పెను. ౧

నీవు మదించి యెదురులేక యథేచ్ఛంబుగా మన్మథభోగంబులం బడియున్నావు. ఇప్పుడు మహాభయంబు నీకువచ్చినది. ముఖ్యంబుగా నీచేత నే చారులవలనఁ దెలిసికొనవలసినదయ్యు మదోన్మత్తుఁడవగుటచేఁ దెలిసికొనకున్నావు. ౨

ప్రజలు ఎల్లప్పుడును గ్రామ్యభోగంబులందె తగిలియుండువాఁడును స్వేచ్ఛగా నాచరించువాఁడును లుబ్ధుఁడు నగు రాజును శ్మశానాగ్నివలెఁ జూతురు, ఎంతమాత్రము గౌరవింపరు. ౩

ఏరాజు యుక్తకాలంబునఁ దనకార్యంబులఁ దానే చేసికొనఁడో అతనికార్యంబులు చెడుటయేగాక అతఁడు రాజ్యంబుఁ బోఁగొట్టుకొని తానును నశించును. ౪

అయుక్తచారం దుర్దర్శ మస్వాధీనం నరాధిపమ్,
వర్జయన్తి నరా దూరా న్నదీపఙ్క మివ ద్విపాః. ౫

యే న రక్షన్తి విషయ మస్వాధీనా నరాధిపాః,
తే న వృద్ధ్యా ప్రకాశన్తే గిరయ స్సాగరే యథా. ౬
ఆత్మవద్భి ర్విగృహ్య త్వం దేవగన్ధర్వదానవైః,
అయుక్తచార శ్చపలః కథం రాజా భవిష్యసి. ౭

త్వం తు బాలస్వభావ శ్చ బుద్ధిహీన శ్చ రాక్షస!,
జ్ఞాతవ్యం తు న జానీషే కథం రాజా భవిష్యసి. ౮

యేషాం చార శ్చ కోశ శ్చ నయ శ్చ జయతాం వర!,
అస్వాధీనా నరేన్ద్రాణాం ప్రాకృతై స్తే జనై స్సమాః. ౯

యస్మా త్పశ్యన్తి దూరస్థాన్ సర్వా నర్థా న్నరాధిపాః,
చారేణ తస్మా దుచ్యన్తే రాజానో దీర్ఘచక్షుషః. ౧౦
అయుక్తచారం మన్యే త్వాం ప్రాకృతై స్సచివై ర్వృతమ్,
స్వజన స్తు జనస్థానం హతం యో నావబుధ్యసే. ౧౧

చతుర్దశ సహస్రాణి రక్షసాం క్రూరకర్మణామ్,
హతా న్యేకేన రామేణ ఖర శ్చ సహదూషణః. ౧౨
ఋషీణా మభయం దత్తం కృతక్షేమా శ్చ దణ్డకాః,
ధర్షితం చ జనస్థానం రామే ణాక్లిష్టకర్మణా. ౧౩

ఏనుఁగులు ఏటిబురదనులోనికిఁబోయిన నందుఁదగులుకొందునని దాని దూరంబుననదలునట్లు జనులు చారులులేనివాఁడును అర్థ్యైకాలంబుల దర్శనం బొసఁగనివాఁడును స్త్రీపరతంత్రుఁడునగు రాజును ఆతనితోఁ జేరినఁ దామును జెడుదురని దూరంబునఁ బరిత్యజింతురు. ౫

సముద్రంబునందు మునిఁగిన పర్వతములు ప్రకాశింపనట్లు స్త్రీపరతంత్రులయి దేశమును జక్కఁగా రక్షింపని రాజులు వృద్ధినొంది ప్రకాశింపరు.

నీవుబలవంతులగు దేవగంధర్వదానవులతో విరోధముచేసికొని యిట్లు చారుల నేర్పఱచుకొనక విషయలోలుఁడవైయున్నయెడ నెట్లు దొరతనము దక్కించుకొనఁగలవు? ౬

రావణుఁడా! నీవు బాలునివంటివాఁడవు బుద్ధిహీనుఁడవు. దేని ముఖ్యముగాఁ దెలిసికొనవలెనో దానింగూడఁ దెలిసికొనకున్నావు. నీ వెట్లుదొరతనము సేయఁగలవు? ౭

జయించువారలలో శ్రేష్ఠుఁడవగు రావణుఁడా! ఏరాజులు చారులను బొక్కసమును నీతిని నేర్పఱచుకొనకుందురో వారలు సాధారణమూఢజనులవంటివారలే. ౮

రాజులు చారులవలన బహుదూరంబున జరగినసమాచారంబుల నన్నింటినిం దెలిసికొందురు. కావున వారలకు దీర్ఘనేత్రులను పేరువచ్చినది. ౧౦

నీవు జనస్థానంబున బంధుజనులందఱు హతులయిన సంగతినింగూడ దెలిసికొనకున్నావు. కావున నీవు చారుల నేర్పఱచుకొనలేదనియు నీమంత్రులందఱు మూఢులనియుం దలంచెదను. ౧౧

రాముఁడొక్కఁడు భయంకరపరాక్రములగు పదునాల్గువేలరాక్షసులను ఖరుని దూషణునింగూడ వధించెను. ౧౨

అక్లిష్టకర్ముఁడగురాముఁడు ఋషులకభయం బొసంగి జనస్థానంబునం దలి రాక్షసుల నందఱ వధించి దండకారణ్యంబున నేవిధమయినబాధయు లేకుండునట్లు గావించెను. ౧౩

త్వ స్తు లుబ్ధః ప్రమత్తశ్చ పరాధీనశ్చ రావణ!,
విషయే స్వే సముత్పన్నం భయం యో నావబుధ్యసే. ౧౪

తీక్ష్ణ మల్పప్రదాతారం ప్రమత్తం గర్వితం శఠమ్,
వ్యసనే సర్వభూతాని నాభిధావన్తి పార్థివమ్. ౧౫

అతిమానిన మగ్రాహ్య మాత్మసమ్భావితం నరమ్,
క్రోధనం వ్యసనే హన్తి స్వజనోఽపి మహీపతిమ్. ౧౬

నానుతిష్ఠతి కార్యాణి భయేషు న బిభేతి చ,
క్షిప్రం రాజ్యాచ్చ్యుతో దీన స్తృణై స్తుల్యో భవిష్యతి.

శుష్కైః కాష్ఠై ర్భవే త్కార్యం లోష్టై రపి చ పాంసుభిః,
న తు స్థానా త్పరిభ్రష్టైః కార్యం స్యా ద్వసుధాధిపైః. ౧౮

ఉపభుక్తం యథా వాసః స్రజో వా మృదితా యథా,
ఏవం రాజ్యా త్పరిభ్రష్ట స్సమర్థోఽపి నిరర్థకః ౧౯

అప్రమత్తశ్చ యో రాజా సర్వజ్ఞో విజితేన్ద్రియః,
కృతజ్ఞో ధర్మశీలశ్చ స రాజా తిష్ఠతే చిరమ్. ౨౦

నయనాభ్యాం ప్రసుప్తోఽపి జాగర్తి నయచక్షుషా,
వ్యక్తక్రోధప్రసాదశ్చ స రాజా పూజ్యతే జనైః. ౨౧

రావణుఁడా! నీవు నీదేశంబునందు మహాభయంబు గలిగియుండుటను దెలిసికొనఁజాలకున్నావే; కావున నీవు కృపణుఁడవు. జాగ్రత్తలేనివాఁడవు. స్త్రీలోలుఁడవు. ౧౪

క్రూరుఁడును ఎంతకార్యముచేసినను గొంచెముగానిచ్చువాఁడును ప్రమత్తుఁడును గర్వితుఁడును బైకి మంచివాఁడుగానుండి రహస్యముగానప్రియముగావించువాఁడు నగురాజునకు ఆపదవచ్చినప్పుడు జను లెవ్వరును అతని రక్షింపరారు. ౧౫

మిక్కిలియు నహంకారముగలవాఁడునుసత్పురుషులకగ్రాహ్యుఁడును దన్నుఁదానె పొగడుకొనువాఁడును అకాలంబునందు మిక్కిలియుఁ గోపపడువాఁడు నగురాజునకు ఆపదవచ్చినప్పుడు స్వజనులును అతని వధింతురు.

ఏరాజు కార్యంబుల నర్థ్యకాలంబులందు సరిగాఁజేయక భయములు వచ్చునప్పుడు జాగ్రత్త నొందకుండునో; అతఁడు శీఘ్రంబున రాజ్యభ్రష్టుఁడై గర్వంబుడిగి తృణంబువంటివాఁ డగును. ౧౬

ఎందుకొయ్యలచేతను మట్టిగడ్డలచేతను దుమ్ముచేతను గార్యముండును గాని రాజ్యభ్రష్టులగురాజులచే నెంతమాత్రము ప్రయోజనములేదు. ౧౭

కట్టుకొని విడువఁబడినవస్త్రము ఎట్లు ఇతరుల కుపయోగింపదో ధరించివిడిచినపుష్పమాలికలు ఎట్లు ఇతరుల కుపయోగింపవో అట్లు రాజ్యభ్రష్టుఁడగురాజు ఎంతగట్టివాఁడైనను ఎంతమాత్రముఁ బ్రయోజనకారికాఁడు. ౧౮

ఏరాజు ఏమఱుపాటులేక సర్వజ్ఞుఁడును జితేంద్రియుఁడును గృతజ్ఞుఁడును ధార్మికుఁడునై యుండునో అతఁడు బహుకాలము సుఖముగా రాజ్యముఁ బాలించుచుండును. ౨౦

ఎవ్వఁడు చర్మనేత్రములచే నిదురవోవుచుండినను నీతివిషయమయి యెంతమాత్రము నేమఱకుండునో మఱియు నెవ్వని నిగ్రహానుగ్రహములు వ్యర్థములుగాకుండునో ఆరాజును జనులు పూజింతురు. ౨౧

త్వ న్తు రావణ! దుష్బుద్ధి గ్గుణై ర్జీతై ర్వివర్జితః,
యస్య తేఽవిదిత శ్చారై రక్షసాం సుమహా న్వధః. ౨౨

పరావమన్తా విషయేషు సఙ్గతో
న దేశకాలప్రవిభాగతత్త్వవిత్,
అయుక్తబుద్ధి ర్గుణదోషనిశ్చయే
విపన్నరాజ్యో నచిరా ద్విపత్స్యసే. ౨౩
ఇతి స్వదోషా న్పరికీర్తితాం స్తయా
సమీక్ష్య బుద్ధ్యా క్షణదాచరేశ్వరః,
ధనేన దర్పేణ బలేన చాన్వితో
విచిన్తయామాస చిరం స రావణః. ౨౪
ఇతి శ్రీమదరణ్యకాణ్డే త్రయస్త్రింశ స్సర్గః. 33.

---

## చతుస్త్రింశ స్సర్గః.

తత శ్శూర్పణఖాం క్రుద్ధాం బ్రువన్తీం పరుషం వచః,
అమాత్యమధ్యే సంక్రుద్ధః పరిపప్రచ్ఛ రావణః. ౧

కశ్చ రామః కథంవీర్యః కింరూపః కింపరాక్రమః,
కిమర్థం దణ్డకారణ్యం ప్రవిష్ట స్సుదురాసదమ్. ౨

ఆయుధం కిఞ్చ రామస్య నిహతా యేన రాక్షసాః,
ఖర శ్చ నిహత స్సంఖ్యే దూషణ స్త్రిశిరా స్తథా. ౩

ఇత్యుక్తా రాక్షసేన్ద్రేణ రాక్షసీ క్రోధమూర్ఛితా,
తతో రామం యథాతత్త్వ మాఖ్యాతు ముపచక్రమే. ౪

రావణుఁడా ! నీవు జనస్థానంబున రాక్షసులందఱును వధింపఁబడిన సంగతిని జారులచే నిదివఱకుఁ దెలిసికొనకున్నావు. కావున దుర్బుద్ధివగు నీయందిప్పుడు చెప్పిన రాజార్హగుణంబు లెంతమాత్రము లేవు. ౨౨

నీవు పగుల నవమానించువాఁడవు. విషయోపభోగంబులఁ దగిలినవాఁడవు. ఏదేశంబున నేకాలంబున నేదిచేయవలసినదో దానిం దెలియనివాఁడవు. గుణదోషంబుల నిశ్చయింపఁజాలనివాఁడవు. కావున నీవు శీఘ్రంబున భ్రష్టరాజ్యుండవై నశియింపంగలవు. అని శూర్పణఖ రావణునితోఁ జెప్పెను. ౨౩

ధనంబును గర్వంబును బలంబునుంగలరాక్షసేశ్వరుఁడగు రావణుఁడు ఇట్లు శూర్పణఖ చెప్పిన తనదోషంబు లన్నియు స్వబుద్ధిచేఁ జూచుకొని బహుకాల మాలోచించెను. ౨౪

ఇది ముప్పదిమూఁడవసర్గము.

---

## ముప్పదినాల్గవసర్గము.

అంత రావణుఁడు ఖరాదివధంబు వినుటచేఁ గ్రుద్ధుఁడై కుపితయయి పరుషంబుగా మాటలాడుచున్న శూర్పణఖం జూచి మంత్రిమధ్యంబున, నిట్లని యడిగెను. ౧

రాముఁ డెవ్వఁడు? అతనివీర్య మెట్టిది? అతనిపరాక్రమ మెట్టిది? అతఁడేరూపముగలవాఁడు? అతఁడు ఎట్టివారికిని జొరరాని దండకారణ్యంబున కేల వచ్చినాఁడు? ౨

దేనిచేత రాముఁడు యుద్ధంబున ఖరుఁడు దూషణుఁడు త్రిశిరుఁడు మొదలుగాఁ బదునాలుగువేలరాక్షసులం జంపెనో ఆయాయుధం బెద్ది? అని రావణుఁడు శూర్పణఖ నడిగెను. ౩

పరమకుపితయయిన శూర్పణఖ రాక్షసేశ్వరుఁడగు రావణుఁడు చెప్పినమాటనువిని యంత రాముని స్వరూపంబును యథార్థంబుగాఁ జెప్ప నారంభించెను. ౪

దీర్ఘబాహు ర్విశాలాక్ష శ్చీరకృష్ణాజినామ్బరః,
కన్దర్పసమరూప శ్చ రామో దశరథాత్మజః. ౫

శక్రచాపనిభం చాపం వికృష్య కనకాఙ్గదమ్,
దీప్తాన్ క్షిపతి నారాచాన్ సర్పా నివ మహావిషాన్. ౬

నాదదానం శరా న్ఘోరా న్న ముఞ్చన్తం శిలీముఖాన్,
న కార్ముకం వికర్షన్తం రామం పశ్యామి సంయుగే. ౭

హన్యమాన న్తు తత్సైన్యం పశ్యామి శరవృష్టిభిః,
ఇన్ద్రేణేవోత్తమం సస్య మాహత న్త్వశ్మవృష్టిభిః. ౮

రక్షసాం భీమరూపాణాం సహస్రాణి చతుర్దశ,
నిహతాని శరై స్తీక్ష్ణై స్తే నై కేన పదాతినా. ౯

అర్ధాధికముహూర్తేన ఖర శ్చ సహదూషణః,
ఋషీణా మభయం దత్తం కృతక్షేమా శ్చ దణ్డకాః. ౧౦

ఏకా కథంచి న్ముక్తాఽహం పరిభూయ మహాత్మనా,
స్త్రీవధం శఙ్కమానేన రామేణ విదితాత్మనా. ౧౧

భ్రాతా చాస్య మహాతేజా గుణత స్తుల్యవిక్రమః,
అనురక్త శ్చ భక్త శ్చ లక్ష్మణో నామ వీర్యవాన్. ౧౨

అమర్షీ దుర్జయో జేతా విక్రాన్తో బుద్ధిమా న్బలీ,
రామస్య దక్షిణో బాహు ర్నిత్యం ప్రాణో బహిశ్చరః. ౧౩

దశరథపుత్త్రుఁడగు రాముఁడు ఆజానుబాహుఁడు; విశాలములయిన కన్నులుగలవాఁడు; నారచీరలును కృష్ణాజినంబును గట్టుకొనియున్నవాఁడు; మన్మథుంబోలు రూపముగలవాఁడు. ౫

ఆరాముఁడు బంగారుపట్టబంధముగల యింద్రధనుస్సువంటి ధనుస్సు నాకర్షించి మహావిషంబులగు సర్పంబులవంటి తీక్ష్ణబాణంబుల విడుచును.

నేను యుద్ధంబున రాముఁడు భయంకరంబులగు బాణంబుల గ్రహించుటనుగాని బాణంబుల విడుచుటనుగాని ధనుస్సు నాకర్షించుటనుగాని చూచినది లేదు. ౬

ఇంద్రుఁడు గురిపించు రాళ్లవానలచే మంచిపయిరు చెడునట్లు బాణవర్షంబుచే నాసైన్యమంతయు వధింపఁబడుచుండుటను మాత్రము చూచుచుంటిని. ౭

పదాతియగు నారాముఁ డొక్కఁడు ఒకటియు నరముహూర్తంబునఁ దీక్ష్ణబాణంబులచే భయంకరాకారులగు పదునాలుగు వేలమందిరాక్షసులను దూషణుని ఖరునిం గూడ వధించిపుచ్చెను. ౯

అట్లురాముఁడు ఋషులకభయంబొసంగి దండకారణ్యంబున నేమియు బాధ లేనట్లు గావించెను. ౧౦

మహాత్ముఁడును ఆత్మజ్ఞానముగలవాఁడు నగురాముఁడు స్త్రీవధము కారాదని యతిప్రయాసంబున నన్నొకతెను మాత్రము నానావిధంబుల నవమానించి విడిచెను. ౧౧

ఈరామునకు మహాతేజుఁడును గుణవంతుఁడును మహాపరాక్రమశాలియు అన్నపై ననురాగంబును భక్తియుఁగలవాఁడునగు లక్ష్మణుఁ డనుతమ్ముఁ డొక్కఁడున్నాఁడు. ౧౨

ఆలక్ష్మణుఁడు మిక్కిలియుఁ గోపముగలవాఁడు; శత్రువులకు దుర్జయుఁడు. ఎట్టిశత్రువునైనను జయించువాఁడు; మహాపరాక్రమశాలి; బుద్ధిమంతుఁడు, బలవంతుఁడు; రామునకుఁ గుడిభుజమువంటివాఁడు. ౧౩

రామస్య తు విశాలాక్షీ పూర్ణేన్దుసదృశాననా,
ధర్మపత్నీ ప్రియా భర్తు ర్నిత్యం ప్రియహితే రతా. ౧౪

సా సుకేశీ సునాసోరు స్సురూపా చ యశస్వినీ,
దేవతేవ వన స్యాస్య రాజతే శ్రీ రి వాపరా. ౧౫

తప్తకాఞ్చనవర్ణాభా రక్తతుఙ్గనఖీ శుభా,
సీతా నామ వరారోహా వైదేహీ తనుమధ్యమా. ౧౬

నైవ దేవీ న గన్ధర్వీ న యక్షీ న చ కిన్నరీ,
నైవంరూపా మయా నారీ దృష్టపూర్వా మహీతలే. ౧౭

యస్య సీతా భవే ద్భార్యా యం చ హృష్టా పరిష్వజేత్,
అతిజీవే త్స సర్వేషు లోకే ష్వపి పురన్దరాత్. ౧౮

సా సుశీలా వపుఃశ్లాఘ్యా రూపే ణాప్రతిమా భువి,
తవానురూపా భార్యా సా త్వం చ తస్యా స్తథా పతిః. ౧౯

తాం తు విస్తీర్ణజఘనాం పీనశ్రోణీపయోధరామ్,
భార్యార్థే చ తవానేతు ముద్యతాఽహం వరాననామ్. ౨౦

విరూపితాఽస్మి క్రూరేణ లక్ష్మణేన మహాభుజ!,

తా స్తు దృష్ట్వాఽద్య వైదేహీం పూర్ణచన్ద్రనిభాననామ్. ౨౧
మన్మథస్య శరాణాం వై త్వం విధేయో భవిష్యసి,

రాముని భార్యయు విశాలములయినకన్నులుగలది; నిండుచందురునిం బోలు ముఖంబుగలది; పెనిమిటికిఁ బ్రియంబును హితంబు నగుకార్యమును జేయుచుండును. ౧౪

ఆరాముని భార్య సుందరము లయిన వెండ్రుకలతో సుందరములయిన ముక్కుం దొడలతో నొప్పు చు రమణీయాకారయయి యాదండకారణ్యదేవత యో రెండవ లక్ష్మీదేవియో యనందగి ప్రకాశించుచున్నది. ౧౫

ఆబిడ మంచిబంగారుచాయగలమేనితో నొప్పుచుండును; ఎఱ్ఱనియు న్నతములయిన నఖములును సుందరములయిన పిఱుఁదులును సన్ననినడుమును గలది. మంగళలక్షణంబులుగలది; ఆబిడపేరు సీత. విదేహదేశపు రాజకూఁతురు. ౧౬

నేను దేవతలలోఁగాని యక్షులలోఁగాని కిన్నరులలోఁగాని యీసీత వంటిరూపముగల యాఁడుదాని నిదివఱకుఁజూడలేదు. ఇంక భూలోకంబున లేదని చెప్పనేల? ౧౭

సీతాదేవి యెవ్వనికి భార్యయో ఎవ్వని సంతోషంబునం గవుఁగిలించుకొనునో ఆమహాపురుషుఁడు సమస్తలోకంబులందును దేవేంద్రునికన్నను అధికుఁడు. ౧౮

సదాచారసంపన్నయు సుందరాంగియు సౌందర్యంబున భూలోకంబున నెచ్చటను సాటిలేనిదియు నగు నా సీత నీకుఁ దగిన భార్య. అట్లు నీ వాబిడకుఁ దగినపెనిమిటివి. ౧౯

విశాలమయినజఘనమును బలిసినపిఱుందులును స్తనములును సుందరమయిన ముఖమును గలయాసీతను నీకు భార్యగా నుండునని నే నిచ్చటికిఁ బ్రయత్నించితిని. ౨౦

మహాబాహుఁడవగు రావణుఁడా! నే నట్లు సీత నపహరింపఁ బ్రయత్నించుటను జూచి క్రూరుఁడు లక్ష్మణుఁడు నన్నిట్లు విరూపఁగావించెను.

నీవు నిండుచందురుంబోలు మొగముగల యాసీతను జూచితివేని తక్షణంబున మన్మథబాణబాధం బొక్కుదువు. ౨౧

యది తస్యా మభిప్రాయో భార్యార్థే తవ జాయతే. ౨౨
శీఘ్ర ముద్ధ్రియతాం పాదో జయార్థ మిహ దక్షిణః,
కురు ప్రియం తథా తేషాం రక్షసాం రాక్షసేశ్వర!. ౨౩
వధా త్తస్య నృశంసస్య రామస్యాఽఽశ్రమవాసినః,

తం శరై ర్నిశితై ర్హత్వా లక్ష్మణం చ మహారథమ్. ౨౪
హతనాథాం సుఖం సీతాం యథావ దుపభోక్ష్యసి,

రోచతే యది తే వాక్యం మమైత ద్రాక్షసేశ్వర!. ౨౫
క్రియతాం నిర్విశఙ్కేన వచనం మమ రాఘవ!,
విజ్ఞాయే హాత్మశక్తిం చ హ్రియతా మబలా బలాత్. ౨౬
సీతాసర్వానవద్యాఙ్గీ భార్యార్థే రాక్షసేశ్వర!.

నిశమ్య రామేణ శరై రజిహ్మగై
ర్హతా జ్జనస్థానగతా న్నిశాచరాన్,
ఖరఞ్చ బుద్ధ్వా నిహతం చ దూషణం
త్వ మద్య కృత్యం ప్రతిపత్తు మర్హసి. ౨౭
ఇతి శ్రీమదరణ్యకాణ్డే చతుస్త్రింశ స్సర్గః. ౩౪.

---

షట్త్రింశ స్సర్గః.
తత శ్శూర్పణఖా వాక్యం త చ్ఛ్రుత్వా రోమహర్షణమ్,
సచివా నభ్యనుజ్ఞాయ కార్యం బుద్ధ్వా జగామ సః. ౧

తత్కార్య మనుగమ్యాథ యథావ దుపలభ్య చ,
దోషాణాం చ గుణానాం చ సంప్రధార్య బలాబలమ్. ౨

నీవు ఆసీత భార్యకావలె ననుకోర్కెఁ గలదేని యిప్పుడె శీఘ్రముగా రామలక్ష్మణులను జయింపఁ గుడియడుగు ముందు పెట్టుము. ౨౨

రాక్షసరాజుఁడవగు రావణుఁడా! నీవట్లు క్రూరుఁడును ఆశ్రమవాసియు నైన రాముని వధించి యతనిచే వధింపఁబడిన రాక్షసుల కందఱకును సంతోషము గావింపుము. ౨౩

ఆరాముని మహారథుఁడగు లక్ష్మణునిఁ గఱకుబాణంబుల వధింతువేని యుట్లనాథయయిన సీతను సుఖంబుగా భార్యగాఁ గావించుకొని నానావిధభోగముల ననుభవింపఁగలవు. ౨౪

రాక్షసరాజుఁడవగు రావణుఁడా! నే నిప్పుడు చెప్పినమాట నీకు సమ్మతమగునేని నేను జెప్పినట్లు నిశ్చయముగాఁ గావింపుము. ౨౫

రాక్షసనాథుఁడవగు రావణుఁడా! నీకుం గలబలాతిశయమును దెలిసికొని సర్వాంగసుందరియగు సీతను బలాత్కారంబునం గొనితెచ్చి భార్యగావించుకొనుము. ౨౬

రాముఁడు జనస్థానంబునందలి రాక్షసులనందఱను ఖరదూషణులను దీక్ష్ణబాణంబుల వధించినసంగతిని వినియున్నావుగదా? ఇంకఁ గర్తవ్యమును గుఱించి నీవె నిశ్చయింపుము, అని శూర్పణఖ రావణునకుఁ జెప్పెను. ౨౭

ఇది ముప్పదినాల్గవసర్గము.

---

## ముప్పదియైదవసర్గము.

అంత నారావణుఁడు భయంకరంబగు శూర్పణఖ చెప్పినమాటను విని మంత్రులవలన రాచకార్యంబులు తెలిసికొని వారలను సెలవొసంగి యంతఃపురంబునకుఁ బోయెను. ౧

అంత నారావణుఁడు ఏకాంతంబున సీత నపహరించుటను గుఱించి చక్కఁగా నాలోచించి పరాక్రమంబునం గొనివచ్చుటయందును దొంగతన

ఇతికర్తవ్య మిత్యేవ కృత్వా నిశ్చయ మాత్మనః,
స్థిరబుద్ధి స్తతో రమ్యాం యానశాలాం జగామ హ. ౩

యానశాలాం తతో గత్వా ప్రచ్ఛన్నో రాక్షసాధిపః,
సూతం సంచోదయామాస రథ స్సంయోజ్యతా మితి. ౪

ఏవ ముక్తః క్షణేనైవ సారథి ర్లఘువిక్రమః,
రథం సంయోజయామాస త స్యాభిమత ముత్తమమ్. ౫

కాఞ్చనం రథ మాస్థాయ కామగం రత్నభూషితమ్,
పిశాచవదనై ర్యుక్తం ఖరైః కాఞ్చనభూషణైః. ౬
మేఘప్రతిమనాదేన స తేన ధనదానుజః,
రాక్షసాధిపతి శ్శ్రీమా న్యయౌ నదనదీపతిమ్. ౭
స శ్వేతవాలవ్యజనః శ్వేతచ్ఛత్రో దశాననః,
స్నిగ్ధవైడూర్యసంకాశ స్తప్తకాఞ్చనకుణ్డలః. ౮
వింశద్భుజో దశగ్రీవో దర్శనీయపరిచ్ఛదః,
త్రిదశారి ర్మునీన్ద్రఘ్నో దశశీర్ష ఇవాద్రిరాట్. ౯
కామగం రథ మాస్థాయ శుశుభే రాక్షసేశ్వరః,
విద్యున్మణ్డలవా న్మేఘ స్సబలాక ఇ వామ్బరే. ౧౦
సశైలం సాగరానూపం వీర్యవా నవలోకయన్,
నానాపుష్పఫలై ర్వృక్షై రనుకీర్ణం సహస్రశః. ౧౧

ముగా నపహరించుటయందును గుణదోషంబుల బలాబలములు విమర్శించి జనస్థానమున నున్న ఖరదూషణులు మున్నుగాఁ బదునాలుగు వేలరాక్షసుల మాఁడుగడియలలో వధించిపుచ్చిన మహాపరాక్రమశాలియగురాము నెదుటఁ పరాక్రమంబున సీత నపహరించుట యెంతమాత్రము సాధ్యముకాదని యెఱింగి చౌర్యంబుననే యపహరింపవలయునని దృఢంబుగా నిశ్చయించి రమణీయంబగు గుఱ్ఱములకొట్టమునకుఁ బోయెను. ౧-౩

రాక్షసేశ్వరుఁడగు రావణుఁడు మందోదరి మంత్రులు మున్నగువార లెఱింగిన నివారింతు రని యెవ్వరికిని దెలియనట్లు యానశాలకుఁ బోయి సారథిం గని రథం బాయత్తంబు గావింపుమని యాజ్ఞాపించెను. ౪

శీఘ్రమయిన నడకగల యాసారథి రావణుని యాజ్ఞను విని తత్క్షణమాత్రంబున రావణున కభిమతం బగు రమణీయరథంబు నాయత్తంబు గావించెను. ౫

కుబేరునితమ్ముఁడగు రాక్షసాధీశ్వరుఁడు రావణుఁడు కామగమనంబును రత్నభూషితంబును బిశాచముఖంబులును గాంచనాలంకృతంబులు నగు ఖరంబులుపూన్చినదియగు కాంచనరథంబు నారోహించి సముద్రంబు చెంతకుం బోయెను. ౬,౭

ఇరువదిచేతులుగలవాఁడును బదితలలుగలవాఁడునగు నారాక్షసరాజుఁ డయిన రావణుఁడు పదిశిఖరంబులతోఁ గూడినపర్వతంబు కరణిఁ జూపట్టుచు వైడూర్యంబువంటి మేనిచాయగల్గి దెల్లనివింజామరలును శ్వేతచ్ఛత్రములును మంచిబంగారుపోఁగులును ధరించి కామగమనంబగు కాంచనరథంబు నారోహించియుండుటచే నాకాశంబున మెఱపులతోసుం గూడినమేఘంబు వలె నెంతయు శోభిల్లెను. ౮,౯,౧౦

మహాపరాక్రమశాలియగు రావణుఁడు పర్వతంబులతోను నానావిధంబులగు పుష్పఫలంబులతో నొప్పుచున్న వృక్షములతోనుంగూడిన సముద్రంబును జూచుచుఁ బోయెను. ౧౧

శీతమఙ్గళతోయాభిః పద్మినీభి స్సమన్తతః,
విశాలై రాశ్రమపదై ర్వేదిమద్భి స్సమావృతమ్. ౧౨

కదళ్యాఢకిసమ్బాధం నాళికేరోపశోభితమ్,
సాలై స్తాలై స్తమాలైశ్చ పుష్పితై స్తరుభి ర్వృతమ్. ౧౩

నాగై స్సుపర్ణై ర్గన్ధర్వైః కిన్నరైశ్చ సహస్రశః,
అజై ర్వైఖానసై ర్మాషై ర్వాలఖిల్యై ర్మరీచిపైః. ౧౪
అత్యన్తనియతాహారైః శోభితం పరమర్షిభిః,
జితకామైశ్చ సిద్ధైశ్చ చారణై రుపశోభితమ్. ౧౫

దివ్యాభరణమాల్యాభి ర్దివ్యరూపాభి రావృతమ్,
క్రీడారతివిధిజ్ఞాభి రప్సరోభి స్సహస్రశః. ౧౬

సేవితం దేవపత్నీభి శ్శ్రీమతీభి శ్శ్రియాఽఽవృతమ్,
దేవదానవసఙ్ఘైశ్చ చరితంత్వమృతాశిభిః. ౧౭

హంసక్రౌఞ్చప్లవాకీర్ణం సారసై స్సంప్రణాదితమ్,
వైడూర్యప్రస్తరం రమ్యం స్నిగ్ధం సాగరతేజసా. ౧౮

చల్లనిమంచినీళ్లుగల దామరకొలంకులతోను విశాలంబులును యాగవేదికాలంకృతంబులు నగు నాశ్రమంబులతోను ఒప్పుచున్నసముద్రతీరంబుఁ జూచుచు రావణుఁడు పోయెను. ౧౨

అరఁటిచెట్లతోను కందితీఁగెలతోను టెంకాయచెట్లతోను గూడినదియు మద్దిచెట్లు తాటిచెట్లు తమాలవృక్షంబులు మున్నగుచక్కఁగాఁ బూచినవృక్షములచే నిండియుండునదియునగు సముద్రతీరమును జూచుచు రావణుఁడు పోయెను. ౧౩

నాగములును గరుడులును గంధర్వులును గిన్నరులును అయోనిజులును జంద్రసూర్యకిరణంబులె యాహారంబుగా గొనువారలును నియతాహారులునగు వైఖానసులును వాలఖిల్యులును మున్నగువారలకు నివాసస్థానంబగు సముద్రతీరమును జూచుచు రావణుఁడు పోయెను. ౧౪

అవాప్తసమస్తకాములగు సత్పురులచేతను సిద్ధులచేతను జారణులచేతను ఎంతయు నొప్పుచుండునట్టి సముద్రతీరముం జూచుచు రావణుఁడు పోయెను. ౧౫

దివ్యంబులగు నాభరణములను బుష్పమాలికలను దాల్చియుండువారలును దివ్యసౌందర్యంబుగలవారలును నానావిధక్రీడలయందుఁ బాండిత్యంబుగలవారలు నగు నప్సరస్త్రీలతో నొప్పుచున్నసముద్రతీరముం జూచుచు రావణుఁడు పోయెను. ౧౬

కాంతిసంపన్నలగు దేవభార్యలచే సేవింపఁబడినదియుఁ గాంతిసంపన్నంబును అమృతంబు భుజించునట్టి దేవదానవులకు విహారస్థానంబునగు సముద్రతీరంబుఁ జూచుచు రావణుఁడు పోయెను. ౧౭

మధురముగాఁ గూయునట్టి హంసపక్షులు క్రౌంచపక్షులు నీరుకోళ్లు సారసపక్షులు మొదలగుపక్షులతో నొప్పుచున్నదియు రమణీయంబును సముద్రకాంతిచే మఱియు సుందరముగాఁ జూపట్టుచున్నదియు నగు సముద్రతీరముఁ జూచుచు రావణుఁడు పోయెను. ౧౮

పాణ్డురాణి విశాలాని దివ్యమాల్యయుతాని చ,
తూర్యగీతాభిజుష్టాని విమానాని సమన్తతః. ౧౯
తపసా జితలోకానాం కామగా న్యభిసంపతన్,
గన్ధర్వాప్సరస శ్చైవ దదర్శ ధనదానుజః. ౨౦

నిర్యాసరససమూలానాం చన్దనానాం సహస్రశః,
వనాని పశ్యం స్సౌమ్యాని ఘ్రాణతృప్తికరాణి చ. ౨౧

అగరూణాం చ ముఖ్యానాం వనా న్యుపవనాని చ,
తక్కోలానాం చ జాత్యానాం ఫలానాం చ సుగన్ధినామ్. ౨౨

పుష్పాణి చ తమాలస్య గుల్మాని మరిచస్య చ,
ముక్తానాం చ సమూహాని శుష్యమాణాని తీరతః. ౨౩

శఙ్ఖానాం ప్రస్తరం చైవ ప్రవాళనిచయం తథా,
కాఞ్చనాని చ శైలాని రాజతాని చ సర్వశః. ౨౪
ప్రస్రవాణి మనోజ్ఞాని ప్రసన్నాని హ్రదాని చ,

ధనధాన్యోపపన్నాని స్త్రీరత్నై శ్శోభితాని చ. ౨౫
హస్త్యశ్వరథగాఢాని నగరా ణ్యవలోకయన్,

తం సమం సర్వత స్స్నిగ్ధం మృదుసంస్పర్శమారుతమ్. ౨౬
అనూపం సిన్ధురాజస్య దదర్శ త్రిదివోపమమ్,

తత్రాపశ్య త్స మేఘాభం న్యగ్రోధ మృషిభి ర్వృతమ్. ౨౭

కుబేరునితమ్ముఁ డగురావణుఁడు అప్పుడు మార్గంబునఁ దెల్లనివియు విశాలంబులును దివ్యంబులగు పుష్పమాలికలతోఁ గూడినవియు నానావిధవాద్యధ్వనులతోను గీతధ్వనులతోను ఒప్పుచున్నవియుఁ గామగమనంబులునగు తపోబలంబున దివ్యలోకంబుల సాధించినట్టిసత్పురుషులవిమానంబులను గంధర్వులను అప్సరస్త్రీలనుఁ జూచెను. ౧౯

సుగంధంబు గుబాళించుచుండు నిర్యాసంబులతోఁ గూడినవియు సుందరములును ఘ్రాణేంద్రియాహ్లాదకంబులునగు చందనవనంబులం జూచుచు రావణుఁడు పోయెను. ౨౦

శ్రేష్ఠములయిన యగరువృక్షములయొక్కయుఁ దక్కోలవృక్షముల యొక్కయు మంచివాసనగల జాతివృక్షములయొక్కయు వనంబులను ఉద్యానవనంబులనుం జూచుచు రావణుఁడు పోయెను. ౨౧

తమాలవృక్షముల పుష్పములను మిఱియపుఁదీఁగెలను సముద్రతీరంబునంబడి యెండుచున్న ముత్తెములసమూహములను జూచుచు రావణుఁడు పోయెను. ౨౨

శంఖసమూహములను జిగురుటాకులసమూహములను బంగారుకొండలను వెండికొండలను వీనినన్నింటినిం జూచుచు రావణుఁడు పోయెను. ౨౩

మనోహరములగు సెలయేఱులను నిర్మలమయిన జలముగల మడుంగులనుం జూచుచు రావణుఁడు పోయెను.

ధనధాన్యసంపన్నములును ఉత్తమస్త్రీలతో నొప్పుచున్నవియు సేనుఁగులతోను గుఱ్ఱములతోను రథంబులతోను నిండినవియు నగు నగరంబులం జూచుచు రావణుఁడు పోయెను. ౨౪

మిట్టపల్లములులేనిదియు అంతటనురమణీయంబును జల్లగాలిగలదియు స్వర్గంబువలె నతిసుందరంబై యున్నదియు నగుసముద్రతీరమును రావణుఁడు చూచెను. ౨౫

అచ్చట నారావణుఁడు నాలుగుప్రక్కలను నూఱుయోజనములనిడుపు

సమన్తా ద్యస్య తా శ్శాఖా శ్శతయోజన మాయతాః,

యస్య హ స్తిన మాదాయ మహాకాయం చ కచ్ఛపమ్. ౨౭
భక్షార్థం గరుడ శ్శాఖా మాజగామ మహాబలః,
తస్య తాం సహసా శాఖాం భారేణ పతగోత్తమః. ౨౮
సుపర్ణః పర్ణబహులాం బభఞ్జ చ మహాబలః,
తత్ర వైఖానసా మాషా వాలఖిల్యా మరీచిపాః. ౩౦
అజా బభూవు ర్ధూమ్రా శ్చ సఙ్గతాః పరమర్షయః,

తేషాం దయార్థం గరుడ స్తాం శాఖాం శతయోజనామ్. ౩౧
జగా మాదాయ వేగేన తౌ చోభౌ గజకచ్ఛపౌ,
ఏకపాదేన ధర్మాత్మా భక్షయిత్వా తదామిషమ్. ౩౨
నిషాదవిషయం హత్వా శాఖయా పతగోత్తమః,
ప్రహర్ష మతులం లేభే మోక్షయిత్వా మహామునీన్. ౩౩
స తేనైవ ప్రహర్షేణ ద్విగుణీకృతవిక్రమః,
అమృతానయనార్థం వై చకార మతిమా న్మతిమ్. ౩౪
అయోజాలాని నిర్మథ్య భిత్త్వా రత్నమయం గృహమ్,
మహేన్ద్రభవనా ద్గుప్త మాజహా రామృతం తతః. ౩౫

తం మహర్షిగణై ర్జుష్టం సుపర్ణకృతలక్షణమ్,
నామ్నా సుభద్రం న్యగ్రోధం దదర్శ ధనదానుజః. ౩౬

తం తు గత్వా పరం పారం సముద్రస్య నదీపతేః,
దదర్శాశ్రమ మేకాన్తే రమ్యే పుణ్యే వనాన్తరే. ౩౭

గల కొమ్మలుగలదియు మేఘసమానంబును ఋషులకు నివాసభూతంబు నగు న్యగ్రోధవృక్షముం జూచెను. ౨౮

మున్ను మహాబలశాలియగు గరుత్మంతుఁడు ఏనుఁగును మహాకాయం బగు కచ్ఛపంబును దీసికొని వానిం దినుటకై యాచెట్టుకొమ్మపైకి వ్రాలెను.

మహాబలశాలియగు నాగరుత్మంతుని భారము తాళఁజాలక యాచెట్టుకొమ్మ పటాలున విఱిగినది. ౨౯

ఆకొమ్మక్రింద చంద్రసూర్యకిరణంబులు ద్రావువారలును ధూమపులును అయోనిజులునగు వైఖానసులును వాలఖిల్యులును మాషులు ననుమహర్షులు తపస్సుచేయుచుండిరి. ౩౦

గరుత్మంతుఁడు ఆఋషులపై దయచేత నూఱుయోజనంబుల నిడుపుగలయాశాఖను ఆగజకచ్ఛపంబులరెంటినిం దీసికొని వేగంబునం బోయెను.

ధర్మాత్ముఁడగు గరుత్మంతుఁడు ఒక్కకాలిచే నిలిచి యాగజకచ్ఛపంబులం దిని యంత నాశాఖచే నిషాదుల నందఱం జంపి వారలను భక్షించి యమ్మహామునులను విడిపించి పరమసంతోషము నొందెను. ౩౨-౩౩

బుద్ధిమంతుఁడగు నాగరుత్మంతుఁడు ఆసంతోషంబున రెట్టించినపరాక్రమముగలవాఁడై యమృతంబుదేరం దలంచెను. ౩౪

అంత నాగరుత్మంతుఁడు ఇనుపకిటికీలను బగులఁగొట్టి రత్నమయం బగు గృహమును భేదించి మహేంద్రునింట రక్షితంబైన యమృతంబుఁ దెచ్చెను. ౩౫

కుబేరునితమ్ముఁడగు రావణుఁడు మహర్షిసేవితంబును గరుత్మంతునిచేఁ గొమ్మవిఱిగిన గుఱుతుగలదియు సుభద్రమను పేరుగలదియు నగు నాన్యగ్రోధవృక్షమును జూచెను. ౩౬

అంత నారావణుఁడట్లు సముద్రముయొక్కయావలిగట్టుఁజేరి యచ్చట నేకాంతంబును రమణీయంబును బుణ్యంబు నగువనంబునడుమ నొకయాశ్రమంబుఁ గనెను. ౩౭

తత్ర కృష్ణాజినధరం జటావల్కలధారిణమ్,
దదర్శ నియతాహారం మారీచం నామ రాక్షసమ్. ౩౮
స రావణ స్సమాగమ్య విధివ త్తేన రక్షసా,
మారీచే నార్చితో రాజా సర్వకామై రమానుషైః. ౩౯

తం స్వయం పూజయిత్వా తు భోజనే నోదకేన చ,
అర్థోపహితయా వాచా మారీచో వాక్య మబ్రవీత్. ౪౦
కచ్చి త్తే కుశలం రాజ! లఙ్కాయాం రాక్షసేశ్వర!,
కేనార్థేన పున స్త్వం వై తూర్ణ మేవ మిహాగతః. ౪౧

ఏవ ముక్తో మహాతేజా మారీచేన స రావణః,
తతః పశ్చా దిదం వాక్య మబ్రవీ ద్వాక్యకోవిదః. ౪౨
ఇతి శ్రీమదరణ్యకాణ్డే పఞ్చత్రింశ స్సర్గః. ౩౫.

---

## షట్త్రింశ స్సర్గః.

మారీచ! శ్రూయతాం తాత! వచనం మమ భాషతః,
ఆర్తో౽స్మి మమ చార్తస్య భవాన్ హి పరమం గతిః. ౧
జానీషే త్వం జనస్థానే యథా భ్రాతా ఖరో మమ,
దూషణశ్చ మహాబాహు స్స్వసా శూర్పణఖా చ మే. ౨
త్రిశిరాశ్చ మహాతేజా రాక్షసః పిశితాశనః,
అన్యే చ బహవ శ్శూరా లబ్ధలక్షా నిశాచరాః. ౩
వసన్తి మన్నియోగేన నిత్యవాసం చ రాక్షసాః,
బాధమానా మహారణ్యే మునీ న్యే ధర్మచారిణః. ౪
చతుర్దశ సహస్రాణి రక్షసాం భీమకర్మణామ్,
శూరాణాం లబ్ధలక్షాణాం ఖరచిత్తానువర్తినామ్. ౫

రావణుఁ డయ్యాశ్రమంబునఁ గృష్ణాజినంబును జటావల్కలంబులును ధరించినవాఁడును నియతాహారుఁడునగు మారీచుఁడను రాక్షసుఁ జూచెను.

అంత మారీచుఁడు రాక్షసరాజుం డగురావణుఁడు వచ్చుటం జూచి యథాశాస్త్రంబుగా మనుష్యదుర్లభంబులగు నానావిధమహార్హపదార్థములచే నతనిం బూజించెను. ౩౯

మారీచుఁడు ఆరావణునకు అర్ఘ్యపాద్యంబులను ఆహారంబులను ఒసఁగి పూజించి యతనిం జూచి యర్థికార్థసహితంబగు మాటచే నిట్లని చెప్పెను.

రాక్షసరాజుఁడవగు రావణుఁడా! లంకయందంతయు క్షేమమేకదా! నీవే యింతశీఘ్రముగా మఱల నిచ్చటి కెందుకు వచ్చినావు? అని మారీచుఁడు రావణుఁ నడిగెను. ౪౧

మహాతేజుఁడును మాటలుచెప్పుటయందుఁ బండితుఁడు నగురావణుఁడు మారీచుఁడు చెప్పినమాటను విని యంత నీమాటం జెప్పెను. ౪౨

ఇది ముప్పదియొకటవసర్గము.

ముప్పదియాఱవసర్గము.

నాయనా! నేను జెప్పుమాట లన్నియు వినుము; నేను మిక్కిలియు దుఃఖితుండనైతిని. ఆర్తార్తుఁడనగు నాకుఁ బరమగతివి నీవేకదా!. ౧

నాతమ్ముఁడు ఖరుఁడును మహాబాహుఁడగు దూషణుఁడును నాచెల్లెలు శూర్పణఖయు మహాతేజుఁడగు త్రిశిరుఁడును మఱియు నితరులగు శూరులయిన రాక్షసులు పెక్కండ్రును నాయాజ్ఞచే దండకారణ్యంబున ధర్మచారులగు మునులను బాధించుచు జనస్థానంబున నున్నారనుసంగతి నీకుం దెలిసియున్నది. ౨-౩-౪

భయంకరకర్ములును శూరులును మహోత్సాహులు నగు రాక్షసులు పదునాలుగు వేలమంది ఖరునిక్రింద నున్నారు. ౫

తాం స్త్విదానీం జనస్థానే వసమానా మహాబలాః,
సఙ్గతాః పరమాయత్తా రామేణ సహ సంయుగే. ౬
నానాప్రహరణోపేతాః ఖరప్రముఖరాక్షసాః,
తేన సంజాతరోషేణ రామేణ రణమూర్ధని. ౭
అనుక్త్వా పరుషం కిఞ్చిచ్ఛరైర్వ్యాపారితం ధనుః,
చతుర్దశ సహస్రాణి రక్షసా ముగ్రతేజసామ్. ౮
నిహతాని శరై స్తీక్ష్ణై ర్మానుషేణ పదాతినా,
ఖరశ్చ నిహత స్సంఖ్యే దూషణ శ్చ నిపాతితః. ౯
హత శ్చ త్రిశిరా శ్చాపి నిర్భయా దణ్డకాః కృతాః,
పిత్రా నిరస్తః క్రుద్ధేన సభార్యః క్షీణజీవితః. ౧౦
స హన్తా తస్య సైన్యస్య రామః క్షత్రియపాంసనః,
దుశ్శీలః కర్కశ స్తీక్ష్ణో మూర్ఖో లుబ్ధోఽజితేన్ద్రియః. ౧౧
త్యక్తధర్మా త్వధర్మాత్మా భూతానా మహితే రతః,
యేన వైరం వినాఽరణ్యే సత్త్వ మాశ్రిత్య కేవలమ్. ౧౨
కర్ణనాసాపహరణా ద్భగినీ మే విరూపితా,
తస్య భార్యాం జనస్థానా త్సీతాం సురసుతోపమామ్. ౧౩
ఆనయిష్యామి విక్రమ్య సహాయ స్తత్ర మే భవ,
త్వయా హ్యహం సహాయేన పార్శ్వస్థేన మహాబల!. ౧౪
భ్రాతృభి శ్చ సురా న్యుద్ధే సమగ్రా న్నాభిచిన్తయే,

జనస్థానంబునందు నివసించుచున్న మహాబలశాలులగు నాఖరుఁడు మొదలగురాక్షసులు నానావిధాయుధంబులం జేకొని సన్నద్ధులయి రామునితో యుద్ధంబు గావించిరి. ౬

అంత నారాముఁడు పరమకుపితుఁడై యుద్ధంబునఁ గొంచెమేని పరుషవార్తయాడక ధనుస్సున బాణంబులుగూర్చి ధనుర్విద్యాపాండిత్యంబుఁ జూపెను. ౭

పదాతియును మనుష్యుఁడునగు రాముఁడొక్కఁడు భయంకరపరాక్రములగుపదునాలుగు వేలరాక్షసుల వధించెను. ౮

ఖరుఁడుం దూషణుఁడుం త్రిశిరుఁడు ఇమ్మహావీరులందఱు వధింపఁబడిరి; ఇప్పుడు దండకారణ్యమున ఋషులకు ఎంతమాత్రము భయము లేనట్లు చేయఁబడినది. ౯

కుపితుఁడగు తండ్రిచేఁ దఱుమఁబడినవాఁడును భార్యాసహితుఁడును ఆయుస్సుదీఱినవాఁడును క్షత్రియాధముఁడునగు నారాముఁడు అంతసైన్యమునంతయు వధించినాఁడు. ౧౦

ఆరాముఁడు దుష్టుఁడు. క్రూరుఁడు; కఠినహృదయుఁడు మూర్ఖుఁడు; లుబ్ధుఁడు. ఇంద్రియంబులకు లోఁబడియుండువాఁడు. ధర్మంబువిడిచి యధర్మం బాచరించువాఁడు; ప్రాణులకుఁ గీడు గావించువాఁడు. ౧౧

ఎవ్వఁడు ఎంతమాత్రము వైరములేకున్నను కేవల బలగర్వంబున వనంబునందు నాచెల్లెలి శూర్పణఖను ముక్కుం జెవులుఁ గోసి విరూపగావించెనో ఆరామునిభార్యను దేవకన్యాసమానురాలిని సీతం దేవలయు. నీ వావిషయమునందు సాహాయ్యంబు సేయుము. ౧౩

మహాబలుఁడవగు మారీచుఁడా! నీవును నాతమ్ములును నాకు సహాయులుగా నాప్రక్కనుండఁగా నేను యుద్ధంబున దేవతలందఱు నొకటిగావచ్చినను సరకుసేయకుందునుగదా!. ౧౪

తత్సహాయో భవ త్వం మే సమర్థో హ్యసి రాక్షస!. ౧౫

వీర్యే యుద్ధే చ దర్పే చ న హ్యస్తి సదృశ స్తవ,
ఉపాయజ్ఞో మహాన్ శూర స్సర్వమాయావిశారదః. ౧౬

ఏతదర్థ మహం ప్రాప్త స్త్వత్సమీపం నిశాచర!,
శృణు తత్కర్మ సాహాయ్యే యత్కార్యం వచనా న్మమ. ౧౭
సౌవర్ణ స్త్వం మృగో భూత్వా చిత్రో రజతబిన్దుభిః,
ఆశ్రమే తస్య రామస్య సీతాయాః ప్రముఖే చర. ౧౮
త్వాం తు నిస్సంశయం సీతా దృష్ట్వా తు మృగరూపిణమ్,
గృహ్యతా మితి భర్తారం లక్ష్మణం చాభిధాస్యతి. ౧౯
తత స్తయో రపాయే తు శూన్యే సీతాం యథాసుఖమ్,
నిరాబాధో హరిష్యామి రాహు శ్చన్ద్రప్రభా మివ. ౨౦

తతః పశ్చా త్సుఖం రామే భార్యాహరణకర్శితే,
విస్రబ్ధః ప్రహరిష్యామి కృతార్థే నాన్తరాత్మనా. ౨౧
తస్య రామకథాం శ్రుత్వా మారీచస్య మహాత్మనః,
శుష్కం సమభవ ద్వక్త్రం పరిత్రస్తో బభూవ హ. ౨౨
ఓష్ఠౌ పరిలిహ ఞ్ఛుష్కౌ నేత్రై రనిమిషై రివ,
మృతభూత ఇవార్త స్తు రావణం సముదైక్షత. ౨౩
స రావణం త్రస్తవిషణ్ణచేతా
మహావనే రామపరాక్రమజ్ఞః,
కృతాఞ్జలి స్తత్త్వ మువాచ వాక్యం
హితం చ తస్మై హిత మాత్మన శ్చ. ౨౪

ఇతి శ్రీమదరణ్యకాణ్డే షట్త్రింశ స్సర్గః. ౩౬.

మారీచుఁడా! అందువలన నీవు నాకు సహాయుఁడవగుము. నీవు మిక్కి-
లియు సమర్థుండవు. ౧౫

పరాక్రమంబునను దర్పంబునను యుద్ధంబునను నీకు సరియయిన వాఁడెవ్వఁడును లేఁడు. నీవు ఉపాయంబు దెలిపినవాఁడవు. మహాశూరుఁడవు. సమస్తమాయలును దెలిసినవాఁడవు. ౧౬

మారీచుఁడా! ఇందుకొఱకే నేను నీయొద్దకు వచ్చినాను. నాకు వచ్చి సాహాయ్యముసేయ నేమిచేయవలెనో చెప్పెదను వినుము ౧౭

నీవు వెండిబిందువులతో నొప్పుచున్న బంగారుజింకరూపము ధరించి రాముని యాశ్రమంబున సీతయెదుట సంచరింపుము. ౧౮

సీత కాంచనమృగరూపంబు ధరించిననిన్నుఁ జూచినంతనె దీనిం బట్టి యిండని తనపెనిమిటితోను లక్ష్మణునితోను నిస్సంశయముగాఁ జెప్పును ౧౯

అంత నారామలక్ష్మణులు పోయినవెనుక శూన్యంబగునరణ్యంబున నడ్డులేనివాఁడనై సుఖంబుగ రాహువుచంద్రప్రభను గబళించునట్లు సీత నపహరించెదను. ౨౦

అంత రాముఁడు భార్యావిరహంబునఁ బరమదుఃఖితుఁడై కృశించును గావున నతఁడు యుద్ధంబునకు వచ్చినను గృతార్థుఁడనై నిశ్చయంబుగాఁ బ్రహరించెదను. ౨౧

రాముని పేరు విన్నంతనే మహాబలుఁడగు నమ్మారీచుని నోరెండి యతఁడు పరమభీతుఁ డయ్యెను. ౨౨

ఆమారీచుఁడు ఎండినపెదవులం దడుపుకొనుచు చచ్చినవాఁడువలెఁ బరమార్తుఁడై ఱెప్పపాటులేనికన్నులతో రావణుఁ జూచుచుండెను. ౨౩

దండకారణ్యంబున నిదివఱకు రామునిపరాక్రంబు నెఱింగియుండునట్టి యమ్మారీచుఁడు పరమభీతుఁడై పరమదుఃఖితుఁడై చేతులు మొగిడ్చి రావణుం జూచి యతనికిని దనకును హితంబును యథార్థంబునగు నీమాటం జెప్పెను

ఇది ముప్పదియాఱవసర్గము.

## సప్తత్రింశస్సర్గః.

తచ్ఛ్రుత్వా రాక్షసేన్ద్రస్య వాక్యం వాక్యవిశారదః,
ప్రత్యువాచ మహాప్రాజ్ఞో మారీచో రాక్షసేశ్వరమ్. ౧
సులభాః పురుషా రాజన్! సతతం ప్రియవాదినః,
అప్రియస్య చ పథ్యస్య వక్తా శ్రోతా చ దుర్లభః. ౨

న నూనం బుధ్యసే రామం మహావీర్యం గుణోన్నతమ్,
అయుక్తచారశ్చపలో మహేన్ద్రవరుణోపమమ్. ౩

అపి స్వస్తి భవేత్తాత! సర్వేషాం భువి రక్షసామ్,
అపి రామో న సంక్రుద్ధః కుర్యాల్లోకమరాక్షసమ్. ౪
అపి తే జీవితాన్తాయ నోత్పన్నా జనకాత్మజా,
అపి సీతానిమిత్తం చ న భవేద్వ్యసనం మమ. ౫
అపి త్వామీశ్వరం ప్రాప్య కామవృత్తం నిరఙ్కుశమ్,
న వినశ్యేత్పురీ లఙ్కా త్వయా సహ సరాక్షసా. ౬

త్వద్విధః కామవృత్తో హి దుశ్శీలః పాపమన్త్రితః,
ఆత్మానం స్వజనం రాష్ట్రం స రాజా హన్తి దుర్మతిః. ౭

న చ పిత్రా పరిత్యక్తో నామర్యాదః కథంచన,
న లుబ్ధో న చ దుశ్శీలో న చ క్షత్రియపాంసనః. ౮
న చ ధర్మగుణైర్హీనః కౌసల్యానన్దవర్ధనః,
న తీక్ష్ణో న చ భూతానాం సర్వేషామహితే రతః. ౯
వఞ్చితం పితరం దృష్ట్వా కైకేయ్యా సత్యవాదినమ్,

## ముప్పదియేడవ సర్గము.

మాటలయందు గట్టివాఁడును మహాపండితుఁడు నగు మారీచుఁడు రాక్షసరాజుఁడగు రావణునిమాటనువిని రావణునిఁజూచియిట్లని చెప్పెను ౧

రాక్షసరాజుఁడవగురావణుఁడా! కీడు లెంచక ఇచ్ఛకములాడువారలు ఎల్లప్పుడును గావలసినంతమంది దొరకుదురు; అప్రియమయిన హితమును జెప్పువాఁడును జెప్పినచో వినువాఁడును ఎవ్వఁడును లేఁడు. ౨

నీవు చారులచే శత్రువునిజాడ దెలిసికొనలేదు. మఱియుఁ జపలుండవు కావున రాముఁడుమహాపరాక్రమశాలియనియు సమస్తసద్గుణసంపన్నుఁడనియు మహేంద్రవరుణులను సాటివచ్చువాఁడనియు నీకుఁ దెలియదు. ఇది నిశ్చయము. ౩

నాయనా! భూమిలో నింక రాక్షసులకందఱకు మంగళముకలుగునా? రాముఁడు కోపించి లోకములోరాక్షసులే లేకుండునట్లు చేయఁడాయేమి? ౪

సీతాదేవి నీమరణంబుకై పుట్టలేదాయేమి? సీతానిమిత్తముగా నాకు దుఃఖము కలుగదాయేమి? ౫

నిరంకుశంబుగా మనసునకు వచ్చినట్లాచరించునట్టినిన్ను నాథునిఁగాఁ బొంది లంకాపురి నీతోను సమస్తరాక్షసులతోనుంగూడ నాశము నొందకుండునాయేమి? ౬

ఎవ్వఁడు నీవలె మనస్సునకువచ్చినట్లాచరించుచు దుష్టస్వభావుఁడై పాపాలోచనముంజేయుచుండునో అట్టిదుర్మతియగురాజు తన్నును తనబంధువులను తనరాజ్యమును జెఱచుకొనును. ౭

రాముఁడు తండ్రిచేఁ దఱుమఁగొట్టఁబడినవాఁడుకాఁడు, మర్యాదలేనివాఁడుకాఁడు, లుబ్ధుఁడుకాఁడు, దుష్టస్వభావుఁడుకాఁడు, క్షత్రియాధముఁడుకాఁడు, ధర్మంబుగాని గుణంబులుగాని లేనివాఁడుకాఁడు, క్రూరుఁడుకాఁడు. సమస్తభూతంబులకును గీడుగావించువాఁడునుగాఁడు.

నాయనా! తనతండ్రి కైకేయికి మోసపోయి సత్యపాశబద్ధుఁడై

కరిష్యామీతి ధర్మాత్మా తాత! ప్రవ్రజితో వనమ్. ౧౦

కైకేయ్యాః ప్రియకామార్థం పితు ర్దశరథస్య చ,
హిత్వా రాజ్యం చ భోగాంశ్చ ప్రవిష్టో దణ్డకావనమ్. ౧౧
న రామః కర్కశ స్తాత! నావిద్వా న్నాజితేన్ద్రియః,
అనృతం దుశ్శ్రుతం చైవ నైవ త్వం వక్తు మర్హసి. ౧౨
రామో విగ్రహవా న్ధర్మ స్సాధు స్సత్యపరాక్రమః,
రాజా సర్వస్య లోకస్య దేవానాం మఘవా నివ. ౧౩

కథం త్వం తస్య వైదేహీం రక్షితాం స్వేన తేజసా,
ఇచ్ఛసి ప్రసభం హర్తుం ప్రభా మివ వివస్వతః. ౧౪

శరార్చిష మనాధృష్యం చాపఖడ్గేన్ధనం రణే,
రామాగ్నిం సహసా దీప్తం న ప్రవేష్టుం త్వ మర్హసి. ౧౫

ధనుర్వ్యాదితదీప్తాస్యం శరార్చిష మమర్షణమ్,
చాపపాశధరం వీరం శత్రుసైన్యప్రహారిణమ్. ౧౬
రాజ్యం సుఖం చ సన్త్యజ్య జీవితం చేష్ట మాత్మనః,
నాత్యాసాదయితుం తాత! రామాన్తక మి హార్హసి. ౧౭

అప్రమేయం హి త త్తేజో యస్య సా జనకాత్మజా,
నత్వం సమర్థ స్తాం హర్తుం రామచాపాశ్రయం వనే. ౧౮

తస్య సా నరసింహస్య సింహోరస్కస్య భామినీ,

యుండుటంజూచి ధర్మాత్ముఁడగు రాముఁడు కైకేయికోర్కెని గావించి తండ్రిని అసత్యదోషములేనివానిఁ గావించెద నని చెప్పి యడవికి వచ్చి నాఁడు. ౧౦

రాముఁడు కైకేయికిని దశరథునకును సంతోషంబుగలుగుటకై రాజ్యంబును భోగంబులను విడిచి దండకారణ్యంబునకు వచ్చినాఁడు, వేఱుగాదు.

నాయనా! రాముఁడు క్రూరుఁడుఁ గాఁడు, మూర్ఖుఁడు కాఁడు, ఇంద్రియవశ్యుఁడునుగాఁడు. తప్పుడుమాటలను విని నీ విట్లుబద్ధముఁ జెప్పరాదు.

రాముఁడు ఆకారమునొందిన ధర్మంబనందగును. సత్పురుషుఁడు. సత్యపరాక్రముఁడు. దేవతల కందఱకును ఇంద్రుఁడు ప్రభువగునట్లు జనుల కందఱకును అతఁడు ప్రభుఁడు ౧౩

అట్టి రాముని తేజంబుచే సురక్షితయయియున్న సీతాదేవిని బలాత్కారంబున నీ వెట్లపహరింపఁ గోరెదవు? ఎవ్వరేని సూర్యుని కాంతిని హరింపఁగలరా? ౧౪

నీవు యుద్ధమునందు బాణంబులె జ్వాలలుగాఁగలదియు ధనుస్సు ఖడ్గంబులె కట్టెలుగాఁ గలదియు నెదిరింప నలవిగానిదియుఁ బ్రజ్వలించుచున్నదియు నగురాముఁడను నగ్నిహోత్రములో నెంతమాత్రము పడకుము.

నాయనా! నీవు రాజ్యంబును సుఖంబును బ్రియమయిన జీవితంబును విడిచి యిప్పుడు ధనుస్సే లోకసంహారార్థమయి తెఱపఁబడిన నోరుగాఁగలవాఁడును బాణంబులె జ్వాలలుగాఁగలవాఁడును గుపితుఁడును జాపపాశంబులు దాల్చినవాఁడును వీరుఁడు శత్రుసైన్యంబుల సంహరించువాఁడు నగు రాముఁడను యమునిచెంతకుఁ జనవలదు. ౧౫

ఆసీతకుఁ బెనిమిటియయిన రాముని తేజస్సు అప్రమేయమయినది. అట్టి రామధనుస్సు నాశ్రయించియున్న సీతాదేవిని హరింప నీవు సమర్థుఁడవు కావు. ౧౬

ఆసీతను బురుషోత్తముఁడును సింహాంబునకుంబోలె విశాలంబగు

ప్రాణేభ్యోఽపి ప్రియతరా భార్యా నిత్యమనువ్రతా. ౧౯

న సా ధర్షయితుం శక్యా మైథిల్యోజస్వినః ప్రియా,
దీప్తస్యేవ హుతాశస్య శిఖా సీతా సుమధ్యమా. ౨౦

కి ముద్యమ మిమం వ్యర్థం కృత్వా తే రాక్షసాధిప!,
దృష్టశ్చేత్త్వం రణే తేన తదన్తం తవ జీవితమ్. ౨౧

జీవితఞ్చ సుఖం చైవ రాజ్యం చైవ సుదుర్లభమ్,
యదీచ్ఛసి చిరం భోక్తుం మా కృథా రామవిప్రియమ్. ౨౨
స సర్వైస్సచివైస్సార్ధం విభీషణపురోగమైః,
మన్త్రయిత్వా తు ధర్మిష్ఠైః కృత్వా నిశ్చయ మాత్మనః. ౨౩
దోషాణాం చ గుణానాం చ సమ్ప్రధార్య బలాబలమ్,
ఆత్మనశ్చ బలం జ్ఞాత్వా రాఘవస్య చ తత్త్వతః. ౨౪
హితం హి తవ నిశ్చిత్య క్షమం త్వం కర్తుమర్హసి.
అహం తు మన్యే తవ న క్షమం రణే
సమాగమం కోసలరాజసూనునా,
ఇదం హి భూయశ్శృణు వాక్య ముత్తమం
క్షమం చ యుక్తం చ నిశాచరేశ్వర! ౨౫

ఇతి శ్రీమదరణ్యకాణ్డే సప్తత్రింశస్సర్గః. ౩౭.

---

## అష్టాత్రింశస్సర్గః.

కదాచి దప్యహం వీర్యాత్పర్యటన్పృథివీ మిమామ్,
బలం నాగసహస్రస్య ధారయన్పర్వతోపమః. ౧

బ్రోమ్ముగలవాఁడు నగు నాగాముఁడు తనప్రాణంబులకన్న నెచ్చుగాఁ జూచుకొనుచుండును. అనీతయు నెల్లప్పుడును బెనిమిటి ననుసరించియే యుండును. ౧౯

మండుచున్న యగ్నిజ్వాలను దాఁకుట కలవిగానట్లు మహాపరాక్రమ శాలియగు రాముని ప్రియభార్యయగు నాసీతాదేవిని ధర్షింప నెంతమాత్రము నలవిగాదు. ౨౦.

రాక్షసరాజాఁడవగు రావణుఁడా! నిష్ప్రయోజనమగు నీప్రయత్న మును గావించుటవలన నీకేమి ప్రయోజనముగలుగును? యుద్ధంబున నిన్ను రాముఁడు ఎప్పుడుచూచునో ఆక్షణమె నీప్రాణము నశించును. ౨౧.

జీవితంబును సుఖంబును దుర్లభంబగు రాజ్యంబును అనుభవింపఁ గోరుదువేని రామునిజోలికిఁ బోవలదు. ౨౨

నీవు పరమధార్మికులగు విభీషణుఁడు మున్నగుమంత్రులతో నాలోచించి గుణదోషంబులను బలాబలంబులను విచారించి నీబలంబును రామునిబలంబును జక్కఁగా దెలిసికొని, కీడుమేలుల నాలోచించి, యేదియుక్తమో దానిం జేయుము. ౨౩-౨౪

రాక్షసరాజాఁడవగు రావణుఁడా! నామనమ్ము నీవు దశరథ మహారాజపుత్త్రుఁడగు రామునితో యుద్ధంబు గావించుట మంచిదికాదని తోఁచుచున్నది. నేను మాటిమాటికి దీనినే చెప్పెదను. యుక్తియుక్తంబును దేశకాలయోగ్యంబునగు నీమాటను వినుము. ౨౫

ముప్పదియేడవసర్గము.

---

## ముప్పదియెనిమిదవసర్గము.

మాన్యుకప్పుడు నేను వేయిగజంబులబలంబుగలిగి పర్వతాకారుఁడనై నీలమేఘవర్ణుఁడనై మంచిబంగారుపోఁగులుధరించి కిరీటధరుఁడనై పరిఘంబు

చేతంగొని లోకంబునకంతయు భయంబుగలిగించుచు భూమిం గ్రుమ్మరు చు ఋషిమాంసంబు భక్షింపవలయునని కొంతకాలము దండకారణ్యంబున సంచరించుచుంటిని. ౨

అంత ధర్మాత్ముఁడగు విశ్వామిత్రమహాముని నాకు భయపడి తానే దశరథమహారాజు నొద్దకుఁ బోయి యిట్లని చెప్పెను. ३

దశరథమహారాజా! మారీచుఁడు నన్ను మిక్కిలియు బాధించుచున్నాఁడు, కావున నిప్పుడు రాముఁడు వచ్చి పర్వకాలంబున నన్ను రక్షింపుచుండ వలయును అని విశ్వామిత్రుఁడు దశరథునితోఁ జెప్పెను. ४

అప్పుడు ధర్మాత్ముఁడగు దశరథమహారాజు విశ్వామిత్రుఁడు చెప్పిన మాటను విని మహాభాగుఁడగు విశ్వామిత్రమహామునిం జూచి యిట్లని చెప్పెను. ౫

ఈరాముఁడు పండ్రెండేండ్లపిన్నవాఁడు; అస్త్రబలంబులను అన్నియుఁ జక్కఁగాఁ దెలియనివాఁడు. ౬

నీవుకావలెనన్నచో నా సైన్యంబంతయు వెంటఁదీసికొని నేనువచ్చెదను. మునివరుఁడవగు విశ్వామిత్రుఁడా! నేనేచతురంగసైన్యముతో వచ్చి నీశత్రువులగు రాక్షసుల వధించి పుచ్చెదను. అని దశరథమహారాజు విశ్వామిత్రునితోఁ జెప్పెను. ౭

ఆవిశ్వామిత్రమహాముని దశరథమహారాజు మాటనువిని యతనింజూచి యిట్లని చెప్పెను. ౮

లోకమున రాముఁడుదక్క నుఱియెంతబలమయినను ఆమారీచుసాధింప నలవిగాదు.

నీవు యుద్ధంబులను దేవతలనుంగూడ రక్షించినవాఁడవు. ౯

దశరథమహారాజా ! నీవు గావించినగొప్పకార్యములు ముల్లోకంబులందును వినుతిఁజెందియున్నవి. ౧౦

శత్రువులఁ దపింపఁజేయునట్టి దశరథమహారాజా! నీసైన్యము చాల

బాలోఽప్యేష మహాతేజా స్సమర్థ స్తస్య నిగ్రహే,
గమిష్యే రామ మాదాయ స్వస్తి తేఽస్తు పరన్తప! ౧౧

ఏవ ముక్త్వా తు స ముని స్త మాదాయ నృపాత్మజమ్,
జగామ పరమప్రీతో విశ్వామిత్ర స్స్వ మాశ్రమమ్. ౧౨
తం తదా దణ్డకారణ్యే యజ్ఞ ముద్దిశ్య దీక్షితమ్,
బభూ వోపస్థితో రామ శ్చిత్రం విస్ఫారయ న్ధనుః. ౧౩

అజాతవ్యఞ్జన శ్శ్రీమా న్పద్మపత్రనిభేక్షణః,
ఏకవస్త్రధరో ధన్వీ శిఖీ కనకమాలయా. ౧౪
శోభయ న్దణ్డకారణ్యం దీప్తేన స్వేన తేజసా,
అదృశ్యత తతో రామో బాలచన్ద్ర ఇవోదితః. ౧౫

తతోఽహం మేఘసఙ్కాశ స్తప్తకాఞ్చనకుణ్డలః,
బలీ దత్తవరో దర్పా దాజగామ తదాశ్రమమ్. ౧౬

తేన దృష్టః ప్రవిష్టోఽహం సహసై వోద్యతాయుధః,

మాం తు దృష్ట్వా ధను స్సజ్య మసంభ్రాన్త శ్చకార సః. ౧౭

అవజాన న్నహం మోహా ద్బాలోఽయ మితి రాఘవమ్,

గొప్పదే అయినను దానితోఁ బనిలేదు. అదంతయు నిచ్చటనె యుండుఁగాక.

ఈరాముఁడు బాలుఁడయినను మహాతేజుఁడు గావున నారాక్షసుని వధింపఁగలఁడు.

శత్రువులఁ దపింపఁజేయునట్టి దశరథమహారాజా! అట్లు కావున నేను రామునిందీసికొనిపోయెదను. నీకు మంగళముగలుగుఁగాక అని విశ్వామిత్రుఁడు దశరథునితోఁ జెప్పెను. ౧౧

ఆవిశ్వామిత్రమహాముని యిట్లుచెప్పి రాచకొమరుఁడగురాముందీసికొని పరమసంతుష్టుఁడై తనయాశ్రమంబునకుఁ బోయెను. ౧౨

అప్పుడు రాముఁడు దండకారణ్యంబున నవ్విశ్వామిత్రునాశ్రమమునందుఁ గాంచనచిత్రితంబగు ధనుస్సు చేతంగొని జ్యానాదంబు పఱఁగించుచు యాగదీక్షవహించిన విశ్వామిత్రునిచెంత నుండెను. ౧౩

అంత ఇంకనుమీసములు మొదలగుపురుషచిహ్నములు గలుగకున్నవాఁడును శ్రీమంతుఁడును దామరపూరేకులంబోలె విశాలసుందరంబులగు కన్నులుగలవాఁడును ఒక్కటెవస్త్రంబు గట్టుకొనియున్నవాఁడును బంగారుమాలికతోఁ జుట్టఁబడిన జుట్టుగలవాఁడును 'తనదివ్యతేజంబున దండకారణ్యంబునంతయు వెలిఁగింపుచున్నవాఁడును నవోదితుఁడగు బాలచంద్రునిమాడ్కిం దేజరిల్లుచున్నవాఁడునగు రాముం జూచితిని. ౧౪,౧౫

అంత మేఘాకారుఁడను మంచిబంగారుపోఁగులు ధరించియున్నవాఁడను బలవంతుఁడను వరంబులు పొందియున్నవాఁడ నగునేను. గర్వంబున నావిశ్వామిత్రు నాశ్రమంబునకుఁ బోతిని. ౧౬

నేను ఆయుధధరుఁడనై రాముఁడు చూచుచుండ శీఘ్రంబున నాశ్రమంబుఁ బ్రవేశించితిని.

ఆరాముఁడు నన్నుఁజూచినంతనే యెంతమాత్రము సంభ్రమంబు నొందక ధనుస్సును సజ్యంబు గావించెను. ౧౭

నేను అజ్ఞానంబున "ఇతఁడు పిల్లవాఁ" డని రాముని సరకుసేయక

విశ్వామిత్రస్య తాం వేది మభ్యధావం కృతత్వరః. ౧౮
తేన ముక్త స్తతో బాణ శ్శిత శ్శత్రునిబర్హణః,

తేనాహం త్వాహతః క్షిప్త స్సముద్రే శతయోజనే. ౧౯

నేచ్ఛతా తాత! మాం హన్తుం తదా వీరేణ రక్షితః,

రామస్య శరవేగేన నిరస్తోఽహ మచేతనః. ౨౦

పాతితోఽహం తదా తేన గమ్భీరే సాగరామ్భసి,
ప్రాప్యసంజ్ఞాం చిరా త్తాత! లఙ్కాం ప్రతిగతః పురీమ్.
ఏవ మస్మి తదా ముక్త స్సహాయాస్తు నిపాతితాః,
అకృతాస్త్రేణ బాలేన రామే ణాక్లిష్టకర్మణా. ౨౨

త న్మయా వార్యమాణ స్త్వం యది రామేణ విగ్రహమ్,
కరిష్య స్యాపదం ఘోరాం క్షిప్రం ప్రాప్స్యసి రావణ!. ౨౩
క్రీడారతివిధిజ్ఞానాం సమాజోత్సవశాలినామ్,
రక్షసాంచైవ సంతాప మనర్థం చాహరిష్యసి. ౨౪

హర్మ్యప్రాసాదసమ్బాధాం నానారత్నవిభూషితామ్,
ద్రక్ష్యసి త్వం పురీం లఙ్కాం వినష్టాం మైథిలీకృతే. ౨౫

అకుర్వన్తోఽపి పాపాని శుచయః పాపసంశ్రయాత్,
పరపాపై ర్వినశ్యన్తి మత్స్యానాగహ్రదే యథా. ౨౬

వేగంబున విశ్వామిత్రుని యాగవేదికమీఁదికిఁ బోతిని, ౧౮

అంత నారాముఁడు శత్రుసంహారణంబగు నొక్కతీక్ష్ణబాణంబు విడిచెను.

ఆబాణంబుదెబ్బకు నేను నూఱుయోజనంబుల కావల సముద్రంబునం బడితిని. ౧౯

నాయనా! అప్పుడు వీరుఁడగు రాముఁడు నన్ను వధింపనొల్లనందున నాప్రాణంబులు గొనక రక్షించెను.

నేను రాముని బాణవేగంబునకు సముద్రంబునం బడి మూర్ఛనొందితిని. ౨౦

నాయనా! అప్పుడు ఆబాణవేగంబున నేను లోఁతయిన సముద్రజలంబులంబడి బహుకాలంబునకు సంజ్ఞనొంది లంకానగరంబునకు వచ్చినాను.

అప్పటికి రాముఁడు బాలుఁడు. ఇంకను అస్త్రములుగూడ నేర్చియుండలేదు. అట్లుండఁగానే నాసహాయులనందఱ వధించి నన్ను నంతటితో విడిచెను. ౨౨

రావణుఁడా! అట్లుకావున నీవు నేనుజెప్పినమాటను వినక రామునితో యుద్ధముగావింతువేని శీఘ్రంబున గొప్పయాపదం బొందఁగలవు. ౨౩

నీవు చెడుటయేగాక నానావిధంబుగాఁ గ్రీడలం దేలుచు నానావిధ సంభోగరసం బనుభవింపుచు సభలుచేరి బహువిధోత్సవసుఖంబులం బొందుచున్న రాక్షసులకునుగూడ సంతాపంబును నాశంబును దెచ్చినవాఁడ వగుచున్నావు. ౨౪

మేడలచేతను రాజగృహములచేతను నిండియుండునదియు నానావిధ మణులచే నలంకృతంబునగు లంకాపురి సీతానిమిత్తమయి నశించుటం జూడగలవు. ౨౫

సర్పములు నివసించునట్టి తటాకమునందుండుటచే మత్స్యములుగూడ గరుత్మంతునిచే భక్షింపఁబడునట్లు ఏపాపము నెఱుఁగనిపరిశుద్ధాత్ములుగూడఁ బాపులసహవాసముచేత వారల పాపదోషంబునఁ దాముసు నశింతురు. ౨౬

దివ్యచన్దనదిగ్ధాఙ్గా న్దివ్యాభరణభూషితాన్,
ద్రక్ష్య స్యభిహతా న్భూమౌ తవ దోషా త్తు రాక్షసాన్. ౨౭

హృతదారాం త్సదారాం శ్చ దశ విద్రవతో దిశః,
హతశేషా నశరణా న్ద్రక్ష్యసి త్వం నిశాచరాన్. ౨౮
శరజాలపరిక్షిప్తా మగ్నిజ్వాలాసమావృతామ్,
ప్రదగ్ధభవనాం లఙ్కాం ద్రక్ష్యసిత్వం న సంశయః. ౨౯

పరదారాభిమర్శా త్తు నాన్య త్పాపతరం మహత్,
ప్రమదానాం సహస్రాణి తవ రాజ! న్పరిగ్రహః. ౩౦

భవ స్స్వదారనిరత స్స్వకులం రక్ష రాక్షస!,
మాన మృద్ధిం చ రాజ్యం చ జీవితం చేష్ట మాత్మనః. ౩౧

కళత్రాణి చ సౌమ్యాని మిత్రవర్గం తథైవ చ,
య దీచ్ఛసి చిరం భోక్తుం మాకృథా రామవిప్రియమ్. ౩౨

నివార్యమాణ స్సుహృదా మయా భృశం
ప్రసహ్య సీతాం యది ధర్షయిష్యసి,
గమిష్యసి క్షీణబల స్సబాన్ధవో
యమక్షయం రామశరాత్తజీవితః. ౩౩

ఇతి శ్రీమదరణ్యకాణ్డేఽష్టాత్రింశ స్సర్గః. ౩౮.

---

ఏకోనచత్వారింశ స్సర్గః.

ఏవ మస్మి తదా ముక్తః కథంచి త్తేన సంయుగే,

దివ్యచందనంబు మేన నలందికొని దివ్యభూషణధారులయియుండు రాక్షసులు నీదోషంబునం జేసి రామబాణాభిహతులయి నేలం గూలియుండుటం జూడఁగలవు. ౨౭

నీవు హతశేషులగురాక్షసులు రక్షకుం గానక కొందఱు భార్యలతోను దశదిశలకుం బరుగెత్తుటను జూడఁగలవు. ౨౮

నీవు లంకాపురియంతయు బాణసమూహంబులం గప్పఁబడి యగ్నిజ్వాలాసమావృతమయి మండిపోయినవియు మండుచున్నవియు నగుగృహంబులతో నుండుటం జూడఁగలవు. ఇందుకు సంశయములేదు. ౨౯

రాక్షసరాజుఁడవగు రావణుఁడా! పరస్త్రీసంగమముకన్నను వేఱే యధికపాప మేదియులేదు. నీకు భార్యలు వేయిమందియున్నారు. పరస్త్రీల నపేక్షింపకుము. ౩౦

రావణుఁడా! స్త్రీలను విడిచి స్వభార్యలయందే యాసక్తుఁడవై యుండుము. నీవంశమును గౌరవంబును సంపదను రాజ్యమును బ్రియంబగు జీవితంబును రక్షించుకొనుము. ౩౧

బహుకాలము సౌందర్యవతులగు భార్యల నుపభోగించుచు స్నేహితులతోఁగూడ సుఖంబు ననుభవించుటకుఁ గోరుదువేని రామున కెంతమాత్రమపకారము సేయవలదు. ౩౨

స్నేహితుఁడగు నేను జెప్పినమాటను వినక నీవు బలాత్కారంబున సీత నపహరింతువేని నీవు రామబాణాభిహతుఁడవై బంధుసహితంబుగా నాశంబునొంది యమపురంబు నేరంగలవు. ౩౩

ముప్పదియొనిమిదవసర్గము.

---

## ముప్పదితొమ్మిదవసర్గము.

అప్పుడు బాల్యంబున రాముఁడు యుద్ధంబున నన్నెట్టకేలకు మన్నిం

ఇదానీ మపి యద్వృత్తం త చ్ఛృణుష్వ నిరుత్తరమ్. ౧

రాక్షసాభ్యా మహం ద్వాభ్యా మనిర్విణ్ణ స్తథాకృతః,
సహితో మృగరూపాభ్యాం ప్రవిష్టో దణ్డకావనమ్. ౨
దీప్తజిహ్వో మహాకాయ స్తీక్ష్ణదంష్ట్రో మహాబలః,
వ్యచరం దణ్డకారణ్యం మాంసభక్షో మహామృగః. ౩

అగ్నిహోత్రేషు తీర్థేషు చైత్యవృక్షేషు రావణ!,
అత్యన్తఘోరో వ్యచరం తాపసాం స్సంప్రధర్షయన్. ౪

నిహత్య దణ్డకారణ్యే తాపసా న్ధర్మచారిణః,
రుధిరాణి పిబం స్తేషాం తథా మాంసాని భక్షయన్. ౫
ఋషిమాంసాశనః క్రూర స్త్రాసయ న్వనగోచరాన్,
తథా రుధిరమత్తో౽హం విచర న్ధర్మదూషకః. ౬

ఆసాదయం తదా రామం తాపసం ధర్మచారిణమ్,
వైదేహీం చ మహాభాగాం లక్ష్మణం చ మహారథమ్. ౭
తాపసం నియతాహారం సర్వభూతహితే రతమ్,
సో౽హం వనగతం రామం పరిభూయ మహాబలమ్. ౮
తాపసో౽య మితి జ్ఞాత్వా పూర్వవైర మనుస్మరన్,
అభ్యధావం హి సంక్రుద్ధ స్తీక్ష్ణశృఙ్గో మృగాకృతిః. ౯
జిఘాంసు రకృతప్రజ్ఞ స్తం ప్రహార మనుస్మరన్,

తేన ముక్తా స్త్రయో బాణా శ్శితా శ్శత్రునిబర్హణాః. ౧౦
వికృష్య బలవ చ్చాపం సుపర్ణానిలనిస్వనాః,

విడిచెను. ఇప్పుడు అతనియౌవనంబు వచ్చినవెనుక జరగినసమాచారమును జెప్పెదను మాటాడక యూరక వినుము. ౧

అట్లు రామునిచే దెబ్బదినియు నంత నూరకుండక నేను మఱల జింకలరూపు దాల్చిన యిద్దఱిరాక్షసులతో దండకారణ్యంబుఁ జొచ్చితిని. ౨

నేను వెలుంగుచున్న నాలుకయుఁ గఱకుగోఱలును పెద్దమేనును గలదియు మహాబలంబును మాంసభక్షంబు నగుపెద్దజింకనై దండకారణ్యంబున సంచరించితిని. ౩

రావణుఁడా! నేను భయంకరాకారుఁడనై యగ్నిహోత్రంబులయొద్దను బుణ్యతీర్థంబులయందును చైత్యవృక్షసమీపంబులందును ఋషులను భయపఱచుచు సంచరించుచుంటిని. ౪

దండకారణ్యంబున ధర్మంబు నాచరించుచుండు ఋషులను వధించి వారల రక్తంబు గ్రోలుచు మాంసంబు భక్షింపుచుంటిని. ౫

నేను క్రూరుఁడనై ఋషులమాంసంబు దినుచు వనంబున నుండువారల వెఱపించుచు యథేచ్ఛముగా నెత్తురుద్రావి మంచి ధర్మంబుఁ జెఱచుచు నీప్రకారంబున విహరింపుచుంటిని. ౬

అప్పుడు నేను ఋషివేషధరుఁడును ధార్మికుఁడునగు రాముని మహాభాగురాలగు సీతాదేవిని మహారథుఁడగు లక్ష్మణునిం జూచితిని. ౭

కఱకుగొమ్ములుగల జింకరూపంబు దాల్చియున్న నేను రాముంజూచి నంతనె మున్నతఁడు నన్ను గొట్టినదెబ్బను దలఁచుకొని మునుపటివైరంబు దలఁచి యుక్తాయుక్తంబు విచారింపక "ఈతఁడుతాపసుఁడుగా నున్నాఁడు; ఇప్పు డేమిసేయఁగలఁడు?" అని యెంచి తాపసాకారుఁడును నియతాహారుఁడును సర్వభూతహితాసక్తుఁడును బలశాలియు నగు రామునిం దిరస్కరించి వధింపవలయునని యాతనిపైకిఁ బరుగెత్తితిని. ౮-౯

ఆరాముఁడు గరుత్మంతునకును వాయువునకునుంబోలె మహావేగంబు గలవియుఁ దీక్ష్ణములును శత్రువధంబు సేయునవియునగు మూఁడుబాణంబులు ప్రయోగించెను. ౧౦

తే బాణా వజ్రసఙ్కాశా స్సుముక్తా రక్తభోజనాః. ౧౧
ఆజగ్ముస్సహితా స్సర్వే త్రయ స్సన్నతపర్వణః,

పరాక్రమజ్ఞో రామస్య శఠో దృష్టభయః పురా. ౧౨
సముత్క్రాన్త స్తతో ముక్త స్తావుభౌ రాక్షసౌ హతౌ,

శరేణ ముక్తో రామస్య కథంచి త్ప్రాప్య జీవితమ్. ౧౩
ఇహ ప్రవ్రాజితో యుక్త స్తాపసోఽహం సమాహితః,

వృక్షేవృక్షే చ పశ్యామి చీరకృష్ణాజినామ్బరమ్. ౧౪
గృహీతధనుషం రామం పాశహస్త మివాన్తకమ్,

అపి రామసహస్రాణి భీతః పశ్యామి రావణ!. ౧౫
రామభూత మిదం సర్వ మరణ్యం ప్రతిభాతి మే,

రామ మేవ హి పశ్యామి రహితే రాక్షసాధిప!. ౧౬
దృష్ట్వా స్వప్నగతం రామ ముద్భ్రమామి విచేతనః,

రకారాదీని నామాని రామత్రస్తస్య రావణ!. ౧౭
రత్నాని చ రథా శ్చైవ త్రాసం సఞ్జనయన్తి మే,

అహం తస్య ప్రభావజ్ఞో న యుద్ధం తేన తే క్షమమ్. ౧౮
బలిం వా నముచిం వాపి హన్యాద్ధి రఘునన్దనః,

వజ్రములవంటియుఁ జెవివఱకుధనుస్సు నాకర్షించి విడువఁబడినవియు రక్తంబు ద్రావునవియు సన్నతపర్వంబులు నగునాబాణంబులు మూఁడు నొక్కపెట్ట మాపైకి వచ్చినవి. ౧౧

నేను రామబాణవేగంబును మున్నొకమా అనుభవించి రాముని పరాక్రమంబు దెలిసికొనియున్నాను గావునఁ బరుగెత్తి తప్పించుకొంటిని. ఆ యిద్దఱు రాక్షసులు వధింపఁబడిరి. ౧౨

నేను రామునిబాణంబువాతం బడక ప్రాణంబు దక్కించుకొని దుష్టకార్యంబుల నన్నియు విడిచి తపోనిష్ఠుఁడనై యోగాభ్యాసంబు సేయుచు నిచ్చట నున్నాను. ౧౩

రాముఁడు నారచీరలును గృష్ణాజినంబును దాల్చి ధనుర్ధరుఁడై పాశహస్తుఁడగు యమునికైవడి నతిభయంకరాకారుఁడై నాకుఁ బ్రతివృక్షంబు నందును జూపట్టుచున్నాఁడు. ౧౪

రావణుఁడా! పెక్కువేలరాములు నాకంటి కగపడి నాకు భయంబు గలిగించుచున్నారు. ఈయడవియంతయు నాకు రామమయముగా నగపడుచున్నది. ౧౫

రాక్షసరాజుఁడవగురావణుఁడా! ఎవ్వరునులేని ప్రదేశములందంతటను నాకు రాముఁడే తప్పక పొడచూపుచున్నాఁడు. ౧౬

కలలో రామునిఁ జూచి మూర్ఛనొంది పరమభయంబునం గలవరించెదను.

రావణుఁడా! నాకు రామునివలని భయంబునంజేసి రకారము మొదట గల రత్నములు రథములు మొదలగునవియుఁగూడ మహాభయంబు గలిగించుచున్నవి. ౧౭

ఆరాముని ప్రభావంబు నాకుఁ జక్కఁగాఁ దెలియును. కావున నతనితో యుద్ధముసేయుట నీకెంతమాత్రము తగదు. రాముఁడు బలినిగాని నముచినిం గాని వధింపఁజాలినంతటి మహాపరాక్రమశాలి. ౧౮

రణే రామేణ యుధ్యస్వ క్షమాం వా కురు రాక్షస!. ౧౯
న తే రామకథా కార్యా యది మాం ద్రష్టు మిచ్ఛసి,

బహవ స్సాధవో లోకే యుక్తా ధర్మ మనుష్ఠితాః. ౨౦
పరేషా మపరాధేన వినష్టా స్సపరిచ్ఛదాః,

సోఽహం త్వ దపరాధేన వినశ్యేయం నిశాచర!. ౨౧

కురు యత్తేక్షమం తత్త్వ మహం త్వా నానుయామి హ,

రామశ్చ హి మహాతేజా మహాసత్త్వో మహాబలః. ౨౨
అపి రాక్షసలోకస్య న భవే దన్తకోఽపి సః,
యది శూర్పణఖాహేతో ర్జనస్థానగతః ఖరః. ౨౩
అతివృత్తో హతః పూర్వం రామే ణాక్లిష్టకర్మణా,
అత్ర బ్రూహి యథాతత్త్వం కో రామస్య వ్యతిక్రమః. ౨౪

ఇదం వచో బన్ధుహితార్థినా మయా
యథోచ్యమానం యది నాభిపత్స్యసే,
సబాన్ధవ స్త్యక్ష్యసి జీవితం రణే
హతోఽద్య రామేణ శరై రజిహ్మగైః. ౨౫

ఇతి శ్రీమదరణ్యకాణ్డే ఏకోనచత్వారింశ స్సర్గః. ౩౯.

రావణుఁడా! నీవు రామునితో యుద్ధముచేసినను జేయుము. ఊరక యున్నను ఊరకుండుము. నీయిష్టము. నీవు నన్నుఁజూడఁగోరుదువేని రాముని ప్రస్తాపమునుమాత్రము నాయొద్దఁ జేయకుము. ౧౯

లోకమునందు యోగ్యులును ధార్మికులునగు సత్పురుషులు పెక్కండ్రు ఒరుల యపరాధంబునఁ బరివారజనంబులతోఁగూడ నాశంబు నొంది యున్నారు. ౨౦

రావణుఁడా! అట్టి సాధువృత్తి నవలంబించియున్న నేను నీయపరాధంబున నాశంబు నొందుదును. ౨౧

నీ కేమియుక్తముగాఁ దోఁచునో ఆప్రకారము నీవు చేసికొనుము. నాకక్కఱలేదు. నీతోఁగూడ నెంతమాత్రము రాను.

మహాతేజుఁడును మహాధైర్యుఁడును మహాబలుఁడు నగు నారాముఁడు రాక్షసుల నందఱను వధింపక విడువఁడు. ౨౨

రాముఁ డొరులకు దుఃఖముగలిగించువాఁడు కాఁడు "శూర్పణఖను విరూపంగావించెను; ఆకోపంబున యుద్ధంబునకు వచ్చినఖరునివధించెను." అని రామునిపై దోషంబు చెప్పుదువు కాఁబోలు; శూర్పణఖ సీతను బాధింపఁబోవుటచే రాముఁడాబిడను విరూపఁగావించెను. ఖరుఁడు పైఁబడి కొట్టవచ్చినందువలన నాత్మసంరక్షణార్థమయి యతని వధించెను. ఇందురాముని దప్పేమియున్నది? యథార్థముగాఁ జెప్పుము. ౨౩-౨౪

బంధుఁడను నీమేలుగోరువాఁడను నగునేను యథార్థముగాఁ జెప్పునట్టి మాట నంగీకరింపవేని యుద్ధంబున రామునిబాణంబుల నభిహతుఁడవై బంధుసహితంబుగాఁ బ్రాణంబులు విడువఁగలవు. అని మారీచుఁడు రావణునకుం జెప్పెను. ౨౫

ముప్పదితొమ్మిదవసర్గము.

---

## చత్వారింశ స్సర్గః.

మారీచేన తు తద్వాక్యం క్షమం యుక్తం నిశాచరః,
ఉక్తో న ప్రతిజగ్రాహ మర్తుకామ ఇవౌషధమ్. ౧
తం పథ్యహితవక్తారం మారీచం రాక్షసాధిపః,
అబ్రవీ త్పరుషం వాక్య మయుక్తం కాలచోదితః. ౨

య త్కిలైత దయుక్తార్థం మారీచ! మయి కథ్యతే,
వాక్యం నిష్ఫల మత్యర్థ ముప్తం బీజ మి వోషరే. ౩
త్వద్వాక్యై ర్నతు మాం శక్యం భేత్తుం రామస్య సంయుగే,
పాపశీలస్య మూర్ఖస్య మానుషస్య విశేషతః. ౪

య స్త్యక్త్వా సుహృదో రాజ్యం మాతరం పితరం తథా,
స్త్రీవాక్యం ప్రాకృతం శ్రుత్వా వన మేకపదే గతః. ౫

అవశ్య న్తు మయా తస్య సంయుగే ఖరఘాతినః,
ప్రాణైః ప్రియతరా సీతా హర్తవ్యా తవ సన్నిధౌ. ౬

ఏవం మే నిశ్చితా బుద్ధి ర్హృది మారీచ! వర్తతే,
న వ్యావర్తయితుం శక్యా సేన్ద్రై రపి సురాసురైః. ౭

దోషం గుణం వా సంపృష్ట స్త్వ మేవం వక్తు మర్హసి,
అపాయం వా ప్యుపాయం వా కార్య స్యాస్య వినిశ్చయే. ౮
సంపృష్టేన తు వక్తవ్యం సచివేన విపశ్చితా,
ఉద్యతాఞ్జలినా రాజ్ఞే య ఇచ్ఛే ద్భూతి మాత్మనః. ౯

## నలువదియవసర్గము.

రావణుఁడు మారీచుఁడు యుక్తియుక్తంబుగా నెంతచెప్పినను జావఁ
గోరినవాఁడు మందును బుచ్చుకొననట్లు మారీచునిమాట నంగీకరింపఁడయ్యె.

రాక్షసరాజుఁడగు రావణుఁడు కాలచోదితుఁడై మేలుగలిగించుమా
టలం జెప్పినమారీచుం జూచి పరుషంబును అయుక్తంబు నగు నీమాటం
జెప్పెను. ౨

మారీచుఁడా! నావిషయమును ఇట్లు చెప్పరానిమాటలం జెప్పినావు.
చవుటినేలయందు వేయఁబడిన విత్తనమువలె నీమాటలంతయు వ్యర్థము. ౩

పాపిష్ఠుఁడును మూర్ఖుఁడును విశేషించి మనుష్యుఁడునగు రామునితో
యుద్ధంబుసేయువిషయమునందు నన్ను మఱలింప నీమాటలచే నెంతమాత్రము
శక్యముగాదు. ౪

ఆఁడుది యగుకైకేయిచెప్పిన యుపయోగములేని మాటనువిని తత్క్షణ
మున స్నేహితులను రాజ్యంబునుం దలిదండ్రులను విడిచి వనంబుఁ జేరినం
తటిమూర్ఖుఁడు రాముఁడు. ౫

యుద్ధంబున ఖరునివధించినట్టి దుర్మార్గుఁడగు నారామునకుఁ బ్రాణంబు
లకన్నఁ బ్రియతరయగు భార్యను సీతను నీయెదుట నే నవశ్యము హరింపవ
లయునని నిశ్చయించితిని. ౬

మారీచుఁడా! ఈప్రకారంబున నేను మనంబున నిశ్చయించుకొని
యున్నాను. ఈనిశ్చయమును దేవేంద్రుఁడు సురాసురులు నందఱు నొకటి
యయినను మఱల్పఁజాలరు. ౭

ఈకార్యము నిశ్చయించువిషయమయి ఉపాయాపాయంబులనుగాని
గుణదోషంబులనుగాని చెప్పుమని నే నడిగినట్టయిన నీ విట్లు చెప్పవచ్చును. ౮

సంపదం బొందఁగోరిన పండితుఁడగుమంత్రి తన్ను రాజడిగిన పిమ్మట నే
చేతులుమోడ్చుకొని తనకుఁ దోఁచినది రాజునకుఁ జెప్పుకొనవలయును. అదు
గనియెడఁ జెప్పఁగూడదు. ౯

వాక్య మప్రతికూలం తు మృదుపూర్వం శుభం హితమ్,
ఉపచారేణ యుక్తం చ వక్తవ్యో వసుధాధిపః. ౧౦

సావమర్దం తు యద్వాక్యం మారీచ! హిత ముచ్యతే,
నాభినన్దతి తద్రాజా మానార్హో మానవర్జితమ్. ౧౧

పఞ్చ రూపాణి రాజానో ధారయ న్త్యమితౌజసః,
అగ్నే రిన్ద్రస్య సోమస్య వరుణస్య యమస్య చ. ౧౨
ఔష్ణ్యం తథా విక్రమం చ సౌమ్యం దణ్డం ప్రసన్నతామ్,
ధారయన్తి మహాత్మానో రాజానః క్షణదాచర!. ౧౩

తస్మా త్సర్వా స్వవస్థాసు మాన్యాః పూజ్యా శ్చ పార్థివాః,

త్వం తు ధర్మ మవిజ్ఞాయ కేవలం మోహ మాస్థితః. ౧౪
అభ్యాగతం మాం దౌరాత్మ్యా త్పరుషం వక్తు మిచ్ఛసి,

గుణదోషౌ న పృచ్ఛామి క్షమం చాత్మని రాక్షస!. ౧౫

మయోక్తం తవ చైతావ త్సంప్ర త్యమితవిక్రమ!,

అస్మిం స్తు త్వం మహాకృత్యే సాహాయ్యం కర్తు మర్హసి. ౧౬
శృణు తత్కర్మ సాహాయ్యే యత్కార్యం వచనా న్మమ,

సౌవర్ణ స్త్వం మృగో భూత్వా చిత్రో రజతబిన్దుభిః. ౧౭
ఆశ్రమే తస్య రామస్య సీతాయాః ప్రముఖే చర,

అట్లు మంత్రి రాజునకు హితంబుఁ జెప్పుటలోను రాజునకు విరుద్ధము గాకుండను మృదువుగను వినయసహితంబుగను మంచిమాటలుగనుం జెప్పవలయును. ౧౦

మారీచుఁడా! తిరస్కారముతోఁ జెప్పఁబడునేని యది హితవాక్యమయినను సమ్మానరహితమగుటచే రాజు సమ్మానయోగ్యుఁడు కావున దాని నంగీకరింపఁడు. ౧౧

అమితప్రతాపులగు రాజులు అగ్ని ఇంద్రుఁడు చంద్రుఁడు వరుణుఁడు యముఁడు ఈయయిదుగురి రూపంబులను దాల్చియుందురు. ౧౨

మారీచుఁడా! మహాత్ములగు రాజులు అట్లు అగ్నిదేవుని వేఁడిమిని ఇంద్రుని పరాక్రమంబును జంద్రుని చల్లఁదనంబును వరుణుని ప్రసన్నతను యముని శిక్షాశక్తిని దాల్చియుందురు. ౧౩

అందువలన రాజులను సర్వావస్థలయందును గౌరవింపుచుఁ బూజింపుచు నుండవలయును.

నీవు రాజధర్మంబుఁ దెలియనివాఁడ వగుటచే నజ్ఞానంబున నిట్లు దౌష్ట్యంబు వహించి నీయింటికి వచ్చిన సకలరాక్షసరాజును నన్నుఁ జూచి పరుషంబు లాడఁబూనితివి. ౧౪

మారీచుఁడా! ఇప్పు డీవిషయమునందు గుణదోషంబులనుగాని యుక్తాయుక్తంబులను గాని నేను నిన్నడుగలేదు. ౧౫

కొలఁదిలేనిపరాక్రమంబుగల మారీచుఁడా! నీకు నేను జెప్పినకార్యమింతమాత్రము. దాని నీవు చేయవలసినదేకాని బదులుచెప్పఁగూడదు.

ఇమ్మహాకార్యంబునందు నీవు సాహాయ్యంబు సేయవలయును. ౧౬

సాహాయ్యము సేయుటయందు నీవు నామాటప్రకారము నాకేమి చేయవలయునో దానిం జెప్పెదను వినుము.

నీవు వెండిచుక్కలచేఁ జిత్రితమయిన బంగారుజింకరూపు దాల్చి యారాముని యాశ్రమంబునకుఁబోయి సీతయెదుటం దిరుగుము. ౧౭

ప్రలోభయిత్వా వైదేహీం యథేష్టం గన్తుమర్హసి. ౧౮

తాం తు మాయామయం మృగం దృష్ట్వా కాఞ్చనం జాతవిస్మయా,
ఆనయైన మితి క్షిప్రం రామం వక్ష్యతి మైథిలీ. ౧౯
అపక్రాన్తే తు కాకుత్స్థే దూరం యాత్వా వ్యుదాహర,
హా సీతే! లక్ష్మణే త్యేవం రామవాక్యానురూపకమ్. ౨౦

తచ్ఛ్రుత్వా రామపదవీం సీతయా చ ప్రచోదితః,
అనుగచ్ఛతి సంభ్రాన్తః సౌమిత్రి రపి సౌహృదాత్. ౨౧

అపక్రాన్తే చ కాకుత్స్థే లక్ష్మణే చ యథాసుఖమ్,
ఆనయిష్యామి వైదేహీం సహస్రాక్షః శ్శచీమివ. ౨౨
ఏవం కృత్వా త్విదం కార్యం యథేష్టం గచ్ఛ రాక్షస!,
రాజ్య స్యార్ధం ప్రయచ్ఛామి మారీచ! తవ సువ్రత!. ౨౩
గచ్ఛ సౌమ్య! శివం మార్గం కార్య స్యాస్య వివృద్ధయే,
అహం త్వాఽనుగమిష్యామి సరథో దణ్డకావనమ్. ౨౪

ప్రాప్య సీతా మయుద్ధేన వఞ్చయిత్వా తు రాఘవమ్,
లఙ్కాం ప్రతిగమిష్యామి కృతకార్య స్సహ త్వయా. ౨౫
న చే త్కరోషి మారీచ! హన్మి త్వా మహ మద్య వై,
ఏత త్కార్య మవశ్యం మే బలా దపి కరిష్యసి. ౨౬
రాజ్ఞో హి ప్రతికూలస్థో న జాతు సుఖ మేధతే
ఆసాద్య తం జీవితసంశయ స్తే
మృత్యు ర్ధ్రువో హ్యద్య మయా విరుధ్య,

అట్లు సీతకు మృగరూపధారివగు నీపై ఆశగల్గునట్లుచేసి యథేచ్ఛం బొమ్ము. ౧౮

బంగారుమాయజింకరూపుదాల్చియున్న నిన్నుఁ జూచినంతనే సీత యాశ్చర్యపడి యాజింకను దెచ్చియిమ్మని రాము నడుగంగలదు. ౧౯

రాముఁడు నిన్నుఁ బట్టుటకు సీతాలక్ష్మణులను వదలివచ్చినపిమ్మట నీవు దూరముగాఁ బోయి రాముఁడు చెప్పినట్లుగా "అయ్యో! సీతా! లక్ష్మణా!" అని యఱవుము. ౨౦

లక్ష్మణుఁడును ఆమాటను విన్నంతనె యేమియుం దోఁచక యన్నపై స్నేహమువలనను సీతప్రేరణవలనను రాముఁడు పోయినమార్గంబుఁ బట్టి పోవును. ౨౧

అట్లు రాముఁడును లక్ష్మణుఁడును ఆవలికిం బోయినపిమ్మట నేను ఇంద్రుఁడు శచీదేవినింబోలె సుఖంబున సీతం దెచ్చెదను. ౨౨

మంచివ్రతములుగల మారీచుఁడా! నీ వింతమాత్రము చేసి నీయిచ్చకు వచ్చినచోటికిం బొమ్ము. నీకు నారాజ్యంబులో సగ మిచ్చెదను. ౨౩

సౌమ్యుఁడవగు మారీచుఁడా! ఈకార్యం బభివృద్ధినొందుటకొఱకు సుందరంబగు మృగరూపంబు నొంది దండకారణ్యంబునకుఁ బొమ్ము. నేను రథారూఢుఁడనై నీవెంటవచ్చెదను. ౨౪

ఈప్రకారమున రాముని వంచించి యుద్ధంబుసేయవలసినది లేకయే సీత నపహరించుకొని కృతార్థుఁడనై నీతోఁగూడ లంకకుం బోయెదను. ౨౫

మారీచుఁడా! నీ వీకార్యము సేయవేని నే నిప్పుడే నిన్ను వధింతును. అవశ్యముగా బలాత్కారంబుననైనను నీచేత నీకార్యముఁ జేయింతును. ౨౬

రాజునకుఁ బ్రతికూలముగా నుండువాని కెప్పటికిని సుఖముగలుగదు.

నీవు ఆరామునియొద్దకుఁ బోవుదువేని మరణంబు గలుగుట సందేహము. ఒకవేళఁ దప్పినను దప్పవచ్చును. నాతో విరోధింతువేని యిప్పుడే

ఏత ద్యథావ త్ప్రతిగృహ్య బుద్ధ్యా
యు [illegible] వమ్. ౨౭

ఇతి శ్రీమదరణ్యకాణ్డే చత్వారింశ స్సర్గః. ౪౦.

---

## ఏకచత్వారింశ స్సర్గః.

ఆజ్ఞప్తో రాజవ ద్వాక్యం ప్రతికూలం నిశాచరః,
అబ్రవీ త్పరుషం వాక్యం మారీచో రాక్షసాధిపమ్. ౧

కేనాయ ముపదిష్ట స్తే వినాశః పాపకర్మణా,
సపుత్త్రస్య సరాష్ట్రస్య సామాత్యస్య నిశాచర!. ౨

క స్త్వయా సుఖినా రాజ న్నాభినన్దతి పాపకృత్,
కేనేద ముపదిష్టం తే మృత్యుద్వార ముపాయతః. ౩

శత్రవ స్తవ సువ్యక్తం హీనవీర్యా నిశాచరాః,
ఇచ్ఛన్తి త్వాం వినశ్యన్త ముపరుద్ధం బలీయసా. ౪
కేనేద ముపదిష్టం తే క్షుద్రేణాహితవాదినా,
య స్త్వా మిచ్ఛతి నశ్యన్తం స్వకృతేన నిశాచర!. ౫
వధ్యాః ఖలు న హన్యన్తే సచివా స్తవ రావణ!,
యే త్వా ముత్పథ మారూఢం న నిగృహ్ణన్తి సర్వశః. ౬

అమాత్యైః కామవృత్తో హి రాజా కాపథ మాశ్రితః,
నిగ్రాహ్య స్సర్వథా సద్భి ర్న నిగ్రాహ్యో నిగృహ్యసే. ౭

ధర్మ మర్థం చ కామం చ యశ శ్చ జయతాం వర!,
స్వామిప్రసాదా త్సచివాః ప్రాప్నువన్తి నిశాచర!. ౮

మరణంబు గల్గును. ఇది నిశ్చితము. నీ వీరెంటిని జక్కఁగా నాలోచించి నీకేదిహితమో దానిఁగావింపుము. అని రావణుఁడు మారీచునితోఁ జెప్పెను.

ఇది నలువదియవసర్గము.

---

## నలుబదియొకటవసర్గము.

రావణుఁడు తనయధికార మేర్పడ "నీయిష్టముసకుఁ బ్రతికూలమయినను నీ వీకార్యముఁ జేయవలయును" అని యాజ్ఞాపింప మారీచుఁడు రాక్షసరాజుఁడగు రావణుం జూచి యిట్లని పరుషవాక్యంబునుం బలికెను. ౧

నీకును నీకొడుకులకును నీరాజ్యంబునకును నీమంత్రులకును అందఱకును వినాశంబు గలిగించునట్టి యీయుపాయమును నీ కే పాపాత్ముఁ డుపదేశించెను. ౨

రాక్షసరాజుఁడవగు రావణుఁడా! నీవు సుఖంబున నుండుట నేపాపాత్ముఁడు చూడఁజాలకున్నాఁడు? మృత్యుద్వారతుల్యంబగు నీకార్యమును నీకెవ్వఁ డుపదేశించెను?. ౩

పరాక్రమహీనులగు రాక్షసులు నీశత్రువులు సందేహములేదు. నీవు బలిష్ఠుఁడగు రామునిచేతం జిక్కి నాశంబునొందవలెనని కోరెదరు. ౪

రావణుఁడా! క్షుద్రుఁడగు నెవ్వఁడు నీనాశంబుఁ గోరి నీ కీయహితం బుపదేశించెను? ౫

రావణుఁడా! ఈమంత్రు లెవ్వరును ఇట్లు దుర్మార్గప్రవృత్తుఁడగునిన్ను నిగ్రహింపకున్నారు. కావున వారలందఱు వధ్యులు. వారల నేల వధింపకున్నావు? ౬

రాజు ఇచ్ఛకు వచ్చినట్లు దుర్మార్గంబు నొందునేని సత్పురుషు లగుమంత్రులతని నన్నివిధంబుల నిగ్రహింపవలయును. నిన్నేల నిగ్రహింపకున్నారు. ౭

జయించువారలలో నుత్తముఁడ వగురావణుఁడా! రాజు నిర్దోషుఁడై యుండునేని మంత్రులకు ధర్మకామంబులును గీర్తియుఁ గల్గును. ౮

విపర్యయే తు త త్సర్వం వ్యర్థం భవతి రావణ!,
వ్యసనం స్వామివైగుణ్యా త్ప్రాప్నువ న్తీతరే జనాః. ౯
రాజమూలో హి ధర్మ శ్చ జయ శ్చ జయతాంవర!,
తస్మా త్సర్వా స్వవస్థాసు రక్షితవ్యో నరాధిపః. ౧౦

రాజ్యం పాలయితుం శక్యం న తీక్ష్ణేన నిశాచర!,
న చాపి ప్రతికూలేన నావినీతేన రాక్షస!. ౧౧

యే తీక్ష్ణమన్త్రా స్సచివా భజ్య న్తే సహ తేన వై,
విషమే తురగా శ్శీఘ్రా మన్దసారథయో యథా. ౧౨

బహవ స్సాధవో లోకే యుక్తా ధర్మ మనుష్ఠితాః,
పరేషా మపరాధేన వినష్టా స్సపరిచ్ఛదాః. ౧౩

స్వామినా ప్రతికూలేన ప్రజా స్తీక్ష్ణేన రావణ!,
రక్ష్యమాణా న వర్ధన్తే మేషా గోమాయునా యథా. ౧౪

అవశ్యం వినశిష్య న్తి సర్వే రావణ! రాక్షసాః,
యేషాం త్వం కర్కశో రాజా దుర్బుద్ధి రజితేన్ద్రియః. ౧౫
త దిదం కాకతాలీయం ఘోర మాసాదితం మయా,
అత్రైవ శోచనీయ స్త్వం ససైన్యో వినశిష్యసి. ౧౬

రావణుఁడా! రాజు దుర్గుణుఁడగునేని మంత్రులకే ప్రయోజనమును లేదు. ఇతరజనులుగూడ మిక్కిలియుఁ గష్టంబు నొందుదురు. ౯

జయించువారలలో నుత్తముఁడ వగురావణుఁడా! ధర్మమునకును జయమునకును రాజే కారణము. కావున సర్వావస్థలయందును రాజులను రక్షింపవలయును. ౧౦

రావణుఁడా! క్రూరుఁడగువాఁడుగాని ప్రజలకుఁ బ్రతికూలుఁడగువాఁడుగాని యింద్రియనిగ్రహంబు లేనివాఁడుగాని రాజ్యంబు నెంతమాత్రము పాలింపఁజాలఁడు. ౧౧

చేతఁగాని సారథిగలగుఱ్ఱములు మిట్టపల్లముగానుండు ప్రదేశమునం దతివేగముగాఁ బోయి సారథితోఁగూడఁ గూలునట్లు అపాయకరములగు నాలోచనలు చెప్పునట్టి మంత్రులు యసమర్థుఁడగుటచేఁ దమమాటలు విను రాజుతోఁ గూడ నాశము నొందుదురు. ౧౨

లోకమునందు నీతిమార్గవర్తులును ధర్మానుష్ఠానంబు తప్పక గావించు వారలునగు సత్పురుషులు పెక్కండ్రు ఇతరుల నమ్మి వారలుగావించిన యపరాధంబువలనఁ బరివారసమేతంబుగా నాశంబు నొందియున్నారు. ౧౩

మేఁకలను బెదికి తినునట్టి నక్కచే రక్షింపఁబడు మేఁకలు క్షీణించు నట్లు క్రూరుఁడు జనవిరోధియు నగు రాజుచే రక్షింపఁబడుజనులు నానాఁటికి క్షీణింతురు. ౧౪

రావణుఁడా! క్రూరుఁడవు దుర్బుద్ధివింద్రియసుఖలోలుఁడవునగు నీవు రాక్షసరాజుగా నుండుటచే రాక్షసులందఱు తప్పక నాశంబునొందఁగలరు.

నేను దైవికముగా భయంకరంబగు నీయాపదం బొందితిని నేనుగావలెనని దెచ్చుకొనలేదు గావునను నాకొక్కనికే నాశముగలుగుటవలనను నన్నుగుఱించి దుఃఖింపవలసినదిలేదు. నీవు బుద్ధిపూర్వకముగాఁ దెచ్చుకొన్నవాఁడవు. మఱియు నీ వొక్కఁడవే కాదు పుత్రభ్రాతృబంధుసమేతంబుగా నాశంబు నొందెదవు కావున నిన్నుఁజూచియే దుఃఖింపవలసియున్నది.

మాం నిహత్య తు రామ శ్చ నచిరా త్త్వాం వధిష్యతి,
అనేన కృతకృత్యోఽస్మి మ్రియే య దరిణా హతః. ౧౮

దర్శనా దేవ రామస్య హతం మా మవధారయ,
ఆత్మానం చ హతం విద్ధి హృత్వా సీతాం సబాన్ధవమ్. ౧౯

ఆనయిష్యసి చే త్సీతా మాశ్రమా త్సహితో మయా,
నైవ త్వ మసి నాహం చ నైవలఙ్కా న రాక్షసాః. ౧౯

నివార్యమాణ స్తు మయా హితైషిణా
న మృష్యసే వాక్యమిదం నిశాచర!,
పరేతకల్పా హి గతాయుషో నరా
హితం న గృహ్ణన్తి సుహృద్భి రీరితమ్. ౨౦

ఇతి శ్రీమదరణ్యకాణ్డే ఏకచత్వారింశ స్సర్గః. ౪౧.

---

## ద్వి చ త్వా రిం శ స్స ర్గః.

ఏవ ముక్త్వా తు పరుషం మారీచో రావణం తతః,
గచ్ఛావే త్యబ్రవీ ద్దీనో భయా ద్రాత్రిఞ్చరప్రభోః. ౧

దృష్ట శ్చాహం పున స్తేన శరచాపాసిధారిణా,
మద్విధోద్యతశస్త్రేణ వినష్టం జీవితం చ మే. ౨

న హి రామం పరాక్రమ్య జీవ న్ప్రతినివర్తతే,
వర్తతే ప్రతిరూపోఽసౌ యమదణ్డహతస్య తే. ౩

రాముఁడు నన్ను వధించినపిమ్మట శీఘ్రంబుగనే నిన్నును వధించును. నిన్ను వధించునట్టి రామునిచేతఁ జావుఁబొందుటవలనఁ గృతార్థుఁడ నయ్యెదను. (లేక) నీచే నిప్పుడు చచ్చుటకన్న రామునిచేఁ జచ్చుటవలనఁ గృతార్థుఁడ నగుదును. ౧౭

రామునిం జూచినంతనే నేను హతుఁడ నయ్యెదనని నిశ్చయించుకొనుము. సీతాదేవి నపహరించినంతనే నీవు బంధుసమేతంబుగా హతుఁడవౌదు వని తలంపుము. ౧౮

నీవును నేనును రామునియాశ్రమంబుననుండి సీతాదేవిం దెత్తుమేని యింక నీవును జీవించియుండఁ బోవునదిలేదు. నేనును లేను. రాక్షసులును జీవించియుండఁబోరు. లంకయు నాశంబునొందకమానదు. ౧౯

రావణుఁడా! నేను నీమేలుఁగోరి వలదని యెంతదూరముచెప్పినను నామాటను వినకున్నావు. ఆయుస్సంతయుఁ గడచినపిమ్మట మరణం బతిసమీపంబున నుండునప్పుడు మనుష్యులు స్నేహితులుచెప్పెడు హితోక్తుల నాలకింపరు. అని మారీచుఁడు రావణునితోఁ జెప్పెను. ౨౦

ఇది నలువదియొకటవసర్గము.

---

## నలువదిరెండవసర్గము.

అంత మారీచుఁడు రావణునితో నీప్రకారంబునం జెప్పి యంత రాక్షసరాజుఁడగు రావణునకు భయపడి దుఃఖితుఁడై పోయెదమని చెప్పెను. ౧

నేను ధనుర్బాణంబులు దాల్చి నన్నువధింపంబూనియున్న రామునియెదుటం బడవలసినదంతే. రాముఁడు బాణము వేయవలసినదిగూడ నక్కఱలేదు. మృతుఁడ నగుదును. ౨

రామునియెదుటఁ బరాక్రమంబుఁజూపి యెట్టివాఁడునుమఱలి బ్రతికి రాలేఁడు. నీవొక్కఁడవు యమదండహతుఁడవై చావనున్నవాఁడవు. నీవలె నేనొకఁడ నున్నాను: ౩

కిం ను శక్యం మయా కర్తు మేవం త్వయి దురాత్మని,
ఏష గచ్ఛా మ్యహం తాత! స్వస్తి తేఽస్తు నిశాచర!. ౪

ప్రహృష్ట స్త్వభవ త్తేన వచనేన స రావణః,
పరిష్వజ్య సుసంశ్లిష్ట మిదం వచన మబ్రవీత్. ౫
ఏత చ్ఛౌణ్డీర్యయుక్తం తే మచ్ఛన్దా దివ భాషితమ్,
ఇదానీ మసి మారీచః పూర్వ మన్యో నిశాచరః. ౬

ఆరుహ్యతా మయం శీఘ్రం రథో రత్నవిభూషితః,
మయా సహ తథా యుక్తః పిశాచవదనైః ఖరైః. ౭
ప్రలోభయిత్వా వైదేహీం యథేష్టం గన్తు మర్హసి,
తాం శూన్యే ప్రసభం సీతా మానయిష్యామి మైథిలీమ్. ౮

తతో రావణమారీచౌ విమాన మివ తం రథమ్,
ఆరుహ్య యయతు శ్శీఘ్రం తస్మా దాశ్రమమణ్డలాత్. ౯
తథైవ తత్ర పశ్యన్తౌ పత్తనాని వనాని చ,
గిరీం శ్చ సరిత స్సర్వా రాష్ట్రాణి నగరాణి చ. ౧౦

సమేత్య దణ్డకారణ్యం రాఘవ స్యాశ్రమం తతః,
దదర్శ సహమారీచో రావణో రాక్షసాధిపః. ౧౧
అవతీర్య రథా త్తస్మా త్తతః కాఞ్చనభూషణాత్,
హస్తే గృహీత్వా మారీచం రావణో వాక్య మబ్రవీత్. ౧౨
ఏత ద్రామాశ్రమపదం దృశ్యతే కదళీవృతమ్,
క్రియతాం త త్సఖే! శీఘ్రం యదర్థం వయ మాగతాః. ౧౩

నీ విట్లు దుర్బుద్ధిగలిగియుండఁగా నేనేమిచేయఁగలను? ఇదిగో నేను బోవుచున్నాను. నీకు మంగళముగలుగుఁగాక. అని మారీచుఁడు రావణునితోఁ జెప్పెను. ౪

ఆరావణుఁడు మారీచుఁడు చెప్పినమాటకుఁ బరమసంతుష్టుఁడై యతని గాఢంబుగాఁ గవుఁగిలించుకొని యీమాటం జెప్పెను. ౫

నాయిచ్ఛననుసరించి చెప్పినట్లు చెప్పినావుగాని యిదియె నీవుగాఁ జెప్పినమాట. ఇప్పుడు నీవు మారీచుఁడవు. ఇంతకుమున్ను వేఱొకరాక్షసుఁడవుగా నుంటివి. ౬

నానావిధరత్నాలంకృతంబును పిశాచముఖంబులగు ఖరంబులఁ బూన్చి నదియు నగు నీరథమును శీఘ్రంబున నాతోఁగూడ నారోహింపుము. ౭

నీవు సీతను మోసపుచ్చి యంత యథేచ్ఛంజనుము. నేను రామలక్ష్మణు లిద్దఱు లేనప్పుడు సీతం దీసికొనివచ్చెదను. అని రావణుఁడు మారీచునితోఁ జెప్పెను. ౮

అంత రావణమారీచులు విమానంబువంటి యారథము నారోహించియ య్యాశ్రమపదంబుననుండి శీఘ్రంబునం బోయిరి. ౯

ఆరావణమారీచులు అట్లు రథగతులయి పట్టణంబులను వనంబులను బర్వతంబులను నదులను రాజ్యంబులను జిన్నపత్తనంబులనుం జూచుచుఁ బోయిరి. ౧౦

అంత రాక్షసరాజుఁడగు రావణుఁడును మారీచుఁడును అట్లు దండకారణ్యంబునకు వచ్చి రామునియాశ్రమంబుఁ జూచిరి. ౧౧

అంత రావణుఁడు కాంచనాలంకృతంబగు నారథంబుననుండి డిగ్గి మారీచునిచేయిఁ బట్టుకొని యిట్లని చెప్పెను. ౧౨

చెలికాఁడా! అరఁటిచెట్లచేనావృతమయి యిదిగో రామాశ్రమమున్నది చూడుము. ఇంక మన మెందుకు వచ్చినామో ఆపనిని శీఘ్రముగా నారంభింపుము. అని రావణుఁడు మారీచునితోఁ జెప్పెను. ౧౩

స రావణవచ శ్శ్రుత్వా మారీచో రాక్షస స్తదా,
మృగో భూత్వాఽఽశ్రమద్వారి రామస్య విచచార హ. ౧౪
స తు రూపం సమాస్థాయ మహ దద్భుతదర్శనమ్,
మణిప్రవరశృఙ్గాగ్ర స్సితాసితముఖాకృతిః. ౧౫

రక్తపద్మోత్పలముఖ ఇన్ద్రనీలోత్పలశ్రవాః,
కిఞ్చిదభ్యున్నతగ్రీవ ఇన్ద్రనీలదళాధరః. ౧౬

కున్దేన్దువజ్రసఙ్కాశ ముదరం చాస్య భాస్వరమ్,

మధూకనిభపార్శ్వ శ్చ పద్మకిఞ్జల్కసన్నిభః.
వైడూర్యసఙ్కాశఖుర స్తనుజఙ్ఘ స్సుసంహతః,

ఇన్ద్రాయుధసవర్ణేన పుచ్ఛేనోర్ధ్వం విరాజతా. ౧౭

మనోహరస్నిగ్ధవర్ణో రత్నై ర్నానావిధై ర్వృతః,

క్షణేన రాక్షసో జాతో మృగః పరమశోభనః. ౧౮
వనం ప్రజ్వలయన్ రమ్యం రామాశ్రమపదం చ తత్,

మనోహరం దర్శనీయం రూపం కృత్వా స రాక్షసః. ౨౦
ప్రలోభనార్థం వైదేహ్యా నానాధాతువిచిత్రితమ్,
విచర న్గచ్ఛతే తస్మా చ్ఛాద్వలాని సమన్తతః. ౨౧
రూప్యై ర్బిన్దుశతై శ్చిత్రో భూత్వా స ప్రియదర్శనః,

అప్పుడు అమ్మారీచుఁడు రావణుఁడు చెప్పినమాటను విని జింకరూపు దాల్చి రామాశ్రమద్వారంబున సంచరింపుచుండెను. ౧౪

ఆమారీచుఁడు చూపరులకు మిక్కిలియు నాశ్చర్యముగలిగించునట్టి మృగరూపంబు దాల్చి ఇంద్రనీలంబులవంటి శృంగాగ్రంబులను గొంతభాగము తెల్లనిదియుఁ గొంతభాగము నల్లనిదియు నగుముఖంబును ధరించెను. ౧౫

మృగరూపధరుఁడగు నమ్మారీచుఁడు పైభాగమున నెఱ్ఱఁదామరపూవువలెను క్రిందిభాగమున నల్లకలువలువలె నున్ననోరును ఇంద్రనీలమణిప్రభంబులగు నల్లకలువలవంటి చెవులును గొంచెమున్నతమయినకంఠమును ఇంద్రనీలమణిపలుకువలెనుండు పెదవియుం గలిగియుండెను. ౧౬

ఈమారీచుని కడుపుమొల్లలు చంద్రబింబము వజ్రము వీనివలెఁ దెల్లఁగా నెంతయుఁ బ్రకాశించుచుండినది.

అతనిపార్శ్వ మొకటియిప్పపువ్వువన్నెగలదిగాను ఇతరావయవములన్నియుఁ గమలకేసరవర్ణములుగాను గిట్టలు వైడూర్యమణివర్ణంబులుగాను పిక్కలు సన్నవిగాను సంధిబంధంబులు సుదృఢంబులుగాను నుండినవి. ౧౭

అమ్మారీచునితోఁక ఇంద్రధనుస్సువన్నెగలిగి యూర్ధ్వముఖంబయి యెంతయుఁ బ్రకాశించుచుండినది. ౧౮

అమ్మారీచుఁడు మనోహరాకారుఁడై నానావిధరత్నాలంకృతుఁడై యొప్పియుండెను.

అట్లు మారీచుఁడు రమణీయంబగువనంబును రామునియాశ్రమంబును బ్రకాశింపఁజేయుచు క్షణమాత్రంబునఁ బరమసుందరం బగుమృగరూపంబు ధరియించెను. ౧౯

ఆమారీచుఁ డట్లు రమణీయంబును నానావర్ణంబులచే విచిత్రంబునగు రూపంబుదాల్చి సీతాదేవిని మోసపుచ్చుటకై పచ్చికలు మేయుచు లీలమెయిం బోయెను. ౨౦,౨౧

అమ్మారీచుఁడు వెండిచుక్కలు గలుగుటచేఁ జిత్రవర్ణుఁడై చూపరుల

విటపీనాం కిసలయా న్భఙ్క్త్వాఽథ విచచార హ. ౨౨
కదలీగృహకం గత్వా కర్ణికారా నితస్తతః,
సమాశ్రయ న్మన్దగతి స్సీతాసందర్శనం తథా. ౨౩

రాజీవచిత్రపృష్ఠ స్స విరరాజ మహామృగః,
రామాశ్రమపదాభ్యాశే విచచార యథాసుఖమ్. ౨౪

పున ర్గత్వా నివృత్తశ్చ విచచార మృగోత్తమః,
గత్వా ముహూర్తం త్వరయా పునః ప్రతినివర్తతే. ౨౫

విక్రీడంశ్చ క్వచి ద్భూమౌ పున రేవ నిషీదతి,
ఆశ్రమద్వార మాగమ్య మృగయూథాని గచ్ఛతి. ౨౬

మృగయూథై రనుగతః పున రేవ నివర్తతే
సీతాదర్శన మాకాఙ్క్షన్ రాక్షసో మృగతాం గతః. ౨౭

పరిభ్రమతి చిత్రాణి మణ్డలాని వినిష్పతన్,
సముద్వీక్ష్య చ తం సర్వే మృగా హ్యన్యే వనేచరాః. ౨౮
ఉపాగమ్య సమాఘ్రాయ విద్రవన్తి దిశో దశ,

రాక్షస స్సోఽపి తా న్వన్యా న్మృగా న్మృగవధే రతః. ౨౯
ప్రచ్ఛాదనార్థం భావస్య న భక్షయతి సంస్పృశన్,

తస్మి న్నేవ తతః కాలే వైదేహీ శుభలోచనా. ౩౦
కుసుమాపచయవ్యగ్రా పాదపా నభ్యవర్తత,

కానందంబు గలిగించుచు వృక్షంబులచిగుళ్లంగొఱికి దినుచు సంచరించెను. ౨౨

ఆమారీచుఁడు గృహాకారంబుగానుండు కదళీవృక్షంబులను గొండ గోఁగుచెట్లను దాఁటిపోయి ఎచ్చట సీతఁజూడ నవకాశముగలుగునో ఆస్థలముంజేరి యచ్చటచ్చట సంచరించుచుండెను. ౨౩

అట్టి మృగరూపముదాల్చిన యమ్మారీచుఁడు కమలకేసరవర్ణమయిన యాశ్చర్యకరమగు పృష్ఠభాగంబుతోఁ దేజరిల్లుచు రామాశ్రమపదసమీపంబున సుఖముగా విహరించుచుండెను. ౨౪

అమ్మృగోత్తమరూపధరుఁడగు మారీచుఁడు మఱల నాప్రదేశమునుండి యావలికిఁబోయి మఱల వచ్చి విహరించుచు మఱలఁ గొంతసేపు ఆవలికిఁ బోయి మఱలి వచ్చుచు నిట్లు నానావిధంబున సంచరించుచుండెను. ౨౫

ఆమారీచుఁడు అట్లు క్రీడించుచుండి యొకచోటఁ గొంతసేపు నేలపైఁ గూర్చుండును. అంత నాశ్రమద్వారంబునకుఁ బోయి యచ్చట నుండుమృగయూథంబులఁ జేరఁజూచును. ౨౬

మృగరూపుఁడై సీతాదర్శనంబుఁగోరుచున్న యామారీచుఁడు మృగసమూహంబులు తనయొద్దకుఁ జేరవచ్చుటం జూచి మఱలి దూరంబునకుఁ బోవును. ౨౭

అట్లు నానావిధంబులుగ మండలాకారగమనంబులు సేయుచుండును.

అడవియందుండునట్టి యితరమృగంబులన్నియు విచిత్రమృగరూపధరుఁడగు నమ్మారీచుం జూచి సమీపమునకుం బోయి యాఘ్రాణించి దమ్ము భక్షించు రాక్షసుఁడని తెలిసికొని భయంబున దశదిశలకుం బాఱినవి. ౨౮

మృగంబులం జంపి భక్షించుటె స్వభావముగాఁగల యారాక్షసుఁడును తన యథార్థస్వభావము బయలుపడకుండుటకై యావన్యమృగంబులను స్పృశించియు భక్షింపఁడయ్యె. ౨౯

అంత నాకాలమునందె మంగళకరంబులగు కన్నులుగల సీతాదేవి పూలుగోయఁగోరి యావృక్షంబులయొద్దకు వచ్చెను. ౩౦

కర్ణికారా నశోకాం శ్చ చూతాం శ్చ మదిరేక్షణా. ౩౧
కుసుమా న్యపచిన్వన్తీ చచార రుచిరాననా,

అనర్హాఽరణ్యవాసస్య సా తం రత్నమయం మృగమ్. ౩౨
ముక్తామణివిచిత్రాఙ్గం దదర్శ పరమాఙ్గనా,

సా తం రుచిరదన్తోష్ఠీ రూప్యధాతుతనూరుహమ్. ౩౩
విస్మయోత్ఫుల్లనయనా సస్నేహం సముదైక్షత,

స చ తాం రామదయితాం పశ్య న్మాయామయో మృగః.
విచచార పున శ్చిత్రం దీపయ న్నివ తద్వనమ్,

అదృష్టపూర్వం తం దృష్ట్వా నానారత్నమయం మృగమ్. ౩౪
విస్మయం పరమం సీతా జగామ జనకాత్మజా.

ఇతి శ్రీమదరణ్యకాణ్డే ద్వాచత్వారింశ స్సర్గః. ౪౨.

---

## త్రిచత్వారింశ స్సర్గః.

సా తం సమ్ప్రేక్ష్య సుశ్రోణీ కుసుమా న్యపచిన్వతీ,
హైమరాజతవర్ణాభ్యాం పార్శ్వాభ్యా ముపశోభితమ్. ౧
ప్రహృష్టా చానవద్యాఙ్గీ మృష్టహాటకవర్ణినీ,
భర్తార మభిచక్రన్ద లక్ష్మణం చాపి సాయుధమ్. ౨

తయాఽఽహూతౌ నరవ్యాఘ్రౌ వైదేహ్యా రామలక్ష్మణౌ,
వీక్షమాణౌ తు తం దేశం తదా దదృశతు ర్మృగమ్. ౩

మదముగప్పిన కన్నులుగలదియు సుందరంబగు మొగముగలదియునగు సీతాదేవి పూలఁగోయుచుఁ గొండగోఁగుచెట్లు అశోకవృక్షంబులు మామిడి చెట్లు మొదలగు వృక్షంబులఁ యొద్దకుఁ బోయెను. 30

అడవిలో నివసించుటకుఁ దగనిదియు నుత్తమస్త్రీయు నగు నాసీతాదేవి ఉత్తమంబును మంచిముత్తెములు రత్నములునుంబోలె నుండుబిందువులచే నలంకృతమయిన దేహముగలదియు నగు నామృగముం జూచెను. 32

సుందరములగు దంతములును బెదవులును గల యాసీతాదేవి యాశ్చర్యంబున వికసించిననేత్రంబులతో వెండివలెను గైరికధాతువులువలెను నుండు వెండ్రుకలతో నొప్పుచున్న యాజింకను స్నేహంబునం జూచెను.

అమ్మాయామృగంబు రామభార్యయగు సీతాదేవి వచ్చుటం జూచి మఱియు నాశ్చర్యకరంబుగా నవ్వనంబుఁ బ్రకాశింపం జేయుచు విహరించెను. 34

జనకమహారాజపుత్రియగు సీతాదేవి మున్నెప్పుడును జూడనట్టి లోకోత్తరమయిన నానారత్నములవంటి బిందువులు గల యామాయామృగముంజూచి పరమాశ్చర్యంబు నొందెను. 35

ఇది నలువదిరెండవసర్గము.

---

## నలువదిమూఁడవసర్గము.

సుందరములయిన పిఱుందులుగలదియు ననింద్యములగు నవయవములుగలదియుఁ బరిశుద్ధమయిన బంగారమువంటి మేనుగలదియు నగు సీతాదేవి ఒకపార్శ్వమునఁ గాంచనవర్ణముగను మఱియొకపార్శ్వమున రజతవర్ణముగను నుండునట్టి యమ్మాయామృగముం జూచి సంతుష్టయయి పెనిమిటియగు రాముని ఆయుధధారియయి యున్నలక్ష్మణునిం బిలిచెను. 1,2

అట్లు ఆసీతాదేవి పిలుచుటవలనఁ బురుషశ్రేష్ఠులగు రామలక్ష్మణులు వచ్చి యాప్రదేశము నలుప్రక్కలం జూచుచు నామాయజింకం గనిరి. 3

శఙ్కమాన స్తు తం దృష్ట్వా లక్ష్మణో రామ మబ్రవీత్,
త మే వైన మహం మన్యే మారీచం రాక్షసం మృగమ్. ४

చరన్తో మృగయాం హృష్టాః పాపే నోపాధినా వనే,
అనేన నిహతా రాజ! న్రాజానః కామరూపిణా. ౫

అస్య మాయావిదో మాయామృగరూప మిదం కృతమ్,
భానుమ త్పురుషవ్యాఘ్ర! గన్ధర్వపురసన్నిభమ్. ౬

మృగో హ్యేవంవిధో రత్నవిచిత్రో నా స్తి రాఘవ!
జగత్యాం జగతీనాథ! మా యైషా హి న సంశయః. ౭

ఏవం బ్రువాణం కాకుత్స్థం ప్రతివార్య శుచిస్మితా,
ఉవాచ సీతా సంహృష్టా చర్మణా హృతచేతనా. ౮

ఆర్యపుత్త్రాభిరామోఽసౌ మృగో హరతి మే మనః,
ఆన యైనం మహాబాహో! క్రీడార్థం నో భవిష్యతి. ౯

ఇహాఽఽశ్రమపదేఽస్మాకం బహవః పుణ్యదర్శనాః,
మృగా శ్చరన్తి సహితా శ్చమరా స్సృమరా స్తథా. ౧౦

ఋక్షాః పృషతసంఘా శ్చ వానరాః కిన్నరా స్తథా,
విచరన్తి మహాబాహో! రూపశ్రేష్ఠా మనోహరాః. ౧౧

న చాస్య సదృశో రాజ! న్దృష్టపూర్వో మృగః పురా,

లక్ష్మణుఁడు మాత్రము ఆమాయామృగముం జూచినంతనే సందేహమునొంది రామంజూచి యిట్లని చెప్పెను.

ఈమృగమే యామారీచుఁడను రాక్షసుఁడని నాకుఁ దోఁచుచున్నది.

రాముఁడా! కామరూపియగు నీమారీచుఁడు పాపిష్ఠంబగు నీమృగరూపమునే ధరించి వనంబునందు సంతోషంబున వేఁటాడవచ్చినరాజులం జంపినాఁడు. ౫

పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! అమ్మారీచుఁడు బహుమాయల నెఱింగినవాఁడు; అతఁడే మాయచేత నీప్రకారంబునఁ గాంతిమంతంబును గంధర్వనగరాకారంబు నగు నీమృగరూపంబుఁ దాల్చినాఁడు. ౬

సమస్తభూమండలాధీశ్వరుఁడ వగురాముఁడా! ఇట్టి రత్నాకారబిందువులతో నలంకృతమయినమృగము ప్రపంచంబునం దెచ్చటనులేదు. కావున నిది మాయయే. సందియములేదు. అని లక్ష్మణుఁడు రామునితోఁ జెప్పెను. ౭

స్వచ్ఛమయిన చిఱునగవుగల సీతాదేవి యీప్రకారంబునం జెప్పుచున్న లక్ష్మణు నివారించి ఆమాయామృగచర్మసౌందర్యంబునకు మోహించి సంతుష్టయయి రాముం జూచి యిట్లని చెప్పెను. ౮

మహాబాహుఁడవగు రాముఁడా! ఈమృగంబు మిక్కిలియు సుందరంబుగ నుండుటవలన దీనియందు నామనస్సునకు మిక్కిలియు మక్కువగలిగియున్నది. దీనిం బట్టితెమ్ము. మనము క్రీడార్థ ముంచుకొనవచ్చును. ౯

ఇచ్చట మనయాశ్రమమునందు అతిసుందరంబులగు మృగంబులును సృమరంబులును చమరమృగములును అనేకంబులు గుంపుగుంపుగాఁ దిరుగుచున్నవి. ౧౦

మహాబాహుఁడ వగురాముఁడా! అట్లు సుందరరూపంబులగు నెలుఁగుబంటులును బిందువులతోఁగూడిన జింకలును గోఁతులును గిన్నరమృగంబులును మనయాశ్రమంబునం దిరుగుచున్నవి. ౧౧

రాముఁడా! ఎట్లు ఈమృగంబు రంగును ఓర్పును దేహకాంతియుఁ

[illegible] మయా దృష్ట్వో యథాఽయం మృగసత్తమః. ౧౨

నానావర్ణవిచిత్రాఙ్గో రత్నబిన్దుసమాచితః,
ద్యోతయన్ వనమవ్యగ్రం శోభతే శశిసన్నిభః. ౧౩

అహో రూపం మహో లక్ష్మీః స్వరసంపచ్చ శోభనా,
మృగోఽద్భుతో విచిత్రాఙ్గో హృదయం హరతీవ మే. ౧౪

యది గ్రహణ మభ్యేతి జీవన్నేవ మృగ స్తవ,
ఆశ్చర్యభూతం భవతి విస్మయం జనయిష్యతి. ౧౫
సమాప్తవనవాసానాం రాజ్యస్థానాం చ నః పునః,
అన్తఃపురవిభూషార్థో మృగ ఏష భవిష్యతి. ౧౬
భరతస్యార్యపుత్త్రస్య శ్వశ్రూణాం మమ చ ప్రభో!,
మృగరూప మిదం దివ్యం విస్మయం జనయిష్యతి. ౧౭
జీవన్న యది తేఽభ్యేతి గ్రహణం మృగసత్తమః,
అజినం నరశార్దూల! రుచిరం మే భవిష్యతి. ౧౮

నిహతస్యాస్య సత్త్వస్య జామ్బూనదమయత్వచి,
శష్పబృస్యాం వినీతాయా మిచ్ఛామ్యహ ముపాసితుమ్. ౧౯
కామవృత్త మిదం రౌద్రం స్త్రీణా మసదృశం మతమ్,
వపుషా త్వస్య సత్త్వస్య విస్మయో జనితో మమ. ౨౦

తేన కాఞ్చనరూపేణ మణిప్రవరశృఙ్గిణా,
తరుణాదిత్యవర్ణేన నక్షత్రపథవర్చసా. ౨౧

గలిగియున్నదో అట్లు రంగు ఓర్పు దేహకాంతి కలిగి దీనికి సరియయినయెండు మృగమును ఇదివఱకు మన మెప్పుడును జూచినదిలేదు. ౧౨

విచిత్రములయిన నానావిధంబులగు వర్ణంబులతోను రత్నాకారంబులయిన బిందువులతోను ఒప్పుచున్న యీమృగము చంద్రుఁడుంబోలె నీవనంబంతయుఁ బ్రకాశింపఁజేయుచుఁ దేజరిల్లుచున్నది. ౧౩

ఇదియేమిసౌందర్యము! ఇదియేమికాంతి! దీనికంఠధ్వనియేమి! ఆవయవసంపత్తియేమి! ఆశ్చర్యకరంబును విచిత్రరూపంబు నగు నీమృగంబు నామనస్సు నెంతయు నాకర్షించుచున్నది. ౧౪

ఈమృగంబు ప్రాణముతోనే నీకుఁ బట్టుపడునేని ఇతరులకును మనకును ఆశ్చర్యంబు గలిగించుచు మనయొద్ద నుండఁగలదు. ౧౫

మనము వనవాసవ్రతంబు ముగించుకొని మఱల రాజ్యంబున నుండునప్పుడు ఈమృగంబు మనయంతఃపురంబున కలంకారముగా నుండఁగలదు.

రాముఁడా! ఈమృగంబు అయోధ్యలో భరతునకును నీకును నాయత్తలకును నాకును ఎల్లప్పుడును ఆశ్చర్యంబు గలిగించుచుండఁగలదు. ౧౬

పురుషశ్రేష్ఠుఁడా! ఈమృగశ్రేష్ఠంబు ప్రాణంబుతో నీచేతికిఁ జిక్కదేని దీనిం జంపి తెత్తువేని సుందరంబయిన దీనిచర్మమును నే నుంచుకొందును. ౧౭

ఈమృగమును జంపితెత్తువేని నేను కాంచనమయంబగు దీనిచర్మమును దర్భాసనముపైఁ బఱచుకొని నీతోఁగూడ శయనింపఁగోరెదను. ౧౮

ఇట్లు స్త్రీలు స్వేచ్ఛగా భర్తం బ్రేరేపించుట మిక్కిలియు భయంకరము. ఇది స్త్రీల కెంతమాత్రము తగదు. అయినను ఈమృగము రూపసౌందర్యాదులచేఁ బరవశనై యడుగుచున్నాను. అని సీత రామునితోఁ జెప్పెను. ౨౦

కాంచనవర్ణంబును ఇంద్రనీలములవంటి కొమ్ములుగలదియు బాలసూర్యునికాంతివంటి కాంతిగలదియును దెల్లనిబిందువులు గలుగుటంజేసి నక్షత్ర

బభూవ రాఘవ స్యాపి మనో విస్మయ మాగతమ్,

ఏవం సీతావచ శ్శ్రుత్వా తం దృష్ట్వా మృగ మద్భుతమ్.
లోభిత స్తేన రూపేణ సీతయా చ ప్రచోదితః,
ఉవాచ రాఘవో హృష్టో భ్రాతరం లక్ష్మణం వచః. ౨౩

పశ్య లక్ష్మణ! వైదేహ్యాః స్పృహాంమృగగతా మిమామ్,
రూపశ్రేష్ఠతయా హ్యేష మృగోఽద్య న భవిష్యతి. ౨౪

న వనే నన్దనోద్దేశే న చైత్రరథసంశ్రయే,
కుతః పృథివ్యాం సౌమిత్రే! యోఽస్య కశ్చి త్సమో మృగః.
ప్రతిలోమానులోమా శ్చ రుచిరా రోమరాజయః,
శోభన్తే మృగ మాశ్రిత్య చిత్రాః కనకబిన్దవః. ౨౬

పశ్యాస్య జృమ్భమాణస్య దీప్తా మగ్నిశిఖోపమామ్,
జిహ్వాం ముఖా న్నిస్సరన్తీం మేఘా దివ శతహ్రదామ్. ౨౭

మసారగల్లర్కముఖ శ్శఙ్ఖముక్తానిభోదరః,
కస్య నామాభిరూప్యోఽసౌ న మనో లోభయే న్మృగః. ౨౮

కస్య రూప మిదం దృష్ట్వా జామ్బూనదమయం ప్రభో!,
నానారత్నమయం దివ్యం న మనో విస్మయం వ్రజేత్. ౨౯

మాంసహేతో రపి మృగా న్వినోదార్థం చ ధన్వినః,
ఘ్నన్తి లక్ష్మణ! రాజానో మృగయాయాం మహావనే. ౩౦

గణయుక్తంబగు నాకాశంబు పగిదిఁ దేజరిల్లుచున్నదియు నగు నామృగంబుం జూచి రాముఁడును ఆశ్చర్యంబు నొందెను. ౨౧

రాముఁడు ఇట్లు సీతాదేవి చెప్పినమాటను విని యాశ్చర్యకరంబగు నామృగంబునుం జూచి దానిసౌందర్యంబునకు ఆశనొంది సీతాదేవిచేతను ఆట్లడుగంబడినవాఁడై సంతోషంబునఁ దమ్ముఁడగు లక్ష్మణుం జూచి యిట్లని చెప్పెను. ౨౨,౨౩

లక్ష్మణుఁడా! సీతాదేవికి ఈమృగంబుపై నెంత యాసగలిగియున్నదో చూడుము. ఇంత సౌందర్యము గల మృగమెందును లేదు. కావున నిట్టి మృగంబు ఈవనములో దొరకదు. ౨౪

లక్ష్మణుఁడా! దీనికి సరియైనమృగము నందనవనమునందును చైత్రరథవనమునందును దొరకదు. ఇంక భూమియం దెట్లు దొరకును. ౨౫

ప్రతిలోమములుగాను అనులోమములుగాను నుండువెండ్రుకలు బంగారుబిందువులచేఁ జిత్రితంబులయి మృగశరీరంబున కెంతయుఁ బ్రకాశము గలిగించుచున్నవి. ౨౬

ఈమృగము ఆవలించునప్పుడు దీనినాలుకను నోటనుండివెడలి యగ్నిజ్వాలవలె వెలుంగుచు మేఘంబుననుండి వెడలునట్టి మెఱుపుకైవడి మెఱయుచున్నది చూడుము. ౨౭

ఇంద్రనీలమణిగిన్నెవంటి నోరుగలదియు శంఖములును ముత్తెములునుంబోలెఁ దెల్లనైన కడుపుగలదియు నిట్టిదని నిరూపించి చెప్ప నలవిగానిదియు నగు నీమృగంబుపై నెవ్వని కాశ గలుగదు? ౨౮

సమర్థుఁడవగు లక్ష్మణుఁడా! కాంచనవర్ణంబును నానావిధరత్నాకారబిందువులచే నలంకృతంబును దివ్యంబునగు నీరూపంబుఁజూచి యెవ్వనిమనస్సున కాశ్చర్యంబు గలుగదు? ౨౯

లక్ష్మణుఁడా! రాజులు వనంబున మాంసము సంపాదించుకొఱకును ధనుర్వ్యాహారముకొఱకును వేఁటయందు మృగంబులం జంపుదురు. ౩౦

ధనాని వ్యవసాయేన విచీయన్తే మహావనే,
ధాతవో వివిధాశ్చాపి మణిరత్నసువర్ణినః. ౩౧

తత్సార మఖిలం నౄణాం ధనం నిచయవర్ధనమ్,
మనసా చిన్తితం సర్వం యథా శుక్రస్య లక్ష్మణ!. ౩౨

అర్థీ యే నార్థకృత్యేన సంవ్రజ త్యవిచారయన్,
త మర్థ మర్థశాస్త్రజ్ఞాః ప్రాహు రర్థ్యాశ్చ లక్ష్మణ!. ౩౩

ఏతస్య మృగరత్నస్య పరార్ధ్యే కాఞ్చనత్వచి,
ఉపవేక్ష్యతి వైదేహీ మయా సహ సుమధ్యమా. ౩౪
న కాదలీ న ప్రియకీ న ప్రవేణీ న చావికీ,
భవే దేతస్య సదృశీ స్పర్శనే నేతి మే మతిః. ౩౫
ఏష చైవ మృగ శ్శ్రీమా న్యశ్చ దివ్యో నభశ్చరః,
ఉభా వేతౌ మృగౌ దివ్యౌ తారామృగమహీమృగౌ. ౩౬

యది వాఽయం తథా యన్మాం భవే ద్వదసి లక్ష్మణ!,
మాయైషా రాక్షసస్యేతి కర్తవ్యోఽస్య వధో మయా. ౩౭
ఏతేన హి నృశంసేన మారీచే నాకృతాత్మనా,
వనే విచరతా పూర్వం హింసితా మునిపుఙ్గవాః. ౩౮
ఉత్థాయ బహవో యేన మృగయాయాం జనాధిపాః,
నిహతాః పరమేష్వాసా స్తస్మా ద్వధ్య స్త్వయం మృగః. ౩౯

వనంబున వేఁటాడుటచే రాజులకు అచ్చటచ్చట నిధులందుండు ధనములును మంచిరత్నములును బంగారును గలిగియుండు ధాతుప్రదేశంబులును దొరకును. ౩౧

లక్ష్మణుఁడా! శుక్రుఁడు మనుష్యులు మనస్సున గొంతెమకోర్కెలం గోరుధనమునంతయు అనాయాసముగాఁ గొని తనకోశంబు నిండించుకొనునట్లు రాజులు అడవులయందు నానావిధంబులం బడియున్న యుత్తమమయిన ధనములనంతయు కష్టములేక గ్రహించి తమకోశంబుల నిండించుకొందురు. ౩౨

లక్ష్మణుఁడా! అపూర్వవస్తువుఁ గోరునట్టిపురుషుఁడు ఎంతమాత్రమాలోచింపక దేని సంపాదించుటకై ప్రయత్నించునో అర్థసంపాదనసమర్థులును శాస్త్రముఁ దెలిసినవారలు నగువారలు దానినే అర్థము అనఁగా సంపాదింపఁదగిన వస్తువని చెప్పుదురు. ఈమృగ మట్టిది. ౩౩

మృగశ్రేష్ఠంబగు దీని కాంచనవర్ణమయిన యుత్తమచర్మమునందు సుందరమయిన నడుముగల సీతాదేవి నాతోఁ గూడఁ గూర్చుండఁగలదు. ౩౪

అధికరోమములుగల కదళీమృగముగాని ప్రియకీమృగముగాని ప్రవేణీమృగముగాని అవిమృగముగాని మృదుత్వంబున దీనిసరి కాఁజాలవు. ౩౫

శ్రీమంతంబగు నీమృగంబును ఆకాశంబుననుండునట్టి దివ్యంబగు మృగశీర్షనక్షత్రంబను మృగంబును ఈభూమిమృగమును నక్షత్రమృగమును రెండును ఉత్తమమృగములు. ౩౬

లక్ష్మణుఁడా! నీవు నాతోఁ జెప్పినట్లు ఇది మారీచునిమాయయే యగునేని నేను దీని నవశ్యము వధింపవలయును. ౩౭

మున్ను బుద్ధిహీనుఁడును గ్రూరుఁడు నగు నీమారీచుఁడు ఈవనంబునం దిరుగుచు బెక్కుమునివరులం జంపియున్నాఁడుగదా!. ౩౮

ఈమృగము వేఁటకువచ్చిన మహాధనుర్ధరులగు రాజులఁ బెక్కండ్ర వధించియున్నది. కావున దీని నవశ్యము వధింపవలయును. ౩౯

పురస్తా దిహ వాతాపిః పరిభూయ తపస్వినః,
ఉదరస్థో ద్విజా న్హన్తి స్వగర్భోఽశ్వతరీ మివ. ౪౦

స కదాచి చ్చిరా ల్లోభా దాససాద మహామునిమ్,
అగ స్త్యం తేజసా యుక్తం భక్ష స్తస్య బభూవ హ. ౪౧

సముత్థానే చ త ద్రూపం క ర్తుకామం సమీక్ష్య తమ్,
ఉత్ స్మయిత్వా తు భగవా న్వాతాపి మిద మబ్రవీత్. ౪౨

త్వయా విగణ్య వాతాపే! పరిభూతా స్స్వ తేజసా,
జీవలోకే ద్విజశ్రేష్ఠా స్తస్మా దసి జరాం గతః. ౪౩

త దేవం న భవే ద్రక్షో వాతాపి రివ లక్ష్మణ!,
మద్విధం యోఽతిమన్యేత ధర్మనిత్యం జితేన్ద్రియమ్. ౪౪

భవే ద్ధతోఽయం వాతాపి రగ స్త్యే నేవ మాం గతః,

ఇహ త్వం భవ సన్నద్ధో యన్త్రితో రక్ష మైథిలీమ్. ౪౫
అస్యా మాయ త్త మస్మాకం య త్కృత్యం రఘునన్దన!,

అహ మేనం వధిష్యామి గ్రహీష్యా మ్యపి వా మృగమ్. ౪౬
యావ ద్గచ్ఛామి సౌమిత్రే! మృగ మానయితుం ద్రుతమ్,
పశ్య లక్ష్మణ! వై దేహీం మృగత్వచి గతస్పృహామ్. ౪౭

మున్ని దండకారణ్యంబున వాతాపియను రాక్షసుఁ డొకఁడు ఋషులను వంచించి తాను మేఁకరూపమెత్తి వారలకు భోజ్యమయి వారల యుదరముఁ బ్రవేశించి యశ్వతరి యీనునప్పుడు దూడ గర్భంబుఁ జీల్చుకొని వచ్చి తల్లిం జంపునట్లు యాఋషులకడుపు చించుకొనివచ్చి వారల వధించుచుండెను. ౪౦

ఆవాతాపి యట్లు బహుకాలముండి యంత నొకప్పుడు మాంసాశచేఁ బ్రభావసంపన్నుఁడగు నగస్త్యమహామునియొద్దకుఁబోయి యథాక్రమముగ భోజ్యమయి యాయనయుదరముఁ బ్రవేశించెను. ౪౧

భగవంతుఁడగు నగస్త్యుఁడు భోజనాంతంబునఁ దనయుదరంబు భేదించుటకై యావాతాపి నిజరూపంబు ధరింపఁగోరుటం జూచి యతనిం జేర్కొని యిట్లని జెప్పెను. ౪౨

వాతాపీ! నీవు భూలోకంబునఁ బాపమునిగూడ విచారింపక పెక్కు బ్రాహ్మణోత్తములం జంపినావు. అందువలన నీవు నాయుదరంబున జీర్ణుఁడవయితివి. అని యగస్త్యుఁడు వాతాపితోఁ జెప్పెను. ౪౩

లక్ష్మణుఁడా! ధర్మంబునందుఁ జలనములేకుండువాఁడును జితేంద్రియుండునగు నాయట్టివాని నతిక్రమించునేని యామారీచుఁడు వాతాపివలె నిహతుఁ డగును. ౪౪

అగస్త్యునిచేత వాతాపి హతుఁడయినట్లు మారీచుఁడు నాచే హతుఁ డగును.

లక్ష్మణుఁడా! నీ విచ్చట సన్నద్ధుఁడవై జాగ్రత్తతో సీతాదేవిని రక్షింపుచుండుము. మనకార్యములన్నియు ఈబిడయందె యున్నవి. (ఈబిడను రక్షించుటె మనకు ముఖ్యకార్యము.) ౪౫

లక్ష్మణుఁడా! నేను ఈమృగమును పట్టనైనను బట్టెదను. లేక వధింపనైనను వధించెదను. నేనుబోయి మృగమును దీసికొని శీఘ్రంబున వచ్చెదను.

లక్ష్మణుఁడా! ఈమృగచర్మమునందు సీత కాశ గలిగి యున్నది.

త్వచా ప్రధానయా హ్యేష మృగోఽద్య న భవిష్యతి,

అప్రమత్తేన తే భావ్య మాశ్రమస్థేన సీతయా. ౪౮
యావ త్పృషత మేకేన సాయకేన నిహ న్మ్యహమ్,
హ త్వైతి చ్చర్మ చాదాయ శీఘ్ర మేష్యామి లక్ష్మణ!. ౪౯
ప్రదక్షిణే నాతిబలేన పక్షిణా
జటాయుషా బుద్ధిమతా చ లక్ష్మణ!,
భ వాప్రమ త్తః పరిగృహ్య మైథిలీం
ప్రతిక్షణం సర్వత ఏవ శఙ్కితః. ౫౦

ఇతి శ్రీమదరణ్యకాణ్డే త్రిచత్వారింశ స్సర్గః. ౪౩.

---

## చతుశ్చత్వారింశ స్సర్గః.

తథా తు తం సమాదిశ్య భ్రాతరం రఘునన్దనః,
బబ న్ధాసిం మహాతేజా జామ్బూనదమయత్సరుమ్. ౧
తత స్త్ర్యవనతం చాప మాదాయాఽత్మవిభూషణమ్,
ఆబధ్య చ కలాపౌ ద్వౌ జగా మోదగ్రవిక్రమః. ౨
తం వఞ్చయానో రాజేన్ద్రమాపత న్తం నిరీక్ష్య వై,
బభూ వా న్తర్హిత స్త్రాసా త్పున స్సన్దర్శనేఽభవత్. ౩

బద్ధాసి ర్ధను రాదాయ ప్రదుద్రావ యతో మృగః,

తం స్మ పశ్యతి రూపేణ ద్యోతమాన మి వాగ్రతః. ౪
అవే క్ష్యావేక్ష్య ధావ న్తం ధనుష్పాణిం మహావనే,
అతివృ త్త మిషోః పాతా ల్లోభయానం కదాచన. ౫

కావున దీనిచర్మమె మనకు ముఖ్యము కాఁబట్టి యీమృగమును వధించి దీని చర్మమును దెచ్చెదను. ౪౮

నే నొక్కబాణంబున నీమృగమును వధించి వచ్చువఱకు నీవు సీతకుఁగా నీయాశ్రమంబున ఎంతమాత్ర మేమఱక కాచియుండవలయును. ౪౯

లక్ష్మణుఁడా! నేను మృగచర్మమును దీసికొని శీఘ్రముగ వచ్చెదను.

లక్ష్మణుఁడా! నీవు మహాసమర్థుండును మహాబలుఁడును బుద్ధిమంతుఁడు నగు జటాయువుతోఁగూడ సమస్తమునందును శంకగలవాఁడుండవలసినంతటి జాగ్రత్తతో నేమఱక సీతను రక్షింపుచుండుము. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౫౦

ఇది నలువదిమూఁడవసర్గము.

---

## నలువదినాలవ సర్గము.

మహాతేజుఁడగు రాముఁడు ఆప్రకారంబునఁ దమ్మునితోఁ జెప్పి కాంచనమయంబగు పిడికిలిగల ఖడ్గంబును మొలను బంధించెను. ౧

అంత మహాపరాక్రమశాలియగు రాముఁడు తనకలంకారమయిన శార్ఙ్గధనుస్సుఁ దీసికొని అమ్ములపొదులరెంటినిం గట్టుకొని పోయెను. ౨

ఆమారీచుఁడు రాజశ్రేష్ఠుఁడగు నారాముఁడు వచ్చుటంజూచి యతని మోసపుచ్చఁ దలంచి భయంబునఁ గొంతసే పంతర్హితుఁడై యుండి మఱల నతనికిం బొడసూపెను. ౩

రాముఁడు ఖడ్గంబు మొలయందు బంధించుకొని ధనుస్సు చేతంగొని మృగంబు పోయినదారిం బట్టిపోయెను.

అంత కాంత్యతిశయంబున ముందటనుండునట్లు తేజరిల్లుచు ధనుష్పాణియగు రామునియభిప్రాయంబు నెఱింగి యతఁడు బాణంబు నేయుసమయంబున బాణంబు తగలకుండునట్లు దూరంబు పరుగెత్తుచు నేమఱియుండునప్పుడు సమీపించి యాశగల్గించుచు భీతుఁడై భ్రాంతుఁడై యాకాశం

శఙ్కిత స్తు సముద్భ్రాన్త ముత్పత న్త మివామ్బరే,
దృశ్యమాన మదృశ్యం చ వనోద్దేశేషు కేషుచిత్. ౬
ఛిన్నాభ్రై రివ సంవీతం శారదం చన్ద్రమణ్డలమ్,

ముహూర్తా దేవ దదృశే ముహుర్దూరా త్ప్రకాశతే. ౭

దర్శనాదర్శనా దేవం సోఽపాకర్షత రాఘవమ్,
సుదూర మాశ్రమ స్యాస్య మారీచో మృగతాం గతః. ౮

ఆసీ త్క్రుద్ధ స్తు కాకుత్స్థో వివశ స్తేన మోహితః,
అ థావతస్థే సంభ్రాన్త శ్ఛాయా మాశ్రిత్య శాద్వలే. ౯

స త మున్మాదయామాస మృగరూపో నిశాచరః,
మృగైః పరివృతో వన్యై రదూరా త్ప్రత్యదృశ్యత. ౧౦

గృహీతుకామం దృష్ట్వైవం పున రేవాభ్యధావత,
తత్క్షణా దేవ సంత్రాసా త్పున రన్తర్హితోఽభవత్. ౧౦

పున రేవ తతో దూరా ద్వృక్షషణ్డా ద్వినిస్సృతమ్,
దృష్ట్వా రామో మహాతేజా స్తం హన్తుం కృతనిశ్చయః. ౧౨

భూయ స్తు శర ముద్ధృత్య కుపిత స్తత్ర రాఘవః,
సూర్యరశ్మి ప్రతీకాశం జ్వల న్త మరిమర్దనః. ౧౩
సంధాయ సుదృఢే చాపే వికృష్య బలవ ద్బలీ,

బునఁ బెగసిపోవునట్లు అతివేగంబునఁ బరుగెత్తుచు మేఘఖండంబులచేఁ గప్పఁబడిన చంద్రమండలంబుపగిదిఁ గొన్నిప్రదేశంబులం బొడసూపుచుఁ గొన్నిట నంతర్హితుఁడగుచు నీరీతి నరణ్యంబున సంచరించుచున్న యమ్మారీచుని రాముఁడు చూచెను. ౪-౭

అమ్మృగము ముహూర్తమాత్రంబున సమీపంబున నుండును మఱల నధికదూరంబునం దోఁచును. ౭

మృగరూపధరుఁడగు మారీచుఁడు అట్లు కొంచెముసేపు పొడసూపుచుఁ గొంచెముసే పంతర్హితుఁ డగుచు ఇట్లు రాముని ఆశ్రమంబునకు బహుదూరముగాఁ గొనిపోయెను. ౮

రాముఁడు ఆమృగచేష్టకుఁ గొంతసేపు కోపంబును అంత దానిసౌందర్యంబునకు మోహితుఁడై పరవశత్వంబునుం బొంది యంతే సంభ్రాంతచిత్తుఁడై యొకచెట్టునీడయందుఁ బచ్చికనేలపై నిలుచుండెను. ౯

అట్లు మృగరూపధరుఁడగు నమ్మారీచుఁడు రాముని బహుదూరము పరుగెత్తునట్లుచేసి భ్రాంతచిత్తుం గావించెను. అంత మఱల నతని కాళగలుగుటకై యామాయామృగము వన్యమృగపరివృతంబై సమీపంబునం బొడసూపెను. ౧౦

అమ్మృగంబు రాముఁడు తన్నుఁ బట్టుకొనవచ్చుటం జూచి మఱలఁ బరుగెత్తెను. అంత క్షణమాత్రమున మఱల భయమువలన నంతర్హితంబయ్యెను. ౧౧

అంత మహాతేజుఁడగు రాముఁడు మఱల నామృగం బొకవృక్షసమూహంబువనుండి వెడలుటం జూచి యామృగంబును వధింపవలెనని నిశ్చయించెను. ౧౨

రాముఁ డట్లు బాణం బెత్తి పరమకుపితుఁడై యుండెను.

శత్రువుల మర్దించువాఁడును బలవంతుఁడు నగు రాముఁడు సూర్యప్రకాశంబయి జ్వలించుచున్న దివ్యబాణంబును దృఢంబగుధనువునందు సంధించి

త మేవ మృగ ముద్దిశ్య శ్వస న్త మివ పన్నగమ్. ౧౪
ముమోచ జ్వలితం దీ ప్త మస్త్రం బ్రహ్మవినిర్మితమ్,

శరీరం మృగరూపస్య వినిర్భిద్య శరో త్తమః. ౧౫
మారీచ స్యైవ హృదయం బిభే దాశనిసన్నిభః,
తాళమాత్ర మ థోత్ప్లుత్య న్యపత త్స శరాతురః. ౧౬
వినద న్భైరవం నాదం ధరణ్యా మల్పజీవితః,
మ్రియమాణ స్తు మారీచో జహౌ తాం కృత్రిమాం తనుమ్.

స్మృత్వా త ద్వచనం రక్షో దధ్యౌ కేన తు లక్ష్మణమ్,
ఇహ ప్రస్థాపయే త్సీతా శూన్యే తాం రావణో హరేత్.

స ప్రాప్తకాల మాజ్ఞాయ చకార చ తత స్స్వరమ్,
సదృశం రాఘవ స్యైవ హా సీతే! లక్ష్మణేతి చ. ౧౯
తేన మర్మణి నిర్విద్ధ శ్శరే ణానుపమేన చ,
మృగరూపం తు త త్త్యక్త్వా రాక్షసం రూప మాత్మనః. ౨౦.
చక్రే స సుమహాకాయో మారీచో జీవితం త్యజన్,
తతో విచిత్రకేయూర స్సర్వాభరణభూషితః. ౨౧
హేమమాలీ మహాదంష్ట్రో రాక్షసోఽభూ చ్ఛరాహతః,

తం దృష్ట్వా పతితం భూమౌ రాక్షసం ఘోరదర్శనమ్. ౨౨
రామో రుధిరసక్తాఙ్గం వేష్టమానం మహీతలే,
జగామ మనసా సీతాం లక్ష్మణస్య వచః స్మరన్. ౨౩

మారీచ స్యైతి మా యైషా పూర్వోక్తం లక్ష్మణేన తు,

యాకర్ణాంత మాకర్షించి భయంబున సర్పంబువలె నిట్టూర్పులు పుచ్చుచున్న యామృగము నుద్దేశించి జ్వలించుచున్న బ్రహ్మనిర్మితంబగు నద్దివ్యాస్త్రంబు నేసెను. ౧౩,౧౪

పిడుగువంటిదైన యాబాణోత్తమము మొదట నమ్మారీచుఁడు ధరించిన మృగశరీరమును భేదించి యంత నతనిహృదయము నే భేదించెను. ౧౫

అంత నామారీచుఁడు బాణపీడితుఁడై తాటిచెట్టంతపొడ వెగిరి భయంకరంబుగా నఱచుచు హీనజీవితుఁడై భూమిం బడెను. ౧౬

మారీచుఁడు మృతిఁబొందువాఁడై కృత్రిమంబగు నామృగరూపంబు విడిచి నిజరూపంబు దాల్చెను. ౧౭

మారీచుఁడు రావణుఁడు చెప్పిన మాటను దలఁచుకొని "ఏయుపాయంబుచేత సీతాదేవి లక్ష్మణు నిచ్చటికిఁ బంపియెవ్వరునులేనికాలమునందు రావణుఁడు సీతను హరించును?" అని యాలోచించెను. ౧౮

అమ్మారీచుఁడు ఇది సమయంబని తెలిసికొని రామునికంఠధ్వని ననుసరించి "అయ్యో! సీతా! లక్ష్మణుఁడా!" అని యఱచెను. ౧౯

మహాకాయుఁడగు నమ్మారీచుఁడు రామునిచే దివ్యబాణంబున మర్మస్థానమునందుఁ గొట్టఁబడినవాఁడై మృగరూపమును విడిచి తనరాక్షసరూపమును గైకొని ప్రాణంబులు విడిచెను. ౨౦

అంత రామబాణహతంబయిన యమ్మాయామృగంబు విచిత్రంబులగు బాహుపురులు దాల్చి సమస్తాభరణంబులతో నొప్పుచుఁ గాంచనమాల ధరియించి భయంకరంబులగు కోఱలతోఁగూడియున్న రాక్షసశరీరంబు నొందెను. ౨౧

రాముఁడు నేలంబడి నెత్తుటం దోఁగుచుఁ బొరలాడుచున్న భయంకరాకారు నారాక్షసుం గని లక్ష్మణుఁడు చెప్పినమాటం దలపోసి మనమ్మున సీతాదేవిం దలంచుకొనెను. ౨౨,౨౩

ఇది మారీచుని మాయయేగాని వేఱు కాదని లక్ష్మణుఁడు మున్నె

తత్తథా హ్యభవ చ్ఛాద్య మారీచోఽయం మయా హతః. ౨౪

హా సీతే! లక్ష్మణే త్యేవ మాక్రుశ్య తు మహాస్వనమ్,
మమార రాక్షస స్సోఽయం శ్రుత్వా సీతా కథం భవేత్. ౨౫
లక్ష్మణ శ్చ మహాబాహుః కా మవస్థాం గమిష్యతి,

ఇతి సంచిన్త్య ధర్మాత్మా రామో హృష్టతనూరుహః. ౨౬

తత్ర రామం భయం తీవ్ర మావివేశ విషాదజమ్,
రాక్షసం మృగరూపం తం హత్వా శ్రుత్వాచ తత్స్వరమ్. ౨౭

నిహత్య పృషతం చాన్యం మాంస మాదాయ రాఘవః,
త్వరమాణో జనస్థానం ససా రాభిముఖ స్తదా. ౨౮
ఇతి శ్రీమదరణ్యకాణ్డే చతుశ్చత్వారింశ స్సర్గః. ౪౪

---

పఞ్చచత్వారింశ స్సర్గః.

ఆర్తస్వరం తు తం భర్తు ర్విజ్ఞాయ సదృశం వనే,
ఉవాచ లక్ష్మణం సీతా గచ్ఛ జానీహి రాఘవమ్. ౧
నహి మే హృదయం స్థానే జీవితం వాఽవతిష్ఠతి,
క్రోశతః పరమా ర్తస్య శ్రుత శ్శబ్దో మయా భృశమ్. ౨
ఆక్రన్దమానం తు వనే భ్రాతరం త్రాతు మర్హసి,

తం క్షిప్ర మభిధావ త్వం భ్రాతరం శరణైషిణమ్. ౩
రక్షసాం వశ మాపన్నం సింహానా మివ గోవృషమ్,

చెప్పినాఁడు. అది యట్లే యయినది. నాచే నిప్పుడు వధింపఁబడిన రాక్షసుఁడు మారీచుఁడే. ౨౪

ఈరాక్షసుఁడు నాకంఠధ్వనిననుసరించి 'అయ్యో! సీతా! లక్ష్మణుఁడా!' అని పేరెలుఁగున నాక్రోశించి ప్రాణంబులు విడిచెను. ఈమాటనువిని సీత యేమిదలఁచునో మహాబాహుఁడగు లక్ష్మణుఁ డెంతదుఃఖపడునో? అని రాముఁ డెంచెను. ౨౫

ధర్మాత్ముఁడగు రాముఁ డీప్రకారంబునం దలపోసి భయమువలన దేహమంతయు గగుర్పాటు నొందెను. ౨౬

అట్లు రాముఁడు మారీచుఁడు మృగరూపధరుఁడై వచ్చి హతుండగుటయు నవ్విధంబునం బలుకుటయుఁ దలపోసి యిదియంతయు నేమో దుఃఖంబునకుఁ గారణంబని మహాభయమునొందెను. ౨౭

రాముఁడంత మఱియొకజింకంజంపి దానిమాంసముఁ దీసికొని యతి వేగంబున జనస్థానమధ్యంబుననున్న తనయాశ్రమంబుదారిఁ బట్టిపోయెను.

నలుఁవదినాలవసర్గము.

---

## నలువదియైదవసర్గము.

సీత పెనిమిటికంఠధ్వనివంటి యారోదనధ్వనిని విని లక్ష్మణుం జూచి యిట్లని చెప్పెను. నీవుపోయి రామునిం జూడుము. ౧

పరమార్తుఁడయి రోదనంబుగావించిన రాముని కంఠధ్వని వింటిని. ఇంక నామనసుగాని ప్రాణముగాని దేహంబున నిలువఁజాలదు. ౨

అడవియందు దిక్కులేక రోదనంబుసేయుచున్న నీయన్నను మాత్రమురక్షింపుము.

సింహంబులచేతంజిక్కిన యాఁబోఁతువలె రాక్షసులచేతంజిక్కి రక్షకుం గానక పరితపించుచున్న నీయన్నయొద్దకు శీఘ్రంబుగాఁ బోయి యాయనను రక్షింపుము. అని సీత లక్ష్మణునితోఁ జెప్పెను. 3

న జగామ తథోక్త స్తు భ్రాతు రాజ్ఞాయ శాసనమ్. ౪
తమువాచ తత స్తత్ర కుపితా జనకాత్మజా,

సౌమిత్రే! మిత్రరూపేణ భ్రాతు స్త్వ మసి శత్రువత్. ౫
య స్త్వ మస్యా మవస్థాయాం భ్రాతరం నాభిపత్స్యసే,

ఇచ్ఛసి త్వం వినశ్యన్తం రామం లక్ష్మణ! మత్కృతే. ౬
లోభా న్మమ కృతే నూనం నానుగచ్ఛసి రాఘవమ్,

వ్యసనం తే ప్రియం మన్యే స్నేహో భ్రాతరి నాస్తి తే. ౭
తేన తిష్ఠసి విస్రబ్ధ స్త మపశ్య న్మహాద్యుతిమ్,

కిం హి సంశయ మాపన్నే తస్మి న్నిహ మయా భవేత్. ౮
కర్తవ్య మిహ తిష్ఠన్త్యా యత్ప్రధాన స్త్వ మాగతః,

ఇతి బ్రువాణాం వైదేహీం బాష్పశోకపరిప్లుతామ్. ౯
అబ్రవీ ల్లక్ష్మణ స్త్రస్తాం సీతాం మృగవధూ మివ,

పన్నగాసురగన్ధర్వదేవమానుషరాక్షసైః. ౧౦
అశక్య స్తవ వైదేహి! భర్తా జేతుం న సంశయః,

దేవి! దేవమనుష్యేషు గన్ధర్వేషు పతత్రిషు. ౧౧
రాక్షసేషు పిశాచేషు కిన్నరేషు మృగేషు చ,

ఆలక్ష్మణుఁడు సీతాదేవి యెంతదూరము చెప్పినను అన్నయాజ్ఞను దలంచిపోవ నొల్లఁడయ్యె. ౪

అంత జనకమహారాజపుత్త్రియగు సీతాదేవి కోపమునొంది లక్ష్మణుం జూచి యిట్లని చెప్పెను.

లక్ష్మణుఁడా! నీవు నీయన్న యిట్టిదురవస్థ నొందినప్పుడుకూడ నతని రక్షింపఁబోవకున్నావు. కావున నీ వతనికి మిత్త్రుని యట్లు నటించుచున్నావు కాని యథార్థంబున శత్త్రుఁడవు. ౫

లక్ష్మణుఁడా! నీవు నాకుఁగా రాముఁడు నశింపవలయునని కోరెదవు. నిశ్చయముగ నీవు నాయం దాసపడి రాముఁడట్లే నశించుఁగాక యనియాతనియొద్దకుఁ బోవకున్నావు. ౬

రామునకుఁ గష్టము వచ్చుట నీకుఁ బ్రియమని తోఁచుచున్నది. నీకు రామునియం దెంతమాత్త్రము స్నేహము లేదు. కావుననే యమ్మహాతేజునకు నాపదగలిగినప్పుడు నీవు నెమ్మదిగా నున్నావు. ౭

నీవు రామునిజూచి యిటకు వచ్చినాఁడవుగాని నన్నుఁజూచి రాలేదు గదా! అట్టిరాముఁడు ప్రాణసందేహమునొందినపిదప నే నిచ్చట నీతోఁగూడ నుండి చేయవలసిన పనియేమియున్నది? కాఁబట్టి నీ వింక నన్ను రక్షింపవలసినదిలేదు. అని సీత లక్ష్మణునితోఁ జెప్పెను. ౮

లక్ష్మణుఁడు ఈప్రకారంబునఁ గోపముచేఁ జెప్పుచున్నదియుఁ గన్నీళ్లుగాఱ రోదనంబు సేయుచు భయంబునొందిన యాఁడుజింకకైవడి నతిచపలయయి యున్నదియు నగు సీతం జూచి యిట్లని చెప్పెను. ౯

సీతాదేవీ! పన్నగులుగాని యసురులుగాని గంధర్వులుగాని దేవతలుగాని మనుష్యులుగాని రాక్షసులుగాని నీభర్తను రాముని జయింపఁజాలరు. ఇందుకు సందియము లేదు. ౧౦

మంగళస్వరూపిణివగు సీతాదేవీ! యుద్ధంబున దేవేంద్రతుల్యపరాక్రముఁడగు రామునితోఁ బోరువాఁడు దేవతలలోఁగాని మనుష్యులలోఁ

దానవేషు చఘోరేషు న స విద్యేత శోభనే!. ౧౨
యో గామం ప్రతియుధ్యేత సమరే వాసవోపమమ్,

అవధ్య స్సమరే రామో నైవం త్వం వక్తు మర్హసి. ౧౩
న త్వా మస్మి న్వనే హాతు ముత్సహే రాఘవం వినా,

అనివార్యం బలం తస్య బలై ర్బలవతా మపి. ౧౪
త్రిభి ర్లోకై స్సముద్యుక్తై స్సేశ్వరై రపి సామరైః,
హృదయం నిర్వృతం తేఽస్తు సంతాప స్త్యజ్యతా మయమ్.
ఆగమిష్యతి తే భర్తా శీఘ్రం హత్వా మృగో త్తమమ్,
న చ తస్య స్వరో వ్యక్తం మాయయా కేనచి త్కృతః. ౧౬
గన్ధర్వనగరప్రఖ్యా మాయా సా తస్య రక్షసః,

న్యాసభూతాఽసి వైదేహి! న్యస్తా మయి మహాత్మనా. ౧౭
రామేణ త్వం వరారోహే! న త్వాం త్యక్తు మి హోత్సహే,

కృతవై రాశ్చ వైదేహి! వయ మేతై ర్నిశాచరైః. ౧౮
ఖరస్య నిధనా దేవ జనస్థానవధం ప్రతి,

రాక్షసా వివిధా వాచో విసృజన్తి మహావనే. ౧౯
హింసావిహారా వైదేహి! న చిన్తయితు మర్హసి,

లక్ష్మణే నైవ ముక్తా సా క్రుద్ధా సంరక్తలోచనా. ౨౦
అబ్రవీ త్పరుషం వాక్యం లక్ష్మణంసత్యవాదినమ్,
అనార్యాకరుణారమ్భ! నృశంస! కులపాంసన!. ౨౧

గాని గంధర్వులలోఁగాని పక్షులలోఁగాని రాక్షసులలోఁగాని పిశాచంబులలోఁగాని కిన్నరులలోఁగాని మృగంబులలోఁగాని భయంకరాకారులగు దానవులలోఁగాని యుండఁడు. ౧౧-౧౨

రాముఁడు యుద్ధంబున నెట్టివారికిని వధ్యుఁడుకాఁడు. నీ విట్లు చెప్పవలదు. రాముఁడు లేకుండునప్పుడు నిన్నొంటిమెయి నీవనంబున విడిచిపోఁజాలను. ౧౩

ఇంద్రునితోను దేవతలతోనుం గూడ ముల్లోకంబులు నొక్కపెట్ట వచ్చినను ఎట్టిబలవంతులకును రాము నెదిరింప నలవి గాదు. ౧౪

మనస్సును నెమ్మదిగాఁ జేసికొనుము. ఈపరితాపంబు విడువుము. నీపెనిమిటిరాముఁడు ఆమృగశ్రేష్ఠంబును వధించి శీఘ్రంబున వచ్చును. ౧౫

ఈధ్వనియు రామునికంఠధ్వని కాదు. ఆమారీచుఁడు మాయచే నిట్టిధ్వనిని నిర్మించినాఁడు. మారీచునిమాయ గంధర్వనగరమువంటిది. అది విచిత్రముగా వ్యామోహముగలిగించును. ౧౬

సుందరములయిన పిఱుఁదులుగల సీతాదేవీ! మహాత్ముఁడగు రాముఁడు "ఈబిడను రక్షించి నేను వచ్చినప్పుడు నాకప్పగింపుము" అని నావశంబున నిన్నుంచెను. కావున నేను ని న్నీవనంబున నొంటిమెయి విడువంజాలను.

సీతాదేవీ! మఱియు ఖరునివధించుటవలన జనస్థానయుద్ధంబు మొదలు తమ ప్రభువును జంపినామని మనమీఁద నీ రాక్షసు లందఱుఁ బగగొనియున్నారు. ౧౭

సీతాదేవీ! అట్లు హింసాస్వభావులగు రాక్షసులు మనపైవిరోధంబున మనకు భయమోహంబులు గలుగవలయునని నానావిధములగు మాటలుచెప్పుచున్నారు. అని లక్ష్మణుఁడు సీతాదేవితోఁ జెప్పెను. ౧౮

ఆసీతాదేవి లక్ష్మణుఁడు చెప్పినమాటను విని కోపంబునొంది కన్నులనెఱ్ఱఁదనంబుగదుఱసత్యవాదియగు లక్ష్మణుంజూచిపరుషవచనంబున నిట్లనియె.

చేయరానిపని చేయఁగోరినవాఁడవు క్రూరుఁడవు కులంబుఁ జెఱపం

అహం తవ ప్రియం మన్యే రామస్య వ్యసనం మహత్,
రామస్య వ్యసనం దృష్ట్వా తే నైతాని ప్రభాషసే. ౨౨

నైత చ్చిత్రం సపత్నేషు పాపం లక్ష్మణ! య ద్భవేత్,
త్వద్విధేషు నృశంసేషు నిత్యం ప్రచ్ఛన్నచారిషు. ౨౩

సుదుష్ట స్త్వం వనే రామ మేక మేకోఽనుగచ్ఛసి,
మమ హేతోః ప్రతిచ్ఛన్నః ప్రయుక్తో భరతేన వా. ౨౪

త న్న సిధ్యతి సౌమిత్రే! తవ వా భరతస్య వా,
కథ మిన్దీవరశ్యామం పద్మపత్రనిభేక్షణమ్. ౨౫
ఉపసంశ్రిత్య భర్తారం కామయేయం పృథగ్జనమ్,

సమక్షం తవ సౌమిత్రే! ప్రాణాం స్త్యక్ష్యే న సంశయః. ౨౬
రామం వినా క్షణ మపి నహి జీవామి భూతలే,

ఇత్యుక్తః పరుషం వాక్యం సీతయా రోమహర్షణమ్. ౨౭
అబ్రవీ ల్లక్ష్మణ స్సీతాం ప్రాఞ్జలి ర్విజితేన్ద్రియః,

ఉత్తరం నోత్సహే వక్తుం దైవతం భవతీ మమ. ౨౮
వాక్య మప్రతిరూపం తు న చిత్రం స్త్రీషు మైథిలి!,
స్వభావ స్త్వేష నారీణా మేవం లోకేషు దృశ్యతే. ౨౯

బుట్టినవాఁడవు నగులక్ష్మణుఁడా! రామునకు మహావిపత్తు గలుగుటంతయు నీకు సంతోషంబని నాకుఁ దోఁచుచున్నది. ౨౧

అందువలననె. రామున కాపద గలిగినప్పుడు అతని రక్షింపంబోక యీమాటం జెప్పుచున్నావు. ౨౨

కపటంబున మిత్రవేషంబుతో వ్యవహరించువారలును యథార్థంబున శత్రువులును గ్రూరులు నగు నీయట్టివారల కిట్టిద్రోహబుద్ధి గలుగుట యెంతమాత్ర మాశ్చర్యకరముగాదు. ౨౩

నీవు పరమదుష్టుఁడవు నీకొఱకైయు లేక భరతప్రేరితుఁడవైయు నానిమిత్తమయి కపటంబున నడవియందు ఒక్కఁడవై రాముని వెంబడించి వచ్చుచున్నావు. ౨౪

లక్ష్మణుఁడా! నీకుఁ గాని భరతునికిఁ గానినన్నుఁ బొందవలెనను కోర్కెమాత్రము సిద్ధింపదు.

నల్లనికలువవలె నల్లనిమనోహర దేహముగలవాఁడును దామరపూరేకులుంబోలె విశాలసుందరంబులగు కన్నులుగలవాఁడునగు రామునిభర్తనుగాఁ బొంది అన్యపురుషు నెట్లు కామింతును? ౨౫

లక్ష్మణుఁడా! నీయెదుటఁ బ్రాణంబులు విడిచెదను. అందుకు సంశయము లేదు. రాముని విడిచి క్షణమేని భూమియందు జీవించియుండజాలను. అని సీత లక్ష్మణునితోఁ జెప్పెను. ౨౬

జితేంద్రియుఁడగు లక్ష్మణుఁడు అట్లు సీతాదేవి చెప్పిన పరుషంబును గగుర్పాటుగలిగించునదియు నగుమాటను విని చేమోడ్పు గీలించి సీతంజూచి యిట్లని చెప్పెను. ౨౭

నేను నీకు బదులు చెప్పనోల్లను. నీవు నాకు దేవతవు. ౨౮

సీతాదేవీ! ఇట్లు అనుచితమయినమాటచెప్పుట స్త్రీలయం దెంతమాత్రము ఆశ్చర్యకరముగాదు. స్త్రీల కిది స్వభావము. లోకములం దంతయు నిట్లె యగపడుచున్నది. ౨౯

విముక్తధర్మా శ్చపలా స్తీక్ష్ణా భేదకరాః స్త్రియః,

న సహే హీదృశం వాక్యం వైదేహి! జనకాత్మజే!. ౩౦
శ్రోత్రయో రుభయో ర్మేఽద్య తప్తనారాచసన్నిభమ్,
ఉపశృణ్వన్తు మే సర్వే సాక్షిభూతా వనేచరాః. ౩౧
న్యాయవాదీ యథాన్యాయ ముక్తోఽహంపరుషం త్వయా,

ధిక్త్వా మద్య ప్రణశ్య త్వం యన్మా మేవం విశఙ్కసే. ౩౨
స్త్రీత్వం దుష్టం స్వభావేన గురువాక్యే వ్యవస్థితమ్,

గమిష్యే యత్ర కాకుత్స్థ స్స్వస్తి తేఽస్తు వరాననే!. ౩౩

రక్షన్తు త్వాం విశాలాక్షి! సమగ్రా వనదేవతాః,

నిమిత్తాని హి ఘోరాణి యాని ప్రాదుర్భవన్తి మే. ౩౪
అపి త్వాం సహ రామేణ పశ్యేయం పునరాగతః,
నవే త్యేత న్న జానామి వైదేహి! జనకాత్మజే!. ౩౫

లక్ష్మణే నైవ ముక్తా సా రుదన్తీ జనకాత్మజా,
ప్రత్యువాచ తతో వాక్యం తీవ్రం బాష్పపరిప్లుతా. ౩౬
గోదావరీం ప్రవేక్ష్యామి వినా రామేణ లక్ష్మణ!,

ఆబన్ధిష్యేఽథవా త్యక్ష్యే విషమే దేహ మాత్మనః. ౩౭
పిబా మ్యహం విషం తీక్ష్ణం ప్రవేక్ష్యామి హుతాశనమ్,

స్త్రీలు ధర్మంబు విడిచినవారలు. చంచలబుద్ధులు క్రూరచిత్తలు. ఎట్టి స్నేహితుల కేని విరోధము గలిగింతురు.

జనకమహారాజుకొమార్తెవగు సీతాదేవీ! ఈమాట నాచెవులకు నిప్పులోఁగాచిన బాణమువలె నున్నది. ఇట్టిమాటను నేను సహింపఁజాలను. ౩౦

నీవు న్యాయవాదినగు నన్నుఁ జూచి యిట్లన్యాయముగాఁ బరుషవాక్యంబు లాడినసంగతిని వనచరదేవతలందఱు నాకు సాక్షులయి వినియుందురుగాక. ౩౧

అన్నగారియాజ్ఞను శిరసావహించియున్న నామీఁద నిట్లుసందేహించి నింద మోపుచున్నావు కావున నీవు దహింపఁబడుదువుగాక. ఇప్పుడే నాశము నొందుము. స్త్రీలు స్వభావంబుననే దుష్టలు ౩౨

సుందరమయిన ముఖముగల సీతాదేవీ! నేను రాముఁ డుండుచోటికిఁ బోయెదను. నీకు మంగళ మగుఁగాక. ౩౩

విశాలంబులగు కన్నులుగల సీతాదేవీ! వనదేవతలందఱు నిన్ను రక్షింపుచుందురుగాక.

జనకమహారాజు కొమార్తెవగు సీతాదేవీ! ఇప్పుడు ఇట్లు భయంకరంబు లగుదుర్నిమిత్తంబులు తోఁచుటం జూడఁగా నేను మఱల వచ్చి రామునితోఁగూడ నిన్నుఁ జూతునో లేనో అనునదిగూడ సందేహముగానున్నది. అని లక్ష్మణుఁడు సీతాదేవితోఁ జెప్పెను ౩౪

అంత నాసీతాదేవి లక్ష్మణుఁడు చెప్పినమాటలను విని రోదనంబు సేయుచుఁ గన్నీళ్లుగాఱ నాలక్ష్మణుం జూచి తీక్ష్ణంబగు నీమాటఁ జెప్పెను. ౩౫

లక్ష్మణుఁడా! రాముని విడిచి నేను నిమిషమేని జీవింపఁజాలను గోదావరీనదిలోఁ బడి ప్రాణంబులు విడిచెదను. ౩౬

నేను ఉరిఁబోసికొనియైనను పర్వతంబుపైనుండి పడియయినను ఉగ్రంబగు విషంబు త్రావియయినను అగ్నిలోఁబడియయినను ప్రాణంబులు విడిచెదను. ౩౭

న త్వహం రాఘవా దన్యం పదాపి పురుషం స్పృశే. ౩౮

ఇతి లక్ష్మణ మాక్రుశ్య సీతా దుఃఖసమన్వితా,
పాణిభ్యాం రుదతీ దుఃఖా దుదరం ప్రజఘాన చ. ౩౯

తా మార్తరూపాం విమనా రుదన్తీం
సౌమిత్రి రాలోక్య విశాలనేత్రామ్,
ఆశ్వాసయామాస న చైవ భర్తు
స్తం భ్రాతరం కిఞ్చి దువాచ సీతా. ౪౦
తత స్తు సీతా మభివాద్య లక్ష్మణః
కృతాఞ్జలిః కిఞ్చి దభిప్రణమ్య చ,
అన్వీక్షమాణో బహుశ శ్చ మైథిలీం
జగామ రామస్య సమీప మాత్మవాన్. ౪౧

ఇతి శ్రీమదరణ్యకాణ్డే పఞ్చచత్వారింశ స్సర్గః. ౪౫.

---

## షట్చత్వారింశ స్సర్గః.

తయా పరుష ముక్త స్తు కుపితో రాఘవానుజః,
స వికాఙ్క్ష న్భృశం రామం ప్రతస్థే నచిరా దివ. ౧

త దాసాద్య దశగ్రీవః క్షిప్ర మన్తర మాస్థితః,
అభిచక్రామ వైదేహీం పరివ్రాజకరూపధృత్. ౨

శ్లక్ష్ణకాషాయసంవీత శ్శిఖీ ఛత్రీ ఉపానహీ,
వామే చాంసేఽవస జ్యాథ శుభే యష్టికమణ్డలూ. ౩

నేను రామునికన్న నితరపురుషునిమాత్రము పాదముతోనైనను స్పృశింపను. అని సీతాదేవి లక్ష్మణునితోఁ జెప్పెను. ౩౮

సీతాదేవి ఈప్రకారంబున లక్ష్మణుని నిందించి పరమదుఃఖితయయి దుఃఖాతిశయంబునఁ జేతులతో నుదరంబు మోఁదుకొనుచు రోదనముగావించెను. ౩౯

లక్ష్మణుఁడు సీతాదేవి యిట్లు దుఃఖితయయి విశాలనేత్రంబులనుండి నీళ్లుగాఱ రోదనంబుసేయుటం చూచి దుఃఖితుఁడై యాబిడ నూఱడించెను. సీతాదేవి మఱఁదితో నేమియుఁ బలుకకుండెను. ౪౦

అంత మహాత్ముఁడగు లక్ష్మణుఁడు సీతాదేవి కభివాదనంబుగావించి మఱలఁ గోపంబు దేఁటపడఁ జేమోడ్పుగీలించి కొంచెముగా నమస్కరించి పెక్కుమాఱులు వెనుకకుఁ దిరిగితిరిగి సీతాదేవిం జూచుచు రాముని సమీపంబునకుఁ బోయెను. ౪౧

ఇది నలువదియైదవసర్గము.

---

## నలువదియాఱవసర్గము.

ఆలక్ష్మణుఁడు సీతాదేవిచే నట్లుపరుషంబుగాఁ బలుకఁబడినవాఁడై ఎంతమాత్రము మనంబున నిచ్చలేనివాఁడయ్యును సీత నొంటిగా విడిచిపోవలయునే యని కాళ్ళు వెనుక కీడ్వఁగా శీఘ్రంబునం బోవలెనని యతిప్రయత్నంబున రామునొద్దకుఁ బోయెను. ౧

అవకాశము నెదురుచూచుచున్న రావణుఁడు లక్ష్మణుఁడుగూడఁ బోవుటయు సీత యొంటిమెయి నుండుటయుంగని యిదెసమయంబని శీఘ్రంబున సన్న్యాసిరూపంబు దాల్చి సీతాదేవియొద్దకుఁ బోయెను. ౨

ఆరావణుఁడు సన్నకావివస్త్రమును ధరియించి మంచిజుట్టుగలవాఁడై ఛత్రంబును పాదుకలును దాల్చి వామభుజంబుమీఁద దండమునకుఁ గమండ-

పరివ్రాజకరూపేణ వైదేహీ మన్వపద్యత,

తా మాససాదాతిబలో భ్రాతృభ్యాం రహితాం వనే. ౪
రహితాం చన్ద్రసూర్యాభ్యాం సన్ధ్యా మివ మహత్తమః,

తా మపశ్య త్తతో బాలాం రామపత్నీం యశస్వినీమ్. ౫
రోహిణీం శశినా హీనాం గ్రహవ ద్భృశదారుణః,

త ముగ్రతేజఃకర్మాణం జనస్థానరుహా ద్రుమాః. ౬
సమీక్ష్య సంప్రకమ్పన్తే న ప్రవాతి చ మారుతః,

శీఘ్రస్రోతా శ్చ తం దృష్ట్వా వీక్ష న్తం రక్తలోచనమ్. ౭
స్తిమితం గన్తు మారేభే భయా ద్గోదావరీ నదీ,

రామస్య త్వన్తరం ప్రేప్సు ర్దశగ్రీవ స్తదన్తరే. ౮
ఉపతస్థే చ వైదేహీం భిక్షురూపేణ రావణః,

అభవ్యో భవ్యరూపేణ భర్తార మనుశోచతీమ్. ౯
అభ్యవర్తత వైదేహీం చిత్రా మివ శనైశ్చరః,

స పాపో భవ్యరూపేణ తృణైః కూప ఇ వావృతః. ౧౦
అతిష్ఠ త్ప్రేక్ష్య వైదేహీం రామపత్నీం యశస్వినీమ్,

శుభాం రుచిరదన్తోష్ఠీం పూర్ణచన్ద్రనిభాననామ్. ౧౧
ఆసీనాం పర్ణశాలాయాం బాష్పశోకాభిపీడితామ్,

లువు దగిలించి యుంచుకొని యిట్లు సన్యాసిరూపంబు దాల్చి సీతాదేవియొద్ద
కుc బోయెను. 3.

చంద్రసూర్యులు లేకుండునప్పుడు భయంకరంబగు చీcకటి సంధ్యం
బొందునట్లు మహాబలుcడగు రావణుcడు రామలక్ష్మణులు లేకుండుసమయం
బున సీతయొద్దకుc బోయెను. ౪

అంత మహాభయంకరమగు నంగారకగ్రహము చంద్రహీనయయి
యుండునప్పుడు రోహిణిం జూచునట్లు రావణుcడు రామలక్ష్మణహీనయయి
యున్న సీతాదేవిం జూచెను. ౫

భయంకరపరాక్రముcడును లోకంబుల నశింపcజేయువాcడునగు నారా
వణుం జూచి జనస్థానంబునం గల వృక్షంబు లన్నియు గడగడ వడంకినవి.
వాయువును వీవcడయ్యె. ౬

శీఘ్రముగాc బ్రవహించునట్టి గోదావరీనదియు నెఱ్ఱనికన్నులతోc
జూచుచున్న యారావణుంజూచి భయంబున సద్దులేకుండునట్లు మెల్లగాcబో
యెను. ౭

రామునిపక్షంబున నెప్పుడు ఛిద్రంబు సంభవించునని నిరీక్షించుచుం
డిన రావణుcడు అదియె యవకాశంబుగాcగొని సన్న్యాసిరూపంబున సీతా
దేవి సమీపంబునకుc బోయెను. ౮

దుర్జనుcడగు రావణుcడు సుజనవేషంబు దాల్చి పెనిమిటిని గుఱించి
దుఃఖించుచున్న సీతాదేవియొద్దకు చిత్రానక్షత్రమును శనైశ్చరుcడు పొం
దునట్లు పోయెను. ౯

పచ్చికలచేc గప్పcబడిన కూపంబుపగిదిc బాపిష్ఠుcడగు నారావణుcడు
పుణ్యవంతుని వేషంబు వేసికొని మహాపతివ్రతయు రామభార్యయు నగు సీతా
దేవిం జూచుచు నిలుచుండెను. ౧౦

దుష్టాత్ముcడగు నారావణుcడు మంగళాంగియు సుందరములగు దంత
ములును బెదవులునుగలదియు నిండుచంద్రునివంటి మొగంబుగలదియుc దామర

స తాం పద్మపలాశాక్షీం పీతకౌశేయవాసినీమ్. ౧౨
అభ్యగచ్ఛత వైదేహీం దుష్టచేతా నిశాచరః,

స మన్మథశరావిష్టో బ్రహ్మఘోష ముదీరయన్. ౧౩
అబ్రవీ త్ప్రశ్రితం వాక్యం రహితే రాక్షసాధిపః,
తా ముత్తమాం స్త్రియం లోకే పద్మహీనా మివ శ్రియమ్. ౧౪
విభ్రాజమానాం వపుషా రావణః ప్రశశంస హ,

కా త్వం కాఞ్చనవర్ణాభే! పీతకౌశేయవాసిని!. ౧౫
కమలానాం శుభాం మాలాం పద్మినీవ హి బిభ్రతీ,

హ్రీః శ్రీః కీర్తి శ్శుభా లక్ష్మీ రప్సరా వా శుభాననే!. ౧౬
భూతి ర్వా త్వం వరారోహే! రతి ర్వా స్వైరచారిణీ,

సమా శ్శిఖరిణ స్స్నిగ్ధాః పాణ్డురా దశనా స్తవ. ౧౭
విశాలే విమలే నేత్రే రక్తాన్తే కృష్ణతారకే,

విశాలం జఘనం పీన మూరూ కరికరోపమౌ. ౧౮

ఏతా వుపచితౌ వృత్తౌ సంహతౌ సంప్రవల్గితౌ,
పీనోన్నతముఖౌ కాన్తౌ స్నిగ్ధౌ తాళఫలోపమౌ. ౧౯
మణిప్రవేకాభరణౌ రుచిరౌ తే పయోధరౌ,

పూరేకులవంటి నేత్రంబులు గలదియుఁ బీతాంబరంబు గట్టుకొనియున్న దియుఁ బర్ణశాలయందుఁ గన్నీళ్లుగాఱ రోదనంబు సేయుచుఁ గూర్చుండి యున్నదియు నగు సీతాదేవియొద్దకుఁ బోయెను. ౧౧-౧౨

రాక్షసరాజుఁడగు రావణుఁడు మన్మథపరవశుఁడై వేదంబులం బఠింపుచు నెవ్వరులేనప్పుడు సీతంజూచి సవినయంబుగా నిట్లనిచెప్పెను. ౧౩

రావణుఁడు లోకంబునందంతయు నుత్తమస్త్రీయు రామహీనయగుటంజేసి పద్మహీనయగు లక్ష్మీదేవికైవడి నున్నదియు దేహకాంతిం దేజరిల్లుచున్నదియు నగు నాసీతాదేవి నీప్రకారంబునం బ్రశంసించెను. ౧౪

బంగారువంటిదేహవర్ణముగలదానవు. మంచిపసపు పట్టుచీరఁగట్టుకొని యున్నదానవగు చిన్నదానా! కమలంబులవంటి ముఖమును నేత్రంబులును హస్తంబులును పాదంబులును గలదానవగుటంజేసి కమలమాలికను ధరించి యున్న తామరతీఁగవలె నున్నావు. నీ వెవ్వతెవు. ౧౫

మంగళకరమయినముఖంబును సుందరమయిన పిఱుందులును గలచిన్నదానా! నీవు పార్వతివా?కాంత్యధిష్ఠానదేవతవా? కీర్త్యధిష్ఠానదేవతవా?లక్ష్మీదేవివా?అప్సరసవా?భూత్యధిష్ఠానదేవతవా? స్వాతంత్ర్యయగురతివా?చెప్పుము.

నీదంతములు సమములుగాను సుందరములయిన యగ్రములుగలవిగాను కాంతిగలవిగాను తెల్లనివిగాను నున్నవి. నీనేత్రంబులు విశాలంబులును నిర్మలంబులు గొనల నెఱ్ఱనివియు నల్లనిపాపలుగలవియు నై యున్నవి.

నీజఘనంబు మిక్కిలియు విలాసమయినది. నీతొడలు ఏనుఁగుతొండములంబోలె నున్నవి. ౧౬

నీస్తనములు ఉన్నతములయి గుండ్రములయి ఒండొంటితో నంటుకొని మిక్కిలియు బరువుగా నుండుటచేఁ గొంచెము చలించునట్లున్నవై బలిసినవియుఁ గొనఁదగినవియు స్నిగ్ధంబులును తాలఫలసమానంబులునై మణిమయహారంబులతో నలంకరింపఁబడి యెంతయు రమణీయంబులయి యున్నవి. ౧౭

చారుస్మితే! చారుదతి! చారునేత్రే! విలాసిని!. ౨౦
మనో హరసి మే కాన్తే! నదీకూల మి వామ్భసా,

కరాన్తమితమధ్యాఽసి సుకేశీ సంహత స్తనీ. ౨౧

నైవ దేవీ న గన్ధర్వీ న యక్షీ న చ కిన్నరీ,
నైవంరూపా మయా నారీ దృష్టపూర్వా మహీతలే. ౨౨

రూప మగ్ర్యం చ లోకేషు సౌకుమార్యం వయ శ్చ తే,
ఇహ వాస శ్చ కాన్తారే చిత్త మున్మాదయన్తి మే. ౨౩

సా ప్రతిక్రామ భద్రం తే న త్వం వస్తు మి హార్హసి,
రాక్షసానా మయం వాసో ఘోరాణాం కామరూపిణామ్.

ప్రాసాదాగ్రాణి రమ్యాణి నగరోపవనాని చ,
సంపన్నాని సుగన్ధీని యుక్తా న్యాచరితుం త్వయా. ౨౪
వరంమాల్యం వరం భోజ్యం వరం వస్త్రం చ శోభనే!,
భర్తారం చ వరం మన్యే త్వద్యుక్త మసితేక్షణే!. ౨౬

కా త్వం భవసి రుద్రాణాం మరుతాం వా వరాననే!,
వసూనాం వా వరారోహే! దేవతా ప్రతిభాసి మే. ౨౭

సుందరమయిన చిఱునగవును సుందరములయిన దంతములును సుంద రములయిన నేత్రంబులును గలదానవు. విలాసశాలినగు చిన్నదానా! నది ప్రవాహముచేఁ దీరమును హరించునట్లు నీవు సౌందర్యముచే నామనస్సు నాకర్షించుచున్నావు.

నీవు పిడికిలియంతటికౌను సుందరములగు తలవెంట్రుకలును ఒండొంటితో నొరసుకొనియున్న కఠిన స్తనంబులునుగలిగి యెంతయు మనోహరంబుగా నున్నావు. ౨౧

నేను మనుష్యులలోఁగాని దేవతలలోఁగాని గంధర్వులలోఁగాని యక్షులలోఁగాని కిన్నరులలోఁగాని యిట్టి రూపసౌందర్యాదులుగల స్త్రీ నిదివఱ కెప్పుడును జూడనేలేదు. ౨౨

లోకంబులం దంతటను దుర్లభంబగు నీరూపంబును సౌకుమార్యంబును నీవయస్సును ఈయడవియందు వాసంబు గావించుటయుఁ జూడఁగా నామనస్సున కెంతయు దుఃఖము గలుగుచున్నది. ౨౩

అట్టి సుకుమారాంగి వగు నీ వి ట్లీయడవియం దుండఁదగదు. నీస్థానంబునకుఁ బొమ్ము. ఇది భయంకరాకారులును గామరూపులు నగు రాక్షసుల నివాసము గావించుస్థలము. ౨౪

నీవు సమృద్ధంబులును సుగంధయుక్తంబులును రమణీయంబులునగు ప్రాసాదశిఖరంబులంగు నుద్యానవనంబులందును సంచరింపఁదగినదానవు. ౨౫

మంగళరూపిణీవి. నల్లనికన్నులుగలదానవు నగు సీతాదేవీ! లోకోత్తరమగు నిన్నుఁబొందిన పుష్పమాలికలు భోగ్యద్రవ్యంబులును వస్త్రంబును సర్వోత్తమములని తలంచెదను. అట్లె నిన్ను భార్యగాఁ బడసిన నీపెనిమిటియు సర్వోత్తముఁడని తలఁచెదను. ౨౬

సుందరమయిన ముఖముగలదానవు సుందరములయిన పిఱుఁదులుగలదానవు నగు చిన్నదానా! నిన్నుఁజూడ నాకు నీవు దేవతాస్త్రీవిగాఁ దోఁచుచున్నది. నీవు రుద్రపత్నివా? వాయుపత్నివా? లేకవసుపత్నివా? చెప్పుము.

నేహ గచ్ఛన్తి గన్ధర్వా న దేవా న చ కిన్నరాః,
రాక్షసానా మయం వాసః కథం ను త్వ మిహాగతా. ౨౮
ఇహ శాఖామృగా స్సింహా ద్వీపివ్యాఘ్రమృగా స్తథా,
ఋక్షా స్తరక్షవః కఙ్కాః కథం తేభ్యో న బిభ్యసి. ౨౯

మదాన్వితానాం ఘోరాణాం కుఞ్జరాణాం తరస్వినామ్,
కథ మేకా మహారణ్యే న బిభేషి వరాననే!. ౩౦

కాఽసి కస్య కుతశ్చి త్త్వం కిన్నిమి త్తం చ దణ్డకాన్,
ఏకా చరసి కల్యాణి! ఘోరా న్రాక్షససేవితాన్. ౩౧

ఇతి ప్రశస్తా వై దేహీ రావణేన దురాత్మనా,
ద్విజాతివేషేణ హి తం దృష్ట్వా రావణ మాగతమ్. ౩౨
సర్వై రతిథిసత్కారైః పూజయామాస మైథిలీ,

ఉపనీ యాసనం పూర్వం పాద్యే నాభినిమన్త్ర్య చ. ౩౩
అబ్రవీ త్సిద్ధ మి త్యేవ తదా తం సౌమ్యదర్శనమ్,

ద్విజాతివేషేణ సమీక్ష్య మైథిలీ
సమాగతం పాత్రకుసుమ్భధారిణమ్,
అశక్య ముద్వేష్టు ముపాయదర్శనం
న్యమన్త్రయ ద్బ్రాహ్మణవ త్తదాఽఙ్గనా. ౩౪
ఇయం బృసీ బ్రాహ్మణ! కామ మాస్యతా
మిదంచ పాద్యం ప్రతిగృహ్యతా మితి,

గంధర్వులుగాని దేవతలుగాని కిన్నరులుగాని యిచ్చటికి రారు. ఇది రాక్షసులు నివసించు ప్రదేశము. నీ వెట్లిచ్చటికి వచ్చియున్నావు. ౨౮

భయంకరాకారంబులగు కోతులును సింహంబులును జిఱుతపులులును బెద్దపులులును ఎలుఁగుబంటులును రాపులుఁగుపక్షులును ఈవనంబునందు సంచరించుచుండును. వానింజూచి యెట్లు భయంబు నొందకున్నావు?. ౨౯

సుందరముఖంబగు చిన్నదానా! ఇమ్మహారణ్యంబున నీ వొక్కతెవె మదించియున్న భయంకరాకారంబులును బలవంతంబులు నగు నేనుఁగులకు భయపడ కెట్లున్నావు? ౩౦

మంగళరూపిణి వగుచిన్నదానా! నీవెవ్వతెవు.ఎవ్వరిసంబంధముదానవు?ఎందుండి వచ్చినావు? భయంకరంబును రాక్షసవాసస్థలంబు నగు నీదండకారణ్యంబున నొంటిమెయి సంచరించుచున్నా వేల? అని రావణుఁడు సీతాదేవితోఁ జెప్పెను. ౩౧

సీతాదేవి యట్లు దురాత్ముఁడగు రావణునిచేఁ బ్రశంసింపఁబడి బ్రాహ్మణసన్న్యాసివేషంబు దాల్చి వచ్చిన యారావణుం గని నిక్కంబుగ సన్న్యాసియె యని భ్రమించి యతని కర్ఘ్యపాద్యాద్యతిథిసత్కారంబులు యథావిధిం గావించెను. ౩౨

ఆసీతాదేవి పీట దెచ్చివేసి రావణునకుఁ బాద్యం బొసంగి యింత సౌమ్యవేషంబు వేసికొనియున్న యారావణుం జూచి "పక్వాన్నంబు సిద్ధం బయ్యె" భుజింపు మని చెప్పెను. ౩౩

సీతాదేవి బ్రాహ్మణసన్న్యాసివేషంబు నొంది కమండలువును ధరించి కాషాయవస్త్రంబు గట్టుకొనివచ్చుటవలన నెంతమాత్రము దుర్మార్గుఁడని సంశయింప నలవిగానివాఁడును దుర్మార్గంబు సేయుటకే వచ్చియున్నవాఁడునగు నారావణుని బ్రాహ్మణునింబోలె భుజింపఁ బ్రార్థించెను. ౩౪

బ్రాహ్మణుఁడా! ఇదిగో ఆసనము. కూర్చుండుము. ఇదిగో పాద్య మంగీకరింపుము. నీకొఱకుఁ బక్వము చేయఁబడిన యుత్తమంబగు వన్యపదార్థము

ఇదం చ సిద్ధం వనజాత ముత్తమం
త్వదర్థ మవ్యగ్ర మి హోపభుజ్యతామ్. 35
నిమన్త్ర్యమాణః ప్రతిపూర్ణభాషిణీం
నరేన్ద్రపత్నీం ప్రసమీక్ష్య మైథిలీమ్,
ప్రసహ్య తస్యా హరణే ధృతం మన
స్సమర్పయ త్స్వాత్మవధాయ రావణః. 36
తత స్సువేషం మృగయాగతం పతిం
ప్రతీక్షమాణా సహ లక్ష్మణం తదా,
నివీక్షమాణా హరితం దదర్శ త
న్మహా ద్వనం నైవ తు రామలక్ష్మణౌ. 37

ఇతి శ్రీమదరణ్యకాణ్డే షట్చత్వారింశ స్సర్గః. ౪౬.

---

## సప్తచత్వారింశ స్సర్గః.

రావణేన తు వైదేహీ తథా పృష్టా జిహీర్షతా,
పరివ్రాజకలిఙ్గేన శశం సాత్మాన మఙ్గనా. ౧

బ్రాహ్మణ శ్చాతిథి శ్చాయ మనుక్తో హి శపేత మామ్,
ఇతి ధ్యాత్వా ముహూర్తం తు సీతా వచన మబ్రవీత్. ౨

దుహితా జనక స్యాహం మైథిలస్య మహాత్మనః,
సీతా నామ్నాఽస్మి భద్రం తే రామభార్యా ద్విజోత్తమ!. 3
ఉషిత్వా ద్వాదశ సమా ఇక్ష్వాకూణాం నివేశనే,
భుఞ్జానా మానుషా న్భోగాం త్సర్వకామసమృద్ధినీ. ౪

లిదిగో భుజింపుము అని సీతాదేవి రావణుం బ్రార్థించెను. ౩౫

రావణుఁడు అట్లు సీతచేఁ బ్రార్థింపఁబడుచున్నవాఁడై కపటములేక నోటినిండుగా మాటలాడుచున్న రామభార్యయగు నాసీతాదేవిం జక్కఁగాఁ జూచి తనచావుకొఱకై ధైర్యంబున బలాత్కారంబున నాబిడ నపహరింపఁ దలంచెను. ౩౬

అంత నప్పు డాసీతాదేవి సుందరాకారుఁడగు వేటకుఁబోయిన తన పెనిమిటిని రాముని లక్ష్మణుని ఎదురుచూచుచు నానావిధంబుల నాదిక్కుఁ బట్టి యెంతచూచినను ఆబిడకు పట్టి యరణ్యమే కానవచ్చెనుగాని రామలక్ష్మణు లెంతమాత్రము కానరారైరి. ౩౭

ఇది నలుఁవదియాఱవసర్గము.

---

## నలువదియేడవసర్గము.

సీతాదేవి యట్లు తన్నపహరించుటకై సన్న్యాసివేషము వేసికొనివచ్చి యున్న రావణుఁడడుగఁగానే తనవృత్తాంతమంతయు నీప్రకారంబునం జెప్పం దొడంగెను. ౧

సీతాదేవి ఈతఁడు బ్రాహ్మణుఁడు అతిథియుఁగావున "నీతఁ డడిగినది చెప్పకుందునేని నన్ను శపించును" అనికొంచెము సేపాలోచించి యంతయు నిట్లని చెప్పెను. ౨

బ్రాహ్మణశ్రేష్ఠుఁడా! నీకు మంగళములగుఁగాక నేను మహాత్ముఁడును మిథిలానాయకుఁడు నగు జనకమహారాజు కొమార్తెను. రాముని భార్యను.

నేను వివాహమయిన పిమ్మట నత్తగారింటఁ బండ్రెండుసంవత్సరములు సమస్తకామ్యపదార్థంబులతోను సమృద్ధంబుగాఁగూడి పెనిమిటితోఁ గూడ నానావిధంబులగు మనుష్యదుర్లభంబులయిన భోగంబు లనుభవించు చుంటిని. ౪

తత స్త్రయోదశే వర్షే రాజాఽమన్త్రయత ప్రభుః,
అభిషేచయితుం రామం సమేతో రాజమన్త్రిభిః. ౫

తస్మిం త్సంభ్రియమాణే తు రాఘవ స్యాభిషేచనే,
కైకేయీ నామ భర్తార మార్యా సా యాచతే వరమ్. ౬

ప్రతిగృహ్య తు కైకేయీ శ్వశురం సుకృతేన మే,
మమ ప్రవ్రాజనం భర్తు ర్భరత స్యాభిషేచనమ్. ౭
ద్వా వయాచత భర్తారం సత్యసన్ధం నృపోత్తమమ్,

నాద్య భోక్ష్యే న చ స్వప్స్యే న పాస్యే చ కథంచన. ౮
ఏష మే జీవిత స్యాన్తో రామో య ద్యభిషిచ్యతే,

ఇతి బ్రువాణాం కైకేయీం శ్వశురో మే స మానదః. ౯
అయాచ తార్థై రన్వర్థై ర్న చ యాచ్ఞాం చకార సా,

మమ భర్తా మహాతేజా వయసా పఞ్చవింశకః. ౧౦
అష్టాదశ హి వర్షాణి మమ జన్మని గణ్యతే,
రామేతి ప్రథితో లోకే గుణవాం త్సత్యవాన్ శుచిః. ౧౧
విశాలాక్షో మహాబాహు స్సర్వభూతహితే రతః,

కామార్త స్తు మహాతేజాః పితా దశరథ స్స్వయమ్. ౧౨
కైకేయ్యాః ప్రియకామార్థం తం రామం నాభ్యషేచయత్,
అభిషేకాయ తు పితు స్సమీపం రామ మాగతమ్. ౧౩
కైకేయీ మమ భర్తార మిత్యువాచ ధృతం వచః,

అంతఁ బదునాఱవసంవత్సరంబున మామామ దశరథమహారాజు సామంతరాజులతోను మంత్రులతోనుంగూడ రామునకుఁ బట్టాభిషేకము సేయవలెనని యాలోచించెను. ౫

అట్లు రామునకుఁ బట్టాభిషేకము సేయ నారంభించుకాలంబునందు నాయత్తగారొకతె కైకేయి యనునాబిడ పెనిమిటి నీప్రకారంబున వరం బడిగెను. ౬

ఆకైకేయి సత్యసంధుఁడును రాజశ్రేష్ఠుఁడు నగు దశరథమహారాజును తాను ము న్నాయనకుఁ గావించియున్న యుపకారముచే స్వాధీనపఱచుకొని నాపెనిమిటియగు రాముని వనంబునకుఁ బంపుట తనకొడుకు భరతునకుఁ బట్టాభిషేకము సేయుట యను నీరెండువరముల నడిగెను. ౭

నీ వేమిచేసినను నే నింక భోజనము సేయను. నిదురపోవను! నీళ్లు త్రాగను. రామునకుఁ బట్టాభిషేకము గావింతువేని యిప్పుడే ప్రాణంబుల విడిచెదను. అని కైకేయి దశరథునితోఁ జెప్పెను. ౮

నానావిధబహుమానంబుల నిచ్చునట్టి యాదశరథమహారాజు కైకేయి యీప్రకారమునం జెప్పుటఁ జూచి యమూల్యంబులగు నానావిధ ధనంబుల నొసంగి యూరకుండుమని యెంత ప్రార్థించినను ఆబిడ యంగీకరింపదయ్యె.

అప్పుడు మహాపరాక్రమశాలియగు నాపెనిమిటి యిరువదియయిదేండ్లవాఁడు. నేను బుట్టి యప్పటికిఁ బదునెనిమి దేండ్లయినవి. ౧౦

నాపెనిమిటి రాముఁ డనుపేర లోకంబునఁ బ్రసిద్ధుఁడు. గుణవంతుఁడు సత్యవాది పరిశుద్ధాత్ముఁడు విశాలంబులగు కన్నులుగలవాఁడు ఆజానుబాహుఁడు సర్వభూతంబులకును మేలుసేయువాఁడు. ౧౧

మహాతేజుఁడగు తండ్రి దశరథుఁడును మన్మథపీడితుఁడై కైకేయి మాటకు మాఱుపలుకంజాలక కైకేయికిసంతోషంబుగలుగుటకై యట్టి రామునకుఁ బట్టాభిషేకంబు సేయుటను మానెను. ౧౨

కైకేయి పట్టాభిషేకార్థమయియే తండ్రిసమీపంబునకు వచ్చిన నాభర్తను రామునిం జూచి ధైర్యంబున నీమాటను జెప్పెను. ౧౩

తవ పిత్రా సమాజ్ఞప్తం మ మేదం శృణు రాఘవ!. ౧౮

భరతాయ ప్రదాతవ్య మిదం రాజ్య మకణ్టకమ్,
త్వయా హి ఖలు వస్తవ్యం నవ వర్షాణి పఞ్చ చ. ౧౯
వనే ప్రవ్రజ కాకుత్స్థ! పితరం మోచ యానృతాత్,

తథే త్యుక్త్వా చ తాం రామః కైకేయీ మకుతోభయః.
చకార తద్వచ స్తస్యా మమ భర్తా దృఢవ్రతః,
దద్యా న్న ప్రతిగృహ్ణీయా త్సత్యం బ్రూయా న్న చానృతమ్.
ఏత ద్బ్రాహ్మణ! రామస్య ధ్రువం వ్రత మనుత్తమమ్,

తస్య భ్రాతా తు ద్వైమాత్రో లక్ష్మణో నామ వీర్యవాన్.
రామస్య పురుషవ్యాఘ్ర స్సహాయ స్సమరేఽరిహా,

స భ్రాతా లక్ష్మణో నామ ధర్మచారీ దృఢవ్రతః, ౧౯
అన్వగచ్ఛ ద్ధనుష్పాణిః ప్రవ్రజన్తం మయా సహ,
జటీ తాపసరూపేణ మయా సహ సహానుజః. ౨౦
ప్రవిష్టో దణ్డకారణ్యం ధర్మనిత్యో జితేన్ద్రియః,

తే వయం ప్రచ్యుతా రాజ్యా త్కైకేయ్యా స్తు కృతే త్రయః.
విచరామ ద్విజశ్రేష్ఠ! వనం గమ్భీర మోజసా,

సమాశ్వస ముహూర్తం తు శక్యం వస్తు మిహ త్వయా. ౨౨
ఆగమిష్యతి మే భర్తా వన్య మాదాయ పుష్కలమ్,
రురూన్గోధాన్వరాహాంశ్చ హత్వాఽదాయాఽమిషాన్బహూన్.

రాముఁడా! నీవు నీతండ్రి యీప్రకారంబున నాజ్ఞాపించినాఁడు చెప్పెదను వినుము. ౧౪

శత్రురహితమయిన యీరాజ్యమును భరతుని కివ్వవలయును.

రాముఁడా! నీవుమాత్రము పదునాలుగుసంవత్సరము లడవిలో వాసము సేయవలయును. కాఁబట్టి శీఘ్రముగాఁ బొమ్ము నీతండ్రికి అసత్యదోసము తగులకుండునట్లు చేయుము. ౧౫

ఎందును భయపడనివాఁడును దృఢవ్రతుఁడునగు నాభర్త రాముఁడు కైకేయికి అట్లేచేసెదనని చెప్పి యాబిడమాటప్రకారము వనమునకువచ్చెను.

బ్రాహ్మణుఁడా! రాముఁడు ఒరుల కిచ్చునుగాని ప్రతిగ్రహింపఁడు. సత్యమునే చెప్పునుగాని యబద్ధము నెంతమాత్రమును జెప్పఁడు ఇది రాముని ముఖ్యవ్రతము దీని నెప్పుడును వదలఁడు. ౧౬

మహాపరాక్రమశాలియు యుద్ధంబున శత్రువధంబుసేయువాఁడును బురుషశ్రేష్ఠుఁడు నగువాఁడును రాముని సవతితల్లికొడుకు లక్ష్మణుఁ డనువాఁడు మాత్రము ఎల్లప్పుడు రామునకు సహోయుఁడుగా నుండును. ౧౮

పరమధార్మికుఁడును దృఢవ్రతుఁడు నగు నాలక్ష్మణుఁడు రాముఁడు నాతోఁగూడ వనంబునకు వచ్చునప్పుడు ధనుర్ధరుఁడై యతనివెంబడివచ్చెను.

ధర్మమునం దెంతమాత్రము చలనములేనివాఁడును జితేంద్రియుఁడు నగు రాముఁడు తాపసవేషంబు ధరించి జటలుదాల్చి నేనును లక్ష్మణుఁడును వెంబడింప నీదండకారణ్యంబునకు వచ్చినాఁడు. ౨౦

బ్రాహ్మణశ్రేష్ఠుఁడా! అట్లు కైకేయినిమిత్తమయి రాజ్యభ్రష్టులమయిన మేము ముగ్గురమును అతిభయంకరంబగు నీయరణ్యంబునఁ బరాక్రమాతిశయంబుచే సంచరించుచున్నాము. ౨౧

కొంచెము సేపు శ్రమము దీర్చుకొనుచు నిచ్చటనుండుము. ఇచ్చట నీకు సుఖముగానుండును. నాభర్త జింకలను ఉడుముల వరాహంబులను వధించి పెక్కుమాంసములను ఇతరవన్యపదార్థంబులనుం దీసికొని శీఘ్రింబుగా వచ్చును. ౨౨

స త్వం నామ చ గోత్రఞ్చ కులం చాచక్ష్వ తత్త్వతః,
ఏక శ్చ దణ్డకారణ్యే కిమర్థం చరసి ద్విజ!. ౨౪

ఏవం బ్రువన్త్యాం సీతాయాం రామపత్న్యాం మహాబలః,
ప్రత్యువాచోత్తరం తీవ్రం రావణో రాక్షసాధిపః. ౨౫

యేన విత్రాసితా లోకా స్సదేవాసురపన్నగాః,
అహ స్తు రావణో నామ సీతే! రక్షోగణేశ్వరః. ౨౬
త్వా న్తు కాఞ్చనవర్ణాభాం దృష్ట్వా కౌశేయవాసినీమ్,
రతిం స్వకేషు దారేషు నాధిగచ్ఛా మ్యనిన్దితే!. ౨౭

బహ్వీనా ముత్తమస్త్రీణా మాహృతానా మిత స్తతః,
సర్వాసా మేవ భద్ర న్తే మ మాగ్రమహిషీ భవ. ౨౮

లఙ్కా నామ సముద్రస్య మమ మధ్యే మహాపురీ,
సాగరేణ పరిక్షిప్తా నివిష్టా నగమూర్ధని. ౨౯
తత్ర సీతే! మయా సార్ధం వనేషు విహరిష్యసి,
న చాస్యారణ్యవాసస్య స్పృహయిష్యసి భామిని!. ౩౦

పఞ్చ దాస్య స్సహస్రాణి సర్వాభరణభూషితాః,
సీతే! పరిచరిష్య న్తి భార్యా భవసి మే యది. ౩౧

రావణే నైవ ముక్తా తు కుపితా జనకాత్మజా,
ప్రత్యువాచానవద్యాఙ్గీ త మనాదృత్య రాక్షసమ్. ౩౨

బ్రాహ్మణుఁడా! ఇఁక నీవును నీపేరును గోత్రంబును జెప్పుము. ఇట్లే కాకిగా నీదండకారణ్యంబున నేల తిరుగుచున్నావు. అని సీతాదేవి రావణునితోఁ జెప్పెను. ౨౫

రామభార్యయగు సీతాదేవి యీప్రకారంబునం జెప్పఁగా నంత మహాబలుఁడును రాక్షసేశ్వరుఁడు నగు రావణుఁడు భయంకరంబగు నీమాటను బదులు చెప్పెను. ౨౬

సీతా! దేవాసురులు మున్నగా సమస్తలోకంబులును ఎవ్వనికి భయపడునో అట్టిరాక్షససమూహనాథుఁడగు రావణుఁ డనువాఁడను నేనే!. ౨౭

నిందింపఁదగనట్టిసీతా! బంగారువంటి మేనిచాయతోఁ బట్టువస్త్రము కట్టుకొని తేజరిల్లుచున్న నిన్నుఁ జూచినది మొదలు నాభార్యలయందు నా కెంతమాత్రము ఇచ్ఛ గలుగకున్నది. ౨౮

నీకుమంగళము గలుగుఁగాక. అయ్యైస్థలములందుండి తేఁబడిన యుత్తమస్త్రీలు పెక్కండ్రున్నారు. వారియందఱిలోను నీవు నాకు మొదటిభార్యవుగా నుండుము. ౨౯

నాకు లంకయను మహాపురియున్నది. అదిచుట్టును సముద్రముచే నావరింపఁబడి సముద్రమధ్యంబునఁబర్వతాగ్రంబుపైఁ బ్రతిష్ఠితమయి యున్నది.

సీతా! ఆలంకయందు నీవు నాతోఁగూడ నుద్యానవనంబులం గ్రీడించుచుండవచ్చును. అట్టిసుఖంబులకుఁ దగిన నీవు ఈవనములో నింక నెంతమాత్ర ముండవలదు. 3౦

సీతా! నీవు నాకు భార్యవగుదువేని సమస్తాభరణభూషితలగు నైదువేల దాసీలు నీ కెల్లప్పుడును బరిచర్యసేయుచుందురు. అని రావణుఁడు సీతతోఁ జెప్పెను. 3౧

అతిసుందరంబులగు నవయవములుగల సీతాదేవి ఈప్రకారంబునరావణుఁడు చెప్పినమాటను విని పరమకుపితయయి యారావణు నెంతమాత్రము సరకుసేయక యిట్లని యుత్తరము చెప్పెను. 3౨

"మహాగిరి మి వాకమ్ప్యం మహేన్ద్రసదృశం పతిమ్,
మహోదధి మి వాక్షోభ్య మహం రామ మనువ్రతా. 33

సర్వలక్షణసమ్పన్నం న్యగ్రోధపరిమణ్డలమ్,
సత్యసన్ధం మహాభాగ మహం రామ మనువ్రతా. 34

మహాబాహుం మహోరస్కం సింహవిక్రాన్తగామినమ్,
నృసింహం సింహసంకాశ మహం రామం మనువ్రతా. 35

పూర్ణచన్ద్రాననం రామం రాజవత్సం జితేన్ద్రియమ్,
పృథుకీర్తిం మహాత్మాన మహం రామ మనువ్రతా. 36

త్వం పునర్జమ్బుక స్సింహీం మా మిచ్ఛసి సుదుర్లభామ్,
నాహం శక్యా త్వయా స్ప్రష్టు మాదిత్యస్య ప్రభా యథా.

పాదపా న్కాఞ్చనా న్నూనం బహూ న్పశ్యసి మన్దభాక్,
రాఘవస్య ప్రియాం భార్యాం య స్త్వమిచ్ఛసి రావణ!. 37

క్షుధితస్య హి సింహస్య మృగశత్రో స్తరస్వినః,
ఆశీవిషస్య చ ముఖా ద్దంష్ట్రా మాదాతు మిచ్ఛసి. 38

రాముఁడు మహాపర్వతముంబోలె నెట్టివారికిని గదలింప నలవిగానివాఁడు. మహాసముద్రమువలెనతిగంభీరుఁడు. ఎట్టికష్టమునకేని కలఁతనొందఁడు. దేవేంద్రునకు సరివచ్చువాఁడు. అట్టి నాథుఁడయిన రాముని నే ననువర్తించియున్నాను. ఇట్టిమాట లాడుచున్నావే నీకు భయములేదా యేమి?. 33

నేను సమస్తశుభలక్షణములతోఁ గూడినవాఁడును మఱ్ఱిచెట్టునకుఁ గొమ్మలుండునట్లు అనేకబంధువులుగలవాఁడును సత్యసంధుఁడును మహాభాగుఁడు నగు రాము ననువర్తించిన దానను. నీయట్టి నీచుని గంటనైనం జూతునా!, 34

నేను మహాబాహుఁడును విశాలవక్షుఁడును సింహంబునకుంబోలె మహాపరాక్రమంబుగలవాఁడగుటచే సగర్వంబుగా నడుచువాఁడును బురుషశ్రేష్ఠుఁడును సింహంబువంటివాఁడు నగు రామునను వర్తించియున్నాను. తప్పుడుమాట లాడకుము. 35

నేను నిండుచందురుంబోలె మొగంబుగలవాఁడును సమస్తలోకంబులను దమింపఁ జేయువాఁడును రాజకుమారుఁడును జితేంద్రియుఁడును మహాయశుఁడును మహాత్ముఁడునగు రాము ననువర్తించినాను. ఇంకనొరులఁ గన్నెత్తిచూతునా? 36

నీవు నక్కవు ఆఁడుసింహమును నీకెంతమాత్రము పొందనలవిగానిదాననగు నన్నుఁ గోరెదవు. సూర్యునికాంతిస్పృశింప నలవిగానట్లు నన్ను స్పృశింప నీకెంతమాత్రమలవిగాదు. 37

రావణుఁడా! రామునిప్రియభార్యనగు నన్నుఁ గోరుచున్నావు కావున మందభాగ్యుఁడవగు నీవు ఇంక శీఘ్రంబుగ బంగారువృక్షంబుల ననేకంబులం జూడఁగలవు. ఇది నిశ్చయము. (చావు సమీపించినప్పుడు బంగారువృక్షంబు లగపడునని ప్రసిద్ధి.) 38

ఆఁకలిగొన్నదియు బలవంతంబులు నగు సింహసర్పంబుల నోటనుండి కోఱం బెఱుకఁ గోరినట్లు నన్నుఁ గోరుట నీకు మరణము గల్గించును సిద్ధము.

మన్దరం పర్వతశ్రేష్ఠం పాణినా హర్తు మిచ్ఛసి,
కాలకూటం విషం పీత్వా స్వస్తిమా న్గన్తు మిచ్ఛసి. ౪౦

అక్షిసూచ్యా ప్రమృజసి జిహ్వయా లేక్షి చ క్షురమ్,
రాఘవస్య ప్రియాం భార్యాం యోఽధిగన్తుం త్వ మిచ్ఛసి.

అవసజ్య శిలాం కణ్ఠే సముద్రం తర్తు మిచ్ఛసి,
సూర్యాచన్ద్రమసౌ చోభౌ పాణిభ్యాం హర్తు మిచ్ఛసి. ౪౨
యో రామస్య ప్రియాం భార్యాం ప్రధర్షయితు మిచ్ఛసి,
అగ్నిం ప్రజ్వలితం దృష్ట్వా వస్త్రే ణాహర్తు మిచ్ఛసి. ౪౩
కల్యాణవృత్తాం రామస్య యో భార్యాం హర్తు మిచ్ఛసి,
అయోముఖానాం శూలానా మగ్రే చరితు మిచ్ఛసి. ౪౪
రామస్య సదృశీం భార్యాం యోఽధిగన్తుం త్వ మిచ్ఛసి.

యదన్తరం సింహసృగాలయోర్వనే
యదన్తరం స్యన్దికాసముద్రయోః,
సురాగ్ర్యసౌవీరకయో ర్యదన్తరం
తదన్తరం వై తవ రాఘవస్య చ. ౪౫
య దన్తరం కాఞ్చనసీసలోహయో
ర్యదన్తరం చన్దనవారిపఙ్కయోః,
య దన్తరం హస్తిబిడాలయో ర్వనే
తదన్తరం దాశరథే స్తవైవ చ. ౪౬
యదన్తరం వాయసవైనతేయయో
ర్య దన్తరం మద్గుమయూరయో రపి,

నీవు పర్వతోత్తమమయినమందరపర్వతమును చేతందీసికొనఁగోరుచున్నావు. అది నీ కెట్లు సిద్ధించును. మఱియుఁ గాలకూటమును ద్రావిసుఖంబుగా నింటికిఁ బోఁగోలేదవు. కాలకూటంబు ద్రావినట్లు నన్నుఁ గోరుటవలన నీవు ఇంక నిల్లు చూడఁబోవునదిలేదు. ఇక్కడనే మరణము నొందుదువు. ౪౦

నీవు రాముని ప్రియభార్యనగు నన్ను బొందఁ గోరుటవలన సూదితోఁ గన్ను తుడుచుకొనుటవలనఁ గన్ను నశించునట్లు కత్తి నాలుక నాకుటవలన నాలుక చెడునట్లు నాశంబు నొందుదువు. ౪౧

నీవు రాముని ప్రియభార్యనగు నన్ను ధర్షింపఁగోరుటవలన మెడకు ఱాయి గట్టుకొని సముద్రంబు దాఁటఁగోరినవాఁడ వగుచున్నావు. చంద్రసూర్యుల నిద్దఱను జేతులఁ బట్టుకొనంగూడఁ బ్రయత్నింతువు. ౪౨

నీవు మహాపతివ్రతను రాముని ప్రియభార్య నగు నన్ను హరింపఁగోరుటంజూడఁగా మండుచున్ననిప్పును గుడ్డలోఁ గట్టుకొనిపోఁ గోరినట్లున్నది.

నీవు రాముని ప్రియభార్యనగు నన్నుఁ బొందఁగోరుటం జూడఁగా ఉక్కుశూలంబుల సమూహముపై నడవఁ గోరినట్లున్నది. అది యెట్లసాధ్యకరమో నన్నుఁ గోరుటయు నట్లని తలంపుము. ౪౪

సింహమునకును నక్కకును ఎంతభేదమున్నదో చిన్నచెలమకును సముద్రమునకును ఎంతభేదమున్నదో ఉత్తమమయిన మద్యమునకును కడుగునీళ్లకును ఎంతభేదమున్నదో రామునకును నీకును అంతభేద మున్నది. ౪౫

బంగారమునకును సీసమునకునుఎంతభేదమున్నదో చందనపుముద్దకును బురదకును ఎంతభేదమున్నదో ఏనుంగునకును పిల్లికిని ఎంతభేదమున్నదో రామునకును నీకును అంతభేదం బున్నది. ౪౬

కాకికిని గరుత్మంతునకును ఎంతభేదమున్నదో నీరుకాకికిని నెమిలికిని ఎంతభేదమున్నదో గద్దకును హంసకును ఎంతభేదమున్నదో నీకునురామునకును

యదన్తరం సారసగృధ్రయో ర్వనే
తదన్తరం దాశరథే స్తవైవ చ. ౪౭
తస్మిం త్సహస్రాక్షసమప్రభావే
రామే స్థితే కార్ముకబాణపాణౌ,
హృతాఽపి తేఽహం న జరాం గమిష్యే
వజ్రం యథా మక్షికయాఽవగీర్ణమ్. ౪౮
ఇతీవ తద్వాక్య మదుష్టభావా
సుదుష్ట ముక్త్వా రజనీచరం తమ్,
గాత్రప్రకమ్పవ్యథితా బభూవ
వాతోద్ధతా సా కదళీవ తన్వీ. ౪౯
తాం వేపమానా ముపలభ్య సీతాం
స రావణో మృత్యుసమప్రభావః,
కులం బలం నామ చ కర్మ చ స్వం
సమాచచక్షే భయకారణార్థమ్. ౫౦

ఇతి శ్రీమదరణ్యకాణ్డే సప్తచత్వారింశ స్సర్గః. ౪౭.

---

## అష్టచత్వారింశ స్సర్గః.

ఏవం బ్రువన్త్యాం సీతాయాం సంరబ్ధః పరుషం వచః,
లలాటే భ్రుకుటిం కృత్వా రావణః ప్రత్యువాచ హ. ౧
భ్రాతా వైశ్రవణ స్యాహం సాపత్న్యో వరవర్ణిని!,
రావణో నామ భద్రం తే దశగ్రీవః ప్రతాపవాన్. ౨
యస్య దేవా స్సగన్ధర్వాః పిశాచపతగోరగాః,
విద్రవన్తి భయా ద్భీతా మృత్యో రివ సదా ప్రజాః. 3

అంతభేదం బున్నది. ४६

దేవేంద్రసమప్రభావుఁడగు రామున్ఁడు ధనుర్బాణధరుఁడై నిలిచి యుండఁగా నీవు నన్నపహరించినను ఈఁగె వజ్రముపలుకు మ్రింగినచో నది దానికి జీర్ణము గానట్లు నీకు నేను స్వాధీనఁగాను మఱి నీకు మరణమె గల్గింతును. అని సీతాదేవి రావణునితోఁ జెప్పెను. ४७

పరిశుద్ధహృదయయగు నాసీతాదేవి యీప్రకారంబున నతిధైర్యముగా నారావణాసురునితోఁ జెప్పి యంత భయంబున గాలిచేఁ గదలింపఁబడిన యరఁటిచెట్టుకైవడి గడగడవడంకసాగెను. ४८

మృత్యువునకుంబోలె మహాప్రభావంబుగల యారావణుఁడు అట్లు సీతాదేవి భయంబున వడంకుటఁ జూచి మఱియు భయంబుగలిగించుటకై తన కులంబును బలంబును పేరును దాను గావించినమహాకార్యంబులను జెప్పెను.

ఇది నలువదియేడవసర్గము.

## నలువదియెనిమిదవసర్గము.

సీతాదేవి చెప్పినమాటను విని రావణుఁడు కుపితుఁడై నొసట బొమముడిపాటు గదురఁ బరుషవచనంబున నిట్లని బదులుచెప్పెను. ౧

ఉత్తమస్త్రీవగు సీతా! నేను కుబేరునితమ్ముఁడను. అతని సవతితల్లికొడుకును. నాపేరు రావణుఁడందురు. పదితలలుగలవాఁడను. మహాపరాక్రమశాలిని.

మృత్యువునుజూచి ప్రజలు భయపడి పాఱిపోవునట్లు దేవతలును గంధర్వులును పిశాచములును పక్షులును సర్పములును నాభయంబున నున్నచోట నిలువక పాఱిపోవుచుందురు. ३

యేన వైశ్రవణో రాజా వైమాత్రః కారణాన్తరే,
ద్వన్ద్వ మాసాదితః క్రోధా ద్రణే విక్రమ్య నిర్జితః. ౪
యద్భయార్తః పరిత్యజ్య స్వ మధిష్ఠాన మృద్ధిమత్,
కైలాసం పర్వతశ్రేష్ఠ మధ్యాస్తే నరవాహనః. ౫

యస్య తత్పుష్పకం నామ విమానం కామగం శుభమ్,
వీర్యా దావర్జితం భద్రే! యేన యామి విహాయసమ్. ౬

మమ సంజాతరోషస్య ముఖం దృష్ట్వైవ మైథిలి!,
విద్రవన్తి పరిత్రస్తా స్సురా శ్శక్రపురోగమాః. ౭
యత్ర తిష్ఠా మ్యహం తత్ర మారుతో వాతి శఙ్కితః,
తీవ్రాంశు శ్శిశిరాంశు శ్చ భయా త్సంపద్యతే రవిః. ౮

నిష్కమ్పపత్రా స్తరవో నద్య శ్చ స్తిమితోదకాః,
భవన్తి యత్ర యత్రాహం తిష్ఠామి విచరామి చ. ౯

మమ పారే సముద్రస్య లఙ్కా నామ పురీ శుభా,
సంపూర్ణా రాక్షసై ర్ఘోరై ర్యథేన్ద్ర స్యామరావతీ. ౧౦

ప్రాకారేణ పరిక్షిప్తా పాణ్డురేణ విరాజితా,
హేమకక్ష్యా పురీ రమ్యా వైడూర్యమయతోరణా. ౧౧

హస్త్యశ్వరథసంబాధా తూర్యనాదవినాదితా,
సర్వకాలఫలై ర్వృక్షై స్సంకులోద్యానశోభితా. ౧౨

మున్ను ఒకకారణంబున నాయన్నకుబేరునకును నాకును మహాయుద్ధమగలిగినప్పుడు నేను బరాక్రమంబున నతని జయించియున్నాను. ౪

కుబేరుఁడు నాభయంబువలననే సమృద్ధంబగు తనపట్టణమును లంకను విడిచి కైలాసపర్వతంబు శివస్థానంబు కావున నేనచ్చటఁ దొందరచేయనని యప్పర్వతోత్తమంబుపై నున్నాఁడు. ౫

మంగళరూపిణి వగుసీతా! ఇప్పుడు నేను దేని నారోహించి యాకాశంబున సంచరించుచున్నానో కామగమనంబగు నాపుష్పకవిమానంబు ఆకుబేరునియొద్దనుండి పరాక్రమబలంబునఁ నేను బెఱుకుకొన్నదే. ౬

ఇంద్రుఁడు మొదలగు దేవతలందఱు నేను కోపమునొందియుండునప్పుడు నా మొగంబుఁజూచిరేని తత్క్షణంబున భయంబుచేఁ బరుగెత్తుదురు.

నేనెచ్చటనుందునో అచ్చట నంతయు వాయువు భయంబున అనుకూలుఁడై వీచును. వేడికిరణములుఁగల సూర్యుఁడు భయంబునఁ జల్లనికిరణంబులు గలవాఁడగును. ౮

నేనెచ్చటెచ్చట నిలుచుందునో ఎచ్చటెచ్చట సంచరించుచుందునో అచ్చటంతయు వృక్షంబుల పత్రములుగూడఁ జలింపవు. నదులు ప్రవహింపక నిశ్చలజలంబు లయియే యుండును. ౯

ఇంద్రున కమరావతీపట్టణ ముండునట్లు నాకు సముద్ర దక్షిణతీరంబునందు భయంకరాకారులగు రాక్షసులతోనిండి నలంక యనెడు మహాపట్టణము గలదు. ౧౦

ఆలంకాపురికిఁ జుట్టును తెల్లనిగొప్పప్రాకారంబును, అందు మేడలు బంగారముతోఁ గట్టఁబడియుండును. పురద్వారంబులు వైడూర్యమణిమయంబు లయియుండును. ౧౧

ఆలంక యేనుఁగులచేతను గుఱ్ఱములచేతను రథములచేతను నిండినదై యెల్లప్పుడును వాద్యధ్వనులతోఁగూడి సమస్తకాలంబులందును ఫలించునట్టి వృక్షములతోనిండిన యుద్యానవనంబులతో నెంతయు నొప్పుచుండును. ౧౨

తత్ర త్వం వసతీ సీతే! రాజపుత్రి! మయా సహ,
న స్మరిష్యసి నారీణాం మానుషీణాం మనస్వినీ. ౧౩

భుఞ్జానా మానుషా న్భోగా న్దివ్యాం శ్చ వరవర్ణిని!,
న స్మరిష్యసి రామస్య మానుషస్య గతాయుషః. ౧౪

స్థాపయిత్వా ప్రియం పుత్రం రాజ్ఞా దశరథేన యః,
మన్దవీర్య స్సుతో జ్యేష్ఠస్తతః ప్రస్థాపితో హ్యయమ్. ౧౫

తేన కిం భ్రష్టరాజ్యేన రామేణ గతచేతసా,
కరిష్యసి విశాలాక్షి! తాపసేన తపస్వినా. ౧౬

సర్వరాక్షసభర్తారం కామా త్స్వయ మి హాగతమ్,
న మన్మథశరావిష్టం ప్రత్యాఖ్యాతుం త్వ మర్హసి. ౧౭

ప్రత్యాఖ్యాయ హి మాం భీరు! పరితాపం గమిష్యసి,
చరణే నాభిహత్యేవ పురూరవస మూర్వశీ. ౧౮

అఙ్గుళ్యా న సమో రామో మమ యుద్ధే స మానుషః,
తవ భాగ్యేన సంప్రాప్తం భజస్వ వరవర్ణిని!. ౧౯

ఏవ ముక్తా తు వైదేహీ క్రుద్ధా సంరక్తలోచనా,
అబ్రవీ త్పరుషం వాక్యం రహితే రాక్షసాధిపమ్. ౨౦

మంచి మనస్సుగలదానవు రాచకొమార్తెవు నగుసీతా! అలంకాపురియందు నీవు నాతోఁగూడ విహరింపుచుండువేని యామనుష్యస్త్రీల నెంతమాత్రము స్మరింపకుందువు. ౧౩

ఉత్తమస్త్రీ వగుసీతా! అచ్చట నీవు నాతోఁగూడ మనుష్యలోకంబునందలి భోగంబులను దేవలోకంబునందలి భోగంబులను అనుభవించుచు మనుష్యుండును ఆసన్నమరణుఁడునగు రాము నెంతమాత్రము స్మరింపవు. ౧౪

దశరథమహారాజు తన ప్రియపుత్త్రుఁడగు భరతుని రాజ్యంబున నుంచి రాముఁడు జ్యేష్ఠపుత్త్రుఁడయినను బరాక్రమ హీనుఁడగుటచే గదా యరణ్యంబునకుఁ బంపినాఁడు. అట్టి రాముని ఏల యూరక పొగడెదవు. ౧౫

విశాలములగు కన్నులుగల సీతా! అట్లు పరాక్రమహీనుఁడును రాజ్యభ్రష్టుఁడును బుద్ధిహీనుఁడును దాపసుఁ డగుటచే శౌర్యంబులేనివాఁడును శోచనీయుండు నగు రామునిం బెట్టుకొని నీవేమి చేయఁగలవు! ౧౬

సమస్తరాక్షసేశ్వరుఁడనగు నేను నేనైయే కామావేశంబున నీయొద్దకు వచ్చి మన్మథశరపీడితుఁడనై నిన్ను వేఁడుకొనుచుండునప్పుడు నీవు నన్నుఁ దిరస్కరింపఁదగదు. ౧౭

భయముగలదానా! ఒకవేళ రామభయంబున నన్నిప్పుడు నీవు తిరస్కరించినను ఊర్వశి మొదటఁ జరణపతితుఁడగు పురూరవస్సును గాలందన్ని యావల నతనిం బొందఁ బరితపించినట్లు నీవు అట్టి మహాస్నేహంబుఁ దెలుపుకొంటినే యని పశ్చాత్తాపంబు నొందఁగలవు. ౧౮

ఉత్తమస్త్రీవగుసీతా! మనుష్యుఁడగు రాముఁడు యుద్ధంబున నాయొక వ్రేలికి సరిచాలఁడు. నీవు అతనికి భయపడవలదు. నేను నిభాగ్యవశంబున నీయొద్దకువచ్చి నిన్ను వేఁడుచున్నాను. నన్నుఁ బొందుము. అని రావణుఁడు సీతతోఁ జెప్పెను. ౧౯

సీతాదేవి రావణుఁడు చెప్పినమాటను విని కోపంబునొంది కన్నులనెఱ్ఱదనంబు గదుర విజనప్రదేశంబున రాక్షసరాజుఁడగు రావణుం జూచి పరుషవచనంబున నిట్లనియె. ౨౦

కథం వైశ్రవణం దేవం సర్వభూతనమస్కృతమ్,
భ్రాతరం వ్యపదిశ్య త్వ మశుభం కర్తు మిచ్ఛసి?. ౨౧
అవశ్యం వినశిష్యన్తి సర్వే రావణ! రాక్షసాః,
యేషాం త్వం కర్కశో రాజా దుర్బుద్ధి రజితేన్ద్రియః. ౨౨

అపహృత్య శచీం భార్యాం శక్య మిన్ద్రస్య జీవితుమ్,
న చ రామస్య భార్యాం మా మపనీ యాస్తి జీవితమ్. ౨౩

జీవే చ్చిరం వజ్రధరస్య హస్తా
చ్ఛచీం ప్రధృష్యాప్రతిరూపరూపామ్,
న మాదృశీం రాక్షస! దూషయిత్వా
పీతామృతస్యాపి తవాస్తి మోక్షః. ౨౪

ఇతి శ్రీమదరణ్యకాణ్డేఽష్టచత్వారింశ స్సర్గః. ౪౮.

---

## ఏకోనపఞ్చాశ స్సర్గః.

సీతాయా వచనం శ్రుత్వా దశగ్రీవః ప్రతాపవాన్,
హస్తే హస్తం సమాహత్య చకార సుమహ ద్వపుః. ౧

స మైథిలీం పున ర్వాక్యం బభాషే చ తతో భృశమ్,

నోన్మత్తయా శ్రుతౌ మన్యే మమ వీర్యపరాక్రమౌ. ౨

ఉద్వహేయం భుజాభ్యాం తు మేదినీ మమ్బరే స్థితః,
ఆపిబేయం సముద్రం చ హన్యాం మృత్యుం రణే స్థితః. ౩

నీవు సమస్తభూతనమస్కృతుఁడును బుణ్యాత్ముఁడ నగు కుబేరుఁడు నా కన్న యని చెప్పుకొనుచు నిట్టిపాపము చేయఁబూనితివేమి? ౨౧

రాక్షసులకు రాజయిన నీవిట్లు క్రూరుఁడవుగాను దురాత్ముఁడవుగాను ఇంద్రియలోలుఁడవుగా నున్నావు గావున రాక్షసులందఱు తప్పక నాశంబు నొందుదురు. ౨౨

ఇంద్రునిభార్యను శచీదేవి నపహరించియయినను బ్రాణముతో నుండవచ్చునుగాని రామునిభార్యనగు నన్నపహరించిమాత్రము ఎంతయుఁజీవింప నలవిగాదు. ౨౩

వజ్రాయుధంబుదాల్చియుండు దేవేంద్రుని యెదుటఁ బరమసౌందర్యశాలినియగు శచీదేవి నవమానించితివేనను బ్రతుకవచ్చునుఁగాని నాయట్టిదాని నవమానించి నీవు అమృతంబు ద్రావినను బ్రాణముతో నుండఁజాలవు. అని సీతాదేవి రావణునితోఁ జెప్పెను. ౨౪

ఇది నలువదియొనిమిదవసర్గము.

---

## నలువదితొమ్మిదవసర్గము.

మహాపరాక్రమశాలియగు రావణుఁడు సీతాదేవి చెప్పిన మాటను విని కోపంబున చేయిమీఁద చేయిగొట్టి భయంకరాకారంబగు రూపముఁ దాల్చెను. ౧

ఆరావణుఁ డంత మఱల సీతాదేవిం జూచి మఱియుఁ గఠినంబుగా నిట్లని చెప్పెను.

నీవు పిచ్చిదానవుగా నున్నావు. నాబలపరాక్రమములను నేను మున్ను చెప్పినప్పుడు నీవు విననే లేదని తలంచెదను. ౨

నేను ఆకాశంబున నిలిచి రెండుచేతులచే నీభూమినంతయు నెత్తుదును. సముద్రం బంతయుఁ ద్రావివేయుదును. యుద్ధంబున మృత్యువునుం గూడ వధించివుత్తును. ౩

అర్కం రున్ధ్యాం శరై స్తీక్ష్ణై ర్విభిన్ద్యాం హి మహీతలమ్,
కామరూపిణ మున్మత్తే! పశ్య మాం కామదం పతిమ్. ౪

ఏవ ముక్తవత స్తస్య సూర్యకల్పే శిఖిప్రభే,
క్రుద్ధస్య హరిపర్యన్తే రక్తే నేత్రే బభూవతుః. ౫

సద్య స్సౌమ్యం పరిత్యజ్య భిక్షురూపం స రావణః,
స్వం రూపం కాలరూపాభం భేజే వైశ్రవణానుజః. ౬

సంరక్తనయన శ్శ్రీమాం స్తప్తకాఞ్చనకుణ్డలః,
క్రోధేన మహతాఽఽవిష్టో నీలజీమూతసన్నిభః. ౭
దశాస్యః కార్ముకీ బాణీ బభూవ క్షణదాచరః,

స పరివ్రాజకచ్ఛద్మ మహాకాయో విహాయ తత్. ౮
ప్రతిపద్య స్వకం రూపం రావణో రాక్షసాధిపః,
సంరక్తనయనః క్రోధా జ్జీమూతనిచయప్రభః. ౯
రక్తామ్బరధర స్తస్థౌ స్త్రీరత్నం ప్రేక్ష్య మైథిలీం,
స తా మసితకేశాన్తాం భాస్కరస్య ప్రభా మివ. ౧౦
వసనాభరణోపేతాం మైథిలీం రావణోఽబ్రవీత్,

త్రిషు లోకేషు విఖ్యాతం యది భర్తార మిచ్ఛసి. ౧౧
మా మాశ్రయ వరారోహే! తవాహం సదృశః పతిః,

మాం భజస్వ చిరాయ త్వ మహం శ్లాఘ్యః ప్రియ స్తవ. ౧౨

తీక్ష్ణబాణంబుల సూర్యు నడ్డగింతును. భూమినంతయు భేదింతును. పిచ్చిదానా! నాసంగతి నీకుఁ దెలియలేదు. కామరూపిని. కోరినవానినెల్ల నొసంగువాఁడను. నీకుఁ దగినపెనిమిటినగు నారూపంబుఁ జూడుము. అని రావణుఁడు సీతతోఁ జెప్పెను. ౪

ఇట్లు చెప్పుచున్న క్రుద్ధుఁడగు నారావణునియొక్క సూర్యాగ్నిసమానములును గొనలఁ బింగళవర్ణములునగు నేత్రంబులు మిక్కిలియు నెఱ్ఱనివయ్యెను. ౫

కుబేరునితమ్ముఁడగు నారావణుఁడంత నాక్షణమె సౌమ్యంబును బూజనీయంబు నగు నాసన్న్యాసిరూపంబు విడిచి యమునిరూపమువలె నతిభయంకరంబగు తనరూపము ధరించెను. ౬

రావణుఁడు పరమకుపితుఁడై కన్నుల నెఱ్ఱఁదనంబుగదుర నప్పుడు అభిక్షురూపంబు విడిచి శ్రీమంతుఁడును మంచిబంగారుపోఁగులు గలవాఁడును నీలమేఘవర్ణుండునుబదితలలుగలవాఁడునుధనుర్బాణంబులుగలవాఁడునై పొడసూపెను. ౭

మహాకాయుఁడును రాక్షసేశ్వరుఁడునగు నారావణుఁడు ఆసన్న్యాసిరూపమును విడిచి నిజరూపంబుఁ దాల్చి కోపంబునఁ గన్నుల నెఱ్ఱఁదనంబు గదుర మేఘసమానవర్ణుఁడై రక్తవస్త్రధరుండై యుత్తమస్త్రీయగు సీతాదేవిం జూచుచు నిలుచుండెను. ౮-౯

ఆరావణుఁడు నల్లనివెండ్రుకల కొనలుగలదియు సూర్యకాంతివలెఁ దేజిచూడ నలవిగాకున్నదియు మంచివస్త్రంబును ఆభరణంబులను ధరించి యున్నదియు నగు నాసీతాదేవిం జూచి యిట్లనియె. ౧౦

సుందరమయిన పిఱుఁదులుగల సీతా! ముల్లోకంబులయందును ప్రసిద్ధిఁగాంచిన పెనిమిటి కావలెనని కోరెదవేని నన్నాశ్రయింపుము. నీకు సరియయిన పెనిమిటిని నేను. ౧౧

మంగళరూపిణివగుసీతా! బహుకాలమునకు నీకుఁ దగినశ్లాఘ్యభర్తను

నైవ చాహం క్వచి ద్భద్రే! కరిష్యే తవ విప్రియమ్,
త్యజ్యతాం మానుషో భావో మయి భావః ప్రణీయతామ్ ౧౩
రాజ్యా చ్చ్యుత మసిద్ధార్థం రామం పరిమితాయుషమ్,
కై ర్గుణై రనురక్తాఽసి మూఢే! పణ్డితమానిని!. ౧౪
యః స్త్రియా వచనా ద్రాజ్యం విహాయ ససుహృజ్జనమ్,
అస్మి న్వ్యాళానుచరితే వనే వసతి దుర్మతిః. ౧౫
ఇ త్యుక్త్వా మైథిలీం వాక్యం ప్రియార్హాం ప్రియవాదినీం,
అభిగమ్య సుదుష్టాత్మా రాక్షసః కామమోహితః. ౧౬
జగ్రాహ రావణ స్సీతాం బుధః ఖే రోహిణీ మివ,
వామేన సీతాం పద్మాక్షీం మూర్ధజేషు కరేణ సః. ౧౭
ఊర్వో స్తు దక్షిణే నైవ పరిజగ్రాహ పాణినా,
తం దృష్ట్వా మృత్యుసంకాశం తీక్ష్ణదంష్ట్రం మహాభుజమ్ ౧౮
ప్రాద్రవ న్గిరిసఙ్కాశం భయార్తా వనదేవతాః,
స చ మాయామయో దివ్యః ఖరయుక్తః ఖరస్వనః. ౧౯
ప్రత్యదృశ్యత హేమాఙ్గో రావణస్య మహారథః,
తత స్తాం పరుషై ర్వాక్యై రభిభర్త్స్య స మహాస్వనః. ౨౦
అఙ్కే నాదాయ వైదేహీం రథ మారోపయ త్తదా,
సా గృహీతా విచుక్రోశ రావణేన యశస్వినీ. ౨౧
రామేతి సీతా దుఃఖార్తా రామం దూరగతం వనే,

నేను దొరికితిని. కావున నన్నాశ్రయింపుము. నేను నీ కెప్పుడును ఏవిధ మయిన యపకారమును జేయను. ౧౨

నీవు మనుష్యునిపై మనస్సు విడిచి నాపై మనసు నుంచుము. ౧౩

సీతా! నీకేమియుఁ దెలియకున్నను పండితురాల నని యహంకారము మాత్రముగలదు. స్త్రీమాట వినియకంటకంబగు రాజ్యమును బంధువులను విడిచి క్రూరమృగసేవితం బగు నీయరణ్యంబున నున్నాఁడే. యిట్టి దుర్బుద్ధియు రాజ్యభ్రష్టుఁడును ఏకార్యముఁ దెలియనివాఁడును ఆసన్నమరణుఁడునగు రామునియందు ఏగుణములు చూచి నీ వతనిపై ననురాగము నొందియున్నావు. అని రావణుఁడు సీతతోఁ జెప్పెను. ౧౪-౧౫

దుష్టాత్ముఁడగు రావణుఁడు ప్రియవచనంబులకే దగినదియు నొకప్పుడేని యొరులంజూచి యప్రియంబు లాడనిదియునగు సీతం జూచి యట్టిక్రూరవచనంబులాడి ఆకాశంబున బుధుఁడు రోహిణిం బట్టునట్లు సీతం బట్టుకొనెను. ౧౬

ఆరావణుఁడు శాపభయంబున సీతాదేవిదేహము తనచేయి దగులకుండునట్లు వామహస్తంబున వెండ్రుకలను గుడిచేతం దొడలను బట్టుకొనెను. ౧౭

వనదేవతలందఱు ఆసీతాదేవి నెత్తుకొనుచున్న మృత్యువుంబోలె భయంకరాకారుఁడునుబర్వతాకారుఁడును దీక్ష్ణదంష్ట్రుఁడును మహాబాహుఁడు నగు నారావణుంజూచి భయంబునం బరుగెత్తిరి. ౧౮

మాయచే నింతవఱకుఁ బ్రచ్ఛన్నమయియుండిన, దివ్యంబును గాడిదలు పూన్చినదియు మహాధ్వనిగలదియు బంగారుచక్రములుగలదియు నగు నారావణుని మహారథము నప్పుడు పొడసూపెను. ౧౯

మహాధ్వనియగు నారావణుఁడంతఁ బరుషవచనంబుల నాసీతను బెదరించుచు ఎత్తి తనరథముపైఁ గూర్చుండఁబెట్టెను. ౨౦

మహాపతివ్రతయగు నాసీత అట్లు రావణునిచే గ్రహింపఁబడినదై యరణ్యంబునందు దూరముననున్న రామునిం జేరొకని యెంతయు విలపించెను. ౨౧

తా మకామాం స కామా_ర్తః పన్నగేన్ద్రవధూ మివ. ౨౨
వివేష్టమానా మాదాయ ఉత్పపా తాథ రావణః,

తత స్సా రాక్షసేన్ద్రేణ హ్రియమాణా విహాయసా. ౨౩
భృశం చుక్రోశ మ_త్తేవ భ్రా_న్తచిత్తా యథాఽఽతురా,

హా లక్ష్మణ! మహాబాహో! గురుచి_త్తప్రసాదక!. ౨౪
హ్రియమాణాం న జానీషే రక్షసా మా మమర్షిణా,

జీవితం సుఖ మర్థాం శ్చ ధర్మహేతోః పరిత్యజన్. ౨౫
హ్రియమాణా మధర్మేణ మాం రాఘవ! న పశ్యసి,

నను నా మావినీతానాం వినేతాఽసి పర న్తప!. ౨౬
కథమేవంవిధం పాపం న త్వం శాసి హి రావణమ్,
నను సద్యోఽవినీతస్య దృశ్యతే కర్మణః ఫలమ్. ౨౭
కాలోఽప్యఙ్గీభవ త్యత్ర సస్యానా మివ ప_క్తయే,

స కర్మ కృతవా నేత త్కాలోపహతచేతనః. ౨౮
జీవితా_న్తకరం ఘోరం రామా ద్వ్యసన మాప్నుహి,
హా న్తేదానీం సకామాః స్తు కైకేయీ సహ బాన్ధవైః. ౨౯
హ్రియే యద్ధర్మకామస్య ధర్మపత్నీ యశస్వినః,

ఆమన్త్రయే జనస్థానే కర్ణికారాం స్తుపుష్పితాన్. ౩౦
క్షిప్రం రామాయ శసధ్వం సీతాం హరతి రావణః,

కామార్తుఁడగు నారావణుఁడు తనతోఁగూడవచ్చుట కెంతమాత్రము నిచ్చలేనిదియు నాగకన్యకవలెఁ బొరలాడుచున్నదియు నగు నాసీతాదేవిం దీసికొని యంత నాకాశంబున నుద్గమించెను. ౨౨

అంత నాసీతాదేవి యట్లు రాక్షసరాజుఁడగు రావణునిచే నాకాశమార్గంబునం గొనిపోఁబడుచు కైపునొందినదివలె మోహామునొందినదివలెఁ బల మదుఃఖితయయి యఱచెను. ౨౩

ఆయ్యో! అన్నమనస్సున కెప్పుడును సంతోషంబుగలుగఁజేయువాఁడవు మహాబాహుఁడవు నగు లక్ష్మణుఁడా! కుపితుఁడగు నీరాక్షసుఁడున న్నిప్పు డపహరించుకొనిపోవుచున్నాఁ డనుట నీకుఁ దెలియదుగదా! ౨౪

రాముఁడా ధర్మమునిమిత్తమయి ప్రాణంబును సుఖంబును ధనంబులను అన్నిటిని విడుచునట్టి మహానుభావుఁ డవు నీవుగూడ అధర్మంబున నన్నీ రావణుఁ డపహరించుకొని పోవుటఁ జూడకున్నావుగదా! ౨౫

శత్రువుల వధించునట్టి రాముఁడా! నీవు దుష్టుల నందఱను శిక్షించువాఁడవే. ఇట్టి పరమదుష్టుఁడగు నీరావణుని శిక్షింపకున్నా వేల? ౨౬

ఓయి! దుష్టకార్యముచేసినట్టయినదానికి ఫలము తత్క్షణమే యనుభవమునకువచ్చును. పైరుపంటకుఁ గాలము సహాయపడునట్లు దీనికిం గాలమె సహాయపడును. ౨౭

అట్లు నీవు కాలవశంగతుఁడవై యిట్టికార్యము గావించినావు. కావున నీవు భయంకరంబగు నాపదంబొంది రామునిచేతనే వధింపఁబడుదువుగాక.

ధర్మకాముఁడును గీర్తిమంతుఁడు నగురాముని ధర్మపత్నినగు నన్ను రాక్షసుఁ డపహరించుకొని పోవుచున్నాఁడు. కావున ఇప్పుడు కైకేయియు ఆబిడకుఁ గావలసినవారలును దమమనోరథం బీడేఱినది కాఁబట్టి సంతోషంబు నొందుదురుగాక. ౨౯

జనస్థానంబునందుఁబుష్పితంబులయియుండు కర్ణికారవృక్షములారా! మిమ్ముఁ బిలిచి వేఁడుకొనెదను. 'రావణుఁడు సీత నపహరించుకొని పోవుచున్నాఁ'డని శీఘ్రంబున రామునకుఁ జెప్పుఁడు. ౩౦

మాల్యవ న్తం శిఖరిణం వన్దే ప్రస్రవణం గిరిమ్. 31
క్షిప్రం రామాయ శంస త్వం సీతాం హరతి రావణః,

హంసకారణ్డవాకీర్ణాం వన్దే గోదావరీం నదీమ్. 32
క్షిప్రం రామాయ శంస త్వం సీతాం హరతి రావణః,

దైవతాని చ యా న్యస్మి న్వనే వివిధపాదపే. 33
నమస్కరో మ్యహం తేభ్యో భర్తు శ్శంసత మాం హృతామ్,

యాని కానిచి ద ప్యత్ర సత్త్వాని నివస న్త్యుత. 34
సర్వాణి శరణం యామి మృగపక్షిగణా నపి,
హ్రియమాణాం ప్రియాం భర్తుః ప్రాణేభ్యోఽపి గరీయసీమ్.
వివశాఽపహృతా సీతా రావణేనేతి శంసత,

విదిత్వా మాం మహాబాహు రము త్రాపి మహాబలః. 35
ఆనేష్యతి పరాక్రమ్య వైవస్వతహృతా మపి,

సా తదా కరుణా వాచో విలప న్తీ సుదుఃఖితా. 36
వనస్పతిగతం గృధ్రం దదర్శాఽఽయతలోచనా,

సా త ముద్వీక్ష్య సుశ్రోణీ రావణస్య వశం గతా. 37
సమాక్రన్ద ద్భయపరా దుఃఖోపహతయా గిరా,

జటాయో! పశ్య మా మార్య! హ్రియమాణా మనాథవత్.
అనేన రాక్షసేన్ద్రేణ కరుణం పాపకర్మణా,

ప్రస్రవణపర్వతమా! పుష్పములుగలవాఁడవును మంచిశిఖరములుగలవాఁడవు నగు నీకు నమస్కరించెదను. నీవు రావణుఁడు సీతాదేవి నపహరించుకొనిపోవుచున్నాఁడని శీఘ్రంబున రామునకుఁ జెప్పుము. ౩౧

మధురంబుగాఁగూయు హంససారసపక్షులతో నొప్పుచున్న గోదావరీనదీ! నీకు నమస్కరించెదను. నీవు రావణుఁడు సీతను అపహరించుకొనిపోవుచున్నాఁడని శీఘ్రంబుగా రామునకుఁ జెప్పుము. ౩౨

నానావిధములగు వృక్షములుగల యీవనమునం దుండు దేవతలకందఱకు నమస్కరించెదను. వారలైనను నన్ను రాక్షసుఁ డపహరించినాఁడని నాపెనిమిటికిఁ జెప్పుదురుగాక. ౩౩

ఈవనంబునందు నివసించుజంతువులలో మృగపక్షులు మొదలుగాఁగలవాని నన్నింటిని శరణుపొందెదను. ౩౪

మీరలు రామునొద్దకుఁబోయి నీకుఁబ్రాణంబులకన్నఁ బ్రియురాలగు నీభార్య సీత పరవశురాలయి రావణునిచే నపహరింపఁబడినదని రామునకుఁ జెప్పుఁడు. ౩౫

మహాబాహుఁడును మహాబలుఁడు నగురాముఁడు నేనున్నస్థలముఁ దెలియునేని నేను స్వర్గముననున్నను యమలోకంబుననున్నను బరాక్రమబలంబున నన్నుఁ దెచ్చుకొనును. అని సీతాదేవి యఱచినది ౩౬

అప్పుడు విశాలంబులగు నేత్రంబులుగల యాసీతాదేవి పరమదుఃఖితయయి వినువారికిఁగూడ దుఃఖంబు గలుగునట్లు రోదనంబుసేయుచు వృక్షగతుఁడై యున్న జటాయువుం జూచెను. ౩౭

అట్లు రావణవశంగతయయియున్న సుందరములగు పిఱుఁదులుగల యాసీతాదేవి ఆజటాయువుఁ జూచి భయదుఃఖంబులు మనంబునఁ బెనంగొన నీప్రకారంబున నఱచెను. ౩౮

పూజ్యుఁడవగుజటాయువా! పాపిష్ఠుఁడగు నీరాక్షసరాజు రావణుఁడు నన్ను దిక్కులేనిదానింబోలె నపహరించుకొని పోవుచున్నాఁడు చూడుము.

నైష వారయితుం శక్య స్తవ క్రూరో నిశాచరః. ४०
సత్త్వవా ఞ్జితకాశీ చ సాయుధ శ్చైవ దుర్మతిః,
రామాయ తు యథాత త్త్వం జటాయో! హరణం మమ ४౧
లక్ష్మణాయ చ త త్సర్వ మాఖ్యాతవ్య మశేషతః. ४౧½

ఇతి శ్రీమదరణ్యకాణ్డ ఏకోనపఞ్చాశ స్సర్గః. ४౯.

---

పఞ్చాశ స్సర్గః.

తం శబ్ద మవసు ప్త స్తు జటాయు రథ శుశ్రు వే,
నిరీక్ష్య రావణం క్షిప్రం వై దేహీం చ దదర్శ సః. ౧
తత స్పర్వతకూటాభ స్తీక్ష్ణతుణ్డః ఖగో త్తమః,
వనస్పతిగత శ్శ్రీమా న్వ్యాజహార శుభాం గిరమ్. ౨

దశగ్రీవ! స్థితో ధర్మే పురాణే సత్యసంశ్రయః,
జటాయు ర్నామ నామ్నాఽహం గృధ్రరాజో మహాబలః. ౩

రాజా సర్వస్య లోకస్య మహేన్ద్రవరుణోపమః,
లోకానాం చ హితే యుక్తో రామో దశరథాత్మజః. ४

తస్యైషా లోకనాథస్య ధర్మపత్నీ యశస్వినీ,
సీతానామ వరారోహా యాం త్వం హర్తు మి హేచ్ఛసి. ౫
కథం రాజా స్థితో ధర్మే పరదారా న్పరామృశేత్,
రక్షణీయా విశేషేణ రాజదారా మహాబల!. ౬

ఈరాక్షసుఁడు బలవంతుఁడు జయశీలుఁడు నాయుధధరుఁడును క్రూరుఁడును గావున నీ కితని నెదిరింప నలవిగాదు. ౪౦

జటాయువా! అందువలన నీవు రావణుఁడు నన్నపహరించిన సమాచారమునంతయు యథార్థముగా నిశ్శేషముగా రామునకును లక్ష్మణునకును జెప్పుము. అని సీత జటాయువుతోఁ జెప్పెను. ౪౧

ఇది నలుబదితొమ్మిదవసర్గము.

---

## ఏఁబదియవ సర్గము.

అంతఁ జెట్టుమీఁద నిద్రించుచుండిన జటాయువు ఆశబ్దమును విని మేల్కొని రావణుని సీతాదేవినిం జూచెను. ౧

అంతఁ బర్వతశిఖరాకారుఁడును దీక్ష్ణవానుఁడును శ్రీమంతుఁడునగు నాజటాయువు చెట్టుమీఁదనుండియే రావణుం జూచి మంగళకరంబగు నీమాటం జెప్పెను. ౨

రావణుఁడా! నేను ధర్మంబు దప్పనివాఁడను సత్యవాదిని. నాపేరు జటాయువందురు. గృధ్రరాజుఁడను మహాబలశాలిని. నేను చెప్పుమాటను వినుము. ౩

దశరథమహారాజకుమారుఁడగు రాముఁడు సమస్తలోకంబునకును ప్రభువు. దేవేంద్రవరుణులకు సమానుండు. సమస్తలోకంబులకును హితంబు సేయువాఁడు. ౪

ఈసీతాదేవి లోకనాథుఁడగు నారాముని ధర్మపత్ని మహాపతివ్రత. ఆబిడను నీవు అపహరించుట ఎంతమాత్రము తగదు. ౫

మహాబలుఁడవగు రావణుఁడా! ధర్మంబు నవలంబించియున్న నీయట్టి రాజు పరస్త్రీలం బాఁకవచ్చునా? అందును విశేషించి రాజస్త్రీల నేమఱక రక్షింపవలెను. ౬

నివర్తయ మతిం నీచాం పరదారాభిమర్శనాత్,
న తత్సమాచరే ద్ధీరో యత్పరోఽస్య విగర్హయేత్. ౭

యథాఽఽత్మన స్తథాఽన్యేషాం దారా రక్ష్యా విపశ్చితా,

ధర్మమర్థం చ కామం చ శిష్టాః శాస్త్రే ష్వనాగతమ్. ౮
వ్యవస్యన్తి న రాజానో ధర్మం పౌలస్త్యనన్దన!,

రాజా ధర్మస్య కామస్య ద్రవ్యాణాం చోత్తమో నిధిః. ౯
ధర్మ శ్శుభం వా పాపం వా రాజమూలం ప్రవర్తతే,

పాపస్వభావ శ్చపలః కథం త్వం రక్షసాం వర!. ౧౦
ఐశ్వర్య మభిసంప్రాప్తో విమాన మివ దుష్కృతిః,

కామం స్వభావో యో యస్య న శక్యః పరిమార్జితుమ్. ౧౧
న హి దుష్టాత్మనా మార్య మావస త్యాలయే చిరమ్,

విషయే వా పురే వా తే యదా రామో మహాబలః. ౧౨
నాపరాధ్యతి ధర్మాత్మా కథం త స్యాపరాధ్యసి,

యది శూర్పణఖాహేతో ర్జనస్థానగతః ఖరః. ౧౩
అతివృత్తో హతః పూర్వం రామే ణాక్లిష్టకర్మణా,
అత్ర బ్రూహి యథాతత్త్వం కో రామస్య వ్యతిక్రమః. ౧౪
యస్య త్వం లోకనాథస్య భార్యాం హృత్వా గమిష్యసి,

నీచమయిన యీపరదారాభిమర్శనబుద్ధిని వదలుము. పండితుఁడగువాఁడు తా నేకార్యముచేసిన నితరులు దన్ను నిందింతురో ఆకార్యము నెంతమాత్రము చేయఁగూడదు. ౭

ఎట్లు తనభార్యను బరపురుషసంబంధము గలుగకుండునట్లు తాను రక్షించుకొనునో అట్లు ఇతరభార్యలనుగూడ రక్షింపవలెను.

రావణుఁడా! శిష్టులగురాజులు శాస్త్రనిషిద్ధమయిన ధర్మమునుగాని యర్థమునుగాని కామమునుగాని యెంతమాత్రము కోరరు. కావున నీవు ధర్మంబు దప్పకుము. ౮

రాజు ధర్మమునకును గామమునకును అర్థమునకును మూలము. రాజు ధర్మము నాచరించిన జనులును ధర్మము నాచరింతురు. రాజు పాపము నాచరించిన జనులును బాపము నాచరింతురు. కావున రాజవగు నీవు ధర్మము దప్పరాదు. ౯

రాక్షసశ్రేష్ఠుఁడవగు రావణుఁడా! పాపస్వభావుఁడవు విషయలోలుఁడవు నగు నీకు పాపిష్ఠునకు దేవవిమానము లబ్ధమయినట్లు ఈయైశ్వర్యమెట్లు లబ్ధమయినది? ఇంక శీఘ్రమున నశింపఁగలదు. ౧౦

వారివారిస్వభావమును బోఁగొట్టుట కెంతమాత్రము శక్యముకాదు; అయితే దుష్టాత్ములయింట నైశ్వర్యము చిరకాల ముండఁజాలదు. శీఘ్రముగనే నశించును. ౧౧

మహాబలశాలియు ధర్మాత్ముఁడునగురాముఁడు నీరాజ్యంబునందుఁగాని పట్టణమునందుఁగాని యేవిధమయినయపరాధమును జేయకుండునప్పుడు నీ వేల యతని కపరాధము గావించెదవు? ౧౨

ఎవ్వరికిని దుఃఖముగలిగింపని రాముఁడు మున్ను శూర్పణఖనిమిత్తమయి యధికప్రసంగముగావించిన ఖరుని వధించినాఁడు. అందుకు నేను రామునిభార్య నపహరించుకొని పోయెద నని చెప్పెదవు కాఁబోలు; ఈ విషయమునందు రాముని తప్పేమియున్నది. నీవు యథార్థముగాఁ జెప్పుము.

క్షిప్రం విసృజ వై దేహీం మా త్వా ఘోరేణ చక్షుషా. ౧౫
దహే ద్దహనభూతేన వృత్ర మిన్ద్రాశని ర్యథా,

సర్ప మిమాశీవిషం బద్ధ్వా వస్త్రాన్తే నావబుధ్యసే. ౧౬

గ్రీవాయాం ప్రతిముక్తం చ కాలపాశం న పశ్యసి,

స భార స్సౌమ్య! భర్తవ్యో యో నరం నావసాదయేత్,
తదన్న మపి భోక్తవ్యం జీర్యతే య దనామయమ్,

య త్కృత్వా న భవే ద్ధర్మో న కీర్తి ర్న యశో భువి. ౧౮
శరీరస్య భవే త్ఖేదః క స్తత్కర్మ సమాచరేత్,
షష్టి ర్వర్షసహస్రాణి మమ జాతస్య రావణ!. ౧౯
పితృపైతామహం రాజ్యం యథావ దనుతిష్ఠతః,
వృద్ధోఽహం త్వం యువా ధన్వీ సశరః కవచీ రథీ. ౨౦
తథాఽప్యాదాయ వై దేహీం కుశలీ న గమిష్యసి,

న శక్త స్త్వం బలా ద్ధర్తుం వైదేహీం మమ పశ్యతః ౨౧
హేతుభి ర్న్యాయసంసిద్ధై ర్ధ్రువాం వేదశ్రుతీ మివ,

యుధ్యస్వ యది శూరోఽసి ముహూర్తం తిష్ఠ రావణ!. ౨౨
శయిష్యసే హతో భూమౌ యథా పూర్వం ఖర స్తథా,
అసకృ త్సంయుగే యేన నిహతా దైత్యదానవాః. ౨౩
నచిరా చ్చీరవాసా స్త్వాం రామో యుధి వధిష్యతి,
కిన్ను శక్యం మయా కర్తుం గతౌ దూరం నృపాత్మజౌ. ౨౪
క్షిప్రం త్వం నశ్యసే నీచ! తయో ర్భీతో న సంశయః,

సీతాదేవి శీఘ్రముగా విడువుము ; లేనియెడఁ గోపముతోఁగూడిన భయంకరాకారంబగు రాముని నేత్రము నిప్పులు గ్రక్కుచు నింద్రునివజ్రాయుధము వృత్రుని వధించినట్లు నిన్ను దహించును. ౧౫

మహావిషంబగుసర్పమును కొంగునం గట్టుకొని యేమియుఁ దెలియకున్నావు. ౧౬

నీకంఠమునకుఁ బ్రాణహారంబగు కాలపాశంబు తగులుకొని యుండుటనుగూడఁ జూచుకొనకున్నావు.

సౌమ్యుఁడా! దేని మోసిన మనిషికి నుపాధి గలుగదో ఆబరువును మోయవలయును. ఏది రోగమేమియుఁ గలిగింపక సుఖముగా జీర్ణమగునో ఆయన్నమును భుజింపవలయును. ఆలోచించుము. ౧౭

దేనిచేసినచో ధర్మముగాని కీర్తిగాని గలుగదో దేహమునకు దుఃఖము మాత్రము గలుగునో అట్టికార్యము నెవ్వఁడు సేయును? ౧౮

రావణుఁడా! నేనుబుట్టి నాపితృపైతామహమయిన గృధ్రరాజ్యంబుఁ గ్రమంబుగఁ బరిపాలించుచు, నిప్పటికి అఱువదివేలయేండ్లు గడపినాను. ౧౯

నేను ముసలివాఁడను నిరాయుధుఁడను. నీవు యౌవనవంతుఁడవు ధనుర్బాణంబులు దాల్చి కవచంబుఁదొడుగుకొని రథగతుఁడవై యున్నావు. అట్లయినను నిన్ను సీతం దీసికొని క్షేమంబుగఁ బోనివ్వను. ౨౦

తర్కముతోఁగూడినకారణముచే వేదము ఖండింప నలవిగానట్లు నేను జూచుచుండఁగా సీతాదేవిఁ గొనిపోవ నీకెంతమాత్ర మలవిగాదు. ౨౧

రావణుఁడా! శూరుఁడవగుదువేని కొంచెముసేపు నిలిచి యుద్ధముసేయుము. మున్ను ఖరుఁడువలె నీవును హతుఁడవై నేలంబరుండి యుందువు.

ఎవ్వఁడును యుద్ధంబునఁబలుమాఱు దైత్యదానవులం జంపినాఁడో ఆ వల్కలధరుఁడగు రాముఁడుశీఘ్రంబున నేనిన్ను యుద్ధంబున వధించిపుచ్చును.

నీచుఁడా! రామలక్ష్మణులు బహుదూరము పోయియున్నారు. నేను వారలను శీఘ్రముగాఁ బిలుచుకొని రాఁజాలనని నీవు వారలభయంబున శీఘ్రమున వారల కంటంబడక పోవలెనని పోవుచున్నావు. సందియములేదు. ౨౪

న హి మే జీవమానస్య నయిష్యసి శుభా మిమామ్. ౨౫
సీతాం కమలపత్త్రాక్షీం రామస్య మహిషీం ప్రియామ్,

అవశ్యం తు మయా కార్యం ప్రియం తస్య మహాత్మనః, ౨౬
జీవితే నాపి రామస్య తథా దశరథస్య చ,

తిష్ఠ తిష్ఠ దశగ్రీవ! ముహూర్తం పశ్య రావణ!. ౨౭
యుద్ధాతిథ్యం ప్రదాస్యామి యావత్ప్రాణం నిశాచర!,
వృన్తా దివ ఫలం త్వాం తు పాతయేయం రథోత్తమాత్.

ఇతి శ్రీమదరణ్యకాణ్డే పఞ్చాశ స్సర్గః. ౫౦.

---

ఏ క ప ఞ్చా శ స్స ర్గః.

ఇ త్యుక్తస్య యథాన్యాయం రావణస్య జటాయుషా,
క్రుద్ధ స్యాగ్నినిభా స్సర్వా రేజు ర్వింశతిదృష్టయః. ౧
సంరక్తనయనః కోపా త్తప్తకాఞ్చనకుణ్డలః,
రాక్షసేన్ద్రోఽభిదుద్రావ పతగేన్ద్ర మమర్షణః. ౨

స సంప్రహార స్తుముల స్తయో స్తస్మి న్మహావనే,
బభూవ వాతోద్ధతయో ర్మేఘయో ర్గగనే యథా. ౩

త ద్బభూ వాద్భుతం యుద్ధం గృధ్రరాక్షసయో స్తథా,
సపక్షయో ర్మాల్యవతో ర్మహాపర్వతయో రివ. ౪
తతో నాళీకనారాచై స్తీక్ష్ణాగ్రై శ్చ వికర్ణిభిః,
అభ్యవర్ష న్మహాఘోరై ర్గృధ్రరాజం మహాబలః. ౫

నేను బ్రతికియుండునంతవఱకు నీవుతామరపూరేకులవంటి విశాలనే త్రంబుగలదియు రామునిప్రియభార్యయు మంగళరూపిణియునగు నీసీతాదేవిం గొనిపోఁజాలవు. ౨౫

నే నవశ్యము ప్రాణమువిడిచియయినను మహాత్ముఁడగు రామునకును ఆతని తండ్రియు నాస్నేహహితుఁడు నగు దశరథునకును బ్రియము సేయవలయును. ౨౬

రావణుఁడా! నిలునిలు. కొంచెము నేపుచూడుము. నాబలముకొలఁది యుద్ధముగావించెదను. నిన్నే మొయూరకపోనివ్వను. ౨౭

తొడిమనుండి ఫలమును బడఁద్రోయునట్లు నిన్ను రథంబుననుండి నేలం బడఁద్రోసెదను. అని జటాయువు రావణునితోఁ జెప్పెను. ౨౮

ఇది యేఁబదియవసర్గము.

---

## ఏఁబదియొకటవసర్గము.

ఇట్లు జటాయువు న్యాయము నవలంబించి చెప్పఁగానే రావణుఁడు ఇరువదికన్నుల నిప్పులురాలఁ బరమకుపితుఁ డయ్యెను. ౧

మంచి బంగారుపోగులు ధరించి యున్న రాక్షసరాజు రావణుఁడు కుపితుఁడై కోపంబునఁ గన్నుల నెఱ్ఱఁదనంబు గదురఁ బక్షిరాజుఁడగు జటాయువుపై కడరెను. ౨

ఆకాశంబున మేఘంబులు వాతోద్ధతంబులయి యొండొంటిం దాఁకునట్లు ఆమహావనంబునందు ఆరావణజటాయువులు ఒండొరులం దాఁకి తుములంబుగాఁ బోరిరి. ౩

అప్పుడు మాల్యవంతములను పేరుగలపర్వతములు రెండును ఱెక్కలనొంది పోరునట్లు ఆజటాయురావణులు ఆశ్చర్యకరంబుగాఁ బోరిరి. ౪

అంత మహాబలుఁడగు రావణుఁడు గృధ్రరాజుఁడగు జటాయువుపై తీక్ష్ణంబులును మహాభయంకరములు నగు నానావిధబాణంబులం బ్రయోగించెను. ౫

స తాని శరజాలాని గృధ్రః పత్త్రరథేశ్వరః,
జటాయు ప్రతిజగ్రాహ రావణాస్త్రాణి సంయుగే. ౬
తస్య తీక్ష్ణనఖాభ్యాం తు చరణాభ్యాం మహాబలః,
చకార బహుధా గాత్రే వ్రణా న్పతగసత్తమః. ౭
అథ క్రోధా ద్దశగ్రీవో జగ్రాహ దశ మార్గణాన్.
మృత్యుదణ్డనిభా న్ఘోరా చ్ఛత్రుమర్దనకాఙ్క్షయా. ౮
స తై ర్బాణై ర్మహావీర్యః పూర్ణముక్తై రజిహ్మగైః,
బిభేద నిశితై స్తీక్ష్ణై ర్గృధ్రం ఘోరై శ్శిలీముఖైః. ౯

స రాక్షసరథేఽపశ్య జ్జానకీం బాష్పలోచనామ్,
అచిన్తయిత్వా తా న్బాణా న్రాక్షసం సమభిద్రవత్. ౧౦
తతోఽస్య సశరం చాపం ముక్తామణివిభూషితమ్,
చరణాభ్యాం మహాతేజా బభఞ్జ పతగేశ్వరః. ౧౧
తతోఽన్య ద్ధను రాదాయ రావణః క్రోధమూర్ఛితః,
వవర్ష శరవర్షాణి శతశోఽథసహస్రశః. ౧౨
శరై రావారిత స్తస్య సంయుగే పతగేశ్వరః,
కులాయ ముపసంప్రాప్తః పక్షీవ ప్రబభౌ తదా. ౧౩

స తాని శరవర్షాణి పక్షాభ్యాం చ విధూయ చ,
చరణాభ్యాం మహాతేజా బభఞ్జాస్య మహ ద్ధనుః. ౧౪
త చ్చాగ్నిసదృశం దీప్తం రావణస్య శరావరమ్,
పక్షాభ్యాం స మహావీర్యో వ్యాధునో త్పతగేశ్వరః. ౧౫

కాఞ్చనోరశ్ఛదా న్దివ్యా న్పిశాచవదనా న్ఖరాన్,
తాం శ్చాస్య జవసంపన్నా ఞ్జఘాన సమరే బలీ. ౧౬

పక్షిరాజుఁడగుజటాయువు రావణుఁడు ప్రయోగించిన యాబాణంబుల నన్నింటిని సరకుసేయక సహించెను. ౬

మహాబలుఁడగు నాజటాయువు కఱకుగోళ్లుగల చరణములతో గీఱి ఆరావణుని దేహమంతయుఁ బెక్కువ్రణములు గావించెను. ౭

అంత రావణుఁడు కోపంబునొంది జటాయువును నొప్పించు తలంపున భయంకరంబులగు కాలదండములవంటి పదిబాణముల నెత్తెను. ౮

మహాపరాక్రమశాలియగు నారావణుఁడు చక్కఁగా సానబెట్టఁబడి మిక్కిలియుఁ దీక్ష్ణములయియుండు నాబాణంబుల నాకర్ణాంతము నాకర్షించి జటాయువుపై నేసెను. ౯

ఆజటాయువు నొచ్చియుఁ రావణునిరథంబునఁ గన్నీళ్ళుగార్చుచున్న సీతాదేవిం జూచి యాబాణంబుల సరకుసేయక మఱల రావణునిపై కడరెను.

అంత మహాబలుఁడగు జటాయువు రావణుని ముక్తామణిభూషితంబును బాణసహితంబునగు ధనుస్సును గాళ్లచే విఱిచివేసెను. ౧౧

అంత రావణుఁడు పరమకుపితుఁడై మఱియొకధనుస్సునుదీసికొని జటాయువుమీఁద నూఱునూఱు వేనవేలుగాను బాణంబులు గురిపించెను. ౧౨

అప్పుడు యుద్ధంబున జటాయువు రావణప్రయుక్తంబులగు బాణంబులచేఁ గప్పఁబడి వానినడుమ నున్నవాఁడై గూటిలోనుండుపక్షివలె నొప్పెను. ౧౩

మహాతేజుఁడగు జటాయువు ఆబాణంబుల నన్నియు ఱెక్కలచేఁ దట్టివేసి పాదములచే నారావణుని మహాధనుస్సును ద్రుంచెను. ౧౪

మహాపరాక్రమశాలియగు నాజటాయువు నిప్పువలె వెలుంగుచుండునట్టి యారావణుని కవచంబును ఱెక్కలచే భిన్నమయి యెగిరిపోవునట్లు గావించెను. ౧౫

బలవంతుఁడగు జటాయువు యుద్ధంబున బంగారుకవచంబులు వేసినవియు దివ్యంబులును పిశాచముఖంబులునగు నారావణుని ఖరంబులనుఁగూడ వధించెను. ౧౬

వరం త్రివేణుసంపన్నం కామగం పావకార్చిషమ్,
మణిహేమవిచిత్రాఙ్గం బభఞ్జ చ మహారథమ్. ౧౭

పూర్ణచన్ద్రప్రతీకాశం ఛత్త్రం చ వ్యజనై స్సహ,
పాతయామాస వేగేన గ్రాహిభీ రాక్షసై స్సహ ౧౮
సారథే శ్చాస్య వేగేన తుణ్డే నైవ మహా చ్ఛిరః,
పున ర్వ్యపాహర చ్ఛ్రీమా న్పక్షి రాజో మహాబలః. ౧౯.

స భగ్నధన్వా విరథో హతాశ్వో హతసారథిః,
అఙ్కే నాదాయ వైదేహీం పపాత భువి రావణః. ౨౦
దృష్ట్వా నిపతితం భూమౌ రావణం భగ్నవాహనమ్,
సాధుసా ధ్వితి భూతాని గృధ్రరాజ మపూజయన్. ౨౧
పరిశ్రాన్తం తు తం దృష్ట్వా జరయా పక్షియూథపమ్,
ఉత్పపాత పున ర్హృష్టో మైథిలీం గృహ్య రావణః. ౨౨

తం ప్రహృష్టం నిధా యాఙ్కే గచ్ఛన్తం జనకాత్మజామ్,
గృధ్రరాజ స్సముత్పత్య సమభిద్రుత్య రావణమ్. ౨3
సమావార్య మహాతేజా జటాయు రిద మబ్రవీత్,
వజ్రసంస్పర్శబాణస్య భార్యాం రామస్య రావణ!. ౨౪
అల్పబుద్ధే! హర స్యేనాం వధాయ ఖలు రక్షసామ్,

సమిత్త్రబన్ధు స్సామాత్య స్సబల స్సపరిచ్ఛదః. ౨౫
విషపానం పిబ స్యేత త్పిపాసిత ఇ వోదకమ్,

ఉత్తమంబును దృఢమయిన నొగతోఁగూడినదియుఁ గామగమనం
బును అగ్నివలె వెలుఁగుచున్నదియు బంగారుచేతను రత్నములచేత నలంకరిం
పఁబడిన చక్రములుగలదియు నగు నతని మహారథంబునుగూడ జటాయువు
విఱిచెను. ౧౭

ఆజటాయువు నిండుచంద్రునింబోలునట్టి శ్వేతచ్ఛత్రంబును వింజామ
రలను వానింబట్టుకొనియుండిన రాక్షసులనుం బడవేసెను. ౧౮

శ్రీమంతుఁడును మహాబలశాలియు నగు నాజటాయువు అంత నూర
కుండక వేగంబున నారావణుని సారథియొక్క భయంకరమయిన శిరస్సును
ముక్కుతోఁ ద్రుంచివేసెను. ౧౯

ఆరావణుఁడు భగ్నధనుష్కుఁడై విరథుఁడై చంపఁబడినగుఱ్ఱములును
సారథియునుగలవాఁడై సీతాదేవిని చంకనెత్తుకొని నేలకు దుమికెను. ౨౦

రావణుఁడు విరథుఁడై నేలపై నుండుటను జూచి సమస్తభూతంబు
లును జటాయువుం బూజించిరి. ౨౧

అంత పక్షిరాజుఁడగు జటాయువు ముసలితనంబున నలసియుండుటం
జూచి సంతోషంబున రావణుఁడు మఱల సీతాదేవి నెత్తుకొని ఆకాశంబున
కుద్గమించెను. ౨౨

మహాతేజుఁడగు జటాయువు అట్లు రావణుఁడు తన్ను సరకుసేయక
సంతోషంబున సీతను చంకనెత్తుకొని పోవుచుండుటనుజూచి ఎగిరి రావణుఁ
డఱుముకొనిపోయి యతని నడ్డగించి యతనితో నిట్లని చెప్పెను ౨౩

అల్పబుద్ధివగురావణుఁడా! నీవు రాక్షసవధార్థమయియే వజ్రసమాన
ములగు బాణములుగల రామునిభార్యను అపహరించుకొని పోవుచున్నావు
గదా!. ౨౪

నీవు దప్పిగొన్నవాఁడు జలమును ద్రాగునట్లు సీతాహరణరూపమగు నీ
విషమును త్రాగుచున్నాఁవు; ఇది నీకుమాత్రమేగాదు, నీస్నేహితులకును
బంధువులకును మంత్రులకును సైన్యమునకును బరివారములకును అదివఱకును
నాశము గలిగించును. ౨౫

అనుబన్ధ మజానన్తః కర్మణా మవిచక్షణాః. ౨౬
శీఘ్ర మేవ వినశ్యన్తి యథా త్వం వినశిష్యసి,
బద్ధ స్త్వం కాలపాశేన క్వ గత స్తస్య మోక్ష్యసే. ౨౭
వధాయ బడిశంగృహ్య సామిషం జలజో యథా,

న హి జాతు దురాధర్షౌ కాకుత్స్థౌ తవ రావణ!. ౨౮
ధర్షణం చాశ్రమ స్యాస్య క్షమిష్యేతే తు రాఘవౌ,
యథా త్వయా కృతం కర్మ భీరుణా లోకగర్హితమ్. ౨౯
తస్కరాచరితో మార్గో నైష వీరనిషేవితః,

యుధ్యస్వ యది శూరోఽసి ముహూర్తం తిష్ఠ రావణ!. ౩౦
శయిష్యసే హతో భూమౌ యథా భ్రాతా ఖర స్తథా,

పరేతకాలే పురుషో య త్కర్మ ప్రతిపద్యతే ౩౧
వినాశా యాత్మనోఽధర్మ్యం ప్రతిపన్నోఽసి కర్మ తత్,

పాపానుబన్ధో వై యస్య కర్మణః కర్మ కోను తత్. ౩౨
కుర్వీత లోకాధిపతి స్స్వయంభూ ర్భగవా నపి,

ఏవ ముక్త్వా శుభం వాక్యం జటాయు స్తస్య రక్షసః. ౩౩
నిపపాత భృశం పృష్ఠే దశగ్రీవస్య వీర్యవాన్,

తం గృహీత్వా నఖై స్తీక్ష్ణై ర్విరరాద సమన్తతః. ౩౪
అధిరూఢో గజారోహో యథా స్యా ద్దుష్టవారణమ్,

విరరాద నఖై రస్య తుణ్డం పృష్ఠే సమర్పయన్. ౩౫

మూఢులగువారలు తాము చేయుకార్యములఫలముఁ దెలుసుకొనని వారలయి నీయట్లు శీఘ్రంబున వినాశంబు నొందుదురు. ౨౬.

నీవు కాలపాశముచే వధమునకు బద్ధుఁడ వయియున్నావు మాంసము గ్రుచ్చివేసిన గాలమును మ్రింగిన మత్స్యముకైవడి నీవెంకఁబోయినను అది నిన్ను వదలదు. ౨౭

రావణుఁడా! దుర్ధర్షులగు రామలక్ష్మణులు నీ విప్పుడు గావించిన మహాపరాధమును ఎంతమాత్రమును క్షమింపరు. నిన్నవశ్యము వధింతురు.

నీ విప్పుడు పిఱికివై ఎవరులేనప్పుడు లోకనిందితమగు నీకార్యము చేసినావే ఇది దొంగలుచేయుపని. వీరు లెంతమాత్రము ఇట్లుచేయురు. ౨౯

రావణుఁడా! నీవు శూరుఁడ వగుదువేని రామలక్ష్మణులు వచ్చువఱకుఁ గొంచెముసేపు నిలిచియుండి యుద్ధముగావింపుము, అప్పుడు నీతమ్ముఁడు ఖరుని యట్లు నిహతుఁడవై నేలమీఁద శయనింతువు.

మృత్యుసమయమువచ్చినప్పుడు పురుషుఁడు తనవినాశంబునకై యధర్మంబు కావించునో నీ విప్పుడాయధర్మముఁ జేసినావు. నీకు మరణము సిద్ధము. 3౦.

ఏకార్యము పాపముగలిగించునో ఆకార్యమును సమస్తలోకాధీశ్వరుఁడును భగవంతుఁడునగు బ్రహ్మదేవుఁడు గూడఁ జేయఁజాలఁడు. అని జటాయువు రావణునితోఁ జెప్పెను. 3౧

మహాపరాక్రమశాలియగు జటాయువు ఈప్రకారంబున ధర్మ్యంబగు మాట చెప్పి యంత నారావణుఁడు తనమాట వినక పాఱిపోవుటంజూచి యతని వీపుపైకి వ్రాలెను. 33

మావటీఁడు దుష్టగజము నారోహించి అంకుశముచే దాని నానావిధంబులం బొడుచునట్లు ఆజటాయువు రావణుని వీపుపై వ్రాలి తీక్ష్ణములగు నఖములచే నానావిధంబులం గీఱెను. 3౪

గోళ్లను ఱెక్కలును ముఖమును ఆయుధములుగాఁగల జటాయువు

కేశాం శ్చోత్పాటయామాస నఖపక్షముఖాయుధః,

స తథా గృధ్రరాజేన క్లిశ్యమానో ముహుర్ముహుః. 36
అమర్షస్ఫురితోష్ఠ స్సన్ ప్రాకమ్పత స రావణః,
స పరిష్వజ్య వైదేహీం వామే నాఙ్కేన రావణః. 37
తలే నాభిజఘా నాశు జటాయుం క్రోధమూర్ఛితః,
జటాయు స్తమభిక్రమ్య తుణ్డే నాస్య ఖగాధిపః. 38
వామబాహూ న్దశ తదా వ్యపాహర దరిన్దమః,

సంఛిన్నబాహో స్సద్యైవ బాహావ స్సహసాఽభవన్. 39
విషజ్వాలావలీయుక్తా వల్మీకా దివ పన్నగాః,

తతః క్రోధాద్దశగ్రీవ స్సీతా ముత్సృజ్య రావణః. 40
ముష్టిభ్యాం చరణాభ్యాం చ గృధ్రరాజ మపోథయత్,
తతో ముహూర్తం సంగ్రామో బభూ వాతుల్యవీర్యయోః.
రాక్షసానాం చ ముఖ్యస్య పక్షిణాం ప్రవరస్య చ,
తస్య వ్యాయచ్ఛమానస్య రామ స్యార్థే స రావణః. 41
పక్షౌ పార్శ్వౌ చ పాదౌ చ ఖడ్గ ముద్ధృత్య సోఽచ్ఛినత్,

స చ్ఛిన్నపక్ష స్సహసా రక్షసా రౌద్రకర్మణా. 43
నిపపాత హతో గృధ్రో ధరణ్యా మల్పజీవితః,
తం దృష్ట్వా పతితం భూమౌ క్షతజార్ద్రం జటాయుషమ్. 44
అభ్యధావత వైదేహీ స్వబన్ధు మివ దుఃఖితా.

తం నీలజీమూతనికాశకల్పం
సుపాణ్డురోరస్క ముదారవీర్యమ్,

నోటిచేతను నఖములచేతను రావణుని వీపునందుఁ జక్కఁగా గీఱెను. తల వెండ్రుకలం బెఱికెను. ౩౫

ఆరావణుఁడు అట్లు జటాయువుచే నానావిధంబుల బాధింపఁబడి కోపంబునఁ బెదవులు స్ఫురింప గడగడవడంకెను. ౩౬

ఆరావణుఁడు పరమకుపితుఁడై యెడమచంకను సీత నుంచుకొని శీఘ్రంబున జటాయువు నఱచేతం జఱచెను. ౩౭

అప్పుడు శత్రువుల నడంగఁ ద్రొక్కఁజాలినవాఁడును పక్షిరాజుఁడు నగుజటాయువు రావణుని నెదిరించి నోటిచే నతని యెడమచేతులం బదింటిని ఖండించివైచెను. ౩౮

అట్లు రావణుని యెడమచేతులు పదియుఁ దెగఁగానే తత్క్షణంబుననే పొదనుండి విషజ్వాలలతోఁ గూడిన సర్పములు బయలుదేఱునట్లు మఱల బాహువులు ప్రాదుర్భవించినవి. ౩౯

అంతఁ గోపంబున రావణుఁడు సీతను నేలనుంచి పిడికిళ్ళచేతను పాదంబులచేతను జటాయువుం గ్రుమ్మెను. ౪౦

అంత సరిలేని పరాక్రమంబుగల రాక్షసోత్తముఁడు రావణునకును పక్షివర్యుఁడు జటాయువునకును కొంచెము సేపు మహాయుద్ధంబుగలిగినది. ౪౧

ఆరావణుఁడు అట్లు రామకార్యార్థంబై యుద్ధము సేయుచున్న జటాయువుం జూచి ఖడ్గంబుచే నతని ఱెక్కలను పార్శ్వంబులను పాదంబులను ఛేదించివైచెను. ౪౨

ఆజటాయువు భయంకరకర్ముండగు రావణునిచేఁ బక్షంబులు ఖండింపఁబడ హతుఁడై యల్పజీవితుఁడై నేలం బడెను. ౪౩

సీతాదేవి జటాయువు నెత్తుటం దోఁగుచు నేలంబడి యుండుట జూచి తనబంధు వెవ్వఁడైన నట్టియాపదనొందినచో దుఃఖము నొందునట్లు పరమదుఃఖితయయి యతనియొద్దకుఁ బరుగెత్తెను. ౪౪

లంకేశ్వరుఁడగు రావణుఁడు అట్లు నేలఁబడినవాఁడును నీలమేఘవర్ణుఁడును దెల్లనివక్షస్స్థలంబుగలవాఁడును మహాపరాక్రమశాలియుఁ జల్లాఱిన

దదర్శ లఙ్కాధిపతిః పృథివ్యాం
జటాయుషం శాన్తమి వాగ్నిదావమ్. ౪౫
తత స్తు తం పత్త్రరథం మహీతలే
నిపాతితం రావణవేగమర్దితమ్,
పునః పరిష్వజ్య శశిప్రభానన
రురోద సీతా జనకాత్మజా తదా. ౪౬

ఇతి శ్రీమదరణ్యకాణ్డ ఏకపఞ్చాశ స్సర్గః. ౫౧.

---

## ద్వి ప ఞ్చా శ స్స ర్గః.

త మల్పజీవితం గృధ్రం స్ఫురన్తం రాక్షసాధిపః,
దదర్శ భూమౌ పతితం సమీపే రాఘవాశ్రమాత్. ౧

సా తు తారాధిపముఖీ రావణేన సమీక్ష్య తమ్,
గృధ్రరాజం వినిహతం విలలాప సుదుఃఖితా. ౨
ఆలిఙ్గ్య గృధ్రం నిహతం రావణేన బలీయసా,
విలలాప సుదుఃఖార్తా సీతా శశినిభాననా. ౩

నిమిత్తం లక్షణజ్ఞానం శకునిస్స్వరదర్శనమ్,
అవశ్యం సుఖదుఃఖేషు నరాణాం ప్రతిదృశ్యతే. ౪
నూనం రామ! న జానాసి మహ ద్వ్యసన మాత్మనః,
ధావన్తి నూనం కాకుత్స్థం మదర్థం మృగపక్షిణః. ౫

అయం హి పాపచారేణ మాం త్రాతు మభిసఙ్గతః,
శేతే వినిహతో భూమౌ మ మాభాగ్యా ద్విహఙ్గమః. ౬

దావాగ్నిచందంబున నున్నవాఁడునగు నాజటాయువుం జూచెను. ౪౫

అంత నప్పుడు చంద్రబింబముంబోలె సుందరంబగు మొగంబుగల జనకమహారాజపుత్రి సీతాదేవి రావణపరాక్రమనిహతుఁడై భూమిం బడియున్న జటాయువును మాటిమాటికిఁ గవుఁగిలించుకొని రోదనంబు గావించెను. ౪౬

ఇది ఏఁబదియొకటవసర్గము.

---

## ఏఁబదిరెండవ సర్గము.

రాక్షసరాజుఁడగు రావణుఁడు అల్పజీవితుఁడును ఇట్టటు కదలుచున్నవాఁడును రామునియాశ్రమంబునకు సమీపంబున నేలంబడియున్నవాఁడు నగు జటాయువుం జూచెను. ౧

చంద్రబింబమువంటి మొగంబుగలసీతాదేవి రావణనిహతుఁడైన యాజటాయువుం జూచి పరమదుఃఖితయయి విలపించెను. ౨

చంద్రబింబసుందరంబగు ముఖంబుగల సీతాదేవి బలిష్ఠుండగు రావణునిచే వధింపఁబడిన జటాయువుం గవుఁగిలించుకొని పరమదుఃఖితయయి విలపించెను. ౩

నేత్రస్పందాదిలక్షణములు పక్షిధ్వనులు ఇవి తప్పక మనుష్యుల సుఖదుఃఖముల సూచించుచుండును. ౪

రాముఁడా! నీ కిప్పుడు గలిగిన మహావ్యసనమును ఇంక నెఱుంగకున్నావా యేమి? నేత్రస్పందాదినిమిత్తంబులఁ దెలిసికొన లేదా? ఈ మృగపక్షులు పరుగెత్తుచున్నవే; ఇవి నానిమిత్తమైయె రామునియొద్దకుఁబోవుచున్నవి కాఁబోలు. ఇది నిశ్చయము. ౫

నన్నుఁ గాపాడుటకై వచ్చిన యాజటాయువు నాదౌర్భాగ్యంబువంజేసి పాపిష్ఠుఁడగు రావణునిచేత నిహతుండై భూమియందు శయనించియున్నాఁడు ౬

త్రాహి మా మద్య కాకుత్స్థ! లక్ష్మణేతి వరాఙ్గనా,
సుసంత్రస్తా సమాక్రన్ద చ్ఛృణ్వతాం తు యథాన్తికే. ౭

తాం క్లిష్టమాల్యాభరణాం విలపన్తీ మనాథవత్,
అభ్యధావత వైదేహీం రావణో రాక్షసాధిపః. ౮

తాం లతా మివ వేష్టన్తీ మాలిఙ్గన్తీం మహాద్రుమాన్,
ముఞ్చముఞ్చేతి బహుశః ప్రవద న్రాక్షసాధిపః. ౯
క్రోశన్తీం రామరా మేతి రామేణ రహితాం వనే,
జీవితాన్తాయ కేశేషు జగ్రా హాన్తకసన్నిభః. ౧౦

ప్రధర్షితాయాం సీతాయాం బభూవ సచరాచరమ్,
జగ త్సర్వ మమర్యాదం తమసాఽన్ధేన సంవృతమ్. ౧౧

న వాతి మారుత స్తత్ర నిష్ప్రభోఽభూ ద్దివాకరః,
దృష్ట్వా సీతాం పరామృష్టాం దీనాం దివ్యేన చక్షుషా. ౧౨
కృతం కార్య మితి శ్రీమా న్వ్యాజహార పితామహః,

ప్రహృష్టా వ్యథితా శ్చాసం త్సర్వే తే పరమర్షయః. ౧౩
దృష్ట్వా సీతాం పరామృష్టాం దణ్డకారణ్యవాసినః,
రావణస్య వినాశం చ ప్రాప్తం బుద్ధ్వా యదృచ్ఛయా. ౧౪
స తు తాం రామరా మేతి రుదతీం లక్ష్మణేతి చ,
జగా మాదాయ చాకాశం రావణో రాక్షసాధిపః. ౧౫

"రాముఁడా! లక్ష్మణుఁడా! ఇప్పుడు నన్ను రక్షింపుము" అని యివ్విధంబున సీతాదేవి సమీపంబుననుండి వినుచున్న వారలంబోలె రామలక్ష్మణులం బేర్కొని యాక్రందించెను. ౭

రాక్షసరాజగు రావణుఁడు నలిగినపుష్పమాలికలును భూషణంబులును గలదియు ననాథయుంబోలె విలపించుచున్నదియు నగు నాసీతాదేవి యొద్దకుఁ బోయెను. ౮

యమునితో సమానుండగు నారాక్షసరాజు రావణుఁడు లతలను జుట్టుకొనుచున్నదియు మహావృక్షంబులం గవుఁగిలించుకొనుచున్నదియు మహారణ్యంబున రాముని విడిచి యొంటిపోయి యున్నదియు "రామరామా!" అని యఱచుచున్నదియు నగు సీతాదేవిని "ఈచేష్టలు విడువు విడువు" మని నానాప్రకారంబులం జెప్పుచుఁ దనజీవితనాశంబుపొంటెఁ గేశంబులం బట్టుకొనెను. ౯,౧౦

సీతాదేవి యట్లు ధర్షింపఁబడఁగానే చరాచరంబులతోఁగూడిన ప్రపంచం బంతయు మర్యాదావిహీనంబై గాఢాంధకారంబుచేఁ గప్పఁబడినట్లుండినది. ౧౧

అప్పుడు వాయువు వీవలేదు. సూర్యుఁడు కాంతిహీనుం డయ్యె.

శ్రీమంతుఁడగు బ్రహ్మదేవుఁడు సీతాదేవి రావణునిచే వెండ్రుకలఁ బట్టఁబడి దీనయయి యుండుటను దివ్యదృష్టిం జూచి "కార్యంబయినది" అని నుడివెను. ౧౨

దండకారణ్యవాసులగు సమ్మహర్షులందఱును సీతాదేవి యట్లు రావణునిచే ధర్షింపఁబడుటం జూచి రావణునకు వినాశంబును శీఘ్రంబున నె సిద్ధముగాఁ గలదిగా నెఱింగి దుఃఖితులును సంతుష్టులును అయిరి. ౧౪

రాక్షసేశ్వరుఁడగు రావణుఁడు రామరామా యనియు లక్ష్మణా యనియు రోదనంబు సేయుచున్న యాసీతాదేవిం జేకొని యాకాశమార్గంబు నొందెను. ౧౫

తప్తాభరణసర్వాఙ్గీ పీతకౌశేయవాసినీ,
రరాజ రాజపుత్త్రీ తు విద్యు త్సౌదామినీ యథా. ౧౬

ఉద్ధూతేన చ వస్త్రేణ తస్యాః పీతేన రావణః,
అధికం ప్రతిబభ్రాజ గిరి ర్దీప్త ఇ వాగ్నినా. ౧౭

తస్యాః పరమకల్యాణ్యా స్తామ్రాణి సురభీణి చ,
పద్మపత్త్రాణి వైదేహ్యా అభ్యకీర్యన్త రావణమ్. ౧౮
తస్యాః కౌశేయ ముద్ధూత మాకాశే కనకప్రభమ్,
బభౌ చాదిత్యరాగేణ తామ్ర మభ్ర మి వాతపే. ౧౯

తస్యా స్తత్సునసం వక్త్ర మాకాశే రావణాఙ్కగమ్,
న రరాజ వినా రామం వినాళ మివ పఙ్కజమ్. ౨౦

బభూవ జలదం నీలం భిత్త్వా చన్ద్ర ఇ వోదితః,
సులలాటం సుకేశా న్తం పద్మగర్భాభ మవ్రణమ్. ౨౧
శుక్లై స్సువిమలై ర్దన్తైః ప్రభావద్భి రలఙ్కృతమ్,
తస్యా స్తద్విమలం వక్త్ర మాకాశే రావణాఙ్కగమ్. ౨౨
రుదితం వ్యపమృష్టాస్రం చన్ద్రవ త్ప్రియదర్శనమ్,
సునాసం చారుతామ్రోష్ఠ మాకాశే హాటకప్రభమ్. ౨౩

రాక్షసేన సమాధూతం తస్యా స్తద్వదనం శుభమ్,
శుశుభే న వినా రామం దివా చన్ద్ర ఇ వోదితః. ౨౪

ఉత్తమంబగు బంగారమువంటి మేనుగలదియుఁ బసుపుపట్టువస్త్రంబుఁ గట్టుకొనియున్నదియు నగు సీతాదేవి మేఘంబునందు మెఱుపువలె రావణుని యంకంబునం బ్రకాశించినది. ౧౭

సీతాదేవి పీతవస్త్రంబు గాలికి ఎగురుటంజేసి యారావణుండు అగ్నిహోత్రముచే వ్యాపింపఁబడినపర్వతంబుకరణి మిక్కిలియుఁ బ్రకాశించెను. ౧౮

మిక్కిలియు మంగళస్వరూపిణి యగు నాసీతాదేవిమేననుండి మంచివాసనగల యెఱ్ఱనైన తామరపూరేకులు రావణునిమేనం బడినవి. ౧౯

గాలికి ఎగిరిన కాంచనవర్ణంబగు నాసీతాదేవిపసుపుపట్టువస్త్రము మధ్యాహ్నమున సూర్యునికాంతిచే నెఱ్ఱనైన యాకాశంబుపగిదిం బ్రకాశించెను. ౧౯

ఆకాశంబున రావణుని యంకంబుననున్న సుందరమయిన ముక్కుగల యాసీతాదేవిముఖంబు రాముఁడు లేకుండుటంజేసి కాడలేనికమలంబుపగిది ఎంతమాత్రము ప్రకాశింపదయ్యె. ౨౦

సుందరమయిన లలాటంబు గలదియు సుందరములగు ముంగురులతో నొప్పుచున్నదియు వికసితంబగు కమలంబువంటిదియు దోషరహితంబును దెల్లనివియు స్వచ్ఛంబులును గాంతిమంతములు నగుదంతంబులచే నలంకృతంబును ఏడ్చియేడ్చి తుడువఁబడిన కన్నీళ్లుగలదియు చంద్రబింబమువలెఁ బ్రియదర్శనంబును సుందరమయిననాసికగలదియు సుందరములయిన యెఱ్ఱని పెదవులుగలదియు బంగారమువంటి వన్నెగలదియును నిర్మలంబునగు రావణాంకంబున నున్న యాసీతాదేవిముఖంబు నల్లనిమేఘమండలంబు భేదించి తన్మధ్యంబున వగపడు చంద్రుంబోలి యొప్పినది. ౨౧-౨౩

రావణునిచే భయకంపితంబయిన మంగళకరంబగు నాసీతాదేవిముఖంబు రాముఁడు లేకుండుటంజేసి పగలు ఉదయించిన చంద్రునిభంగి నెంతమాత్రమును బ్రకాశింపదయ్యె. ౨౪

సా హేమవర్ణా నీలాఙ్గం మైథిలీ రాక్షసాధిపమ్,
శుశుభే కాఞ్చనీ కాఞ్చీ నీలం మణిమి వాశ్రితా. ౨౪
సా పద్మగౌరీ హేమాభా రావణం జనకాత్మజా,
విద్యుద్ఘన మి వావిశ్య శుశుభే తప్తభూషణా. ౨౫

తస్యా భూషణఘోషేణ వైదేహ్యా రాక్షసాధిపః,
బభౌ సచపలో నీల స్సఘోష ఇవ తోయదః. ౨౬

ఉత్తమాఙ్గా చ్చ్యుతా తస్యాః పుష్పవృష్టి స్సమన్తతః,
సీతాయా హ్రియమాణాయాః పపాత ధరణీతలే. ౨౭
సా తు రావణవేగేన పుష్పవృష్టి స్సమన్తతః,
సమాధూతా దశగ్రీవం పున రే వాభ్యవర్తత. ౨౮
అభ్యవర్తత పుష్పాణాం ధారా వైశ్రవణానుజమ్,
నక్షత్రమాలా విమలా మేరుం నగ మి వోన్నతమ్. ౩౦
చరణా న్నూపురం భ్రష్టం వైదేహ్యా రత్నభూషితమ్,
విద్యున్మణ్డలసంకాశం పపాత మధురస్వనమ్. ౩౧

తరుప్రవాళరక్తా సా నీలాఙ్గం రాక్షసేశ్వరమ్,
ప్రాశోభయత వైదేహీ గజం కక్ష్యేవ కాంచనీ. ౩౨

తాం మహోల్కా మి వాకాశే దీప్యమానాం స్వతేజసా,
జహారాకాశ మావిశ్య సీతాం వైశ్రవణానుజః. ౩౩

తస్యా స్తా న్యగ్నివర్ణాని భూషణాని మహీతలే,

బంగారువన్నెగల యాసీతాదేవి నీలదేహుఁడై రావణునిఁ బొందియుం డుటవలన నీలరత్నముఁబొందిన బంగారు మొలనూలువలెఁ బ్రకాశించినది.

బంగారుసొమ్ములు ధరించియున్నదియుఁ గమలంబువలెఁ గోమలంబగు గౌరవర్ణంబుగలదియు బంగారువన్నెగలదియు నగు నాజనకమహారాజకొమా ర్తెయైన సీతాదేవి రావణునియంకంబున మేఘంబునందు మెఱుపువలె నెంత యుం బ్రకాశించినది. ౨౬

రాక్షసరాజుఁడగు రావణుఁడు ఆసీతాదేవిని ధరించి యాబిడ యాభర ణధ్వనులతోఁ గూడియుండుటచే మెఱుపులతోను గర్జనలతోనుఁ గూడిన మేఘమువలెం బ్రకాశించినది. ౨౭

అప్పు డపహరింపఁబడుచున్న సీతాదేవిశిరస్సుననుండి పుష్పంబులు జాఱి యచ్చటిభూమియంతటం బడినవి. ౨౮

ఆపుష్పవర్షము రావణుఁడు పోవు వేగంబుచేత నాకర్షింపఁబడినదై మఱల రావణునిం బొందినది. ౨౯

ఉన్నతమగు మేరుపర్వతముచుట్టును విమలంబగు నక్షత్రమాల యావ రించునట్లు రావణునిచుట్టును ఆపుష్పవర్షంబు పరివేష్టించినది. 30

సీతాదేవి రామపాదంబుననుండి రత్నభూషితంబును మెఱుపులసమూ హమువలెఁ జూపట్టునదియు నగు నూపురంబు వీడి మధురధ్వనిగల్గునట్లు నేలం బడినది. 3౧

చిగురుటాకువలె నెఱ్ఱనయినసీతాదేవి నీలదేహుఁడగు రావణునిమేన నుండుటవలన బంగారుతోఁ జేయఁబడిన కక్ష్యతో నొప్పుచున్న యేనుంగు వలె నారావణుఁ డెంతయుఁ బ్రకాశించెను. 3౨

కుబేరునితమ్ముఁడగు రావణుఁడు ఆకాశంబున నిజదేహకాంతిచే మహోల్కకైవడి వెలుంగుచున్న సీతాదేవిం జేకొని యాకాశమార్గంబునఁ బోయెను. 33

అగ్నివర్ణంబులగు నాసీతాదేవి యాభరణంబులు మహాధ్వని గదుర

సఘోషా ణ్యవకీర్యన్త క్షీణా స్తారా ఇ వామ్బరాత్. ౩౪
తస్యాః స్తనా న్తరా ద్భ్రష్టో హార స్తారాధిపద్యుతిః,
వైదేహ్యా నిపత న్భాతి గఙ్గేవ గగనా చ్చ్యుతా. ౩౫
ఉత్పన్నవాతాభిహతా నానాద్విజగణాయుతాః,
మా భై రితి విధూతాగ్రా వ్యాజహ్రు రివ పాదపాః. ౩౬

నళిన్యో ధ్వస్తకమలా స్త్రస్తమీనజలేచరాః,
సఖీ మివ గతోచ్ఛ్వాసా మన్వశోచ న్త మైథిలీమ్. ౩౭

సమన్తా దభిసంపత్య సింహవ్యాఘ్రమృగద్విజాః,
అన్వధావం స్తదా రోషా త్సీతాం ఛాయానుగామినః. ౩౮

జలప్రపాతాస్రముఖా శ్శృఙ్గై రుచ్ఛ్రితబాహుభిః,
సీతాయాం హ్రియమాణాయాం విక్రోశ న్తీవ పర్వతాః. ౩౯

హ్రియమాణా స్తు వైదేహీం దృష్ట్వా దీనో దివాకరః,
ప్రతిధ్వస్తప్రభ శ్శ్రీమా నాసీ త్పాణ్డురమణ్డలః. ౪౦
నా స్తి ధర్మః కుత స్సత్యం నార్జవం నానృశంసతా,
యత్ర రామస్య వైదేహీం భార్యాం హరతి రావణః. ౪౧

ఇతి సర్వాణి భూతాని గణశః పర్యదేవయన్,

విత్రస్తకా దీనముఖా రురుదు ర్మృగపోతకాః. ౪౨
ఉద్వీక్ష్యోద్వీక్ష్య నయనై రస్రపాతావిలేక్షణాః,
సుప్రవేపితగాత్రాశ్చ బభూవు ర్వనదేవతాః. ౪౩

నాకాశంబుననుండి నక్షత్రంబులుం బోలె నేలం బడినవి. ౩౪

అప్పుడు చంద్రధవళంబైన యాసీతాదేవిహారంబు స్తనాంతరంబుననుండి పతితంబై ఆకాశంబున నుండి పడు గంగానదియుం బోలె నొప్పినది.

పెనుగాలి వీచుటయు నప్పుడు నానావిధపక్షులతోఁ గూడినవృక్షంబులు మధురంబులగు పక్షిధ్వనులతో శాఖాగ్రంబులను చేతులం గదలించుచు సీతకు భయపడవల దని యభయంబుఁ జెప్పినట్లు చూపట్టినవి. ౩౬

తామరకొలంకులు కాంతిహీనంబులయిన కమలంబు లను ముఖంబులతోను ఆకులితంబులగు మీనంబు లను నేత్రంబులతోను ఒప్పుచు ఆపన్నయగు చెలిం జూచి దుఃఖపడునట్లు తోఁచినవి ౩౭

అప్పుడు సింహవ్యాఘ్రాది మృగంబులును బక్షులును అచ్చటచ్చటనుండి వచ్చి రావణునిపైఁ గోపంబున నీడ ననుసరించి సీతాదేవివెంటం బరుగత్తినవి. ౩౮

పర్వతంబులు కన్నీళ్ళవలె నుండు జలప్రవాహంబులతోను బైకెత్తఁబడిన చేతులనలెఁ గనుపట్టు నున్నతశిఖరంబులతోను సీతాదేవి యపహరింపఁబడుటంజూచి రోదనంబు సేయుచున్నట్లు చూపట్టినవి. ౩౯

సూర్యుఁడు సీతాదేవి యపహరింపంబడుటను జూచి దీనుఁడై కాంతిహీనుఁడై తెల్లఁబోయెను. ౪౦

మహాత్ముఁడగు రామునిభార్యయయినసీతాదేవిని రావణుఁ డపహరించుచున్నాఁడే! ఇట్టికాలంబున ధర్మము సత్యమునిష్కపటత దయ ఇవియెక్కడ నుండును? ౪౧

ఈప్రకారంబునఁ జెప్పుచు సమస్తభూతంబులుగుంపులుగుంపులుగాఁ జేరి రోదనంబుఁ జేసిరి.

చిన్నజింకపిల్లలు భయపడి దుఃఖితములై కన్నుల నీళ్ళుగాఱఁ దల యెత్తి చూచిచూచి రోదనంబు గావించినవి. ౪౨

అట్లు లక్ష్మణా!రామా! యని మధురస్వరంబుగా నాక్రోశించుచున్నది

విక్రోశ న్తీం భృశం సీతాం దృష్ట్వా దుఃఖం తథాగతామ్,
తాం తు లక్ష్మణ రామేతి క్రోశ న్తీం మధురస్వరమ్. ४४
అవేక్షమాణాం బహుశో వై దేహీం ధరణీతలమ్,
స తా మాకులకేశాన్తాం విప్రమృష్టవిశేషకామ్. ४५
జహా రాత్మవినాశాయ దశగ్రీవో మనస్వినీమ్.

తత స్తు సా చారుదతీ శుచిస్మితా
వినాకృతా బన్ధుజనేన మైథిలీ,
అపశ్యతీ రాఘవలక్ష్మణా వుభౌ
వివర్ణవక్త్రా భయభారపీడితా. ४६

ఇతి శ్రీమదరణ్యకాణ్డే ద్విపఞ్చాశ స్సర్గః. ५२.

---

త్రి ప ఞ్చా శ స్స ర్గః.

ఖ ముత్పత న్తం తం దృష్ట్వా మైథిలీ జనకాత్మజా,
దుఃఖితా పరమోద్విగ్నా భయే మహతి వర్తినీ. ౧

రోషరోదనతామ్రాక్షీ భీమాక్షం రాక్షసాధిపమ్,
రుదతీ కరుణం సీతా హ్రియమాణేద మబ్రవీత్. ౨

న వ్యపత్రపసే నీచ! కర్మణాఽనేన రావణ!,
జ్ఞాత్వా విరహితం య న్మాం చోరయిత్వా పలాయసే. ౩

త్వ యైవ నూనం దుష్టాత్మ! న్భీరుణా హర్తు మిచ్ఛతా,
మ మాపవాహితో భర్తా మృగరూపేణ మాయయా. ४

యుఁ బరమదుఃఖితయు రోదనంబు సేయుచున్నదియు మాటిమాటికి భూమిం జూచుచున్నదియు నగు సీతాదేవిం జూచి వనదేవత లందఱు దుఃఖభయంబులచే గడగడ వడంకిరి. ४४

ఆరావణుఁడు కలంగినముంగురులు గలదియు మాసిన తిలకంబు గలదియుఁ బతివ్రతయు నగు నాసీతాదేవిని ఆత్మనాశంబు కలుగునని యెఱుంగక యపహరించెను. ४५

అంతసుందరంబులగు దంతములుగలదియు ధవళస్వచ్ఛమయిన చిఱునగవుగలదియు నగు నాసీతాదేవి యప్పుడు బంధుహీనయాయి రామలక్ష్మణులం గానక ముఖంబు వివర్ణంబుగాఁ బరమభీతయయినది. ४६.

ఇది యేఁబదిరెండవసర్గము,

---

## ఏఁబదిమూఁడవసర్గము.

జనకమహారాజుకూఁతురయిన సీతాదేవి రావణుఁడు తన్నుఁ దీసికొని యాకాశంబునం బోవుటం జూచి మహాభయంబు నొంది పరమదుఃఖితయయి కంపంబునొందినది. ౧

అట్లపహరింపఁబడుచున్న సీతాదేవి కరుణంబుగా రోదనంబుసేయుచు రోదనముచేతను రోషముచేతనుం గన్నుల నెఱ్ఱఁదనంబు గదుర భయంకరనేత్రుఁడగు రాక్షసేశ్వరుని రావణుం జూచి యిట్లని చెప్పెను. ౨

నీచుఁడవగు రావణుఁడా! రామలక్ష్మణు లెవ్వరును లేకుండుటం జూచి నన్ను దొంగిలించుకొని పరుగెత్తుచున్నావే; ఇట్టికార్యమున నీకు సిగ్గులేదాయేమి? ౩

దుష్టాత్ముండవగు రావణుఁడా! నీవే నన్ను హరింపఁగోరి పితికివికావున రామునకు భయపడి మాయచే శృంగారమృగరూపంబు దాల్చి మోసంబున రాముని మాఱుమునకుఁ గొనిపోయినావు నిశ్చయము. ४

యో హి మా ముద్యత స్త్రాతుం సోఽప్యయం వినిపాతితః,
గృధ్రరాజః పురాణోఽసౌ శ్వశురస్య సఖా మమ. ౫

పరమం ఖలు తే వీర్యం దృశ్యతే రాక్షసాధమ!,
విశ్రావ్య నామధేయం హి యుద్ధే నాస్మి జితా త్వయా. ౬

ఈదృశం గర్హితం కర్మ కథం కృత్వా న లజ్జసే,
స్త్రియాశ్చ హరణం నీచ! రహితే తు పరస్య చ. ౭
కథయిష్యన్తి లోకేషు పురుషాః కర్మ కుత్సితమ్,
సునృశంస మధర్మిష్ఠం తవ శౌణ్డీర్యమానినః ౮
ధిక్తే శౌర్యం చ సత్త్వం చ యత్త్వం కథితవాంస్తదా,
కులాక్రోశకరం లోకే ధిక్తే చారిత్ర మీదృశమ్. ౯

కిం కర్తుం శక్య మేవం హి యజ్జవే నైవ ధావసి,
ముహూర్త మపి తిష్ఠస్వ న జీవ న్ప్రతియాస్యసి. ౧౦

న హి చక్షుష్పథం ప్రాప్య తయోః పార్థివపుత్రయోః,
ససైన్యోఽపి సమర్థ స్త్వం ముహూర్త మపి జీవితుమ్. ౧౧

న త్వం తయోః శరస్పర్శం సోఢుం శక్తః కథంచన,
వనే ప్రజ్వలిత స్యేవ స్పర్శ మగ్నే ర్విహఙ్గమః. ౧౨
సాధు కృత్వాఽఽత్మనః పథ్యం సాధు మాం ముఞ్చ రావణ!,

మత్ప్రధర్షణరుష్టో హి భ్రాత్రా సహ పతి ర్మమ. ౧౩

జటాయువు మిక్కిలి వృద్ధుఁడు. నామామయగు దశరథమహారాజునకు మిత్రుఁడు గావున నన్ను అపహరించుటను జూచి సహింపఁజాలక యొట్లయిన నన్నుఁ గాపాడవలయునని యుద్ధంబునకు వచ్చినాఁడు. అతనింగూడ వధించితివి. ౫

రాక్షసాధముఁడవగు రావణుఁడా! నీవు నీపే తంతయు స్తుతించుకొని తుదకు భయంబున నన్నుఁ జౌర్యంబునం గొనిపోవుచున్నావు. కావున నీ పరాక్రమము మిక్కిలియు గొప్పదే. ౬

నీచుఁడా! పతిలేనికాలంబునఁ బరస్త్రీని హరించితివే! ఇట్టి నిందితకార్యము గావించి నీ వెట్లు లజ్జ వొందకున్నావు? ౭

పురుషులు శూరుఁడ నను నహంకారముగల నీ విప్పుడు గావించిన నిందితంబును క్రూరంబును అధర్మిష్ఠంబు నగు కార్యమును జెప్పుకొందురు.

అప్పుడు నీవు చెప్పుకొన్న నీబలశౌర్యంబులు దహింపఁబడుఁగాక. పుట్టినకులమున కంతయు నింద గలిగించునట్టి నీచరిత్రమును దహింపఁబడుఁగాక. ౯

ఇట్లు బహువేగంబునఁ బరుగెత్తిపోవుదువేని యేమిసేయవచ్చును? రెండుగడియ లయినను నిలిచియుందువేని యింకఁ బ్రాణంబులతోఁ బ్రతికిపోఁజాలవు. ౧౦

నీవు రాక్షససైన్యముల నన్నిటినిం గూడి వచ్చినను రాజపుత్రులగు రామలక్ష్మణులయెదుటం బడుదువేని ముహూర్తకాలమయినను జీవించియుండఁజాలవు. ౧౧

అడవియందు మండుచున్న దావాగ్నిస్పర్శమును బక్షి సహింపఁజాలనట్లు నీవు ఆరామలక్ష్మణులబాణపాతమును ఎంతమాత్రము సహింపఁజాలవు.

రావణుఁడా! నీవు హితంబుగోరుదువేని నన్నుఁ దక్షిణంబ చక్కఁగా విడిచిపెట్టుము.

నీవు నన్ను విడిచిపెట్టవేని నాపెనిమిటియగు రాముఁడు నన్నప

విధాస్యతి వినాశాయ త్వం మాం యది న ముఞ్చసి.

యేన త్వం వ్యవసాయేన బలా న్మాం హర్తు మిచ్ఛసి. ౧౪
వ్యవసాయ స్స తే నీచ! భవిష్యతి నిరర్థకః,
న హ్యహం త మపశ్యన్తీ భర్తారం విబుధోపమమ్. ౧౫
ఉత్సహే శత్రువశగా ప్రాణా న్ధారయితుం చిరమ్,
న నూనం చాత్మన శ్శ్రేయః పథ్యం వా సమవేక్షసే. ౧౬
మృత్యుకాలే యథా మర్త్యో విపరీతాని సేవతే,
ముమూర్షూణాం హి సర్వేషాం యత్పథ్యం తన్న రోచతే. ౧౭
పశ్యా మ్యద్య హి కణ్ఠే త్వాం కాలపాశావపాశితమ్,
యథా చాస్మి న్భయస్థానే న బిభేషి దశానన!. ౧౮
వ్యక్తం హిరణ్మయా న్హి త్వం సంపశ్యసి మహీరుహాన్,

నదీం వైతరణీం ఘోరాం రుధిరౌఘనివాహినీమ్. ౧౯
అసిపత్రవనం చైవ భీమం పశ్యసి రావణ!,

తప్తకాఞ్చనపుష్పాం చ వైడూర్యప్రవరచ్ఛదామ్. ౨౦
ద్రక్ష్యసే శాల్మలీం తీక్ష్ణా మాయసైః కణ్టకై శ్చితామ్,

న హి త్వమీదృశం కృత్వా తస్యాలీకం మహాత్మనః.
ధరితుం శక్ష్యసి చిరం విషం పీత్వేవ నిర్ఘృణః,

బద్ధ స్త్వం కాలపాశేన దుర్నివారేణ రావణ!. ౨౨
క్వ గతో లప్స్యసే శర్మ భర్తు ర్మమ మహాత్మనః,
నిమేషాన్తరమాత్రేణ వినా భ్రాత్రా మహావనే. ౨౩

హరించుటకుఁ బరమకుపితుఁడై తమ్మునితోఁగూడ నిన్ను వధించుటకై ప్రయత్నము సేయును. ౧౩

నీచుఁడా! నీ వేప్రయత్నమున న న్నిట్లు బలాత్కారంబున నవమానించుచున్నావో? ఆప్రయత్నం బంతయు వ్యర్థంబు కాఁగలదు. ౧౪

నేను దేవేంద్రసమానుఁడగు నాభర్తను రామునిం జూడక శత్రువశంగతనై బహుకాలము జీవించియుండ నొల్లను. ౧౫

మనుష్యుఁడు మరణకాలంబున విపరీతబుద్ధియగునట్లు నీవు నీకు హితమునుగాని శ్రేయస్సునుగాని తెలిసికొనకున్నావు. ఇది నిశ్చయము. ౧౬

చావఁబోవువారల కందఱకును హిత మేదో అది రుచింపదు. నీ విప్పుడు కంఠంబునఁ గాలపాశంబుఁ దగిలించుకొనియుండుటం జూచుచున్నానుగదా!

రావణుఁడా! భయపడవలసినకాలంబున నీ విప్పుడు భయంబునొందకున్నావు కావున నీ వింక శీఘ్రంబుననె బంగారువృక్షంబులనుఁ జూడఁగలవు. స్పష్టము. ౧౮

రావణుఁడా! నీ వింక శీఘ్రంబుననె భయంకరంబును నెత్తురుప్రవాహములతోఁ గూడినదియు నగు వైతరణీనదిని అసిపత్రవనంబునుం గూడ యమలోకంబునం జూడఁగలవు. ౧౯

మంచిబంగారువన్నెగల పుష్పములుగలదియు వైఢూర్యములవంటి యాకులుగలదియుఁ దీక్ష్ణము లినుపముండ్లతో నిండినదియు నగు శాల్మలీవృక్షముం జూడఁగలవు. ౨౦

నిర్దయుఁడవగు నీవు మహాత్ముఁడగు నారామునకు నిట్టి యపకారంబు గావించినావు కావున విషంబు ద్రావినవాఁడువలె నింక బహుకాలము బ్రతికియుండఁజాలవు. ౨౧

రావణుఁడా! మహాత్ముఁడగు నాభర్త రాముఁ డుండఁగా కాలపాశంబుచే బద్ధుండవగు నీవు ఎచ్చటికిఁ బోయినను సుఖంబు పొందఁజాలవు. ౨౨

ఎవ్వఁడు తమ్ముఁడుగూడ లేక తానొక్కఁడే మహారణ్యంబునందు

రాక్షసా నిహతా యేన సహస్రాణి చతుర్దశ,
స కథం రాఘవో వీర స్సర్వాస్త్రకుశలో బలీ. ౨౪
న త్వాం హన్యా చ్ఛరై స్తీక్ష్ణై రిష్టభార్యాపహారిణమ్,

ఏత చ్చాన్య చ్చ పరుషం వై దేహీ రావణాఙ్కగా. ౨౫
భయశోకసమావిష్టా కరుణం విలలాప హ.

తథా భృశార్తాం బహు చైవ భాషిణీం
విలాపపూర్వం కరుణం చ భామినీమ్,
జహార పాపః కరుణం వివేష్టతీం
నృపాత్మజా మాగతగాత్రవేపథుమ్. ౨౬
ఇతి శ్రీమదరణ్యకాణ్డే త్రిపఞ్చాశ స్సర్గః. ౫౩.

---

చతుఃపఞ్చాశ స్సర్గః.

హ్రియమాణా తు వై దేహీ కంచి న్నాథ మపశ్యతీ,
దదర్శ గిరిశృఙ్గస్థా న్పఞ్చ వానరపుఙ్గవాన్. ౧
తేషాం మధ్యే విశాలాక్షీ కౌశేయం కనకప్రభమ్,
ఉత్తరీయం వరారోహా శుభా న్యాభరణాని చ. ౨
ముమోచ యది రామాయ శంసేయు రితి మైథిలీ,

వస్త్ర ముత్సృజ్య తన్మధ్యే నిక్షిప్తం సహభూషణమ్. ౩
సంభ్రమా త్తు దశగ్రీవ స్తత్కర్మ న స బుద్ధవాన్,

పిఙ్గాక్షా స్తాం విశాలాక్షీం నేత్రై రనిమిషై రివ. ౪
వికోశన్తీం తథా సీతాం దదృశు ర్వానరర్షభాః,

నిమేషమాత్రంబునఁ బదునాలుగువేలమహారాక్షసులను వధించిపుచ్చెనో అట్టి మహాపరాక్రమశాలియు సర్వాస్త్రసమర్థుఁడును బలవంతుఁడు నగు రాముఁడు తనప్రియభార్యను హరించినట్టి నిన్నుఁ దీక్ష్ణబాణంబుల వధింపక విడుచునా? అని సీతాదేవి రావణునితోఁ జెప్పినది. ౨౩,౨౪

రావణుని యంకంబున నుండి సీతాదేవి భయదుఃఖపీడితయయి పరుషంబుగాను గరుణంబుగాను విలపించుచు ఈమాటలను ఇతరములయిన మాటలను జెప్పెను. ౨౫

అట్లు సీతాదేవి పరమదుఃఖితయయి విలపించుచు దుఃఖకరముగా నానావిధంబులం జెప్పుచున్నను దుఃఖమున వేష్టనముసేయుచున్నను దేహమంతయు గడగడవడంకుచున్నను బాపిష్ఠుఁడగు రావణుఁడు దాని నంతయు సరకు సేయక యాబిడం గొనిపోయెను. ౨౬

ఇది యేఁబదిమూఁడవ సర్గము.

---

## ఏఁబదినాలవ సర్గము.

సీతాదేవి యట్లపహరింపఁబడుచు ఎచ్చటను రక్షకుం గానక యొక పర్వతశిఖరంబున నైదుగురు వానరశ్రేష్ఠులం గాంచెను. ౧

విశాలములగు కన్నులుగలదియు సుందరములగు పిఱుందులుగలదియు నగు సీతాదేవి "యీవానరోత్తములు రామునకు నాసంగతిని జెప్పినం జెప్పుదు"రని తలంచి కాంచనవర్ణంబగు తనయుత్తరీయంబున ఆభరణంబుల మూఁటగట్టి వారినడుమం బడునట్లు పాఱవైచెను. ౨

ఆసీతాదేవి యుత్తరీయంబున నాభరణంబులును దీని మూటఁగట్టి యవ్వానరులనడుమ వేసినది రావణుఁడు సీతాపహారసంభ్రమంబున నెఱుంగఁడయ్యె. ౩

పింగళనేత్రులగు నావానరోత్తములు అట్లు రోదనంబుసేయుచున్న విశాలాక్షియగు సీతాదేవిని ఱెప్పపాటుగూడ వేయక చూచుచుండిరి. ౪

స చపమ్పా మతిక్రమ్య లఙ్కా మభిముఖః పురీమ్. ౫
జగామ రుదతీం గృహ్య వైదేహీం రాక్షసేశ్వరః,
తాం జహార సుసంహృష్టో రావణో మృత్యు మాత్మనః. ౬
ఉత్సఙ్గే నేవ భుజగీం తీక్ష్ణదంష్ట్రాం మహావిషామ్,

వనాని సరిత శ్శైలాం స్సరాంసి చ విహాయసా. ౭
స క్షిప్రం సమతీయాయ శర శ్చాపా దివ చ్యుతః,

తిమినక్రనికేతం తు వరుణాలయ మక్షయమ్. ౮
సరితాం శరణం గత్వా సమతీయాయ సాగరమ్,

సంభ్రమా త్పరివృత్తోర్మీ రుద్ధమీనమహోరగః. ౯
వైదేహ్యాం హ్రియమాణాయాం బభూవ వరుణాలయః,

అన్తరిక్షగతా వాచ స్ససృజు శ్చారణా స్తదా.
ఏతదన్తో దశగ్రీవ ఇతి సిద్ధా స్తదాఽబ్రువన్,
సతు సీతాం వివేష్టన్తీ మఙ్కేనాదాయ రావణః. ౧౧
ప్రవివేశ పురీం లఙ్కాం రూపిణీం మృత్యు మాత్మనః,

సోఽభిగమ్య పురీం లఙ్కాం సువిభక్తమహాపథామ్. ౧౨
సంరూఢకక్ష్యాబహుళం స్వ మన్తఃపుర మావిశత్,

తత్ర తా మసితాపాఙ్గాం శోకమోహపరాయణామ్. ౧౩
నిదధే రావణ స్సీతాం మయో మాయా మివ స్త్రియమ్,

రాక్షసేశ్వరుఁడగు రావణుఁడు రోదనంబుసేయు సీతాదేవిం జేకొని పంపాసరస్సు నతిక్రమించి లంకాపట్టణాభిముఖుఁడై పోయెను. ౫

రావణుఁడు పరమసంతుష్టుఁడై తనకు మృత్యుభూతయయిన సీతాదేవిని రామలక్ష్మణులను కోఱలుగలమహావిషమయిన సర్పమని యెఱుంగక చంకలో నుంచుకొనిపోయెను. ౬

ఆరావణుఁడు వింటనుండి విడువఁబడిన బాణంబు మాడ్కి నతివేగంబున ఆకాశమార్గమున వనంబులను నదులను పర్వతంబులను గొలంకులను నతిక్రమించిపోయెను. ౭

రావణుఁడు తిములకు మకరంబులకును నివాసస్థానంబైనదియు నాశరహితంబైనదియు నదుల కన్నిటికిని బొందఁ దగినదియు నగుసముద్రంబు నొంది దానిం దాఁటెను. ౮

రావణుఁడు సీతాదేవి నపహరించుకొనిపోవుటం జూచి సముద్రము భయసంభ్రమంబులంజేసితరంగంబులు లేనిదిగాను లోపలనడంగియున్నమత్స్యములును మహాసర్పంబులును గలదిగాను ఉండినది. ౯

అప్పు డాకాశంబుననున్న చారణులును సిద్ధులును "రావణుఁడు ఇప్పుడు సీతను హరించినాఁడు; ఈతఁడు దీనితోసరి" అని చెప్పుకొనిరి. ౧౦

ఆరావణుఁడు రూపంబుదాల్చివచ్చిన తనమృత్యువనం దగినదియు దుఃఖంబునం జొట్టుకొనుచున్నదియు నగు సీతాదేవిని జంక నెత్తుకొని లంకాపురిం బ్రవేశించెను. ౧౧

రావణుఁడు సుందరముగా నేర్పఱుపఁబడిన రాజమార్గంబులుగల లంకాపురిం బ్రవేశించి జననిబిడంబులగు తొట్టికట్లతోఁ గూడిన తనయంతఃపురముం బ్రవేశించెను. ౧౨

రావణుఁడు మయుఁ డాసురమాయనువలె నల్లనికన్నులుగలదియుఁ బరమదుఃఖమోహితయు నగు నాసీతను నచ్చట నుంచెను. ౧౩

అబ్రవీచ్చ దశగ్రీవః పిశాచీ ర్ఘోరదర్శనాః. ౧౪
యథా నేమాం పుమాన్ స్త్రీ వా సీతాం పశ్య త్యసమ్మతః,

ముక్తామణిసువర్ణాని వస్త్రా ణ్యాభరణాని చ, ౧౫
యద్య దిచ్ఛే త్త దే వాస్యా దేయం మచ్ఛన్దతో యథా,

యా చ వక్ష్యతి వైదేహీం వచనం కించి దప్రియమ్,
అజ్ఞానా ద్యది వా జ్ఞానా న్న తస్యా జీవితం ప్రియమ్,

తథోక్త్వా రాక్షసీ స్తాస్తు రాక్షసేన్ద్రః ప్రతాపవాన్, ౧౭
నిష్క్రమ్యా న్తఃపురా త్తస్మా త్కిం కృత్య మితి చిన్తయన్,
దదర్శాష్టౌ మహావీర్యా న్రాక్షసా న్పిశితాశనాన్.

స తా న్దృష్ట్వా మహావీర్యో వరదానేన మోహితః,
ఉవా చైతా నిదం వాక్యం ప్రశస్య బలవీర్యతః. ౧౯

నానాప్రహరణాః క్షిప్ర మితో గచ్ఛత సత్వరాః,
జనస్థానం హతస్థానం భూతపూర్వం ఖరాలయమ్. ౨౦

తత్రోష్యతాం జనస్థానే శూన్యే నిహతరాక్షసే,
పౌరుషం బల మాశ్రిత్య త్రాస ముత్సృజ్య దూరతః. ౨౧

బలం హి సుమహ ద్యన్మే జనస్థానే నివేశితమ్,
సదూషణఖరం యుద్ధే హతం రామేణ సాయకైః. ౨౨

అంత రావణుఁడు భయంకరాకారలగు రాక్షసస్త్రీలం జూచి యిట్లనియె. నా యనుజ్ఞలేక పురుషుఁడుగాని స్త్రీగాని యీసీతనుఁ జూడగూడదు. మీర లాప్రకారమునఁ గావలియుండుఁడు. ౧౪

ముత్తెములు గాని రత్నములుగాని సువర్ణంబుగాని వస్త్రములుగాని యాభరణంబులుగాని యేమేమి గోరునో అదంతయు నీబిడకు నాయాజ్ఞ యయినట్లె యివ్వవలయును. ౧౫

ఎవ్వతెగాని ప్రాణమునందుఁ బ్రియములేనిదగుచేని యీసీతకు జ్ఞానమువలనఁగాని యజ్ఞానమువలనఁగాని కొంచెమేని యప్రియవార్తఁ జెప్పును. చెప్పినచో నవశ్యము వధించిపుత్తును. అని రావణుఁడు రాక్షసస్త్రీలకు జెప్పెను.

మహాపరాక్రమశాలియగు రావణుఁడు ఆరాక్షసస్త్రీలకు ఆప్రకారంబునం జెప్పి యాయంతఃపురంబునుండి వెవలి యింకేమి చేయవలయు నని యాలోచించుచు మహాపరాక్రములగు మాంసాహారుల నెనిమిదిమంది రాక్షసులం జూచెను. ౧౬,౧౭

మహాపరాక్రమశాలియు వరదానగర్వితుఁడునగు నారావణుఁడు ఆరాక్షసులం జూచి వారలబలపరాక్రమంబులం బేర్కొని ప్రశంసించి యిట్లని చెప్పెను. ౧౮

మీరలు ఇచ్చటనుండి శీఘ్రముగా నానావిధాయుధములు ధరించి వేగంబునం బూర్వము ఖరుని యునికిపట్టుగా నుండినదియు నిప్పుడును శూన్యంబైనదియునగు జనస్థానమునకుఁ బొండు. ౨౦

మీరలు పౌరుషంబును బలంబును నాశ్రయించి దూరంబున భయముం బాఱఁదోలి రాక్షసులందరు వధింపఁబడుటచే శూన్యంబయియుండు నాజనస్థానంబున నుండుఁడు. ౨౧

నేను ఖరదూషణుల నాయకులఁగా నేర్పఱిచి గొప్పసైన్యమును జనస్థానంబున నుంచితినే ఆసైన్యము నంతయు రాముఁడు యుద్ధంబున బాణంబులఁ గధించి పుచ్చెను. ౨౨

తత్ర క్రోధో మ మామర్షా ద్ధైర్య స్యోపరి వర్తతే,
వైరం చ సుమహ జ్జాతం రామం ప్రతి సుదాగుణమ్. ౨౩

నిర్యాతయితు మిచ్ఛామి తచ్చ వైర మహం రిపోః,
నహి లప్స్యే హ్యహం నిద్రా మహత్వా సంయుగే రిపుమ్ ౨౪
తం త్విదానీ మహం హత్వా ఖరదూషణఘాతినమ్,
రామం శర్మోపలప్స్యామి ధనం లబ్ధ్వేవ నిర్ధనః. ౨౫
జనస్థానే వసద్భి స్తు భవద్భి రామ మాశ్రితా,
ప్రవృత్తి రుపనేతవ్యా కిఙ్కరో తీతి తత్త్వతః. ౨౬
అప్రమాదా చ్చ గన్తవ్యం సర్వై రపి నిశాచరైః,
కర్తవ్య శ్చ సదా యత్నో రాఘవస్య వధం ప్రతి. ౨౭

యుష్మాకంచ బలజ్ఞోఽహం బహుశో రణమూర్ధని,
అత శ్చాస్మిన్ జనస్థానే మయా యూయం నియోజితాః. ౨౮

తతః ప్రియం వాక్య ముపేత్య రాక్షసా
మహార్థ మష్టా వభివాద్య రావణమ్,
విహాయ లఙ్కాం సహితాః ప్రతస్థిరే
యతో జనస్థాన మలక్ష్యదర్శనాః. ౨౯
తతస్తు సీతా ముపలభ్య రావణ
స్సుసంప్రహృష్టః పరిగృహ్య మైథిలీమ్,
ప్రసజ్య రామేణ చ వైర ముత్తమం
బభూవ మోహా న్ముదిత స్స రాక్షసః. ౩౦
ఇతి శ్రీమదరణ్యకాణ్డే చతుఃపఞ్చాశ స్సర్గః. ౫౪.

ఆనిమిత్తము నాకుఁ జాలకోపము గలిగియున్నందున నాకు దేహము దెలియకున్నది కావున నేను బోవుటకులేదు. నాకు రామునిపై మహాభయంకరంబగు గొప్పవైరంబును గలిగియున్నది. ౨౩

శత్రువగు నారామునిపైఁ గల్గినపగను దీర్చుటకొనఁగోరెదను. శత్రువును యుద్ధంబున వధింపకపోతే నాకు నిదురగూడ పట్టదు. ౨౪

ఖరదూషణులఁ జంపిన యారాముని నే నిప్పుడు వధింతునేని ధనంబునొందిన పేదవాఁడువలె సుఖంబు నొందుదును. ౨౫

మీరుమాత్రము జనస్థానముననుండి రాముఁ డెప్పుడేమి సేయునదియు యథార్థముగాఁ దెలిసికొని యాసంగతి నాకుఁ దెలుపుచుండవలయును. ౨౬

మీరలందఱు ఎంతమాత్రము ఏమఱక బహుజాగ్రత్తతోఁ బోవలెను. ఎల్లప్పుడును రామునివధమును గుఱించి ప్రయత్నముఁజేయుచునే యుండవలయును. ౨౭

నేను యుద్ధంబునఁ బెక్కుమాఱులు మీబలపరాక్రమంబులం జూచినవాఁడను. కావుననే ఈజనస్థానకార్యంబున మిమ్ము నియోగించినాను అని రావణుఁ డారాక్షసులకుఁ జెప్పెను. ౨౮

అంత నారాక్షసు లెన్మిదిమందియు నధికార్థమగు రావణుఁడు చెప్పిన ప్రియవాక్యంబు విని రావణునకు నమస్కరించి యంతర్హితరూపులయి లంకనుండి జనస్థానముండుస్థలమునకుం బోయిరి. ౨౯

అంత నారావణుఁడు సీతం జూచి సీతం బొందితిఁగదా! యని మిక్కిలియు సంతోషంబునొందినాఁడు. అతఁడు మహాపరాక్రమశాలియగు రామునితో వైరంబు గొనియు భయదుఃఖములు పొందవలసినకాలంబున అజ్ఞానముచే సంతోషంబు నొందెను. ౩౦

ఇది యేఁబదినాలవసర్గము.

## పఞ్చపఞ్చాశ స్సర్గః

సన్దిశ్య రాక్షసా న్ఘోరా న్రావణోఽష్టౌ మహాబలాన్,
ఆత్మానం బుద్ధివైక్లబ్యా త్కృతకృత్య మమన్యత. ౧

స చిన్తయానో వైదేహీం కామబాణసమర్పితః,
ప్రవివేశ గృహం రమ్యం సీతాం ద్రష్టు మభిత్వరన్. ౨
స ప్రవిశ్య తు తద్వేశ్మ రావణో రాక్షసాధిపః,
అపశ్య ద్రాక్షసీమధ్యే సీతాం శోకపరాయణామ్. ౩

అశ్రుపూర్ణముఖీం దీనాం శోకభారాభిపీడితామ్,
వాయువేగై రివాఽఽక్రాన్తాం మజ్జన్తీం నావ మర్ణవే. ౪
మృగయూథపరిభ్రష్టాం మృగీం శ్వభి రివావృతామ్,
అధోముఖముఖీం సీతా మభ్యేత్య చ నిశాచరః ౫
తాం తు శోకపరాం దీనా మవశాం రాక్షసాధిపః,
స బలా ద్దర్శయామాస గృహం దేవగృహోపమమ్. ౬

హర్మ్యప్రాసాదసంబాధం స్త్రీసహస్రనిషేవితమ్,
నానాపక్షిగణై ర్జుష్టం నానారత్నసమన్వితమ్. ౭
దాన్తకై స్తాపనీయై శ్చ స్ఫాటికై రాజతై రపి,
వజ్రవైడూర్యచిత్రై శ్చ స్తమ్భై ర్దృష్టిమనోహరైః. ౮

దివ్యదున్దుభినిర్హ్రాదం తప్తకాఞ్చనతోరణమ్,
సోపానం కాఞ్చనం చిత్ర మారురోహ తయా సహ. ౯

## ఏఁబదియైదవసర్గము.

రావణుఁడు అట్లు భయంకరాకారులును మహాబలశాలులు నగు నెనిమిదిమందిరాక్షసుల జనస్థానంబునకుం బంపి బుద్ధిహీనుఁడు కావున అంతటితోఁ దాను కృతార్థుఁడైనట్లు తలంచుకొనెను. ౧

ఆరావణుఁడు మన్మథబాధపీడితుఁడై సీతాదేవిఁ దలంచి సీతం జూడఁ గోరి యాతురతతో రమణీయంబగు నంతఃపురంబునకుఁ బోయెను. ౨

రాక్షసరాజుఁడగు రావణుఁడు అంతఃపురగృహంబుఁ బ్రవేశించి యారాక్షసస్త్రీలనడుమ బహుదుఃఖపరాయణయయి యున్న సీతాదేవిం జూచెను. 3

రాక్షసేశ్వరుఁడగు రావణుఁడు కన్నులనిండఁగన్నీళ్లు గాఱ దీనయయి పరమదుఃఖితయయి వాయువేగంబునం గొట్టఁబడినదియు సముద్రంబున మునుంగుచున్నదియు నగు నోడవలెఁ బరమవ్యాకులమయి మృగయూథంబు దప్పి కుక్కలనడుమం జిక్కిన లేడికైవడి రామలక్ష్మణుల విడిచి రాక్షసస్త్రీలనడుమం జిక్కి పరితపించుచుఁ దల వాంచి దుఃఖాకులయయియున్న సీతాదేవియొద్దకుఁ బోయి యాబిడ దుఃఖపరాయణయయి దీనయయి వివశయయి వలదని యెంతచెప్పినను వినక బలాత్కారంబున నాబిడం దీసికొనిపోయి దేవతాగృహతుల్యంబగు తన గృహ మంతయుం జూపెను. ౪-౫-౬

హర్మ్యప్రాసాదమయంబును బెక్కువేల స్త్రీలతోఁ గూడినదియు నానాపక్షిసమూహములతోను నానావిధరత్నములతోను ఒప్పుచున్నదియు దంతవికారంబులును గాంచనమయంబులునుస్ఫటికశిలలతోఁజేయఁబడినదియు రజతవికారంబులును వజ్రవైడూర్యఖచితంబులగు స్తంభంబులతోఁ గూడినదియు నగు తనగృహంబును రావణుఁడు సీతకుఁ జూపెను. ౭-౮

ఆరావణుఁడు సీతం దీసికొని ఎక్కునప్పుడు దివ్యంబగు భేరివలె ధ్వనించునదియు మంచిబంగారుతోఁ జేయఁబడినద్వారముగలదియు బంగారముతోఁ జేయఁబడినదియు నాశ్చర్యకరంబునగు సోపానపఙ్క్తి నారోహించెను. ౯

దాన్తకా రాజతా శ్చైవ గవాక్షాః ప్రియదర్శనాః,
హేమజాలావృతా శ్చాసం స్తత్ర ప్రాసాదపఙ్క్తయః. ౧౦

సుధామణివిచిత్రాణి భూమిభాగాని సర్వశః,
దశగ్రీవ స్స్వభవనే ప్రాదర్శయత మైథిలీమ్. ౧౧
దీర్ఘికాః పుష్కరిణ్య శ్చ నానావృక్షసమన్వితాః,
రావణో దర్శయామాస సీతాం శోకపరాయణామ్. ౧౨
దర్శయిత్వా తు వైదేహ్యాః కృత్స్నం త ద్భవనోత్తమమ్,
ఉవాచ వాక్యం పాపాత్మా సీతాం లోభితు మిచ్ఛయా. ౧౩
దశ రాక్షసకోట్య శ్చ ద్వావింశతి రథాపరాః,
తేషాం ప్రభు రహం సీతే! సర్వేషాం భీమకర్మణామ్. ౧౪

వర్జయిత్వా జరావృద్ధా న్బాలాం శ్చ రజనీచరాన్,
సహస్ర మేక మేకస్య మమ కార్యపురస్సరమ్ ౧౫
య దిదం రాజతన్త్రం మే త్వయి సర్వం ప్రతిష్ఠితమ్,
జీవితం చ విశాలాక్షి! త్వం మే ప్రాణై ర్గరీయసీ. ౧౬

బహూనాం స్త్రీసహస్రాణాం మమ యోఽసౌ పరిగ్రహః,
తాసాం త్వ మీశ్వరా సీతే! మమ భార్యా భవ ప్రియే!. ౧౭

సాధు కిం తేఽన్యయా బుద్ధ్యా రోచయస్వ వచో మమ,
భజస్వ మాఽభితప్తస్య ప్రసాదం కర్తు మర్హసి. ౧౮

పరిక్షిప్తా సముద్రేణ లఙ్కేయం శతయోజనా,
నేయం ధర్షయితుం శక్యా సేన్ద్రై రపి సురాసురైః. ౧౯

అచ్చట సోపానపఙ్క్తియందుఁ గిటికీలు దంతములతోను వెండితోను జేయఁబడియుండినవి. మేడలపైని కిటికీలు బంగారుతోఁ జేయఁబడియుండినవి. ౧౦

రావణుఁడు తనగృహంబున నున్నము పూసి రత్నంబులు పొదిగి విచిత్రములయియున్న యట్టియ్యప్రదేశముల నన్నింటిని సీతాదేవికిఁ జూపెను.

రావణుఁడు పరమదుఃఖితయగు సీతాదేవికి నడబావులను నానావిధములగు వృక్షములతో నొప్పుచుండెడి కొలంకులను జూపించెను ౧౨

పాపాత్ముఁడగు రావణుఁడు ఉత్తమంబగు తనగృహంబంతయు సీతకుఁ జూపి ఆమెకు ఆశగలుగునట్లు చేయఁదలంచి యీమాటం జెప్పెను. ౧౩

సీతా ! పదికోటులరాక్షసులును ఇంక నిరుపదికోటుల రాక్షసులును ఉన్నారు. వారలందఱు భయంకరకర్ములు. వారల కందఱకును నేను ప్రభుండను. ౧౪

వృద్ధులును బాలురు దప్ప అందు ముఖ్యులగు రాక్షసుల కొక్కొక్కనికిని వేయిమంది పరిచారకు లున్నారు. ౧౫

నారాజపరికరము ఏదేదియున్నదో అదంతయు నీయధీనము. నా ప్రాణముగూడ నీయనధీనమె. వెడఁదకన్నులుగల సీతా! నీవు నాకుఁబ్రాణంబులకన్న నధికురాలవు. ౧౬

ప్రియురాలవగు సీతా! నీవు నాభార్య వగుము. అట్లగుదువేని యీయంతఃపురంబుననుండు నుత్తమస్త్రీలపెక్కండ్రలో నాభార్య లెవ్వ రెవ్వరున్నారో వారలకును గూడ నీ వీశ్వరి వగుదువు. ౧౭

నీవు వేఱేబుద్ధిని వదలుము. దానివలనఁ బ్రయోజనము లేదు. నేను జెప్పినమాట మంచిది. దాని నంగీకరింపుము. మన్మథతప్తుండ నగు నామీఁద ననుగ్రహం బుంచుము. ౧౮

ఈలంక నూఱుయోజనంబుల వైశాల్యముగల సముద్రము చేఁజుట్టును బరివేష్టింపఁబడిన యున్నది. ఇంద్రసహితులగు దేవాసురులకుఁ గూడ నీపట్టణమును ధర్షింపనలవిగాదు. ౧౯

న దేవేషు న యక్షేషు న గన్ధర్వేషు పక్షిషు,
అహం పశ్యామి లోకేషు యో మే వీర్యసమో భవేత్. ౨౦

రాజ్యభ్రష్టేన దీనేన తాపసేన గతాయుషా,
కిం కరిష్యసి రామేణ మానుషేణాల్పతేజసా. ౨౧
భజస్వ సీతే! మామేవ భర్తాఽహం సదృశ స్తవ,
యౌవనం హ్యధ్రువం భీరు! రమ స్వేహ మయా సహ. ౨౨
దర్శనే మాకృథా బుద్ధిం రాఘవస్య వరాననే!,
కాఽస్య శక్తి రిహాఽఽగన్తు మపి సీతే! మనోరథైః. ౨౩

న శక్యో వాయు రాకాశే పాశై ర్బద్ధుం మహాజవః,
దీప్యమానస్య వా ప్యగ్నే ర్గ్రహీతుం విమలాం శిఖామ్. ౨౪

త్రయాణా మపి లోకానాం న తం పశ్యామి శోభనే!,
విక్రమేణ నయే ద్య స్త్వాం మద్బాహుపరిపాలితామ్. ౨౫

లఙ్కాయాం సుమహ ద్రాజ్య మిదం త్వ మనుపాలయ,
త్వత్ప్రేష్యా మద్విధా శ్చైవ దేవా శ్చాపి చరాచరాః. ౨౬

అభిషేకోదకక్లిన్నా తుష్టా చ రమయస్వ మామ్,

దుష్కృతం య త్పురా కర్మ వనవాసేన త ద్గతమ్. ౨౭
యశ్చ తే సుకృతో ధర్మ స్తస్యేహ ఫల మాప్నుహి,
ఇహ మాల్యాని సర్వాణి దివ్యగన్ధాని మైథిలి!. ౨౮
భూషణాని చ ముఖ్యాని సేవస్వ చ మయా సహ,

పరాక్రమంబున నాకు సమానుఁడగువాఁడు లోకంబుల దేవతలయందుఁగాని యక్షులయందుఁగాని గంధర్వులయందుఁగాని పక్షుల యందుఁగాని యెవ్వఁడును లేఁడు. ౨౦

రాజ్యభ్రష్టుఁడును దీనుఁడును తాపసుఁడును గతప్రాణుఁడును మనుష్యుఁడును అల్పతేజస్కుఁడు నగు రామునితో నీ కేమిపని? ౨౧

సీతా! నీవు నన్నే పొందుము. నేను నీకుఁ దగినపెనిమిటిని. యౌవనము అస్థిరముగదా! నాతోఁగూడ నిచ్చట రమించుచుండుము. ౨౨

సుందరముఖివగు సీతా! రామునిం జూడవలె నని మనంబున నాశ యుంచుకొనకుము, ఇచ్చటికి రావలెనని మనంబునం దలంచుటకుఁగూడ నతనికి శక్తిలేదు. ౨౩

మహావేగంబగు వాయువును ఆకాశంబునఁ ద్రాళ్లం బట్టి కట్ట నలవియగునా? మండుచున్న యగ్నిహోత్రుని విమలంబగుశిఖను బట్ట నలవియగునా? ౨౪

మంగళకరివగు సీతా! నాభుజబలంబునఁ బరిపాలింపఁబడుచున్నట్టి నిన్నుఁ బరాక్రమంబున నిచ్చటనుండి గొనిపోఁజాలినవాఁడు ఈముల్లోకంబులనుంగూడఁ గానంబడఁడు. ౨౫

నీవు లంకయందు ఇమ్మహారాజ్యంబును పాలింపుచుండుము. నేను ఇంకను నా యట్టి మహాశూరులును దేవతలును జంగమస్థావరంబులును నీకుఁ బరిచారకులు కాఁగలము. ౨౬

నీవు పట్టాభిషేకము నొంది లంకారాజ్యాధిపతివై సంతోషంబున నాతోఁగూడి రమింపుచుండుము.

నీవు మున్ను గావించిన పాపము వనవాసముచే ననుభవించితివి. ఇంక నీవు చేసికొనియున్న పుణ్యంబునకు ఫలమును ఇచ్చట ననుభవింపుము.

సీతా నీ విచ్చట దివ్యగంధపుష్పమాలికలను ఉత్తమంబులగు భూషణంబులను నాతోఁగూడ సేవించి క్రీడింపుము. ౨౯

పుష్పకం నామ సుశ్రోణి! భ్రాతు ర్వైశ్రవణస్య మే. ౨౯
విమానం సూర్యసఙ్కాశం తరసా నిర్జితం మయా,

విశాలం రమణీయం చ తద్విమాన మనుత్తమమ్. ౩౦
తత్ర సీతే! మయా సార్ధం విహరస్వ యథాసుఖమ్,

వదనం పద్మసఙ్కాశం విమలం చారుదర్శనమ్. ౩౧
శోకార్తం తు వరారోహే!న భ్రాజతి వరాననే!,

ఏవం వదతి తస్మిం త్సా వస్త్రాన్తేన వరాఙ్గనా. ౩౨
పిధా యేన్దునిభం సీతా ముఖ మశ్రూ ణ్యవర్తయత్,

ధ్యాయన్తీం తా మివాస్వస్థాం దీనాం చిన్తాహతప్రభామ్.౩౩
ఉవాచ వచనం పాపో రావణో రాక్షసేశ్వరః,

అలం వ్రీడేన వైదేహి! ధర్మలోపకృతేన చ. ౩౪
ఆర్షో౽యం దైవనిష్యన్దో య స్త్వా మభిగమిష్యతి,

ఏతౌ పాదౌ మయా స్నిగ్ధౌ శిరోభిః పరిపీడితౌ. ౩౫
ప్రసాదం కురు మే క్షిప్రం వశ్యో దాసో౽హ మస్మి తే,

ఇమా శ్శూన్యా మయా వాచ శ్శుష్యమాణేన భాషితాః.౩౬
న చాపి రావణః కాఞ్చి న్మూర్ధ్నా స్త్రీం ప్రణమేత హ,

సుందరములయిన పిఱుందులుగలసీతా! నాయన్న యగు కుబేరుని దగుసూర్యప్రభంబయిన పుష్పకమను విమానమును నేను భుజబలంబున జయించితిని. ౨౯

సీతా! ఉత్తమంబగు నావిమానము విశాలంబును రమణీయంబును గా నున్నది; అవ్విమానంబునందు సుఖముగా నాతోఁగూడ విహరింపుచుండుము. ౩౦

సుందరములయిన పిఱుందులుఁగలదానవు. సుందరమయిన మొగముగల దానవు నగుసీతా! కమలతుల్యంబును నిర్దోషంబును సుందరమునగు నీముఖము దుఃఖపీడితమయి యున్నది కావునఁ బ్రకాశింపకున్నది. దుఃఖము వదలుము. అని రావణుండు సీతతోఁ జెప్పెను. ౩౧

ఆరావణుఁ డీప్రకారంబునం జెప్పుచుండఁగా నుత్తమవనితయగు నాసీతాదేవి చీరకొంగునఁ జంద్రసుందరమగుముఖంబు గప్పుకొని కన్నీళ్లుగాఱ రోదనంబుఁ జేసెను. ౩౨

పాపిష్ఠుఁడయిన రాక్షసరాజుం డగు రావణుఁడు చింతాధ్యానపరాయణయయి పరవశయయి దీనయయి కాంతిహీనయయియున్న సీతాదేవిం జూచి యీమాటం జెప్పెను. ౩౩

సీతా! ధర్మలోపములు గలుగునని నీవు సిగ్గుపడవలదు. ఇప్పుడు దైవగతిచే నీకుఁ దటస్థించిన యీసంబంధము పునర్భూవిధులచే ధర్మశాస్త్రములందుఁ జెప్పఁబడియుండు ధర్మమే. ౩౪

సుందరములగు నీపాదముల నాతలలు సోఁకునట్లు పెక్కుమార్లు నమస్కారము సేయుచున్నాను. నామీఁద ననుగ్రహం బుంచుము. నీకు నేను వశ్యుండను దాసుండ నైతిని. ౩౫

నేను మన్మథబాణపీడితుండనై నీచములయిన యీమాటలం జెప్పినాను. రావణుం డిదివఱకు ఎట్టి స్త్రీకిని తలవంచి నమస్కరించి యెఱుంగఁడు. అని రావణుఁడు సీతతోఁ జెప్పెను. ౩౬

ఏవ ముక్త్వా దశగ్రీవో మైథిలీం జనకాత్మజామ్. ౩౫
కృత్వా న్తవశ మాపన్నో మ మేయ మితి మన్యతే,

ఇతి శ్రీమదరణ్యకాణ్డే పఞ్చపఞ్చాశ స్సర్గః. ౫౫.

---

## షట్పఞ్చాశ స్సర్గః.

సా తథోక్తా తు వైదేహీ నిర్భయా శోకకర్శితా,
తృణ మన్తరతః కృత్వా రావణం ప్రత్యభాషత. ౧

రాజా దశరథో నామ ధర్మసేతు రివాచలః,
సత్యసన్ధః పరిజ్ఞాతో యస్య పుత్త్రస్స రాఘవః. ౨
రామో నామ స ధర్మాత్మా త్రిషు లోకేషు విశ్రుతః,
దీర్ఘబాహు ర్విశాలాక్షో దైవతం హి పతి ర్మమ. ౩

ఇక్ష్వాకూణాం కులే జాత స్సింహస్కన్ధో మహాద్యుతిః,
లక్ష్మణేన సహ భ్రాత్రా య స్తే ప్రాణా న్హరిష్యతి. ౩

ప్రత్యక్షం య ద్యహం తస్య త్వయా స్యాం ధర్షితా బలాత్,
శయితా త్వం హత స్సంఖ్యే జనస్థానే యథా ఖరః. ౫

య ఏతే రాక్షసాః ప్రోక్తా ఘోరరూపా మహాబలాః,
రాఘవే నిర్విషా స్సర్వే సుపర్ణే పన్నగా యథా. ౬

రావణుండు జనకమహారాజ పుత్త్రియగు సీతతో నీప్రకారము చెప్పి కాలవశంగతుఁడై "ఈసీత నెట్లయినను వశీకరించుకొనవలెను" అని తలంచెను. ౩౭

ఇది యేఁబదియైదవసర్గము.

---

## ఏఁబదియాఱవసర్గము.

దుఃఖపీడితయగు నాసీత రావణుఁడు చెప్పినదంతయును విని భయంబు విడిచి రావణునకును దనకును నడుమం దృణం బుంచుకొని రావణుం జూచి యిట్లని చెప్పెను. ౧

దశరథుండను మహారాజొక్కఁడుండెను. అతఁడు ధర్మవ్యవస్థాపరుఁడుఁ, స్థిరుఁడు, సత్యసంధుండని ప్రసిద్ధుఁడు; ఆరాముఁడు ఆయనపుత్త్రుఁడు. రాముఁడు ధర్మాత్ముఁడు ముల్లోకంబులయందును బ్రసిద్ధి వహించినవాఁడు; ఆజానుబాహుఁడు; వెడఁదకన్నులవాఁడు; నాపెనిమిటి; కావున నీతండె నాకు దేవత. ౩

అతఁడు ఇక్ష్వాకువంశమునం బుట్టినవాఁడు. సింహమునకుంబోలె నున్నతభుజశిఖరంబులు గలవాఁడు; మహాతేజుఁడు; అతనికి లక్ష్మణుండను తమ్ముఁడు గలఁడు. ఆరాముఁడె తమ్మునితోఁ గూడ వచ్చి యుద్ధంబున నిన్ను వధింపఁ గలఁడు. ౪

నీవు రాముని సమక్షంబున మాత్రము నన్ను బలాత్కారంబున హరించియుందువేని నీ వింతకాలమునకు ఖరునియట్లు యుద్ధంబున నిహతుఁడవై జననభూమిం బరుండియుందువు. ౫

భయంకరాకారులయిన మహాబలశాలులునగు నీరాక్షసు లున్నారని చెప్పినావే; గరుత్మంతునిమీఁద సర్పముల విషము పనికిరానట్లు రామునిమీఁద నెంతమాత్రము వీరల జవము సాగదు. ౬

తస్య జ్యావిప్రముక్తా స్తే శరాః కాఞ్చనభూషణాః,
శరీరం విధమిష్యన్తి గఙ్గాకూల మివోర్మయః. ౭

అసురైర్వా సురైర్వా త్వం యద్యవధ్యోఽసి రావణ!,
ఉత్పాద్య సుమహా ద్వైరం జీవం స్తస్య న మోక్ష్యసే. ౮

స తే జీవితశేషస్య రాఘవోఽన్తకరో బలీ,
పశో ర్యూపగత స్యేవ జీవితం తవ దుర్లభమ్. ౯

యది పశ్యేత్స రామ స్త్వాం రోషదీప్తేన చక్షుషా,
రక్షః! స్త్వ మద్య నిర్దగ్ధో గచ్ఛే స్సద్యః పరాభవమ్. ౧౦
య శ్చన్ద్రం నభసో భూమౌ పాతయే న్నాశయేత వా,
సాగరం శోషయే ద్వాపి న సీతాం మోచయే దిహ. ౧౧

గతాయు స్త్వంగత శ్రీకో గతసత్త్వో గతేన్ద్రియః,
లఙ్కా వైధవ్యసంయుక్తా త్వత్కృతేన భవిష్యతి. ౧౨

న తే పాప మిదం కర్మ సుఖోదర్కం భవిష్యతి,
యాఽహం నీతా వినాభావం పతిపార్శ్వా త్త్వయా వనే.

స హి దైవతసంయుక్తో మమ భర్తా మహాద్యుతిః,
నిర్భయో వీర్య మాశ్రిత్య శూన్యే వసతి దణ్డకే. ౧౪

స తే దర్పం బలం వీర్య ముత్సేకం చ తథావిధమ్,
అపనేష్యతి, గాత్రేభ్య శ్శరవర్షేణ సంయుగే. ౧౫

ఆ రాముని ధనుశ్చ్యుతంబులగు కాంచనాలంకృతంబులయిన బాణంబులు తరంగంబులు నదీతీరంబు గలంచునట్లు నీదేహమును ఛేదించును. ౭

రావణుఁడా! నీవు అసురులకుఁ గాని సురలకుఁగాని యవధ్యుండవయ్యును ఆరామునకు నీమీఁద మహావైరంబు గలుగునట్లు చేసికొన్నావు; ఇంక ప్రాణముతో విడువఁ బడవు. ౮

నీ కింక నేమైన బ్రతుకవలసిన దినము లున్నట్లయితే వానికి బలవంతుఁడగు రాముఁడంతకుఁడు. యూపస్తంభంబునం గట్టఁబడిన పశువునకింక జీవితాశ లేనట్లు నీకింక జీవితాశ యెంతమాత్రము లేదు. ౯

రావణుఁడా! రాముఁడు ని న్నిప్పుడు రోషరక్తంబగు నేత్రంబునం జూచునేని నీవు తత్క్షణముననె దగ్ధుండవై పరాభవంబు నొందుదువు. ౧౦

రాముఁడు ఆకాశంబున నుండి చంద్రుని నేలం బడవైచును; నాశంబు నొందింపనుం జాలును. సముద్రంబు నంతయు శోషిల్లం జేయఁ జాలును అట్టి రాముఁడు సీత నిచ్చటనుండి కొనుపోఁ గలం డనుట యేమి యాశ్చర్యము. ౧౧

నీవు ఆయుర్హీనుఁడవు తేజోహీనుండవు. బలహీనుఁడవు. జ్ఞానహీనుండవు నైతివి. నీవు చేసిన పరస్త్రీపరామర్శముచేతనె లంకయు వైధవ్యము నొందఁగలదు. ౧౨

నీవు వనంబునఁ బెనిమిటిపార్శ్వంబుననుండి నన్ను వియోగంబు నొందించి యిచ్చటికి దెచ్చినావు. కావున ఈపాపకార్యము నీ కెంతమాత్రము సుఖము కలిగింపదు. దుఃఖమునే కలిగించును. ౧౩

దైవబలంబుగలవాఁడును మహాతేజుఁడునగు నా పెనిమిటి రాముఁడు పరాక్రమంబు నాశ్రయించి శూన్యం బగు దండకారణ్యంబునందు నిర్భయుండై యున్నాఁడు. నిన్ను వదలఁడు. ౧౪

ఆరాముఁడు యుద్ధంబున బాణవర్షంబు పఱఁగించి నీదేహమునందు మదంబును బలంబును బరాక్రమంబును గర్వంబును విడిపింపఁగలఁడు. ౧౫

యదా వినాశో భూతానాం దృశ్యతే కాలచోదితః,
తదా కార్యే ప్రమాద్యన్తి నరాః కాలవశం గతాః. ౧౬
మాం ప్రధృష్య స తే కాలః ప్రాప్తోఽయం రాక్షసాధమ!,
ఆత్మనో రాక్షసానాం చ వధా యాన్తఃపురస్య చ. ౧౭

న శక్యా యజ్ఞమధ్యస్థా వేది స్స్రుగ్భాణ్డమణ్డితా,
ద్విజాతిమన్త్రపూతా చ చణ్డాలే నావమర్దితుమ్. ౧౮

తథాఽహం ధర్మనిత్యస్య ధర్మపత్నీ పతివ్రతా,
త్వయా స్ప్రష్టుం న శక్యాఽస్మి రాక్షసాధమ! పాపినా. ౧౯

క్రీడన్తీ రాజహంసేన పద్మషణ్డేషు నిత్యదా,
హంసీ సా తృణషణ్డస్థం కథం పశ్యేత మద్గుకమ్. ౨౦
ఇదం శరీరం నిస్సంజ్ఞం బన్ధ వా ఖాదయస్వ వా,
నేదం శరీరం రక్ష్యం మే జీవితం వాపి రాక్షస!. ౨౧

నతు శక్ష్యామ్యుపక్రోశం పృథివ్యాం దాతు మాత్మనః,

ఏవ ముక్త్వా తు వైదేహీ క్రోధా త్సుపరుషం వచః. ౨౨
రావణం మైథిలీ తత్ర పున ర్నోవాచ కించన,
సీతాయా వచనం శ్రుత్వా పరుషం రోమహర్షణమ్. ౨౩
ప్రత్యువాచ తత స్సీతాం భయసన్దర్శనం వచః,

శృణు మైథిలి! మద్వాక్యం మాసా న్ద్వాదశ భామిని!. ౨౪

దైవగతిచే భూతవివాళంబు కలుగఁబోవు కాలంబున మనుష్యులు కాలవశంగతులయి విపరీతకార్యంబులం జేయుదురు. ౧౬

రాక్షసాధముఁడవగు రావణుఁడా! నీవు నన్నపహరించినావు కావున నీ కిప్పుడు నీవును రాక్షసు లందఱును అంతఃపురజనులును వధంబునొందునట్టి యాకాలంబు వచ్చినది. ౧౭

యాగశాలామధ్యంబున నుండునదియు స్రుక్స్రువాద్యుపకరణములతోఁ గూడినదియు బ్రాహ్మణులు పఠించు మంత్రంబులచేఁ బరిశుద్ధంబునగు యాగవేదికను జండాలుఁడు కాలం ద్రొక్కఁజాలఁడుగదా!. ౧౮

రాక్షసాధముఁడవగు రావణుఁడా! ఆప్రకారంబునఁ బరమధార్మికుఁడగు రాముని ధర్మపత్నిని పతివ్రతను అయిన నన్నుఁ బాపిష్ఠుఁడవగు నీకు స్పృశింప నెంతమాత్ర మలవికాదు. ౧౯

ఎల్లప్పుడు కమలవనంబునందు రాజహంసతోఁ గ్రీడించుచుండు హంసి తృణంబులం దిరుగు నీరుకాకిని గన్నెత్తి చూచునా? ౨౦

రావణుఁడా! నీవు తాఁకినంతనె యీదేహంబు నిస్సంజ్ఞంబగును దీనిబంధించినను బంధించుము. భక్షించినను భక్షించుము. నాకు ఈదేహమును ప్రాణమును గాని రక్షించుకొన వలయునని యెంతమాత్రములేదు. నేను పాతివ్రత్యభంగంబునొందితినని లోకములో నపవాదమును బొందుట నెంతమాత్రము సహింపఁజాలను. అనిసీతాదేవి రావణునికిఁ జెప్పెను.

సీతాదేవి కోపావేశంబున, నీప్రకారము పరుషముగాఁ జెప్పి యంత రావణునితో మఱేమియు మాటాడక యూరకుండెను. ౨౨

ఆరావణుఁడు సీతాదేవి చెప్పిన పరుషంబును గగుర్పాటు నొందించునదియు నగు మాటను విని కుపితుఁడై సీతాదేవిం జూచి భయంకరమగు నీమాటం జెప్పెను. ౨౩

సీతా! నేను జెప్పెడిమాట వినుము. నీకుఁ బండ్రెండుమాసములు గడువొసంగెదను. ౨౪

కాలే నానేన నాభ్యేషి యది మాం చారుహాసిని!,
తత స్త్వాం ప్రాతరాశార్థం సూదా శ్ఛేత్స్యన్తి లేశశః. ౨౫

ఇ త్యుక్త్వా పరుషం వాక్యం రావణ శ్శత్రురావణః,
రాక్షసీ శ్చ తతః క్రుద్ధ ఇదం వచన మబ్రవీత్. ౨౬
శీఘ్ర మేవ హి రాక్షస్యో! వికృతా ఘోరదర్శనాః,
దర్ప మస్యా వినేష్యధ్వం మాంసశోణితభోజనాః ౨౭

వచనా దేవ తా స్తస్య సుఘోరా రాక్షసీగణాః,
కృతప్రాఞ్జలయో భూత్వా మైథిలీం పర్యవారయన్. ౨౮
స తాః ప్రోవాచ రాజా తు రావణో ఘోరదర్శనః,
ప్రచాల్య చరణోత్కర్షై ర్దారయ న్నివ మేదినీమ్. ౨౯

అశోకవనికామధ్యే మైథిలీ నీయతా మియమ్,
తత్రేయం రక్ష్యతాం గూఢం యుష్మాభిః పరివారితా. ౩౦
త త్రైనాం తర్జనై ర్ఘోరైః పున స్సాన్త్వై శ్చ మైథిలీమ్,
ఆనయధ్వం వశం సర్వా వన్యాం గజవధూ మివ. ౩౧

ఇతి ప్రతిసమాదిష్టా రాక్షస్యో రావణేన తాః,
అశోకవనికాం జగ్ము ర్మైథిలీం ప్రతిగృహ్య తు. ౩౨
సర్వకాలఫలై ర్వృక్షై ర్నానాపుష్పఫలై ర్వృతామ్,
సర్వకాలమదై శ్చాపి ద్విజై స్సముపసేవితామ్. ౩౩
సా తు శోకపరీతాఙ్గీ మైథిలీ జనకాత్మజా,
రాక్షసీవశ మాపన్నా వ్యాఘ్రీణాం హరిణీ యథా. ౩౪

సుందరమయిన నగవుగలసీతా! ఈపండ్రెండుమాసములలో నీవు నన్నుఁ బొందవేని యంత మఱునాటి ప్రాతఃకాలభోజనంబునకై నిన్ను నావంటవాండ్రు తునకలు తునకలుగా ఛేదింతురు. అని రావణుఁడు సీతతోఁ జెప్పెను. ౨౫

శత్రువుల నేడ్పించునట్టి రావణుఁడు ఇట్లు పరుషంబుగా సీతతోడం జెప్పి కుపితుఁడై రాక్షసస్త్రీలం జూచి యీమాటం జెప్పెను. ౨౬

మాంసరక్తాహారలగు రాక్షసస్త్రీలారా! మీరలు శీఘ్రంబున వికృతంబును భయంకరంబు నగు నాకారంబునొంది యీసీతాదేవి గర్వం బడంతురు గాక. అని రాక్షసస్త్రీలతోఁ జెప్పెను. ౨౭

భయంకరాకారలగు నారాక్షసస్త్రీలు రావణుని మాటమాత్రముననె చేమోడ్పులు గిలించి సీతాదేవి చుట్టును బరివేష్టించి నిలిచిరి. ౨౮

భయంకరాకారుండగు రాక్షసరాజుఁడు రావణుఁడు కోపంబున భూమి చలించి పగులునట్లు కాళ్లచే నేలందన్నుచు నారాక్షసస్త్రీలం జూచి యిట్లని చెప్పెను. ౨౯

ఈసీతను అశోకవనంబునడుమ నుంచి మీరలు ఈబిడచుట్టును బరివేష్టించియుండి రహస్యముగా నీబిడను రక్షింపుఁడు. ౩౦

ఆయ్యశోకవనంబున మీరలు భయంకరముగా బెదరించియు మఱలఁ దిన్నవిమాటలం దేర్చియు అడవియాఁడేనుంగునుంబోలె నీసీతను వశీకరింపుఁడు. అని రావణుఁడు రాక్షసస్త్రీల కాజ్ఞాపించెను. ౩౧

ఆరాక్షసస్త్రీలు రావణునాజ్ఞను శిరసావహించి సీతం దీసికొని యెల్లప్పుడును నానావిధఫలపుష్పంబులతోఁ గూడిన వృక్షంబులతోను ఎల్లకాలంబులయందును మదకలములయిన పక్షులతోను ఒప్పుచున్న యశోకవనమునకుఁ బోయిరి. ౩౨,౩౩

జనకమహారాజు కొమార్తెయగు నాసీతాదేవి యారాక్షసస్త్రీల నడుమం జిక్కి పులులనడుమం జిక్కిన లేడికైవడి దుఃఖభయంబుల నెంతయుఁ బరితపించెను. ౩౪

శోకేన మహతా గ్రస్తా మైథిలీ జనకాత్మజా,
న శర్మ లభతే భీరుః పాశబద్ధా మృగీ యథా. ౩౫

న విన్దతే తత్ర తు శర్మ మైథిలీ
విరూపనేత్రాభి రతీవ తర్జితా,
పతిం స్మరన్తీ దయితం చ దైవతం
విచేతనాఽభూ ద్భయశోకపీడితా. ౩౬

ఇతి శ్రీమదరణ్యకాణ్డే షట్పఞ్చాశ స్సర్గః. ౫౬.

## సప్తపఞ్చాశ స్సర్గః.

రాక్షసం మృగరూపేణ చరన్తం కామరూపిణమ్,
నిహత్య రామో మారీచం తూర్ణం పథి నివర్తతే. ౧
తస్య సన్త్వరమాణస్య ద్రష్టుకామస్య మైథిలీమ్,
క్రూరస్వనోఽథ గోమాయు ర్విననా దాస్య పృష్ఠతః. ౨
స తస్య స్వర మాజ్ఞాయ దారుణం రోమహర్షణమ్,
చిన్తయామాస గోమాయోః స్వరేణ పరిశఙ్కితః. ౩

అశుభం బత మన్యేఽహం గోమాయు ర్వాశ్యతే యథా,
స్వస్తి స్యా దపి వైదేహ్యా రాక్షసై ర్భక్షణం వినా. ౪

మారీచేన తు విజ్ఞాయ స్వర మాలంబ్య మామకమ్,
విక్రుష్టం మృగరూపేణ లక్ష్మణ శ్శృణుయా ద్యది. ౫
స సౌమిత్రి స్స్వరం శ్రుత్వా తాం చ హిత్వా చ మైథిలీమ్,
తయైవ ప్రహితః క్షిప్రం మత్సకాశ మిహైష్యతి. ౬
రాక్షసై స్సహితై ర్నూనం సీతాయా ఈప్సితో వధః,

జనకమహారాజపుత్త్రియగు సీతాదేవి స్వభావంబున భీరువుకావున త్రాళ్లం గట్టఁబడిన లేడికైవడిఁ బరమదుఃఖితయయి యెంతమాత్రము సుఖంబు నొందదయ్యె. ౩౫

అప్పుడు సీతాదేవి వికృతనయనలగు నారాక్షసస్త్రీలు నానావిధంబుల బెదరింప నెంతమాత్రము సుఖంబు నొందక ప్రియుండును దైవంబును బెనిమిటియునగు రాముం దలంచుకొని భయదుఃఖంబులు మనంబునఁ బెనంగొన మూర్ఛితయయ్యెను. ౩౬

ఇది యేఁబదియాఱవసర్గము.

---

## ఏఁబదియేడవ సర్గము.

రాముఁడు మృగరూపంబునం దిరుగుచున్న కామరూపియగు మారీచుని వధించి శీఘ్రంబునఁ దనయాశ్రమంబు దారిఁబట్టిపోయెను. ౧

అంత నారాముఁడు సీతం జూడఁగోరి శీఘ్రంబునఁ బోవుచుండఁగా నతనివెనుకను నక్క భయంకరధ్వనితో నఱచెను. ౨

రాముఁడు భయంకరమును రోమహర్షణంబు నగు నానక్కధ్వనిని విని యట్లు తనవెనుకఁ జేరి నక్క కూయుటచే సందేహమునొంది యిట్లని యాలోచించెను. ౩

ఈప్రకారంబున నక్క యఱచుటవలన ఏమో యమంగళంబు గలుగునని తలంచెదను. అయ్యో! సీత రాక్షసులచే భక్షింపఁబడక క్షేమంబుగ నుండునా యేమి ? ౪

లక్ష్మణుఁడు మృగరూపముదాల్చిన మారీచుఁడు నాకంఠధ్వనిఁజక్కఁగా గనిపెట్టి యనుసరించి యఱచిన ధ్వనిని వినియుండునేని అట్లె యాధ్వనిని విన్నసీతచేఁ బంపఁబడినవాఁడై యతఁడు సీతను విడిచి నన్ను వెదకుకొని యిచ్చటికి రాఁగలఁడు. ౫

మారీచుఁడు కాంచనమృగరూపంబున వచ్చి నన్ను ఆశ్రమంబున

కాఞ్చనశ్చ మృగో భూత్వా వ్యపనీయాశ్రమాత్తు మామ్,
దూరం నీత్వా తు మారీచో రాక్షసోఽభూచ్ఛరాహతః,
హా లక్ష్మణ! హతోఽస్మీతి యద్వాక్యం వ్యాజహార చ. ౮

అపి స్వస్తి భవేత్తాభ్యాం రహితాభ్యాం మహావనే,
జనస్థాననిమిత్తం హి కృతవైరోఽస్మి రాక్షసైః. ౯

నిమిత్తాని చ ఘోరాణి దృశ్యన్తేఽద్య బహూని చ,

ఇత్యేవం చిన్తయన్రామ శ్రుత్వా గోమాయునిస్వనమ్. ౧౦
ఆత్మనశ్చాపనయనాన్మృగరూపేణ రక్షసా,
ఆజగామ జనస్థానం రాఘవః పరిశఙ్కితః. ౧౧

తం దీనమనసో దీనమాసేదుర్మృగపక్షిణః,
సవ్యం కృత్వా మహాత్మానం ఘోరాంశ్చ ససృజుస్స్వరాన్.
తాని దృష్ట్వా నిమిత్తాని మహాఘోరాణి రాఘవః,
న్యవర్తతాథ త్వరితో జవేనాశ్రమమాత్మనః. ౧౩
స తు సీతాం వరారోహాం లక్ష్మణం చ మహాబలమ్,
ఆజగామ జనస్థానం చిన్తయన్నేవ రాఘవః. ౧౪

తతో లక్ష్మణమాయాన్తం దదర్శ విగతప్రభమ్,

తతోఽవిదూరే రామేణ సమీయాయ స లక్ష్మణః. ౧౫
విషణ్ణస్సువిషణ్ణేన దుఃఖితో దుఃఖభాగినా,
సంజగర్హేఽథ తం భ్రాతా జ్యేష్ఠో లక్ష్మణమాగతమ్. ౧౬

నుండి బహుదూరంబునకు గొనిపోయి తుదకు బాణహతుండై మఱల రాక్షసుండయినాఁడు. మఱియు నూరక చావక "హా లక్ష్మణా! హతుండ నైతిని" అని నాకంఠధ్వనియట్లు కూసెను. ఈ కారణములవలన రాక్షసులందఱు చేరి సీతను జంపివేయవలెనని కోరుచున్నారనుట నిశ్చయము. ౭-౮

జనస్థానయుద్ధమె నిమిత్తముగా రాక్షసులతో వైరంబుఁ బెట్టుకొంటిని. మహారణ్యంబున నొంటిమెయి నున్న సీతాలక్ష్మణులు క్షేమంబుగా నుందురా యేమి? ౯

మఱియు నిప్పుడు భయంకరములయిన నిమిత్తంబులుఁ గూడఁ బెక్కులు చూపట్టుచున్నవి. అని రాముఁడు చింతించెను.

రఘువంశమునఁ బుట్టిన రాముఁడు మృగరూపుఁడగు మారీచునిధ్వనిని విని యతఁడు తన్నట్లు దూరంబు గొనిపోవుటవలనను సంశయము నొందిన వాఁడై యీప్రకారంబునం జింతించుచు జనస్థానంబునందలి తనయాశ్రమంబునకు వచ్చెను. ౧౦,౧౧

మృగపక్షులు దీనములయి దీనుఁడైన రామునిచెంతఁ జేరి మహాత్ముఁడగు నతని కప్రదక్షిణముగాఁ దిరిగి భయంకరంబుగా నఱచినవి. ౧౨

రాముఁడు మహాభయంకరములయిన యాదుష్టనిమిత్తములం జూచి శంకితుఁడై వేగంబునఁ దనయాశ్రమంబుదారిఁ బట్టి నడిచెను. ౧౩

రాముఁడు సుందరంబులయిన పిఱుందులుగల సీతాదేవిని మహాబలుండగు లక్ష్మణునిం దలంచుకొనుచునే జనస్థానంబునందలి తనయాశ్రమంబునకు వచ్చుచుండెను. ౧౪

అంత రాముఁడు వెలవెలంబాఱు మోముతోఁ దనయొద్దకు వచ్చుచున్న లక్ష్మణుం జూచెను.

అంత దిగులొంది దుఃఖితుఁడై యున్న యాలక్ష్మణుఁడు అట్లు దిగులుపడియున్నవాఁడును దుఃఖితుఁడు నైన రామునిసమీపంబునకుఁ బోయెను.

అంత అన్నయగు రాముఁడు నిర్జనంబయిన రాక్షసు లుండునట్టి మహా-

విహాయ సీతాం విజనే వనే రాక్షససేవితే,
గృహీత్వా చ కరం సవ్యం లక్ష్మణం రఘునన్దనః.
ఉవాచ మధురోదర్క మిదం పరుష మార్తిమత్,
అహో లక్ష్మణ! గర్హ్యం తే కృతం య స్త్వం విహాయ తామ్,
సీతా మిహాఽగత స్సౌమ్య! కచ్చి త్స్వస్తి భవే దిహ,

న మేఽస్తి సంశయో వీర! సర్వథా జనకాత్మజా ౧౯
వినష్టా భక్షితా వాపి రాక్షసై ర్వనచారిభిః,
అశుభా న్యేవ భూయిష్ఠం యథా ప్రాదుర్భవన్తి మే. ౨౦

అపి లక్ష్మణ! సీతాయా స్సామగ్ర్యం ప్రాప్నుయావహే,
జీవన్త్యాః పురుషవ్యాఘ్ర! సుతాయా జనకస్య వై. ౨౧
యథా వై మృగసంఘా శ్చ గోమాయు శ్చైవ భైరవమ్,
వాశ్యన్తే శకునా శ్చాపి ప్రదీప్తా మభితో దిశమ్. ౨౨
అపి స్వస్తి భవే త్తస్యా రాజపుత్ర్యా మహాబల!.

ఇదం హి రక్షో మృగసన్నికాశం
ప్రలోభ్య మాం దూర మనుప్రయాన్తమ్,
హతం కథంచి న్మహతా శ్రమేణ
స రాక్షసోఽభూ న్మ్రియమాణ ఏవ. ౨౩
మనశ్చ మే దీన మిహాప్రహృష్టం
చక్షు శ్చ సవ్యం కురుతే వికారమ్,
అసంశయం లక్ష్మణ! నాస్తి సీతా
హృతా మృతా వా పథి వర్తతే వా. ౨౪

ఇతి శ్రీమదరణ్యకాణ్డే సప్తపఞ్చాశ స్సర్గః. ౫౭.

రణ్యంబున సీతాదేవి నొంటి విడిచివచ్చిన లక్ష్మణు నెంతయు నిందించెను.

రాముఁడు లక్ష్మణుని యెడమచేయిఁ బట్టుకొని మొదటఁ బరుషం బును దుదను మధురంబును దుఃఖయుక్తంబునగు నీమాటం జెప్పెను. ౧౭

లక్ష్మణుఁడా! నీవు సీత నచ్చట నొంటిమెయి విడిచివచ్చితివే; తప్పు పని చేసినావు. ఆశ్చర్యముగా నున్నది సౌమ్యుఁడా! ఇప్పుడు మనకు క్షేమము కలుగునాయేమి? ౧౮

పరాక్రమవంతుఁడవగు లక్ష్మణుఁడా! ఇప్పుడు నాకు దుర్నిమిత్తములె యధికముగా నగపడుచుండుటం జూడఁగా నన్నివిధంబులను సీతను వనచరులగు రాక్షసులు అపహరించుకొనియయినను బోయియుందురు లేక భక్షించియయిన నుందురు. నాకు సందియములేదు. ౧౯,౨౦

పురుషశ్రేష్ఠుఁడవగు లక్ష్మణుఁడా! జనకమహారాజుకొమార్తెయగు సీతాదేవి బ్రతికి క్షేమముతో నుండుటను మనము చూడఁగలమాయేమి? ౨౧

ఎందువలన ననఁగా! జింకలు నక్కలును బక్షులును సూర్యుఁ డుండుదిక్కుఁ జేరి భయంకరంబుగా నఱచుచున్నవి. ౨౨

మహాబలశాలివగు లక్ష్మణుఁడా! రాచకొమార్తెయగు సీతకు క్షేమంబు గలుగునాయేమి?

జింకరూపుదాల్చిన యీరాక్షసుఁడు తన్ను వెంబడించుచున్న నన్ను మోసపుచ్చి బహుదూరము కొనిపోయి మహాశ్రమంబున నాచే హతుఁడై మరణకాలంబుననె రాక్షసరూపంబు నొందెను. ౨౩

ఇప్పుడు నామనస్సు దీనమై సంతోషములేకున్నది. నాయెడమకన్ను అదరుచున్నది. కావున లక్ష్మణుఁడా సీత రాక్షసులచే నపహరింపఁబడినదో, మరణంబునొందినదో, మార్గంబునం గొనిపోఁబడుచున్నదోఁగాని యాశ్రమంబునందులేదు. సందేహములేదు. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను.

ఇది యేఁబదియేడవసర్గము.

## అష్టపఞ్చాశ స్సర్గః.

స దృష్ట్వా లక్ష్మణం దీనం శూన్యే దశరథాత్మజః,
పర్యపృచ్ఛత ధర్మాత్మా వైదేహీ మాగతం వినా. ౧

ప్రస్థితం దణ్డకారణ్యం యా మా మనుజగామ హ,
క్వ సా లక్ష్మణ! వైదేహీ యాం హిత్వా త్వ మిహాగతః. ౨

రాజ్యభ్రష్టస్య దీనస్య దణ్డకా న్పరిధావతః,
క్వ సా దుఃఖసహాయా మే వైదేహీ తనుమధ్యమా. ౩

యాం వినా నోత్సహే వీర! ముహూర్త మపి జీవితుమ్,
క్వ సా ప్రాణసహాయా మే సీతా సురసుతోపమా. ౪

పతిత్వ మమరాణాం వా పృథివ్యా శ్చాపి లక్ష్మణ!,
తాం వినా తపనీయాభాం నేచ్ఛేయం జనకాత్మజామ్. ౫

కచ్చి జ్జీవతి వైదేహీ! ప్రాణైః ప్రియతరా మమ,
కచ్చి త్ప్రవ్రాజనం సౌమ్య! న మే మిథ్యా భవిష్యతి. ౬

సీతానిమిత్తం సౌమిత్రే! మృతే మయి గతే త్వయి,
కచ్చి త్సకామా సుఖితా కైకేయీ సా భవిష్యతి.

సపుత్త్రరాజ్యాం సిద్ధార్థాం మృతపుత్త్రా తపస్వినీ,
ఉపస్థాస్యతి కౌసల్యా కచ్చి త్సౌమ్య! న కైకయీమ్. ౮

## ఏఁబదియెనిమిదవసర్గము.

ధర్మాత్ముఁడగు దశరథమహారాజపుత్రుఁడైన రాముఁడు శూన్యంబగు మహారణ్యంబున సీతాదేవిని విడిచివచ్చినవాఁడును దీనుఁడు నగు లక్ష్మణుం జూచి యిట్లని యడిగెను. ౧

లక్ష్మణుఁడా! ఎవ్వతె దండకారణ్యంబునకు వచ్చుచున్న నన్ను వెంబడించి వచ్చెనో అట్టిసీతను నీ విప్పుడు విడిచి వచ్చినావే; ఆసీత యిప్పు డెచ్చట నున్నది? ౨

రాజ్యభ్రష్టుఁడనై దీనుఁడనై దండకారణ్యంబునం దిరుగుచున్న నాతో సమానముగా దుఃఖము ననుభవించుచు నాకుఁ దోడుగానున్న సన్న నడుముగల యాసీత యెచ్చట నున్నది? ౩

పరాక్రమశాలివగు లక్ష్మణుఁడా! ఎవ్వతెను విడిచి నేను ముహూర్తకాలమేని జీవింపఁజాలనో అట్టి దేవకన్యతో సరివచ్చునట్టి నాప్రాణంబులకుఁ దోడైన సీత యెచ్చట నున్నది? ౪

లక్ష్మణుఁడా! బంగారుచాయవంటి దేహముగల జనకమహారాజపుత్రి యగు నాసీత లేనియెడ దేవేంద్రత్వముగాని భూమండలాధిపత్యముగాని నా కింతమాత్ర మక్కఱలేదు. ౫

సౌమ్యుఁడవగు లక్ష్మణుఁడా! నాకుఁ బ్రాణంబులకన్నను బ్రియయయిన సీత బ్రతికియున్నదా? సీతావియోగమువలన నే నిప్పుడె ప్రాణంబులు వదలఁగాఁ బదునాలుగుసంవత్సరములు వనవాసము నేయుటయను నావ్రతము తప్పిపోవుఁగదా? ౬

లక్ష్మణుఁడా! సీత నశించుటవలన నేనును మరణంబు నొంది నీవు అయోధ్యకుఁ బోఁగానే ఆకైకేయి నిన్నుం జూచి తనకోర్కె యీడేఱెనని సుఖంబు నొందఁగలదా యేమి? ౭

అట్లు పుత్రుఁడనైన నేనును మృతినిబొంది కనికరింపఁదగిన స్థితిలోనుండు కౌసల్యాదేవి కొడుకుతోను దొరతనముతోనుం గూడినదియుఁ దన

యది జీవతి వైదేహీ గమిష్యా మ్యాశ్రమం పునః,
సువృత్తా యది వృత్తా సా ప్రాణాం స్త్యక్ష్యామి లక్ష్మణ!. ౯

యది మా మాశ్రమగతం వైదేహీ నాభిభాషతే,
పునః ప్రహాసితా సీతా వినశిష్యామి లక్ష్మణ!. ౧౦

బ్రూహి లక్ష్మణ! వైదేహీ యది జీవతి వా న వా,
త్వయి ప్రమత్తే రక్షోభి ర్భక్షితా వా తపస్వినీ. ౧౧
సుకుమారీ చ బాలా చ నిత్యం చాదుఃఖదర్శినీ,
మద్వియోగేన వైదేహీ వ్యక్తం శోచతి దుర్మనాః. ౧౨

సర్వథా రక్షసా తేన జిహ్మేన సుదురాత్మనా,
వదతా లక్ష్మణే త్యుచ్చై స్తవాపి జనితం భయమ్. ౧౩
శ్రుత స్తు శఙ్కే వైదేహ్యా స స్వర స్సదృశో మమ,
త్రస్తయా ప్రేషిత స్త్వం చ ద్రష్టుం మాం శీఘ్ర మాగతః. ౧౪

సర్వథా తు కృతం కష్టం సీతా ముత్సృజతా వనే,
ప్రతికర్తుం నృశంసానాం రక్షసాం దత్త మన్తరమ్. ౧౫

దుఃఖితాః ఖరఘాతేన రాక్షసాః పిశితాశనాః,
తై స్సీతా నిహతా ఘోరై ర్భవిష్యతి న సంశయః. ౧౬
అహోఽస్మిన్ వ్యసనే మగ్న స్సర్వథా శత్రుసూదన!,
కిం న్విదానీం కరిష్యామి శఙ్కే ప్రాప్తవ్య మీదృశమ్. ౧౭

కోర్కులన్నియు నీడేర్చుకొన్నదియు నగు కైకేయిని వినయంబున సేవింపుచుండఁ గలదాయేమి? ౮

లక్ష్మణుఁడా! సీత బ్రతికియుండు నేని మఱల నాశ్రమంబునకు వచ్చెదను. సదాచారసంపన్నయగు నాసీత మృతిఁబొందియుండినయెడఁ బ్రాణంబులు విడిచెదను. ౯

లక్ష్మణుఁడా! నే నాశ్రమంబునకుఁ జేరఁగానే సీత మొగంబునం జిఱునగ వొప్ప మధురాలాపంబు లాడుచు నాచెంతకు రాకుండు నేని నేను దక్షణంబ మరణంబు నొందుదును. ౧౦

లక్ష్మణుఁడా! సీత బ్రతికియున్నదా లేదా? చెప్పు. లేక నీవు ఏమఱియుండఁగా రాక్షసులు చూచి దిక్కులేనిసీతను భక్షించివేసినారా? ౧౧

సుకుమారశరీరయును బిన్నవయస్సుదియు నెప్పుడును దుఃఖము నెఱుంగనిదియు నగుసీత నావియోగంబు గలుగుటచే దుఃఖంబునొందఁగలదు. ఇది స్పష్టము. ౧౨

కపటియు దురాత్ముఁడు నగు నారాక్షసుఁడు "లక్ష్మణుఁడా" యని గట్టిగా నఱచుటచేత శూరుఁడవగు నీకును భయంబు గలిగినది. ౧౩

నాకంఠధ్వనియట్లు ఆరాక్షసుఁడు కూసినమాటను సీత వినియుండును. అంత భయపడి నిన్నుఁ బంపఁగా నీవు నన్నుఁ జూచుటకై శీఘ్రంబున వచ్చినావని తలంచెదను. ౧౪

అడవియందు సీత నొంటి విడిచి వచ్చుటచేత నీవు చాలఁ గష్టము గావించినావు. క్రూరులగు రాక్షసులకు మనపై వైరంబు దీర్చుకొనుట కవకాశంబు లేకుండినది. ఇప్పుడు నీవు అవకాశము గలిగించితివి. ౧౫

మాంసాహారులగురాక్షసులు నేను ఖరుని వధించుటచేఁ జాలదుఃఖంబు నొందియున్నారు. భయంకరాకారులగు నారాక్షసులు సీతను వధించియుందురు. సందియము లేదు. ౧౬

శత్రువులం జంపునట్టి లక్ష్మణుఁడా! అయ్యో! నే నిప్పు డీవ్యసనసముద్రమునందు మునింగి యేమి చేయఁగలను? ఇట్టియాపదను బొందవలసి

ఇతి సీతాం వరారోహాం చిన్తయ న్నేవ రాఘవః,
ఆజగామ జనస్థానం త్వరయా సహలక్ష్మణః. ౧౭
వికర్షమాణోఽనుజ మార్తరూపం
క్షుధాశ్రమా చ్చైవ పిపాసయా చ,
వినిశ్శ్వసన్ శుష్కముఖో వివర్ణః
ప్రతిశ్రయం ప్రాప్య సమీక్ష్య శూన్యమ్. ౧౮
స్వ మాశ్రమం సమ్ప్రవిగాహ్య వీరో
విహారదేశా ననుసృత్య కాంశ్చిత్,
ఏత త్తదిత్యేవ నివాసభూమౌ
ప్రహృష్టరోమా వ్యథితో బభూవ. ౨౦
ఇతి శ్రీమదరణ్యకాణ్డేఽష్టపఞ్చాశ స్సర్గః. ౫౮.

ఏకోనషష్టితమ స్సర్గః.

అథాఽఽశ్రమా దుపావృత్త మన్తరా రఘునన్దనః,
పరిపప్రచ్ఛ సౌమిత్రిం రామో దుఃఖార్దితం పునః. ౧

త ముపాచ కిమర్థం త్వ మాగతోఽపాస్య మైథిలీమ్,
యదా సా తవ విశ్వాసా ద్వనే విరహితా మయా. ౨

దృష్ట్వై వాభ్యాగతం త్వాం మే మైథిలీం త్యజ్య లక్ష్మణ!,
శఙ్కమానం మహ త్పాపం య త్సత్యం వ్యథితం మనః. ౩

స్ఫురతే నయనం సవ్యం బాహు శ్చ హృదయం చ మే,

నట్లు విధియున్నదని తలంచెదను. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను.

రాముఁ డీప్రకారంబున సుందరంబులగు పిఱుందులుగల సీతనే తలంచుచు లక్ష్మణునితోఁ గూడ వేగంబున జనస్థానంబునకుఁ బోయెను. ౧౮

పరాక్రమవంతుఁడగు రాముఁడు దుఃఖితుఁడై యున్న తమ్ముని లక్ష్మణు నీప్రకారంబున నిందించుచు ఆఁకలిదప్పులవలనను శ్రమంబువలనను నిట్టూర్పులు పుచ్చుచు ఎండిననోరుగలవాఁడై వివర్ణుఁడై తనయాశ్రమసమీపప్రదేశమునకుఁ బోయి యచ్చట సీతం గానక యంత నాశ్రమంబుఁ జొచ్చి యచ్చటను బ్రియురాలిం గానక విహారప్రదేశంబులం జూచి యాక్రీడావాసస్థానంబునందు "ఈప్రదేశం బిట్టిది ఇదియట్టి" దని చెప్పుచు మేనం గగుర్పాటు గదురఁ బరమదుఃఖితుఁడయ్యె. ౧౯,౨౦

ఇది యేఁబదియెనిమిదవసర్గము.

---

## ఏఁబదితొమ్మిదవసర్గము.

అంత రఘువంశమునకు సంతోషంబు గలిగించునట్టి రాముఁడు ఆశ్రమమునుండి వచ్చిన పరమదుఃఖితుఁడగు లక్ష్మణుని దారినడుమం జూచి మఱల నిట్లని యడిగెను. ౧

రాముఁడు లక్ష్మణుఁ జూచి యిట్లనియె. నేను నీయందలి నమ్మకంబున సీతను వనంబునందు విడిచిపోయియుండఁగా నీవు ఆబిడను విడిచియెందుకు వచ్చితివి ? ౨

లక్ష్మణుఁడా! సీత నడవిలో విడిచివచ్చిన నిన్నుఁ జూచినంతనె సీతకేమో మహాభయంబు గలిగియుండునని భయంబునొంది నామనస్సు వాస్తవముగా మిక్కిలియు దుఃఖము నొందినది. ౩

లక్ష్మణుఁడా! సీతను విడిచివచ్చుచున్న నిన్ను దూరంబుననుండి దారిలోఁజూచినంతనె నాయెడమకన్నును ఎడమభుజంబును వక్షంబును అదరు

దృష్ట్వా లక్ష్మణ! దూరే త్వాం సీతావిరహితం పథి. ४
ఏవ ముక్తస్తు సౌమిత్రి ర్లక్ష్మణ శ్శుభలక్షణః,
భూయో దుఃఖసమావిష్టో దుఃఖితం రామ మబ్రవీత్. ५

న స్వయం కామకారేణ తాం త్యక్త్వాఽహ మిహాగతః,
ప్రచోదిత స్తయై వోగ్రై స్త్వత్సకాశ మిహాగతః. ౬

ఆర్యే ణేవ పరాక్రుష్టం హా సీతే! లక్ష్మణేతి చ,
పరిత్రాహీతి య ద్వాక్యం మైథిల్యా స్త చ్ఛ్రుతిం గతమ్. ౭

సా త మార్తస్వరం శ్రుత్వా తవ స్నేహేన మైథిలీ,
గచ్ఛగచ్ఛేతి మా మాహ రుదతీ భయవిహ్వలా. ౮

ప్రచోద్యమానేన మయా గచ్ఛేతి బహుశ స్తయా,
ప్రత్యుక్తా మైథిలీ వాక్య మిదం త్వత్ప్రత్యయాన్వితమ్. ౯

న త త్పశ్యా మ్యహం రక్షో య దస్య భయ మావహేత్,
నిర్వృతా భవ నా స్త్యేత త్కేనా ప్యేవ ముదాహృతమ్. ౧౦

విగర్హితం చ నీచం చ కథ మార్యోఽభిధాస్యతి,
త్రాహీతి వచనం సీతే! య స్త్రాయేత్ త్రిదశా నపి. ౧౧

కిం నిమిత్తం తు కేనాపి భ్రాతు రాలమ్బ్య మే స్వరమ్,
రాక్షసే నేరితం వాక్యం త్రాహి త్రాహీతి శోభనే!. ౧౨

చున్నవి. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౪

మంగళకరంబులగు లక్షణంబులుగలసుమిత్రాపుత్త్రుఁడగు లక్ష్మణుఁడు ఇట్లు రాముఁడు చెప్పిన మాటలను విని దుఃఖితుఁడై యిట్లని చెప్పెను. ౫

నేనై స్వేచ్ఛగా సీత నచ్చట విడిచియిచ్చటికి వచ్చినవాఁడనుగాను. ఆసీతయె అతితీక్ష్ణములగు మాటలచేఁ బొమ్ము పొమ్మని పలుమాఱు ప్రేరింపఁగా నేను నీయొద్దకిచ్చటికి వచ్చినానుగాని వేఱుగాదు. ౬

"అయ్యో! సీతా లక్ష్మణుఁడా" అనియు "రక్షింపుము" అనియు నీకంఠధ్వని ననుసరించి యేమాట యారాక్షసునిచే నఱవఁబడినదో ఆమాట సీతాదేవిచెవి సోఁకెను. ౭

సీత యీయేడ్పును విన్నంతనె నీయందలిస్నేహముచేత నీ కేమో యాపద వాటిల్లె ననుభయంబున గడగడవణంకుచు రోదనంబు సేయుచు నన్ను నీయొద్దకుఁ బొమ్ముపొమ్మని బలాత్కారముచేసెను. ౮

అట్లు సీత పలుమాఱు నన్నుఁ బొమ్మని చెప్పఁగా నేను నీశౌర్యపరాక్రమంబులయందు దృఢమయిన నమ్మకముగలవాఁడ నగుటచే నాబిడం జూచి యిట్లని చెప్పితిని. ౯

రామునకు భయంబు గలిగించునంతటి రాక్షసుఁడీ ప్రపంచంబుననే లేఁడు. ఇది రాముఁ డఱచినమాటగాదు. నీవు సుఖంబు నొందుము. ఎవ్వఁడో ఇట్లు కూసినాఁడు గాని వేఱుగాదు. ౧౦

దేవతలకైనను భయంబు గలిగినప్పుడు రక్షింపఁజాలినట్టి రాముఁడు మహాకులంబునఁ బుట్టిన శూరునకు నిందితంబును అందును ఆపత్కాలంబున స్త్రీనిం బిలుచుటచే నతినీచంబు నగు "సీతా! రక్షించుము" అను నీమాట నెట్లు చెప్పును? ౧౧

మంగళరూపిణివగు సీతా! ఎవ్వఁడో యొకరాక్షసుఁడు ఏదో యొక ప్రయోజనము నుద్దేశించి నాయన్నయగు రామునికంఠధ్వనికి సరిగా నుండునట్లు "రక్షించు రక్షించు" మని యఱచినాఁడేగాని వేఱుగాదు. ౧౨

విస్వరం వ్యాహృతం వాక్యం లక్ష్మణ! త్రాహి మా మితి,
న భవత్యా వ్యథా కార్యా కునారీజనసేవితా. ౧౩

అలం వైక్లబ్య మాలమ్బ్య స్వస్థా భవ నిరుత్సుకా,

న సోఽస్తి త్రిషు లోకేషు పుమా న్నైవ రాఘవం రణే. ౧౪
జాతో వా జాయమానో వా సంయుగే యః పరాజయేత్,
నజయ్యో రాఘవో యుద్ధే దేవై శ్శక్రపురోగమైః. ౧౫

ఏవ ముక్తా తు వైదేహీ పరిమోహితచేతనా,
ఉవా చాశ్రూణి ముఞ్చన్తీ దారుణం మా మిదం వచః. ౧౬
భావో మయి త వాత్యర్థం పాప ఏవ నివేశితః,
వినష్టే భ్రాతరి ప్రాప్తుం నచ త్వం మా మవాప్స్యసి. ౧౭

సంకేతా ద్భరతేన త్వం రామం సమనుగచ్ఛసి,
క్రోశన్తం హి యథాఽత్యర్థం నైన మభ్యవపద్యసే. ౧౮

రిపుః ప్రచ్ఛన్నచారీ త్వం మదర్థ మనుగచ్ఛసి,
రాఘవ స్యాన్తరప్రేప్సు స్తథైనం నాభిపద్యసే. ౧౯

ఏవ ముక్తో హి వైదేహ్యా సంరబ్ధో రక్తలోచనః,
క్రోధా త్ప్రస్ఫురమాణోష్ఠ ఆశ్రమా దభినిర్గతః. ౨౦

“లక్ష్మణుఁడా! నన్ను రక్షింపుము” అని చెప్పినమాటధ్వని వికృతముగా వినంబడినదికాఁబట్టి చక్కఁగా నాలోచించినచో నది రామధ్వనియనియు తోఁచదు; కావున కుత్సితస్త్రీలవలె నుత్తమస్త్రీవగు నీ విట్లు దుఃఖించుట యుక్తముగాదు. ౧౩

దుఃఖము వదిలి నెమ్మదిగా నుండుము. నన్ను బంపవలెనను తలంపును విడువుము.

యుద్ధంబున రాముని గెలువఁగలయట్టి పురుషుఁడు ముల్లోకంబులందెచ్చటను ఇదివఱకుఁ బుట్టియుండఁడు, ఇంకం బుట్టనుంబోఁడు. ౧౪

దేవేంద్రుని ముందిడుకొని దేవతలందఱెత్తివచ్చినను యుద్ధంబున రాముని జయింపఁజాలరు. అని సీతతోఁ జెప్పితిని. ౧౫

ఈప్రకారము నేను జెప్పినంత సీతయుక్తాయుక్తబుద్ధి లేక కన్నీళ్లు విడుచుచు నన్నుఁ జూచి భయంకరంబులగు మాటల నిట్లని చెప్పెను. ౧౬

అన్న యెట్లయినను నాశంబు నొందినంత నన్నుఁ బొందవలె నని నీవు నాయందు మిక్కిలియుఁ బాపిష్ఠంబగు నభిప్రాయము నే యుంచియున్నావు. అయితే నీవేమో నన్నుఁబొందఁజాలవు. ౧౭

ఇంత అఱచినను రామునియొద్దకుఁబోవుటకు నీ కిష్టము రాలేదే కావున నీవు భరతునితో సంకేతముచేసికొని రాముని వెంబడి కపటంబున నిట్లు వచ్చుచున్నావుకాని వేఱుగాదు. ౧౮

నీవు శత్రుఁడవు. కపటవేషంబుతో నున్నావు. రాముని కెప్పుడు వినాశంబు గలుగునో యని నాకొఱకై వెంబడివచ్చుచున్నావు. అందువలననే నీవు ఆపత్కాలంబున రామునియొద్దకుఁ బోయి సాహాయ్యము సేయనొల్లకున్నావు. అని సీత నాతోఁ జెప్పినది. ౧౯

ఇట్లు సీత చెప్పఁగానే నేను కోపంబు నొంది సంరబ్ధుఁడనై కన్నులెఱ్ఱఁదనంబుఁ గదురఁ బెదవు లదర నాశ్రమంబు వెడలి నీ కెదురుగా వచ్చితిని. అని లక్ష్మణుఁడు రామునితోఁ జెప్పెను. ౨౦

ఏవం బ్రువాణం సౌమిత్రిం రామ స్సన్తాపమోహితః,
అబ్రవీ ద్దుష్కృతం సౌమ్య! తాం వినా య త్త్వ మాగతః. ౨౧

జాన న్నపి సమర్థం మాం రక్షసాం వినివారణే,
అనేన క్రోధవాక్యేన మైథిల్యా నిస్సృతో భవాన్. ౨౨
నహి తే పరితుష్యామి త్యక్త్వా య ద్యాసి మైథిలీమ్,
క్రుద్ధాయాః పరుషం శ్రుత్వా స్త్రియా శ్చ త్వ మిహాఽగతః.

సర్వథా త్వపనీతం తే సీతయా యత్ప్రచోదితః,
క్రోధస్య వశ మాపన్నో నాకరో శ్శాసనం మమ. ౨౪
అసౌ హి రాక్షస శ్శేతే శరే ణాభిహతో మయా,
మృగరూపేణ యే నాహ మాశ్రమా దపవాహితః. ౨౫

వికృష్య చాపం పరిధాయ సాయకం
సలీలబాణేన చ తాడితో మయా,
మార్గీం తనుం త్యజ్య స విక్లబస్వరో
బభూవ కేయూరధర స్సరాక్షసః. ౨౬

శరాహతే నైవ తదా ర్తయా గిరా
స్వరం మ మాఽలమ్బ్య సుదూరసంశ్రవమ్,
ఉదాహృతం తద్వచనం సుదారుణం
త్వ మాగతో యేన విహాయ మైథిలీమ్. ౨౭

ఇతి శ్రీమదరణ్యకాణ్డే ఏకోనషష్టితమ స్సర్గః. ౫౯.

రాముఁడు పరమదుఃఖితుఁడై దేహంబు దెలియక యిట్లు చెప్పుచున్న లక్ష్మణుం జూచి యిట్లని చెప్పెను. సౌమ్యుఁడా! సీతను విడిచి నీవు వచ్చుట మిక్కిలి తప్పయిన పని. ౨౧

నీవు నేను రాక్షసులం జయింప సమర్థుఁడనని యెఱింగియు సీత చెప్పిన యాకోపవచనముచే నిట్లు సీత నొంటి విడిచి వచ్చినావుగదా!. ౨౨

నీవు సీతను విడిచి వచ్చినావుకావున నిన్నుఁ జూడ నాకు సంతోషము కలుగలేదు. స్త్రీ కోపంబు నొంది యేమో పరుషముగాఁ జెప్పితే నీవు అంతటితో నాబిడను విడిచి వచ్చినావు. ఇదియెంతమాత్రము యుక్తము కాదు. ౨౩

నీవు సీత చెప్పిన మాటలు విని క్రోధపరవశుఁడవై నాయాజ్ఞను మీఱినావు. అన్నివిధంబులఁ జూచినను ఇది నీది గొప్ప తప్పు. ౨౪

ఎవ్వఁడు మృగరూపంబు ధరించి మోసంబున నన్నాశ్రమంబున నుండి దూరంబు తొలఁగఁదీసికొని పోయెనో ఆరాక్షసుం డిదిగో నాబాణముచే హతుఁడై నేలంబడియున్నాఁడు. ౨౫

నేను వింట విలాసార్థముగానుండు బాణంబుఁ గూర్చి యాకర్షించి వేయఁగా నతం డాబాణంబుచే హతుఁడై యేడ్చుచు మృగదేహము విడిచి బాహుపురులతో నొప్పునట్టి రాక్షసరూపంబు నొందెను. ౨౬

అప్పుడు బాణహతుఁడైనంతనే యారాక్షసుఁడు ఆర్తస్వరంబున నాకంఠధ్వని ననుసరించి బహుదూరము చక్కఁగా వినునట్లు భయంకరము యిన యామాట నఱచినాఁడు. దాని విని నీవు సీతను విడిచి వచ్చినావు. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౨౭

ఇది యేఁబదితొమ్మిదవసర్గము.

## షష్టితమ స్సర్గః.

భృశ మావ్రజమానస్య త స్యాధో వామలోచనమ్,
ప్రాస్ఫుర చ్చాస్ఖల ద్రామో వేపథు శ్చాస్య జాయత. ౧

ఉపాలక్ష్య నిమిత్తాని సోఽశుభాని ముహుర్ముహుః,
అపి క్షేమం ను సీతాయా ఇతి వై వ్యాజహార చ. ౨
త్వరమాణో జగామాథ సీతాదర్శనలాలసః,
శూన్య మావసథం దృష్ట్వా బభూవోద్విగ్నమానసః. ౩
ఉద్భ్రమ న్నివ వేగేన విక్షిప న్రఘునన్దనః,
తత్ర త త్రోటజస్థాన మభివీక్ష్య సమన్తతః. ౪
దదర్శ పర్ణశాలాం చ రహితాం సీతయా తదా,
శ్రియా విరహితాం ధ్వస్తాం హేమన్తే పద్మినీ మివ. ౫
రుదన్త మివ వృక్షై శ్చ మ్లానపుష్పమృగద్విజమ్,
శ్రియా విహీనం విధ్వస్తం సన్త్యక్తవనదేవతమ్. ౬
విప్రకీర్ణాజినకుశం విప్రవిద్ధబృసీకటమ్,
దృష్ట్వా శూన్యం నిజస్థానం విలలాప పునఃపునః. ౭

హృతా మృతా వా నష్టా వా భక్షితా వా భవిష్యతి,
నిలీనా ప్యథ వా భీరు రథ వా వనమాశ్రితా. ౮

గతా విచేతుం పుష్పాణి ఫలాన్యపి చ వా పునః,
అథవా పద్మినీం యాతా జలార్థం వా నదీం గతా. ౯

యత్నా న్మృగయమాణ స్తు నాసనాద వనే ప్రియామ్,

## అఱువదియవసర్గము.

అట్లు రాముఁడు ఆశ్రమంబునకు వచ్చుచుండఁగా అతనియెడమకంటిక్రిందిభాగము మిక్కిలియు నదరినది; రాముఁడు నడచునప్పుడు తొట్రుపడెను. అతనిదేహమున వడఁకు పుట్టినది. ౧.

ఆరాముఁడు మాటిమాటికి దుర్నిమిత్తంబు లెచ్చుగాఁ బొడసూపుటం జూచి "సీతకు క్షేమంబు గలుగునా స్వామీ!" అని చెప్పెను. ౨

అంత రాముఁడు సీతం జూడవలెనను తొందరచే నతివేగంబున నాశ్రమంబునకుఁబోయి యందు సీత లేకుండుటం జూచి పరమదుఃఖితుం డయ్యె. ౩

రాముఁడు ఎగిరినట్లు అతివేగంబున దుఃఖపారవశ్యంబుచేఁ జేతులుఁ గాళ్ళు విదిలించుచు నచ్చటచ్చట సీతయుండుప్రదేశముల నన్నింటిని జూచి సీత లేకుండుటచేఁ గాంతిహీనమయి హేమంతర్తువునందుఁ జెడిపోయియుండు తామరకొలంకుంబోలియున్న పర్ణశాలం జూచెను. ౪,౫

రాముఁడు వికృతస్వరంబులగు తుమ్మెదలతోఁ గూడినవగుటచే రోదనంబు సేయుచున్నట్లున్న వృక్షంబులతోఁ గూడినదియు వాడినపూలును దీనములగు మృగపక్షులును గలదియుఁ గాంతిహీనంబును ధ్వంసంబునొందినదియు వనదేవతలచేఁ బరిత్యక్తంబును అచ్చటచ్చట వెదచల్లంబడియుండు కృష్ణాజినంబులును దర్భలును ఆసనంబులును చాఁపలును గలదియు శూన్యంబునగు తనయాశ్రమంబుఁ జూచి మాటిమాటికి విలపించెను. ౬,౭

భీరువగు సీత రాక్షసులచే నపహరింపఁబడినదో, మరణంబు నొందినదో, నష్టయయినదో, భక్షింపఁబడినదో, లేకయెందేని దాఁగియున్నదో లేక వనంబునకే పోయియున్నదో!. ౮

సీత పూలనుగాని ఫలంబులనుగాని కోయుటకే పోయినదో; లేక విహారార్థము తామరకొలనునకే పోయినదో; లేక జలంబుగొనివచ్చుటకై నదికే పోయెనో. అని రాముఁడు విలపించెను. ౯.

రాముఁ డట్లు మహాప్రయాసముతో వెంత వెదకినను వనంబునఁ బ్రియురాలిం గానఁడయ్యె

శోకర క్తేక్షణ శ్శోకా దున్మత్త ఇవ లక్ష్యతే. ౧౦
వృక్షా ద్వృక్షం ప్రధావం త్స గిరే శ్చాద్రిం నదా న్నదీమ్,

బభూవ విలప న్రామ శ్శోకార్ణవపరిప్లుతః. ౧౧

అపి కాచి త్త్వయా దృష్టా సా కదమ్బప్రియా ప్రియా,
కదమ్బ! యది జానీషే శంస సీతాం శుభాననామ్. ౧౨

స్నిగ్ధపల్లవసఙ్కాశా పీతకౌశేయవాసినీ,
శంసస్వ యది వా దృష్టా బిల్వ! బిల్వోపమ స్తనీ. ౧౩

అథ వాఽర్జున! శంస త్వం ప్రియాం తా మర్జునప్రియామ్,
జనకస్య సుతా భీరు ర్యది జీవతి వా నవా. ౧౪

కకుభః కకుభోరూం తాం వ్యక్తం జానాతి మైథిలీమ్,
యథా పల్లవపుష్పాఢ్యో భాతి హ్యేష వనస్పతిః. ౧౫

భ్రమరై రుపగీత శ్చ యథా ద్రుమవరో హ్యయమ్,
ఏష వ్యక్తం విజానాతి తిలక స్తిలకప్రియామ్. ౧౬
అశోక! శోకాపనుద! శోకోపహతచేతసమ్,
త్వన్నామానం కురు క్షిప్రం ప్రియాసన్దర్శనేన మామ్. ౧౭

రాముఁడు దుఃఖాతిశయంబునఁ గన్నులనెఱ్ఱఁదనంబు గదుర దుఃఖపరవశుండై పిచ్చిపట్టినట్లు ఒకవృక్షంబుననుండి మఱియొకవృక్షంబునొద్దకును ఒకపర్వతంబుననుండి మఱియొకపర్వతమునొద్దకును ఒకనదియొద్దనుండి మఱియొకనదియొద్దకును బరుగెత్తుచుండెను. ౧౦

అట్లు రాముఁడు దుఃఖసముద్రంబున మునింగి యీప్రకారంబున విలపించుచుండెను. ౧౧

కదంబవృక్షమా! కదంబపుష్పములయందుఁ బ్రీతిగల నాప్రియురాలయిన సీతయను నొకానొక స్త్రీని నీవు చూచినావా? ఆబిడ మొగము సుందరముగా నుండును. తెలిసియుండునేని ఆబిడ యెక్కడనున్నదో నాకుఁ దెలుపుము. ౧౨

బిల్వవృక్షమా! సుందరమయిన చిగురుటాకువంటి దేహముగలదియుఁ బసపుపట్టువస్త్రము కట్టుకొనియుండనదియు బిల్వఫలంబులవంటి స్తనములు గలదియు నగు సీతను జూచియుందువేని యాబిడ యెచట నున్నది? చెప్పుము. ౧౩

అటుగాదేని అర్జునవృక్షమా! నీయం దధికప్రీతిగల నాప్రియురాలి సంగతిని నీవైనం జెప్పుము. భీరువగు జనకమహారాజపుత్రి బ్రతికియున్నదా? లేదా? ౧౪

ఈకకుభవృక్షము పల్లవంబులతోను బుష్పంబులతోనుం బ్రకాశించుచున్నది. కాఁబట్టి యీకకుభవృక్షమునకుఁ దనవంటి తొడలుగల సీతసంగతి స్పష్టముగాఁ దెలిసియుండును. ౧౫

ఈతిలకవృక్షము భ్రమరగానముతో నొప్పుచున్నది కాఁబట్టి దీనికిఁ దనయం దధికప్రీతిగల సీతసంగతి చక్కఁగాఁ దెలిసియుండును. ౧౬

అశోకవృక్షమా! నీ వెప్పుడును దుఃఖముఁ బోఁగొట్టుదువు. దుఃఖితుఁడనగు నాకు నాప్రియురాలిం జూపి శీఘ్రమున నన్ను దుఃఖములేనివానిఁగాఁ జేయుము. ౧౭

యది తాల! త్వయా దృష్టా పక్వతాలఫల స్తనీ,
కథయస్వ వరారోహాం కారుణ్యం యది తే మయి. ౧౮

యది దృష్టా త్వయా సీతా జమ్బు! జమ్బూఫలోపమా,
ప్రియాం యది విజానీషే నిశ్శఙ్కం కథయస్వ మే. ౧౯

అహో! త్వం కర్ణికారాద్య సుపుష్పై శ్శోభసే భృశమ్,
కర్ణికారప్రియా సాధ్వీ శంస దృష్టా ప్రియా యది. ౨౦

చూతనీపమహాసాలా న్పనసా న్కురవా న్ధవాన్,
దాడిమా నసనా న్గత్వా దృష్ట్వా రామో మహాయశాః. ౨౧
మల్లికామాధవీ శ్చైవ చమ్పకాన్ కేతకీ స్తథా,
పృచ్ఛ న్రామో వనే భ్రాన్త ఉన్మత్తఇవ లక్ష్యతే. ౨౨

అథవా మృగశాబాక్షీం మృగ! జానాసి మైథిలీమ్,
మృగవిప్రేక్షణీ కాన్తా మృగీభి స్సహితా భవేత్. ౨౩

గజ! సా గజనాసోరూ ర్యది దృష్టా త్వయా భవేత్,
తాం మన్యే విదితాం తుభ్య మాఖ్యాహి వరవారణ!. ౨౪

శార్దూల! యది సా దృష్టా ప్రియా చన్ద్రనిభాననా,
మైథిలీ మమ విస్రబ్ధం కథయస్వ న తే భయమ్. ౨౫

కిం ధావసి ప్రియే! దూరం దృష్టాఽసి కమలేక్షణే!,

తాలవృక్షమా! పక్వములయిన తాలఫలములవంటి స్తనములుగల సీతను నీవు చూచియుందువేని నాయందు నీకు దయగలపక్షమునకు సుందరములయిన పిఱుందులుగల యాసీత యెచ్చట నున్నదో నాకుఁ జెప్పుము.

జంబూవృక్షమా! సీతం జూచియుందువేని జంబూఫలంబులుంబోలె స్నిగ్ధమయినమేనుగల నాప్రియురాలుండుస్థలము నీకుఁ దెలిసినపక్షమునకు నాకుఁ జక్కఁగాఁ జెప్పుము. ౧౯

కర్ణికారవృక్షమా! నీ విప్పుడు సుందరంబులగు పుష్పంబులతో నొప్పుచు నెంతయు నాశ్చర్యంబు గలిగించుచున్నావు. నీపుష్పంబులపై నధిక ప్రీతి గలదియుం బతివ్రతయు నగు నాప్రియురాలిం జూచి యుందువేని యెచ్చట నున్నదో నాకుఁ జెప్పుము. ౨౦

మహాకీర్తిశాలియగు రాముఁడు అట్లు వనంబునం దిరిగి తిరిగి చూతవృక్షంబులను గదంబవృక్షంబులను సాలవృక్షంబులను బనసవృక్షంబులను గురవకంబులను జంద్రచెట్లను దాడిమవృక్షంబులను అసనవృక్షంబులను మల్లె గురివెంద సంపెఁగ మొగిలి మొదలగువానినిం జూచి "సీత యెచ్చట నున్నది?" అని యడుగుచుఁ బిచ్చిపట్టినవానిపగిదిఁ జూపట్టుచుండెను. ౨౧

మృగమా! ఈవృక్షంబు లెఱుంగకున్నను జింకపిల్ల కన్నులవంటి కన్నులుగల సీతను నీవెఱింగియుందువు. జింకలవలెఁ జపలముగాఁ జూచుచున్నది కావున నాప్రియురాలు లేళ్లతోఁగూడి యుండును. ౨౩

గజమా! నీతొండమువంటి తొడలుగల సీతను నీవు చూచియుందువేని నాకుఁ జెప్పుము. ఉత్తమగజమా! ఆసీతసంగతి నీకుఁ దెలిసియుండునని తలంచెదను. ౨౪

వ్యాఘ్రిమా! చంద్రబింబమువంటి మొగముగల నాప్రియురాలయిన సీతం జూచితివేని నిశ్చయంబుగా నాకుఁ జెప్పుము. నిన్నేమి చేయను భయపడవలదు. ౨౫

ప్రియురాలా! ఏల పరుగెత్తెదవు? కమలంబులంబోలు కన్నులు

వృక్షై రాచ్ఛాద్య చాత్మానం కిం మాం న ప్రతిభాషసే. ౨౬

తిష్ఠ తిష్ఠ వరారోహే! న తేఽస్తి కరుణా మయి,
నాత్యర్థం హాస్యశీలాఽసి కిమర్థం మా ముపేక్షసే. ౨౭

పీతకౌశేయకే నాసి సూచితా వరవర్ణిని!,
ధావ న్త్యపి మయా దృష్టా తిష్ఠ యద్య స్తి సౌహృదమ్. ౨౮

నైవసా నూన మథవా హింసితా చారుహాసినీ,
కృచ్ఛ్రంప్రాప్తం న మాం నూనం యథోపేక్షితు మర్హతి. ౨౯

వ్యక్తం సా భక్షితా బాలా రాక్షసైః పిశితాశనైః,
విభజ్యాఙ్గాని సర్వాణి మయా విరహితా ప్రియా. ౩౦

నూనం త చ్ఛుభదన్తోష్ఠం సునాసం చారుకుణ్డలమ్,
పూర్ణచన్ద్ర మివ గ్రస్తం ముఖం నిష్ప్రభతాం గతమ్. ౩౧

సా హి చమ్పకవర్ణాభా గ్రీవా గ్రైవేయశోభితా,
కోమలా విలపన్త్యా స్తు కాన్తాయా భక్షితా శుభా. ౩౨

నూనం విక్షిప్యమాణౌ తౌ బాహూ పల్లవకోమలౌ,
భక్షితౌ వేపమానాగ్రౌ సహస్తాభరణాఙ్గదౌ. ౩౩

గలదానా! నిన్ను దూరంబునం జూచితిని. ఇంక నిలువుము. వృక్షంబులం డాఁగి నాతో మాటాడకున్నావేల? ౨౬

సుందరములయిన పిఱుందులుగలదానా! నిలునిలు పరుగెత్తకుము. నీకు నాయందుఁ గొంచెమేని దయలేదు. నీవు అంతనవ్వులాటదానవు కావు. ఇప్పు డేల నన్నిట్లుపేక్షించి యాడించెదవు? ౨౭

చలికాలంబున వేఁడిగాను వేసంగికాలంబున చల్లఁగాను సుఖంబుగా నుండుదేహము గలిగి భర్త్రయం దనురాగముగలదానా! నీవు పరుగెత్తుచున్నను నీపసపుపట్టుచీరచే నిన్నుఁ జూచినాను. నాయందు నీకు స్నేహము కలదేని పరుగెత్తక నిలువుము. ౨౮

సుందరమయిననగవుగల సీత లేనే లేదని తోఁచుచున్నది. రాక్షసులచేఁ జంపఁబడియుండును. ఇది నిశ్చయము. అటుగానియెడ ఇట్లు దుఃఖితుఁడనైన నన్నింతమాత్రము నుపేక్షించియుండదు. ౨౯

నేను లేనప్పుడు మాంసమునే దినునట్టి రాక్షసులు బాలయగు ప్రియురాలను అన్నియవయవంబులను వేఱువేఱఁ దీసి భక్షించియుందురు. ఇది స్పష్టము. ౩౦

మంగళకరంబులయిన దంతములును బెదవులును గలదియు సుందరమయిన ముక్కుగలదియు సుందరములయిన కుండలములతో నొప్పుచున్నదియు నిండుచందురునిం బోలినదియు నగు నాప్రియురాలిముఖంబు రాక్షసులచే మ్రింగఁబడినదై కాంతిహీనయయి యుండును. నిశ్చయము. ౩౧

సంపెంగపూవువంటి వన్నెగలదియుఁ గంఠాభరణముతో నొప్పుచున్నదియు సుకుమారంబును మంగళలక్షణలక్షితంబు నగు సీతయొక్క కంఠమును ఆబిడ విలపించుచుండఁగా రాక్షసులు భక్షించియుందురు. ౩౨

భక్షింతురను భయంబున నిట్టటువీవఁబడుచుండునవియు విదిలింపఁబడుకొనలుగలవియు నగు కడియములతోను బాహుపురులతోను ఒప్పుచున్న పల్లవసుకుమారంబులయిన యాప్రియురాలిచేతులంగూడ రాక్షసులు భక్షించియుందురు. ౩౩

మయా విరహితా బాలా రక్షసాం భక్షణాయ వై,
సార్థే నేవ పరిత్యక్తా భక్షితా బహుబాన్ధవా. 34

హా లక్ష్మణ! మహాబాహో! పశ్యసి త్వం ప్రియాం క్వచిత్,
హా ప్రియే! క్వ గతా భద్రే! హా సీతేతి పునః పునః. 35

ఇత్యేవం విలప న్రామః పరిధావ న్వనా ద్వనమ్,
క్వచి దుద్భ్రమతే వేగా త్క్వచి ద్విభ్రమతే బలాత్. 36

క్వచి న్మత్త ఇ వాభాతి కాన్తాన్వేషణతత్పరః,

స వనాని నదీ శ్శైలా న్గిరిప్రస్రవణాని చ. 37
కాననాని చ వేగేన భ్రమ త్యపరిసంస్థితః.

తథా స గత్వా విపులం మహద్వనం
పరీత్య సర్వం త్వథ మైథిలీం ప్రతి,
అనిష్ఠితాశ స్స చకార మార్గణే
పునః ప్రియాయాః పరమం పరిశ్రమమ్. 38

ఇతి శ్రీమదరణ్యకాణ్డే షష్టితమ స్సర్గః. ౬౦.

---

## ఏకషష్టితమ స్సర్గః.

దృష్ట్వాఽఽశ్రమపదం శూన్యం రామో దశరథాత్మజః,
రహితాం పర్ణశాలాం చ విధ్వస్తా న్యాసనాని చ. 1
అదృష్ట్వా తత్ర వై దేహీం సన్నిరీక్ష్య చ సర్వశః,

బాలయగు సీతను రాక్షసులు భక్షించుటకైయే నేను విడిచిపోయి నట్లయినది. తోడిబాటసారులచే విడువఁబడిన స్త్రీ మృగాదులచే భక్షింపఁబడునట్లు సీత యిప్పుడు రాక్షసులచే భక్షింపఁబడినది. 34

అయ్యో! మహాబాహుఁడనగు లక్ష్మణుఁడా! నీ వెందేని ప్రియురాలిం జూచినావా?. మంగళరూపిణివగు ప్రియురాలా! అయ్యో సీతా! నీ వెచ్చటికిఁబోయినావు? అని మాటిమాటికి రాముఁడు విలపించెను. 35

రాముఁ డీప్రకారంబున విలపించుచు వనంబునుండి వనంబునకుఁ దిరుగుచు ఒక్కచో దుఃఖాతిశయంబున జడపదార్థంబులనుంగూడ సీతాదేవి వృత్తాంతంబు నడుగుచు నొక్కచో సీతపోల్కిగలలతాదులం జూచి సీతం జూచినట్లె భ్రమించి పరితపించుచు నుండెను. 36

అట్లు మఱియొకచోఁ బ్రియురాలి వెదకుచుఁ గై పునొందినవాఁడువలె మార్గామార్గవివేకంబులేక దిరుగుచుండెను.

రాముఁ డట్లు మనస్సునిలుకడలేక చిన్నయడవులను పెద్దయడవులను నదులను బర్వతంబులను సెలయేళ్ళను అతివేగంబున ఒక్కచో నుండి మఱియొకచోటికిఁ దిరుగుచుండెను. 37

రాముఁ డట్లు అనంతంబగు నాగొప్పయరణ్యంబు నొంది యవ్వనం బంతయుఁ దిరిగి సీతం గానక మఱలఁ బ్రియురాలిని వెదకుటకై మఱియు నధికముగా శ్రమంబుఁ బుచ్చుకొనెను. 38

ఇది యఱువదియవ సర్గము.

---

## అఱువదియొకటవసర్గము.

దశరథమహారాజపుత్రుఁడగు రాముఁడు సీత లేకుండుటచేఁ బాడుపడియుండు నాశ్రమంబును శూన్యమయినపర్ణశాలను జెడిపోయియున్న యాసనంబులనుం జూచి యంతటను వెదకి, యచ్చట సీతం గానక సీతం బేర్కొని గట్టిగా నఱచి చేతులు కట్టుకొని యిట్లని చెప్పెను. 1,2

ఉవాచ రామః ప్రాక్రుశ్య ప్రగృహ్య రుచిరౌ భుజౌ. ౨
క్వ ను లక్ష్మణ! వైదేహీ కం వా దేశ మితో గతా,
కేనాహృతా వా సౌమిత్రే! భక్షితా కేన వా ప్రియా. ౩

వృక్షే ణాచ్ఛాద్య యది మాం సీతే! హసితు మిచ్ఛసి,
అలం తే హసితే నాద్య మాం భజస్వ సుదుఃఖితమ్. ౪

యైస్సహ క్రీడసే సీతే! విశ్వస్తై ర్మృగపోతకైః,
ఏతే హీనా స్త్వయా సౌమ్యే! ధ్యాయ న్త్యస్రావిలేక్షణాః. ౫

సీతయా రహితో౽హం వై నహి జీవామి లక్ష్మణ!,
మృతం శోకేన మహతా సీతాహరణజేన మామ్. ౬
పరలోకే మహారాజో నూనం ద్రక్ష్యతి మే పితా,

కథం ప్రతిజ్ఞాం సంశ్రుత్య మయా త్వ మభియోజితః. ౭
అపూరయిత్వా తం కాలం మత్సకాశ మిహాగతః,
కామవృత్త మనార్యం మాం మృషావాదిన మేవ చ. ౮
ధి క్త్వా మితి పరే లోకే వ్యక్తం వక్ష్యతి మే పితా,

వివశం శోకసన్తప్తం దీనం భగ్నమనోరథమ్. ౯
మా మిహోత్సృజ్య కరుణం కీర్తి ర్నర మి వానృజుమ్,
క్వ గచ్ఛసి వరారోహే! మాం నోత్సృజ సుమధ్యమే!. ౧౦

లక్ష్మణుఁడా! సీత యెచ్చట? ఇచ్చటనుండి యెక్కడికిఁ బోయినది? లక్ష్మణుఁడా! ఎవ్వఁ డపహరించినాఁడు? ప్రియురాలిని ఎవ్వఁడు భక్షించివేసినాఁడు? ౩

సీతా! నీవు చెట్టుమఱుఁగున డాఁగియుండి నన్ను నవ్వుపట్టింపఁ గోరుచున్నయెడల నిఁక చాలును. నేను బరమదుఃఖితుఁడ నైయున్నాను. నాయొద్దకు రమ్ము. ౪

సౌమ్యవగు సీతా! బహుకాలముగా లాలనము సేయుటచేత నీపట్ల భయమువదలియుండ నీజింకపిల్లలతోఁ గ్రీడింపుచుందువుగదా! ఆయీజింకపిల్ల లిప్పుడు నీవు లేకుండుటచేఁ గన్నుల నీళ్లుగాఱఁ జింతాక్రాంతములయి యున్నవి. ౫

లక్ష్మణుఁడా! నేను సీతను విడిచి బ్రతుకఁజాలనుగదా!

ఇట్లు సీతాపహరణంబునం గలిగినమహాదుఃఖమువలన నేను మృతిఁ బొందఁగా నన్ను స్వర్గంబున నాతండ్రి దశరథమహారాజు చూడఁగలఁడు. నిశ్చయము. ౬

పరలోకంబున నాతండ్రి నన్నుఁ జూచి "నీవు నాచే నాజ్ఞాపితుఁడవై యాజ్ఞాప్రకారము పదునాలుగు సంవత్సరములు వనవాసంబు గావించెదనని ప్రతిజ్ఞచేసి ఆపదునాలుగేండ్లు నిండకమున్నె యిచ్చటికి నాయొద్ద కెట్లు వచ్చినావు? నీవు యథేచ్ఛముగా నాచరించువాఁడవు దుష్టుండవు అబద్ధము చెప్పువాఁడవు. నీవు దహింపఁబడుదువుగాక. అని నిందించును. సందేహము లేదు. ౭,౮

సుందరములయిన పిఱుఁదులుగలదానా! సుందరమయిన సన్నినడుముగలదానా! పరవశుఁడను బరమదుఃఖితుండను దీనుండను భగ్నమయిన మనోరథముగలవాఁడనగు నన్ను ఇచ్చట కపటియగు పురుషుని గీర్తి విడుచునట్లు విడిచిపెట్టి నీ వెచ్చటికిఁ బోయెదవు? నన్ను విడిచి నీ వెచ్చటికిఁ బోయెదవు? ౯,౧౦

త్వయా విరహిత శ్చాహం మోక్ష్యే జీవిత మాత్మనః,

ఇ తీవ విలప న్రామ స్సీతాదర్శనలాలసః. ౧౧
న దదర్శ సుదుఃఖార్తో రాఘవో జనకాత్మజామ్,
అనాసాదయమానం తం సీతాం దశరథాత్మజమ్. ౧౨
పఙ్కమాసాద్య విపులం సీద న్త మివ కుఞ్జరమ్,
లక్ష్మణో రామ మత్యర్థ ముువాచ హితకామ్యయా. ౧౩
మా విషాదం మహాబాహో! కురు యత్నం మయా సహ,
ఇదం చ హి వనం శూర! బహుకన్దరశోభితమ్. ౧౪

ప్రియకాననసంచారా వనోన్మత్తా చ మైథిలీ,
సా వనం వా ప్రవిష్టా స్యా న్నళినీం వా సుపుష్పితామ్. ౧౫

సరితం వాఽపి సంప్రాప్తా మీనవఞ్జుళసేవితామ్,
స్నాతుకామా నిలీనా స్యా ద్ధాసకామా వనే క్వచిత్. ౧౬

విత్రాసయితుకామా వా లీనా స్యా త్కానవే క్వచిత్,
జిజ్ఞాసమానా వై దేహి త్వాం మాం చ పురుషర్షభ!. ౧౭

తస్యా హ్యన్వేషణే శ్రీమన్! క్షిప్ర మేవ యతావహే,

వనం సర్వం విచినువో యత్ర సా జనకాత్మజా. ౧౮
మన్యసే యది కాకుత్స్థ! మాస్మ శోకే మనః కృథాః,

నేను నిన్ను విడిచి నిమిషంబేని జీవించియుండఁజాలను ప్రాణంబులు విడిచెదను. అని రాముఁడు విలపించెను.

రాముఁడు సీతాదేవిం గానఁగోరి పరమదుఃఖితుఁడై యిట్లెంత విలపించినను సీతాదేవి గానరాదయ్యె. ౧౧

లక్ష్మణుఁడు అట్లు పెద్దబురదలోఁబడి నశించుగజంబువలె సీతం గానక దుఃఖసముద్రంబున మునుంగుచున్న దశరథమహారాజపుత్రుఁడగు రామునిం జూచి మిక్కిలియు సతనిహితంబు గోరి యిట్లని చెప్పెను ౧౨,౧౩

మహాబాహుఁడవు శూరుఁడవు నగురాముఁడా! దుఃఖింపకుము. నాతోఁగూడ సీతాదేవిని వెదకుటయందుఁ బ్రయత్నము గావింపుము. ఈయడవి గుహలవంటి లతాగృహములు పెక్కులు గలది. కావున సీతాదేవి యెందేని యుండవచ్చును. ౧౪

సీత అడవిం దిరుగుటయందు మిక్కిలియుఁ బ్రియముగలది. కావున వనంబులోనికిఁగాని చక్కఁగాఁ బుష్పించియుండు తామరకొలంకునకుఁగాని బోయియుండును. ౧౫

సీత స్నానముచేయవలెనని మీనంబులతోను బ్బలితీఁగెలతోను నొప్పుచున్ననదికిఁ బోయియో నవ్వులాటకుఁగా వనంబున నొక్కచో డాఁగియో యుండును. ౧౬

పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! సీత మనల భయపఱుపఁగోరియో లేక మనసామర్థ్యము నెఱుంగఁగోరియో యరణ్యంబున నొక్కచో నెందేని డాఁగియుండును. ౧౭

కాంతిమంతుఁడవగు రాముఁడా! సీతను వెదకుటకు శీఘ్రముగాఁ బ్రయత్నింతము.

రాముఁడా! నీకిష్టముండునేని సీత యుండు స్థలంబు దెలియుటకై యీవనంబునంతయు వెదకుదము. మనంబున దుఃఖం బుంచుకొనకుము. అని లక్ష్మణుఁడు రామునితోఁ జెప్పెను. ౧౮

ఏవ ముక్తస్తు సౌహార్దా ల్లక్ష్మణేన సమాహితః. ౧౯
సహ సౌమిత్రిణా రామో విచేతు ముపచక్రమే,
తౌ వనాని గిరీం శ్చైవ సరిత శ్చ సరాంసి చ. ౨౦
నిఖిలేన విచిన్వానౌ సీతాం దశరథాత్మజౌ,
తస్య శైలస్య సానూని గుహా శ్చ శిఖరాణి చ. ౨౧
నిఖిలేన విచిన్వానౌ నైవ తా మభిజగ్మతుః,
విచిత్య సర్వత శ్శైలం రామో లక్ష్మణ మబ్రవీత్. ౨౨

నేహ పశ్యామి సౌమిత్రే! వైదేహీం పర్వతే శుభామ్,

తతో దుఃఖాభిసన్తప్తో లక్ష్మణో వాక్య మబ్రవీత్. ౨౩
విచర న్దణ్డకారణ్యం భ్రాతరం దీప్తతేజసమ్,
ప్రాప్స్యసి త్వం మహాప్రాజ్ఞ! మైథిలీం జనకాత్మజామ్. ౨౪
యథా విష్ణు ర్మహాబాహు ర్బలిం బద్ధ్వా మహీ మిమామ్,

ఏవ ముక్తస్తు సౌహార్దా ల్లక్ష్మణేన స రాఘవః. ౨౫
ఉవాచ దీనయా వాచా దుఃఖాభిహతచేతనః,
వనం సర్వం సువిచితం పద్మిన్యః ఫుల్లపఙ్కజాః. ౨౬
గిరి శ్చాయం మహాప్రాజ్ఞ! బహుకన్దరనిర్ఝరః,

నహి పశ్యామి వైదేహీం ప్రాణేభ్యోఽపి గరీయసీమ్. ౨౭

ఏవం స విలప న్రామ స్సీతాహరణకర్శితః,
దీనః శోకసమావిష్టో ముహూర్తం విహ్వలోఽభవత్. ౨౮

రాముఁడు స్నేహంబున లక్ష్మణుఁడు చెప్పినమాటలను విని సమాధానమునొంది లక్ష్మణునితోఁ గూడ సీతను వెదక నారంభించెను. ౧౯

దశరథమహారాజపుత్త్రులగు నారామలక్ష్మణులు అడవులను బర్వతంబులను నదులను గొలంకులను అంతటను సీతాదేవిని వెదకిరి. ౨౦

ఆరామలక్ష్మణులు ఆ ప్రస్రవణపర్వతమునందలి సానువులను గుహలను శిఖరంబులను అంతటను ఎంతవెదకినను సీత యగపడనేలేదు. ౨౧

అట్లా ప్రస్రవణపర్వతమంతయు వెదకి రాముఁడు లక్ష్మణుఁ జూచి యిట్లనియె. ౨౨

లక్ష్మణుఁడా! ఈ ప్రస్రవణపర్వతంబునందును మంగళరూపిణియగు సీత యగపడలేదు. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను.

అంత దండకారణ్యంబున సీతను వెదకుచున్న లక్ష్మణుఁడు పరమ దుఃఖితుఁడై మహాతేజుఁడగు రాముం జూచి యిట్లని చెప్పెను. ౨౩

మహాపండితుఁడవగు రాముఁడా! మహాబాహుఁడగు విష్ణువు బలిచక్రవర్తిని బంధించి యీభూమిం బొందినట్లు నీవు నిస్సందేహముగా సీత నపహరించినవాని శిక్షించి జనకమహారాజపుత్త్రియగు సీతం బొందఁగలవు. అని లక్ష్మణుఁడు రామునితోఁ జెప్పెను. ౨౪

రాముఁడు లక్ష్మణుఁడు స్నేహంబునఁ జెప్పినమాటను విని పరమదుఃఖితుఁడై లక్ష్మణుం జూచి దీనవాక్యంబున నిట్లనియె. ౨౫

మహాపండితుఁడవగు లక్ష్మణుఁడా! ఈయడవియంతయు వికసితకమలంబులగు తామరకొలంకులను పెక్కుగుహలను సెలయేళ్లను గల యీ ప్రస్రవణపర్వతంబును జక్కఁగా వెదకినాము. ౨౬

ఇంకను నాకుఁ బ్రాణంబులకన్న నధికమయిన సీత యగపడకున్నది గదా! అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౨౭

రాముఁడు సీతాపహరణంబుచే నలఁగినవాఁడై దీనుఁడై దుఃఖితుఁడై యీప్రకారంబున విలపించుచు దుఃఖామూర్ఛ యతిశయంబునఁబొందెను.

సంతప్తో హ్యవసన్నాఙ్గో గతబుద్ధి ర్విచేతనః,
నిషసా దాతురో దీనో నిశ్శ్వస్యాశీత మాయతమ్. ౨౯

బహుళం స తు నిశ్శ్వస్య రామో రాజీవలోచనః,
హా ప్రియేతి విచుక్రోశ బహుశో బాష్పగద్గదః. ౩౦

తం తత స్సా న్త్వయామాస లక్ష్మణః ప్రియబాన్ధవః,
బహుప్రకారం ధర్మజ్ఞః ప్రశ్రితం ప్రశ్రితాఞ్జలిః. ౩౧

అనాదృత్య తు తద్వాక్యం లక్ష్మణోష్ఠపుటాచ్చ్యుతమ్,
అపశ్యం స్తాం ప్రియాం సీతాం ప్రాక్రోశత్స పునఃపునః. ౩౨

ఇతి శ్రీమదరణ్యకాణ్డే ఏకషష్టితమ స్సర్గః. ౬౧.

---

## ద్విషష్టితమ స్సర్గః.

సీతా మపశ్య న్ధర్మాత్మా కామోపహతచేతనః,
విలలాప మహాబాహూ రామః కమలలోచనః. ౧

పశ్య న్నివ చ తాం సీతా మపశ్య న్మదనార్దితః,
ఉవాచ రాఘవో వాక్యం విలాపాశ్రయదుర్వచమ్. ౨

త్వ మశోకస్య శాఖాభిః పుష్పప్రియతయా ప్రియే!,
ఆవృణోషి శరీరం తే మమ శోకవివర్ధనీ. ౩

కదలీకాణ్డసదృశౌ కదళ్యా సంవృతా వుభౌ,
ఊరూ పశ్యామి తే దేవి! నాసి శక్తా నిగూహితుమ్. ౪

రాముఁడు సంతాపమునొంది దేహము కృశించి నిస్సత్త్వుండై నిశ్చేష్టుఁడై యాతురుఁడై దుఃఖితుఁడై వేఁడినిట్టూర్పులువుచ్చుచు ఏమియుఁ జేయంజాలక కూర్చుండెను. ౨౯

కమలంబులంబోలు కన్నులుగలరాముఁడు అట్లధికంబుగా నిట్టూర్పులు నిగుడించుచు కంఠంబున మిక్కిలియు డగ్గుత్తిక గదుర "అయ్యో ప్రియురాలా" యని గట్టిగా నేడ్చెను. ౩౦

అంత బంధుప్రియుఁడును ధర్మంబు తెలిసినవాఁడు నగు లక్ష్మణుఁడు చేమోడ్పుగీలించి నానావిధంబుల సవినయంబుగా నారాముని మంచిమాటల నాశ్వాసించెను. ౩౧

ఆరాముఁడు లక్ష్మణుఁడు చెప్పెడు నాశ్వాసనవచనముల నెంతమాత్రము సరకుసేయక ప్రియురాలగు సీతం జూడకున్నందున మాటిమాటికి రోదనము సేయుచునే యుండెను. ౩౨

ఇది యఱువదియొకటవసర్గము.

---

## అఱువదిరెండవసర్గము.

ధర్మాత్ముఁడును ఆజానుబాహుఁడును కమలంబులంబోలు కన్నులుగలవాఁడునగు రాముఁడు సీతాదేవి యగపడనందునఁ బ్రియావిరహముచేఁ బరవశుఁడై యిట్లని విలపించెను. ౧

రాముఁడు సీత యెదుట లేకుండుటచే నాబిడం జూడకున్నను మన్మథపరవశుఁడై సీతాదేవిఁ గట్టెదుటం జూచుచున్నవాఁడువలె రోదనంబుచే డగ్గుత్తికవలన శబ్దము లుచ్చరింప నశక్యముగా నీమాటఁ జెప్పెను. ౨

ప్రియురాలా! నీవు పుష్పములయందుఁ బ్రీతిగలదాన వగుటచేత నాదుఃఖము వృద్ధిఁ బొందునట్లు నీదేహమును అశోకశాఖలచేఁ గప్పికొనుచున్నావు. ౩

అరఁటి స్తంభములతో సమానములును అరఁటిచెట్టు మఱుఁగున నున్నవియు నగు నీతొడలరెంటినిఁ జూచితిని. నీకుఁ జక్కఁగా మఱుఁగుచేసి

కర్ణికారవనం భద్రే! హాసన్తీ దేవి! సేవసే,
అలం తే పరిహాసేన మమ బాధావహేన వై. ౫

పరిహాసేన కిం సీతే! పరిశ్రాన్తస్య మే ప్రియే!,
అయం స పరిహాసోఽపి సాధు దేవి! న రోచతే. ౬

విశేషే ణాశ్రమస్థానే హాసోఽయం న ప్రశస్యతే,
అవగచ్ఛామి తే శీలం పరిహాసప్రియం ప్రియే!.
ఆగచ్ఛ త్వం విశాలాక్షి! శూన్యోఽయ ముటజ స్తవ, ౭

సువ్యక్తం రాక్షసై స్సీతా భక్షితా వా హృతాఽపి వా. ౮
న హి సా విలపన్తం మా ముపసంప్రైతి లక్ష్మణ!,

ఏతాని మృగయూథాని సాశ్రునేత్రాణి లక్ష్మణ!. ౯
శంసన్తీవ హి వై దేహీం భక్షితాం రజనీచరైః,
హా మ మార్యే! క్వ యాతాఽసి హా సాధ్వి! వరవర్ణిని!. ౧౦
హా సకామా త్వయా దేవీ కైకేయీ సా భవిష్యతి,

సీతయా సహ నిర్యాతో వినా సీతా ముపాగతః, ౧౧
కథం నామ ప్రవేక్ష్యామి శూన్య మన్తఃపురం పునః,
నిర్వీర్య ఇతి లోకో మాం నిర్దయ శ్చేతి వక్ష్యతి. ౧౨
కాతరత్వం ప్రకాశం హి సీతాపనయనేన మే,

కొనఁ దెలియదు. ౪

మంగళరూపిణివగు ప్రియురాలా! నీవు నవ్వుచుఁ గొండగోఁగుచెట్ల లోఁ దిరుగుచున్నావు. నీనవ్వులాట చాలును; దానివలన నాకుఁ జాలబాధ గలుగుచున్నది. ౫

ప్రియురాలవగుసీతా! నన్నుగతాళిసేయుటచే నీకేమి ప్రయోజనము? మున్ను నా కీపరిహాసము సంతోషకరముగనే యున్నను ఇప్పుడు చాల డస్సి యున్నాను గావున మిక్కిలియు బాధకరముగ నున్నది. ౬

ప్రియురాలా! విశేషించి పరిహాసము ఆశ్రమములయందు మంచిది కాదు; నీవు పరిహాసప్రియవని నీస్వభావము నాకుఁ జక్కఁగాఁ దెలియును.

విశాలంబులగు కన్నులుగలసీతా! నీవు ఇంక రమ్ము! నీవు లేకుండుటచే నీపర్ణశాల పాడుపడియున్నది. ౭

లక్ష్మణుఁడా! రాక్షసులు సీతను భక్షించివేసియయున నుందురు; లేక యపహరించుకొనిపోయియయిన నుందురు; స్పష్టము. ఎందువలన ననఁగా నేను ఎంత విలపించినను సీత నాయొద్దకు రాకయేయున్నదే. ౮

లక్ష్మణుఁడా! ఈమృగసమూహములు కన్నీళ్లుగార్చుచు సీత రాక్షసులచే భక్షింపఁబడినదని చెప్పునట్లు చూపట్టుచున్నవి. ౯

అయ్యో! నాప్రియురాలా! పూజ్యురాలా! పతివ్రతాశిరోమణీ! ఉష్ణకాలమున సుఖశీతంబును శీతకాలమున సుఖోష్ణమునగు సంగము గలిగి భర్తయందు బద్ధానురాగముగల యుత్తమనారీమణీ! ఎచ్చటికిఁ బోతివి? అయ్యో! నీవు ఇట్లు నశించుటచే రాణియగు నాకైకేయికోర్కి యీడేఱఁ గలదు. ౧౦

నేను సీతతోఁగూడ వెడలివచ్చి సీతలేకయే యూరికిఁబోయి శూన్యంబైయుండు నంతఃపురమును మఱల నెట్లు ప్రవేశింపఁగలను? ౧౧

జనులు ఇంక నన్ను వీర్యహీనుండనియు దయలేనివాఁడనియుం జెప్పుదురు. సీతను రాక్షసు లపహరించుకొనిపోవుటచేత నాపిఱికితనము స్పష్టముగా నందఱికి వెల్లడియయినది గదా! ౧౨

నివృత్తవనవాస శ్చ జనకం మిథిలాధిపమ్. ౧౩
కుశలం పరిపృచ్ఛ స్తం కథం శక్ష్యే నిరీక్షితుమ్,
విదేహరాజో నూనం మాం దృష్ట్వా విరహితం తయా. ౧౪
సుతాస్నేహేన సంతప్తో మోహస్య వశ మేష్యతి,
అథవా న గమిష్యామి పురీం భరతపాలితామ్. ౧౫
స్వర్గోఽపి సీతయా హీన శ్శూన్య ఏవ మతో మమ,

మా మిహోత్సృజ్య హి వనే గచ్ఛాయోధ్యాం పురీంశుభామ్.
న త్వహం తాం వినా సీతాం జీవేయం హి కథంచన,

గాఢ మాశ్లిష్య భరతో వాచ్యో మద్వచనా త్త్వయా. ౧౭
అనుజ్ఞాతోఽసి రామేణ పాలయేతి వసుంధరామ్,

అమ్బా చ మమ కైకేయీ సుమిత్రా చ త్వయా విభో!. ౧౮
కౌసల్యా చ యథాన్యాయ మభివాద్యా మమాఽజ్ఞయా,
రక్షణీయా ప్రయత్నేన భవతా సూక్తకారిణా. ౧౯

సీతాయా శ్చ వినాశోఽయం మమ చామిత్రకర్శన!,
విస్తరేణ జనన్యా మే వినివేద్య స్త్వయా భవేత్. ౨౦

ఇతి విలపతి రాఘవే సుదీనే
వన ముపగమ్య తయా వినా సుకేశ్యా,
భయవికలముఖ స్తు లక్ష్మణోఽపి
వ్యథితమనా భృశ మాతురో బభూవ. ౨౧

ఇతి శ్రీమదరణ్యకాణ్డే ద్విషష్టితమ స్సర్గః. ౬౨.

—

నేను వనవాసము సమాప్తినొందించి యూరఁ జేరఁగానే క్షేమం బడుగుటకై వచ్చునట్టి మిథిలారాజుఁడగు జనకమహారాజు మొగం బెట్లు చూతును?

జనకమహారాజు సీతలేక నేను మాత్రము వచ్చియుండుటను జూచి కొమార్తెయందలి ప్రేమచేఁ బరితపించుచు మూర్ఛనొందును. నిశ్చయము.

లేక భరతునిచేఁ బాలింపఁబడుచు సమృద్ధంబై యుండునట్టి యా యయోధ్యాపట్టణమునకు నేను బోవుటయే లేదు. స్వర్గమయినను సీతలేని యెడ నాకుఁ బాడుపడియున్నట్లె తోఁచును. ౧౫

లక్ష్మణుఁడా! నీవు నన్నిచ్చట వనంబుననే విడిచిపెట్టి యయోధ్యా పట్టణంబునకుఁ బొమ్ము. నేను సీతను విడిచి యెట్లయినను ఎంతమాత్రము జీవింపఁజాలను. ౧౬

నీవు భరతుని గాఢంబుగాఁ గవుఁగిలించుకొని "రాముఁడు నీ కనుమతి యొసంగెను; యథేష్టంబు భూమిం బాలింపుచుండుము" అని నేను జెప్పినట్లు అతనికిఁ జెప్పవలయును. ౧౭

లక్ష్మణుఁడా! నీవు నాయాజ్ఞచే నాతల్లులు కైకేయికిని సుమిత్రకును గౌసల్యకును యథాన్యాయముగా నమస్కారములు చేయవలయును. ౧౮

నీవు చెప్పినట్లు చేయువాఁడవు కావున నాతల్లి కౌసల్యను బ్రయత్నంబున రక్షింపుచుండవలయును ౧౯

శత్రుపులం జయించునట్టి లక్ష్మణుఁడా! ఇట్లు సీతయు నేనును నాశంబునొందుటలు నీవు సవిస్తరముగ నాతల్లియగు కౌసల్యకుఁ జెప్పవలయును. అని రాముఁడు విలపించెను. ౨౦

అట్లు సీతాదేవి యగపడక పోవుటకై వనంబున రాముఁడు పరమదుఃఖితుఁడై విలపింపఁగా లక్ష్మణుండును భయంబున మొగంబు వివర్ణతనొంద దుఃఖంబుచే మిక్కిలియుఁ బీడితుఁడయ్యెను. ౨౧

ఇది యరువదిరెండవసర్గము.

## త్రి ష ష్టి త మ స్స ర్గః.

స రాజపుత్త్రః ప్రియయా విహీనః
కామేన శోకేన చ పీడ్యమానః,
విషాదయ న్భ్రాతర మార్తరూపో
భూయో విషాదం ప్రవివేశ తీవ్రమ్. ౧

స లక్ష్మణం శోకవశాభిపన్నం
శోకే నిమగ్నో విపులే తు రామః,
ఉవాచ వాక్యం వ్యసనానురూప
ముష్ణం వినిశ్శ్వస్య రుదం త్సశోకమ్. ౨

న మద్విధో దుష్కృతకర్మకారీ
మన్యే ద్వితీయోఽస్తి వసున్ధరాయామ్,
శోకేన శోకో హి పరంపరాయా
మా మేతి భిన్ద న్హృదయం మనశ్చ. ౩

పూర్వం మయా నూన మభీప్సితాని
పాపాని కర్మా ణ్యసకృ త్కృతాని,
తత్రాయ మద్యాపతితో విపాకో
దుఃఖేన దుఃఖం య దహం విశామి. ౪

రాజ్యప్రణాశ స్స్వజనై ర్వియోగః
పితు ర్వినాశో జననీవియోగః,
సర్వాణి మే లక్ష్మణ! శోకవేగ
మాపూరయన్తి ప్రవిచిన్తితాని. ౫

సర్వం తు దుఃఖం మమ లక్ష్మణేదం
శాన్తం శరీరే వన మేత్య శూన్యమ్,
సీతావియోగా త్పున రప్యుదీర్ణం
కాష్ఠై రి వాగ్ని స్సహసా ప్రదీప్తః. ౬

## అఱువదిమూఁడవసర్గము.

రాచకొమరుఁడగు నారాముఁడు ప్రియురాలి సీత నెడఁబాసి దుఃఖమోహంబు లతిశయిల్లఁ బరమపీడితుఁడై తమ్ముఁడును దన్నుఁ జూచి మిక్కిలియు దుఃఖింప మఱలఁ దీవ్రంబగు దుఃఖంబు నొందెను. ౧

ఆరాముఁడు అపారంబగు దుఃఖసముద్రంబున మునింగి యట్లు పరమదుఃఖపీడితుఁడగు లక్ష్మణుం జూచి వ్యసనంబునకుఁ దగినట్లు వేఁడినిట్టూర్పులు నిగుడించుచు రోదనంబు సేయుచు దుఃఖయుక్తంబగు నీమాటం జెప్పెను. ౨

నావలెఁ బాపంబులు చేసినవాఁడు నాకన్న వేఱె రెండవవాఁడు భూలోకములో లేఁడని తలంచెదను. దుఃఖముపై దుఃఖము పరంపరగా ఒకొకటియు గుండెకాయను మనస్సును భేదించునవి నాకు సంభవించుచున్నవి. ౩

నేను బూర్వజన్మంబునఁ గావలెనని పెక్కుపాపంబులఁ బలుమాఱు చేసియున్నాను. నిశ్చయము. నాకిప్పుడు దుఃఖముపై దుఃఖము వచ్చుటంతయు వానిఫలము. ఇప్పు డనుభవమునకు వచ్చినది. ౪

లక్ష్మణుఁడా! రాజ్యభ్రంశము బంధువుల నెడఁబాయుట తండ్రిమృతిఁ బొందుట తల్లిని విడిచివచ్చుట ఇవన్నియు ఒకొకటియుఁ దలంచుకొని విపరీతముగా దుఃఖము గలిగించుచున్నవి. ౫

లక్ష్మణుఁడా! నే నీజనశూన్యంబగు వనంబుఁ జేరినపిదప ఈదుఃఖంబు నంతయు గడుపులో నణఁచుకొని యుంటిని. కట్టెలచేనిప్పు ప్రజ్వరిల్లునట్లు ఇప్పుడు సీతావిరహమువలన నాదుఃఖమంతయు మఱల బయలుపడినది. ౬

సా నూన మార్యా మమ రాక్షసేన
బలాద్ధృతా ఖం సముపేత్య భీరుః,
అపస్వరం సస్వరవిప్రలాపా
భయేన విక్రన్దితవ త్యభీక్ష్ణమ్. ౭
తౌ లోహితస్య ప్రియదర్శనస్య
సదోచితా వుత్తమచన్దనస్య,
వృత్తౌ స్తనౌ శోణితపఙ్కదిగ్ధౌ
నూనం ప్రియాయా మమ నాభిభాతః. ౮
తచ్ శ్లక్ష్ణసువ్యక్తమృదుప్రలాపం
తస్యా ముఖం కుఞ్చితకేశభారమ్,
రక్షోవశం నూన ముపాగతాయా
న భ్రాజతే రాహుముఖే యథేన్దుః. ౯
తాం హారపాశస్య సదోచితాయా
గ్రీవాం ప్రియాయా మమ సువ్రతాయాః,
రక్షాంసి నూనం పరిపీతవన్తి
విభిద్య శూన్యే రుధిరాశనాని. ౧౦
మయా విహీనా విజనే వనే యా
రక్షోభి రాహృత్య వికృష్యమాణా,
నూనం వినాదం కురరీవ దీనా
సా ముక్తవ త్యాయతకాన్తనేత్రా. ౧౧
అస్మి న్మయా సార్ధ ముదారశీలా
శిలాతలే పూర్వ ముపోపవిష్టా,
కాన్తస్మితా లక్ష్మణ! జాతహాసా
త్వా మాహ సీతా బహువాక్యజాతమ్. ౧౨

భయస్వభావయగు నాప్రియురాలు రాక్షసుఁడు బలాత్కారంబున నపహరించుకొని యాకాశంబునకుఁ గొని పోవ భయంబున మహాధ్వని గదుర తనమధురస్వరంబు విడిచి వికృతస్వరంబున నధికముగా రోదనంబుచేసి యుండును. నిశ్చయము. ౭

చూపరులకు సంతోషంబు గలిగించునట్టియు త్తమమయినర క్తచందనంబులకుఁ దగినవియు వర్తులంబులునగు నాప్రియురాలి స్తనంబులు ఇప్పుడు రాక్షసునిచే భక్షణార్థము ఛేదింపఁబడి నెత్తురుతోఁ గప్పఁబడి ప్రకాశింపకుండును నిశ్చయము. ౮

మధురంబులును స్వచ్ఛంబులును బరుషంబులు గానివియునగు మాటలు గలదియు వక్రంబులయిన వెండ్రుకలతో నొప్పుచుండునదియు నగు నాసీత మోము ఇప్పుడు రాక్షసునిచేఁ జిక్కినదగుటచే రాహువుచేఁ గబళింపఁ బడినచంద్రునిపగిది నెంతమాత్రము ప్రకాశింపకుండును. నిశ్చయము. ౯

పాతివ్రత్యవ్రతముగల నాప్రియురాలికంఠము ఎప్పుడును హారముచే నలంకృతంబై యుండందగినది. అట్టికంఠమును రాక్షసులు నిర్జనారణ్యంబున విఱిచి నెత్తురు ద్రావియుందురు. నిశ్చయము. ౧౦

ప్రియురాలు నిర్జనంబగు నరణ్యంబున నన్నెడఁబాసి రాక్షసులు తన్నపహరించి యాకర్షించుచుఁ గొనిపోవ దుఃఖితయయి లేడివలె సుందరంబులయిన విశాలనేత్రంబుల దిక్కులం బఱపుచుఁ బేరెలుంగున నేడ్చినది. నిశ్చయము. ౧౧

లక్ష్మణుఁడా! ఉత్తమస్వభావురాలును మధురమయిన చిఱునగవుగలదియునగు సీత మున్ను ఈశాతిమీఁద నాసమీపంబునఁ గూర్చుండి యయ్యె పరిహాసవచనంబులకు నవ్వుచు నిన్నుఁజూచి పెక్కుమాటలం జెప్పుచుండెను. ౧౨

గోదావరీయం సరితాం వరిష్ఠా
ప్రియా ప్రియాయా మమ నిత్యకాలమ్,
అప్యత్ర గచ్ఛే దితి చిన్తయామి
నై కాకినీ యాతి హి సా కదాచిత్. ౧౩
పద్మాననా పద్మవిశాలనేత్రా
పద్మాని వాఽ నేతు మభిప్రయాతా,
త దప్యయుక్తం న హి సా కదాచి
న్మయా వినా గచ్ఛతి పఙ్కజాని. ౧౪
కామం త్విదం పుష్పితవృక్షషణ్డం
నానావిధై ః పక్షిగణై రుపేతమ్,
వనం ప్రయాతా ను తద ప్యయుక్త
మేకాకినీ సాఽతిబిభేతి భీరుః. ౧౫
ఆదిత్య! భో లోకకృతాకృతజ్ఞ!
లోకస్య సత్యానృతకర్మసాక్షిన్!,
మమ ప్రియా సా క్వ గతా హృతా వా
శంసస్వ మే శోకవశస్య సత్యమ్. ౧౬

లోకేషు సర్వేషు చ నాస్తి కించి
ద్యత్తే న నిత్యం విదితం భవే త్తత్,
శంసస్వ వాయో! కులశాలినీం తాం
హృతా మృతా వా పథి వర్తతే వా. ౧౭
ఇతీవ తం శోకవిధేయదేహం
రామం విసంజ్ఞం విలపన్త మేవమ్,
ఉవాచ సౌమిత్రి రదీనసత్త్వో
న్యాయే స్థితః కాలయుతం చ వాక్యమ్. ౧౮

నదులలో నుత్తమనదియయిన యీగోదావరిమీఁద నాప్రియురాలి కెల్లప్పుడును బ్రీతి యతిశయించి యుండును. ఒకవేళ నిచ్చటికిఁ బోయి యుండునా? యని తలంచెదను; పోయియుండదు; నన్ను విడిచి యాబిడ యొంటిగా నెప్పుడును బోయినదిలేదు. ౧౩

కమలమువంటి మోముగలదియుఁ గమలంబులుంబోలె విశాలంబులయిన కన్నులుగలదియు నగు నాప్రియురాలు ఒకవేళఁ గమలంబులఁ గోసి తెచ్చుటకై పోయినదో యేమో; ఆ! అదిసరికాదు; ఆబిడ యెప్పుడును నన్ను విడిచి కమలంబులు గోయుటకుఁ బోయినదేలేదు. ౧౪

ఈవనమునందలివృక్షములు మిక్కిలియుఁ బుష్పించియున్నవి. నానావిధములయిన మధురస్వనంబులగు పక్షులతోఁ గూడియున్నవి. ఈవనంబునకేమైనఁ బోయెనో; కాదు; ఆబిడ పిఱికి; ఒంటిగానుండినప్పుడు మిక్కిలియు భయపడును. ౧౫

ఓసూర్యుఁడా! నీవు లోకంబున నేది జరుగుచున్నదో యేది జరగదో ఆవ్యాపారంబుల నన్నింటినిం దెలిసినవాఁడవు జనులు చేయుపుణ్యపాపకర్మంబులకు సాక్షివి; నాప్రియురాలు ఎక్కడికిఁ బోయినది? రాక్షసు లాబిడ నపహరించుకొని పోయినారా? నే నెప్పుడును దుఃఖము నే యనుభవించుటకుఁ బుట్టినాను. నా కింతమాత్రము చెప్పుము. ౧౬

వాయుదేవుఁడా! సమస్తలోకంబులయందును నీకుఁ దెలియనిది కొంచెమేని యెప్పుడును లేదు; కాఁబట్టి నాప్రియురాలు రాక్షసులచే నపహరింపఁబడినదా? మృతిఁ బొందినదా? మార్గంబున నున్నదా? సత్కులప్రసూతయగు నాభార్యసంగతిఁ జెప్పుము. అని రాముఁడు విలపించెను. ౧౭

ఇట్లు విలపించుచు దుఃఖపరవశుఁడై విసంజ్ఞుండై యున్న రాముం జూచి న్యాయంబు నవలంబించియున్నవాఁడును మహాధైర్యుండు నగు లక్ష్మణుఁడు కాలోచితంబుగా నీప్రకారంబున నాశ్వాసించెను. ౧౮

శోకం విముఞ్చార్య! ధృతిం భజస్వ
సోత్సాహతా చాస్తు విమార్గణేఽస్యాః,
ఉత్సాహవన్తో హి నరా న లోకే
సీదన్తి కర్మ స్వతిదుష్కరేషు. ౧౯
ఇతీవ సౌమిత్రి ముదగ్రపౌరుషం
బ్రువన్త మార్తో రఘువంశవర్ధనః,
న చిన్తయామాస ధృతిం విముక్త్వా
స్పునశ్చ దుఃఖం మహ దభ్యుపాగమత్. ౨౦
ఇతి శ్రీమదరణ్యకాణ్డే త్రిషష్టితమ స్సర్గః. ౬౩.

## చతుష్షష్టితమ స్సర్గః.

స దీనో దీనయా వాచా లక్ష్మణం వాక్య మబ్రవీత్,
శీఘ్రం లక్ష్మణ! జానీహి గత్వా గోదావరీం నదీమ్. ౧
అపి గోదావరీం సీతా పద్మా న్యానయితుం గతా,
ఏవ ముక్తస్తు రామేణ లక్ష్మణః పరవీరహా. ౨
నదీం గోదావరీం రమ్యాం జగామ లఘువిక్రమః,
తాం లక్ష్మణ స్తీర్థవతీం విచిత్వా రామ మబ్రవీత్. ౩
నైనాం పశ్యామి తీర్థేషు క్రోశతో న శృణోతి మే,
కం ను సా దేశ మాపన్నా వైదేహీ క్లేశనాశినీ. ౪
న హ్యహం వేద తం దేశం యత్ర సా జనకాత్మజా,

పూజ్యుఁడవగు రాముఁడా! దుఃఖంబు విడిచి ధైర్యము నవలంబింపుము. జానకిని వెదకుటయం దుత్సాహము నొందుము. లోకంబున నుత్సాహముగల పురుషులు ఎంతదుష్కరకార్యములయందైనను బరాజయంబు నొందరు. అని లక్ష్మణుఁడు రామునకుఁ జెప్పెను. ౧౯

మహాపౌరుషుఁడగు లక్ష్మణుఁడు ఈప్రకారమున నెంతచెప్పినను రఘువంశంబు వృద్ధినొందింపం బుట్టినరాముఁడుదుఃఖాతిశయంబున లక్ష్మణునిమాటల సరకుసేయకయే యున్నధైర్యంబునుంగూడ విడిచి మఱియును మహాదుఃఖంబు నొందెను. ౨౦

ఇది యఱువదిమూఁడవసర్గము.

---

# అఱువదినాలవసర్గము.

ఆరాముఁడు దుఃఖితుఁడై లక్ష్మణుం జూచి దీనవాక్యంబున నిట్లని చెప్పెను.

లక్ష్మణుఁడా! జానకి కమలంబులఁగోయుటకై గోదావరీనది కేమైనఁ బోయినదో నీవు శీఘ్రంబున గోదావరీనదికిఁ బోయి తెలిసికొనిరమ్ము. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౧

శత్రువీరుల వధించునట్టి లక్ష్మణుఁడు రామునిమాటను విన్నంతనె శీఘ్రగమనంబున రమణీయంబగు గోదావరీనదికిఁ బోయెను ౨

లక్ష్మణుఁడు ఆగోదావరీనదిలో రేవులనంతటను సీతనువెదకి రామునొద్దకు వచ్చి యిట్లనిచెప్పెను. ౩

గోదావరిరేవులం దెచ్చటను నాకు జానకి యగపడలేదు. నే నెంత పిలిచినను బలుకలేదు.

దుఃఖమును బోఁగొట్టునట్టిసీత యెచ్చటికిఁ బోయినదో; జనకమహారాజపుత్త్రియగు నాసీత యెచ్చటికిఁ బోయియుండునో ఆస్థలము నాకుఁ దెలియలేదు. అని లక్ష్మణుఁడు రామునితోఁ జెప్పెను. ౪

లక్ష్మణస్య వచ శ్శ్రుత్వా దీన స్సన్తాపమోహితః: ౫
రామ స్సమభిచక్రామ స్స్వయం గోదావరీం నదీమ్,

స తా ముపస్థితో రామః క్వ సీ తే త్యేవ మబ్రవీత్. ౬

భూతాని రాక్షసేన్ద్రేణ వధార్హేణ హృతా మితి,
న తాం శశంసూ రామాయ తథా గోదావరీనదీ. ౭
తతః ప్రచోదితా భూతై శ్శంసాస్మై తాం ప్రియా మితి,
నతు సాఽభ్యవద త్సీతాం పృష్టా రామేణ శోచతా. ౮

రావణస్య చ తద్రూపం కర్మాణి చ దురాత్మనః.
ధ్యాత్వా భయాత్తు వైదేహీం సా నదీ న శశంస తామ్. ౯

నిరాశస్తు తయా నద్యా సీతాయా దర్శనే కృతః,
ఉవాచ రామః సౌమిత్రిం సీతాఽదర్శనకర్శితః. ౧౦

ఏషా గోదావరీ సౌమ్య! కించి న్న ప్రతిభాషతే,
కిన్ను లక్ష్మణ!వక్ష్యామి సమేత్య జనకం వచః. ౧౧
మాతరం చైవ వైదేహ్యా వినా తా మహ మప్రియమ్,
యా మే రాజ్యవిహీనస్య వనే వన్యేన జీవతః. ౧౨
సర్వం వ్యపనయే చ్ఛోకం వైదేహీ క్వను సా గతా,

జ్ఞాతిపక్షవిహీనస్య రాజపుత్త్రీ మపశ్యతః. ౧౩
మన్యే దీర్ఘా భవిష్యన్తి రాత్రయో మమ జాగ్రతః,

రాముఁడు లక్ష్మణుఁడు పలికినమాటను విని దీనుఁడై సంతాపంబునం జేసి యుక్తాయుక్తంబు దెలియనివాఁడై తానే గోదావరినదియొద్దకుం బోయెను. ౫

అట్లు రాముఁడు గోదావరీనదిసమీపంబునకుఁ బోయి "సీత యెచ్చట!" అని యడిగెను. ౬

వధ్యుఁడగు రాక్షసేశ్వరుఁడు రావణుఁడు సీత నపహరించినాఁడని రామునకు భూతంబులును జెప్పలేదు. అట్లె గోదావరీనదియుఁ జెప్పదయ్యె.

అంత సమస్తభూతంబులును "మాకుఁగా నీవు రామునకుఁ బ్రియురాలివార్తం జెప్పుమని వేఁడినను రాముఁడు దుఃఖితుఁడై యెంతయడిగినను గోదావరీనది సీతావృత్తాంతంబు నెంతమాత్రము చెప్పనేలేదు. ౮

గోదావరీనది దురాత్ముఁడగు నారావణుని భయంకరాకారంబునుం దలంచి భయపడియుండుటవలననే రామునకుం బ్రియురాలివృత్తాంతంబుఁ జెప్పలేదు. ౯

సీతం జూడకుండుటచే మిక్కిలియు దుఃఖితుఁడై కృశించియుండు రాముఁడు ఇంకను సీత దొరకినను దొరకవచ్చు నను విషయమునందు గోదావరీనది యేమియుఁ బ్రత్యుత్తర మివ్వకుండుటవలన నిరాశుఁడై లక్ష్మణుం జూచి యిట్లని చెప్పెను. ౧౦

సౌమ్యుఁడవగు లక్ష్మణుఁడా! ఈగోదావరి ఎంతమాత్రము బదులు చెప్పకున్నది. నేను సీతలేక జనకమహారాజునొద్దకు మనతల్లి కౌసల్యయొద్దకును బోయి వారి కప్రియంబుగా నెట్లు చెప్పుదును? ౧౧

రాజ్యభ్రష్టుఁడనై యడవియందుఁ గందమూలాదులం దిని జీవించుచున్న నాదుఃఖమునంతయు నెవ్వతె పోఁగొట్టునో ఆసీత యెక్కడికిఁ బోయినది? ౧౨

బంధువర్గమును బాసి రాచకొమార్తెయగు ప్రియురాలి నెడఁబాసి కంటికి నిదురపట్టకున్న నాకు ఒక్కొకరాత్రి యొకయుగముగా నుండునని తలంచెదను. ౧౩

మన్దాకినీం జనస్థాన మిమం ప్రస్రవణం గిరిమ్. ౧౪
సర్వా ణ్యనుచరిష్యామి యది సీతా హి దృశ్యతే,

ఏ తేమృగా మహావీర్యా మా మీక్షన్తే ముహుర్ముహుః. ౧౫
వక్తుకామా ఇవ హి మే ఇఙ్గితాన్యుపలక్షయే,

తాం స్తు దృష్ట్వా నరవ్యాఘ్రో రాఘవః ప్రత్యువాచహ. ౧౬
క్వ సీతేతి నిరీక్షన్వై బాష్పసంరుద్ధయా దృశా,
ఏవ ముక్తా నరేన్ద్రేణ తే మృగా స్సహసోత్థితాః. ౧౭
దక్షిణాభిముఖా స్సర్వే దర్శయన్తో నభస్థ్సలమ్,
మైథిలీ హ్రియమాణా సా దిశం యా మన్వపద్యత. ౧౮
తేన మార్గేణ ధావన్తో నిరీక్షన్తే నరాధిపమ్,
యేన మార్గం చ భూమించ నిరీక్షన్తే స్మ తే మృగాః. ౧౯
పున శ్చ మార్గ మిచ్ఛన్తి లక్ష్మణే నోపలక్షితాః,
తేషాం వచనసర్వస్వం లక్షయామాస చేఙ్గితమ్. ౨౦
ఉవాచ లక్ష్మణో జ్యేష్ఠం ధీమా న్భ్రాతర మార్తవత్,

క్వ సీతేతి త్వయా పృష్టా యథేమే సహసోత్థితాః. ౨౧
దర్శయన్తి క్షితించైవ దక్షిణాం చ దిశం మృగాః,
సాధు గచ్ఛావహే దేవ! దిశ మేతాం హి నైరృతీమ్. ౨౨
యది స్యా దాగమః కశ్చి దార్యా వా సాఽథ లక్ష్యతే,

బాఢ మిత్యేవ కాకుత్స్థః ప్రస్థితో దక్షిణాం దిశమ్. ౨౩
లక్ష్మణానుగత శ్శ్రీమా న్వీక్షమాణో వసున్ధరామ్,
ఏవం సంభాషమాణౌ తా వన్యోన్యం భ్రాతరా వుభౌ. ౨౪

ఇప్పుడు సీత యగపడునేని నే నావిడంగూడి గోదావరీనదీతీరంబులను జనస్థానంబునను ఈప్రస్రవణపర్వతంబునను సమస్తరమణీయప్రదేశంబులను విహరింతునుగదా! ౧౪

మహాపరాక్రమశాలివగు లక్ష్మణుఁడా! ఈమృగములు నన్ను మాటిమాటికిఁ జూచుచున్నవి. ఇవి నాకు సీతసంగతి చెప్పవలయునని యున్నట్లు వానియింగితంబులవలనఁ దెలియవచ్చుచున్నది. ౧౫

పురుషశ్రేష్ఠుఁడగు రాముఁడు ఆమృగంబులం జూచినంతనే కన్నులు నిండఁగ నీళ్లుగాఱ "సీత యెచ్చట?" అని యడిగెను. ౧౬

ఆమృగంబులు రాముఁడు చెప్పినది విని వేగంబున అన్నియు లేచి దక్షిణాభిముఖంబులయి యాకాశంబుఁ జూపుచు సీతాదేవిని రావణుఁ డపహరించుకొని యేమార్గంబునఁ బోయినాఁడో యామార్గంబుఁబట్టి పరుగెత్తుచు రాముఁ జూచుచుండినవి. ౧౭,౧౮

ఆమృగంబులు దక్షిణదిక్కుమార్గంబుననే పోవ్రటకుఁ గోరుచుండుటం జూచి దానియభిప్రాయంబును లక్ష్మణుఁడు దెలిసికొనెను. ౧౯

బుద్ధిమంతుఁడగు లక్ష్మణుఁడు ఆమృగంబుల చేష్టలవలన మాటలవలనం బోలె నభిప్రాయంబు నూహించి దీనస్వరంబున అన్నంజూచి యిట్లని చెప్పెను. ౨౦

దేవరా! నీవు సీత యెక్కడ? అని యడిగినంతనే యామృగంబులు వేగంబునలేచి దక్షిణదిక్కును భూమినిం జూపుచున్నవి కావున మనము దక్షిణపుదిక్కునుబట్టియే పోవుదము. ఒకవేళ యేమైన నుపాయమేని తెలియును. పూజ్యురాలగు నాసీతయైన దొరకినను దొరకును. అని లక్ష్మణుఁడు రామునితోఁ జెప్పెను. ౨౧,౨౨

శ్రీమంతుఁడగు రాముఁడు మంచిదే యని లక్ష్మణుఁడు తోడ వెంబడింపఁ దలవంచి నేలం జూచుచు దక్షిణదిక్కును బట్టిపోయెను ౨౩

అన్నదమ్ములగు నా రామలక్ష్మణులు ఈప్రకారంబున నొండురులతో

వసున్ధరాయాం పతితం పుష్పమార్గ మపశ్యతామ్,

తాం పుష్పవృష్టిం పతితాం దృష్ట్వా రామో మహీతలే. ౨౫
ఉవాచ లక్ష్మణం వీరో దుఃఖితో దుఃఖితం వచః,

అభిజానామి పుష్పాణి తా నీమా నీహ లక్ష్మణ!. ౨౬
పినద్ధాని హి వైదేహ్యా మయా దత్తాని కాననే,
మన్యే సూర్యశ్చ వాయు శ్చ మేదినీ చ యశస్వినీ. ౨౭
అభిరక్షన్తి పుష్పాణి ప్రకుర్వన్తో మమ ప్రియమ్,

ఏవ ముక్త్వా మహాబాహుం లక్ష్మణం పురుషర్షభః. ౨౮
ఉవాచ రామో ధర్మాత్మా గిరిం ప్రస్రవణాకులమ్,
కచ్చి త్క్షితిభృతాం నాథ! దృష్టా సర్వాఙ్గసున్దరీ!. ౨౯
రామా రమ్యే వనోద్దేశే మయా విరహితా త్వయా,

క్రుద్ధోఽబ్రవీ ద్గిరిం తత్ర సింహః క్షుద్రమృగం యథా. ౩౦

తాం హేమవర్ణాం హేమాభాం సీతాం దర్శయ పర్వత!,
యావ త్సానూని సర్వాణి న తే విధ్వంసయా మ్యహమ్. ౩౧

ఏవ ముక్త స్తు రామేణ పర్వతో మైథిలీం ప్రతి,
శంసన్నివ తత స్సీతాం నాదర్శయత రాఘవే. ౩౨
తతో దాశరథీ రామ ఉవాచ చ శిలోచ్చయమ్,

మమ బాణాగ్నినిర్దగ్ధో భస్మీభూతో భవిష్యసి. ౩౩

మాటలాడుకొనుచుం బోయి మార్గంబున నేలపైఁ బూలురాలియుండుటం ౨౪
జూచిరి.

పరాక్రమవంతుఁడగు రాముఁడు నేలం బడియున్న యాపుష్పంబులం
జూచి దుఃఖితుఁడై తనయట్లు దుఃఖితుఁడైన లక్ష్మణుం జూచి యిట్లని ౨౫
చెప్పెను.

లక్ష్మణుఁడా! నే నీపుష్పంబుల నెఱుంగుదును; నేనే యీపుష్పంబుల
సీత కివ్వఁగా నాబిడ వీని గొప్పునఁ బెట్టుకొనెను. ౨౬

సూర్యుఁడును వాయుదేవుఁడును యశస్వినియగు భూదేవియు
నాకు సంతోషంబు సేయవలెనని యీపుష్పంబు రక్షింపుచుందు రని తలంచె
దను. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౨౭

పురుషశ్రేష్ఠుఁడును ధర్మాత్ముఁడు నగురాముఁడు మహాబాహుఁడగు
లక్ష్మణునితో నీప్రకారముచెప్పి ప్రస్రవణగిరిం జూచి యిట్లని చెప్పెను. ౨౮

పర్వతశ్రేష్ఠమవగు ప్రస్రవణపర్వతమా! నేను లేక పరితపించుచుండు
సర్వాంగసుందరియగు నొకానొకస్త్రీ నేమైన రమణీయంబగు వనప్రదేశ
మునం జూచితివా యేమి? అని రాముఁడు పర్వతంబుతోఁ జెప్పెను. ౨౯

అంతఁ బర్వతంబు మాఱుపలుకకుండుటంజూచి రాముఁడు సింహం
బు అల్పమృగంబుంబోలె నప్పర్వతంబును బెదరింపుచు నిట్లనియె. ౩౦

ప్రస్రవణపర్వతమా! నేను గోపించి నీసానువుల నన్నింటిని నశింపఁ
జేయుటకు మున్నె నీవు బంగారువన్నెగలదియు బంగారు ప్రతిమవంటిదియు
నగు నాసీతం జూపుము. అని రాముఁడు పర్వతముతోఁ జెప్పెను. ౩౧

అంతఁ బర్వతంబు రాముఁడు చెప్పినది విని ప్రతిధ్వనిచే సీతను
గూర్చియేమో చెప్పునట్లు చూపట్టెను గాని రామున కాబిడను జూపలేదు.

అంత దశరథకుమారుఁడగు రాముఁడు మఱలఁ గొండంజూచి యిట్లని
చెప్పెను.

బాణాగ్నిచే నిన్ను దహించి భస్మంబుగావించెదను. అంత నీయందుఁ

అసేవ్య స్సన్తతం చైవ నిస్తృణద్రుమపల్లవః,
ఇమాం వా సరితం చాద్య శోషయిష్యామి లక్ష్మణ!. ౩౪
యది నాఖ్యాతి మే సీతా మార్యాం చన్ద్రనిభాననామ్,
ఏవం స రుషితో రామో దిధక్షు న్నివ చక్షుషా. ౩౫
దదర్శ భూమౌ నిష్క్రాన్తం రాక్షసస్య పదం మహత్,
త్రస్తాయా రామకాఙ్క్షిణ్యాః ప్రధావన్త్యా ఇత స్తతః. ౩౬
రాక్షసే నానువృత్తాయా మైథిల్యాశ్చ పదా న్యథ,
స సమీక్ష్య పరిక్రాన్తం సీతాయా రాక్షసస్య చ. ౩౭
భగ్నం ధనుశ్చ తూణీ చ వికీర్ణం బహుధా రథమ్,
సమ్భ్రాన్తహృదయో రామ శ్శశంస భ్రాతరం ప్రియమ్. ౩౮
పశ్య లక్ష్మణ! వైదేహ్యాః శీర్ణాః కనకబిన్దవః,
భూషణానాం హి సౌమిత్రే! మాల్యాని వివిధాని చ. ౩౯
తప్తబిన్దునికాశైశ్చ చిత్రైః క్షతజబిన్దుభిః,
ఆవృతం పశ్య సౌమిత్రే! సర్వతో ధరణీతలమ్. ౪౦
మన్యే లక్ష్మణ! వైదేహీ రాక్షసైః కామరూపిభిః,
భిత్త్వా భిత్త్వా విభక్తా వా భక్షితా వా భవిష్యతి. ౪౧
తస్యా నిమిత్తం వైదేహ్యా ద్వయో ర్వివదమానయోః,
బభూవ యుద్ధం సౌమిత్రే! ఘోరం రాక్షసయో రిహ. ౪౨
ముక్తామణిమయం చేదం తపనీయవిభూషితమ్,
ధరణ్యాం పతితం సౌమ్య! కస్య భగ్నం మహ ద్ధనుః. ౪౩
తరుణాదిత్యసఙ్కాశం వైడూర్యగుళికాచితమ్,

బచ్చికగాని వృక్షములుగాని జిగుళ్లుగాని లేకుండుటవలన నిన్నెవ్వరును సేవింపరు. అని రాముఁడు పర్వతముతోఁ జెప్పెను. ౩౩

లక్ష్మణుఁడా! ఈనదిగాని పూజ్యారాలును చంద్రబింబమువంటి సుందరమయిన ముఖముగలదియునగు సీతసంగతిని నాకుఁ జెప్పదేని దీని నిప్పుడె శోషింపఁజేసెదను. అని రాముఁడు చెప్పెను. ౩౪

ఆరాముఁడు ఇట్లు కోపంబునఁ గన్నుల నిప్పులురాల లోకంబుల దహింపఁదలఁచినట్లుండఁగా భూమియందు పెద్దవగురాక్షసుని యడుగులును భయపడి రామునియొద్దకుఁ బోఁగోరి రాక్షసుఁడు వెంటనంటి తఱుముటచే నిటునటుపరుగెత్తుచున్న సీతయడుగులును అతని కగపడినవి. ౩౫ ౩౬

రాముఁడు సీతాదేవి యడుగులును రాక్షసుని యడుగులనుంజూచి మఱియు నచ్చటచ్చట భగ్నంబులయి పడియున్నధనుస్సును అమ్ములపొదులను నానావిధముగా భిన్నమైయున్న రథంబునుఁగని తమ్మునింజూచి యిట్లని చెప్పెను. ౩౭,౩౮

లక్ష్మణుఁడా! ఇటుచూడుము; జానకి భూషణంబులనుండి బంగారు శకలంబులు రాలియున్నవి. మఱియు నానావిధంబులయిన పుష్పమాలికలును రాలియున్నవి. ౩౯

లక్ష్మణుఁడా ఆశ్చర్యకరంబుగా బంగారుబిందువులువలెనుండు రక్తబిందువులచేత భూమియంతయుఁ గప్పఁబడియున్నది చూడుము. ౪౦

లక్ష్మణుఁడా! కామరూపులగురాక్షసులు సీతను ఛేదించి తలాకొంచెము పంచుకొనిరైనను లేక భక్షించిరైన నుందురు. ౪౧

లక్ష్మణుఁడా! ఆజానకినిమిత్తమయి ఇద్దఱురాక్షసులు వివాదమాడి యిచ్చట భయంకరమయిన యుద్ధముగావించిరి. ౪౨

సౌమ్యుఁడా! ముత్తెములును మణులును బొదిగి కాంచనభూషితమయి విఱిగి నేలంబడియున్న యీధనుస్సు ఎవ్వనిది? ౪౩

బాలసూర్యునితో సమానంబును వైడూర్యమణుల పొదిగినదియునగు

విశీర్ణం పతితం భూమౌ కవచం కస్య కాఞ్చనమ్. ౪౪
ఛత్రం శతశలాకం చ దివ్యమాల్యోపశోభితమ్,
భగ్నదణ్డ మిదం కస్య భూమౌ సమ్యఙ్నిపాతితమ్. ౪౫
కాఞ్చనోరశ్ఛదా శ్చేమే పిశాచవదనాః ఖరాః,
భీమరూపా మహాకాయాః కస్య వా నిహతా రణే. ౪౬

దీప్తపావకసంకాశో ద్యుతిమాం త్సమరధ్వజః,
అపవిద్ధ శ్చ భగ్నశ్చ కస్య సాఙ్గ్రామికో రథః. ౪౭
రథాక్షమాత్రా విశిఖా స్తపనీయవిభూషణాః,
కస్యేమేఽభిహతా బాణాః ప్రకీర్ణా ఘోరకర్మణః. ౪౮

శరావరౌ శరైః పూర్ణౌ విధ్వస్తౌ పశ్య లక్ష్మణ!,
ప్రతోదాభీశుహస్తో వై కస్యాయం సారథి ర్హతః. ౪౯

కస్యేమౌ పురుషవ్యాఘ్ర! శయాతే నిహతౌ యుధి,
చామరగ్రాహిణౌ సౌమ్య! సోష్ణీషమణికుణ్డలౌ. ౫౦

పదవీ పురుష స్యైషా వ్యక్తం కస్యాపి రక్షసః,
వైరం శతగుణం పశ్య మ మేదం జీవితాన్తకమ్. ౫౧

సుఘోరహృదయైః సౌమ్య! రాక్షసైః కామరూపిభిః,
హృతా మృతా వా సీతా సా భక్షితా వా తపస్వినీ. ౫౨

న ధర్మ స్త్రాయతే సీతాం హ్రియమాణాం మహావనే,

విఱిగి నేలంబడియున్న యీబంగారుకవచం బెవ్వనిది? ౪౪

నూఱుకమ్ములుగలిగి దివ్యమాలికతో నొప్పుచున్న చక్కఁగా దండము విఱిచి నేలంబడవేయఁ బడియున్న యాఛత్త్రం బెవ్వనిది? ౪౫

బంగారుకవచంబులుగలవియు భయంకరాకారంబులును పిశాచముఖంబులునగు యుద్ధంబున వధింపఁబడి నేలంబడియున్న యాకంచరగాడిదలు ఎవ్వనివి? ౪౬

మండుచున్నయగ్నివలెఁ బ్రకాశించుచున్నవియుఁ గాంతిమంతంబులు నగు విఱిగిపడియున్నధ్వజంబును యుద్ధార్థమయినరథంబును ఎవ్వనివి? ౪౭

నాలుగువందలయంగుళములనిడుపుగల కాంచనాలంకృతంబులును మండితాగ్రంబులు నగుబాణంబులు ఇచ్చట విఱిగి యిచ్చటచ్చటఁ బడియున్నవే ఇవి యేభయంకర కర్మునివి? ౪౮

లక్ష్మణుఁడా! బాణపూర్ణంబులగు తూణీరంబులును రెండును విఱిగియున్నవి చూడుము; మునికోలయును బగ్గములు జేతులంబట్టుకొని చచ్చిపడియుండు నీతఁడు ఎవ్వనిసారథి? ౪౯

పురుషశ్రేష్ఠుఁడవు సౌమ్యుఁడవు నగు లక్ష్మణుఁడా! తలగుడ్డలతో రత్నకుండలంబులతోను నొప్పుచు యుద్ధంబున నిహతులయి పడియున్నారే; వీరలిద్దఱు ఎవ్వని చామరగ్రాహులు? ౫౦

ఈమార్గము ఎవ్వఁడో యొకరాక్షసునిది; సందేహములేదు. ఇదివఱకు రాక్షసులమీఁద నాకంతగా వైరంబుగలుగలేదు. కాఁబట్టి వారి యపరాధంబుల కోర్చియుంటిని. ఇప్పుడు నూతెంతలు వైరంబుగలిగినది ఇఁక రాక్షసుల యుందఱిప్రాణంబులను హరించెదఁ జూడుము. ౫౧

సౌమ్యుఁడవగు లక్ష్మణుఁడా! శోచనీయయగు జానకిని గామరూపులును భయంకరమయిన కఠినమనస్సుగలవారలు నగురాక్షసులు అపహరించి గాని భక్షించిగానియుందురు, లేక జానకి మరణంబు నేని బొందియుండును.

మహారణ్యంబునందు రాక్షసులు సీత నపహరింపఁగా ధర్మంబైనను ఆబిడను రక్షింపఁకున్నదే!

భక్షితాయాం హి వైదేహ్యాం హృతాయామపి లక్ష్మణ!. ౫౩
కేహి లోకే ప్రియం కర్తుం శక్తా స్సౌమ్య! మ మేశ్వరాః,

కర్తార మపి లోకానాం శూరం కరుణవేదినమ్. ౫౪
అజ్ఞానా దవమన్యేరం స్సర్వభూతాని లక్ష్మణ!,

మృదుం లోకహితే యుక్తం దాన్తం కరుణవేదినమ్. ౫౫
నిర్వీర్య ఇతి మన్యన్తే నూనం మాం త్రిదశేశ్వరాః,

మాం ప్రాప్య హి గుణో దోష స్సంవృత్తః పశ్య లక్ష్మణ!. ౫౬
అద్యైవ సర్వభూతానాం రక్షసా మభవాయ చ,
సంహృత్యైవ శశిజ్యోత్స్నాం మహాంత్సూర్య ఇవోదితః.
సంహృత్యైవ గుణాం త్సర్వా న్మమ తేజః ప్రకాశతే,

నైవ యక్షా న గన్ధర్వా న పిశాచా న రాక్షసాః. ౫౭
కిన్నరా వా మనుష్యా వా సుఖం ప్రాప్స్యన్తి లక్ష్మణ,

మ మాస్త్రబాణసంపూర్ణ మాకాశం పశ్య లక్ష్మణ!. ౫౮
నిస్సంపాతం కరిష్యామి హ్యద్య త్రైలోక్యచారిణామ్,

సన్నిరుద్ధగ్రహగణ మావారితనిశాకరమ్. ౬౦
విప్రణష్టానలజలద్భాస్కరసంవృతమ్,
వినిర్మథితశైలాగ్రం శుష్యమాణజలాశయమ్. ౬౧
ధ్వస్తద్రుమలతాగుల్మం విప్రణాశితసాగరమ్,
త్రైలోక్యం తు కరిష్యామి సంయుక్తం కాలకర్మణా. ౬౨

సౌమ్యుఁడవగు లక్ష్మణుఁడా! రాక్షసులు జానకిని భక్షించిగాని యప హారించిగాని యయినపిదప నా కింక నెట్టివారును సంతోషంబు నేయం జాలరు. ౫౩

లక్ష్మణుఁడా! లోకంబుల సృజింపఁజాలినవాఁడైనను శూరుఁడైనను దయాపరుఁడైనచో నతనిసామర్థ్యంబుఁ దెలియమింజేసి సమస్తభూతంబులు నతని నవమానించును. ౫౪

నేను లోకహితార్థినై మృదువుగా జితేంద్రియుఁడనై దయాపరుఁ డనై యుండుటవలన దేవతలందఱు నన్ను నిర్వీర్యుఁడని తలఁచుచున్నారు. నిశ్చయము. ౫౫

లక్ష్మణుఁడా! నన్నుఁబొందె సద్గుణముగూడ దోషమయినది చూడుము.

ఇప్పుడే సమస్తభూతంబులును రాక్షసులందఱును నాశంబు నొందు నట్లు సూర్యుఁడు వెన్నెలనంతయు సంహరించి లోకసంతాపకరుఁడై యుద యించునట్లు కారుణ్యాదిగుణంబులన్నియు సంహరించి లోకనాశార్థము నా తేజస్సు ప్రకాశించుచున్నది చూడుము. ౫౬

లక్ష్మణుఁడా! ఇఁక యక్షులుగాని గంధర్వులుగాని పిశాచములుగాని రాక్షసులుగాని కిన్నరులుగాని మనుష్యులుగాని సుఖంబు నొందకుండునట్లు గావించెదను. ౫౭

లక్ష్మణుఁడా! బ్రహ్మాస్త్రాదిదివ్యాస్త్రంబులచేతను బాణంబులచేతను ఆకాశంబు నిండించెదను చూడుము. ఇప్పుడు ముల్లోకంబులయందును ఎంత మాత్రము సందులేనట్లు గావించెదను. ౫౮

ఇప్పుడు గ్రహములకు సంచారములేనట్లును జంద్రునకుఁ జలములేన ట్లును చేసెదను. అగ్నిని జలమును వాయువును సూర్యుని నశింపఁజేసెదను. పర్వతశిఖరంబులఁ జూర్ణంబు గావించెదను. కొలంకుల నెల్ల నెండించెదను. వృక్షలతాగుల్మంబుల ధ్వంసంబు గావించెదను. సముద్రము శోషింపఁజేసెదను. ఇట్లు ముల్లోకంబులను నాశంబు నొందించెదఁ జూడుము. ౬౦-౬౨

న తాం కుశలినీం సీతాం ప్రదాస్యన్తి మమేశ్వరాః,
అస్మిన్ముహూర్తే సౌమిత్రే! మమ ద్రక్ష్యన్తి విక్రమమ్. ౬౩
నాకాశ ముత్పతిష్యన్తి సర్వభూతాని లక్ష్మణ!,
మమ చాపగుణోన్ముక్తై ర్బాణజాలై ర్నిరన్తరమ్. ౬౪

అర్దితం మమ నారాచై ర్ధ్వస్తభ్రాన్తమృగద్విజమ్,
సమాకుల మమర్యాదం జగ త్పశ్యాద్యలక్ష్మణ!. ౬౫
ఆకర్ణ పూర్ణై రిషుభి ర్జీవలోకం దురావరైః,
కరిష్యే మైథిలీహేతో రపిశాచ మరాక్షసమ్. ౬౬

మమ రోషప్రయుక్తానాం సాయకానాం బలం సురాః,
ద్రక్ష్యన్త్యద్య విముక్తానా మతిదూరాతిగామినామ్. ౬౭
నైవ దేవా న దైతేయా న పిశాచా నరాక్షసాః,
భవిష్యన్తి మమ క్రోధా త్త్రైలోక్యే విప్రణాశితే. ౬౮
దేవదానవయక్షాణాం లోకా యే రక్షసా మపి,
బహుధా న భవిష్యన్తి బాణౌఘైః శకలీకృతాః. ౬౯

నిర్మర్యాదా నిమాన్లోకా న్కరిష్యామ్యద్య సాయకైః,
హృతాం మృతాం వా సౌమిత్రే! న దాస్యన్తి మమేశ్వరాః.

తథారూపాం హి వైదేహీం న దాస్యన్తి యది ప్రియామ్,
నాశయామి జగత్సర్వం త్రైలోక్యం సచరాచరమ్. ౭౧

ఇత్యుక్త్వా రోషతామ్రాక్షః రామో నిష్పీడ్య కార్ముకమ్,
శర మాదాయ సందీప్తం ఘోరమాశీవిషోపమమ్. ౭౨

ఇప్పుడు దేవతలు నాకు క్షేమంబుతోఁగూడిన సీత నొసంగకున్నారు గదా! ఈక్షణమునందే నాపరాక్రమముఁ జూడఁగలరు. ౨౩

లక్ష్మణుఁడా! సమస్తభూతంబులకును ఆకాశమున సంచరించుట కెంత మాత్రము నవకాశము లేకుండునట్లు నాధనుర్ముక్తంబులగు బాణంబులు ఆకాశమంతయును నిరవకాశంబు గావింపఁగలవు. ౨౪

లక్ష్మణుఁడా! నాబాణంబులచేఁ బీడితంబై మృగంబులును బక్షులు నశించి జగమంతయును వ్యాకులంబై మర్యాదాహీనంబు కాఁగలదు చూడుము.

ఇప్పుడు తానిమిత్తంబుగా దుష్ప్రధర్షణంబులగు బాణంబులఁ జెవి వఱకు నాకర్షించి ప్రయోగించి ప్రాణిలోకంబునఁ బిశాచంబులుగాని రాక్షసులుగాని లేకుండునట్లు గావించెదను. ౨౫

ఇప్పుడు రోషంబునం బ్రయోగింపఁబడినవియు బహుదూరముపోయినవియు నగు నాబాణంబులబలంబును దేవతలు చూతురుగాక. ౨౬

నాకోపమువలన ముల్లోకంబులును నాశంబు నొందఁగా దేవతలును దైత్యులును బిశాచంబులును రాక్షసులును తోడనే నశింతురు. ౨౭

దేవలోకంబులును దానవలోకంబులును యక్షలోకంబులును రాక్షసలోకంబులును ఏవిగలవో అవన్నియు నిప్పుడు నాబాణంబులచేఁ బెక్కువ్రయ్యలై నాశంబు నొందును. ౨౮

లక్ష్మణుఁడా! దేవతలు అపహృతయయినగాని మరణంబునొందిగాని యుండుసీతను నాకొసఁగరు. నే నిప్పుడు బాణంబులచేఁ బ్రపంచంబునంతయు నిర్మర్యాదంబు గావించెదను. ౩౦

అపహరింపఁబడిగాని మరణంబు నొందిగాని యుండుప్రియురాలిని దేవతలు నాకొసంగరేని యిప్పుడు జంగమస్థావరంబులతోఁగూడిన ప్రపంచమువంతయు నశింపఁజేసెదను. అని రాముఁడు చెప్పెను. ౩౧

ఇట్లు బీరంబులువలికి కోపంబునఁగన్నులనెఱ్ఱఁదనంబుగదుర ధనుస్సు చేతంబట్టి దేదీప్యమానంబును భయంకరాకారంబును గ్రూరసర్పముం బోలిన

సన్ధాయ ధనుషి శ్రీమా న్రామః పరపురఞ్జయః,
యుగాన్తాగ్ని రివ క్రుద్ధ ఇదం వచన మబ్రవీత్. ౨౩

యథా రాజా యథా మృత్యు ర్యథా కాలో యథా విధిః,
నిత్యం న ప్రతిహన్యన్తే సర్వభూతేషు లక్ష్మణ!. ౨౪
తథాఽహం క్రోధసంయుక్తో న నివార్యోఽస్మి సర్వథా.
పు రేవ మే చారుదతీ మనిన్దితాం
దిశ న్తి సీతాం యది నాద్య మైథిలీమ్,
స దేవగన్ధర్వమనుష్యపన్నగం
జగ త్సశైలం పరివ ర్తయా మ్యహమ్. ౨౫

ఇతి శ్రీమదరణ్యకాణ్డే చతుష్షష్టితమ స్సర్గః. ౬౪.

## పఞ్చషష్టితమ స్సర్గః

తప్యమానం తథా రామం సీతాహరణకర్శితమ్,
లోకానా మభవే యుక్తం సాంవర్తక మివానలమ్. ౧
వీక్షమాణం ధను స్సజ్యం నిశ్శ్వసన్తం పునః పునః,
దగ్ధుకామం జగ త్సర్వం యుగాన్తే తు యథా హరమ్. ౨
అదృష్టపూర్వం సంక్రుద్ధం దృష్ట్వా రామం తు లక్ష్మణః,
అబ్రవీ త్ప్రాఞ్జలి ర్వాక్యం ముఖేన పరిశుష్యతా. ౩

పురా భూత్వా మృదు ర్దాన్త స్సర్వభూతహితే రతః,
న క్రోధవశమాపన్నః ప్రకృతిం హాతు మర్హసి. ౪

చన్ద్రే లక్ష్మీః ప్రభా సూర్యే గతి ర్వాయౌ భువి క్షమా,

దియు నగు బాణంబుదీసి వింటంగూర్చి శ్రీమంతుఁడును శత్రుపట్టణంబుల జయించువాఁడునగు రాముఁడు ప్రళయకాలానలంబుకైవడిఁ బరమక్రుద్ధుఁడై యిట్లని చెప్పెను. ౭౩

లక్ష్మణుఁడా! లోకంబున సమస్తభూతంబులును ఎట్లురాజునుగాని మృత్యువునుగాని కాలమునుగాని విధినిగాని యెప్పుఁడు నివారింపఁజాలవో అట్లుక్రుద్ధుఁడనగు నన్నును నివారింప నేరికి నలవిగాదు. ౭౪

మును పుండినట్లు సుందరములయిన దంతములుగలదియుఁ బతివ్రతయునగు సీతను నాకు దేవతలొసంగరేని దేవగంధర్వమనుష్య పన్నగంబులతోను బర్వతంబులతోనుంగూడఁ బ్రపంచమునంతయు నాశంబు నొందించెదను. అని రాముఁడు చెప్పెను. ౭౫

ఇది యఱువదినాల్గవసర్గము.

---

## అఱువదియైదవసర్గము.

అట్లు సీతాహరణంబునంజేసి పరితపించుచున్నవాఁడును ప్రళయకాలాగ్నిహోత్రునిమాడ్కి లోకనాశంబు సేయఁ బ్రవృత్తుఁడై యున్నవాఁడును ఎక్కుపెట్టఁబడిన ధనుస్సుంజూచుచుఁ గ్రోధపారవశ్యంబున మాటికిమాటికి నిట్టూర్పులు నిగుడించుచున్నవాఁడును ప్రళయకాలరుద్రునికైవడిభయంకరాకారుఁడై జగంబంతయు దహింపఁజూచుచున్నవాఁడును ఆదివఱకెన్నఁడుం జూడని యాకారవిశేషంబు నొందినవాఁడును బరమక్రుద్ధుఁడునగు రాముం జూచి లక్ష్మణుఁడు దుఃఖభయంబుల నోరెండఁ జేమోడ్పుగీలించి యిట్లని చెప్పెను. ౧-౩

నీవు ఇంతవఱకు మృదుస్వభావుడవుగాను జితేంద్రియుఁడవుగాను సమస్తభూతంబులకును హితంబు సేయువాఁడవుగాను ఉండి యిప్పుడు క్రోధపారవశ్యంబునొంది నీస్వభావంబును వదలుట యుచితముగాదు. ౪

చంద్రునియందుఁ గాంతియు సూర్యునియందు వెలుఁగును వాయువు

ఏతచ్చ నియతం సర్వం త్వయి చానుత్తమం యశః. ౫

ఏకస్య నాపరాధేన లోకాన్ హన్తుం త్వ మర్హసి,

నతు జానామి క స్యాయం భగ్న స్సాఙ్గ్రామికో రథః. ౬
కేన వా కస్య వా హేతో స్సాయుధ స్సపరిచ్ఛదః,

ఖురనేమిక్షత శ్చాయం సిక్తో రుధిరబిన్దుభిః. ౭
దేశో నిర్వృత్తసఙ్గ్రామ స్సుఘోరః పార్థివాత్మజ!,

ఏకస్య తు విమర్దోఽయం న ద్వయో ర్వదతాం వర!. ౮
నహి వృత్తంహి పశ్యామి బలస్య మహతః పదమ్,

నైకస్య తు కృతే లోకా న్వినాశయితుమర్హసి. ౯
యుక్తదణ్డా హి మృదవః ప్రశాన్తా వసుధాధిపాః,

సదా త్వం సర్వభూతానాం శరణ్యః పరమా గతిః. ౧౦

కోను దారప్రణాశం తే సాధు మన్యేత రాఘవ!,

సరిత స్సాగరా శ్శైలా దేవగన్ధర్వదానవాః. ౧౧
నాలం తే విప్రియంకర్తుం దీక్షితస్యేవ సాధవః,

నందు గమనమును భూమియందు క్షమయును ఇట్లొక్కొకరియందు ఒక్కొకటి నియతముగానుండును. నీయందు గాంత్యాదులన్నియు అసదృశంబగు కీర్తియు నియతముగా నుండును. ౫

ఒకఁడు తప్పుచేయుటచేత నీవు నిరపరాధంబులగు లోకంబుల నన్నిటిని వధించుట యుక్తముకాదు.

ఆయుధములతోను ఇతరములయిన యుద్ధోపకరణములతోనుంగూడి విఱిగి పడియున్న యీయుద్ధరథము ఎవ్వనిది? ఎవ్వనిచే విఱువఁబడినది? ఎందుకుఁగా విఱువఁబడినది? ఈసంగతి నాకేమియుఁ దెలియలేదు. ౭

రాచకొమరుఁడవగు రాముఁడా! ఈప్రదేశము గుఱ్ఱములచేతను రథచక్రములచేతను క్షుణ్ణంబై నెత్తురుచేఁ దడుపఁబడి భయంకరముగా నుండుటవలన ఇందు ఇంతకుమునుపు మహాయుద్ధము జరిగినట్లు తోఁచుచున్నది.

మాటలాడువారలలో నుత్తముఁడవగు రాముఁడా! యుద్ధ మొకనిది గానే తోఁచుచున్నది. ఇద్దఱిదిగాని బహుమందిదిగాని కాదు. ఏలయనఁగా గొప్పసేనయుండినట్లు అడుగులజాడ యగపడలేదు. ౮

ఒక్కనికిఁగా లోకంబులనన్నింటిని నశింపజేయుటయుచితముకాదు. రాజులు ఎవ్వని కెంత దగునో యంత శిక్షయే చేయువారలుగాను మృదువులుగాను శాంతులుఁగాను నుందురుగదా! ౯

నీవు ఆరాజులవంటివాఁడవు మాత్రమె కావు. ఎల్లప్పుఁడును సమస్త భూతంబులకును శరణ్యుఁడవు. పరమగతివి. ౧౦

రాముఁడా! నీ కిప్పుడు గలిగినభార్యావియోగము మంచిదని యెవ్వఁడు తలంచును?

యాగదీక్షితునకు ఋత్విజులు అప్రియంబుచేసినచో అది యాగవిఘాతమూలంబునఁ దమకును సంభవించునని భయంబున అతని కప్రియంబు సేయవెఱచునట్లు లోకరక్షకుఁడవగు నీకు నదులుగాని సముద్రంబులుగాని పర్వతంబులుగాని దేవగంధర్వదానవులుగాని దామెచేడుదు రనుభయంబున అప్రియం బెంతమాత్రము చేయఁజాలరు. ౧౧

యేన రాజన్! హృతా సీతా త మన్వేషితుమర్హసి. ౧౨
మద్ద్వితీయో ధనుష్పాణి స్సహాయైః పరమర్షిభిః,
సముద్రం చ విచేష్యామః పర్వతాంశ్చ వనాని చ. ౧౩
గుహాశ్చ వివిధా ఘోరా నదీః పద్మవనానిచ,

దేవగన్ధర్వలోకాంశ్చ చేష్యామ స్సమాహితాః. ౧౪
యావ న్నాధిగమిష్యామ స్తవ భార్యాపహారిణమ్,

నచే త్సామ్నా ప్రదాస్యన్తి పత్నీం తే త్రిదశేశ్వరాః. ౧౫
కోసలేన్ద్ర!తతఃపశ్చా త్ప్రాప్తకాలం కరిష్యసి,

శీలేన సామ్నావినయేనసీతాం
నయేన నప్రాప్స్యసి చే న్నరేన్ద్ర!,
తత స్సముత్సాదయ హేమపుఙ్ఖై
ర్మహేన్ద్రవజ్రప్రతిమైశ్శరౌఘైః. ౧౬

ఇతి శ్రీమదరణ్యకాణ్డే పఞ్చషష్టితమ స్సర్గః ౬౫.

---

## షష్టితమ స్సర్గః.

తం తథా శోకసంతప్తం విలపన్త మనాథవత్,
మోహేనమహతా౽౽విష్టం పరిద్యూన మచేతనమ్. ౧
తత స్సౌమిత్రి రాశ్వాస్య ముహూర్తా దివ లక్ష్మణః,
రామం సంబోధయామాస చరణౌచాభిపీడయన్. ౨
మహతాతపసా రామ! మహతా చాపి కర్మణా,
రాజ్ఞా దశరథే నాసి లబ్ధో౽మృత మి వామరైః. ౩

రాముఁడా! సీతను ఎవ్వఁ డపహరించెనో నాతోఁ డంగూడి ధనుర్ధరుఁడ వై పరమర్షులతోఁ డ్వడ నాపాపాత్ముని వెదకుము. ౧౨

సముద్రంబునను బర్వతంబులను వనంబులను నానావిధంబులును భయంకరాకారంబులునగు గుహలను నదులను దామరకొలంకులను సీతాదేవిని వెదకుదము. ౧౩

అట్లు సమాహితులమయి దేవలోకంబులను గంధర్వలోకంబులనుం గూడ వెదకుదము. అట్లు నీభార్య నపహరించినవాఁడు దొరకువఱకు వెదకుచుందము. ౧౪

కోసలదేశరాజుఁడవగు రాముఁడా! దేవతలు సామోపాయంబునను నీభార్య నొసంగరేని యటుపిమ్మట యుక్తకాలము వచ్చినందువలన యుద్ధము గావింపఁగలవు. ౧౫

రాముఁడా! సదాచారంబునను సామోపాయంబునను వినయంబునను నయంబునను సీత దొరకకపోవునేని యంతమీఁదఁ గాంచనపుంఖంబులును మహేంద్రుని వజ్రమువంటివియు నగు బాణంబులచే నాశంబు గావింపుము. అని లక్ష్మణుఁడు రామునితోఁ జెప్పెను. ౧౬

ఇది యఱువదియైదవసర్గము.

---

## అఱువదియాఱవసర్గము.

అంత నట్లు పరమదుఃఖితుఁడై యనాథునివగిది విలపించుచుఁ బరమ మోహితుఁడై రోదనంబు సేయుచు నష్టహృదయుఁడై యున్న రాముని ముహూర్తమాత్రంబున నాశ్వాసించి పాదంబులఁబట్టుకొని మఱల నిట్లని చెప్పెను. ౧-౨

రాముఁడా! దేవత లమృతంబును సంపాదించినట్లు దశరథమహారాజు మహాతపస్సుచేసి గొప్పగొప్ప యాగంబులగావించి నిన్నుఁ బొందెను. ౩

తవ చైవ గుణై ర్బద్ధ స్త్వద్వియోగా న్మహీపతిః,
రాజా దేవత్వ మాపన్నో భరతస్య యథా శ్రుతమ్. ౪
యది దుఃఖ మిదం ప్రాప్తం కాకుత్స్థ! న సహిష్యసే,
ప్రాకృత శ్చాల్పసత్త్వ శ్చ ఇతరః క స్సహిష్యతి. ౫
దుఃఖితో హి భవా న్లోకాం స్తేజసా యది ధక్ష్యతే,
ఆర్తాః ప్రజా నరవ్యాఘ్ర క్వను యాస్యన్తి నిర్వృతిమ్. ౬

లోకస్వభావ ఏవైష యయాతి ర్నహుషాత్మజః,
గత శ్శక్రేణ సాలోక్య మనయ స్తం సమస్పృశత్. ౭

మహర్షి ర్యో వసిష్ఠ స్తు యః పితు ర్నః పురోహితః,
అహ్నా పుత్త్రశతం జజ్ఞే తథైవాస్య పున ర్హతమ్. ౮

యా చేయం జగతాం మాతా దేవీ లోకనమస్కృతా,
అస్యా శ్చ చలనం భూమే ర్దృశ్యతే సత్యసంశ్రవ!. ౯

యా ధర్మా జగతాం నేత్రౌ యత్ర సర్వం ప్రతిష్ఠితమ్,
ఆదిత్యచన్ద్రౌ గ్రహణ మభ్యుపేతౌ మహాబలౌ. ౧౦

సుమహా న్త్యపి భూతాని వేదా శ్చ పురుషర్షభ!,
న దైవస్య ప్రముఞ్చన్తి సర్వభూతాది దేహినః. ౧౧
శక్రాది ష్వపి దేవేషు వర్తమానౌ నయానయౌ,

దశరథమహారాజు నీదు సద్గుణంబులచే బద్ధుఁడై నీవియోగంబు సహింపఁజాలకయె దేవత్వంబు నొందెనని భరతునివలన వింటిని. ౪

రాముఁడా! నీవు యిప్పుడు సంభవించినదుఃఖమును సహింపఁజాలవేని యిఁక క్షుద్రుఁడును అల్పబలుఁడునగువాఁ డెవ్వఁడు సహింపఁగలఁడు? ౫

పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! నీవు ఇట్లు దుఃఖితుఁడవై తేజస్సుచే లోకంబు నెల్ల దహింతువేని నీతేజస్సుచేఁ బీడితులగు ప్రజలు సుఖం బెట్లు పొందగలరు? ౬

ఇట్లు ఆపదలం బొందుట లోకంబులందలి స్వభావమే; నహుషపుత్రుడగు యయాతి ఇంద్రలోకముం బొందియు అచ్చట అసూయచే నింద్రునిచే "మీరాజ్యంబున నెవ్వఁడు శ్రేష్ఠుండు" అని యడుగఁబడినవాఁడై యథార్థవాదియగుటచే నేనే శ్రేష్ఠుఁడనని చెప్పి యంత మహేంద్రునిచే నీ వాత్మశ్లాఘివి స్వర్గంబున నుండఁదగదని త్రోయఁబడి యాపదం బొందెను. ౭

ఎవ్వఁడు వసిష్ఠమహర్షి యని లోకంబులం బ్రఖ్యాతిగాంచెనో యెవ్వఁడు మనతండ్రికిఁ బురోహితుఁడో అట్టివసిష్ఠమహర్షికి ఒక్కదినంబుననే నూఱుకొడుకులు పుట్టియుండి ఆ ట్లొకదినంబుననె విశ్వామిత్రునిచే హతులైరి. ౮

సత్యప్రతిజ్ఞుఁడవగు రాముఁడా! ఏదేవి జగంబులకుఁ దల్లియు లోకనమస్కృతయునై యొప్పుచుండునో ఆభూమికింగూడఁ జలనంబు కలుగుచున్నది. ౯

ఎవ్వరు ధర్మస్వరూపులో ఎవ్వరు లోకనాయకులో ఎవ్వరియందు సమస్తమును బ్రతిష్ఠితమయియుండునో అట్టిమహాబలశాలులగు చంద్రసూర్యులకుఁగూడ గ్రహణము కలుగుచున్నది. ౧౦

పురుషశ్రేష్ఠుఁడా! మహాభూతంబులును దేవతలునుగూడ సమస్తభూతాంతర్యామియగు దైవము నతిక్రమింపఁజాలరు. ౧౧

పురుషశ్రేష్ఠుఁడవగురాముఁడా! దేవేంద్రుఁడు మొదలుగాఁగల దేవత

శ్రూయతే నరశార్దూల! న త్వం శోచితు మర్హసి. ౧౨

నష్టాయా మపి వైదేహ్యాం హృతాయా మపి చానఘ!,
శోచితుం నార్హసే వీర యథాఽన్యః ప్రాకృత స్తథా. ౧౩

త్వద్విధా నహి శోచన్తి సతతం సత్యదర్శినః,
సుమహ త్స్వపి కృచ్ఛ్రేషు రామానిర్విణ్ణదర్శనాః. ౧౪
తత్త్వతో హి నరశ్రేష్ఠ! బుద్ధ్యా సమనుచిన్తయ,
బుద్ధ్యా యుక్తా మహాప్రాజ్ఞా విజానన్తి శుభాశుభే. ౧౫

అదృష్టగుణదోషాణా మధృతానాం తు కర్మణామ్,
నాన్తరేణ క్రియాం తేషాంఫల మిష్టం ప్రవర్తతే. ౧౬

త్వమేవ హి పురా రామ! మా మేవం బహుశోఽన్వశాః,
అనుశిష్యా ద్ధి కో ను త్వా మపి సాక్షా ద్బృహస్పతిః. ౧౭
బుద్ధి శ్చ తే మహాప్రాజ్ఞ! దేవై రపి దురన్వయా,
శోకే నాభిప్రసుప్తం తే జ్ఞానం సమ్బోధయామ్యహమ్. ౧౮

దివ్యం చ మానుషం చ త్వ మాత్మన శ్చ పరాక్రమమ్,
ఇక్ష్వాకువృషభావేక్ష్య యతస్వ ద్విషతాం వధే. ౧౯

లయందుఁగూడ సుఖదుఃఖము లుండునట్లు తెలియవచ్చుచున్నది. కాఁబట్టి నీవు దుఃఖింపవలదు. ౧౨

పాపరహితుఁడవు వీరుఁడవగు రాముఁడా! సీత నశించిపోయినను అపహరింపఁబడినను నీవు మఱియొకక్షుద్రునియట్లు దుఃఖించుట యుచితము గాదు. ౧౩

రాముఁడా! ఎల్లప్పుడును సత్యంబు విడువనివారును నాశములేని వివేకముగలవారలు నగు నీయట్టివారలు ఎట్టికష్టంబులయందేని దుఃఖింపరు.

పురుషశ్రేష్ఠుఁడా! చక్కఁగా నీబుద్ధితోనే యాలోచించుకొనుము: ఈకష్టమేల సంభవించెనో నీకే తెలియవచ్చును: అబాధితంబగు బుద్ధితోఁగూడిన మహాపండితులు బుద్ధిబలంబువలనఁ దమకు రాఁబోవు మంచిచెడుగులను దెలిసికొందురు. ౧౪

పూర్వజన్మమునందు అయ్యైఫలములఁగల్గించునట్టి కర్మంబులం జేసియున్నంగాని, యిప్పుడు ఆయాఫలములు అనుభవమునకు రావు. ఆకర్మముల గుణదోషములు మనకు సాక్షాత్తుగాఁ దెలియవు. ఇట్టివని నిశ్చయింప నశక్యములు: ఫలానుభవముచేతమాత్రమె యూహింపఁదగినవి. ౧౫

రాముఁడా! నీవే మున్ను నాకీసంగతులన్నియు బహువిధముగాబోధించియున్నావు. సాక్షాద్బృహస్పతి యయినను నీకెవ్వఁడు చెప్పఁగలఁడు?

మహాపండితుఁడవగు రాముఁడా! నీబుద్ధిని దేవతలుగూడఁ దెలిసికొనఁజాలరు; అయితే నీజ్ఞానమిప్పుడు దుఃఖముచే మఱుఁగుపడియున్నది కావున నేను దాని జ్ఞాపకపఱచుచున్నాను గాని వేఱుగాదు. ౧౬

ఇక్ష్వాకువంశమునందుఁ బుట్టినవారలలో శ్రేష్ఠుఁడవగు రాముఁడా! నీవు స్వర్గమునందలి దేవగంధర్వాదిప్రాణివర్గమును మనుష్యలోకంబునందలి బ్రాహ్మణక్షత్రియాదిప్రాణివర్గంబును అవధ్యమగుటను సమస్తలోకసంహారసమర్థంబగు నీపరాక్రమంబునుం జూచి శత్రువుల వధించుటకుఁ బ్రయత్నింపుము. ౧౭

కిం తేన సర్వనాశేన కృతేన పురుషర్షభ!,
త మేవ త్వం రిపుం పాపం విజ్ఞా యోద్ధర్తు మర్హసి. ౨౦

ఇతి శ్రీమదరణ్యకాణ్డే షట్షష్టితమ స్సర్గః. ౬౬.

---

## సప్తషష్టితమ స్సర్గః.

పూర్వజోఽప్యుక్తమాత్ర స్తు లక్ష్మణేన సుభాషితమ్,
సారగ్రాహీ మహాసారం ప్రతిజగ్రాహ రాఘవః. ౧

సన్నిగృహ్యా మహాబాహుః ప్రవృత్తం కోప మాత్మనః,
అవష్టభ్య ధను శ్చిత్రం రామో లక్ష్మణ మబ్రవీత్.
కిం కరిష్యావహే వత్స! క్వవా గచ్ఛావ లక్ష్మణ!,
కే నోపాయేన గచ్ఛేయం సీతా మితి విచిన్తయ. ౩

తం తథా పరితాపార్తం లక్ష్మణో రామ మబ్రవీత్,

ఇద మేవ జనస్థానం త్వ మన్వేషితు మర్హసి. ౪
రాక్షసై ర్బహుభిః కీర్ణం నానాద్రుమలతాయుతమ్,
స న్తీహ గిరిదుర్గాణి నిర్దరాః కన్దరాణిచ. ౫
గుహా శ్చ వివిధా ఘోరా నానామృగగణాకులాః,
ఆవాసాః కిన్నరాణాం చ గన్ధర్వభవనాని చ. ౬

తాని యుక్తో మయా సార్ధం త్వమన్వేషితు మర్హసి,
త్వద్విధా బుద్ధిసమ్పన్నా మహాత్మానో నరర్షభ!. ౭
ఆపత్సున ప్రకమ్పన్తే వాయువేగై రి వాచలాః,

పురుషశ్రేష్ఠుఁడా! ఆరాక్షసుఁడు సీతను మాత్రమెగాదు. ఇంక నేమిచేసినను ఏమికాఁగలదు? నీవు పాపిష్ఠుఁడగు ఆశత్రువుని తెలిసికొని వధింపుము. అని లక్ష్మణుఁడు రామునితోఁ జెప్పెను. ౨౦

ఇది యఱువదియాఱవసర్గము.

---

## అఱువదియేడవ సర్గము.

రాముఁడు జ్యేష్ఠుఁడైనను సారగ్రాహి యగుటవలనఁ దమ్ముఁడగు లక్ష్మణుఁడు సారయుక్తంబును యుక్తియుక్తంబు నగు నీమాటను జెప్పఁగానే యంగీకరించెను. ౧

మహాబాహుఁడగు రాముఁడు తనకుఁ బుట్టినకోపమును నిగ్రహించుకొని కాంచనచిత్రంబగు ధనుస్సుపై నానుకొని లక్ష్మణునితో నిట్లనియెను.

లక్ష్మణుఁడా! ఏమిచేయుదము? ఎచ్చటికిఁ బోవుదము? సీతను బొందు నుపాయమేదో ఆలోచింపుము. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౩

లక్ష్మణుఁ డట్లు పరమదుఃఖితుఁడైయున్న రాముం జూచి యిట్లని చెప్పెను.

నీవు పెక్కండ్రరాక్షసులతోఁ గూడినదియు నానావిధరమణీయవృక్షలతలతో నొప్పుచున్నదియునగు నీజనస్థానమునే వెదకవలయును. ౪

ఈజనస్థానమునందు దుర్గమప్రదేశములును విరిసినతాళ్లనడుమనుండు ప్రదేశములును పాషాణసంధులును నానావిధంబులును నానావిధక్రూరమృగంబులతోఁ గూడియుండుటచే భయంకరములునగు గుహలును గిన్నరగృహములును గంధర్వగృహములును ఉన్నవి. ౫-౭

ఆస్థలంబుల నన్నిఁటిని నీవు నాతోఁగూడ జక్కఁగా వెదకుము.

పురుషోత్తముఁడవగు రాముఁడా! నీయట్టిబుద్ధిమంతులును మహాత్ములంనగువారలు వాయువేగంబునఁ బర్వతంబులు చలింపనట్లు ఎట్టి యాపదలందేని భయపడరు. అని లక్ష్మణుఁడు రామునితోఁ జెప్పెను. ౮

ఇ త్యుక్త్వా స్తద్వనం సర్వం విచచార సలక్ష్మణః. ౮
క్రుద్ధో రామ శ్శరం ఘోరం సంధాయ ధనుషి క్షురమ్,

తతః పర్వతకూటాభం మహాభాగం ద్విజోత్తమమ్. ౯
దదర్శ పతితం భూమౌ క్షతజార్ద్రం జటాయుషమ్,

తం దృష్ట్వా గిరిశృఙ్గాభం రామో లక్ష్మణ మబ్రవీత్. ౧౦

అనేనసీతా వైదేహీ భక్షితా నాత్ర సంశయః,

గృధ్రరూప మిదం రక్షో వ్యక్తం భవతి కాననే. ౧౧
భక్షయిత్వా విశాలాక్షీ మాస్తే సీతాం యథాసుఖమ్,

ఏనం వధిష్యే దీప్తాస్యై ర్ఘోరై ర్బాణై రజిహ్మగైః. ౧౨

ఇత్యుక్త్వాఽభ్యపతద్గృధ్రం సంధాయ ధనుషి క్షురమ్,
క్రుద్ధో రామ స్సముద్రాన్తాం కమ్పయ న్నివ మేదినీమ్. ౧౩

తం దీనం దీనయా వాచా సఫేనం రుధిరం వమన్,
అభ్యభాషత పక్షీ తు రామం దశరథాత్మజమ్. ౧౪
యా మోషధి మివాఽఽయుష్మ న్నన్వేషసి మహావనే,
సా దేవీ మమ చ ప్రాణా రావణే నోభయం హృతమ్. ౧౫

త్వయా విరహితా దేవీ లక్ష్మణేన చ రాఘవ!,
హ్రియమాణా మయా దృష్టా రావణేన బలీయసా. ౧౬

రాముఁడు ఇట్లు లక్ష్మణునిమాటను విని కోపంబున భయంకరంబగు నర్ధచంద్రాకారబాణంబు వింటంగూర్చి లక్ష్మణునితోడంగూడి యవ్వనం బంతయుఁ దిరిగెను. ౮

అంత రాముఁడు పర్వతశిఖరాకారుఁడును నెత్తుటందోఁగుచు నేలం బడియున్నవాడును బక్షిశ్రేష్ఠుఁడును మహాభాగుఁడు నగు జటాయువుఁ జూచెను. ౯

రాముఁడు పర్వతశిఖరాకారుఁడగు నా జటాయువుంజూచి లక్ష్మణునితో నిట్లని చెప్పెను. ౧౦

జనకమహారాజపుత్త్రియగు సీతను ఈతఁడె భక్షించియుండును; సందేహములేదు.

ఈరాక్షసుఁడు గద్దరూపముదాల్చి యీవనంబున నున్నాడు. నిశ్చయము. విశాలంబులగు కన్నులుగల సీతనుభక్షించి సుఖంబుగాఁ గూర్చుండియున్నాఁడు. ౧౧

దేదీప్యమానంబులగు ముఖంబులుగలవియు భయంకరములును లక్ష్యంబుదప్పనివియు నగుబాణంబుల నీతని వధించెదను. అని రాముఁడు లక్ష్మణునితో జెప్పెను. ౧౨

రాముఁడు ఇట్లు చెప్పి యంత గుపితుఁడై వింట నర్ధచంద్రాకారబాణంబుఁ గూర్చి సముద్రపర్యంతంబగుభూమియంతయు బాదాఘాతంబున వడఁక నాగద్దపైకి బోయెను. ౧౩

ఆజటాయువు దుఃఖితుఁడగు దశరథమహారాజపుత్త్రుని రాముం జూచి నురుగును నెత్తురును గ్రక్కుచు దీనవాక్యంబున నిట్లని చెప్పెను. ౧౪

దీర్ఘాయుష్మంతుఁడవగు రాముఁడా! నీవు ఎవ్వతెను దివ్యౌషధినివలె మహావనంబున వెదకుచున్నావో ఆసీతాదేవిని నాప్రాణంబులను రెంటిని రావణుఁ డపహరించెను. ౧౫

రాముఁడా! సీతాదేవి నీవును లక్ష్మణుఁడును లేకుండునప్పుడు బలవంతుఁడగు రావణునిచేత నపహరింపఁబడుచుండుటను జూచినాను. ౧౬

సీతా మభ్యవపన్నోఽహం రావణశ్చ రణే మయా,
విధ్వంసితరథ శ్ఛత్ర పాతితో ధరణీతలే. ౧౭
ఏత దస్య ధను ర్భగ్న మేత దస్య శరావరమ్,
అయ మస్యరథో రామ! భగ్న స్సాఙ్గ్రామికో మయా. ౧౮

అయం తు సారథి స్తస్య మత్పక్షనిహతో యుధి,

పరిశ్రాన్తస్య మే పక్షౌ ఛిత్త్వా ఖడ్గేన రావణః. ౧౯
సీతా మాదాయ వైదేహీ ముత్పపాత విహాయసమ్,
రక్షసా నిహతం పూర్వం న మాం హన్తుం త్వ మర్హసి ౨౦

రామ స్తస్య తు విజ్ఞాయ బాష్పపూర్ణముఖ స్తదా,
ద్విగుణీకృత తాపార్త స్సీతాసక్తాం ప్రియాం కథామ్. ౨౧

గృధ్రరాజం పరిష్వజ్య పరిత్యజ్య మహ ద్ధనుః,
నిపపా తావశో భూమౌ రురోద సహలక్ష్మణః. ౨౨

ఏక మేకాయనే దుర్గే నిశ్శ్వస న్తం కథంచన,
సమీక్ష్య దుఃఖితతరో రామ స్సౌమిత్రి మబ్రవీత్. ౨౩

రాజ్యా ద్భ్రంశో వనే వాస స్సీతా నష్టా హతో ద్విజః,
ఈదృ శీయం మ మాలక్ష్మీ ర్నిర్దహే దపి పావకమ్. ౨౪
సంపూర్ణ మపి చే దద్య ప్రవిశేయం మహోదధిమ్,
సోఽపి నూనం మమాలక్ష్మ్యా విశుష్యే త్సరితాం పతిః. ౨౫

నే నంత సీతయొద్దకుఁబోయి యుద్ధంబున ఈస్థలంబుననే రావణుని రథంబును భగ్నంబు గావించి యతని నేలపయిఁబడఁ ద్రోసితిని. ౧౮

రాముఁడా! నాచే విఱువఁబడిన రావణునిధనుస్సు ఇదిగో యున్నది; కవచము ఇదిగో; యుద్ధంబున నాచే భగ్నమయిన రావణునియుద్ధార్హరథం బిదిగో చూడుము. ౧౯

ఇతఁడు రావణునిసారథి. ఇతఁడు యుద్ధంబున నాపక్షఘాతంబునం గూలెను.

రావణుఁడు నే నలసియుండఁగా నాపక్షంబులను ఖడ్గంబుచే ఖండించి జనకమహారాజపుత్త్రియగు సీతం దీసికొని యాకాశమార్గంబున బోయెను.

మున్ను నేనొకమాఱు రాక్షసునిచే వధింపఁబడియున్నాను. నీవు మఱల నన్ను వధింపకుము. అని జటాయువు రామునితోఁ జెప్పెను. ౨౦

అప్పుడు రాముఁడు జటాయువుచెప్పిన సీతనుగుఱించిన ప్రియమైన మాటనంతయు విన్నంతనే ముఖంబు నిండఁ గన్నీళ్లు గాఱ రెండింతల దుఃఖమునొంది యార్తుఁడయ్యెను ౨౧

రాముఁడంత జటాయువుం గవుఁగిలించుకొని చేతనుండుమహాధనుస్సును జాఱవిడిచి దుఃఖపరవశుఁడై నేలంబడి లక్ష్మణునితోఁగూడ రోదనంబు గావించెను. ౨౨

జటాయువు ఏకాకిగా మిక్కిలియాసన్నమయిన దారియందు దుర్గమప్రదేశంబున హతుఁడై యతిప్రయాసంబున నిట్టూర్పులు పుచ్చుచుండుటం జూచి రాముఁడు మతియుఁ దుఃఖితుఁడై లక్ష్మణుంజూచి యిట్లని చెప్పెను. ౨౩

రాజ్యభ్రంశము. వనవాసము సీత యపహరింపఁబడుట, జటాయువు హతుఁడగుట, ఇట్టినాదౌర్భాగ్యము అగ్నిహోత్త్రునైనను దహించును. ౨౪

ఇప్పుడు, నేను నిండియున్నసముద్రములోఁ బ్రవేశించినను నదీపతి యగు సముద్రముఁగూడ నాదౌర్భాగ్యముచే ఎండిపోవును. ఇది నిశ్చయము.

నాస్త్యభాగ్యతరో లోకే మత్తోఽస్మిం త్సచరాచరే,
యేనేయం మహతీ ప్రాప్తా మయా వ్యసనవాగురా. ౨౬

అయం పితృవయస్యో మే గృధ్రరాజో జరాన్వితః,
శేతే వినిహతో భూమౌ మమ భాగ్యవిపర్యయాత్. ౨౭

ఇత్యేవ ముక్త్వా బహుశో రాఘవ స్సహలక్ష్మణః,
జటాయుషం చ పస్పర్శ పితృస్నేహం విదర్శయన్. ౨౮

నికృత్తపక్షం రుధిరావసిక్తం
స గృధ్రరాజం పరిరభ్య రామః,
క్వ మైథిలీ ప్రాణసమా మమేతి
విముచ్య వాచం నిపపాత భూమౌ. ౨౯

ఇతి శ్రీమదరణ్యకాణ్డే సప్తషష్టితమ స్సర్గః. ౬౭.

---

## అష్టషష్టితమ స్సర్గః.

రామ స్సమ్ప్రేక్ష్య తం గృధ్రం భువి రౌద్రేణ పాతితమ్,
సౌమిత్రిం మిత్రసమ్పన్న మిదం వచన మబ్రవీత్. ౧
మమాయం నూన మర్థేషు యతమానో విహఙ్గమః,
రాక్షసేన హత స్సంఖ్యే ప్రాణాం స్త్యక్ష్యతి దుస్త్యజాన్. ౨
అయ మస్య శరీరేఽస్మి న్ప్రాణో లక్ష్మణ! విద్యతే,
తథాహి స్వరహీనోఽయం విక్లబ స్సముదీక్ష్యతే. ౩
జటాయో! యది శక్నోషి వాక్యం వ్యాహరితుం పునః,
సీతామాఖ్యాహి భద్రం తే వధ మాఖ్యాహి చాత్మనః. ౪

ఇట్టి పరంపరగానుండు దుఃఖంబు వలలోఁ జిక్కియున్న నాకన్నను అధికదౌర్భాగ్యుఁడు జంగమస్థావరసహితంబగు నీప్రపంచంబున నెచ్చటను లేఁడు. ౨౨

నాతండ్రిగారికి మిత్త్రుఁడును వృద్ధుఁడునగు నీజటాయువు నాదౌర్భాగ్యమువలన నిహతుఁడై నేలంబడియున్నాఁడు. అని రాముఁడు లక్ష్మణుని తోఁ జెప్పెను. ౨౩

రాముఁడు, ఈప్రకారమున ననేకవిధంబులం జెప్పి లక్ష్మణునితోఁ గూడఁ దమతండ్రిపైఁ జూపవలసిన స్నేహగౌరవంబులఁ జూపుచు జటాయువు దేహంబంతయుఁ దడవెను. ౨౪

ఆరాముఁడు అట్లు ఛిన్నపక్షుఁడై నెత్తుటఁ దోఁగుచున్న జటాయువుం గవుఁగిలించుకొని నాప్రాణసమానురాలైన సీత యెచ్చట? అని చెప్పి శోకపరవశుఁడై నేలంబడెను. ౨౫

ఇది యఱువదియేడవసర్గము.

---

## అఱువదియెనిమిదవసర్గము.

రాముఁడు భయంకరుఁడగు రావణునిచేత వధింపఁబడి నేలంబడియున్న జటాయువుంజూచి తనకుఁబరమమిత్త్రుఁడగు లక్ష్మణునితోనిట్లని చెప్పెను.

ఈజటాయువు నాకార్యము నిమిత్తమయి యుద్ధంబున రాక్షసునిచే హతుఁడై విడువరాని ప్రాణంబుల నిప్పుడు విడువఁగలఁడు. ౨

లక్ష్మణుఁడా! ఈజటాయువుదేహమునందు ఇంకను బ్రాణంబున్నది, ఇతఁడు హీనస్వరుఁడుగాను బలవిహీనుఁడుగాను అగపడుచున్నాఁడు. ౩

జటాయువా! నీవు మాటచెప్పుటకు శక్తిగలదేని సీతసంగతి చెప్పుము. నీకుమంగళమగుఁగాక! నిన్ను రాక్షసుఁడు వధించినసంగతియుం జెప్పుము.

కింనిమిత్తోఽహర త్సీతాం రావణ స్తస్య కిం మయా,
అపరాధం తు యం దృష్ట్వా రావణేన హృతా ప్రియా. ౫
కథం తచ్చన్ద్రసంకాశం ముఖ మాసీ న్మనోహరమ్,
సీతయా కాని చోక్తాని తస్మిన్కాలే ద్విజోత్తమ!. ౬

కథంవీర్యః కథంరూపః కింకర్మా సచ రాక్షసః,
క్వ చాస్య భవనం తాత! బ్రూహి మే పరిపృచ్ఛతః. ౭
త ముద్వీక్ష్యాథ దీనాత్మా విలపన్త మన న్తరమ్,
వాచాఽతిసన్నయా రామం జటాయు రిద మబ్రవీత్. ౮
హృతా సా రాక్షసేన్ద్రేణ రావణేన విహాయసా,
మాయా మాస్థాయ విపులాం వాతదుర్దినసంకులామ్. ౯

పరిశ్రాన్తస్య మే తాత! పక్షౌ ఛిత్వా స రాక్షసః,
సీతా మాదాయ వైదేహీం ప్రయాతో దక్షిణాం దిశమ్. ౧౦
ఉపరుద్ధ్యన్తి మే ప్రాణా దృష్టిర్భ్రమతి రాఘవ!,
పశ్యామి వృక్షాం త్సౌవర్ణా నుశీరకృతమూర్ధజాన్. ౧౧

యేనయాతి ముహూర్తేన సీతా మాదాయ రావణః,
విప్రణష్టం ధనం క్షిప్రం తత్స్వామీ ప్రతిపద్యతే. ౧౨

విన్దో నామ ముహూర్తోఽయం సచ కాకుత్స్థ! నాబుధత్,

త్వత్ప్రియాం జానకీం హృత్వా రావణో రాక్షసేశ్వరః. ౧౩
ఝషవ ద్బడిశం గృహ్య క్షిప్ర మేవ వినశ్యతి,

రావణుఁడు ఎందుకుఁగా సీతనపహరించెను? నాప్రియురాలను రావణుఁడు హరించునంతటి యపరాధమును నేనేమి యతనికిఁ జేసినాను? ౫

పక్షిశ్రేష్ఠుఁడవగు జటాయువా! చంద్రబింబమువంటిదియు మనోహరంబునగు నాసీతయొక్క మోము అప్పు డెట్లుండినది? అప్పుడు సీతయేమిచెప్పినది? ౬

నాయనా! ఆరాక్షసుని పరాక్రమ మెట్టిది? అతనిరూప మెట్టిది? అతనికార్యము లెట్టివి? అతనిస్థాన మెచ్చట? నే నడిగెదను? చెప్పుము ౭

అంత జటాయువు దీనుఁడై నిరంతరముగా విలపించుచున్న యారాముఁజూచి మిక్కిలియు హీనమయిన స్వరంబున నిట్లని చెప్పెను. ౮

రాక్షసేశ్వరుఁడగు రావణుఁడు మాయచేఁ బెనుగాలియు మేఘంబులను బుట్టించి చీఁకటిక్రమ్మునట్లుచేసి యాకాశమార్గంబున సీతను హరించుకొనిపోయెను. ౯

నాయనా! ఆరావణుఁడు నే నలసియుండునప్పుడు నా రెక్కలం దెగవేసి జనకమహారాజపుత్రియగు సీతం దీసికొని దక్షిణదిశం బట్టిపోయెను.

రాముఁడా! నాప్రాణంబులు నిరోధింపబడుచున్నవి; దృష్టి తిరుగుడునొందుచున్నది; వట్టివేళ్ళవంటి వెండ్రుకలుగల బంగారువృక్షంబులు నాకంటికి అగపడుచున్నవి (మృతిఁబొందఁబోవుకాలమున బంగారువృక్షంబు లగపడునని ప్రసిద్ధి.) ౧౧

రావణుఁడు ఏముహూర్తమునందు సీతను హరించుకొనిపోయెనో ఆముహూర్తంబున నశించినసొమ్ము శీఘ్రంబుననె స్వామియొద్దకుఁ జేరఁగలదు; ఇది దానిస్వభావము. ౧౨

రాముఁడా! ఈముహూర్తమునకు విందమనిపేరు. ఇది రావణునకుఁ దెలియలేదు కావున నీవు సీతను శీఘ్రంబుననె పొందఁగలవు.

నీప్రియురాలగు సీత నపహరించిన రాక్షసేశ్వరుఁడగు రావణుఁడు గాలమును మ్రింగినమత్స్యమువలె శీఘ్రముననె వినాశంబు నొందఁగలఁడు.

నచ త్వయా వ్యథా కార్యా జనకస్య సుతాంప్రతి. ౧౪
వైదేహ్యా రంస్యసే క్షిప్రం హత్వా తం రాక్షసం రణే,

అసమ్మూఢస్య గృధ్రస్య రామం ప్రత్యనుభాషతః. ౧౫
ఆస్యాత్సుస్రావ రుధిరం మ్రియమాణస్య సామిషమ్,

పుత్రో విశ్రవస స్సాక్షాద్భ్రాతా వైశ్రవణస్య చ. ౧౬
ఇత్యుక్త్వా దుర్లభాన్ప్రాణా న్ముమోచ పతగేశ్వరః,

బ్రూహి బ్రూహీతి రామస్య బ్రువాణస్య కృతాఞ్జలేః. ౧౭
త్యక్త్వా శరీరం గృధ్రస్య జగ్ముః ప్రాణా విహాయసమ్,
స నిక్షిప్య శిరో భూమౌ ప్రసార్య చరణౌ తదా. ౧౮
విక్షిప్య చ శరీరం స్వం పపాత ధరణీతలే,
తం గృధ్రం ప్రేక్ష్య తామ్రాక్షం గతాసు మచలోపమమ్. ౧౯
రామ స్సుబహుభి ర్దుఃఖై ర్దీన స్సౌమిత్రి మబ్రవీత్,
బహూని రక్షసాం వాసే వర్షాణి వసతా సుఖమ్. ౨౦
అనేన దణ్డకారణ్యే విశీర్ణ మిహ పక్షిణా,

అనేకవార్షికో యస్తు చిరకాలసముత్థితః. ౨౧
సోఽయ మద్య హత శ్శేతే కాలో హి దురతిక్రమః,

పశ్య లక్ష్మణ! గృధ్రోఽయ ముపకారీ హత శ్చ మే. ౨౨
సీతా మభ్యవపన్నో వై రావణేనబలీయసా;

గృధ్రరాజ్యం పరిత్యజ్య పితృపైతామహం మహత్. ౨3

జనకమహారాజపుత్రియగు సీతంగుఱించి నీ వెంతమాత్రము దుఃఖింప వలదు. నీవు యుద్ధంబున నారావణుని వధించి శీఘ్రంబున సీతంబొంది రమింపఁగలవు. అని జటాయువు రామునితోఁ జెప్పెను. ౧౪

అంతవఱకుఁ దెలివితప్పక రామునితోఁ బ్రత్యుత్తరంబులు చెప్పుచున్న యాజటాయువు మరణంబు నొందునప్పుడు నోటనుండి మాంససహితంబగు నెత్తురు వెడలెను. ౧౫

జటాయువు "రావణుఁడు విశ్రవసుని కొడుకు కుబేరునకుఁ దమ్ముఁడు" అనిచెప్పి యాపై నేమియు నుడువకయె దుర్లభంబులగు ప్రాణంబుల విడిచెను. ౧౬

రాముఁడు చేమోడ్పుగీలించి చెప్పుమని యడుగుచుండఁగానే జటాయువుప్రాణంబులు మేనువిడిచి యాకాశంబు నొందినవి. ౧౭

అప్పుడు జటాయువు తల నేలపై నునిచి కాళ్లుసాఁచి దేహమంతయు నెగురవేయుచు బ్రాణంబులు విడిచి నేలంబడెను. ౧౮

రాముఁడు ఎఱ్ఱనికన్నులతోఁ జచ్చిపడియున్న పర్వతాకారుఁడగు నాజటాయువుంజూచి పరమదుఃఖితుఁడై లక్ష్మణునితో నిట్లని చెప్పెను. ౧౯

ఈజటాయువు రాక్షసులయునికిపట్టైన యీదండకారణ్యంబునం బెక్కుసంవత్సరములు సుఖంబున నిర్భయంబుగానుండి యిప్పుడు నాకొఱకుఁగా నిహతుఁడై కూలెను. ౨౦

ఎవ్వఁడు పెక్కువేలవర్షంబుల వయస్సుగలిగి బహుకాలముగా వృద్ధినొందుచుండెనో అట్టి జటాయువుగూడ ఇప్పుడు హతుఁడై పరుండియున్నాఁడు. కాలము నతిక్రమింప నేరికి నలవిగాదు. ౨౧

లక్ష్మణుఁడా! ఈజటాయువు నా కుపకారముచేయవలెనని సీతను రక్షింపఁబోయి బలవంతుఁడగు రావణునిచే వధింపఁబడియున్నాఁడు చూడుము. ౨౨

పక్షిరాజుఁడగు నీజటాయువు తండ్రితాతలనాటనుండి వచ్చినగొప్ప

మమ హేతో రయం ప్రాణా న్ముమోచ పతగేశ్వరః,

సర్వత్ర ఖలు దృశ్యన్తే సాధవో ధర్మచారిణః. ౨౪
శూరా శ్శరణ్యా స్సౌమిత్రే! తిర్యగ్యోనిగతే ష్వపి,
సీతాహరణజం దుఃఖం న మే సౌమ్య!తథాగతమ్. ౨౫
యథావినాశో గృధ్రస్య మత్కృతేచ పరన్తప!,

రాజా దశరథ శ్శ్రీమా న్యథా మమ మహాయశాః. ౨౬
పూజనీయ శ్చ మాన్య శ్చ తథాఽయం పతగేశ్వరః,
సౌమిత్రే! హర కాష్ఠాని నిర్మథిష్యామి పావకమ్. ౨౭
గృధ్రరాజం దిధక్షామి మత్కృతే నిధనం గతమ్,

నాథం పతగలోకస్య చితా మారోప్య రాఘవ!. ౨౮
ఇమం ధక్ష్యామి సౌమిత్రే!హతం రౌద్రేణ రక్షసా,

యా గతి ర్యజ్ఞశీలానా మాహితాగ్నే శ్చ యా గతిః. ౨౯
అపరావర్తినాం యా చ యా చ భూమిప్రదాయినామ్,
మయా త్వం సమనుజ్ఞాతో గచ్ఛ లోకా ననుత్తమాన్. ౩౦
గృధ్రరాజ! మహాసత్త్వ! సంస్కృత శ్చ మయా వ్రజ,

ఏవ ముక్త్వా చితాం దీప్తా మారోప్య పతగేశ్వరమ్. ౩౧
దదాహ రామో ధర్మాత్మా స్వబన్ధు మివ దుఃఖితః,

రామోఽథ సహసౌమిత్రి ర్వనం గత్వా సవీర్యవాన్. ౩౨

గృధ్రరాజ్యంబువిడిచి నానిమిత్తంబై యుద్ధంబుగావించి ప్రాణంబులు విడిచెను. ౨౩

లక్ష్మణుఁడా! అంతటను మృగపక్షిజాతులందుఁగూడ సాధువులును ధార్మికులును శూరులును శరణ్యులు నగువార లగపడుచున్నారు. ౨౪

శత్రువులఁ దపింపఁజేయునట్టివాఁడ వగులక్ష్మణుఁడా! నానిమిత్తముగా నీజటాయువు మరణంబు నొందుటవలనం గలిగినంతటిదుఃఖము నాకు సీతాహరణంబునంగూడఁ గలుగలేదు. ౨౫

నాకు శ్రీమంతుఁడును మహాకీర్తిశాలియునగు దశరథమహారాజు ఎట్లో అట్లు ఈజటాయువుగూడ పూజ్యుఁడును మాన్యుఁడు నగుచున్నాఁడు.

లక్ష్మణుఁడా! కట్టెలందెమ్ము; మథనంబున నగ్నిని సంపాదించి నానిమిత్తమయి మరణంబునొందిన జటాయువునకు దహనసంస్కారము గావించెదను. ౨౬

రఘువంశమునందుఁ బుట్టినలక్ష్మణుఁడా! భయంకరాకారుఁడగు రాక్షసునిచే నిహతుఁడయిన పక్షిరాజుఁడగు నీజటాయువును జితిపై నునిచి దహించెదను. ౨౭

మహాబలుఁడవగు జటాయువా! యాగములుసేయువార లేలోకముఁ బొందుదురో పంచాగ్నిమధ్యంబునఁ దపంబుసేయునట్టి వానప్రస్థుఁ డేలోకంబునకుఁ బోవునో సన్యాసులు ఏలోకముఁ బొందుదురో భూదానము సేయుచుండువారలకు ఏలోకము గలుగునో నీవు నాచే సంస్కృతుఁడవై నాయనుమతిం బొందినవాఁడవై యుత్తమంబులగు నాలోకంబుల నన్నిటినిం బొందుము. అని రాముఁడు చెప్పెను. ౨౮,౩౦

ధర్మాత్ముఁడగు రాముఁడు ఈప్రకారమునం జెప్పి జటాయువును జితిపై నునిచి దుఃఖితుఁడై తనబంధువునుంబోలె మంత్రపూర్వకంబుగా దహించెను. ౩౧

అంత మహాపరాక్రమశాలియగు రాముఁడు లక్ష్మణునితోఁగూడ వడ

స్థూలాన్ హత్వా మహారోహీ ననుతస్తార తం ద్విజమ్,

రోహిమాంసాని చోత్కృత్య పేశీకృత్య మహాయశాః. 33
శకునాయ దదౌ రామో రమ్యే హరితశాద్వలే,
యత్తత్ప్రేతస్య మర్త్యస్య కథయన్తి ద్విజాతయః. 34
తత్స్వర్గగమనం తస్య పిత్ర్యం రామో జజాప హ,

తతో గోదావరీం గత్వా నదీం నరవరాత్మజౌ 35
ఉదకం చక్రతుస్తస్మై గృధ్రరాజాయ తౌ వుభౌ,
శాస్త్రదృష్టేన విధినా జలే గృధ్రాయ రాఘవౌ. 36
స్నాత్వా తౌ గృధ్రరాజాయ ఉదకం చక్రతుస్తదా,

స గృధ్రరాజః కృతవాన్ యశస్కరం
సుదుష్కరం కర్మ రణే నిపాతితః,
మహర్షికల్పేనచ సంస్కృతస్తదా
జగామ పుణ్యాం గతిమాత్మనశ్శుభామ్. 37
కృతోదకౌ తావపి పక్షిసత్తమే
స్థిరాం చ బుద్ధిం ప్రణిధాయ జగ్మతుః,
ప్రవేశ్య సీతాధిగమే తతో మనో
వనం సురేన్ద్రావివ విష్ణువాసవౌ. 38
ఇతి శ్రీమదరణ్యకాణ్డేఅష్టషష్టితమస్సర్గః.

ఏకోనసప్తతితమస్సర్గః.

కృత్వైవ ముదకం తస్మై ప్రస్థితౌ రామలక్ష్మణౌ,
అవేక్షన్తౌ వనే సీతాం పశ్చిమాం జగ్మతుర్దిశమ్. 1

చికిఁబోయి పెద్దకేసరిమృగంబులం జంపి తెచ్చి జటాయువునకుఁ బిండప్ర
దానము సేయుటకై దర్భలఁ బఱచెను. ౩౨

మహాయశుఁడగు రాముఁడు ఆకేసరిమాంసములం దీసి పిండములుగాఁ
జేసి రమణీయంబగు పచ్చికలనేలపై జటాయువునకు ఒసంగెను. ౩౩

దేని బ్రాహ్మణులు మరణము నొందిన మనుష్యునకు స్వర్గప్రదమని జపిం
తురో అట్టి పితృదేవతాకమయిన మంత్రమును జటాయువునకుఁగా రాముఁ
డు జపించెను. ౩౪

రాచకొమరులగు నా రామలక్ష్మణులు ఇద్దఱు గోదావరీనదికిం బోయి
గృధ్రరాజుఁడగు జటాయువునకు జలతర్పణంబు గావించిరి. ౩౫

అప్పుడు రామలక్ష్మణులు యథాశాస్త్రముగ జటాయువు నుద్దేశించి
గోదావరీజలంబున స్నానము గావించి జటాయువునకు జలతర్పణము గావిం
చిరి. ౩౬

ఆజటాయువు సీతానిమిత్తమయి యుద్ధము చేసి హతుఁ డగుటవలన
శూరుఁ డనియు నెవ్వరికిం జేయనలవి గాని కార్యముం జేసినవాఁడనియుఁ
గీర్తి నొందెను. మహర్షి తుల్యుఁ డగు రామునిచే సంస్కారము నొందుటం
జేసి శాశ్వతంబును బవిత్రమునగు పుణ్యలోకంబును బొందెను. ౩౭

దేవనాథులగు విష్ణుదేవేంద్రులం బోలెనున్న యారామలక్ష్మణులును
జటాయువునకుం బిండోదకములు చేసి జటాయువు చెప్పినమాటయందు దృఢ
మయిన నమ్మకము గలవారలయి యంత సీతను వెదకుటయందు మనస్సునుంచి
వనంబునకుఁ బోయిరి. ౩౮

ఇది యఱువదితొమ్మిదవ సర్గము.

---

## అఱువదితొమ్మిదవసర్గము.

రామలక్ష్మణులు అట్లు జటాయువునకు జలతర్పణాదులు గావించి
బయలు దేఱి వనంబున సీతను వెదకుచు నిఋతిదిక్కుం బట్టి పోయిరి. ౧

తౌ దిశం దక్షిణాం గత్వా శరచాపాసిధారిణౌ,
అవిప్రహత మైక్ష్వాకౌ పన్థానం ప్రతిపేదతుః. ౨
గుల్మై ర్వృక్షైశ్చ బహుభి ర్లతాభిశ్చ ప్రవేష్టితమ్,
ఆవృతం సర్వతో దుర్గం గహనం ఘోరదర్శనమ్ ౩

వ్యతిక్రమ్యతు వేగేన వ్యాళసింహనిషేవితమ్,
సుభీమం తన్మహారణ్యం వ్యతియాతౌ మహాబలౌ. ౪

తతః పరం జనస్థానా త్త్రిక్రోశం గమ్య రాఘవౌ,
క్రౌఞ్చారణ్యం వివిశతు ర్గహనంతౌ మహౌజసౌ. ౫
నానామేఘఘనప్రఖ్యం ప్రహృష్ట మివ సర్వతః,
నానాపక్షిగణై ర్జుష్టం నానావ్యాళమృగై ర్యుతమ్. ౬
దిదృక్షమాణౌ వై దేహీం తద్వనంతౌ విచిక్యతుః,
తత్ర తత్రావతిష్ఠన్తౌ సీతాహరణకర్శితౌ. ౭

తతః పూర్వేణ తౌ గత్వా త్రిక్రోశం భ్రాతరౌ తదా,
క్రౌఞ్చారణ్య మతిక్రమ్య మతఙ్గాశ్రమ మన్తరా. ౮
దృష్ట్వా తు తద్వనం ఘోరం బహుభీమమృగద్విజమ్,
నానాసత్త్వసమాకీర్ణం సర్వం గహనపాదపమ్. ౯
దదృశాతే తు తౌ తత్ర దరీం దశరథాత్మజౌ,
పాతాళసమగమ్భీరాం తమసా నిత్యసంవృతామ్. ౧౦
ఆసాద్య తౌ నరవ్యాఘ్రౌ దర్యాస్తస్యావిదూరతః,
దదృశాతే మహారూపాం రాక్షసీం వికృతాననామ్. ౧౧

భయదా మల్పసత్త్వానాం బీభత్సాం రౌద్రదర్శనమ్,

ఇక్ష్వాకువంశమునందుఁ బుట్టినవారలగు నారామలక్ష్మణులు ధనుర్బాణంబులు ఖడ్గంబులును దాల్చి నిర్ఋతిమూలంబట్టిపోయి పెక్కుగుల్మంబుల చేతను వృక్షంబులచేతను లతలచేతను అంతటను నిండినదియు దుర్గమంబును భయంకరంబును ఎవ్వరిచేతను సంచరింపఁబడనిదియునగు మార్గంబుఁ బ్రవేశించిరి. ౧-౩

మహాబలశాలులగు రామలక్ష్మణులు వేగంబున వ్యాఘ్రసింహాదిక్రూరమృగంబులతోఁ గూడినదియు మహాభయంకరమునగు నాదండకారణ్యము నతిక్రమించి పోయిరి. ౪

అంత మహాపరాక్రమశాలులగు నారామలక్ష్మణులు జనస్థానంబు దాఁటి మూఁడుకోసులదూరముపోయి గహనంబగు క్రౌంచారణ్యముఁ బ్రవేశించిరి.

సీతాహరణంబునఁ బరమదుఃఖితులయియున్న యారామలక్ష్మణులు నానావిధమేఘసమూహముం బోలినదియుఁ బుష్పములచే నంతటను సంతుష్టంబయినట్లు చూపట్టుచున్నదియు నానావిధపక్షిసమూహయుక్తంబును నానావిధసర్పమృగయుక్తంబునగు నాక్రౌంచవనంబంతయు విశ్రమార్థము అచ్చటచ్చట నిలుచుచు సీతం జూడఁగోరి వెదకిరి. ౬-౮

అంత దశరథమహారాజపుత్రులగు నారామలక్ష్మణులు తూర్పుదిక్కుఁ బట్టి మూఁడుకోసులుపోయి క్రౌంచారణ్యంబు నతిక్రమించి మతంగాశ్రమ సమీపంబునభయంకరంబును భయంకరంబులగు మృగపక్షులతోఁ గూడినదియు నానావిధమృగసేవితంబును మహావృక్షంబులతో నొప్పుచున్నదియునగు నవ్వనంబుఁజూచి యచ్చట పాతాళంబువలె నతిగంభీరంబును అంధకారసంవృతంబు నగు నొక్కగుహం గనిరి. ౯,౧౦

పురుషశ్రేష్ఠులగు రామలక్ష్మణులు ఆగుహాసమీపంబునకుఁబోయి యచ్చట వికృతంబయిన రూపంబుగలదియు వికృతంబయిన నోరుగలదియునగు నొకరాక్షసిం జూచిరి. ౧౧

అంత అన్నదమ్ములగు నారామలక్ష్మణులు అల్పులకు భయంబుగలిగిం

లమ్బోదరీం తీక్ష్ణదంష్ట్రాం కరాళాం పరుషత్వచమ్. ౧౨
భక్షయన్తీం మృగా న్భీమా న్వికటాం ముక్తమూర్ధజామ్,
ప్రైక్షేతాం తౌ తత స్తత్ర భ్రాతరౌ రామలక్ష్మణౌ. ౧౩

సా సమాసాద్య తౌ వీరౌ వ్రజన్తం భ్రాతు రగ్రతః,
ఏహి రంస్యావ హేత్యుక్త్వా సమాలమ్బత లక్ష్మణమ్. ౧౪
ఉవాచ చైనం వచనం సౌమిత్రి ముపగూహ్య సా,
అహం త్వయోముఖీ నామ లాభ స్తే త్వ మసి ప్రియః. ౧౫
నాథ! పర్వతకూటేషు నదీనాం పులినేషు చ,
ఆయుశ్శేష మిమం వీర! త్వం మయా సహ రంస్యసే. ౧౬

ఏవ ముక్త స్తు కుపితః ఖడ్గ ముద్ధృత్య లక్ష్మణః,
కర్ణనాసే స్తనౌ చాస్యా నిచకర్తారిసూదనః. ౧౭

కర్ణనాసే నికృత్తే తు విస్వరం సా వినద్య చ,
యథాగతం ప్రదుద్రావ రాక్షసీ భీమదర్శనా. ౧౮
తస్యాం గతాయాం గహనం విశన్తౌ వన మోజసా,
ఆసేదతు రమిత్రఘ్నౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ. ౧౯

లక్ష్మణ స్తు మహాతేజా స్సత్త్వవాన్ శీలవాన్ శుచిః,
అబ్రవీ త్ప్రాఞ్జలి ర్వాక్యం భ్రాతరం దీప్తతేజసమ్. ౨౦

స్పన్దతే మే దృఢం బాహు రుద్విగ్న మివ మే మనః,
ప్రాయశ శ్చా ప్యనిష్టాని నిమిత్తా న్యుపలక్షయే. ౨౧

చునదియు జుగుప్సితమయిన యాకారముగలదియు భయంకరములయిన కన్నులుగలదియు లంబోదరియుఁ గఱకుగోళ్లుగలదియు నున్నతశరీరయుఁ బరుషమయిన చర్మముగలదియు భయంకరంబులగు సింహవ్యాఘ్రాదిమృగంబుల భక్షించుచున్నదియు భయంకరాకారయు వెంట్రుకలు విరియఁబోసికొనియున్నదియు నగు నారాక్షసి వచ్చుటం జూచిరి. ౧౨-౧౩

ఆరాక్షసి వీరులగు రామలక్ష్మణులు చెంతకు వచ్చి అన్నముందట నడచుచున్న లక్ష్మణుం జూచి రమింతము రమ్మని చెప్పి యతనిం బట్టుకొనెను. ౧౪

ఆరాక్షసి లక్ష్మణునిం బిగియఁ గవుఁగిలించి యిట్లని చెప్పెను.

వీరుఁడవగు నాథుఁడా! నేను అయోముఖియను పేరుగలదానను. నీకు దొరకినాను. నీవును నాకుఁ బ్రియుఁడవు దొరకితివి. కావున నీవు ఇంక బ్రతికియుండువఱకుఁ బర్వతశిఖరములయందును నదీపులినంబులయందును నాతోఁగూడ రమింపుచుండుము. అని యారాక్షసి లక్ష్మణునితోఁ జెప్పెను.

శత్రులవధించునట్టి లక్ష్మణుఁడు ఈప్రకారమారాక్షసి చెప్పుటనువిని కుపితుఁడై ఖడ్గంబెత్తి యారాక్షసియొక్క చెవులను ముక్కును స్తనంబులను ఖండించెను. ౧౬

చెవులను ముక్కును స్తనములనుఖండింపఁబడఁగానే భయంకరాకారయగు నారాక్షసి వికృతస్వరంబున నఱచి వచ్చినదారిఁబట్టి పరుగెత్తెను. ౧౭

ఆరాక్షసిపోఁగానే శత్రువుల వధించునట్టి యారామలక్ష్మణులు పరాక్రమంబు నవలంబించి గహనంబగు వనంబునంబోవుచు ఈదుర్నిమిత్తంబులం గనిరి. ౧౯

మహాతేజుఁడును బలవంతుఁడును సదాచారసంపన్నుఁడును బరిశుద్ధుఁడు నగులక్ష్మణుఁడు దీప్తతేజుఁడగు నన్నుం జూచి చేమోడ్పుగీలించి యిట్లని చెప్పెను. ౨౦

నాయొడమభుజము అధికముగా నదరుచున్నది. నామనస్సులో జాల దిగులుగలిగియున్నది. అధికముగా దుర్నిమిత్తములు చూపట్టుచున్నవి. ౨౧

తస్మా త్సఞ్జీభ వార్య! త్వం కురుష్వ వచనంహితమ్,
మ మైవ హి నిమిత్తాని సద్య శ్శంస న్తి సమ్భ్రమమ్, ౨౨

ఏష వఞ్జులకో నామ పక్షీ పరమదారుణః,
ఆవయో ర్విజయం యుద్ధే శంస న్నివ వినర్దతి. ౨౩

తయో రన్వేషతో రేవం సర్వం తద్వన మోజసా,
సంజజ్ఞే విపుల శ్శబ్దః ప్రభఞ్జన్నివ తద్వనమ్. ౨౪

సంవేష్టిత మి వాత్యర్థం గగనం మాతరిశ్వనా,
వనస్య తస్య శబ్దోఽభూ ద్దివ మాపూరయ న్నివ. ౨౫
తం శబ్దం కాఙ్క్షమాణ స్తు రామః క క్షే సహానుజః,
దదర్శ సుమహాకాయం రాక్షసం విపులోరసమ్. ౨౬

ఆసేదతు స్తత స్తత్ర తా వుభౌ ప్రముఖే స్థితమ్,
వివృద్ధ మశిరోగ్రీవం కబన్ధ ముదరే ముఖమ్. ౨౭
రోమభి ర్నిచితై స్తీక్ష్ణై ర్మహాగిరి మివోచ్ఛ్రితమ్,
నీలమేఘనిభం రౌద్రం మేఘ స్తనితనిస్వనమ్. ౨౮
అగ్నిజ్వాలానికాశేన లలాటస్థేన దీప్యతా,
మహాపక్ష్మేణ పిఙ్గేన విపులే నాయతేన చ. ౨౯
ఏకే నోరసి ఘోరేణ నయనే నాశుదర్శినా,
మహాదంష్ట్రోపపన్నం త ల్లేలిహానం మహాముఖమ్. ౩౦
భక్షయ న్తం మహాఘోరా నృక్షసింహమృగద్విపాన్,
ఘోరౌ భుజౌ వికుర్వాణముభౌ యోజన మాయతౌ. ౩౧
కరాభ్యాం వివిధా న్గృహ్య ఋక్షా న్పక్షిగణా న్మృగాన్,

పూజ్యుఁడవగు రాముఁడా! అందువలన నీవు ఆయత్తుఁడవై యుండుము. హితంబగు నామాటం జేయుము. ఈ దుర్నిమిత్తంబులం జూడఁగా "శత్రుక్షణంబు భయంబుగలుగు" నని నాకుఁ దోఁచుచున్నది. ౨౨

పరమభయంకరంబగు నీవంచులకపక్షి యఱచుటం జూడఁగా మనకు యుద్ధంబునం జయంబుగలుగునని తెలియవచ్చుచున్నది. అని లక్ష్మణుఁడు రామునితోఁ జెప్పెను. ౨౩

అట్లు రామలక్ష్మణులు పరాక్రమంబు నవలంబించి ఆవనంబంతయు సీతను వెదకుచుండఁగా నచ్చట నవ్వనంబంతయు విఱుచునట్లు మహాధ్వని యొకటి పుట్టెను. ౨౪

ఆవనంబునందలిధ్వని ఆకాశంబునంతయుఁ బెనువాయువుచే నాహతంబు సేయుచు నాకాశంబు నిండి చెలంగినది. ౨౫

రాముఁడు ఆధ్వనియొక్క మూలంబుఁ దెలియఁగోరి తమ్మునితోఁ గూడ బోయి యొక్క పొదయందు మహాకాయుఁడును విశాలవక్షుఁడునగు రాక్షసుం జూచెను. ౨౬

అంత నారామలక్ష్మణులు మహాకాయుఁడును దలయును మెడయును లేనివాఁడును గడుపున నోరుగలవాఁడును దేహమంతయు దట్టముగాఁ దీక్ష్ణములయిన వెండ్రుకలుగలవాఁడును మహాపర్వతంబువలె నత్యున్నతాకారుఁడును నల్లని మేఘమువంటి మేనుగలవాఁడును రౌద్రాకారుఁడును మేఘగర్జనము వంటి ధ్వనిగలవాఁడును అగ్నిజ్వాలంబోలినదియు పెద్దఱెప్పతో వెలుఁగుచున్నదియుఁ బింగలవర్ణంబును విశాలంబును దీర్ఘంబును శీఘ్రదృష్టిగలదియు వక్షస్స్థలంబున నున్నదియునగు నొక్క నేత్రముతోఁ గూడినవాఁడును బెద్ద కోఱలుగలవాఁడును నాలుకను గదలించుచున్నవాఁడును భయంకరాకారంబును గంభీరంబునగు నోరుగలవాఁడును మహాభయంకరంబులగు నెలుఁగుబంటులను సింహములను మృగంబులను ఏనుఁగులను భక్షించుచున్నవాఁడును భయంకరంబులగు యోజనాయతంబులు నగు చేతులరెంటిని జాఁచుచున్నవాఁ

ఆకర్షన్తం వికర్షన్త మనేకా న్మృగయూథపాన్. 3౨
స్థిత మావృత్య పన్థానం తయో ర్భ్రాత్రోః ప్రపన్నయోః,

అథ తౌ సమభిక్రమ్య క్రోశమాత్రే దదర్శతుః. 33
మహాన్తం దారుణం భీమం కబన్ధం భుజసంవృతమ్,
కబన్ధ మివ సంస్థానా దతిఘోరప్రదర్శనమ్. 3౪

స మహాబాహు రత్యర్థం ప్రసార్య విపులౌ భుజౌ,
జగ్రాహ సహితా వేవ రాఘవౌ పీడయ న్బలాత్. 3౫
ఖడ్గినౌ దృఢధన్వానౌ తిగ్మతేజోవపుర్ధరౌ,
భ్రాతరౌ వివశం ప్రాప్తౌ కృష్యమాణౌ మహాబలౌ. 3౬

తత్ర ధైర్యేణ శూరస్తు రాఘవో నైవ వివ్యథే,
బాల్యా దనాశ్రయత్వా చ్చ లక్ష్మణ స్త్వతివివ్యథే. 3౭

ఉవాచ చ విషణ్ణ స్స న్రాఘవం రాఘవానుజః,

పశ్య మాం వీర! వివశం రాక్షసస్య వశం గతమ్. 3౮
మ యైకేన వినిర్యుక్తః పరిముచ్యస్వ రాఘవ!,

మాం హి భూతబలిం దత్త్వా పలాయస్వ యథాసుఖమ్. 3౯
అధిగన్తాసి వైదేహీ మచిరే ణేతి మే మతిః,
ప్రతిలభ్య చ కాకుత్స్థ! పితృపైతామహీం మహీమ్. ౪౦
తత్ర మాం రామ! రాజ్యస్థః స్మర్తు మర్హసి సర్వదా,

డును నానావిధంబులగు మృగంబులను బక్షులను ఇటు నటు నాకర్షించుచున్నవాఁడును మార్గము నడ్డగించియున్నవాఁడునగు నారాక్షసుని సమీపించిరి. ౨౭-౩౨

అంత నారామలక్ష్మణులు ఎదురుగాఁబోయి సమీపంబున మహాకాయుఁడును మహాభయంకరాకారుఁడును భుజములచే మృగాదులనాకర్షించువాఁడునగు మొండెమువలె నున్నవాఁడును మిక్కిలియు భయంకరమయిన నేత్రముగలవాఁడు నగు కబంధునిం జూచిరి. ౩౩,౩౪

మహాబాహుఁడగు నాకబంధుఁడు మహాదీర్ఘంబులయిన తనబాహువులను జాఁచి భుజబలంబున రామలక్ష్మణుల నిద్దఱం జేర్చిపట్టి యాకర్షించెను.

కత్తులును దృఢములయిన ధనుస్సులును ధరించియున్నవారలును మహాతేజంబున వెలుంగుచున్న మేనుగలవారలును మహాబలశాలులునగు నాయన్నదమ్ములు ఇరువురును కబంధునిబాహువులచే నాకర్షింపఁబడినవారలై పరవశులైరి. ౩౫

ఆయవస్థయందు శూరుఁడగు రాముఁడు ధైర్యమునఁ గొంచెమేని దుఃఖము నొందకుండెను. లక్ష్మణుఁడుమాత్రము బాలుఁడగుటచేతను అంత ధైర్యము లేనివాఁడగుటచేతను మిక్కిలియు దుఃఖమునొందెను. ౩౬

రామునితమ్ముఁడగు లక్ష్మణుఁడు దుఃఖితుఁడై రామునితో నిట్లని చెప్పెను.

పరాక్రమశాలివగురాముఁడా! నేను రాక్షసునిచేతులం జిక్కి పరవశుఁడనై యున్నాను జూడుము. నన్నొకని వినియోగించి నీవు విడిపించుకొనుము. ౩౭

నీవు నన్ను ఈభూతమునకు బలియొసంగి సుఖంబుగా పరుగెత్తుము.

శీఘ్రమున నీవు సీతనుం బొందఁగలవని నాయభిప్రాయము.

కాకుత్స్థవంశమునఁబుట్టిన రాముఁడా! అచ్చట నయోధ్యకుఁబోయి పితృపైతామహంబు రాజ్యంబు నొంది రాజ్యపరిపాలనంబు సేయుచు దివ్య

లక్ష్మణేనైవ ముక్తస్తు రామ స్సౌమిత్రి మబ్రవీత్. ౪౧

మా స్మ త్రాసం కృథా వీర! నహి త్వాదృ గ్విషీదతి,

ఏతస్మి న్నన్తరే క్రూరో భ్రాతరౌ రామలక్ష్మణౌ. ౪౨
పప్రచ్ఛ ఘననిర్ఘోషః కబన్ధో దానవోత్తమః,

కౌ యువాం వృషభస్కన్ధౌ మహాఖడ్గధనుర్ధరౌ. ౪౩
ఘోరం దేశ మిమం ప్రాప్తౌ మమ భక్షా వుపస్థితౌ,

వదతం కార్య మిహ వాం కిమర్థం చాగతౌ యువామ్. ౪౪
ఇమం దేశ మనుప్రాప్తౌ క్షుధార్త స్యేహ తిష్ఠతః,
సబాణచాపఖడ్గౌ చ తీక్ష్ణశృఙ్గా వి వర్షభౌ. ౪౫
మ మాఽస్య మనుసంప్రాప్తౌ దుర్లభం జీవితం పునః,

తస్య తద్వచనం శ్రుత్వా కబన్ధస్య దురాత్మనః. ౪౬
ఉవాచ లక్ష్మణం రామో ముఖేన పరిశుష్యతా,
కృచ్ఛ్రాత్కృచ్ఛ్రతరం ప్రాప్య దారుణం సత్యవిక్రమః. ౪౭
వ్యసనం జీవితాన్తాయ ప్రాప్త మప్రాప్య తాం ప్రియామ్,

కాలస్య సుమహ ద్వీర్యం సర్వభూతేషు లక్ష్మణ!. ౪౮
త్వాం చ మాం చ నరవ్యాఘ్ర! వ్యసనైః పశ్య మోహితౌ,

భోగంబుల ననుభవించుచు నన్నుఁ దలంచుకొనుచుండుము. అని లక్ష్మణుఁడు రామునితోఁ జెప్పెను. ౪౦

రాముఁడు లక్ష్మణుఁడు చెప్పినమాటను విని యతనిం జూచి యిట్లని పలికెను. ౪౧

వీరుఁడా! భయపడకుము. నీయట్టివాఁ డిట్లు విషాదంబునొందుట సరి గాదు. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను.

ఇంతలో క్రూరుఁడగు దానవోత్తముఁడు కబంధుఁడు అన్నదమ్ములగు నా రామలక్ష్మణులం జూచి మేఘగర్జనముంబోలు గంభీరధ్వనితో నిట్లని యడిగెను. ౪౨

ఆఁబోఁతుమూఁపులవంటి భుజశిఖరములుగల్గి గొప్పవగుఖడ్గములును ధనుస్సులను దాల్చియున్నారలు మీరలెవ్వరు? భయంకరంబగు నీవనంబునకు వచ్చి నా కాహారం బయితిరి? ౪౩

ఇచ్చట మీకేమి కార్యమున్నది చెప్పుఁడు. నే నాఁకలిగొనియుండఁగా నాయాఁకలి దీఱునట్లు ఇచ్చటి కేల వచ్చినారలు? ౪౪

ధనుర్బాణంబులు ఖడ్గంబులును ధరించి తీక్ష్ణశృంగములగు ఆఁబోఁతుల వలెనున్న మీరలు నానోటిసమీపంబునకు వచ్చినారు. ఇంక మిమ్ముఁ బ్రాణంబులతోఁ బోనివ్వను. ౪౫

రాముఁడు దురాత్ముఁడగు నాకబంధునిమాటను విని భయంబున నోరెండఁగా లక్ష్మణుం జూచి యిట్లని చెప్పెను. ౪౬

సత్యపరాక్రముఁడవగు లక్ష్మణుఁడా! మొదట రాజ్యభ్రంశము వనవాసము అవల సీతాపహరణము ఇట్లు కష్టముపయిఁ గష్టమునొంది మనము సీతం బొందకయె ప్రాణనాశకరంబగు నీకష్టంబు నొందినాము. ౪౭

పురుషశ్రేష్ఠుఁడవగు లక్ష్మణుఁడా! సమస్తభూతంబులయందును గాలముయొక్క బలమున కెదురులేదు. నీవును నేనును ఇట్లు కష్టములచేఁ బీడింపఁబడుచున్నాము చూడుము. ౪౮

నాతిభారోఽస్తి దైవస్య సర్వభూతేషు లక్ష్మణ!। ౪౯

శూరాశ్చ బలవన్తశ్చ కృతాస్త్రాశ్చ రణాజిరే,
కాలాభిపన్నా స్సీదన్తి యథా వాలుకసేతవః. ౫౦

ఇతి బ్రువాణో దృఢసత్యవిక్రమో
మహాయశా దాశరథిః ప్రతాపవాన్,
అవేక్ష్య సౌమిత్రి ముదగ్రపౌరుషం
స్థిరాం తదా స్వాం మతి మాత్మనాఽకరోత్. ౫౧

ఇతి శ్రీమదరణ్యకాణ్డే ఏకోనసప్తతితమ స్సర్గః. ౬౯.

సప్తతితమ స్సర్గః.

తౌ తు తత్ర స్థితౌ దృష్ట్వా భ్రాతరౌ రామలక్ష్మణౌ,
బాహుపాశపరిక్షిప్తౌ కబన్ధో వాక్య మబ్రవీత్. ౧

తిష్ఠతః కిన్ను మాం దృష్ట్వా క్షుధార్తం క్షత్రియర్షభౌ,
ఆహారార్థం తు సందిష్టౌ దైవేన గతచేతసా. ౨

తచ్ఛ్రుత్వా లక్ష్మణో వాక్యం ప్రాప్తకాలం హితం తదా,
ఉవాచాఽర్తిం సమాపన్నో విక్రమే కృతలక్షణః. ౩

త్వాం చ మాం చ పురా తూర్ణ మాదత్తే రాక్షసాధమః,
తస్మా దసిభ్యామ స్యాశు బాహూ ఛిన్దావహై గురూ. ౪

భీషణోఽయం మహాకాయో రాక్షసో భుజవిక్రమః,
లోకం హ్యతిజితం కృత్వా హ్యావాం హన్తు మిహేచ్ఛతి. ౫

లక్ష్మణుఁడా! సమస్తభూతములయందును గాలంబున కసాధ్యమయిన దేదియు లేదు. ౪౯

యుద్ధభూమియందుశూరులును బలవంతులును అస్త్రవేత్తలు నగువారలునుగూడ కాలహతులయి యిసుకతోఁ గట్టఁబడిన యనకట్టలువలె నాశంబు నొందుదురు. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౫౦

దృఢంబును సత్యంబునగు పరాక్రమముగలవాఁడును మహాకీర్తిశాలియుఁ బ్రతాపవంతుఁడునగు దశరథమహారాజపుత్త్రుఁడైన రాముఁడు మహాపౌరుషశాలియగు లక్ష్మణుంజూచి ధైర్యంబునఁ దనబుద్ధిని స్థిరంబుగావించుకొనెను. ౫౧

ఇది యిఱువదితొమ్మిదవసర్గము.

---

## డెబ్బదియవసర్గము.

కబంధుఁడు పాశంబులవంటి తనబాహువులచేఁ బరివేష్టితులయి యచ్చట నిలుచున్న యన్నదమ్ముల నారామలక్ష్మణులఁ జూచి యిట్లనిచెప్పెను.

క్షత్త్రియశ్రేష్ఠులారా! దైవము నాకాహారార్థముగాఁ బంపఁగా మీర లిచ్చటికివచ్చినారే బుద్ధిలేనివారివలె ఏల యూరక నిలుచున్నారు? అని కబంధుఁడు రామలక్ష్మణులతోఁ జెప్పెను. ౨

లక్ష్మణుఁ డామాటనువిని దుఃఖితుఁడై యెట్టకేలకుఁ బరాక్రమంబు నవలంబించి యప్పటికిఁ దగినదియు హితంబునగు నీమాటం జెప్పెను. ౩

ఈరాక్షసాధముఁడు ఇంక శీఘ్రమున నిన్నును నన్నును మ్రింగును. కావున నీతనివి తీక్ష్ణంబులగు బాహువులరెంటిని శీఘ్రంబున ఖడ్గములచే నఱకుదము. ౪

భయంకరాకారుఁడును మహాకాయుఁడును భుజములయందు మాత్రమె పరాక్రమముగలవాఁడునగు నీరాక్షసుఁడు లోకమునంతయు వశముచేసికొని మనలఁ జంపఁగోరుచున్నాఁడు. ౫

రాజావగురాముఁడా! యాగమధ్యమునకు దక్షిణార్థమై తేఁబడినపశువులను వధింపఁగూడనట్లు ఏమియు నపకారముచేయనివారలను రాజు వధింపరాదు. అని లక్ష్మణుఁడు రామునితోఁ జెప్పెను. ౬

భయంకరాకారుఁడగు నాకబంధుఁడు రామలక్ష్మణుల యామాటను విని కుపితుఁడై యంత నోరుదెఱచి వారల మ్రింగఁబోయెను. ౭

అంత ఏదేశమునం దేకాలమునం దేదికర్తవ్యమో చక్కఁగాఁ దెలిసినట్టి యారామలక్ష్మణులు భయంబున వడంకుచున్న కబంధుని రెండుచేతులను మూఁపులవఱకు ఖడ్గంబులచే ఖండించిరి. ౮

అంత సమర్థుఁడగు రాముఁడు వేగంబున ఎంతమాత్రము అడ్డములేకుండునట్లు కబంధుని కుడిభుజమును ఖండించెను. పరాక్రమశాలియగు లక్ష్మణుఁడు ఎడమచేతిని నఱికెను. ౯

మహాకాయుఁడగు నాకబంధుఁడు చేతులుదెగి పేరెలుఁగున నఱచుచు మేఘమువలె భూమ్యాకాశంబులను దిక్కులను బ్రతిధ్వనిగదుర గర్జించుచు నేలం బడెను. ౧౦

ఆకబంధుఁడు నెత్తుటందోఁగుచుఁ దనచేతులురెండును ఖండింపఁబడుటను గని దీనుఁడై వీరులగు నారామలక్ష్మణులం జూచి "మీరలెవ్వరు?" అని యడిగెను. ౧౧

ఇట్లు కబంధుఁ డడుగ మంగళలక్షణుఁడగు లక్ష్మణుఁడు మహాపరాక్రమశాలియగు నతనికి రామునివృత్తాంతంబు చెప్పెను. ౧౨

ఈతఁడు ఇక్ష్వాకువంశంబునంబుట్టిన దశరథమహారాజు కుమారుఁడు. ఇతనిరాముఁడని జనులు పిలుతురు. నే నతనితమ్ముఁడ లక్ష్మణుఁడను. ౧౩

విజనంబగువనంబున వాసముసేయుచున్న దేవేంద్రపరాక్రముఁడగు నీరామునిభార్యను రాక్షసుఁ డొకఁ డపహరించినాఁడు. మే మాబిడను వెదకుకొనుచు యిచ్చటికి వచ్చినాము. ౧౪

నీ వెవ్వఁడవు? కబంధాకారుఁడవై పిక్కలుఁ దలయులేక బొమ్మునఁ

ఆస్యే నోరసిదీప్తేన భగ్నజఙ్ఘో విచేష్టసే. ౧౫

ఏవముక్తః కబన్ధస్తు లక్ష్మణేనోత్తరం వచః,
ఉవాచ పరమప్రీత స్తదిన్ద్రవచనం స్మరన్. ౧౬

స్వాగతం వాం నరవ్యాఘ్రౌ దిష్ట్యా పశ్యామి చాప్యహమ్,
దిష్ట్యా చేమౌ నికృత్తౌ మే యువాభ్యాం బాహుబన్ధనౌ. ౧౭

విరూపం యచ్చ మే రూపం ప్రాప్తం హ్యవినయా ద్యథా,
తన్మే శృణు నరవ్యాఘ్ర! తత్త్వతశ్శంసత స్తవ. ౧౮

ఇతి శ్రీమదరణ్యకాణ్డే సప్తతితమ స్సర్గః. ౭౦.

---

## ఏకసప్తతితమ స్సర్గః.

పురా రామ! మహాబాహో! మహాబలపరాక్రమ!,
రూపమాసీన్మమాచిన్త్యం త్రిషు లోకేషు విశ్రుతమ్. ౧
యథా సోమస్య శక్రస్య సూర్యస్య చ యథా వపుః,
సోఽహం రూపమిదం కృత్వా లోకవిత్రాసనం మహత్. ౨
ఋషీన్వనగతా న్రామ! త్రాసయామి తత స్తతః,

తత్ర స్థూలశిరా నామ మహర్షిః కోపితో మయా. ౩
సంచిన్వ న్వివిధం వన్యం రూపేణానేన ధర్షితః,

తేనాహముక్తః ప్రేక్ష్యైవం ఘోరశాపాభిధాయినా. ౪
ఏత దేవ నృశంసం సతే రూప మస్తు విగర్హితమ్,

ప్రకాశమానంబగు నోరుగలిగి యివ్వనంబునఁ బొరలుచున్నావేల? అని లక్ష్మణుండు కబంధునితోఁ జెప్పెను. ౧౫

కబంధుఁడు లక్ష్మణునిమాటను విని పూర్వము తన కింద్రుఁడు చెప్పిన మాటలం దలంచుకొని శాపావసానకాలము వచ్చినదని పరమసంతుష్టుఁడై యిట్లని చెప్పెను. ౧౬

పురుషశ్రేష్ఠులారా! మీకు స్వాగతంబగుఁగాక. నాభాగ్యవశంబున మీదర్శనంబు గలిగినది. నాభాగ్యవశంబుననే నాభుజశిఖరంబులు రెండును మీచే ఛేదింపఁబడుటయు నాకుఁ బ్రాప్తమయినది. ౧౭

పురుషోత్తముఁడవగు రామాఁడా! నాయవినయదోషంబున నాకీ వికృతరూపముగల్గినవిధంబంతయు నీకు యథార్థముగాఁ జెప్పెదను; వినుము.

ఇది డెబ్బదియవసర్గము.

---

## డెబ్బదియొకటవసర్గము.

మహాబాహుఁడవు మహాబలపరాక్రమశాలివగు రామాఁడా! చంద్రునకును ఇంద్రునికిని సూర్యునకునుంబోలె మున్ను నాకు అచింత్యంబును ముల్లోకంబులందును ప్రసిద్ధంబునగు దివ్యరూపంబు గలిగియుండినది. ౧

అట్టిదివ్యరూపధరుఁడ నగు నేను లోకంబులకు భయంబు గలిగించునట్టి యీమహాభయంకరరూపంబు దాల్చి వనంబులయందు ఋషులను భయపెట్టుచుంటిని. ౨

అంత నొకప్పుడు కందమూలంబులకు గా వనంబునకువచ్చిన స్థూలశిరుఁడనుమహర్షిని నేను ఈరూపంబున ధర్షించి యతనికిఁ గోపంబు గలుగఁ జేసినాను. ౩

అంత నాస్థూలశిరుఁడు నన్నుఁజూచి "క్రూరంబును నిందితంబునగు ఈయాకారమె నీ కెల్లప్పుడు నుండుఁగాక" యని భయంకరంబగు శాపం బొసంగెను. ౪

స మయా యాచితః క్రుద్ధ శ్ఛాపస్యాన్తో భవే దితి. ౫
అభిశాపకృత స్యేతి తే నేదం భాషితం వచః,

యథా చ్ఛిత్త్వా భుజౌ రామ స్త్వాం దహే ద్విజనే వనే. ౬
తదా త్వం ప్రాప్స్యసే రూపం స్వమేవ విపులం శుభమ్,

శ్రియా విరాజితం పుత్త్రం దనో స్త్వం విద్ధి లక్ష్మణ!. ౭
ఇన్ద్రకోపా దిదం రూపం ప్రాప్త మేవం రణాజిరే,

అహం హి తపసోగ్రేణ పితామహ మతోషయమ్. ౮
దీర్ఘమాయు స్స మే ప్రాదా త్తతో మాంవిభ్రమోఽ స్పృశత్,

దీర్ఘమాయు ర్మయా ప్రాప్తం కిం మే శక్రః కరిష్యతి. ౯
ఇ త్యేవం బుద్ధి మాస్థాయ రణే శక్ర మధర్షయమ్,
తస్య బాహుప్రము క్తేన వజ్రేణ శతపర్వణా. ౧౦
సక్థినీ చైవ మూర్ధాచ శరీరే సమ్ప్రవేశితమ్,
స మయా యాచ్యమాన స్స న్నానయ ద్యమసాదనమ్. ౧౧
పితామహవచ స్సత్యం తద స్త్వితి మ మాబ్రవీత్,

అనాహారః కథం శక్తో భగ్నసక్థిశిరోముఖః. ౧౨
వజ్రే ణాభిహతః కాలం సుదీర్ఘ మపి జీవితుమ్,

ఏవ ము క్తస్తు మే శక్రో బాహూ యోజన మాయతౌ. ౧౩
ప్రాదా దాస్యం చ మే కుక్షౌ తీక్ష్ణదంష్ట్ర మకల్పయత్,

కుపితుఁడగు నమ్మహర్షిం జూచి నేను నాయపరాధముచేఁ గలిగిన యీ శాపమునకు అంతము ననుగ్రహింపుఁడని ప్రార్థించితిని. ఆయన యిట్లని యానతిచ్చెను. ౫

ఎప్పుడు రాముఁడు విజనంబగు నరణ్యంబునకు వచ్చి నీచేతులు ఖండించి నిన్ను దహించునో అప్పుడు నీవు శాపవిముక్తుఁడవై దివ్యంబును సుందరంబు నగు నీరూపంబు నొందఁగలవు. అని యాఋషి చెప్పెను. ౬

లక్ష్మణుఁడా! నేను దనువంశజుఁడైన శ్రీయనువాని పుత్రుఁడనని యెఱుంగుము. యుద్ధభూమియందు ఇంద్రుని కోపంబున నాకిట్టి కబంధరూపంబు ప్రాప్తించినది. ౭

నేనంతభయంకరమగు తపస్సు గావించి బ్రహ్మదేవుని సంతోషపెట్టితిని. అతఁడు నాకు దీర్ఘాయుస్సు నొసంగెను. అంత నాకు మిక్కిలియు గర్వంబు గలిగెను. ౮

దీర్ఘాయుస్సును బొందితిని, ఇంక నన్ను దేవేంద్రుఁడేమి చేయఁగలఁడు అని తలఁచి నేను యుద్ధంబున దేవేంద్రు నెదిరించితిని. ౯

ఆయింద్రుఁడు ప్రయోగించిన శతధారంబగు వజ్రాయుధము నాతొడలను తలను దేహములోపలికిఁ ద్రోసివేసినది. ౧౦

నన్ను వధించివేయుమని నేనెంత ప్రార్థించినను ఇంద్రుఁడు నన్ను వధింపఁడయ్యె. బ్రహ్మదేవుఁడు నాఁడు నీకొసంగినవరము సత్యము కావలెనని యతఁడు నాకుఁ జెప్పెను. ౧౧

వజ్రాయుధముచేఁ గొట్టఁబడి తొడలును తలయును నోరును విఱిగి తినుటకు నోరుగూడ లేమిం జేసి యిట్లు నిరాహారుఁడనై దీర్ఘకాల మెట్లు జీవింతును? అని నే నింద్రునితోఁ జెప్పితిని. ౧౨

ఇంద్రుఁడు నామాటను విని ఆమడదూరము దీర్ఘములయిన బాహువులను రెంటిని నాకొసంగెను. మఱియు నాకడుపునందు కఱకుకోఱలతో నోరు నిర్మించెను. ౧౩

సోహం భుజాభ్యాం దీర్ఘాభ్యాం సంకృష్యాస్మి న్వనేచరాన్.
సింహాద్విపమృగవ్యాఘ్రా న్భక్షయామి సమన్తతః,

స తు మా మబ్రవీ దిన్ద్రో యదా రామస్సలక్ష్మణః. ౧౫
ఛేత్స్యతే సమరే బాహూ తదా స్వర్గం గమిష్యసి,

అనేన వపుషా రామ! వనేఽస్మి న్రాజసత్తమ!. ౧౬
యద్య త్పశ్యామి సర్వస్య గ్రహణం సాధు రోచయే,

అవశ్యం గ్రహణం రామో మన్యేఽహం సముపైష్యతి. ౧౭
ఇమాం బుద్ధిం పురస్కృత్య దేహన్యాసకృతశ్రమః,

స త్వం రామోఽసి భద్రం తే నాహ మన్యేన రాఘవ!.౧౮
శక్యో హన్తుం యథాతత్త్వ మేవ ముక్తం మహర్షిణా,

అహం హి మతిసాచివ్యం కరిష్యామి నరర్షభ!. ౧౯
మిత్రం చై వోపదేక్ష్యామి యువాభ్యాం సంస్కృతోఽగ్నినా,

ఏవ ముక్తస్తు ధర్మాత్మా దనునా తేన రాఘవః. ౨౦
ఇదం జగాద వచనం లక్ష్మణ స్యోపశృణ్వతః,
రావణేన హృతా భార్యా మమ సీతా యశస్వినీ. ౨౧
నిష్క్రాన్తస్య జనస్థానా త్సహ భ్రాత్రా యథాసుఖమ్,

నామమాత్రం తు జానామి న రూపం తస్య రక్షసః. ౨౨

అట్టి నేను ఇవ్వనంబునకువచ్చిన సింహంబులును ఏనుఁగులును మృగంబులును వ్యాఘ్రంబులును మొదలగుమృగంబులనెల్ల దీర్ఘభుజంబుల నాకర్షించుకొని భక్షించుచున్నాను. ౧౪

ఎప్పుడు రామలక్ష్మణులు వచ్చి యుద్ధంబున నీబాహువులను ఛేదింతురో అప్పుడు నీవు స్వర్గంబు నొందఁగలవు; అని యింద్రుఁడును నాతోఁ జెప్పెను. ౧౫

రాజశ్రేష్ఠుఁడవగు రాముఁడా! ఈశరీరమువచ్చినదిమొదలు ఇవ్వనంబున ఏదేదిచూచుచున్నానో దానిసంతయు భక్షింపవలెననియె నాకుఁ దోఁచుచున్నది. ఇది భక్ష్యము ఇది అభక్ష్యము అని చూచుటలేదు. ౧౬

రాముఁడు తప్పక నాయొద్దకు వచ్చును అని యమ్మహర్షి చెప్పినమాటచే దృఢమైనవమ్మకము గలవాఁడనై దేహరక్షణమునందు ఎంతో శ్రమముగలుగుచున్నను ఓర్చి నీరాక కెదురుచూచుచున్నాను. ౧౭

రాముఁడా! నీ వారాముఁడవె వచ్చినావు. నన్ను వధించుటకు మఱియొకని కెంతమాత్ర మలవిగాదు. ఇది యథార్థము. ఈప్రకార మమ్మహర్షి యానతిచ్చెను. ౧౮

పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! మీర లిద్దఱు నాకు అగ్నిసంస్కారము గావించినపిదప నేను మీకు నాబుద్ధికోలఁది యోచనచెప్పుటయెగాక మీకుఁ దగుమిత్రునింగూడఁ దెలిపెదను. అని కబంధుఁడు రామునితోఁ జెప్పెను. ౧౯

ధర్మాత్ముఁడగురాముఁడు దనువంశజుఁడగు నాకబంధునిమాటను విని లక్ష్మణుఁడు సమీపంబున వినుచుండఁ గబంధునితో నిట్లని చెప్పెను. ౨౦

నేను దమ్మునితోడ జనస్థానమునుండి దూరముగాఁ బోయియుండు నప్పుడు రావణుఁడు మే మెవ్వరములేకుండుటంజేసి సుఖముగా పతివ్రతయయిన నాభార్యను సీతను రావణుఁడు హరించెను. ౨౧

ఆరాక్షసుని పేరుమాత్రము మాకుఁ దెలియునుగాని యతని యునికి

నివాసం వా ప్రభావం వా వయం తస్య న విద్మహే,
శోకార్తానా మనాథానా మేవం విపరిధావతామ్. ౨౩
కారుణ్యం సదృశం కర్తు ముపకారే చ వర్తతామ్,

కాష్ఠా న్యాదాయ శుష్కాణి కాలే భగ్నాని కుఞ్జరైః. ౨౪
ధక్ష్యామ స్త్వాం వయం వీర! శ్వభ్రే మహతి కల్పితే,

స త్వం సీతాం సమాచక్ష్వ యేన వా యత్ర వా హృతా. ౨౫
కురు కల్యాణ మత్యర్థం యది జానాసి తత్త్వతః,

ఏవ ముక్తస్తు రామేణ వాక్యం దను రనుత్తమమ్. ౨౬
ప్రోవాచ కుశలో వక్తుం వక్తార మపి రాఘవమ్,

దివ్య మస్తి న మే జ్ఞానం నాభిజానామి మైథిలీమ్. ౨౭
య స్తాం జ్ఞాస్యతి తం వక్ష్యే దగ్ధ స్స్వం రూప మాస్థితః,
అదగ్ధస్య తు విజ్ఞాతుం శక్తి రస్తి న మే ప్రభో!. ౨౮
రాక్షసం తం మహావీర్యం సీతా యేన హృతా తవ,

విజ్ఞానం హి మమ భ్రష్టం శాపదోషేణ రాఘవ!. ౨౯
స్వకృతేన మయా ప్రాప్తం రూపం లోకవిగర్హితమ్,

కింతు యావ న్న యా త్యస్తం సవితా శ్రాన్తవాహనః. ౩౦
తావ న్మా మవటే క్షిప్త్వా దహ రామ! యథావిధి,
దగ్ధ స్త్వయాఽహ మవటే న్యాయేన రఘునన్దన!. ౩౧
వక్ష్యామి త మహం వీర! య స్తం జ్ఞాస్యతి రాక్షసమ్,

పట్టుగాని ప్రభావంబు గాని రూపముగాని మాకెంతమాత్రము తెలియదు. ౨౨

దుఃఖితులును అనాథులును ఇట్లు దిక్కులేక అల్లాడుచున్నవారలును బరోపకారాసక్తులు నగు మావంటివారలవిషయమయి దయయుంచుట యుక్తమయినది. ౨౩

పరాక్రమవంతుఁడవగు కబంధుఁడా! ఏనుఁగులచే విఱువఁబడి బహుకాలమైయుండుటచేతఁ జక్కఁగా ఎండియుండుకట్టెలందీసి పెద్దపల్లము ద్రవ్వి యందు నిన్ను దహించెదము. ౨౪

అట్టి నీవు యథార్థముగా నెఱుంగుదువేని సీత యెవ్వనిచే నెచ్చటికిఁ గొనిపోఁబడినదో నాకుఁ దెలియఁజేసి మహోపకారముచేయుము. అని రాముఁడు కబంధునితోఁ జెప్పెను. ౨౫

మాటలయందుఁ బండితుఁడగు రామునితోఁగూడ మాటలాడుటకు సమర్థుఁడగు నాకబంధుఁడు రాముఁడు చెప్పిన యుత్తమంబగు మాటనువిని ఇట్లని బదులు చెప్పెను. ౨౬

నాకు దివ్యజ్ఞానములేదు. సీతసంగతిని నే నెఱుఁగఁజాలను. నన్ను దహించినపిమ్మట నానిజరూపము నొంది సీత నెఱుంగఁగలవానిం జెప్పెదను.

రాజవగురాముఁడా! దహింపఁబడుటకు మున్ను నాకు నీభార్యను సీత నపహరించిన మహాపరాక్రమశాలియగు రాక్షసునిఁ దెలిసికొనుటకు శక్తిలేదు. ౨౮

రాముఁడా! శాపముచే నాదివ్యజ్ఞానము నశించినది. అట్లు నేను జేసికొన్నదుష్కృతమువలననే యీలోకనిందితమగు రూపంబును నాకుఁ గల్గినది. ౨౯

రాముఁడా! సూర్యుఁడు అలసినగుఱ్ఱములతోఁగూడినవాఁడై యస్తమయము నొందుటకు మున్నె నన్నుఁ బల్లమునఁనుంచి చక్కఁగా దహింపుము.

పరాక్రమశాలివగు రాముఁడా! నీవు నన్నుఁ గ్రమంబుగాఁ బల్లంబునఁనుంచి దహించినపిదప నేను సీత నపహరించినరాక్షసు నెఱుంగంగల యట్టివాని నీకుఁ జెప్పెదను. ౩౦

తేనసఖ్యం చ కర్తవ్యం న్యాయవృత్తేన రాఘవ!। 32
కల్పయిష్యతి తే ప్రీత స్సాహాయ్యం లఘువిక్రమః,

నహి తస్యా స్త్యవిజ్ఞాతం త్రిషు లోకేషు రాఘవ!. 33
సర్వా న్పరిసృతో లోకా న్పురాఽసౌ కారణాన్తరే,

ఇతి శ్రీమదరణ్యకాణ్డ ఏకసప్తతితమ స్సర్గః. ౭౧.

---

## ద్విసప్తతితమ స్సర్గః.

ఏవ ముక్తౌ తు తౌ వీరౌ కబన్ధేన నరేశ్వరౌ,
గిరిప్రదరమాసాద్య పావకం విససర్జతుః. ౧

లక్ష్మణ స్తు మహోల్కాభి ర్జ్వలితాభి స్సమన్తతః,
చితా మాదీపయామాస సా ప్రజజ్వాల సర్వతః. ౨
తచ్ఛరీరం కబన్ధస్య ఘృతపిణ్డోపమం మహాత్,
మేదసా పచ్యమానస్య మన్దం దహతి పావకః. 3
స విధూయ చితా మాశు విధూమోఽగ్ని రివోత్థితః,
అరజే వాససీ బిభ్ర న్మాలాం దివ్యాం మహాబలః. ర

తత శ్చితాయా వేగేన భాస్వరో విమలామ్బరః,
ఉత్పపా తాఽఽశు సంహృష్ట స్సర్వప్రత్యఙ్గభూషణః. ౫

విమానే భాస్వరే తిష్ఠ న్హంసయుక్తే యశస్కరే,
ప్రభయా చ మహాతేజా దిశో దశ విరాజయన్. ౬

రాముఁడా! న్యాయ్యమయిన చరిత్రముగల యాపురుషునితో స్నేహముగావింపుము. అతఁడు మహాపరాక్రమవంతుఁడు. సంతోషంబున నీకు సాహాయ్యము గావించును. ౩౨

రాముఁడా! అతనికిఁ దెలియనిప్రదేశము ముల్లోకంబులయందును లేదు. అతఁ డోకకారణమునకుఁగా మున్నొకమారు సమస్తలోకంబులనుం దిరిగియున్నాఁడు. అని కబంధుఁడు రామునితోఁ జెప్పెను. ౩౩

ఇది డెబ్బదియొకటవసర్గము.

---

## డెబ్బదిరెండవసర్గము.

మనుష్యేశ్వరులును బరాక్రమవంతులును నగు నారామలక్ష్మణులు కబంధుఁడు చెప్పినమాటను విని కబంధునికళేబరమును బర్వతంబులోని యొకపల్లములో నుంచి నిప్పంటించిరి. ౧

లక్ష్మణుఁడును జక్కఁగా మండినపెద్దకొఱవుల నలుప్రక్కలం బెట్టి చితిని జక్కఁగా మండునట్లు గావింప నాచితి చక్కఁగా మండెను. ౨

గొప్పదగు నాకబంధునికళేబరమును ఘృతప్రాయమైయున్నను మేదఃపూర్ణమగుటం జేసి దానిని అగ్ని తిన్నతిన్నఁగా దహించెను. ౩

మహాబలుఁడగు నాకబంధుఁడంత శీఘ్రంబున చితిం ద్రోసివేసి నిర్మలములయిన వస్త్రములను దివ్యంబగుమాలికనుం దాల్చి పొగలేనియగ్నికైవడిం బ్రకాశించుచు లేచెను. ౪

అంత నాకబంధుఁడు దివ్యతేజంబున వెలుఁగుచు నిర్మలంబులగు వస్త్రంబులు ధరించి సమస్తావయవంబులందును భూషణంబులు దాల్చి సంతుష్టుఁడై వేగంబున నాచితినుండి బయలువెడలెను. ౫

మహాతేజుఁడగు కబంధుఁడు ప్రకాశమానంబును హంసలచే నలంకరింపఁబడినదియు యశస్కరంబునగు విమానంబు నొంది కాంతిచే దశదిశల వెలుంగఁజేయుచుండెను. ౬

సోఽన్తరిక్షగతో రామం కబన్ధో వాక్య మబ్రవీత్,
శృణు రాఘవ! తత్త్వేన యథా సీతా మవాప్స్యసి. ౭

రామ! షడ్యుక్తయో లోకే యాభి స్సర్వం విమృశ్యతే,

పరిమృష్టో దశాన్తేన దశాభాగేన సేవ్యతే. ౮

దశాభాగగతో హీన స్త్వం హి రామ! సలక్ష్మణః,
యత్కృతే వ్యసనం ప్రాప్తం త్వయా దారప్రధర్షణమ్. ౯

తదవశ్యం త్వయా కార్య స్ససుహృ త్సుహృదాం వర!,
అకృత్వా హి న తే సిద్ధి మహం పశ్యామి చిన్తయన్. ౧౦

శ్రూయతాం రామ! వక్ష్యామి సుగ్రీవో నామ వానరః,
భ్రాత్రా నిరస్తః క్రుద్ధేన వాలినా శక్రసూనునా. ౧౧

ఋశ్యమూకే గిరివరే పమ్పాపర్యన్తశోభితే,
నివస త్యాత్మవా న్వీర శ్చతుర్భి స్సహ వానరైః. ౧౨

వానరేన్ద్రో మహావీర్య స్తేజోవా నమితప్రభః,
సత్యసన్ధో వినీత శ్చ ధృతిమా న్మతిమా న్మహాన్. ౧౩

దక్షః ప్రగల్భో ద్యుతిమా న్మహాబలపరాక్రమః,

ఆకబంధుఁడు అంతరిక్షంబుననుండి రాముం జూచి యిట్లని చెప్పెను.

రాముఁడా! నీవు సీతాదేవిదొరకు నుపాయమును యథార్థముగాఁ జె
ప్పెదను వినుము. ౭

రాముఁడా! లోకంబున సంధివిగ్రహయానాసనద్వైధీభావసమాశ్రయంబులని యాఱు ఉపాయంబులుగలవు. వానింబట్టియే రాజులు సమస్త కార్యంబులను నిర్వహించుకొందురు.

కష్టమునొందినవాఁడు తనవలెనే కష్టమునొందియున్నవానితోఁ జేరి
కార్యమును సాధించుకొనును ౮

రాముఁడా! నీవు భార్య యపహరింపఁబడి మహాదుఃఖము నొందియు
న్నావు కావున నీవును లక్ష్మణుఁడును దురవస్థనొందినవారలై తక్కువయయి
నారు. ౯

రాముఁడా! అట్లు కావున నీయట్లు దురవస్థాపీడితుఁడగు వానికి నీవు
స్నేహితుఁడవయి యతని నీ యవశ్యము స్నేహితునిగాఁ జేసికొనవలయును.
అట్లుచేయనియెడల నీకుఁ గార్యసిద్ధియగునట్లు ఎంతయాలోచించినను నాకుఁ
దోఁచలేదు. ౧౦

రాముఁడా! అట్టివానిం జెప్పెదను వినుము. సుగ్రీవుఁ డనువానరు
శ్రేష్ఠుని అతనియన్న యింద్రపుత్త్రుఁడగు వాలి కోపించి రాజ్యంబునుండి
తఱుమఁగొట్టినాఁడు. ౧౧

బలవంతుఁడును మహాపరాక్రమశాలియు నగు నాసుగ్రీవుఁడు పం
పాసరోవరసమీపంబున రాజిల్లుచున్న ఋశ్యమూకంబనుపర్వతంబునందునలు
వురు వానరవీరులతోఁగూడ నివసించుచున్నాఁడు. ౧౨

వానరరాజుఁడగు నాసుగ్రీవుఁడు మహాపరాక్రమశాలి. తేజస్వి.
అమితమయినకాంతిగలవాఁడు. సత్యసంధుఁడు, వినయసంపన్నుఁడు, ధైర్యవం
తుఁడు, బుద్ధిమంతుఁడు. పూజనీయుఁడు. ౧౩

మఱియు నతఁడు, సమర్థుఁడు, ప్రౌఢుఁడు, కాంతిమంతుఁడు.
మహాబలపరాక్రమశాలి.

భ్రాత్రా వివాసితో రామ! రాజ్యహేతో ర్మహాబలః. ౧౪

స తే సహాయో మిత్రం చ సీతాయాః పరిమార్గణే,
భవిష్యతి హి తే రామ! మా చ శోకే మనః కృథాః. ౧౫

భవితవ్యం హి యచ్చాపి న త చ్ఛక్య మి హాన్యథా,
కర్తు మిక్ష్వాకుశార్దూల! కాలో హి దురతిక్రమః. ౧౬

గచ్ఛ శీఘ్ర మితో రామ! సుగ్రీవం తం మహాబలమ్,

వయస్యం తం కురు క్షిప్ర మితో గత్వాఽద్య రాఘవ!. ౧౭
అద్రోహాయ సమాగమ్య దీప్యమానే విభావసౌ,

సచ తే నావమన్తవ్య స్సుగ్రీవో వానరాధిపః. ౧౮
కృతజ్ఞః కామరూపీ చ సహాయార్థీ చ వీర్యవాన్,

శక్తౌ హ్యద్య యువాం కర్తుం కార్యం తస్య చికీర్షితమ్. ౧౯
కృతార్థో వాఽకృతార్థో వా కృత్యం తవ కరిష్యతి,

స ఋక్షరజసః పుత్త్రః పమ్పా మటతి శఙ్కితః. ౨౦
భాస్కర స్యౌరసః పుత్త్రో వాలినా కృతకిల్బిషః,

సన్నిధా యాఽయుధం క్షిప్ర మృశ్యమూకాలయం కపిమ్.
కురు రాఘవ! సత్యేన వయస్యం వనచారిణమ్,
స హి స్థానాని సర్వాణి కార్త్స్న్యేన కపికుఞ్జరః. ౨౨
నరమాంసాశినాం లోకే నైపుణ్యా దధిగచ్ఛతి,

రాముఁడా! అతిశయన్న వాలి రాజ్యము నిమిత్తమయి మహాబలుఁడగు నాసుగ్రీవుని యూరువెడలఁగొట్టినాఁడు. ౧౪

రాముఁడా! ఆసుగ్రీవుఁడు సీతను వెదకుటయందును నీకు హితము సేయుటయందును నీకు తోడును స్నేహితుఁడునుగా నుండఁగలఁడు. నీవు మనంబున దుఃఖం బుంచకుము. ౧౫

ఇక్ష్వాకువంశమునఁ బుట్టినవారలలో నుత్తముఁడవగు రాముఁడా! మఱియు నేది యెట్లు కావలయునో అది యట్లే యగును గాని దాని వేఱువిధముగాఁజేయ నెవరికి నలవి కాదు. కాలమును ఎవ్వ రతిక్రమింపఁజాలుదురు?

రాముఁడా! నీ విచ్చటనుండి బయలుదేఱి శీఘ్రమున మహాబలశాలి యగు నాసుగ్రీవునొద్దకుఁ బొమ్ము.

రాముఁడా! నీ విప్పుడు శీఘ్రమున నిచ్చటనుండిపోయి సుగ్రీవునిం జేరి ఎవ్వరికిని మఱల ద్రోహబుద్ధిగలుగకుండుటకై దీప్యమానంబగు నగ్నిసాక్షిగా నుంచుకొని యతని మిత్రుం జేసికొనుము. ౧౭

కృతజ్ఞుఁడును గామరూపియు ఆపన్నుఁడై సహాయముం గోరుచున్నవాఁడును బరాక్రమశాలియునగు వానరాధీశ్వరు నాసుగ్రీవుని నీవు వానరుఁడితఁ డెంతమాత్రమని చులకనగాఁ దలంపరాదు. ౧౮

మీర లిప్పు డాసుగ్రీవుఁడు కోరియుండుకార్యమును సాధించుటకు సమర్థులరై యున్నారుగదా అతఁడును తనకార్యము నెఱవేఱినను నెఱవేఱకున్నను మీకార్యమును జేయును ౧౯

ఋక్షరజానిక్షేత్రంబున సూర్యునివీర్యంబునకుఁ బుట్టిన యాసుగ్రీవుఁడు వాలితో వైరంబు చేసికొని భయంబునఁ బంపాతీరంబున సంచరించుచున్నాఁడు. ౨౦

రాముఁడా నీవు శీఘ్రంబునఁబోయి అయుధసాక్షికంబుగా సత్యముచేత ఋశ్యమూకపర్వతంబుననున్న సుగ్రీవునితో సఖ్యము గావింపుము. ౨౧

వానరోత్తముఁడగు నాసుగ్రీవుఁడు లోకంబున రాక్షసులుండుస్థానంబుల నన్నింటిని తనసామర్థ్యంబువలంజేసి ఎఱింగియున్నాఁడు. ౨౨

న తస్యావిదితం లోకే కించి దస్తి హి రాఘవ!. ౨౩
యావ త్సూర్యః ప్రతపతి సహస్రాంశు రరిన్దమ!,

స నదీ ర్విపులాన్ శైలా న్గిరిదుర్గాణి కన్దరాన్. ౨౪
అన్వీక్ష్య వానరై స్సార్థం పత్నీం తేఽధిగమిష్యతి,

వానరాం శ్చ మహాకాయా న్ప్రేషయిష్యతి రాఘవ!. ౨౫
దిశో విచేతుం తాం సీతాం త్వద్వియోగేన శోచతీమ్,
స జ్ఞాస్యతి వరారోహాం నిర్మలాం రావణాలయే. ౨౬

స మేరుశృఙ్గాగ్రగతా మనిన్దితాం
ప్రవిశ్య పాతాళతలేఽపివా శ్రితామ్,
ప్లవఙ్గమానాం ప్రవర స్తవ ప్రియాం
నిహత్య రక్షాంసి పునః ప్రదాస్యతి. ౨౭

ఇతి శ్రీమదరణ్యకాణ్డే ద్విసప్తతితమ స్సర్గః. ౭౨

---

## త్రిసప్తతితమ స్సర్గః.

నిదర్శయిత్వా రామాయ సీతాయాః ప్రతిపాదనే,
వాక్య మన్వర్థ మర్థజ్ఞః కబన్ధః పున రబ్రవీత్. ౧

ఏష రామ! శివః పన్థా యత్రైతే పుష్పితా ద్రుమాః,
ప్రతీచీం దిశ మాశ్రిత్య ప్రకాశన్తే మనోరమాః. ౨
జమ్బ్వా ప్రియాళ పనస ప్లక్ష న్యగ్రోధ తిన్దుకాః,
అశ్వత్థాః కర్ణికారాశ్చ చూతా శ్చాన్యే చ పాదపాః. ౩
ధన్వనా నాగవృక్షా శ్చ తిలకా నక్తమాలకాః,

శత్రువులనడంగఁద్రొక్కనట్టి రామచంద్రా! సహస్రకిరణుఁడగు సూర్యుఁ
డెంతవఱకు నెండగాయుచున్నాఁడో అంతవఱకు ఈలోకంబున ఆసుగ్రీవు
నకుఁ దెలియని ప్రదేశ మేమియులేదు. ౨౩.

ఆసుగ్రీవుఁడు వానరులంగూడి విశాలంబులగు పర్వతంబులను గుహ
లను దుర్గమంబులగు పర్వతప్రదేశములను గుహాలను వెదకి నీభార్యయగు
సీత యుండుస్థలంబు నెఱుంగఁగలఁడు. ౨౪

నీవియోగంబునంజేసి పరితపించుచున్న సీతను వెదకుటకై యాసుగ్రీ
వుఁడు మహాకాయులగు వానరులను దిక్కులకుం బంపును. ౨౫

ఆసుగ్రీవుఁడు రావణు నింటనున్నదియు మహాపతివ్రతయు సుందరం
బులగు పిఱుందులు గలదియు నగు సీతాదేవిని గనుఁగొనఁగలఁడు. ౨౬

వానరోత్తముఁడగు నాసుగ్రీవుఁడు నీ ప్రియురాలగు సీత మేరుశిఖ
రాగ్రంబుననున్నను పాతాళలోకంబుననున్నను అచ్చటికిఁబోయి రాక్షసుల
నందఱవధించి నీకు మఱల నొసంగఁగలఁడు. అని కబంధుఁడు రామునితోఁ
జెప్పెను. ౨౭

ఇది డెబ్బదిరెండవసర్గము.

---

## డెబ్బదిమూఁడవసర్గము.

కార్యములు సాధించుటయందుఁ బండితుఁడగు నాకబంధుఁడు ఈప్ర
కారంబున రామునకు సీతం బొందు నుపాయంబుఁ జెప్పి మఱల అర్థ
యుక్తంబగు నీమాటం జెప్పెను. ౧.

రామచంద్రా! ఇట్లు పడమటిప్రక్కను నేరేడుచెట్లును మోరటిచెట్లు
ను, పనసవృక్షంబులును, జువ్విచెట్లును, వటవృక్షంబులును తిందుకవృక్షము
లును, అశ్వత్థవృక్షంబులును. కర్ణికారంబులును, మామిడిచెట్లును, మఱియు
నితరములు పెక్కువృక్షములును, చంద్రచెట్లును, పొన్నలును, తిలకంబు
లును, కానుగులును, నీలాశోకంబులును, కదంబంబులును, కరవీరంబులును,

నీలాశోకాః కదమ్బాశ్చ కరవీరాశ్చ పుష్పితాః. ౪
అగ్నిముఖ్యా అశోకాశ్చ సురక్తాః పారిభద్రకాః,
తా నారుహ్యాథవా భూమౌ పాతయిత్వా చ తా న్బలాత్. ౫
ఫలా న్యమృతకల్పాని భక్షయన్తౌ గమిష్యథః,

త దతిక్రమ్య కాకుత్స్థ! వనం పుష్పితపాదపమ్. ౬
నన్దనప్రతిమం చాన్య త్కురవో హ్యుత్తరా ఇవ,

సర్వకామఫలా వృక్షాః పాదపా స్తు మధుస్రవాః. ౭

సర్వే చ ఋతవ స్తత్ర వనే చైత్రరథే యథా,

ఫలభారానతా స్తత్ర మహావిటపధారిణః. ౮
శోభన్తే సర్వత స్తత్ర మేఘపర్వతసన్నిభాః,

తా నారుహ్యాథవా భూమౌ పాతయిత్వా యథాసుఖమ్. ౯
ఫలా న్యమృతకల్పాని లక్ష్మణ స్తే ప్రదాస్యతి,
చఙ్క్రమన్తౌ వరా న్దేశాన్ శైలా చ్ఛైలం వనా ద్వనమ్. ౧౦
తతః పుష్కరిణీం వీరౌ పమ్పాం నామ గమిష్యథః,
అశర్కరా మవిభ్రంశాం సమతీర్థా మశైవలామ్. ౧౧
రామ! సంజాతవాలూకాం కమలోత్పలశాలినీమ్,

తత్ర హంసాః ప్లవాః క్రౌఞ్చాః కురరా శ్చైవ రాఘవ!. ౧౨
వల్గుస్వనాని కూజన్తి పమ్పాసలిలగోచరాః,

భల్లాతకంబులును, అశోకంబులును, వేపచెట్లును బుష్పితంబులయి మనోహరంబుగాఁ బ్రకాశించుచున్నవే ఇదియే శుభమైనమార్గము. ౨-౩-౪

మీరలు ఆవృక్షముల నారోహించిగాని లేక బలంబున వాని నేలం బడఁద్రోచిగాని అమృతసమానంబులగు వానిఫలంబులను భక్షించుచుఁ బోఁగలరు. ౫

రాముఁడా! ఆవనము దాఁటగానే పుష్పించియుండువృక్షములంగల చైత్రరథనందనవనములంబోలునదియు నుత్తరకురుదేశమువలె సర్వకామసమృద్ధంబునగు మఱియొక వనం బున్నది. ౬

అచ్చటివృక్షంబులు నానావిధరమణీయఫలంబులుగలిగి తేనెస్రవించుచుండును. ౭

కుబేరుని చైత్రరథవనంబునందుం బోలె నవ్వనంబున నెల్లప్పుడును సమస్తఋతువులును సన్నిహితంబు లయియుండును.

అవ్వనంబునం దంతటను వృక్షంబులు పెద్దపెద్దకొమ్మలుకలవై ఫలంబు లధికంబుగాఁ గలుగుటంజేసి వంగినవై మేఘపర్వతాకారంబులయి ప్రకాశించుచుండును. ౮

లక్ష్మణుఁడు ఆవృక్షంబుల నారోహించిగాని లేక నేలంబడద్రోసిగాని యమృతసమానంబులగు ఫలంబులం గోసి నీ కొసంగఁగలఁడు. ౯

రాముఁడా! అంతఁబరాక్రమవంతులగు మీరలు ఈపర్వతంబున నుండి ఆపర్వతంబునకు ఈవనంబుననుండి యావనంబునకు ఇట్లుత్తమప్రదేశంబుల విహరించుచుఁబోయి మెుఱపరాళ్లుగాని జాఱుటగాని పాఁచి గాని లేక అంత మిట్టయు నంత లోఁతునుంగాని రేవులుగలిగి మంచియిసుకతోఁ గూడి కమలోత్పలంబులతో నొప్పుచున్నపంప యనుసరస్సును బొందఁగలరు. ౧౦-౧౧

రాముఁడా! ఆపంపాసరసియందు హంసలును ప్లవంబులును క్రౌంచంబులును కురరంబులును మధురంబుగాఁ గూయుచుండును. ౧౨

నోద్విజన్తే నరా న్దృష్ట్వా వధస్యాకోవిదా శ్శుభాః. ౧౩

ఘృతపిణ్డోపమాన్ స్థూలాం స్తా న్ద్విజా న్భక్షయిష్యథః,

రోహితా న్వక్రతుణ్డాం శ్చ నడమీనాం శ్చ రాఘవ!.
పమ్పాయా మిషుభి ర్మత్స్యాం స్తత్ర రామ! వరా న్హతాన్,
ని స్త్వక్పక్షా నయ స్తప్తా నకృశా నేకకణ్టకాన్. ౧౪
తవ భక్త్యా సమాయుక్తో లక్ష్మణ స్సమ్ప్రదాస్యతి,

భృశం తే ఖాదతో మత్స్యా న్పమ్పాయాః పుష్పసంచయే.
5ద్మగన్ధి శివం వారి సుఖశీత మనామయమ్,
ఉద్ధృత్య సతతాక్లిష్టం రౌప్యస్ఫాటికసన్నిభమ్. ౧౬
అసౌ పుష్కరపర్ణేన లక్ష్మణః పాయయిష్యతి,

స్థూలా న్గిరిగుహాశయ్యా న్వరాహా న్వనచారిణః. ౧౭
అపాం లోభా దుపావృత్తా న్వృషభా నివ నర్దతః,
రూపాన్వితాంశ్చ పమ్పాయాం ద్రక్ష్యసి త్వం నరోత్తమ!.
సాయాహ్నే విచర న్రామ! విటపీ న్మాల్యధారిణః,
శీతోదకం చ పమ్పాయాం దృష్ట్వా శోకం విహాస్యసి. ౨౦

సుమనోభి శ్చితాం స్తత్ర తిలకా న్నక్తమాలకాన్,
ఉత్పలాని చ ఫుల్లాని పఙ్కజాని చ రాఘవ! ౨౧

న తాని కశ్చి న్మాల్యాని త త్రారోపయితా నరః,
నచ వై మ్లానతాం యాన్తి నచ శీర్యన్తి రాఘవ!. ౨౨

వధ మెట్టిదో యెఱుఁగనివగుటచేత సుందరంబులగు నాపక్షులు మనుష్యులం జూచి భయపడవు. ౧౩

నేతిముద్దవంటివియు మాంసపుష్టంబులు నగు నాపక్షులను మీరు భక్షింపఁగలరు.

రాముఁడా! అచ్చట పంపాసరస్సునందు లక్ష్మణుఁడు ఉత్తమంబులును బలిసియున్నవియు అధికముగా ముండ్లులేనివియునగు గండుమీనులు చౌరమీనులు రొయ్యమీనులు మొదలుగాఁగల మత్స్యంబులను బాణంబులచే వధించి చర్మమును ఱెక్కలనుందీసి యినుపశలాకం గ్రుచ్చి పక్వముగావించి భక్తితో నీ కొసంగఁగలఁడు. ౧౪-౧౫

నీ వట్లు యథేచ్ఛముగా మత్స్యములు భక్షించుచుండఁగా లక్ష్మణుఁడు పుష్పరాశి గలసియుండుటం జేసి కమలగంధియు పాపహరంబును సుఖకరంబగునట్లు చల్లఁగా నుండునదియు ఆరోగ్యంబును స్వచ్ఛమును వెండివలె స్ఫటికశిలవలెఁ బ్రకాశించుచున్నదియు నగుజలంబును పంపాసరస్సునుండి తామరాకు దొప్పతోఁ గొని తెచ్చి నీ కొసంగఁగలఁడు ౧౬,౧౭

పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! ఆపంపాసరస్సునకు నీళ్ళుత్రావుటకుఁగా వచ్చునట్టిస్థూలంబులును బర్వతగుహలనుండునవియు ఆఁబోతులంబోలె గర్జించునవియు సుందరంబులునగు వరాహంబులం జూడఁగలవు. ౧౮-౧౯

రాముఁడా! నీవు సాయంకాలంబున విహరించుచుఁ బుష్పమాలికలు ధరించియుండువృక్షంబులను పంపాసరస్సునందలి చల్లనినీళ్లనుం జూచి దుఃఖము విడిచి సంతోషంబు నొందఁగలవు. ౨౦

రాముఁడా! నీ వచ్చట పుష్పములతో నిండియుండుతిలకవృక్షంబులను నక్తమాలంబులను వికసించిన కలువలను కమలంబులనుం జూచి దుఃఖములేనివాఁడవు కాఁగలవు. ౨౧

రాముఁడా! అచ్చట నాపుష్పంబుల ధరించువాఁ డెవ్వఁడును లేఁడు. అవి వాడిపోవకుండుటయే గాక రాలుటయు లేక క్రొత్తపుష్పములమాడ్కి నెల్లప్పుడును జూపట్టుచుండును. ౨౨

మతఙ్గశిష్యా స్తత్రాఽఽస న్నృషయ స్సుసమాహితాః,

తేషాం భారాభితప్తానాం వన్యమాహరతాం గురోః. ౨౩
యే ప్రపేతు ర్మహీం తూర్ణం శరీరా త్స్వేదబిన్దవః,
తాని జాతాని మాల్యాని మునీనాం తపసా తదా. ౨౪
స్వేదబిన్దుసముత్థాని న వినశ్యన్తి రాఘవ!,

తేషాం గతానా మద్యాపి దృశ్యతే పరిచారిణీ. ౨౫
శ్రమణీ శబరీ నామ కాకుత్స్థ! చిరజీవినీ,
త్వాంతు ధర్మే స్థితా నిత్యం సర్వభూతనమస్కృతమ్. ౨౬
దృష్ట్వా దేవోపమం రామ! స్వర్గలోకం గమిష్యతి,

తత స్తద్రామ! పమ్పాయా స్తీర మాశ్రిత్య పశ్చిమమ్. ౨౭
ఆశ్రమస్థాన మతులం గుహ్యం కాకుత్స్థ! పశ్యసి,

న తత్రాక్రమితుం నాగా శ్శక్నువన్తి త మాశ్రమమ్. ౨౮
వివిధా స్తత్ర వై నాగా వనే తస్మిం శ్చ పర్వతే,

ఋషే స్తత్ర మతఙ్గస్య విధానా త్తచ్చ కాననమ్. ౨౯

తస్మి న్నన్దనసఙ్కాశే దేవారణ్యోపమే వనే,
నానావిహగసంకీర్ణే రంస్యసే రామ! నిర్వృతః. ౩౦

ఋశ్యమూకశ్చ పమ్పాయాః పురస్తా త్పుష్పితద్రుమః,

అచ్చట మతంగమహాముని శిష్యులయిన యుత్తమంబగు సమాధిగల మహర్షు లుండిరి.

ఆమునులు గురువునకుఁగా వన్యపదార్థములం గొనిపోవుచు బరువుచేఁ బీడింపఁబడఁగా వారిదేహంబుననుండి నేలంబడిన చెమటబిందువులన్నియు వారి తపోబలాతిశయంబునం జేసి పుష్పంబులయినవి. ౨౪

రాముఁడా! ఆమునుల చెమటబిందువులవలనం బుట్టినయాపుష్పంబులు వారితపోమహిమంబునంజేసి నాశంబు నొందకున్నవి.

రాముఁడా! ఆమతంగశిష్యులందఱు స్వర్గస్థులైరి. వారలపనికత్తె చిరజీవినియయిన సన్యాసిస్త్రీ శబరి యనుపేరుగలదిమాత్రము ఇప్పటికి నున్నది.

రాముఁడా! ఎల్లప్పుడును ధర్మమునే యాశ్రయించియున్నట్టి యా శబరి సమస్తభూతంబులచేతను నమస్కరింపఁబడినవాఁడవును దేవేంద్రతుల్యుండవు నగు నీదర్శంబునొంది స్వర్గలోకంబునకుఁ బోఁగలదు. ౨౬

రాముఁడా! అంత నీ వాపంపాసరస్సుయొక్క పశ్చిమతీరంబునకుఁ బోదువేని యచ్చట యుత్తమంబును రహస్యంబునగునొక్కయాశ్రమపదంబుఁ జూడఁగలవు. ౨౭

అచ్చట ఏనుంగులు అయ్యాశ్రమంబులోనికిఁ బోఁజాలవు. ౨౮

అవ్వనంబునందును ఆపర్వతంబునందును నానావిధంబులయిన గజంబులు పెక్కులున్నవి.

ఆయాశ్రమవనంబు మతంగమహర్షిచే నిర్మింపఁబడినది కావున చుట్టు ప్రక్కలవనంబునందును ఏనుఁగులు కావలసినవి యున్నను అవ్వనంబునకు మాత్రము మతంగమహాముని తపఃప్రభావంబున నయ్యేనుఁగులు పోఁజాలవు.

రాముఁడా! నందనము చైత్రరథము మొదలగు దేవవనములతో సమానమయినదియు మధురంబుగాఁ గూయుచుండు నానావిధపక్షులతోఁ గూడినదియు నగు నావనంబునందు నీవు దుఃఖము వీడి విహరింపఁగలవు. ౩౦

పుష్పితంబులగువృక్షములుగలదియు ఏనుఁగుపిల్ల లెచ్చుగాఁ గల్గియుం

సుదుఃఖారోహణో నామ శిశునాగాభిరక్షితః. 3౧
ఉదారో బ్రహ్మణా చైవ పూర్వకాలే వినిర్మితః,

శయానః పురుషో రామ! తస్య శైలస్య మూర్ధని. 3౨
య త్స్వప్నే లభతే విత్తం త త్ప్రబుద్ధోఽధిగచ్ఛతి,

న త్వేనం విషమాచారః పాపకర్మాఽధిరోహతి. 33

య స్తు తం విషమాచారః పాపకర్మాఽధిరోహతి,
తత్రైవ ప్రహర న్త్యేనం సుప్త మాదాయ రాక్షసాః. 3౪

తత్రాపి శిశునాగానా మాక్రన్ద శ్శ్రూయతే మహాన్,
క్రీడతాం రామ! పమ్పాయాం మతఙ్గారణ్యవాసినామ్. 3౫

సిక్తా రుధిరధారాభి స్సంహృత్య పరమద్విపాః,
ప్రచర న్తి పృథక్కీర్ణా మేఘవర్ణా స్తరస్వినః. 3౬

తే తత్ర పీత్వా పానీయం విమలం శీత మవ్యయమ్.
నిర్వృతా స్సంవిగాహన్తే వనాని వనగోచరాః, 3౭

ఋక్షాం శ్చ ద్వీపిన శ్చైవ నీలకోమలకప్రభాన్,
రురూ నపేతాపజయా న్దృష్ట్వా శోకం జహిష్యసి. 3౮

రామ! తస్య తు శైలస్య మహతీ శోభతే గుహా,
శిలాపిధానా కాకుత్స్థ! దుఃఖం చాస్యాః ప్రవేశనమ్. 3౯

డుటంజేసి యారోహింప సులభసాధ్యముకానిదియుఁ బ్రశస్తంబును మున్ను
బ్రహ్మదేవునిచేత నిర్మింపఁబడినదియు నగు ఋశ్యమూకపర్వతము పంపాసర
స్సునకు ముందటనే యున్నది. ౩౧

రాముఁడా! ఋశ్యమూకపర్వతశిఖరంబునఁ బరుండినపురుషుఁడు ఏధ
నమును పొందినట్లు కలగనునో మేలుకొన్నపిమ్మట ఆధనమును దప్పక పొం
దును. ౩౨

పాపిష్ఠుఁడును దురాచారవంతుఁడు నగువాఁడుమాత్రము ఈపర్వతము
నారోహింపఁజాలఁడు. ౩౩

ఎవ్వఁడేని దురాచారసంపన్నుఁడును పాపిష్ఠుఁడు నగువాఁడు ఆపర్వ
తంబు నారోహించునేని రాక్షసులు అచ్చటనే నిదురనొందినప్పుడతనింబట్టి
వధింతురు. ౩౪

రాముఁడా! పంపాసరస్సునఁ గ్రీడించుచుండు మతంగవనవాసులగు
నేనుఁగుపిల్లల గర్జధ్వనులు సమీపంబగుటవలన ఋశ్యమూకపర్వతంబున వినఁ
బడుచుండును. ౩౫

మేఘములవలె నల్లని మేనుగలవియు బలవంతంబులు నగు నాయుత్తమ
గజంబులు ఒకొకప్పుడు పరస్పరము నెత్తురువెల్లువలుగాఁ గొట్టుకొని యంత
వేఱువేఱ విహరించుచుండును. ౩౬

వనంబులనుండునట్టి యాయేనుఁగులు పంపాసరస్సున నిర్మలంబును
సుఖశీతలంబును ఆరోగ్యకరంబునగు జలంబుద్రావి సుఖితంబులయి వనంబు
లం బ్రవేశించును. ౩౭

నీ విచ్చటనుండు నెలుఁగుబంటులను వ్యాఘ్రంబులను నీలమణికిఁ
బోలె మనోహరకాంతిగలవియు భయమునే యెఱుఁగనివియు నగు నల్లచా
ఱల దుప్పులను జూచి దుఃఖము మఱచి సుఖంబు నొందఁగలవు. ౩౮

రాముఁడా! ఆపర్వతమునందు పెనుఱాయిచే మూయఁబడియుండు
నొకగొప్పగుహ ప్రకాశించుచున్నది. దానిలోనికిఁ బోవుట మిక్కిలియుఁ
గష్టము. ౩౯

తస్యా గుహాయాః ప్రాగ్ద్వారే మహాన్ శీతోదకో హ్రదః,
ఫలమూలాన్వితో రమ్యో నానామృగసమావృతః. ౪౦

తస్యాంవసతి సుగ్రీవ శ్చతుర్భి స్సహ వానరైః,
కదాచి చ్ఛిఖరే తస్య పర్వత స్యావతిష్ఠతే. ౪౧

కబన్ధ స్త్వనుశాస్యైవం తా వుభౌ రామలక్ష్మణౌ,
స్రగ్వీ భాస్కరవర్ణాభః ఖే వ్యరోచత వీర్యవాన్. ౪౨

తం తు ఖస్థంమహాభాగంకబన్ధం రామలక్ష్మణౌ,
ప్రస్థితౌ త్వం వ్రజ స్వేతి వాక్య మూచతు రన్తికే. ౪౩
గమ్యతాం కార్యసిద్ధ్యర్థ మితి తా వబ్రవీ త్స చ,
సుప్రీతౌ తా వనుజ్ఞాప్య కబన్ధః ప్రస్థిత స్తదా. ౪౪

స తత్కబన్ధః ప్రతిపద్య రూపం
వృత శ్శ్రియా భాస్కరతుల్యదేహః,
నిదర్శయ న్రామ మవేక్ష్య ఖస్థ
స్సఖ్యం కురుష్వేతి తదాఽభ్యువాచ. ౪౫

ఇతి శ్రీమదరణ్యకాణ్డే త్రిసప్తతితమ స్సర్గః. 73.

---

## చతుస్సప్తతితమస్సర్గః.

తౌ కబన్ధేన తం మార్గం పమ్పాయా దర్శితం వనే,
ప్రతస్థతు ర్దిశం గృహ్య ప్రతీచీం నృపరాత్మజౌ. ౧
తౌ శైలే ష్వాచితానేకా న్క్షౌద్రకల్పఫలా న్ద్రుమాన్
వీక్షన్తౌ జగ్మతు ర్ద్రష్టుం సుగ్రీవం రామలక్ష్మణౌ. ౨

ఆగుహాయొక్క పూర్వద్వారంబున తీరంబులందు ఫలమూలంబులతోఁ గూడినదియు నానావిధమృగసమన్వితంబును సుందరంబును చల్లనినీళ్లుగలదియు నగు నొకగొప్పమడుఁగున్నది. ౪౦

సుగ్రీవుఁడు నలువురు వానరులం గూడి ఆగుహాయందున్నాఁడు. ఒకానొకప్పుడు అతఁడు విహారార్థము ఆఋశ్యమూకపర్వతశిఖరంబుపైన నం దిరుగును. అని కబంధుఁడు రామలక్ష్మణులకుఁ జెప్పెను. ౪౧

పరాక్రమశాలియగు నాకబంధుఁడు ఇట్లు రామలక్ష్మణుల కిద్దఱకును జెప్పి పుష్పమాలికలతో నొప్పుచు సూర్యుఁడుంబోలె నాకాశంబున వెలుఁగుచుండెను. ౪౨

రామలక్ష్మణు లంత బయలుదేఱినవారలయి ఆకాశంబుననున్న మహాభాగుఁడగు కబంధుని సమీపించి "నీ వింక పోవచ్చును" అని చెప్పిరి ౪౩

అప్పుడు కబంధుఁడును రామలక్ష్మణులంజూచి "కార్యసిద్ధికై అనుమీరలుపొం"డని చెప్పి సంతుష్టులయిన యారామలక్ష్మణుల యనుమతిఁ గైకొని పోయెను. ౪౪

అప్పు డాకబంధుఁడు అట్లు దివ్యరూపంబు నొంది మహాతేజంబున సూర్యుఁడువలె వెలుఁగుచు నాకాశంబుననుండి రాముంజూచి ఋశ్యమూకమార్గంబుఁ జూపుచు "సుగ్రీవునితోఁ దప్పక సఖ్యంబు గావింపు" మని చెప్పెను. ౪౫

ఇది డెబ్బదిమూఁడవసర్గము.

---

## డెబ్బదినాలవసర్గము.

రాజపుత్రులగు రామలక్ష్మణులు కబంధుఁడు చెప్పినప్రకారంబునఁ బంపాసరోవరంబునకుఁ బోవుమార్గంబునవలంబించి పడమటిదిక్కును బట్టి పోయిరి. ౧

ఆరామలక్ష్మణులు పర్వతంబులనిండియుండు తేనియవంటిఫలంబులుగలవృక్షంబులఁ జూచుచు సుగ్రీవునిం జూడవలెనను కోర్కెతోఁ బోయిరి

కృత్వా చ శైలపృష్ఠే తు తౌ వాసం రఘునన్దనౌ,
పమ్పాయాః పశ్చిమం తీరం రాఘవా వుపతస్థతుః. 3
తౌ పుష్కరిణ్యాః పమ్పాయా స్తీర మాసాద్య పశ్చిమమ్,
అపశ్యతాం తత స్తత్ర శబర్యా రమ్య మాశ్రమమ్. ౪
తౌ త మాశ్రమ మాసాద్య ద్రుమై ర్బహుభి రావృతమ్,
సురమ్య మభివీక్షన్తౌ శబరీ మభ్యుపేయతుః. ౫

తౌ చ దృష్ట్వా తదా సిద్ధా సముత్థాయ కృతాఞ్జలిః,
రామస్య పాదౌ జగ్రాహ లక్ష్మణస్య చ ధీమతః. ౬

పాద్య మాచమనీయం చ సర్వం ప్రాదా ద్యథావిధి,
తా మువాచ తతో రామ శ్శ్రమణీం సంశితవ్రతామ్. ౭

కచ్చి త్తే నిర్జితా విఘ్నాః! కచ్చి త్తే వర్ధ తే తపః!,
కచ్చి త్తే నియతః క్రోధ! ఆహార శ్చ తపోధనే!. ౮

కచ్చి త్తే నియమాః ప్రాప్తాః కచ్చి త్తే మనస స్సుఖమ్!,
కచ్చి త్తే గురుశుశ్రూషా సఫలా చారుభాషిణి!. ౯

రామేణ తాపసీ పృష్టా సా సిద్ధా సిద్ధసమ్మతా,
శశంస శబరీ వృద్ధా రామాయ ప్రత్యుపస్థితా. ౧౦

అద్య ప్రాప్తా తపస్సిద్ధి స్తవ సందర్శనా న్మయా,
అద్య మే సఫలం తప్తం గురవ శ్చ సుపూజితాః. ౧౧

ఆరామలక్ష్మణులు పర్వతంబుపై నారాత్రియుండి మఱునాఁడు పంపాసరోవరముయొక్క పశ్చిమతీరంబు నొందిరి. ౩

ఆరామలక్ష్మణులు పంపాసరస్సుపశ్చిమతీరంబుఁజేరి యంత నచ్చట రమణీయంబగు శబరియాశ్రమంబుఁ జూచిరి. ౪

ఆరామలక్ష్మణులు బహువృక్షములచేఁ బరివేష్టితమయిన యాశబర్యాశ్రమమునుజేరి యందలి సౌందర్యంబున కచ్చెరువంది చూచుచు శబరియొద్దకుఁబోయిరి. ౫

అప్పుడు యోగసిద్ధినొందియున్న యాశబరి యారామలక్ష్మణులం జూచినంతనె లేచి చేమోడ్చుఁగిలించి రామునిపాదంబులకును నమస్కరించి బుద్ధిమంతుఁడగు లక్ష్మణునిపాదంబులకును నమస్కరించెను. ౬

అంత రామలక్ష్మణులకు యథాశాస్త్రముగా అర్ఘ్యపాద్యంబులను ఆచమనీయంబును ఒసఁగెను.

అంత రాముఁడు తీక్ష్ణమగు వ్రతముగల సన్న్యాసినియగు నాశబరిం జూచి యిట్లని చెప్పెను. ౭

తపస్సే ధనముగాఁగల శబరీ! నీవు తపోవిఘ్నంబు లన్నిఁటిని జయించితివా? నీతపస్సు వృద్ధిఁబొందుచున్నదా? కోపంబును ఆహారంబును నిగ్రహించి కొంటివా? ౮

సుందరముగా మాటలాడునట్టి శబరీ! నీవు చాంద్రాయణాదివ్రతంబులం బొందితివాయేమి? నీమనస్సు సుఖముగానున్నదాయేమి? నీవుచేసిన శుశ్రూష సఫలమయినదా యేమి? అని రాముఁడు శబరి నడిగెను. ౯

తపస్వినియు సిద్ధురాలునుసిద్ధులచే గౌరవింపఁబడినదియు వృద్ధురాలునగు నాశబరి రామునిచే నట్లడుగఁబడినదై రాముని యెదుట నిలిచి యిట్లని చెప్పెను. ౧౦

నీదర్శనముచేయుటవలన ఇప్పుడు నాకుఁ దపస్సిద్ధిగలిగినది. ఇప్పుడు నాతపస్సంతయు సఫలమయినది. ఇప్పుడు నాగురుశుశ్రూషయు సఫలమయినది. ౧౧

అద్య మే సఫలం జన్మ స్వర్గ శ్చైవ భవిష్యతి,
త్వయి దేవవరే రామ! పూజితే పురుషర్షభ!. ౧౨

చక్షుషా తవ సౌమ్యేన పూతాఽస్మి రఘునన్దన!,
గమిష్యా మ్యక్షయా న్లోకాం స్త్వత్ప్రసాదా దరిన్దమ!. ౧౩

చిత్రకూటం త్వయి ప్రాప్తే విమానై రతులప్రభైః,
ఇత స్తే దివ మారూఢా యా నహం పర్యచారిషమ్. ౧౪

తై శ్చాహ ముక్తా ధర్మజ్ఞై ర్మహాభాగై ర్మహర్షిభిః,

ఆగమిష్యతి తే రామ స్సుపుణ్య మిమ మాశ్రమమ్. ౧౫
స తే ప్రతిగ్రహీతవ్య స్సౌమిత్రిసహితోఽతిథిః,

తంచ దృష్ట్వా వరా న్లోకా నక్షయ్యాం స్త్వం గమిష్యసి. ౧౬

మయా తు వివిధం వన్యం సఞ్చితం పురుషర్షభ!,
తవార్థే పురుషవ్యాఘ్ర! పమ్పాయా స్తీరసమ్భవమ్ ౧౭

ఏవ ముక్త స్స ధర్మాత్మా శబర్యా శబరీ మిదమ్,
రాఘవః ప్రాహ విజ్ఞానే తాం నిత్య మబహిష్కృతామ్. ౧౮
దనో స్సకాశా త్తత్త్వేన ప్రభావం తే మహాత్మనః,
శ్రుతం ప్రత్యక్ష మిచ్ఛామి సన్ద్రష్టుం యది మన్యసే. ౧౯

పురుషశ్రేష్ఠుఁడవగు రామునఁడా! దేవతలయందఱిలోను ఉత్తముఁడవగు నిన్నుఁ బూజించుటవలన ఇప్పుడు నాజన్మము సఫలమయినది. నా కింక స్వర్గాదిదివ్యలోకంబులును సిద్ధింపఁగలవు. ౧౨

శత్రువుల నడఁగఁద్రొక్కునట్టి రామునఁడా! నీసౌమ్యదృష్టిచేత పాపంబులన్నియు హరింపఁబడి నేను బరిశుద్ధురాలనైతిని. నీయనుగ్రహంబువలన ఇంక నక్షయంబులగు పుణ్యలోకంబులకుఁ బోయెదను. ౧౩

నే నెవ్వరిని సేవించుచుంటినో యామతంగశిష్యులగు మహర్షులు నీవు చిత్రకూటంబునకు వచ్చినప్పుడే మహాతేజంబున వెలుఁగుచుండు విమానంబుల నారోహించి స్వర్గంబునొందిరి. ౧౪

ధర్మజ్ఞులును మహాభాగులునగు నమ్మహర్షులు అప్పుడు నన్ను జూచి యిట్లని చెప్పిరి.

రాముఁడు నిన్నుఁజూచుటకై పవిత్రమగు నీయాశ్రమంబునకు రాఁగలఁడు. అప్పుడు నీవు రామునకును లక్ష్మణునకును జక్కఁగా నతిథిసత్కారంబు గావింపవలయును, ౧౫

నీ వారాముని సందర్శించి పునరావృత్తిలేనట్టి యుత్తమంబులగు పుణ్యలోకంబులం బొందఁగలవు. అని యమ్మహామునులు నాకుఁ జెప్పిరి. ౧౬

పురుషోత్తముఁడవగు రామునఁడా! నేను నీనిమిత్తమయి పంపాసరస్సు తీరంబులం బుట్టిన నానావిధమయిన ఫలాదివన్యపదార్థములను అప్పటినుండి సేకరించియున్నాను. అని శబరి రామునితోఁ జెప్పెను. ౧౭

ధర్మాత్ముఁడగు నారాముఁడు శబరి చెప్పిన మాటను విని ఎల్లప్పుడును బ్రహ్మజ్ఞానానుసంధానపరాయణయయిన యాశబరింజూచి యిట్లని చెప్పెను.

మహాత్ముఁడగు కబంధుఁడు నీ యొక్కయు నీగురువులయొక్కయుఁ బ్రభావమును నాకుఁ జెప్పినాఁడు. నీకు ఇష్టమయినయెడల వానినన్నిఁటిని బ్రత్యక్షముగాఁ జూడవలెననియున్నాను. అని రాముఁడు శబరితోఁ జెప్పెను. ౧౮

ఏతత్తు వచనం శ్రుత్వా రామవక్త్రా ద్వినిస్సృతమ్;
శబరీ దర్శయామాస తా వుభౌ తద్వనం మహత్. ౨౦
పశ్య మేఘఘనప్రఖ్యం మృగపక్షిసమాకులమ్,
మతఙ్గవన మిత్యేవ విశ్రుతం రఘునన్దన!. ౨౧

ఇహ తే భావితాత్మానో గురవో మే మహావనే,
జుహవాంచక్రిరే తీర్థం మన్త్రవ న్మన్త్రపూజితమ్. ౨౨

ఇయం ప్రత్యక్స్థలీ వేది ర్యత్ర తే మే సుసత్కృతాః
పుష్పోపహారం కుర్వన్తి శ్రమా దుద్వేపిభిః కరైః. ౨౩

తేషాం తపః ప్రభావేన పశ్యాద్యాపి రఘూద్వహ!,
ద్యోతయన్తి దిశ స్సర్వా శ్శ్రియా వేద్యోఽతుల ప్రభాః. ౨౪

అశక్నువద్భి స్తై ర్గన్తు ముపవాస శ్రమాలసైః,
చిన్తితేఽభ్యాగతా న్పశ్య సహితాం స్సప్తసాగరాన్. ౨౫

కృతాభిషేకై స్తై ర్న్యస్తా వల్కలాః పాదపే ష్విహ,
అద్యాపి నావశుష్యన్తి ప్రదేశే రఘునన్దన!. ౨౬

దేవకార్యాణి కుర్వద్భి ర్యా నీమాని కృతాని వై,
పుష్పైః కువలయై స్సార్ధం మ్లానత్వం నోపయాన్తి వై. ౨౭

కృత్స్నం వన మిదం దృష్టం శ్రోతవ్యం చ శ్రుతం త్వయా,
త దిచ్ఛా మ్యభ్యనుజ్ఞాతా త్యక్తు మేత త్కళేబరమ్. ౨౮

రామునినోటనుండి చెప్పిన యామాటను విన్నంతనే శబరి యారామలక్ష్మణుల కిర్వురకును అమ్మహావనంబంతయుఁ జూపెను. ౨౦

రాముఁడా! మేఘసమూహమువలెఁ జూపట్టుచున్నదియు మృగపక్షుల నిండియున్నదియు మతంగవనం బని పేరువడసినదియు నగు నిమ్మహావనంబుం జూడుము. ౨౧

కాంతిమంతుఁడవగు రాముఁడా! ఇచ్చటఁ బరమాత్మవేత్తలగు నాయాచార్యులు మంత్రవేత్తల ఋత్విజులం బురస్కరించికొని మంత్రయుక్తంబుగా యాగంబులు గావించిరి. ౨౨

ఇదిగో యాగవేదిక. నాచేఁ జక్కఁగాఁ సేవింపఁబడుచుండిన నా గురువులు ముసలితనముచే వడంకుహస్తంబుచే దీనిం బుష్పములం బూజించుచుండురు. ౨౩

రాముఁడా! ఈవేదులు మాయాచార్యుల అమ్మహర్షుల తపఃప్రభావమువలన నిప్పటికిఁగూడ అసదృశమగుకాంతిచే సమస్తదిక్కులను వెలుంగంజేయుచున్నవి. చూడుము. ౨౪

ఉపవాసములచేతను ముసలితనముచేతను పోవుటకు శక్తిలేక యమ్మునులు మనస్సున స్మరించినంతనే సప్తసముద్రంబులును వారియాశ్రమంబునకే వచ్చియున్నవి. చూడుము. ౨౫

రాముఁడా! అమ్మునీంద్రులు ఈసప్తసాగరంబుల స్నానముచేసి వృక్షంబుల నాఱవేసినవల్కలంబులు వారితపఃప్రభావంబునంజేసి యిప్పటికిని ఎండకున్నవి. చూడుము. ౨౬

దేవపూజకుఁగా నమ్మునీంద్రులచేత కువలయంబులను ఇతరపుష్పంబులనుం గూర్చికట్టఁబడిన పుష్పమాలికలు వారితపఃప్రభావంబున ఇప్పటికిని వాడకున్నవి చూడుము. ౨౭

నీవు ఈవనంబునంతయుఁ జూచినావు. వినవలసినయంశంబులను విన్నావు. ఇంక నాకనుజ్ఞ యొసంగుదువేని నే నీశరీరంబు విడిచెదను, అని

తేషా మిచ్ఛా మ్యహం గన్తుం సమీపం భావితాత్మనామ్,
మునీనా మాశ్రమో యేషా మహం చ పరిచారిణీ. ౨౯

ధర్మిష్ఠం తు వచ శ్శ్రుత్వా రాఘవ స్సహలక్ష్మణః,
ప్రహర్షమతులం లేభే ఆశ్చర్య మితి తత్త్వతః. ౩౦
తా ముమాచ తతో రామ శ్శ్రమణీం సంశితవ్రతామ్,

అర్చితో౽హం త్వయా భక్త్యా గచ్ఛ కామం యథాసుఖమ్.

ఇత్యుక్త్వా జటిలా వృద్ధా చీరకృష్ణాజినామ్బరా,
తస్మి న్ముహూర్తే శబరీ దేహం జీర్ణం జిహాసతీ. ౩౨
అనుజ్ఞాతాతు రామేణ హుత్వా౽౽త్మానం హుతాశనే,
జ్వలత్పావకసఙ్కాశా స్వర్గ మేవ జగామ సా. ౩౩

దివ్యాభరణసంయుక్తా దివ్యమాల్యానులేపనా,
దివ్యామ్బరధరా తత్ర బభూవ ప్రియదర్శనా. ౩౪
విరాజయన్తీ తం దేశం విద్యు త్సౌదామినీ యథా,
యత్ర తే సుకృతాత్మానో విహరన్తి మహర్షయః. ౩౫
త త్పుణ్యం శబరీ స్థానం జగా మాత్మసమాధినా.

ఇతి శ్రీమదరణ్యకాణ్డే చతుస్సప్తతితమ స్సర్గః. ౭౪.

---

## పఞ్చసప్తతితమ స్సర్గః.

దివం తు తస్యాం యాతాయాం శబర్యాం స్వేన తేజసా,
లక్ష్మణేన సహ భ్రాత్రా చిన్తయామాస రాఘవః. ౧

ఇది యెవ్వరి యాశ్రమమో నేనేమహాత్ముల పరిచారికనో అట్టియాత్మవేత్తలగు మహామునుల పాదమూలము నొందఁగోరుచున్నాను. అని శబరి రామునితోఁ జెప్పెను. ౨౯

రాముఁడును లక్ష్మణుఁడును ధర్మిష్ఠంబగు నాశబరియొక్క మాటనంతయు విని ఈతపోవనవైభవము ఆశ్చర్యకరమని పరమసంతోషంబు నొందిరి.

అంత రాముఁడు మిక్కిలియుఁ దీక్ష్ణమగు వ్రతముగల యాశబరిం జూచి యిట్లని చెప్పెను.

నీవు భక్తితో నన్నుఁ జక్కఁగాఁ బూజించినావు. ఇంక సుఖముగా యథేచ్ఛం బొమ్ము. అని రాముఁడు శబరితోఁ జెప్పెను. ౩౧

జడలుదాల్చియున్నదియు వృద్ధురాలును వల్కలంబులను కృష్ణాజినంబులను వస్త్రములంగా ధరించియుండునదియు నగు నాశబరి రాముఁడు చెప్పిన మాటను విని రామునియనుజ్ఞ నొందినంతనే యప్పుడే జీర్ణంబగు తనదేహము విడువఁగోరి దేహమును అగ్నిహోత్రంబున హోమముచేసి జాజ్వల్యమానంబగు నగ్నివంటి దివ్యదేహంబునొంది స్వర్గంబునొందెను. ౩౨,౩౩

ఆశబరి దివ్యాభరణంబులును దివ్యమాల్యంబులును దివ్యగంధమును దివ్యవస్త్రములును దాల్చి జూపరులెంతో సంతోషంబునొంద మహాప్రకాశంబగు మెఱపువలె నాప్రదేశంబు వెలుఁగంజేయుచు నుండెను. ౩౪

పరమాత్మవేత్తలగు నమ్మతంగశిష్యులయిన మహర్షులు ఎచ్చట విహరించుచున్నారో అట్టిపుణ్యస్థానంబునకు శబరి సమాధియోగబలంబునఁ బోయెను. ౩౫

ఇది డెబ్బదినాలవ సర్గము.

---

## డెబ్బదియైదవసర్గము.

ఆశబరి నిజకాంతితో వెలుఁగుచు స్వర్గము నొందినంతనే రాముఁడు తమ్ముఁడగు లక్ష్మణునితోఁగూడ నాలోచించెను. ౧

స చిన్తయిత్వా ధర్మాత్మా ప్రభావం తం మహాత్మనామ్,
హితకారిణ మేకాగ్రం లక్ష్మణం రాఘవోఽబ్రవీత్. ౨

దృష్టోఽయ మాశ్రమ స్సౌమ్య బహ్వాశ్చర్యో మహాత్మనామ్,
విశ్వస్తమృగశార్దూలో నానావిహగసేవితః. ౩

సప్తానాం చ సముద్రాణా మేషు తీర్థేషు లక్ష్మణ!,
ఉపస్పృష్టం చ విధివ త్పితరశ్చాపి తర్పితాః. ౪
ప్రణష్ట మశుభం త త్తత్కల్యాణం సముపస్థితమ్,
తేన త త్త్వేవ హృష్టం మే మనో లక్ష్మణ! సమ్ప్రతి. ౫

హృదయే హి నరవ్యాఘ్ర! శుభ మావిర్భవిష్యతి,

త దాగచ్ఛ గమిష్యావః పమ్పాం తాం ప్రియదర్శనామ్. ౬
ఋశ్యమూకో గిరి ర్యత్ర నాతిదూరే ప్రకాశతే,
యస్మి న్వసతి ధర్మాత్మా సుగ్రీవోఽంశుమత స్సుతః. ౭
నిత్యం వాలిభయా త్త్రస్త శ్చతుర్భి స్సహ వానరైః,

అభిత్వరే చ తంద్రష్టుం సుగ్రీవం వానరర్షభమ్. ౮
తదధీనం హి మే సౌమ్య! సీతాయాః పరిమార్గణమ్,

ఏవం బ్రువాణం తం ధీరం రామం సౌమిత్రిరబ్రవీత్. ౯

గచ్ఛావ స్త్వరితం తత్ర మమాపి త్వరతే మనః,

ధర్మాత్ముఁడగు నారాముఁడు మహాత్ములగు నమ్మునుల ప్రభావములను దలఁచి తలఁచి తనకు హితమునే గావించువాఁడును ఏకాగ్రచిత్తుఁడునగు లక్ష్మణుం జూచి యిట్లని చెప్పెను. ౧

సౌమ్యుఁడవగు లక్ష్మణుఁడా! అనేకాశ్చర్యములు గలదియు నిర్భయముగా సంచరించుచుండు మృగంబులును పులులును గలదియు నానాపక్షులతోఁగూడి నదియునగు నీపరమాత్మవేత్తలగు మహామునుల యాశ్రమముం జూచినాము.

లక్ష్మణుఁడా! ఈసప్తసముద్రముల తీర్థములయందును స్నానము చేసినాము: పితృతర్పణమునుగూడఁ గావించినాము. ౪

లక్ష్మణుఁడా! అయోగ్యయాపమంగళము లన్నియు నశించినవి ఇంక మంగళము సమీపించియున్నది. అందుచేత యథార్థముగా నామనస్సు సంతోషము నొందినది. ౫

పురుషశ్రేష్ఠుఁడవగు లక్ష్మణుఁడా! మంగళము వచ్చునట్లుండునేని యది ముందే మనస్సునం దోఁచును.

అందువలన శీఘ్రమున రమ్ము. వాలిభయంబున ధర్మాత్ముఁడును సూర్యపుత్రుఁడునగు సుగ్రీవుఁడు నలుగురువానరవీరులంగూడి యెల్లప్పుడును ఏపర్వతంబున వాసముచేయుచుండునో అట్టి ఋశ్యమూకపర్వతంబు దేనిసమీపంబునఁ బ్రకాశించుచుండునో అరమణీయంబగు పంపాసరస్సునకుఁ బోవుదము. ౬,౭

సౌమ్యుఁడవగు లక్ష్మణుఁడా! వానరోత్తముఁడగు సుగ్రీవుని శీఘ్రంబునం జూడఁగోరుచున్నాను; సీతను వెదకుటంతయు నా కతనివలననే గదా కావలసియున్నది. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౮

లక్ష్మణుఁడు ధీరుఁడగు రామునిమాటను విని రాముం జూచి యిట్లని చెప్పెను. ౯

శీఘ్రముగాఁ బంపాసరస్సునకుఁ బోవుదము. నామనస్సునకు శీఘ్రముగాఁ బోవలెననియే యున్నది. అని లక్ష్మణుఁడు రామునితోఁ జెప్పెను.

ఆశ్రమాత్తు తతస్తస్మా న్నిష్క్రమ్య స విశాంపతిః. ౧౦
ఆజగామ తతః పమ్పాం లక్ష్మణేన సహాభిభూః,
స దదర్శ తతః పుణ్యా ముదారజనసేవితాం. ౧౧
నానాద్రుమలతాకీర్ణాం పమ్పాం పానీయవాహినీమ్,
పద్మై స్సౌగన్ధికై స్తామ్రాం శుక్లాం కుముదమణ్డలైః. ౧౨
నీలాం కువలయోద్ఘాటై ర్బహువర్ణాం కుథా మివ,

స తా మాసాద్య వై రామో దూరా దుదకవాహినీమ్. ౧౩
మతఙ్గసరసం నామ హ్రదం సమవగాహత,

అరవిన్దోత్పలవతీం పద్మసౌగన్ధికాయుతామ్. ౧౪
పుష్పితామ్రవణోపేతాం బర్హిణోద్ఘుష్టనాదితామ్,
తిలకై ర్బీజపూరైశ్చ ధవై శ్శుక్లద్రుమై స్తథా. ౧౫
పుష్పితైః కరవీరైశ్చ పున్నాగైశ్చ సుపుష్పితైః,
మాలతీకున్దగుల్మైశ్చ భాణ్డీరై ర్నిచులై స్తథా. ౧౬
అశోకై స్సప్తపర్ణైశ్చ కేతకై రతిముక్తకైః,
అన్యైశ్చ వివిధై ర్వృక్షైః ప్రమదా మివ భూషితామ్. ౧౭
సమీక్షమాణౌ పుష్పాఢ్యం సర్వతో విపులద్రుమమ్,
కోయష్టికై శ్చార్జునకై శ్శతపత్రైశ్చ కీరకైః. ౧౮
ఏతై శ్చాన్యైశ్చ విహగై ర్నాదితన్తు వనం మహత్,
తతో జగ్మతు రవ్యగ్రౌ రాఘవౌ సుసమాహితౌ. ౧౯
తద్వనం చైవ సరసః పశ్యన్తౌ శకునై ర్యుతమ్,
స దదర్శ తతః పమ్పాం శీతవారినిధిం శుభామ్. ౨౦

శత్రుపురజయుండునట్టి నరేంద్రుఁడగు రాముఁడు అంత లక్ష్మణునితోఁ గూడ నాయాశ్రమంబుననుండి వెడలి పంపాసరస్సునకుఁ బోయెను. ౧౦

అంత రాముఁడు పవిత్రంబును మహామునులచే సేవింపఁబడినదియు నానావిధవృక్షలతాలంకృతంబును త్రాగుటకుఁ దగునట్లుగా శీతలంబును సుగంధియుమధురంబునగు జలంబుగలదియు ఎఱ్ఱదామరపూలచేతను ఎఱ్ఱకలువలచేతను నెఱ్ఱనై తెల్లకలువలచేఁ దెల్లనై నల్లకలువలసమూహముచే నల్లనై చిత్రకంబలమువలె నానావర్ణములుగలిగినదియునగు పంపాసరస్సును దూరంబుననుండి చూచెను. ౧౧,౧౨

రాముఁడు అట్లు పంపాసరస్సమీపంబునకుఁబోయి యచ్చట దానికిఁ గొంతదూరంబుననుండు మతంగసరస్సని ప్రసిద్ధిఁజెందిన సరస్సునందు స్నానముగావించెను. ౧౩

అంత ఎఱ్ఱదామరపూలతోను తెల్లతామరపూలతోను తెల్లకలువలతోను ఎఱ్ఱకలువలతోను ఒప్పుచున్నదియుఁ బుష్పించియుండు మామిడితోఁపుతోఁ గూడినదియు మయూరధ్వనులచే ధ్వనింపఁజేయఁబడుచున్నదియు బొట్టుగుచెట్లు దాడిమచెట్లు చంద్రచెట్లు ఏఱుమద్దిచెట్లు పుష్పించిన గన్నేరుచెట్లు పొన్నచెట్లు జాజిచెట్లు మొల్లచెట్లు వటవృక్షంబులు వంజులవృక్షంబులు అశోకవృక్షంబులు సప్తపర్ణవృక్షంబులు మొగిలిపొదలు పువ్వులగురివిందచెట్లు మొదలగువృక్షంబులచే నలంకృతమై యాభరణాలంకృతయయిన నారీమణికైవడిఁ జూపట్టుచున్నదియునగు నా పంపాసరస్సునంతయుఁ జూచుచుఁ బుష్పంబులచే నిండినదియుఁ బెద్దపెద్దవృక్షంబులుగలదియు మధురంబుగాఁ గూయుచుండు చీకుఁగొక్కెరలు నెమిళ్లు బెగ్గురులు చిలుకలు మొదలగుపక్షులతోఁ గూడినదియునగు నాపంపాసరస్సంబంధి వనంబుఁజూచుచు నారామలక్ష్మణులు ఎంతమాత్రమేమఱుపాటులేక యెచ్చరికతో వవ్వానంబునకుఁ బోయిరి. ౧౪-౧౯

అంత రాముఁడు చల్లని జలముగలదియు సుందరమును తిలకవృక్షం

తిలకాశోక పున్నాగ వకులోద్దాలకాశినీమ్,

స రామో వివిధా న్వృక్షాన్ సరాంసి వివిధాని చ. ౨౧
పశ్య న్కామాభిసన్తప్తో జగామ పరమం హ్రదమ్,
పుష్పితోపవనోపేతాం సాలచమ్పకశోభితామ్. ౨౨
షట్పదౌఘసమావిష్టాం శ్రీమతీ మతులప్రభామ్,
స్ఫటికోపమతోయాఢ్యాం శ్లక్ష్ణవాలుకసన్తతాం. ౨౩
స తాం దృష్ట్వా పునః పమ్పాం పద్మసౌగన్ధికైర్యుతామ్,
ఇత్యువాచ తదా వాక్యం లక్ష్మణం సత్యవిక్రమః. ౨౪

అస్యా స్తీరే తు పూర్వోక్తః పర్వతో ధాతుమణ్డితః,
ఋశ్యమూక ఇతి ఖ్యాతః పుణ్యః పుష్పితపాదపః. ౨౫

హరే రృక్షరజోనామ్నః పుత్త్ర స్తస్య మహాత్మనః,
అధ్యాస్తే తం మహావీర్య స్సుగ్రీవ ఇతి విశ్రుతః. ౨౬

సుగ్రీవ మభిగచ్ఛ త్వం వానరేన్ద్రం నరర్షభ!.

ఇత్యువాచ పునర్వాక్యం లక్ష్మణం సత్యవిక్రమమ్. ౨౭

రాజ్యభ్రష్టేన దీనేన తస్యా మాసక్తచేతసా,
కథం మయా వినా శక్యం సీతాం లక్ష్మణ! జీవితుమ్. ౨౮

ములు అశోకవృక్షంబులు పున్నాగవృక్షంబులు పొగడచెట్లు విరిగిచెట్లు మొదలగువృక్షంబులచే నొప్పుచున్నదియునగు పంపాసరస్సు జూచెను. ౨౦

రాముఁడు నానావిధములయిన వృక్షములను నానావిధములయిన సరస్సులనుజూచుచు మన్మథబాణాభిహతుఁడై పంపాసరస్సునకుఁ బోయెను.

సత్యపరాక్రముఁడగు నారాముఁడు పుష్పితంబులగు వనంబులతోఁ గూడినదియు మద్దిచెట్లతోను చంపకవృక్షములతోను ఒప్పుచున్నదియుఁ దుప్పెదలసమూహముతోఁ గూడినదియు అసదృశమయిన కాంతిగలదియు స్ఫటికమువలె స్వచ్ఛమయిన జలముగలదియు మెత్తనియిసుకగలదియు కమలంబులు సౌగంధికంబులు మొదలగు పుష్పంబులతోఁ గూడినదియు నగు నాపంపాసరస్సును జూచి లక్ష్మణునితో నిట్లని చెప్పెను. ౨౩-౨౪

ఈపంపాసరస్సుతీరంబునందే గైరికధాతువులచే నలంకృతంబును బవిత్రంబును పుష్పితంబులగు వృక్షములు గలదియునగు ఋశ్యమూకపర్వతమున్నదని మున్ను కబంధుఁడు చెప్పినాఁడు. ౨౫

మహాపరాక్రమశాలియగు ఋక్షరజుఁడను వానరవీరునిపుత్రుఁడును మహాపరాక్రమశాలియునగు సుగ్రీవుఁడు ఆఋశ్యమూకపర్వతంబునందున్నాఁడు. ౨౬

పురుషశ్రేష్ఠుఁడవగు లక్ష్మణుఁడా! నీవు, వానరరాజుఁడగు సుగ్రీవునొద్దకుఁబొమ్ము. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను.

రాముఁడు సత్యపరాక్రముఁడగు నాలక్ష్మణుంజూచి మఱల నిట్లని చెప్పెను. ౨౮

లక్ష్మణుఁడా! రాజ్యభ్రష్టుఁడను దీనుఁడను సీతయందు మిక్కిలియనాసక్తిగలవాఁడనగు నేను సీతనువిడిచి యెట్లు జీవింపఁగలను? అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౨౯

ఇత్యేవ ముక్త్వా మదనాభిపీడిత
స్స లక్ష్మణం వాక్య మనన్యచేతసమ్,
వివేశ పమ్పాం నళినీం మనోరమాం
రఘూత్తమ శ్శోకవిషాదయన్త్రితః. ౨౯
తతో మహా ద్వర్త్మ సుదూరసంక్రమం
క్రమేణ గత్వా ప్రవిలోకయ న్వనమ్,
దదర్శ పమ్పాం శుభదర్శకాననా
మనేకనానావిధపక్షిజాలకామ్. ౩౦

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే వాల్మీకీయే
చతుర్వింశత్సహస్రికాయాం సంహితాయా
మరణ్యకాణ్డే పఞ్చసప్తతితమ స్సర్గః. ౭౫.

అరణ్యకాణ్డం సమాప్తమ్.

రాముఁడు మన్మథపీడితుఁడై దుఃఖపరవశుఁడై తనమాటయందె దృష్టి యుంచి సావధానుఁడై యున్న లక్ష్మణుంజూచి యిట్లుచెప్పి మనోహరంబగు నాపంపాసరస్సువద్దకుఁ బోయెను. ౨౯

అంత నారాముఁడు అట్లు బహుదూరము క్రమముగా సుందరంబగు నవ్వనంబు జూచుచుంబోయి సుందరములయిన యడవులుగలదియు అధికముగా నానావిధపక్షిసమూహములతో నొప్పుచున్నదియునగు పంపాసరస్సును జూచెను.

ఇది డెబ్బదియైదవసర్గము.

అరణ్యకాండ సమాప్తము.



చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1924.

# సంస్కృతగ్రంథములు.

---

| | | రూ. | అ. |
|---|---|---|---|
| | ప్రతి 1-కి | రూ. | అ. |
| కార్తీకమాహాత్మ్యము, చక్కనికూర్పు | ... | 0 | 6 |
| బాలరామాయణము, సటీక | ... | 0 | 3 |
| పద్మపురాణాంతర్గత మాఘపురాణము, ఆంధ్రతాత్పర్యసహితము | | 2 | 0 |
| ప్రతిపదాంధ్రటీకాతాత్పర్య విశేషార్థసహిత శ్రీమద్రామాయణము, | | | |
| షట్కాండలు 15 వాల్యూములు | ... | 70 | 0 |
| డిటో అరణ్యకాండము | ... | 10 | 0 |
| డిటో కిష్కింధాకాండము | ... | 10 | 0 |
| డిటో సుందరకాండము | (అచ్చగుచున్నది). | | |
| డిటో యుద్ధకాండము | ... | 20 | 0 |
| శ్రీమద్రామాయణము, మూలము దళసరికాగితములు | ... | 6 | 0 |
| డిటో సుందరకాండము, చిన్నసైజు | ... | 1 | 0 |
| డిటో వ్యాఖ్యానచతుష్టయవిశిష్టము 2 సంపుటములు, చిన్నసైజున | | | |
| చక్కగ ముద్రితము | ... | 15 | 0 |
| శ్రీమద్రామాయణము, బాలకాండము, ఆంధ్రతాత్పర్యసహితము | | 1 | 8 |
| డిటో అయోధ్యాకాండము, ఆంధ్రతాత్పర్యసహితము | | 3 | 0 |
| డిటో అరణ్యకాండము ,, | ... | 2 | 0 |
| డిటో కిష్కింధాకాండము ,, | ... | 2 | 8 |
| డిటో సుందరకాండము, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 2 | 0 |
| డిటో యుద్ధకాండము ,, | ... | 4 | 0 |
| అమావాస్యతర్పణము | ... | 0 | 1 |
| ఆపస్తంబగృహ్యసూత్రములు | ... | 0 | 3 |
| ఆపస్తంబధర్మసూత్రములు, ఉజ్జ్వలాభాష్యసహితము | ... | 1 | 8 |
| ఆంధ్రద్రావిడసంధ్యావందనము | ... | 0 | 2 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ఋగ్వేదదేవతార్చన, బ్రహ్మయజ్ఞము, సస్వరము | ... | 0 | 2 |
| ఋగ్వేదపూర్వప్రయోగాదర్శము | ... | 1 | 8 |
| ఋగ్వేదఆశ్వలాయనసూత్రములు | ... | 0 | 8 |
| ఋగ్వేద శ్రాద్ధప్రయోగము, ఆశ్వలాయనము, చిన్నసైజు | | 0 | 4 |
| ఋగ్వేదసంధ్యావందనము, సటీక, చిన్నసైజు | ... | 0 | 2 |
| తిథిమంత్రములు, (ఆరాధ్యులది) | ... | 0 | 2 |
| దేవతార్చన, చిన్నసైజు | ... | 0 | 1 |
| పంచసూక్తములు, సస్వరము | ... | 0 | 2 |
| పంచోపనిషత్తులు, తైత్తిరీయము, సస్వరము | ... | 0 | 12 |
| పంచోపనిషత్తులు, తైత్తిరీయము, బ్రహ్మమేధసహితము | ... | 0 | 4 |
| పితృతర్పణము, చిన్నసైజు | ... | 0 | 1 |
| బ్రహ్మయజ్ఞము, సస్వరము | ... | 0 | 2 |
| మహాన్యాసము, చిన్నసైజు | ... | 0 | 6 |
| మంత్రప్రశ్నములు, మూలము | ... | 0 | 3 |
| ,, సస్వరము | ... | 0 | 6 |
| మంత్రపుష్పము, సటీక | ... | 0 | 1 |
| తైత్తిరీయఆరణ్యకోపనిషద్భాగము, సస్వరము | ... | 3 | 0 |
| యజ్ఞోపవీతధారణవిధి, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 2 |
| యజుర్వేదసంధ్యావందనము, మూలము, సస్వరము | ... | 0 | 2 |
| డిటో పురుషసూక్తము, శ్రీసూక్తము, సాంధ్రటీకాతాత్పర్య సహితము | ... | 0 | 4 |
| యజుర్వేదసంధ్యావందనభాష్యము | ... | 0 | 8 |
| యజుర్వేద ఆబ్దికమన్త్రములు | ... | 0 | 6 |
| యాజుషపూర్వప్రయోగచంద్రిక, సస్వరము.—అనేకవిషయములఁ జేర్చి యాంధ్రమహాజనసంప్రదాయానుసారముగఁ బరిష్కరించి ముద్రించియున్నాము, చక్కనిప్రతి | ... | 2 | 0 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| రుద్రము, పురుషసూక్తము వగైరాలు, చిన్న సైజు ... | 0 | 2 |
| శ్రీవైష్ణవాహ్నికము ... | 0 | 4 |
| శ్రీవైష్ణవశ్రాద్ధప్రయోగము ... | 0 | 4 |
| వ్రతరత్నాకరము, ప్రథమభాగము—ఇందు వ్రతసంకల్పము మొదలు పూజముగియువఱకు చేయవలసినవిధులదెల్పి ప్రాణప్రతిష్ఠ, కలశపూజ, గణాధిపతిపూజ, షోడశోపచారశ్లోకములు మొదలగు వానిని తాత్పర్యముతోడ ముద్రించినారము. ఇందు వినాయక వ్రతము, వరలక్ష్మీవ్రతము, శరస్వతీవ్రతము, అనంతవ్రతము, కేదారేశ్వరవ్రతము, గరుడపంచమీవ్రతము అను 6 వ్రతములు గలవు. ... | 0 | 10 |
| వ్రతరత్నాకరము, ద్వితీయభాగము.—ఇందు ఋషిపంచమీ, మథనద్వాదశీ అమావాస్యసోమవతీ, కృష్ణాష్టమీ, శ్రీరామనవమీ, అముక్తాభరణసప్తమీ, భక్తేశ్వర, శివరాత్రి, లక్షవర్తి, త్రిరాత్రి, చిత్రగుప్త, క్షీరాబ్ధిశయన, సావిత్రిగౌరి, సంపద్గౌరి, సత్యనారాయణ, రథసప్తమీ, సంకటచతుర్థీ, ఏకాదశీఉద్యాపనము, శ్రవణద్వాదశీ, శరన్నవరాత్రి, నృసింహజయంతి మున్నగు వ్రతములు గలవు ... | 1 | 2 |
| వ్రతచూడామణి, 360 వ్రతములు, మంచికాగితములపై చక్కగ ముద్రితము ... | 2 | 0 |
| వైశ్యసంధ్యావందనము ... | 0 | 2 |
| సూర్యనమస్కారము, చిన్న సైజు ... | 0 | 1 |
| జలార్గళశాస్త్రము, ఆంధ్రతాత్పర్యసహితము ... | 0 | 4 |
| జాతకచన్ద్రిక, గోపాలరత్నాకరము, సాంధ్రతాత్పర్యము ... | 0 | 8 |
| కాలామృతము, సటీక, మేలుప్రతి ... | 1 | 4 |
| బృహజ్జాతకము, సటీకాంధ్రతాత్పర్యసహితము, చక్కని ప్రతి, నూతన ముద్రితము ... | 2 | 0 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ముహూర్తదర్పణము, సటీక, చక్కనికూర్పు ... | 0 | 14 |
| షోడశప్రశ్నరత్నావళి, నెపోలియన్ అనుష్ఠించినప్రశ్న గ్రంథము నకు తెనుఁగు ... | 0 | 3 |
| ఛప్పన్నము, ప్రశ్నశాస్త్రము, ఆంధ్రతాత్పర్యసహితము ... | 0 | 6 |
| నక్షత్రచూడామణి, చక్కనిప్రతి ... | 0 | 6 |
| సర్వార్థచింతామణి ... | 0 | 8 |
| లఘుజాతకము, సాంధ్రతాత్పర్యము ... | 0 | 12 |
| భృగుసూత్రములు ,, ... | 0 | 6 |
| భావార్థచంద్రిక ,, ... | 0 | 8 |
| వృద్ధపరాశరము ,, ... | 0 | 10 |
| కేరళప్రశ్నము ,, ... | 0 | 3 |
| సనత్కుమార గృహవాస్తువు, సాంధ్రతాత్పర్యము ... | 0 | 3 |
| మయవాస్తువు ,, ... | 0 | 3 |
| వాస్తుసర్వస్వము ,, ... | 0 | 4 |
| వనమాల (వర్ణఘణి) ,, ... | 0 | 3 |
| స్వప్నశాస్త్రము ,, ... | 0 | 3 |
| గౌళిశాస్త్రము, తెనుఁగు ... | 0 | 2 |
| సాముద్రికశాస్త్రము, సటీక ... | 0 | 4 |
| అష్టకవర్గు, సాంధ్రతాత్పర్యము, చక్కనిప్రతి ... | 0 | 4 |
| శకునశాస్త్రము (శిఖినరసింహశతకము), తాత్పర్యసహితము | 0 | 4 |
| సారావళి, సాంధ్రతాత్పర్యము ... | 3 | 0 |
| ఆరూఢరత్నసిద్ధాంజనము ,, ... | 0 | 12 |
| ఆపస్తంబప్రవరకాండము, సటీక ... | 0 | 3 |
| ఆశ్వలాయనప్రవరకాండము ,, ... | 0 | 2 |
| ఆశౌచనిర్ణయము (తెనుగు) ... | 0 | 3 |
| అపరోక్షానుభూతి, సాంధ్రతాత్పర్యము, చిన్నసైజు ... | 0 | 4 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అద్వైతపంచరత్నము | ... | 0 | 2 |
| అద్వైతోపదేశపంచరత్నములు (సాధనపంచకము) | ... | 0 | 2 |
| ఆత్మబోధము, సటీక, చక్కనికూర్పు | ... | 0 | 4 |
| ఆత్మపూజ ,, | ... | 0 | 1 |
| ఆత్మవిద్యావిలాసము ,, | ... | 0 | 6 |
| ఆత్మానాత్మవివేకము ,, | ... | 0 | 4 |
| ఉత్తరగీతా, సటీక, చిన్నసైజు, మంచికాకితములు | ... | 0 | 12 |
| పంచీకరణము ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 2 |
| డిటో తెలుగువచనము | ... | 0 | 2 |
| బ్రహ్మసూత్రములు, మూలము, చిన్నసైజు | ... | 0 | 3 |
| బ్రహ్మసూత్రములు, తెనుగువచనము, శ్రీశంకరాచార్యులవారిభాష్యము అందరికి తెలియుటదుర్లభమని తలంచి చక్కని శైలిలో అనేకవ్యాఖ్యలననుసరించి తెనుగు వ్యాఖ్యానమును ప్రకటించినారము, రెండు సంపుటములు | | 12 | 0 |
| భగవద్గీతలు మూలముమాత్రము, చిన్నసైజు | ... | 0 | 6 |
| ,, ఆంధ్రతాత్పర్యసహితము చక్కనికూర్పు | ... | 1 | 4 |
| ,, ,, చిన్నసైజు | ... | 0 | 10 |
| ,, అనిబిసెంటుగారి ఇంగ్లీషుతర్జుమాతో | ... | 0 | 8 |
| ,, శ్రీరామచంద్ర సరస్వతీకృత ఆంధ్రటీకాతాత్పర్య సహితము, మతత్రయ భాష్యములనుండి అనేక అంశములిందుచేర్చి శ్లోకానుక్రమణికతో ముద్రింపఁబడినది | ... | 2 | 12 |
| ,, శాంకరభాష్యము, (సంస్కృతము) | ... | 1 | 0 |
| ,, ,, మేలుప్రతి | ... | 1 | 8 |
| ,, రామానుజభాష్యము (సంస్కృతము) | ... | 1 | 4 |
| శ్రీమద్భగవద్గీతారహస్యము, శ్రీ బాలగంగాధరతిలక కృతము | | 3 | 4 |

| | | రూ. | అ. |
|---|---|---|---|
| రామగీతా, సటీక, చిన్నసైజు | ... | 0 | 6 |
| వివేకచూడామణి మూలముమాత్రము, పాతప్రతి | ... | 0 | 4 |
| డిటో ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 12 |
| వ్యవహారపంచకము, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 2 |
| వేదాంతస్తోత్రపంచకము, శ్రీశంకరాచార్యకృతము, ఆంధ్రతాత్పర్యసహితము:—ఇందు ఏకశ్లోకి, యతిపంచకము, మనీషాపంచకము, ప్రాతఃస్మరణము మొదలగునవి గలవు | ... | " | 4 |
| శివగీత, సాంధ్రతాత్పర్యము, చిన్నసైజు | ... | 0 | 12 |
| శుకాష్టకమ్ ,, ,, | ... | 0 | 2 |
| హరిమీడేస్తవము, సటీక, చక్కనికూర్పు | ... | 0 | 4 |
| అమృతబిందూపనిషత్తు, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 2 |
| అథర్వశిఖోపనిషత్తు ,, | ... | 0 | 2 |
| ఆత్మబోధోపనిషత్తు ,, | ... | 0 | 2 |
| ఆరుణేయ్యుపనిషత్తు ,, | ... | 0 | 3 |
| ఈశావాస్యోపనిషత్తు ,, | ... | 0 | 4 |
| ఐతరేయోపనిషత్తు ,, | ... | 0 | 8 |
| కేనోపనిషత్తు ,, | ... | 0 | 4 |
| కృష్ణోపనిషత్తు ,, | ... | 0 | 3 |
| కఠోపనిషత్తు ,, | ... | 0 | 8 |
| ఛాందోగ్యోపనిషత్తు, సాంధ్రటీక | ... | 5 | 0 |
| జాబాల్యుపనిషత్తు సాంధ్రతాత్పర్యము | ... | 0 | 2 |
| తైత్తిరీయోపనిషత్తు; ఆంధ్రటీకాతాత్పర్యవివరణసహి | ... | 3 | 0 |
| ద్వాదశోపనిషత్తులు, తెనుగువచనము | ... | 3 | 0 |
| నిరాలంబోపనిషత్తు, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 2 |
| ప్రశ్నోపనిషత్తు ,, | ... | 0 | 8 |

| ప్రతి 1-కి | | రూ. | అ. |
|---|---|---|---|
| ప్రాణాగ్నిహోత్రోపనిషత్తు సాంధ్రతాత్పర్యము | ... | 0 | 3 |
| పరమహంసోపనిషత్తు ,, | ... | 0 | 4 |
| బ్రహ్మోపనిషత్తు ,, | ... | 0 | 2 |
| ముక్తికోపనిషత్తు ,, | ... | 0 | 8 |
| మండలబ్రాహ్మణోపనిషత్తు ,, | ... | 0 | 3 |
| వజ్రసూచికోపనిషత్తు ,, | ... | 0 | 2 |
| వాసుదేవోపనిషత్తు ,, | ... | 0 | 2 |
| శారీరకోపనిషత్తు ,, | ... | 0 | 2 |
| సర్వసారోపనిషత్తు ,, | ... | 0 | 2 |
| స్కందోపనిషత్తు ,, | ... | 0 | 2 |
| ఋతుసంహారము, ఆంధ్రటీకాతాత్పర్యసహితము | ... | 0 | 8 |
| కాదంబరి, క్రొత్తకూర్పు | ... | 1 | 0 |
| ,, మేలుప్రతి | .. | 1 | 8 |
| కుమారసంభవము, సవ్యాఖ్యానము, మేలుప్రతి | ... | 0 | 14 |
| డిటో సంస్కృతాంధ్ర టీకాతాత్పర్యసహితము | ... | 1 | 8 |
| గీతాగోవిందము, (అష్టపది) ఆంధ్రటీకాతాత్పర్యవివరణసహితము | ... | 1 | 4 |
| పుష్పబాణవిలాసము, సంస్కృతాంధ్రవ్యాఖ్యానసహితము. | | 0 | 4 |
| పంచబాణవిజయము, చక్కనికూర్పు | ... | 0 | 4 |
| ప్రహసనము, కాళిదాసకృతము | ... | 0 | 4 |
| సంస్కృత (నాగరిలిపి) బాలశిక్ష | ... | 0 | 3 |
| బిల్హణచరిత్ర, సటీక, చక్కనికూర్పు | ... | 0 | 8 |
| భర్తృహరి సుభాషితము, సాంధ్రపద్యతాత్పర్యము, అట్టబైండు | | 0 | 14 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 2 |
| భారవి, సవ్యాఖ్యానము, 9 సర్గలు చక్కనికూర్పు | ... | 0 | 12 |
| రామాయణచంపు, సవ్యాఖ్యానము | ... | 2 | 0 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| మాఘము, సవ్యాఖ్యానము 6 సర్గలు, చక్కనికూర్పు ... | 1 | 0 |
| ,, ,, 7-12 సర్గలు పాతప్రతి ... | 0 | 8 |
| ,, 3 సర్గలు, సమాసతాత్పర్య సంస్కృతాంధ్ర వ్యాఖ్యాన సహితము ... | 2 | 0 |
| మేఘసందేశము, సవ్యాఖ్యానము ... | 0 | 6 |
| డిటో సంస్కృతాంధ్రవ్యాఖ్యానసహితము, చిన్నసైజు ... | 0 | 14 |
| రఘువంశము, 10 సర్గలు ,, ... | 1 | 0 |
| ,, 6 సర్గలు, పదచ్ఛేదము అర్థ ఆకాంక్ష శబ్ద సమాసతాత్పర్యవ్యాఖ్యానసహితము, సాధారణప్రతి ... | 3 | 8 |
| ,, మేలుప్రతి, క్రొత్తకూర్పు ... | 5 | 0 |
| ,, మేలుప్రతి, పూర్వముద్రణము ... | 4 | 0 |
| విశ్వగుణాదర్శము, సవ్యాఖ్యానము, క్రొత్తకూర్పు ... | 0 | 12 |
| ,, మేలుప్రతి ... | 1 | 0 |
| విక్రమార్కచరిత్ర, టీకాతాత్పర్యసహితము ... | 1 | 0 |
| హంససందేశము, సవ్యాఖ్యానము ... | 0 | 5 |
| హితోపదేశము, చక్కనికూర్పు ... | 0 | 8 |
| అథర్వణకారికావళీ, ఆంధ్రటీకాతాత్పర్యసహితము ... | 1 | 0 |
| చంద్రాలోకము, సంస్కృతాంధ్రటీకాసహితము ... | 0 | 8 |
| తిఙన్తమంజరీ, ధాతుమంజరీ ... | 0 | 4 |
| లఘుకౌముది, సటిప్పణము, చక్కనికూర్పు ... | 0 | 12 |
| శబ్దమంజరి, చక్కనికూర్పు, శుద్ధప్రతి ... | 0 | 4 |
| డిటో మేలుకాకితములు ... | 0 | 6 |
| ,, (నాగరిలిపి) చిన్నసైజు ... | 0 | 6 |
| ఆదిత్యహృదయము, సటీక ... | 0 | 3 |
| ఇంద్రాక్షీశివకవచము ... | 0 | 2 |
| కృష్ణకర్ణామృతము, ఆంధ్రటీకాపద్యతాత్పర్యసహితము ... | 1 | 8 |
| శ్రీకృష్ణలీలాతరంగిణి, ఆంధ్రతాత్పర్యవివరణసహితము ... | 1 | 8 |

| | | రూ॥ | అ॥ |
|---|---|---|---|
| | | ప్రతి 1-కి రూ॥ | అ॥ |
| గంగాస్తవరాజము | ... | 0 | 2 |
| శ్రీ గురురత్నకోశము, సటీక | ... | 0 | 4 |
| దక్షిణామూర్తిస్తోత్రము, సాంధ్రతాత్పర్యము, చిన్నసైజు | ... | 0 | 2 |
| దేవీస్తోత్రకదంబము | ... | 0 | 6 |
| దేవీమానసికపూజ, చిన్నసైజు | ... | 0 | 1 |
| దేవీఖడ్గమాల ,, | ... | 0 | 1 |
| నవగ్రహస్తోత్రము ,, | ... | 0 | 4 |
| నీతిశాస్త్రము, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 3 |
| పరమేశ్వరస్తోత్రకదంబము, శుద్ధప్రతి | ... | 0 | 6 |
| ప్రాతఃస్మరణ, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 2 |
| భజగోవిందము, ఆంధ్రటీకాతాత్పర్యసహితము | ... | 0 | 2 |
| మృత్యుంజయమానసికపూజ, చిన్నసైజు | ... | 0 | 1 |
| ముకుందమాల, సటీక ,, | ... | 0 | 4 |
| రామబ్రహ్మమానసికపూజ, చిన్నసైజు | ... | 0 | 2 |
| రామకర్ణామృతము, ఆంధ్రపద్యతాత్పర్యసహితము | ... | 1 | 8 |
| లక్ష్మీనృసింహస్తోత్రము, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 2 |
| లక్ష్మీహృదయము, నారాయణహృదయము | ... | 0 | 3 |
| శంకరాచార్యస్తోత్రాది | ... | 0 | 3 |
| శ్యామలాదండకము, సటీక | ... | 0 | 2 |
| శివానందలహరి, సంస్కృతాంధ్రటీకాసహితము | ... | 0 | 12 |
| సౌందర్యలహరి, సటీక | ... | 0 | 4 |
| సప్తర్షిస్తోత్రము | ... | 0 | 2 |
| సనాతనమానవధర్మములు, సాంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 4 |
| సనత్సుజాతీయము, ఆంధ్రటీకాతాత్పర్యసహితము | ... | 0 | 8 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.

# వైదిక గ్రంథములు.

| | ప్రతి 1-కి | రూ. | అ. |
|---|---|---|---|
| అమావాస్యాతర్పణము | ... | 0 | 2 |
| ఆపస్తంబగృహ్యసూత్రములు | ... | 0 | 8 |
| ఆంధ్రద్రావిడసంధ్యావందనము | ... | 0 | 3 |
| ఋగ్వేదదేవతార్చన, బ్రహ్మయజ్ఞము, సస్వరము | ... | 0 | 8 |
| ఋగ్వేదపూర్వప్రయోగాదర్శము | ... | 2 | 8 |
| ఋగ్వేదశ్రాద్ధప్రయోగము, చిన్నసైజు | ... | 0 | 4 |
| ఋగ్వేదసంధ్యావందనము, సటీక | ... | 0 | 3 |
| తిథిమంత్రములు, (ఆరాధ్యులది) | ... | 0 | 2 |
| దశోపనిషత్తులు, తైత్తిరీయము, సస్వరము | ... | 0 | 12 |
| దేవతార్చన, చిన్నసైజు | ... | 0 | 2 |
| [illegible]సూక్తములు, సస్వరము | ... | 0 | 8 |
| పంచోపనిషత్తులు, బ్రహ్మమేధసహితము | ... | 0 | 6 |
| మహాన్యాసము, సస్వరము, చిన్నసైజు | ... | 0 | 12 |
| మంత్రప్రశ్నములు, మూలము | ... | 0 | 8 |
| డిటో సస్వరము (విశాఖకాండ) | ... | 0 | [illegible] |
| మంత్రపుష్పము, సటీక | ... | [illegible] | [illegible] |
| తైత్తిరీయ అరణ్యోపనిషత్తులు, పితృమేధము, మంత్రప్రశ్నములు సహా, సస్వరము | ... | [illegible] | [illegible] |
| యజ్ఞోపవీతధారణవిధి | ... | 0 | 2 |
| యజుర్వేదసంధ్యావందనభాష్యము | ... | [illegible] | [illegible] |
| యజుర్వేదసంధ్యావందనము, మూలము, సస్వరము | ... | [illegible] | [illegible] |
| డిటో [illegible] | | | |